౩౨

త్రింశసర్గప్రారంభః.

గుహాం ప్రవిష్టే సుగ్రీవే విముక్తే గగనే ఘనైః
వర్షరాత్రోషితో రామః కామశోకాభిపీడితః. ౧

టీక ॥ సుగ్రీవే = సుగ్రీవుఁడు; గుహాం = కిష్కింధను; ప్రవిష్టే = ప్రవేశించిన వాఁడుకాఁగా; వర్షరాత్రోషితః = వర్షర్తువునందు వాసముచేసిన; రామః = రాముఁడు; గగనే=ఆకాశము; ఘనైః = మేఘములచేత; విముక్తే= విడువఁబడినదికాఁగా; కామశోకాభిపీడితః = మన్మథునిచేతను దుఃఖముచేతనుబీడింపఁబడినవాఁడు;బభూవ (అధ్యాహృతము)=అయ్యెను.

సుగ్రీవుఁడు కిష్కింధను బ్రవేశించిన వెనుక, రాముండు,వర్షర్తువంతయుఁ గడపి, శరదృతువు వచ్చియాకాశంబు మేఘవిముక్తమయి నిర్మలంబగుటనుజూచి, మన్మథబాధితుండై పరమదుఃఖము నొందెను. అని, తాత్పర్యము.

పాండురం గగనం దృష్ట్వా విమలం చంద్రమండలమ్
శారదీం రజనీంచైవ దృష్ట్వా జ్యోత్స్నానులేపనామ్. ౨
కామవృత్తంచ సుగ్రీవం నష్టాంచ జనకాత్మజామ్
బుద్ధ్వా కాల మతీతంచ ముమోహ పరమాతురః. ౩

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ రాముఁడు; పాండురం=తెల్లనైన;గగనం=ఆకాశమును; విమలం=స్వచ్ఛమయిన;చంద్రమండలం = చంద్రమండలమును; జ్యోత్స్నానులేపనాం=వెన్నెలయే మైపూఁతగాఁగల; శారదీం = శరదృతువునందలి;రజనీంచైవ = రాత్రిని; దృష్ట్వా = చూచి; కామవృత్తం=మన్మథ వ్యాపారముగల; సుగ్రీవంచ = సుగ్రీవుని; నష్టాం = అగపడని; జనకాత్మజాం = సీతను; అతీతం = అతిక్రమించిన;కాలం = కాలమును; బుద్ధ్వా=తెలిసి;పరమాతురః = మిక్కిలి యుఁబీడితుఁడై; ముమోహ= మూర్ఛిల్లెను.

రాముండు, నిర్మలమాయిన ఆకాశ

స ౩౦

మును, స్వచ్ఛమయినచంద్రమండలంబును, చంద్రికారమణీయంబయిన శరత్కాలరాత్రినింజూచి, సీత నష్టయగుటయు, సుగ్రీవుండుమన్మథక్రీడాపరవశుండై యుండుటయు, సంకేతకాలము అతిక్రమించుటయుఁ దలపోసి, పరమదుఃఖితుండై మూర్ఛనొందెను.

అని, తాత్పర్యము.

సతు సంజ్ఞా ముపాగమ్య ముహూర్తా న్మతిమాన్ పునః
మనస్థా మపి వైదేహీం చింతయామాస రాఘవః. ౪

టీక ॥ సః=ఆ; మతిమాన్ = బుద్ధిమంతుఁడగు; రాఘవస్తు = రాముఁడును; ముహూర్తాత్=స్వల్పకాలమువలన; పునః= మఱల; సంజ్ఞాం= తెలివిని; ఉపాగమ్య = పొంది; మనస్థామపి= మనస్సుననున్నదైనను; వైదేహీం=సీతనుగూర్చి; చింతయామాస= చింతించెను.

బుద్ధిమంతుండగు రాముండు, అంతఁగొంతసేపటికిఁ దెలివొంది, సీతమనంబుననె యున్నదైనను ఆబిడంగుఱించి యిట్లని చింతించెను.

అని, తాత్పర్యము.

ఆసీనః పర్వత స్యాగ్రే హేమధాతువిభూషితే
శారదం గగనం దృష్ట్వా జగామ మనసా ప్రియామ్. ౫

టీక॥ సః(అధ్యాహృతము)=ఆరాముఁడు; పర్వతస్య = కొండయొక్క; హేమధాతువిభూషితే= బంగారముచేతను గైరికధాతువులచేతను అలంకరింపఁబడిన; అగ్రే=శిఖరమునందు; ఆసీనః= కూర్చున్నవాఁడై; శారదం=శరత్కాలమునందలి; గగనం = ఆకాశమును; దృష్ట్వా=చూచి; మనసా=మనసుచేత; ప్రియాం=ప్రియురాలను; జగామ=పొందెను.

రాముండు, బంగారముచేతను గైరికధాతువులచేతను అలంకృతంబగు పర్వతశిఖరమునం గూర్చుండి, శరదృతువునందు స్వచ్ఛమయినయాకాశమును జూచి, మనంబునఁ బ్రియురాలం దలంచెను. అని, తాత్పర్యము.

దృష్ట్వాచ విమలం వ్యోమ గతవిద్యుద్వలాహకమ్
సారసారవసంఘుష్టం విలలాపా ర్తయా గిరా. ౬

టీక ॥ రామః (అధ్యాహృతము)= రాముఁడు; విమలం=నిర్మలమును; గతవిద్యుద్వలాహకం= పోయిన మేఘములును మెఱపులునుగలదియు; సారసారవసంఘుష్టం= బెగ్గురుపక్షులయొక్క ధ్వనిచేత ధ్వనిగలదియునగు; వ్యోమ= ఆకాశమును; దృష్ట్వాచ= చూచియు; ఆర్తయా=దుఃఖితమయిన; గిరా=వాక్కుచేత; విలలాప=విలపించెను.

రాముండు, మేఘములును మెఱపులునునశించి, స్వచ్ఛమయి, బెగ్గురుపక్షులధ్వనులచే రమణీయంబైయున్న యాకాశంబుఁజూచి, యార్తస్వరంబున, విలపించెను. అని, తాత్పర్యము.

సారసారవసన్నాదై స్సారసారావనాదినీ
యాఽఽశ్రమే రమతే బాలా సాద్యమే రమతే కథమ్. ౭

టీక ॥ సారసారవనాదినీ= బెగ్గురుపక్షులయొక్క ధ్వనివలె ధ్వనించునదగు; యా=ఏ; మే=నాయొక్క; బాలా=చిన్నది; ఆశ్రిమే= ఆశ్రిమమునందు; సారసారవసన్నాదైః = బెగ్గురుపక్షులయొక్క కూఁతలచేఁగలిగిన ధ్వనులచేత; రమతే= క్రీడించుచుండునో; సా = అట్టిచిన్నది; అద్య=ఇప్పుడు; కథం=ఎట్లు;రమతే = క్రీడించును?

మున్ను, ఆశ్రమంబున,మనోహారంబులగు సారసపక్షి ధ్వనులచేరమించుచుండిన సారసపక్షియుంబోలె మనోహరములయినపలుకులుగల నాప్రియురాలు, ఇప్పుడుఎట్లు క్రీడించును? అని, తాత్పర్యము.

పుష్పితాం శ్చాసనాన్ దృష్ట్వా కాంచనానివ నిర్మలాన్
కథం సా రమతే బాలా పశ్యంతీ మా మపశ్యతీ. ౮

టీక॥ సా=ఆ;బాలా=చిన్నది;కాంచనానివ(స్థితాన్) = బంగారువికారములువలెనున్నవియు; నిర్మలాన్=స్వచ్ఛములునగు; పుష్పితాన్= పూచిన; అసనాన్=వేగిసచెట్లను; దృష్ట్వాచ = చూచియు; పశ్యంతీ = చూచుచు; మాం=నన్ను; అపశ్యతీ= చూడనిదై; కథం=ఎట్లు; రమతే=క్రీడించును?

నాప్రియురాలు, బంగారు పువ్వులవలెనున్న నిర్మలంబులగుపుష్పించిన వేగిసపుష్పంబులంజూచి, నన్ను నాలుగుప్రక్కలంజూచియుఁ గానక, యెట్లు

సంతోషంబునొందును? అని, తాత్పర్యము.

యా పురా కలహంసానాం స్వరేణ కలభాషిణీ
బుధ్యతే చారుసర్వాంగీ సాద్య మే బుధ్యతే కథమ్. ౯

టీక॥ యా=ఏ; కలభాషిణీ=మధురముగా మాటలాడునదియు; చారుసర్వాంగీ=సుందరములయినసర్వావయవములునుగలదియునగు సీత; పురా=మున్ను; కలహంసానాం=హంసలయొక్క; స్వరేణ=ధ్వనిచేత; బుధ్యతే=మేలుకొనునో; మే=నాయొక్క; సా=ఆసీత; అద్య=ఇపుడు; కథం=ఎట్లు; బుధ్యతే=మేలుకొనును?

మనోహరముగా మాటలాడు నదియు రమణీయములయిన సమస్తావయవములునుగలదియునగు నాప్రియురాలయినసీత, మున్నుకలహంసలధ్వనికినిద్ర మేలుకొనునే, ఇప్పుడెట్లు మేలు కొనునో. అని, తాత్పర్యము.

నిస్స్వనం చక్రవాకానాం నిశమ్య సహచారిణామ్
పుండరీకవిశాలాక్షీ కథ మేషా భవిష్యతి. ౧౦

టీక॥ పుండరీకవిశాలాక్షీ=తెల్లదామరపూలువలె విశాలములయిన కన్నులుగల; ఏషా = ఈసీత; సహచారిణాం=కూడఁదిరుగుచున్న; చక్రవాకానాం=చక్రవాకపక్షులయొక్క; నిస్స్వనం=ధ్వనిని; నిశమ్య=విని; కథం = ఎట్లు; భవిష్యతి=ఉండఁగలదు.

తెల్లదామరపూలంబోని విశాలసుందరంబులగు నయనంబులుగలనాప్రియురాలు, సమీపంబునసున్న చక్రవాకంబులమనోహరధ్వనులువిని, నావిరహంబుసహించి యెట్లు జీవించియుండఁగలదు? అని, తాత్పర్యము.

సరాంసి సరితో వాపీః కాననాని వనానిచ
తాం వినా మృగశాబాక్షీం చర న్నాద్య సుఖం లభే. ౧౧

టీక॥ అద్య=ఇప్పుడు; తాం=ఆ; మృగశాబాక్షీంవినా = జింకపిల్లలయొక్క కన్నులవంటి కన్నులుగల సీతనువిడిచి; సరాంసి = కొలంకులను;

స ౩౦

సరితః=నదులను; వాపీః = నడబావులను; కాననాని=పెద్దఅడవులను; వనానిచ= చిన్నఅడవులను; చరన్=పొందుచు; సుఖం=సుఖమును; నలభే = పొందను.

ఇపుడు, జింకపిల్లలకుంబోలె విశాలచంచలనయనంబులుగల యాసీత లేకుండుటంజేసి, సరస్సులను నదులను నడబావులను గాననంబులను వనంబులను సంచరించుచున్నను, నాకు సుఖంబుగలుగకున్నది. అని, తాత్పర్యము.

అపి తాం మద్వియోగాచ్చ సౌకుమార్యాచ్చ భామినీమ్
న దూరం పీడయేత్కామ శ్శరద్గుణనిరంతరః. ౧౨

టీక॥ [illegible]రం= సంపాదించ[illegible]త్తం ముపలనను; సౌ[illegible] [illegible]త్వమువలనను; తాం=ఆ; భా[illegible] స్త్రీ యయిన సీతను; శరద్గుణనిరంతరః=శరదృతువుయొక్క గుణముల చేతంబూర్ణుండగు; కామః=మన్మథుండు; దూరం=మిక్కిలియు; అపినపీడయేత్ = పీడింపకుండునా?

శరదృతువు వచ్చుటంజేసి, పరిపూ[illegible]ండగు మన్మథుండు, సీత న[illegible] యున్నదనియు సుకుమారాంగి యనియుం దయఁ దలంచి, యావిడను అధికముగా బాధింపకున్న మెడఁజక్కఁగానుండును. అని, రాముండు విలపించెను. అని, తాత్పర్యము.

ఏవమాది నరశ్రేష్ఠో విలలాప నృపాత్మజః
విహంగ ఇవ సారంగ స్సలిలం త్రిదివేశ్వరాత్. ౧౩

టీక॥ నృపాత్మజః = రాచకొమరుండగు; నరశ్రేష్ఠః = మనుష్యశ్రేష్ఠుండయిన రాముండు; త్రిదివేశ్వరాత్ = ఇంద్రునివలన; సలిలం = జలమునుగూర్చి; సారంగః = చాతకమను; విహంగఇవ=పక్షివలె; ఏవమాది = ఇదిమొదలుగాఁ గలుగునట్లు; విలలాప = విలపించెను.

చాతకపక్షి, జలమునకై దేవేంద్రునిగుఱించి విలపించునట్లు, పురుషోత్తముండగు రాముండు, ఇదిమొదలయిన విధంబున, సీతానిమిత్తమై విలపించెను. అని, తాత్పర్యము.

తత శ్చంచూర్య రమ్యేషు ఫలార్థీ గిరిసానుషు
దదర్శ పర్యుపావృత్తో లక్ష్మీవాన్ లక్ష్మణో గ్రజమ్. ౧౪

టీక॥ తతః=అటుపిమ్మట; లక్ష్మీవాన్=అధికమయిన కాంతిగల; లక్ష్మణః=లక్ష్మణుడు; ఫలార్థీ = పండ్లను గోరినవాండై; గిరిసానుషు=కొండనెత్తములందు; చంచూర్య=వంకరగాందిరిగి, వంకరమార్గంబులందిరిగియనుట; పర్యుపావృత్తః=మఱలివచ్చినవాండై; అగ్రజం=అన్నను; దదర్శ=చూచెను.

అంత, శ్రీమంతుండగులక్ష్మణుండు, ఫలములకైంబోయియుండి పర్వతనెత్తముల సందుగొందులం దిరిగితిరిగి, మఱలివచ్చి, రాముం గాంచెను.

అని, తాత్పర్యము.

తం చింతయా దుస్సహయా పరీతం
విసంజ్ఞ మేకం విజనే మనస్వీ
భ్రాతు ర్విషాదా త్పరితాపదీన
స్సమీక్ష్య సౌమిత్రి రువాచ రామమ్. ౧౫

టీక ॥ మనస్వీ= మంచిమనస్సుగల; సౌమిత్రిః=లక్ష్మణుడు; విజనే=వివిక్తస్థలమునందు; ఏకం=ఒకండును; దుస్సహయా= సహింపనలవిగాని; చింతయా=వగపుచేత; పరీతం=వ్యాపింపంబడినవాండును; విసంజ్ఞం= తెలివిదప్పినవాండునగు; రామం= రాముని; సమీక్ష్య=చూచి; భ్రాతుః = అన్నయొక్క; విషాదాత్=దుఃఖమువలన; పరితాపదీనః=దుఃఖముచేదీనుండై; ఉవాచ=పలికెను.

పరిశుద్ధంబగు హృదయముగల లక్ష్మణుండు, అట్లు విజనప్రదేశంబున నేకాకిగా దుస్సహంబగు దుఃఖమునొంది దేహముదెలియక విలపించుచున్న రామునింజూచి, అన్న దుఃఖించుటచేం దానునుబరమదుఃఖితుండై, యిట్లని పలికెను. అని, తాత్పర్యము.

కి మార్య కామస్య వశం గతేన
కి మాత్మ పౌరుష్యపరాభవేన
అయం సదా సంహ్రియతే సమాధిః
కి మత్ర యోగేన నివర్తితేన. ౧౬

టీక॥ ఆర్య=పూజ్యుఁడవగు రాముఁడా! సదా = ఎల్లప్పుడును; అయం= ఈ; సమాధిః = ధైర్యము; కామస్య=మన్మథునకు; వశం= అధీనతను; గతేన=పొందిన; మనసా (అధ్యాహృతము)=మనసుచేత;సంహ్రియతేకిం= సంపాదింపఁబడుచున్నదాయేమి? ఆత్మపౌరుష్యపరాభవేన= తనయొక్కపౌరుషముయొక్క తిరస్కరించుటచేత,తనపౌరుషమునువదలుటచేతననుట;(సంహ్రియతే)కిం= సంపాదింపఁ బడుచున్నదాయేమి? అత్ర = ఈకాలమునందు; నివర్తితేన=మరలింపఁబడిన;యోగేన= ఉత్సాహముచేత; (సంహ్రియతే)కిం = సంపాదింపఁ బడుచున్నదాయేమి?

పూజ్యుఁడా! ఇప్పుడు, ఇట్లు, మనస్సు కామములోఁ బడినను, పౌరుషంబు వదలినను ఉత్సాహంబువిడిచినను, మనోధైర్యముకలుగునా? ఎంతమాత్రము కలుగదు. అని, తాత్పర్యము.

ఇది గోవిందరాజాభిప్రాయము.

ఇఁకమహేశ్వరతీర్థాభిప్రాయము. —

ఇందు, "అయంయదాసంహ్రియతేసమాధిః" అని,పాఠాంతరము. ఆర్య= పూజ్యుఁడా! కామస్య=మన్మథునకు; వశం=అధీనతను; గతేన= ... దుటచేత; కిం=ఏమిప్రయోజనము? ఆత్మపౌరుష్యపరాభవేన= తనయొక్క పౌరుషమునుదిరస్కరించుటచేత; కిం= ఏమిప్రయోజనము? అయం= ఈ; సమాధిః=చిత్తసమాధానము;యదా= ఎప్పుడు; సంహ్రియతే=సంపాదింపఁబడుచున్నదో; అత్ర= ఈకాలమునందు; నివర్తితేన=మరలింపఁబడిన;యోగేన=ఉత్సాహముచేత; కిం= ఏమిప్రయోజనము. ఏకాలంబున, మనస్సు సమాహితమయి ధైర్యముతో నుండవలెనో, అట్టి యీ సమయమునందు, కామవశంగతుఁడవై పౌరుషంబు వదలి, యుత్సాహంబువిడిచి, యిట్లు దుఃఖించుటచే నేమిప్రయోజనము?

అని, తాత్పర్యము.

క్రియాభియోగం మనసః ప్రసాదం
సమాధియోగానుగతం చ కాలమ్ ।
సహాయసామర్థ్య మదీనసత్త్వ
స్స్వకర్మహేతుంచ కురుష్వ హేతుమ్. ౧౭

స ౩౦

టీక॥ అదీనసత్త్వ= తక్కువకాని ధైర్యముగల రాముఁడా! క్రియాభియోగం= కార్యముకొఱకైన ప్రయత్నమును; మనసః = మనసుయొక్క; ప్రసాదం = నైర్మల్యమును; సమాధియోగానుగతం= ధైర్యముచేతను ఉపాయముచేతను వెంబడింపఁబడిన; కాలంచ = కాలమును; సహాయసామర్థ్యం = సహాయులయొక్క శక్తిని; స్వకర్మహేతుంచ= నీకర్మము అను కారణమును; హేతుం= కారణమునుగా; కురుష్వ= చేసికొనుము.

మహాధైర్యుఁడవగు రాముఁడా! కార్యోద్యోగమును నిర్మలమయిన మనస్సును ధైర్యంబును ఉపాయంబును దేశకాలంబులను సహాయులగు సుగ్రీవాదుల సామర్థ్యమును దేవతాప్రార్థనాది కర్మమును, సాధనములుగా వహించి, కార్యమును సాధించుకొనుము.

అని, తాత్పర్యము.

న జానకీ మానవవంశనాథ
త్వయా సనాథా సులభా పరేణ
న చాగ్నిచూడాం జ్వలితా ముపేత్య
న దహ్యతే వీర వరార్హ కశ్చిత్. ౧౫

టీక॥ మానవవంశనాథ= మనుష్యసమూహమునకుఁ బ్రభుఁడవగు రాముఁడా! త్వయా= నీచేత; సనాథా= నాథునితోఁగూడినదగు; జానకీ= సీత; పరేణ= ఇతరునిచేత; సులభా= పొందనలవియగునది; న = కాదు. వీరవరార్హ= పరాక్రమవంతులలో నుత్తముఁడవగు రాముఁడా! కశ్చిత్= ఒకానొకఁడును; జ్వలితాం= మండుచున్న; అగ్నిచూడాం = నిప్పుజ్వాలలను; ఉపేత్య= పొంది; నదహ్యతేచ= దహింపఁబడకుండఁడుగదా!

పరాక్రమవంతులలో నుత్తముఁడవు మనుజనాథుఁడవగు రాముఁడా! నీవు నాథుఁడవై యుండునపుడు, సీతను దక్కించుకొనుటకు మఱియొకనికెంతమాత్రమలవిగాదు; ఎవ్వఁడేని యగ్నిజ్వాలలను జేతంబట్టి దహింపఁబడక పోవునా? అని, లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స లక్షణం లక్ష్మణ మప్రధృష్యం
స్వభావజం వాక్యమువాచ రామః

హితంచ పథ్యంచ నయప్రసక్తం
ససామ ధర్మార్థసమాహితంచ. ౧౯

టీక ॥ రామః = రాముఁడు; అప్రధృష్యం=ఎదురుచెప్ప నలవిగానిదియు; స్వభావజం= స్వభావసిద్ధంబును; హితంచ = మందుగలిగించునదియు; పథ్యంచ = తత్కాలమునందు సుఖము గలిగించునదియు; ససామ = తిన్నఁదనముతోఁగూడినదియు; ధర్మార్థసమాహితంచ=ధర్మముతోను అర్థముతోను గూడినదియునగు; వాక్యం= మాటను. ఉక్తవంతం (అధ్యాహృతము)= చెప్పినట్టి; సలక్షణం= శుభలక్షణములతోఁ గూడిన; లక్ష్మణం = లక్ష్మణునిఁగూర్చి; ఉవాచ= చెప్పెను.

అట్లు, బదులుయుక్తిచెప్పుటకు అలవిగానిదియు స్వభావసిద్ధంబును ఉత్తరకాలంబుననుదత్కాలంబుననుసుఖకరంబును రాజనీతియుక్తంబును సాంత్వసమేతంబు ధర్మార్థయుక్తంబునగు మాటం జెప్పినలక్ష్మణుఁజూచి, రాముండిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

నిస్సంశయం కార్య మవేక్షితవ్యం
క్రియావిశేషో హ్యనువర్తితవ్యః
నను ప్రవృత్తస్య దురాసదస్య
కుమార కార్యస్య ఫలంనచింత్యమ్. ౨౦

"నహి ప్రవృత్తస్య" ఇతి పాఠాంతరమ్.

టీక ॥ కుమార=లక్ష్మణుఁడా! కార్యం=పని; నిస్సంశయం=సందేహము లేనట్లుగా; అవేక్షితవ్యం= చూడఁబడవలసినది. క్రియావిశేషః=కార్యమునందువిశేషమయిన యుత్సాహము మొదలగునది; అనువర్తితవ్యోహి= అనుసరింపఁబడవలసినదే. ప్రవృత్తస్య=జరుగుచున్న; దురాసదస్య = పొందరాని; కార్యస్య=పనియొక్క;ఫలం = సీతాప్రాప్తిరూపమయినఫలము; నచింత్యం నను= చింతింపఁదగినదికాదా? చింతింపఁదగినదేయనుట; పాఠాంతరపక్షమునందు, ననచింత్యంహి= చింతింపఁదగినదీ గాకపోలేదుగదా!

కుమారుఁడా! నీవు చెప్పినవిధంబున ఉద్దిష్టకార్యమును ముఖ్యముగాఁ జూడ

వలసినదే; అందుకు సాధనమయినయు త్సాహాదుల నవలంబింపవలసినదే; ఇప్పుడు ప్రవృత్తంబగు సీతాన్వేషణరూప కార్యముయొక్క ఫలమయిన సీతాప్రాప్తిని గుఱించి యాలోచింప వలసినది యావశ్యకమే. అని, రాముండు లక్ష్మణుని కెఱింగఁజెప్పెను. అని, తాత్పర్యము.

అథ పద్మపలాశాక్షీం మైథిలీ మనుచింతయన్
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా. ౨౧

టీక ॥ అథ=అటుపిమ్మట; రామః= రాముఁడు; పద్మపలాశాక్షీం= తామరపూరేకులవంటి కన్నులుగల; మైథిలీం=సీతను; అనుచింతయన్=తలఁచుచు; పరిశుష్యతా= ఎండుచున్న; ముఖేన = నోరుతో ; యుక్తః (అధ్యాహృతము) = కూడినవాఁడై; లక్ష్మణం = లక్ష్మణునిగుర్చి ; ఉవాచ=పలికెను.

అంత, రాముండు, మఱలఁ, దామరపూరేకులంబోలు విశాల సుందర నయనంబులుగల సీతం దలంచుకొని దుఃఖావేశంబునంజేసి యెండిన నోరుగలవాఁడై లక్ష్మణుంజూచి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

తర్పయిత్వా సహస్రాక్షః సలిలేన వసుంధరామ్
నిర్వర్తయిత్వా సస్యాని కృతకర్మా వ్యవస్థితః. ౨౨

టీక॥ సహస్రాక్షః=ఇంద్రుఁడు; వసుంధరాం=భూమిని; సలిలేన = జలముచేత; తర్పయిత్వా= తృప్తినొందించి; సస్యాని = పైరులను; నిర్వర్తయిత్వా=నెఱవేర్చి, పండించియనుట; కృతకర్మా = చేయఁబడిన కార్యముగలవాఁడై; వ్యవస్థితః=నిలిచినాఁడు.

దేవేంద్రుండు, భూమికిఁ గావలసినంత వర్షముగురిసి, పైరుల నన్నిటిని పండించి, తాను జేయవలసిన కార్యము నెఱవేర్చి, కృతకృత్యుండయ్యెను. అని, తాత్పర్యము.

స్నిగ్ధగంభీర నిర్ఘోషాః శైలద్రుమపురోగమాః
విసృజ్య సలిలం మేఘాః పరిశ్రాంతా నృపాత్మజ. ౨౩

స ౩౦

టీక॥ నృపాత్మజ=రాచకొమరుఁడవగు లక్ష్మణుఁడా! స్నిగ్ధగంభీరనిర్ఘోషాః=సాంద్రమయినవియు గంభీరము నగు ధ్వనిగలవియు; శైలద్రుమపురోగమాః = పర్వతమునందలి వృక్షముల మీఁదఁబోవునదియునగు; మేఘాః = మేఘములు; సలిలం=జలమును: విసృజ్య=విడిచి; పరిశ్రాంతాః = అలసటనొందినవి.

రాచకొమరుఁడవగు లక్ష్మణుఁడా! మేఘంబులు, స్నిగ్ధంబును గంభీరంబును నగు ధ్వనిగలిగి, పర్వతవృక్షంబులమీఁద సంచరించుచు జలంబు వర్షించి, శ్రమమునొందినట్లు ఊరకున్నవి.

అని, తాత్పర్యము.

నీలోత్పలదళశ్యామా శ్శ్యామీకృత్వా దిశో దశ
విమదా ఇవమాతంగా శ్శాంతవేగాః పయోధరాః. ౨౪

టీక॥ నీలోత్పలదళశ్యామాః = నల్లగలువరేకువలె నల్లనైన; పయోధరాః = మేఘములు; దశ = పదియయిన; దిశః=దిక్కులను; శ్యామీకృత్వా=నల్లగాఁజేసి; విమదాః = మదమువిడిచిన; మాతంగాఇవ= ఏనుంగులువలె; శాంతవేగాః = నిలిచిన వేగముగలవి.

నల్లగలువల రేకులంబోలె శ్యామలవర్ణంబులయిన మేఘములు, దశదిశలను శ్యామలవర్ణంబులగు నట్లుఅంతటను వ్యాపించి,యిప్పుడు,మదమువిడిచిన యేనుంగువలె, శాంతములయినవి.

అని, తాత్పర్యము.

జలగర్భా మహావేగాః కుటజార్జునగంధినః
చరిత్వా విరతా స్సౌమ్య వృష్టివాతా స్సముద్యతాః. ౨౫

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడా! జలగర్భాః= నీళ్లులోపలఁగలవియు, జలముతోఁ గూడినవియు, లేక, చల్లఁదనముతోఁ గూడినవియుననుట; మహావేగాః=అధికమయిన వేగముగలవియు; కుటజార్జునగంధినః= కొండమల్లెలయొక్కయు ఏఱు మద్దిపూలయొక్కయు వాసనగలవియు; సముద్యతాః=లేచినవియునగు; వృష్టివాతాః=వర్షముగురియించు వాయువులు, తూర్పుగాడ్పులనుట; చరిత్వా=వీచి; విరతాః=నిలిచినవి.

సౌమ్యుఁడవగులక్ష్మణుఁడా! వర్షవా

యువులు, మిక్కిలియుఁజల్లనివై కొండ మల్లెలయొక్కయు అర్జున పుష్పంబుల యొక్కయు సౌరభంబులచే మనోహరంబులై మహావేగంబుతో పిచిపిచి, యిప్పుడునిలిచినవి. అని, తాత్పర్యము.

ఘనానాం వారణానాంచ మయూరాణాంచ లక్ష్మణ
నాదః ప్రస్రవణానాంచ ప్రశాంత స్సహసానఘ. ౨౬

టీక॥ అనఘ = పాపరహితుఁడవగు; లక్ష్మణ = లక్ష్మణుఁడా! ఘనానాం= మేఘములయొక్కయు; వారణానాంచ = ఏనుంగులయొక్కయు; మయూరాణాంచ= నెమిళ్లయొక్కయు; ప్రస్రవణానాంచ= సెలయేర్లయొక్కయు; నాదః=ధ్వని; సహసా = శీఘ్రమున; ప్రశాంతః=నిలిచినది.

పాపరహితుండవయిన లక్ష్మణుఁడా! మేఘగర్జితంబులును గజబృంహితంబులును నెమిళ్ల కేకలును సెలయేర్ల పడుధ్వనులును, ఇప్పుడు తటాలున నిలిచినవి. అని, తాత్పర్యము.

అభివృష్టా మహామేఘై ర్నిర్మలా శ్చిత్రసానవః
అనులిప్తా ఇవాభాంతి గిరయ శ్చిత్రదీప్తిభిః. ౨౭

టీక॥ మహామేఘైః=గొప్పమేఘములచేత; అభివృష్టాః=కడఁగఁబడినవియు; నిర్మలాః=స్వచ్ఛములును; చిత్రసానవః=నానావర్ణములగు నెత్తములుగలవియునగు; గిరయః= పర్వతములును; చిత్రదీప్తిభిః = నానావర్ణము లయిన కాంతులచేత; అనులిప్తాః=మైపూఁతగలవివలె; ఆభాంతి = ప్రకాశించుచున్నవి.

పర్వతంబులు, మహావర్షంబులచే జక్కఁగాఁ గడఁగఁబడి నిర్మలంబు లయి నానావర్ణములయిన నెత్తములు గలిగి, గైరికధాతువులయొక్క నానావిధ కాంతులవలనఁ, గుంకుమాది సుగంధం బుఁబూసికొన్న ట్లున్నవి.

అని, తాత్పర్యము.

దర్శయంతి శరన్నద్యః పులినాని శనైశ్శనైః
నవసంగమసంవ్రీడా జఘనా నీవ యోషితః. ౨౮

స ౩౦

టీక ॥ శరన్నద్యః = శరదృతువు నందలినదులు; పులినాని= ఇసుకదిన్నె లను; జఘనాని=మొలలను;నవసంగమ సంవ్రీడాః = నూతనమయిన పొందు నందుమిక్కిలియు సిగ్గుగల; యోషిత ఇవ=స్త్రీలువలె; శనైశ్శనైః = మెల్లమెల్లఁగా; దర్శయంతి= చూపుచున్నవి.

నూతనసంగమమందు యువతులు సిగ్గుచే మిక్కిలివిలంబమున జఘనముల వెలిపఱచునట్లు, శరదృతువునందు నదులు, మెల్లమెల్లగా, నిసుకదిన్నెల బయలుపఱచుచున్నవి. అని, తాత్పర్యము.

శాఖాసు సప్తచ్ఛదపాదపానాం
ప్రభాసు తారార్కనిశాకరాణామ్
లీలాసుచైవోత్తమవారణానాం
శ్రియం విభజ్యాద్య శరత్ప్రవృత్తా. ౨౯

టీక॥అద్య=ఇపుడు;శరత్=శరదృతువు;సప్తచ్ఛదపాదపానాం = ఏడాకుల యరఁటిచెట్లయొక్క;శాఖాసు=కొమ్మలయందును ; తారార్కనిశాకరాణాం=నక్షత్రములయొక్క యుసూర్యునియొక్కయు చంద్రునియొక్కయు;ప్రభాసు=కాంతులందును; ఉత్తమవారణానాం=శ్రేష్ఠములయిన యేనుంగులయొక్క; లీలాసుచైవ = విలాసములందును;శ్రియం=సమృద్ధిని; విభజ్య=పంచి; ప్రవృత్తా=వచ్చినది.

శరదృతువు, తనసమృద్ధిని, ఏడాకులరఁటిచెట్ల శాఖలందును, నక్షత్రములయొక్కయు సూర్యుని యొక్కయుఁ జంద్రుని యొక్కయు కాంతులందును మదపుటేనుంగుల విలాసములందును, మూపుస్థలములందును విభజించుకొని, వ్యాపించినది. అనితాత్పర్యము. ఏడాకులరఁటికొమ్మలు పూచెననియు నక్షత్రాదులకాంతులు నిర్మలములయ్యెననియు ఏనుంగులకు మదమెక్కెననియు భావము. అని, తాత్పర్యము.

సంప్రత్యనేకాశ్రయచిత్రశోభా
లక్ష్మీశ్శరత్కాలగుణోపనీతా
సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు
పద్మాకరేష్వభ్యధికం విభాతి. ౩౦

టీక ॥ సంప్రతి= ఇప్పుడు; అనేకాశ్రయచిత్రశోభా= పెక్కులయిన ఆశ్రయములచేత నానావిధములయిన కాంతిగలదియు; శరత్కాలగుణోపనీతా= శరదృతువుయొక్క గుణముచేఁబొందింపఁబడినదియునగు; లక్ష్మీః = సమృద్ధి; సూర్యాగ్రహస్తప్రతిబోధితేషు= సూర్యునియొక్క మొదటికిరణములచేత వికసింపఁ జేయఁబడిన; పద్మాకరేషు= తామరకొలంకులయందు; అభ్యధికం= మిక్కిలియు; విభాతి = ప్రకాశించుచున్నది.

సూర్యోదయంబున వికసించిన తామరకొలంకులందు, నల్లనివి యెఱ్ఱనివి, తెల్లనివి మొదలయిన నానావిధ కమలంబులు గల్గియుండుటంజేసి, శరత్కాలలక్ష్మి, నానావిధ కాంతులతో మిక్కిలియుఁబ్రకాశించుచున్నది.

అని, తాత్పర్యము.

సప్తచ్ఛదానాం కుసుమోపగంధీ
షట్పాదబృందై రనుగీయమానః
మత్తద్విపానాం పవనో నుసారీ
దర్పం వనే ష్వభ్యధికం తనోతి. ౩౧

టీక॥ వనేషు= అడవులయందు; సప్తచ్ఛదానాం= ఏడాకులఁరటిచెట్లయొక్క; కుసుమోపగంధీ= పూలయొక్క వాసనగలదియు; షట్పాదబృందైః=తుమ్మెదలచేత; అనుగీయమానః = వెంబడించి పాడఁబడుచున్నదియు; అనుసారీ =అనుసరించు చున్నదియునగు; పవనః=గాలి; మత్తద్విపానాం = మదపుటేనుంగులకు;అభ్యధికం=మిక్కిలియధికమయిన;దర్పం=మదమును; తనోతి= చేయుచున్నది. ఏడాకులరఁటిపూలవాసనకు ఏనుఁగులు మదమొందు ననుట ప్రసిద్ధి.

వనంబు లందు, వాయువులు ఏడాకులరఁటిపూల సుగంధంబుగలిగి తుమ్మెదల మనోహరనాదంబులతోఁ గూడినవై వీచుటచే, మదపుటేనుంగులకుమఱియు మదమధికమగుచున్నది.

అని, తాత్పర్యము.

అభ్యాగతై శ్చారువిశాలపక్షైః

స ౩౦

స్సరఃప్రియైః పద్మరజోవకీర్ణైః
మహానదీనాం పులినోపయాతైః
క్రీడంతి హంసా స్సహ చక్రవాకైః. ౩౨

టీక ॥ అభ్యాగతైః= ఎదురువచ్చిన వియు; చారువిశాలపక్షైః=సుందరములును వెడల్పులునగు ఱెక్కలు గలవియు;సరఃప్రియైః= కొలంకులందుఁబ్రీతి గలవియు; పద్మరజోవకీర్ణైః= కమలములయొక్క పరాగములచేత వ్యాపింపఁబడినవియు; మహానదీనాం= గొప్ప నదులయొక్క; పులినోపయాతైః= ఇసుకదిన్నెలనుబొందినవియునగు; చక్రవాకైస్సహ= చక్రవాకపక్షులతోఁగూడ; హంసాః= హంసపక్షులు; క్రీడంతి=విహరించుచున్నవి.

మిథునములగుటంజేసి యొండొంటి కెదురుమొగములయి సంగతములును సంతోషంబునంజేసి విదిర్చికొన్న సుందరంబులగు ఱెక్కలుగలవియు సరోనివాసప్రియంబులును తామరపూ పరాగంబులచేఁ గప్పఁబడినవియునగు చక్రవాకంబులును హంసలును, గొప్పనదుల యిసుకదిన్నెలందు విహరించుచున్నవి. అని, తాత్పర్యము.

మదప్రగల్భేషు చ వారణేషు
గవాం సమూహేషుచ దర్పితేషు
ప్రసన్నతోయాసు చ నిమ్నగాసు
విభాతి లక్ష్మీ ర్బహుధా విభక్తా. ౩౩

టీక ॥ మదప్రగల్భేషు= మదముచే నధికములయిన; వారణేషుచ=ఏనుఁగులయందును; దర్పితేషు=గర్వించిన; గవాం = ఆఁబోతులయొక్క; సమూహేషుచ=గుంపులయందును; ప్రసన్నతోయాసు= స్వచ్ఛమయినజలముగల; నిమ్నగాసుచ=ఏర్లయందును; లక్ష్మీః= శరత్కాలలక్ష్మి; బహుధా=అనేకవిధములుగా; విభక్తా=భాగింపఁబడినదై; విభాతి=ప్రకాశించుచున్నది.

మదించిన యేనుంగులయందును గర్వితంబులగు ఆఁబోతుల సమూహంబులందును స్వచ్ఛమయిన జలముగలనదులయందును, శరత్కాలలక్ష్మి, యనేక

విధముగా విభజింపఁబడి భాసిల్లుచున్నది. అని, తాత్పర్యము.

ఏనుంగులు మదంబునొందినవనియు ఆఁబోతులుగర్వించినవనియునదీజలము స్వచ్ఛమయ్యెననియు భావము.

నభ స్సమీక్ష్యాంబుధరై ర్విముక్తా
విముక్తబర్హాభరణా వనేషు
ప్రియా స్వసక్తా వినివృత్తశోభా
గతోత్సవా ధ్యానపరా మయూరాః. ౩౪

టీక ॥ నభః = ఆకాశము; సమీక్ష్యాంబుధరైః= చూడఁదగిన మేఘములచేత; విముక్తం = విడువఁబడినవి.వనేషు=అడవులయందు; మయూరాః= నెమిళ్లు; విముక్తబర్హాభరణాః = విడువఁబడిన పింఛమను భూషణముగలవై; ప్రియాసు = ప్రియురాండ్రయందు; ఆసక్తాః = ఆసక్తిగలవై; వినివృత్తశోభాః = మఱలిన కాంతిగలవై, కాంతిలేనివై యనుట; గతోత్సవాః=పోయిన సంతోషము గలవై; ధ్యానపరాః= ధ్యానమునందు సక్తిగలవి;ఆభూవన్ (అధ్యాహృతము) = అయినవి.

దర్శనీయంబులగు మేఘంబులు, ఆకాశంబును వదలినవి; అడవులందు నెమిళ్లు, పింఛములువిదిర్చుటను వదలిప్రియురాండ్రతోఁ గూడక కాంతి హీనంబులయి, సంతోషంబువీడి, మధురంబుగాఁ గూయుటనువిడిచి ధ్యానంబు సేయుచున్నవి. అని, తాత్పర్యము.

మనోజ్ఞగంధైః ప్రియకై రనల్పైః
పుష్పాతిభారావనతాగ్రశాఖైః
సువర్ణగౌరై ర్నయనాభిరామై
రుద్యోతితానీవ వనాంతరాణి. ౩౫

టీక॥ మనోజ్ఞగంధైః= మనోహరమగువాసనగలవియు;అనల్పైః= తక్కువగానివియు ; పుష్పాతిభారావనతాగ్రశాఖైః=పూలయొక్కమిక్కిలిబరువుచేత వంగిన కొనకొమ్మలు గలవియు; సువర్ణగౌరైః= బంగారమువలెపసుపు

వన్నెగలవియు; నయనాభిరామైః = కన్నులకు ఒప్పిదములగునవియు నగు; ప్రియకైః = వేగిసచెట్లచేత; వనాంతరాణి = వనమధ్యములు; ఉద్యోతితానీవ = ప్రకాశింపఁ జేయఁబడు చున్నట్లున్నవి.

వేఁగసచెట్లు, మంచివాసనగలపుష్పంబులు నిండుగానుండుటచే వంగినకొనకొమ్మలుగలవై బంగారువన్నెగలపూలుగలవియుఁ గన్నులపండువుగా నుండుటవలన; వనంబులందు దీపములుంచినట్లు ప్రకాశముగలిగియున్నది.

అని, తాత్పర్యము.

ప్రియాన్వితానాం నళినీప్రియాణాం
వనే రతానాం కుసుమోద్ధతానామ్
మదోత్కటానాం మదలాలసానాం
గజోత్తమానాం గతయో ద్య మందాః. ౩౬

టీక ॥ అద్య = ఇపుడు; ప్రియాన్వితానాం = ప్రియురాండ్రతోఁ గూడినవియు; నళినీప్రియాణాం = తామరకొలంకులందుఁ బ్రీతిగలవియు; వనే = అడవియందు; రతానాం = ఆసక్తములును; కుసుమోద్ధతానాం = ఏడాకులరంటిపూలచే మదించినవియు; మదోత్కటానాం = మదజలముచే భేదింపబడిన గండస్థలములు గలవియు; మదలాలసానాం = మదముచే విషయాసక్తములునగు; గజోత్తమానాం = గజశ్రేష్ఠముల యొక్క; గతయః = నడకలు; మందాః = తిన్ననివిగానున్నవి.

ఇపుడు, గజశ్రేష్ఠములు, ఏడాకులరంటిపూల వాసనకు మదమురేఁగి, మదజలము గండస్థలముల భేదించిస్రవింప, మదముచే మఱియు విషయాసక్తంబులగు, ప్రియురాండ్రఁగూడి, తామరకొలంకులందును వనంబునందును విహరింప నాసక్తంబులయి, మెల్లగానడచుచున్నవి. అని, తాత్పర్యము.

వ్యభ్రం నభ శ్శస్త్రవిధౌతవర్ణం
కృశప్రవాహాని నదీజలాని
కల్హారశీతాః పవనాః ప్రవాంతి
తమోవిముక్తా శ్చ దిశః ప్రకాశాః. ౩౭

స ౩౦

టీక॥ నభః=ఆకాశము; వ్యభ్రం=పోయిన మేఘములుగలవై; శస్త్రవిఘాతవర్ణం(విఘాతశస్త్రవర్ణం)= కడఁగఁబడిన యాయుధముయొక్క వన్నెవంటి వన్నెగలది. నదీజలాని= ఏర్లయందలినీళ్లు; కృశప్రవాహాని=కృశించినవఱదలుగలవి,తక్కువయయినప్రవాహముగలవనుట. పవనాః= గాడ్పులు; కహ్లారశీతాః=ఎఱ్ఱగలువలచేఁజల్లనివై; ప్రవాంతి=వీచుచున్నవి.దిశః=దిక్కులు;తమోవిముక్తాః=చీఁకటిచే విడువఁబడినవై; ప్రకాశాః=వెలుతురుగలవి.

ఆకాశము, మేఘములులేక, చకచకఁగాఁదోమిన యాయుధమువలె స్వచ్ఛముగా నున్నది; నదీప్రవాహములు తగ్గినవి; వాయువులు, ఎఱ్ఱగలువల మీఁదుగా వచ్చుటచేఁ జల్లగావీచుచున్నవి; దిక్కులు, మేఘావరణము పోవుటచేఁ బ్రకాశము గలిగియున్నవి.

అని, తాత్పర్యము.

సూర్యాతపక్రామణనష్టపంకా
భూమి స్సముత్పాదితసాంద్రరేణుః
అన్యోన్యవైరామర్షాయుతానా
ముద్యోగకాలోఽద్య నరాధిపానామ్. ౩౮

టీక॥భూమిః=నేల;సూర్యాతపక్రామణనష్టపంకా=సూర్యుని యెండయొక్కతగులుటచేత నశించినబురదగలదై; సముత్పాదితసాంద్రరేణుః= పుట్టింపఁబడినదట్టమయిన పరాగముగలది. అన్యోన్యవైరామర్షాయుతానాం = ఒండొరులమీఁదవిరోధముతోను అసూయతోనుమిక్కిలిగూడిన; నరాధిపానాం=రాజులకు; అద్య=ఇప్పుడు; ఉద్యోగకాలః=ప్రయత్నసమయము.

భూమి, యెండగాయుటచే బురదయెండి దట్టముగా దుమ్మురేఁగియున్నది; ఒకరిమీఁద నొకరికి విరోధమునుఅసూయయు నధికముగాఁగలరాజులు,ఒకరిమీఁదనొకరుఎత్తిపోవుటకిది యుక్తమయినసమయము. అని, తాత్పర్యము.

శరద్గుణాప్యాయితరూపశోభాః
ప్రహర్షితాః పాంసుసముక్షితాంగాః
మదోత్కటా స్సంప్రతి యుద్ధలుబ్ధా

వృషా గవాం మధ్యగతా నదంతి. ౩౯

టీక॥ సంప్రతి=ఇప్పుడు; వృషాః= ఆఁబోతులు; శరద్గుణాప్యాయితరూపశోభాః=శరదృతువుయొక్క గుణముచేఁబుష్టినొందింపఁబడినశరీరమునుకాంతియుఁ గలవై; పాంసుసముక్షితాంగాః= దుమ్ముచేఁగప్పఁబడిన శరీరము గలవై; మహోత్కటాః = మదముచేన ధికములయి; యుద్ధలుబ్ధాః= పోరునందు ఆశగలవై; గవాం = ఆవులయొక్క; మధ్యగతాః = నడుమునుబొందినవై; ప్రహర్షితాః = సంతోషించినవై; నదంతి=అఱచుచున్నవి.

ఇపుడు, ఆఁబోతులు, శరదృతువు వచ్చుటచే, శరీరపుష్టియుఁ గాంతియు వృద్ధినొందుటంజేసి, మదించినవై, మేనంతయు దుమ్ముచేసికొని, యొండొంటితోఁబోరఁ గాలుద్రవ్వుచు, ఆవుమందల మధ్యంబున, సంతుష్టములయి గర్జించుచున్నవి. అని, తాత్పర్యము.

సమన్మథం తీవ్రగతానురాగాః
కులాన్వితా మందగతిం కరేణ్వః
మదాన్వితం సంపరివార్య యాంతం
వనేషు భర్తార మనుప్రయాంతి. ౪౦

టీక॥ వనేషు= అడవులయందు; తీవ్రగతానురాగాః=అధికముగాఁ బొందఁబడిన యనురాగముగలవియు; కులాన్వితాః=సమూహముతోఁ గూడినవియునగు; కరేణ్వః= ఆఁడేనుఁగులు; సమన్మథం = మన్మథునితోఁగూడినదియు; మందగతిం = తిన్ననినడకగలదియు; మదాన్వితం= మదముతోఁగూడినదియు; యాంతం=పోవుచున్నదియునగు; భర్తారం=పెనిమిటియయిన మగయేనుఁగును; సంపరివార్య = చుట్టుకొని; అనుప్రయాంతి= వెంబడించుచున్నవి.

వనములందు, ఆఁడేనుఁగులు, పెనిమిటియందు గాఢానురాగముగలవైతమసమూహముతోఁగూడినవై, మన్మథవేగంబుతోఁగూడినదియు మదించిమందగమనంబున నడచుచున్నదియునగు పెనిమిటియయిన మగయేనుఁగును బరివేష్టించిపోవుచున్నవి.అని, తాత్పర్యము.

త్యక్త్వా వరాణ్యాత్మవిభూషణాని
బర్హాణి తీరోపగతా నదీనామ్
నిర్భర్త్స్యమానా ఇవ సారసౌఘైః
ప్రయాంతి దీనా విమదా మయూరాః. ౪౧

టీక॥ మయూరాః = నెమిళ్లు; వరాణి=ఉత్తమములయిన; ఆత్మవిభూషణాని= తమయొక్క ఆభరణములయిన; బర్హాణి=పింఛములను; విహాయ=వదలి; నదీనాం= ఏర్లయొక్క; తీరోపగతాః = గట్టును బొందినవై; సారసౌఘైః=హంసపక్షుల సమూహములచేత; నిర్భర్త్స్యమానా ఇవ (స్థితాః)= బెదరింపఁబడినవి వలెనున్నవై; దీనాః= దుఃఖితములయి; విమదాః = పోయిన గర్వముగలవై; ప్రయాంతి = పోవుచున్నవి.

(పూర్వము ధనికులుగానుండి వెనుకఁ గాలవిపర్యాసముచేత దరిద్రులలయినవారలు, నూతనధనికులు చేయు నవమానమునకు, ఏమియుఁ జేయఁజాలక దీనులగునట్లు) నెమిళ్లు, తమయుత్తమాభరణంబులగు పింఛంబులులేక, నదీతీరంబులకుఁబోఁగా, శరత్కాలగర్వితంబులగు హంసలువాని బెదరించినట్లు కూయుటయు, ఆనెమిళ్లు, గర్వంబుడెగిదీనములయి పోవుచున్నవి. అని, తాత్పర్యము.

విత్రాస్య కారండవచక్రవాకాన్
మహారవై ర్భిన్నకటా గజేంద్రాః
సరస్సు బద్ధాంబుజభూషణేషు
విక్షోభ్య విక్షోభ్య జలం పిబంతి. ౪౨

టీక॥ భిన్నకటాః=(మదజలముచే) భేదింపఁబడినచెక్కిళ్లుగల; గజేంద్రాః= గజశ్రేష్ఠములు; మహారవైః = గొప్పధ్వనులచేత; కారండవచక్రవాకాన్= కన్నెలేళ్లను జక్కవలను; విత్రాస్య= భయపఱిచి; బద్ధాంబుజభూషణేషు= వికసించిన కమలములె యలంకారములుగాఁగల; సరస్సు = కొలంకులయందు; విక్షోభ్యవిక్షోభ్య = కలఁచికలఁచి; జలం=నీటిని; పిబంతి= త్రాఁగుచున్నవి.

మదించి గండస్థలంబులను భేదించి

స్రవించుచున్న మదజలముగల యుత్త మగజంబులు, కన్నెలేళ్లును జక్రవాకంబులును భయమునొందునట్లు పెద్దఅంకెలువేసి, వికసించిన కమలములచే నలంకృతంబులగు కొలంకులను గలియఁబెట్టి కలియఁబెట్టి, జలము ద్రావుచున్నవి. అని, తాత్పర్యము.

వ్యపేతపంకాసు సవాలుకాసు
ప్రసన్నతోయాసు సగోకులాసు
ససారసారావనినాదితాసు
నదీషు హృష్టా నిపతంతి హంసాః. ౪౩

టీక॥ వ్యపేతపంకాసు = పోయిన బురదగలవియు; సవాలుకాసు=ఇసుకతోఁగూడినవియు; ప్రసన్నతోయాసు= స్వచ్ఛమయిన జలముగలవియు; సగోకులాసు=ఆవులసమూహముతోఁగూడినవియు; ససారసారావనినాదితాసు= బెగ్గురుపక్షులతోఁ గూడినవియు (వాని యొక్క)ధ్వనులచే ధ్వనింపఁజేయఁబడినవియునగు; నదీషు=ఏర్లయందు; హంసాః=అంచలు; హృష్టాః= సంతసించినవై; నిపతంతి=వాలుచున్నవి.

బురదలు లేకస్వచ్ఛమయిన జలము గల్గి యిసుక దిన్నెలతో నొప్పుచున్నవియు, తీరములందు ఆవులమందలతోఁ గూడినవియు మధురంబుగాఁగూయుచున్న సారసపక్షులచే రమణీయంబులునగు, నదులందు, హంసలు చేరుచున్నవి. అని, తాత్పర్యము.

నదీఘనప్రస్రవణోదకానా
మతిప్రవృద్ధానిలబర్హిణానామ్
ప్లవంగమానాంచ గతోత్సవానాం
ద్రుతం రవా స్సంప్రతి సంప్రణష్టాః. ౪౪

టీక ॥ సంప్రతి = ఇప్పుడు; నదీఘనప్రస్రవణోదకానాం = ఏర్లయొక్కయు గొప్పవగు సెలయేర్లయొక్కయు జలములయొక్కయు; అతిప్రవృద్ధానిలబర్హిణానాం= మిక్కిలియభివృద్ధిఁబొందిన గాడ్పులయొక్కయు నెమిళ్లయొక్కయు; గతోత్సవానాం = పోయిన పండుగగల; ప్లవంగమానాంచ = క

ప్పలయొక్కయు; రవాః = ధ్వనులు; ద్రుతం= శీఘ్రముగా; సంప్రణష్టాః= నశించినవి.

ఇప్పుడు, నదీప్రవాహధ్వనులును సెలయేర్లజలంబులు పడుశబ్దములును పెనుగాడ్పుల ధ్వనియును మయూరంబుల కేకలును, సంతోషహీనంబులయిన కప్పలస్వరంబులును, శీఘ్రంబునసిలిచినవి. అని, తాత్పర్యము.

అనేకవర్ణా స్సువినష్టకాయా
నవోదితే ష్వంబుధరేషు నష్టాః
క్షుధార్దితా ఘోర విషా బిలేభ్య
శ్చిరోషితా విప్రసరంతి సర్పాః. ౪౫

టీక ॥ అనేకవర్ణాః = పెక్కువన్నెలుగలవియు; సువినష్టకాయాః = మిక్కిలియు కృశించిన దేహములుగలవియు; అంబుధరేషు = మేఘములు; నవోదితేషు= నూతనముగా నుదయించినవికాఁగా; నష్టాః = నశించినవియు, అగపడకడాఁగినవియుననుట; క్షుధార్దితాః = ఆఁకలిచేఁ బీడింపఁబడినవియు; ఘోరవిషాః= భయంకరమయిన విషముగలవియు; చిరోషితాః=(బిలములందు ) బహుకాల మున్నవియు నగు; సర్పాః=పాములు; బిలేభ్యః= రంధ్రములనుండి; విప్రసరంతి = వెడలుచున్నవి.

అనేకవిధ వర్ణంబులును, వర్షాకాలంబంతయు బయలందిరుగక బిలంబులందాఁగి యాహారంబు లేకుండుటంజేసి, మిక్కిలియుఁ గృశించినవియునై భయంకరమయిన విషముగలవియునగు సర్పములు బిలంబులనుండి వెడలివచ్చుచున్నవి. అని, తాత్పర్యము.

చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా
అహో రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్. ౪౬

టీక ॥ చంచచ్చంద్రకరస్పర్శహర్షోన్మీలితతారకా= ఉదయించుచున్నచంద్రునియొక్క కిరణములచేతను, (హస్తముచేతను ) తాఁకుటచేతఁ గలిగిన వికాసముచేత (సంతోషముచేత) వికసించిననక్షత్రములు (కంటిగ్రుడ్లు)గలది

యు ; రాగవతీ = ఎఱ్ఱఁదనముగలది యు, అనురాగముగలదియునగు; సంధ్యా = సంజ, సంధ్యయనుస్త్రీ; స్వయం=తానే మె; అంబరం = ఆకాశమును, వస్త్రమును; జహాతి= విడుచుచున్నది. అహో=ఆశ్చర్యము!

చంద్రకిరణంబులప్రకాశముతోఁనక్షత్రములు నిర్మలముగా నుదయించుటయు, నాకాశమునందు సంధ్యారాగముక్రమముగా తగ్గుచున్నది. అని, తాత్పర్యము. కరశబ్దము కిరణమునకు హస్తమునకును, తారకాశబ్దము నక్షత్రమునకును కంటిగ్రుడ్డునకును, రాగశబ్దము ఎఱ్ఱఁదనమునకుఅనురాగమునకును, అంబరశబ్దముఆకాశమునకును వస్త్రమునకునువాచకముగుటవలన, కాముకియగు వనిత, ప్రియుని హస్తస్పర్శంబుచే సంతోషంబున వికసించిన కంటిగ్రుడ్డుగలిగి, అధికానురాగంబుతోఁ, గామాతురయయి సురతార్థము, తానేవస్త్రము వదలుట ప్రతీతమగుచున్నది.

రాత్రిశ్శశాంకోదితసౌమ్యవక్త్రా
తారాగణోన్మీలితచారునేత్రా
జ్యోత్స్నాంశుకప్రావరణా విభాతి
నారీవ శుక్లాంశుకసంవృతాంగీ. ౪౭

టీక ॥ శశాంకోదిత సౌమ్యవక్త్రా (ఉదితశశాంకసౌమ్యవక్త్రా) = ఉదయించిన చంద్రుఁడను సుందరమయిన ముఖముగలదియు; తారాగణోన్మీలిత చారునేత్రా (ఉన్మీలితతారాగణచారునేత్రా)=తెఱవఁబడిననక్షత్రములయొక్క సమూహము అను సుందరములయినకన్నులుగలదియును; జ్యోత్స్నాంశుకప్రావరణా = వెన్నెలయనువస్త్రమె ఉత్తరీయముగాఁగలదియునగు; రాత్రిః= రేయి; శుక్లాంశుకసంవృతాంగీ= తెల్లనివస్త్రముచేఁ గప్పఁబడినయవయవములుగల; నారీవ=స్త్రీవలె; విభాతి= ప్రకాశించుచున్నది.

రాత్రి, ఉదయించిన చంద్రబింబమె ముఖముగా, నక్షత్రములె తెఱవఁబడిన కన్నులుగా వెన్నెలయుత్తరీయముగాఁ గలిగియుండుటవలనఁ, దెల్లనివస్త్రము గప్పుకొన్నకాంతవలె నొప్పుచున్నది. అని, తాత్పర్యము.

విపక్వశాలిప్రసవాని భుక్త్వా

స ౩౦

ప్రహర్షితా సారసచారుపఙ్క్తిః
నభస్సమాక్రామతి శీఘ్రవేగా
వాతావధూతా గ్రథితేవ మాలా. ౪౮

టీక॥ సారసచారుపఙ్క్తిః = బెగ్గురుపక్షులయొక్క సుందరమయినచాలు; విపక్వశాలిప్రసవాని = పండినవరిగింజలను; భుక్త్వా = భక్షించి; ప్రహర్షితా = సంతోషించినదై; శీఘ్రవేగా = శీఘ్రమయిన వేగముగలదై; వాతావధూతా = గాలిచే నెగురఁగొట్టఁబడిన; గ్రథితా = కూర్పఁబడిన; మాలేవ = పుష్పమాలికవలె; నభః = ఆకాశమును; ఆక్రామతి = పొందుచున్నది.

బెగ్గురుపక్షులు, చక్కఁగాఁబండిన శాలిధాన్యమునుదిని సంతుష్టములయి, జాలుగట్టి, పుష్పమాల గాలికెగిరియాకాశంబునొందునట్లు, ఆకాశమున కెగురుచున్నవి. అని, తాత్పర్యము.

సుప్తైకహంసం కుముదై రుపేతం
మహాహ్రదస్థం సలిలం విభాతి
ఘనై ర్విముక్తం నిశి పూర్ణచంద్రం
తారాగణాకీర్ణ మివాంతరిక్షమ్. ౪౯

టీక॥ సుప్తైకహంసం = నిదురించినయొకహంసగలదియు; కుముదైః = తెల్లగలువలతో; ఉపేతం = కూడినదియునగు; మహాహ్రదస్థం = గొప్పతటాకమునందున్న; సలిలం = జలము; నిశి = రాత్రియందు; ఘనైః = మేఘములచేత; విముక్తం = విడువఁబడినదియు; పూర్ణచంద్రం = నిండుచందురుఁడుగలదియు; తారాగణాకీర్ణం = నక్షత్రసమూహములచే వ్యాపింపఁబడినదియునగు; అంతరిక్షమివ = ఆకాశమువలె; విభాతి = ప్రకాశించుచున్నది.

నిర్మలమయి నిదురించిన యొకహంసగలిగి పెక్కు తెల్లగలువలతోఁ గూడినదైన విశాలతటాకము నందలిజలము, రాత్రియందు, మేఘములులేకుండుటవలన నిర్మలమయి పూర్ణచంద్రునితోఁ గూడినదై నక్షత్రములతో నొప్పుచున్న యాకాశమువలెఁ బ్రకాశించుచున్నది. అని, తాత్పర్యము.

ప్రకీర్ణ హంసాకుల మేఖలానాం
ప్రబుద్ధ పద్మోత్పలమాలినీనామ్
వాప్యుత్తమానా మధికా ద్య లక్ష్మీ
ర్వరాంగనానా మివ భూషితానామ్. ౫౦

టీక॥ అద్య= ఇప్పుడు; ప్రకీర్ణ హంసాకుల మేఖలానాం= విచ్చలవిడియయి నహంసలు అనుచలించుచున్న మొలనూలుగలవియు; ప్రబుద్ధపద్మోత్పలమాలినీనాం= వికసించినకమలములయొక్కయు కలువలయొక్కయుమాలికలు గలవియు నగు; వాప్యుత్తమానాం=కోనేళ్లలో నుత్తమములగు వానియొక్క; లక్ష్మీః= కాంతి; భూషితానాం= అలంకరింపఁబడిన; వరాంగనానాం= ఉత్తమస్త్రీలయొక్క; లక్ష్మీః(అధ్యాహృతము) ఇవ=కాంతివలె; అధికా=ఎక్కువయగుచున్నది.

ఇపుడు, అచటచట వ్రాలియున్న హంసలు మొలనూలుగా వికసితములగు కమలంబులు గలువలును బుష్పమాలికలుగాఁగల శ్రేష్ఠంబులగు కోనేళ్ళు, భూషణములచేతను బుష్పమాలికలచేతను అలంకరింపఁబడిన యుత్తమవనితలుంబోలె, నెంతయుఁబ్రకాశించుచున్నవి. అని, తాత్పర్యము.

వేణుస్వనవ్యంజితతూర్యమిశ్రః
ప్రత్యూషకాలానిలసంప్రవృద్ధః
సమ్మూర్ఛితో గర్గరగోవృషాణా
మన్యోన్య మాపూరయతీవ శబ్దః. ౫౧

టీక ॥ వేణుస్వనవ్యంజితతూర్యమిశ్రః=పిల్లంగ్రోవులచేఁదెలుపఁబడిన గీతవాద్యముతోఁగలసినదియు; ప్రత్యూషకాలానిలసంప్రవృద్ధః= ప్రాతఃకాలవాయువుచేఁ బెరిగినదియు; సమ్మూర్ఛితః= వ్యాపించినదియునగు; గర్గరగోవృషాణాం = పెరుఁగుచిలుకుబానలయొక్కయు ఆవులయొక్కయు ఆఁబోతులయొక్కయు; శబ్దః=ధ్వని; అన్యోన్యం= ఒండొంటిని; ఆపూరయతీవ= నిండించునట్లున్నది, వృద్ధిఁబొందించునట్లున్నదనుట.

ప్రాతఃకాలమునందు, గోపికలు పెరుఁగుచిలుకునట్టిధ్వనియు, ఆవులు దూడలకై యఱచునట్టిధ్వనియు ఆఁబోతులు కామాతురంబులయి యఱచునట్టి ధ్వనియు, గోపాలురూఁదునట్టి పిల్లంగ్రోవుల మధురస్వనంబులతోఁ గూడినవై, ప్రాతఃకాలవాయువుచేనధికమయి యంతటవ్యాపించినవై, యొకటితోనొకటికలసి వృద్ధింబొందుచున్నవి.

అని, తాత్పర్యము.

నవైర్నదీనాం కుసుమప్రభాసై
ర్వ్యాధూయమానైర్మృదుమారుతేన
ధౌతామలక్షౌమపటప్రకాశైః
కూలాని కాశైరుపశోభితాని. ౨౨

టీక॥ నదీనాం = ఏర్లయొక్క; కూలాని=తీరములు; నవైః=నూతనములును; కుసుమప్రభాసైః=పూలచేఁబ్రకాశించుచున్నవియు; మృదుమారుతేన=తిన్నని గాలిచేత; వ్యాధూయమానైః=కదలింపఁబడుచున్నవియు; ధౌతామలక్షౌమపటప్రకాశైః=ఉతుకఁబడిన స్వచ్ఛమయిన తెల్లపట్టువస్త్రముయొక్క కాంతివంటికాంతిగల; కాశైః=ఱెల్లుచేత; ఉపశోభితాని = ప్రకాశించుచున్నవి.

నదీతీరములు, నూతనములును తెల్లని పూలతో నొప్పుచున్నవియు మందమారుతమునకుఁ గదలుచున్నవియు స్వచ్ఛమయిన తెల్లనిపట్టుచీరతో సమానములునగు ఱెల్లుచే సంవృతంబులై, తెల్లపట్టుచీరగట్టిన వనితలజఘనంబులవలెఁ బ్రకాశించుచున్నవి. అని, తాత్పర్యము.

వనప్రచండా మధుపానశౌండాః
ప్రియాన్వితాః షట్చరణాః ప్రహృష్టాః
వనేషు మత్తాః పవనానుయాత్రాం
కుర్వంతి పద్మాసనరేణుగౌరాః. ౨౩

టీక॥ వనప్రచండాః = అడవులందు ఎదురులేని గమనముగలవియు; మధుపానశౌండాః = తేనియద్రావుటచే మత్తిల్లినవియు; ప్రియాన్వితాః = ప్రి

యురాండ్రతోఁ గూడినవియు; ప్రహృష్టాః=మిక్కిలియు సంతసించినవియు; మత్తాః=మదించినవియు; పద్మాసనరేణుగౌరాః=కమలములయొక్కయు వేగిసచెట్లయొక్కయు పరాగముచేఁ బసుపువన్నెగలవియునగు; షట్చరణాః=తుమ్మెదలు; పవనానుయాత్రాం = వాయువుయొక్క వెంబడించుటను; కుర్వంతి = చేయుచున్నవి.

వనంబుల నెదురులేకదిరుగుచుఁ దేనియద్రావిద్రావి మత్తిలి ప్రియాసహితంబులయి సంతుష్టంబులయి కమలములయొక్కయు వేగిస పూలయొక్కయుఁ బరాగంబులులెగులుటచేత గౌరవర్ణంబులయిన తుమ్మెదలు, గాలియందలిసుగంధమునకై, గాలిని వెంబడించి పోవుచున్నవి. అని, తాత్పర్యము.

జలం ప్రసన్నం కుముదం ప్రభాసం
క్రౌంచస్వన శ్శాలివనం విపక్వమ్
మృదుశ్చ వాయు ర్విమలశ్చ చంద్ర
శ్శంసంతి వర్ష వ్యపనీతకాలమ్. ౫౪

టీక ॥ ప్రసన్నం= నిర్మలమయిన; జలం=నీరును; ప్రభాసం=వికసించిన; కుముదం=తెల్లగలువయు; క్రౌంచస్వనః=క్రౌంచపక్షులయొక్క ధ్వనియు; విపక్వం=పండిన; శాలివనంచ=వరిపైరును; మృదుః= తిన్ననిి; వాయుశ్చ= గాలియు; విమలః = స్వచ్ఛుఁడయిన; చంద్రశ్చ=చంద్రుఁడును; వర్ష వ్యపనీత కాలం= వానచేవిడువఁబడిన సమయమును; శంసంతి=చెప్పుచున్నవి.

నిర్మలంబగు జలంబును వికసితంబులగు తెల్లకలువలును క్రౌంచపక్షులు మధురముగాఁ గూయుటయు వరిపైరు పండియుండుటయు, మందమారుతంబును, స్వచ్ఛమయిన చంద్రబింబమును, వర్షాకాలము కడచినదనియు నిది శరత్కాలమనియుఁ దెలుపుచున్నవి.

అని, తాత్పర్యము.

మీనోపసందర్శితమేఖలానాం
నదీవధూనాం గతయో ద్య మందాః
కాంతోపభుక్తాలసగామినీనాం
ప్రభాతకాలే ష్వివ కామినీనామ్. ౫౫

టీక ॥ అద్య=ఇప్పుడు; మీనోపసందర్శిత మేఖలానాం = మత్స్యములచే చూపఁబడిన మొలనూళ్లుగల; నదీవధూనాం = నదులను స్త్రీలయొక్క; గతయః = నడకలు; ప్రభాతకాలేషు= ప్రాతఃకాలములయందు; కాంతోపభుక్తాలసగామినీనాం = ప్రియులచేనుపభోగింపఁబడినవారలును, కావుననె, మెల్లగా నడుచువారలునగు; కామినీనాం= స్త్రీలయొక్క; గతయః (అధ్యాహృతము) ఇవ= నడకలువలె; మందాః= తిన్ననివిగానున్నవి.

ఇపుడు, మీనములు మేఖలగాఁగల నదులు, రాత్రియంతయుఁ బ్రియులతోనుపభోగించి యలసియున్న కాములు ప్రాతఃకాలంబుల మెల్లగా నడుచునట్లు, మెల్లగాఁబాఱుచున్నవి.

అని, తాత్పర్యము.

సచక్రవాకాని సశైవలాని
కాశై ర్దుకూలై రివ సంవృతాని
సపత్రలేఖాని సరోచనాని
వధూముఖానీవ నదీముఖాని. ౫౬

టీక॥ సచక్రవాకాని = జక్కవలతోఁగూడినవియు; సశైవలాని=పాచితోఁగూడినవియు; దుకూలైరివ = తెల్లపట్టుచీరలచేతవలె; కాశైః= తెల్లుచేత; సంవృతాని= కట్టఁబడినవియునగు; నదీముఖాని = ఏటిగట్లు; సరోచనాని=గోరోచనముతోఁగూడినవియు; సపత్రలేఖాని = మకరాదిరూపమున వ్రాయఁబడిన చిత్తరువుతోఁ గూడినవియునగు; వధూముఖానీవ=స్త్రీలమోములు వలె; విభాంతి (అధ్యాహృతము) = ప్రకాశించుచున్నవి.

చక్రవాక పక్షులతోను పాచితోనుం గూడినవియు తెల్లుతోఁగప్పఁబడినవియునగు నదులరేవులు, గోరోచనముతోఁ గూడి మకరపత్రాలంకృతంబులయి దుకూలంబుచేఁగప్పఁబడిన వనితాముఖంబులుం బోలెఁ బ్రకాశించుచున్నవి. అని, తాత్పర్యము.

ప్రఫుల్లబాణాసనచిత్రితేషు
ప్రహృష్టషట్పాదనికూజితేషు

గృహీతచాపోద్యత చండదండః
ప్రచండచారో ద్య వనేషు కామః. ౫౭

టీక॥ అద్య = ఇపుడు; ప్రఫుల్లబాణాసనచిత్రశేషు = వికసించిననల్లగోరంట పూలచేతను వేఁగిసపూలచేతను చిత్రవర్ణములుగాఁ జేయఁబడినవియు; ప్రహృష్టషట్పాదనికూజితేషు = సంతసించిన తుమ్మెదలయొక్క-ధ్వనులుగలవియునగు; వనేషు=అడవులయందు; కామః=మన్మథుఁడు; గృహీతచాపోద్యతచండదండః = పట్టఁబడిన ధనుస్సుగలవాఁడును ఎత్తఁబడిన భయంకరములయిన బాణములుగలవాఁడునై; ప్రచండచారః=భయంకరమయిన తిరుగుటగలవాఁడుగా; భవతి(అధ్యాహృతము)= అగుచున్నాఁడు.

ఇపుడు, వికసితంబులగు నల్లగోరంటపూలచేతను వేఁగిసపూలచేతను రమణీయములయి మదించిన తుమ్మెదల మధురఝుంకారములతో నొప్పుచున్న వనంబులందు, మన్మథుఁడు, ధనుస్సును భయంకరంబులగు బాణంబులనుదాల్చి విరహులకుభయంకరుండై విహరించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

లోకం సువృష్ట్యా పరితోషయిత్వా
నదీ స్తటాకానిచ పూరయిత్వా
నిష్పన్నసస్యాం వసుధాంచ కృత్వా
త్యక్త్వా నభ స్తోయధరాః ప్రణష్టాః. ౫౮

టీక॥ తోయధరాః = మేఘములు; లోకం=జనమును; సువృష్ట్యా= మంచివర్షముచేత; పరితోషయిత్వా (పరితోష్య) = సంతోషింపఁజేసి; నదీః=ఏర్లను; తటాకానిచ=చెఱువులను; పూరయిత్వా=నిండించి; వసుధాం=భూమిని; నిష్పన్నసస్యాం=ఫలించినపైరులుగలదానిఁగా; కృత్వాచ = చేసియు; నభః=ఆకాశమును; త్యక్త్వా=విడిచి; ప్రణష్టాః = నశించినవి.

మేఘములు, జనులు సంతోషించునట్లు చక్కఁగావర్షముగురిసి, నదులను దటాకములను నిండించి, భూమియందుఁ బైరులనుబండించి, యాకాశమునువదలిపోయినవి. అని, తాత్పర్యము.

ప్రసన్నసలిలా స్సౌమ్య కురరీభి ర్వినాదితాః
చక్రవాకగణాకీర్ణా విభాంతి సలిలాశయాః. ౫౯

టీక॥ సౌమ్య=తిన్ననివాఁడవగు లక్ష్మణుఁడా! సలిలాశయాః=సరస్సులు; ప్రసన్నసలిలాః=నిర్మలమయిన జలము గలవై; కురరీభిః=ఆఁడుక్రౌంచపక్షుల చేత; వినాదితాః=ధ్వనింపఁజేయఁబడినవై; చక్రవాకగణాకీర్ణాః=జక్కవల యొక్క సమూహముచే వ్యాపింపఁబడినవై; విభాంతి=ప్రకాశించుచున్నవి.

సౌమ్యుఁడవగు లక్ష్మణుఁడా! సరస్సులు, నిర్మలంబగుజలముగలిగి మధురముగాధ్వనించు క్రౌంచపక్షులతోను జక్రవాకసమూహంబులతోను గూడినవై ప్రకాశించుచున్నవి.

అని, తాత్పర్యము.

అసనా స్సప్తపర్ణాశ్చ కోవిదారాశ్చ పుష్పితాః
దృశ్యంతే బంధుజీవాశ్చ శ్యామాశ్చ గిరిసానుషు. ౬౦

టీక॥ గిరిసానుషు=కొండనెత్తములయందు; పుష్పితాః = పూచిన; అసనాః=వేఁగిసచెట్లును; సప్తపర్ణాశ్చ = ఏడాకులరఁటులును; కోవిదారాశ్చ = కాంచనపుచెట్లును; బంధుజీవాశ్చ = మంకెనచెట్లును; శ్యామాశ్చ= ప్రేంకణపుచెట్లును; దృశ్యంతే = చూడఁబడుచున్నవి.

పర్వతసానువులందు, వేఁగిసచెట్లును ఏడాకులరఁటులును కాంచనములును మంకెనలును ప్రేంకణములును, జక్కఁగాఁ బుష్పించియున్నవి.

అని, తాత్పర్యము.

హంససారసచక్రాహ్వైః కురరైశ్చ సమంతతః
పులినా న్యవకీర్ణాని నదీనాం పశ్య లక్ష్మణ. ౬౧

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! హంససారసచక్రాహ్వైః=అంచలచేతను బెగ్గురులచేతను జక్కవలచేతను; కురరైశ్చ = క్రౌంచపక్షులచేతను; సమంతతః=అంతటను; అవకీర్ణాని=వ్యాపింపఁబడిన; నదీనాం=ఏర్లయొక్క; పులినాని=ఇసుకదిన్నెలను; పశ్య=చూడుము.

లక్ష్మణుఁడా! నదుల యిసుకదిన్నె

లందు, హంసలును సారసంబులును జక్రవాకంబులును క్రౌంచంబులును విహరించుచున్నవి చూడుము.

అని, తాత్పర్యము.

అన్యోన్యబద్ధవైరాణాం జిగీషూణాం నృపాత్మజ
ఉద్యోగసమయ స్సౌమ్య పార్థివానా ముపస్థితః. ౬౨

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడవగు; నృపాత్మజ = రాచకొమరుఁడవైన లక్ష్మణుఁడా! అన్యోన్యబద్ధవైరాణాం= ఒండొరులపైఁ గట్టఁబడినవిరోధముగలవారలును; జిగీషూణాం = జయింపఁగోరినవారలునగు; పార్థివానాం= రాజులకు; ఉద్యోగసమయః = ప్రయత్నసమయము; ఉపస్థితః=వచ్చినది.

సౌమ్యుఁడవు రాజపుత్త్రుఁడవగులక్ష్మణుఁడా! ఒండొరులపై వైరంబువహించి యొకరినొకరు జయింపఁదలంచియుండు రాజులు,యుద్ధప్రయత్నము సేయు సమయమువచ్చినది.

అని, తాత్పర్యము.

ఇయం సా ప్రథమా యాత్రా పార్థివానాం నృపాత్మజ
న చ పశ్యామి సుగ్రీవ ముద్యోగంవా తథావిధమ్. ౬౩

టీక॥ నృపాత్మజ = రాచకొమరుఁడా! ఇయం=ఇది; సా=అట్టి; పార్థివానాం=రాజులయొక్క; ప్రథమా= మొదటిదైన; యాత్రా = పయనము, యాత్రాసమయమనుట. సుగ్రీవంచ= సుగ్రీవునినిగాని; తథావిధం = అట్టివిధమయిన; ఉద్యోగంవా = ప్రయత్నమునుగాని; నపశ్యామి = చూడకున్నాను.

రాచకొమరుఁడా! రాజులు యుద్ధమునకై మొదటిప్రయాణము సేయుసమయమిది; సుగ్రీవుఁడును అగపడలేదు; అట్టిప్రయత్నముగాని చేసినట్లు కానరాదు. అని, తాత్పర్యము.

చత్వారో వార్షికా మాసా గతా వర్ష శతోపమాః
మమ శోకాభిభూతస్య సౌమ్య సీతా మపశ్యతః. ౬౪

టీక॥ సౌమ్య = తిన్ననివాఁడా! సీతాం = సీతను; అపశ్యతః = చూడకున్నవాఁడను; శోకాభిభూతస్య=దుఃఖముచేలోఁగొనఁబడినవాఁడనగు; మ

మః=నాకు; వర్షశతోపమాః = సంవత్సరముల నూఱిటితోఁబోల్కిఁగల; వార్షికాః = వర్షముగురియునట్టి; మాసాః=నెలలు; చత్వారః= నాలుగును; గతాః = కడచినవి.

సౌమ్యుఁడా! సీతంజూడక పరితపించుచుఁ బరమదుఃఖితుండనగు నాకు, నూఱేండ్లు గడచినట్లు, వార్షికమాసములు నాలుగును, ఎట్లోకడచినవి.

అని, తాత్పర్యము.

చక్రవాకీవ భర్తారం పృష్ఠతో నుగతా వనమ్
విషమం దండకారణ్య ముద్యానమివ చాగతా. ౬౫

టీక ॥ సా (అధ్యాహృతము)= ఆ సీత; చక్రవాకీవ = ఆఁడుచక్రవాకపక్షివలె; భర్తారం= పెనిమిటిని; పృష్ఠతః = వెనుకనుండి; వనం = అడవిని గూర్చి; అనుగతా = వెంబడించినది. విషమం= కఠినమయిన; దండకారణ్యం= దండకారణ్యమును; ఉద్యానమివ= ఉపవనమునువలె; ఆగతాచ = వచ్చినదియు.

ఆసీత, ఆఁడుచక్రవాకము మగచక్రవాకమును విడువక వెంబడించునట్లు, పెనిమిటివెంట నడచివచ్చినది; అందును, ఉద్యానవనంబునకుఁ బోవువిధంబున, ఎంతమాత్రము దుఃఖములేక సంతోషముతో బహుకష్టమయిన యీదండకారణ్యమునకువచ్చినది.

అని, తాత్పర్యము.

ప్రియావిహీనే దుఃఖార్తే హృతరాజ్యే వివాసితే
కృపాం న కురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ. ౬౬

టీక ॥ లక్ష్మణ= లక్ష్మణుఁడా! రాజా=రాజయిన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; ప్రియావిహీనే=ప్రియురాలిచే విడువఁబడినవాఁడును; దుఃఖార్తే= దుఃఖముచేఁబీడింపఁబడినవాఁడును; హృతరాజ్యే = అపహరింపఁబడినరాజ్యము గలవాఁడును; వివాసితే = స్వదేశమునుండి తఱుమఁగొట్టఁబడినవాఁడునగు; మయి=నాయందు; కృపాం=దయను; నకురుతే=చేయకున్నాఁడు.

లక్ష్మణుఁడా! రాజ్యభ్రష్టుండనై యింటనుండి తఱుమఁగొట్టఁబడి, ప్రియు

రాలంబాసి పరమదుఃఖితుండనై యు న్న నాయందు, రాజయినసుగ్రీవునకు దయరాకున్నది. అని, తాత్పర్యము.

అనాథో హృతరాజ్యో యం రావణేనచ ధర్షితః
దీనో దూరగృహః కామీ మాంచైవ శరణంగతః. ౬౭
ఇత్యేతైః కారణై స్సౌమ్య సుగ్రీవస్య దురాత్మనః
అహం వానరరాజస్య పరిభూతః పరంతప. ౬౮

టీక ॥ సౌమ్య=తిన్ననివాఁడా! పరంతప=శత్రువులఁ దపింపఁజేయువాఁడా! "అయం = ఈరాముఁడు; అనాథః= నాథుఁడులేనివాఁడు. హృతరాజ్యః=అపహరింపఁబడిన రాజ్యముగలవాఁడు. రావణేన=రావణునిచేత; ధర్షితశ్చ= అవమానింపఁబడినవాఁడును. దీనః = దుఃఖితుఁడు. దూరగృహః= దూరమునందు ఇల్లుగలవాఁడు. కామీ=కాముకుఁడు. మామేవ= నన్నే; శరణం=రక్షకునిగా; గతశ్చ= పొందినవాఁడును." ఇతిఏతైః=అనునట్టియీ; కారణైః= హేతువులచేత; అహం= నేను; దురాత్మనః= చెడ్డబుద్ధిగలవాఁడును; వానరరాజస్య = వానరులకు ఱేఁడునగు; సుగ్రీవస్య= సుగ్రీవునకు, సుగ్రీవునిచేతననుట; పరిభూతః=అవమానింపఁబడుచున్నాను.

సౌమ్యుఁడవు శత్రువులఁ దపింపఁజేయువాఁడవగు లక్ష్మణుఁడా! ఈరాముఁడు, దిక్కులేనివాఁడు, రాజ్యభ్రష్టుఁడు, దూరంబుననుండి యిల్లువిడిచివచ్చినవాఁడు; కాముకుఁడు; రావణుండు భార్యనపహరింపఁగా దీనుండై నన్ను శరణుచొచ్చియున్నాఁడు" అను నభిప్రాయంబున నలక్ష్యబుద్ధిచేత దురాత్ముండగు వానరరాజు సుగ్రీవుండు, నన్ను ఆదరింపక యవమానించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

స కాలం పరిసంఖ్యాయ సీతాయాః పరిమార్గణే
కృతార్థ స్సమయం కృత్వా దుర్మతి ర్నావబుధ్యతే. ౬౯

టీక ॥ కృతార్థః= నెఱవేర్పఁబడిన ప్రయోజనముగలవాఁడును; దుర్మతిః=

దుష్టమయినబుద్ధిగలవాఁడునగు; సః= ఆసుగ్రీవుఁడు; సీతాయాః= సీతయొక్క; పరిమార్గణే = వెదకుటయందు; కాలం = శరత్కాలమును; పరిసంఖ్యాయ= సంకేతించి; సమయం = ప్రతిజ్ఞను; కృత్వా= చేసి; నావబుధ్యతే= తెలియకున్నాఁడు.

సుగ్రీవుండు, శరత్కాలము రాఁగానే సీతను వెదకనారంభింపవలెనని సంకేతించికొని యట్లు ప్రతిజ్ఞగావించి, దురాత్ముండుగావున, నాకార్యమ్మెయ్యది నాకనేమియని, యుపేక్షించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

త్వం ప్రవిశ్యచ కిష్కింధాం బ్రూహి వానరపుంగవమ్
మూర్ఖం గ్రామ్యసుఖే సక్తం సుగ్రీవం వచనాన్మమ. ౭౦

టీక ॥ త్వం= నీవు; కిష్కింధాం= కిష్కింధను; ప్రవిశ్యచ = చొచ్చియు; మూర్ఖం= బుద్ధిహీనుండును; గ్రామ్యసుఖే = నీచమయినస్త్రీసుఖమునందు; సక్తం= తగిలినవాఁడును; వానరపుంగవం = వానరశ్రేష్ఠుండునగు; సుగ్రీవం= సుగ్రీవునిగూర్చి; మమ = నాయొక్క; వచనాత్= మాటవలన; బ్రూహి= చెప్పుము.

నీవు, కిష్కింధకుఁబోయి, మూర్ఖుండును గ్రామ్యంబగు మన్మథసుఖంబునందగిలియున్నవాఁడునగు వానరరాజును సుగ్రీవుంజూచి, నేనుజెప్పినట్లుగా, నిట్లనిచెప్పుము. అని, తాత్పర్యము.

అర్థినా ముపపన్నానాం పూర్వం చాప్యుపకారిణామ్
ఆశాం సంశ్రుత్య యో హంతి స లోకే పురుషాధమః. ౭౧

టీక ॥ యః= ఎవఁడు; అర్థినాం = యాచకులును; ఉపపన్నానాం= యోగ్యులును; పూర్వం= ముందు; ఉపకారిణాంచాపి= ఉపకారముచేసినవారలునగు వారలయొక్క; ఆశాం= కోరికను; సంశ్రుత్య= ప్రతిజ్ఞచేసి; హంతి= కొట్టుచున్నాఁడో; సః= అతఁడు; లోకే= ప్రపంచమునందు; పురుషాధమః= పురుషులలోనీచుఁడు.

ఎవ్వండు, తనకుమున్ను ఉపకారముచేసినవారలును యోగ్యులునగు కార్యార్థులకు, "కార్యంబుగావించెద" నని ప్రతిజ్ఞచేసి, యాశగలిగించి, వెనుకఁదప్పుచున్నాఁడో, అతండు, లోకం

ఋసనంతయుఁ బురుషాధముఁడు. అని, తాత్పర్యము.

శుభంవా యదివాపాపం యోహి వాక్య ముదీరితమ్
సత్యేన ప్రతిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః. ౭౨

టీక ॥ యః=ఎవఁడు ("హి"అనునది పాదపూరణార్థము); ఉదీరితం=చెప్పఁబడిన; వాక్యం = మాటను; శుభంవా = పుణ్యమునుగాని; పాపంయదివా = పాపమునుగాని; సత్యేన = సత్యముచేత; ప్రతిగృహ్ణాతి = అంగీకరించుచున్నాఁడో; సః=అట్టి; వీరః=శూరుఁడు; పురుషోత్తమః = పురుషశ్రేష్ఠుఁడు.

ఎవ్వఁడు,మంచిగాని చెడుగాని తాను చెప్పినమాటను దప్పక సత్యముగాఁ గావించునో, అట్టి వీరుండు పురుషోత్తముఁడనఁబడును. అని, తాత్పర్యము.

కృతార్థా హ్యకృతార్థానాం మిత్రాణాం నభవంతి యే
తాన్మృతానపి క్రవ్యాదాః కృతఘ్నా న్నోపభుంజతే. ౭౩

టీక ॥ కృతార్థాః = నెఱవేర్పఁబడిన ప్రయోజనముగల; యే=ఎవరు;అకృతార్థానాం = కృతార్థులుకాని; మిత్రాణాం = స్నేహితులకు; ఉపకారాయ (అధ్యాహృతము) = ఉపకారముకొఱకు; నభవంతి = కారో;కృతఘ్నాన్ = చేయఁబడిన యుపకారమును మఱచినట్టి; తాన్ = వారలను; మృతానపి = చచ్చిన వారలనుగూడ; క్రవ్యాదాః = మాంసముదినునట్టి జంతువులు; నోపభుంజతే=భక్షింపవు.

ఎవరు, తాముస్నేహితులవలన నుపకారమునొంది తమకార్యమును గావించుకొని, యాస్నేహితులు కృతార్థులుగాక దుఃఖితులయి యుండునపుడు, వారలకుఁబ్రత్యుపకారముగావింపరో, అట్టికృతఘ్నులగు వారలుబ్రతికియుండునపుడు వారల నెవ్వరును సత్పురుషులు చూడనైనను జూడరుసరేగదా,వారుమృతిఁబొందినవెనుకఁగూడ, వారికళేబరములను మాంసముదిను జంతువులును, భక్షింపవు. అని, సుగ్రీవునితోఁ జెప్పుము. అని,తాత్పర్యము.

నూనం కాంచనపృష్ఠస్య వికృష్టస్య మయా రణే ।

ద్రష్టు మిచ్ఛతి చాపస్య రూపం విద్యుద్గణోపమమ్. ౭౪

టీక॥ సః (అధ్యాహృతము)=ఆసుగ్రీవుఁడు; మయా=నాచేత; రణే=యుద్ధమునందు; వికృష్టస్య=ఆకర్షింపఁబడిన; కాంచనపృష్ఠస్య= బంగారువికారమయిన వెనుకటి భాగముగల; చాపస్య = ధనుస్సుయొక్క; విద్యుద్గణోపమం = మెఱపులసమూహముతోఁబోల్కిగల; రూపం = ఆకారమును; ద్రష్టుం=చూచుటకు; ఇచ్ఛతి = కోరుచున్నాఁడు; నూనం=నిశ్చయము.

ఆసుగ్రీవుఁడు, యుద్ధంబున నేనుబంగారముతో నలంకరింపఁబడిన వెనుకటి భాగముగల మహాధనుస్సునాకర్షింప, మెఱపులసమూహమువలె మెఱయుచున్నదానియొక్క భయంకరమయినయాకారమునుజూడఁగోరుచున్నాఁడు కాఁబోలు; ఇది నిశ్చయము.

అని, తాత్పర్యము.

ఘోరం జ్యాతలనిర్ఘోషం క్రుద్ధస్య మమ సంయుగే
నిర్ఘోషమివ వజ్రస్య పున స్సంశ్రోతు మిచ్ఛతి. ౭౫

టీక॥ సః(అధ్యాహృతము) = ఆసుగ్రీవుఁడు; సంయుగే= యుద్ధమునందు; క్రుద్ధస్య = కోపించిన; మమ=నాయొక్క; ఘోరం=భయంకరమయిన; జ్యాతలనిర్ఘోషం= అల్లెత్రాటియొక్కయు అఱ్ఱెముయొక్కయుధ్వనిని; వజ్రస్య = వజ్రాయుధముయొక్క; నిర్ఘోషమివ=ధ్వనినివలె; పునః = మఱల; సంశ్రోతుం=వినుటకు; ఇచ్ఛతి = కోరుచున్నాఁడు.

ఆసుగ్రీవుఁడు, యుద్ధంబున నేనుగోపింపఁగా, వజ్రాయుధధ్వనివలెభయంకరమయిననాజ్యాతలధ్వనిని, మఱియొకమాఱు వినఁగోరుచున్నాఁడుకాఁబోలు. అని, తాత్పర్యము.

కామ మేవం గతే ప్యస్య పరిజ్ఞాతే పరాక్రమే
త్వత్సహాయస్య మే వీర న చింతా స్యా న్నృపాత్మజ. ౭౬

టీక॥ వీర=శూరుఁడవగు; నృపాత్మజ=రాచకొమరుఁడా! ఏవం=ఇట్లు; గతేపి=కడచినను; త్వత్సహాయస్య=నీవుతోడుగాఁగల; మే = నాయొక్క;

పరాక్రమే = వీర్యము; కామం=మి
ఱిలి; పరిజ్ఞాతే = తెలియఁబడినదైన
ను; అస్య=ఈసుగ్రీవునకు; చింతా=వి
చారము; నస్యాత్=కలుగదు!

వీరుఁడవగు రాఘవకొమరుఁడా! సా
లవృక్షముల భేదించుటవలనను వాలివధ
మువలనను నాపరాక్రమము చక్కఁగాఁ
దెలిసియుండియు, నీవు సహాయుఁడవు
గానుండుట నెఱింగియు, ఈసుగ్రీవునకు
ఇట్లు కాలము మించిననను మనస్సులోఁ
జింత గలుగకున్నదే! అని, తాత్పర్యము.

యదర్థ మయ మారంభః కృతః పరపురంజయ
సమయం నాభిజానాతి కృతార్థః ప్లవగేశ్వరః. ౭౭

టీక॥ పరపురంజయ=శత్రుపట్టణం
బుల జయించునట్టి లక్ష్మణుఁడా! యద
ర్థం=దేనికొఱకు; అయం=ఈ; ఆరం
భః=ప్రయత్నము; కృతః=చేయఁబడి
నదో; తదీయం (అధ్యాహృతము)= ఆ
సంబంధమయిన; సమయం = సంకేత
మును; కృతార్థః=ఈడేఱిన ప్రయోజ
నముగల; ప్లవగేశ్వరః=వానరరాజయి
న సుగ్రీవుఁడు; నాభిజానాతి=గుఱుతె
ఱుఁగకున్నాఁడు.

శత్రుపట్టణంబుల జయించునట్టి ల
క్ష్మణుఁడా! సఖ్యంబును వాలివధంబు
ను దేనికొఱకుఁ జేయఁబడినవో, ఇప్పు
డు సుగ్రీవుఁడు తనకార్యమయిన పిమ్మ
ట, దానిమఱచియున్నాఁడు.

అని, తాత్పర్యము.

వర్షాసమయకాలంతు ప్రతిజ్ఞాయ హరీశ్వరః
వ్యతీతాం శ్చతురో మాసాన్ విహర న్నావబుధ్యతే. ౭౮

టీక॥ హరీశ్వరః=వానరరాజయిన
సుగ్రీవుఁడు; వర్షాసమయకాలంతు =
వర్షర్తువను సంకేతకాలమునే; ప్రతిజ్ఞా
య=ప్రతినచేసి; విహరన్ = క్రీడించు
చు; వ్యతీతాన్=కడచిన; చతురః=నా
లుగయిన; మాసాన్=నెలలను; నావ
బుధ్యతే=ఎఱుంగకున్నాఁడు.

వానరరాజుసుగ్రీవుండు, వర్షాకా
లము కడచినంతనె వచ్చెదనని ప్రతిజ్ఞ
గావించి, స్త్రీలోలుండై విహరించుచు,
నాలుగు మాసంబులు నతిక్రమించినను
దెలియకున్నాఁడు. అని, తాత్పర్యము.

సామాత్యపరిష త్క్రీడ౯ పానమే వోపసేవతే
శోకదీనేషు నాస్మాసు సుగ్రీవః కురుతే దయామ్. ౯౯

టీక ॥ సుగ్రీవః = సుగ్రీవుఁడు; సామాత్యపరిషత్ = మంత్రులతోను బంధు సమూహముతోను గూడినవాఁడై; క్రీడ౯ = విహరించుచు; పానమేవ= త్రాఁగుటనే; ఉపసేవతే= సేవించుచున్నాఁడు. శోకదీనేషు = దుఃఖముచేత గర్వముడిగిన; అస్మాసు=మాయందు; దయాం = దయను; నకురుతే = చేయఁడు.

సుగ్రీవుఁడు, మంత్రులచేతను బంధువులచేతను బరివృతుండై ఎల్లప్పుడును మద్యపానలోలుఁడై యున్నాఁడుగాని, దుఃఖితులమయి దీనులమయియున్న మనయందు దయయుంచకున్నాఁడు. అని, తాత్పర్యము.

ఉచ్యతాం గచ్ఛ సుగ్రీవ స్త్వయా వత్స మహాబల
మమ రోషస్య యద్రూపం బ్రూయా శ్చైన మిదం వచః. ౮౦

టీక॥ మహాబల=అధికమయిన బలముగల; వత్స=బిడ్డఁడా! గచ్ఛ = పొమ్ము. త్వయా=నీచేత; సుగ్రీవః=సుగ్రీవుఁడు; మమ=నాయొక్క; రోషస్య= కోపముయొక్క; రూపం=ఆకారము; యత్ = ఏది; తత్ (అధ్యాహృతము)= దానిని; ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక. ఏనం=ఈసుగ్రీవునిఁగూర్చి; ఇదం=ఈ; వచశ్చ=మాటనుగూడ; బ్రూహి=చెప్పుము.

మహాబలుఁడా! నీవుపోయి, సుగ్రీవునకు, నాకోపముయొక్కవిధమును దెలియఁజెప్పి, యీమాటనుగూడ, నతనికిఁజెప్పుము. అని, తాత్పర్యము.

నచ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథ మన్వగాః. ౮౧

టీక ॥ సుగ్రీవ=సుగ్రీవుఁడా! వాలీ= వాలి; హతః = వధింపఁబడినవాఁడై; యేన=ఏమార్గముచేత; గతః=పోయినాఁడో; సః (అధ్యాహృతము)= ఆ; పంథాః=మార్గము; సంకుచితః=సంకోచమునొందినది; నచ=కానేకాదు.

సమయే=ప్రతిజ్ఞయందు; తిష్ఠ=నిలువుము. వాలిపథం = వాలియొక్క మార్గమును; మా అన్వగాః=వెంబడింపకుము.

సుగ్రీవుఁడా! వాలి హతుఁడై యే మార్గమునంబోయినాఁడో, అది యిప్పుడు నశించిపోలేదు; అదినీకునుఉన్నది; కాఁబట్టి, ప్రతిజ్ఞను నెఱవేర్పుము; వాలియట్లు వధమునొందకుము.

అని, తాత్పర్యము.

ఏకఏవ రణే వాలీ శరేణ నిహతో మయా
త్వాంతు సత్యా దతిక్రాంతం హనిష్యామి సబాంధవమ్. ౮౨

టీక॥మయా=నాచేత;రణే=యుద్ధమునందు;శరేణ=బాణముచేత;వాలీ=వాలి; ఏకఏవ=ఒక్కఁడె;నిహతః=వధింపఁబడినాఁడు.సత్యాత్=సత్యమునుండి;అతిక్రాంతం=అతిక్రమించిన; త్వాంతు=నిన్నుమాత్రము; సబాంధవం=బంధువులతోఁ గూడిన వానిఁగా; హనిష్యామి=వధించెదను.

మున్ను, యుద్ధంబున బాణముచే వాలి నొక్కనిమాత్రము వధించినాను; చేసిన ప్రతిజ్ఞను దప్పిన నిన్నో, బంధువులతోఁగూడ వధించివుచ్చెదను. అని, సుగ్రీవునితోఁ జెప్పుము.

అని, తాత్పర్యము.

త దేవం విహితే కార్యే య ద్ధితం పురుషర్షభ
త త్త ద్బ్రూహి నరశ్రేష్ఠ త్వర కాలవ్యతిక్రమః. ౮౩

టీక ॥ పురుషర్షభ = పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! తత్= అందువలన; ఏవం=ఇట్లు; కార్యే= పని; విహితే=ఏర్పడియుండఁగా; యత్= ఏది; హితం = మేలుగలిగించునదో; తత్తత్=ఆయామాటను; బ్రూహి = చెప్పుము. నరశ్రేష్ఠ= మనుష్యులలోనుత్తముఁడా! కాలవ్యతిక్రమః=కాలముయొక్క అతిక్రమించుట;భవతి (అధ్యాహృతము)= అగుచున్నది. త్వర=వేగిరపడుము.

పురుషోత్తముఁడవగు లక్ష్మణుఁడా! కార్యముయొక్క స్థితి యిట్లున్నది కావున, ఇప్పుడు ఏయేమాట చెప్పఁదగునో, ఆయామాటలం జెప్పుము; కాలమతిక్రమించుచున్నది, శీఘ్రముగాఁబొమ్ము. అని, తాత్పర్యము.

స ౩౦

కురుష్వ సత్యం మయి వానరేశ్వర
ప్రతిశ్రుతం ధర్మ మవేక్ష్య శాశ్వతమ్
మా వాలినం ప్రేత్య గతో యమక్షయం
త్వ మద్య పశ్యే ర్మమ చోదితై శ్శరైః. ౮౪

టీక॥ వానరేశ్వర=వానరరాజవగు సుగ్రీవుఁడా! మయి=నాయందు; ప్రతిశ్రుతం= అంగీకరింపఁబడినదానిని; శాశ్వతం=నిత్యమయిన; ధర్మం = ధర్మమును; అవేక్ష్య=చూచి; సత్యం= యథార్థమునుగా; కురుష్వ= చేయుము. అద్య=ఇప్పుడు; త్వం = నీవు; మమ= నాయొక్క,నాచేతననుట; చోదితైః= ప్రయోగింపఁబడిన; శరైః=బాణములచేత; ప్రేత్య=చచ్చి;యమక్షయం=యమునిగృహమును; గతః=పొందినవాఁడవై; వాలినం = వాలిని; మాపశ్యేః= చూడకుము.

వానరరాజవగు సుగ్రీవుఁడా! నీవు నాకుఁ గావించెదనని ప్రతిజ్ఞ చేసినకార్యమును, శాశ్వతంబగు ధర్మము నవలంబించి, సత్యముగా నెఱవేర్పుము; అట్లు చేయవేని కుపితుండనగు నా బాణంబులచే హతుండవై యమలోకంబునొంది యచట వాలిం జూడఁగలవు. అని, సుగ్రీవునితోఁ జెప్పుము. అని, రాముండు లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స పూర్వజం తీవ్రవివృద్ధకోపం
లాలప్యమానం ప్రసమీక్ష్య దీనమ్
చకార తీవ్రాం మతి ముగ్రతేజా
హరీశ్వరే మానవవంశనాథః. ౮౫

టీక॥ ఉగ్రతేజాః = భయంకరమయిన పరాక్రమముగలవాఁడును; మానవవంశనాథః= మనుష్యసమూహమునకుఁ బ్రభువునగు; సః = ఆలక్ష్మణుండు; తీవ్రవివృద్ధకోపం = అధికముగా వృద్ధిఁబొందిన కోపము గలవాఁడును; దీనం= దుఃఖితుండునగు; పూర్వజం= అన్నను; ప్రసమీక్ష్య = చూచి; హరీశ్వరే = వానరరాజయిన సుగ్రీవునందు; తీవ్రాం = తీక్ష్ణమయిన; మతిం= బుద్ధిని; చకార = చేసెను.

అట్లు అన్నయగు రాముండు, పర

...కుపితుండును బరమదుఃఖితుండున్నై వి...లపించుచుండుటనుజూచి, భయంకరపరాక్రముఁడగు మనుష్యనాథుఁడైన లక్ష్మణుండు, వానరరాజయిన సుగ్రీవుని విషయమయి, మహాక్రోధంబు వహించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ త్రింశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకత్రింశసర్గప్రారంభః.

స కామినం దీన మదీనసత్త్వం
శోకాభిపన్నం సముదీర్ణకోపమ్
నరేంద్రసూను ర్నరదేవపుత్త్రం
రామానుజః పూర్వజ మిత్యువాచ. ౧

టీక ॥ నరేంద్రసూనుః= మనుష్యులకుఁ బ్రభువయిన దశరథమహారాజుయొక్క కొడుకును; రామానుజః=రామునితమ్ముండునగు; సః= ఆలక్ష్మణుఁడు; కామినం=అధికమయినకామము గలవాఁడును కావున; దీనం=గర్వము డిగినవాఁడును; అదీనసత్త్వం=తక్కువకాని బలముగలవాఁడును; శోకాభిపన్నం= దుఃఖమును బొందినవాఁడును; సముదీర్ణకోపం= మిక్కిలియునధికమయిన కోపముగలవాఁడును; నరదేవపుత్త్రం=మనుష్యులకుఁబ్రభువైన దశరథమహారాజు యొక్క కుమారుఁడునగు; పూర్వజం = అన్నయగు రాముని గూర్చి; ఇతి=అని; ఉవాచ= చెప్పెను.

దశరథమహారాజపుత్త్రుండును రామునితమ్ముఁడునగు లక్ష్మణుండు, కామబాధితుండగుటవలనదీనుండైన దుఃఖితుం

డై సుగ్రీవుఁడు ప్రతినదప్పుటకుఁ బరమ కుపితుండై యున్న మహాబలుండును మహారాజకుమారుండునగు అన్నను రాముంజూచి, యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— ఈశ్లోకము నందు, ముప్పదియవ యక్షరమగు "నరదేవపుత్త్రం" అనుస్థలంబు నందలి "దే" అనునక్షరముచేఁ గాయత్రిపదునొకండవయక్షరము గ్రహింపఁబడినది. పదివేలశ్లోకములయినవి. పదునొకండవశ్లోకసహస్రమున కిది మొదటియక్షరము.

న వానర స్థాస్యతి సాధువృత్తే
న మంస్యతే కర్మఫలానుషంగాన్
న భోక్ష్యతే వానరరాజ్యలక్ష్మీం
తథాహి నాభిక్రమతే స్య బుద్ధిః. ౨

టీక ॥ వానరః = సుగ్రీవుఁడు; సాధువృత్తే = సదాచారమునందు; న స్థాస్యతి = నిలువఁడు. కర్మఫలానుషంగాన్ = సఖ్యరూపమయిన కర్మముయొక్క ఫలములయొక్క యనుబంధములను; నమంస్యతే=తలంపఁడు. వానరరాజ్యలక్ష్మీం = వానరరాజ్యముయొక్క సంపదను; నభోక్ష్యతే= అనుభవింపఁడు. తథాహి = అదియుక్తమె. అస్య = ఈతనియొక్క; బుద్ధిః=బుద్ధి; నాభిక్రమతే = అభిముఖముకాలేదు.

సుగ్రీవుఁడు, తనకుపకారముచేసిన వారికిఁ బ్రత్యుపకారము గావించెదనని చేసిన ప్రతిజ్ఞనుపద్మక నెఱవేర్పవలెననుసదాచారమున నిలువఁడు; రామునితో సఖ్యము సేయుట వలననేకదా, దనకు వానరరాజ్యంబును భార్యాసమాగమంబును సమకూడెనని తలంపతనికిఁ గలుగదు; మనకార్యము విషయమయి యాతఁడనుకూలించిరాఁడు; కావున, వానరరాజ్యలక్ష్మి అతనికిఁదక్కఁదు.

అని, తాత్పర్యము.

మతిక్షయా ద్గ్రామ్యసుఖేషు సక్త
స్తవ ప్రసాదాత్ప్రతికారబుద్ధిః
హతో గ్రజం పశ్యతు వీర తస్య
న రాజ్య మేవంవిగుణస్య దేయమ్. ౩

టీక ॥ వీర=పరాక్రమశాలివగు రాముఁడా! మతిక్షయాత్= బుద్ధియొక్క వినాశమువలన; గ్రామ్యసుఖేషు=గ్రామ్యములయినసౌఖ్యములందు; సక్తః=తగిలినవాఁడును; తవ=నీయొక్క; ప్రసాదాప్రతికారబుద్ధిః = అనుగ్రహమునకుఁ బ్రత్యుపకారబుద్ధిలేనివాఁడునగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; హతః=వధింపఁబడినవాఁడై; అగ్రజం=అన్నను; పశ్యతు=చూచుఁగాక. ఏవంవిగుణస్య = ఇట్టిదుర్గుణములుగల; తస్య=ఆసుగ్రీవునకు; రాజ్యం=దొరతనము; న దేయం=ఇవ్వఁదగినది కాదు.

పరాక్రమశాలివగు రాముఁడా! దుర్బుద్ధిచేత, సుగ్రీవుండు, గ్రామ్యసుఖంబులందగిలి, నీవుచేసినయుపకారంబునకుఁ బ్రత్యుపకారంబుసేయఁ దలంపకున్నాఁడు కావున, ఇపుడు నాచేతహతుండై యన్నను వాలినిం జూచుఁగాక; ఇట్టిదుర్గుణునకు రాజ్యంబివ్వరాదు. అని, తాత్పర్యము.

న ధారయే కోప ముదీర్ణ వేగం
నిహన్మి సుగ్రీవ మసత్య మద్య
హరిప్రవీరై స్సహ వాలిపుత్రో
నరేంద్రపుత్ర్యా విచయం కరోతు. ४

టీక॥ ఉదీర్ణ వేగం=అధికమయినవేగముగల; కోపం=కోపమును; నధారయే=అణఁచను. అద్య = ఇపుడు; అసత్యం=సత్యములేని; సుగ్రీవం=సుగ్రీవుని; నిహన్మి = వధించుచున్నాను. వాలిపుత్రః=వాలికుమారుండగునంగదుండు; హరిప్రవీరైస్సహ= వానరవీరులతోఁగూడ; నరేంద్రపుత్ర్యాః= రాజపుత్రియగు సీతయొక్క; విచయం=వెదకుటను; కరోతు=చేయుఁగాక.

ఇప్పుడుగలిగినమహాక్రోధమును అణఁచఁజాలను; కావున, సత్యంబుదప్పిన యీసుగ్రీవు నిపుడు వధించెదను; వాలికుమారుండగు నంగదుండు, వానరవీరులతోఁగూడ సీతాదేవిని వెదకుదునుగాక. అని, లక్ష్మణుండు రామునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

త మాత్తబాణాసన ముత్పతంతం

నివేదితార్థం రణచండకోపమ్
ఉవాచ రామః పరవీరహంతా
స్వవేక్షితం సానునయంచ వాక్యమ్. ౫

టీక॥ పరవీరహంతా= శత్రువీరుల వధించువాఁడగు; రామః=రాముఁడు; ఆత్తబాణాసనం=పొందఁబడినధనుస్సు గలవాఁడును; ఉత్పతంతం = పోవుచున్నవాఁడును; నివేదితార్థం= తెలియఁ జేయఁబడిన యభిప్రాయముగలవాఁడును; రణచండకోపం= యుద్ధమునందు భయంకరమయిన కోపముగలవాఁడు నగు; తం=ఆలక్ష్మణునిఁగూర్చి; స్వవేక్షితం=చక్కఁగాఁ జూడఁబడినదియు; సానునయంచ = ఊఱడించుటతోఁగూడిన దియునగు; వాక్యం = మాటను; ఉవాచ=పలికెను.

శత్రువీరులవధించువాఁడేకాని యాశ్రితులనువధింపనట్టి రాముండు, అట్లు యుద్ధంబున భయంకరంబగుకోపముగలవాఁడును, ఇవ్విధంబునఁ దానుజేయు బోవు సంగతిం జెప్పి ధనుర్ధరుండైపోవుచున్నవాఁడునగు లక్ష్మణుఁజూచి, మంచియాలోచనముతోఁగూడినదియు సామసమన్వితంబునగు నీమాటంజెప్పెను.

అని, తాత్పర్యము.

నహి వై త్వద్విధో లోకే పాప మేవం సమాచరేత్
పాప మార్యేణ యో హంతి స వీరః పురుషోత్తమః. ౬

టీక॥ లోకే= ప్రపంచమునందు; త్వద్విధః=నీయట్టివాఁడు; ఏవం = ఇట్టి; పాపం= పాపమును; నసమాచరేత్ హి=చేయఁడుగదా!("వై"అనునది పాదపూరణార్థము); యః=ఎవఁడు; పాపం=పాపమునుగలిగించుప్రయత్నమును; ఆర్యేణ= వివేకముచేత; హంతి=కొట్టుచున్నాఁడో; సః= అట్టి; వీరః=శూరుఁడు; పురుషోత్తమః=పురుషశ్రేష్ఠుఁడు.

లోకంబున నీయట్టివాఁడెవ్వఁడేని, యిట్టిమిత్రవధరూపమయిన, పాపమును జేయునా? ఎవ్వఁడు, తనకుఁగ్రోధవశంబునఁ బాపముసేయుతలంపు గల్గినపుడు, దాని వివేకంబుచేఁ బరిహరించుచున్నాఁడో, అట్టి వీరుఁడు, పురుషులలోనెల్ల నుత్తముఁడనంబడును.

అని, తాత్పర్యము.

నేదమద్య త్వయా గ్రాహ్యం సాధువృత్తేన లక్ష్మణ
తాం ప్రీతి మనువర్తస్వ పూర్వవృత్తంచ సంగతమ్. ౭

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! అద్య=ఇప్పుడు; సాధువృత్తేన = సదాచారముగల; త్వయా=నీచేత; ఇద = ఇట్టిపాపము; న గ్రాహ్యం = గ్రహింపఁదగినదికాదు. తాం=ఆ; ప్రీతిం=ప్రేమను; పూర్వవృత్తం = మున్నుజరిగిన; సంగతంచ = సఖ్యమును; అనువర్తస్వ = అనుసరింపుము.

లక్ష్మణుఁడా! ఇప్పుడు, సదాచారసంపన్నుఁడవగు నీవు, ఇట్టిపాపమును జేయరాదు; పూర్వమునను సుగ్రీవునితోఁజేసికొన్న సఖ్యమునను సరించి, మనుపు నీవతని యందుంచియున్న ప్రీతినే యుంచుము. అని, తాత్పర్యము.

సామోపహితయా వాచా రూక్షాణి పరివర్జయన్
వక్తు మర్హసి సుగ్రీవం వ్యతీతం కాలపర్యయే. ౮

టీక॥ త్వం(అధ్యాహార్యము) = నీవు; కాలపర్యయే=కాలముయొక్క క్రమమువిషయమునందు; వ్యతీతం= అతిక్రమించిన; సుగ్రీవం=సుగ్రీవునిగూర్చి; రూక్షాణి = పరుషవచనములను; పరివర్జయన్ = పరిహరించుచు; సామోపహితయా = చిన్నసనముతోఁగూడిన; వాచా=మాటచేత; వక్తుం = చెప్పుట కు; అర్హసి = తగుదువు.

సుగ్రీవుఁడు, క్రమముగాఁ గాలమునకురాలేదుగాని మఱేమియు నంతగా నపరాధముచేసినవాఁడుకాఁడు. కావున, నతనితోఁ, బరుషవాక్యములాడక, మంచితనముగా మాటలాడుము. అని, రాముఁడు, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

స అగ్రజే నానుశిష్టార్థో యథావ త్పురుషర్షభః
ప్రవివేశ పురీం వీరో లక్ష్మణః పరవీరహా. ౯

టీక॥ వీరః=పరాక్రమశాలియు; పరవీరహా = శత్రువీరుల వధించువాఁడును; పురుషర్షభః= పురుషశ్రేష్ఠుఁడునగు; సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; అగ్రజేన=అన్నచేత; యథావత్= యథాన్యాయముగా; అనుశిష్టార్థః = శి

క్షింపఁబడిన యభిప్రాయము గలవాఁడై; పురీం=కిష్కింధాపట్టణమును; ప్రవివేశ=చొచ్చెను.

వీరుండును శత్రువీరుల వధించువాఁడును బురుషశ్రేష్ఠుఁడునగు లక్ష్మణుండు, అన్న ధర్మముననుసరించి చెప్పిన యభిప్రాయమును విని, కిష్కింధాపురంబునకుఁబోయెను.

అని, తాత్పర్యము.

తత శ్శుభమతిః ప్రాజ్ఞో భ్రాతుః ప్రియహితే రతః
లక్ష్మణః ప్రతిసంరబ్ధో జగామ భవనం కపేః. ౧౦

టీక॥ తతః= అటుపిమ్మట; శుభమతిః=మంగళకరమయిన బుద్ధిగలవాఁడును; ప్రాజ్ఞః = పండితుఁడును; భ్రాతుః=అన్నయొక్క; ప్రియహితే= సంతోషమునందును మేలునందును; రతః= ఆసక్తుఁడునగు; లక్ష్మణః = లక్ష్మణుఁడు; ప్రతిసంరబ్ధః=మిక్కిలికోపముగలవాఁడై; కపేః= సుగ్రీవునియొక్క; భవనం=ఇంటిని; జగామ=పొందెను.

అంత, ధర్మిష్ఠమయిన బుద్ధిగలవాఁడును బండితుఁడును అన్నకు సంతోషంబును మేలునుఁగలిగించుకార్యంబులనే కావించువాఁడునగు లక్ష్మణుండు, కోపవేగంబు నడంచుకొని, సుగ్రీవునింటికిఁ బోయెను. అని, తాత్పర్యము.

శక్రబాణాసనప్రఖ్యం ధనుః కాలాంతకోపమః
ప్రగృహ్య గిరిశృంగాభం మందర స్సానుమానివ. ౧౧

టీక॥ కాలాంతకోపమః= ప్రలయకాలమునందలి యమునితోఁబోలికగల లక్ష్మణుండు; శక్రబాణాసనప్రఖ్యం = ఇంద్రధనుస్సుతో సమానమును; గిరిశృంగం=పర్వతశిఖరముయొక్క కాంతివంటికాంతిగలదియునగు; ధనుః= వింటిని; ప్రగృహ్య=పట్టి; మందరః= మందరమును; సానుమానివ=పర్వతమువలె; స్థితః(అధ్యాహృతము)=ఉండెను.

ప్రలయకాలమునందలి యమునితో సమానుండగు నాలక్ష్మణుండు, ఇంద్రధనుస్సుతో సమానంబగు పర్వతశిఖరంబంతటి గొప్పధనుస్సును ధరించి, మందరపర్వతంబువలె నొప్పెను.

అని, తాత్పర్యము.

యథోక్తకారీ వచన ముత్తరంచైవ సోత్తరమ్
బృహస్పతిసమో బుద్ధ్యా మత్వా రామానుజ స్తథా. ౧౨

టీక ॥ తథా=అట్లు; బుద్ధ్యా=బుద్ధిచేత; బృహస్పతిసమః = బృహస్పతితోసమానుఁడును; యథోక్తకారీ = చెప్పఁబడినమాట నతిక్రమింపక చేయువాఁడునగు; రామానుజః=రామునితమ్ముఁడయినలక్ష్మణుఁడు; వచనం=మాటను; సోత్తరంచైవ= బదులుతోఁగూడిన; ఉత్తరంచైవ=ఉత్తరమునుగూడ; మత్వా=తలఁచి; ప్రయయౌ (అధ్యాహృతము) = పోయెను.

అట్లు, బుద్ధియందు బృహస్పతితో సమానుండును, రాముఁడాజ్ఞాపించిన విధంబుఁ గొంచెమేని యతిక్రమింపక కావించువాఁడునగు రామునితమ్ముండు లక్ష్మణుండు, తాను సుగ్రీవునితోఁ జెప్పవలసినమాటను, సుగ్రీవుఁడందుకు బదులుచెప్పుమాటను, తానందుకుఁ జెప్పవలసిన ప్రత్యుత్తరమును ఆలోచించుకొని పోయెను. అని, తాత్పర్యము.

కామక్రోధసముత్థేన భ్రాతుః కోపాగ్నినా వృతః
ప్రభంజనఇవా ప్రీతః ప్రయయౌ లక్ష్మణ స్తదా. ౧౩

టీక ॥ తదా=అప్పుడు; లక్ష్మణః= లక్ష్మణుఁడు; కామక్రోధసముత్థేన = కామమువలనను గోపమువలనను గలిగిన; భ్రాతుః=అన్నయొక్క; కోపాగ్నినా= కోపమనుఅగ్నిచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; అప్రీతః=కోపము నొందినవాఁడై; ప్రభంజనఇవ = వాయువువలె; ప్రయయౌ=పోయెను.

అప్పుడు, లక్ష్మణుండు, కామక్రోధవశంగతుండగు రాముని కోపంబను నగ్నితోఁగూడినవాఁడై అగ్నిసహితుండగు వాయువువలెఁ, గుపితుండై పరమవేగంబునఁబోయెను. అని, తాత్పర్యము.

సాలతాలాశ్వకర్ణాంశ్చ తరసా పాతయ న్బహూన్
పర్యస్య న్గిరికూటాని ద్రుమా నన్యాంశ్చ వేగతః. ౧౪
శిలాశ్చ శకలీకుర్వ న్పద్భ్యాం గజ ఇవాశుగః
దూర మేకపదం త్యక్త్వా యయౌ కార్యవశా ద్ద్రుతమ్. ౧౫

స ౩౧

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆ లక్ష్మణుఁడు; తరసా=బలముచేత; బహూన్ = పెక్కులయిన; సాలతాలాశ్వకర్ణాంశ్చ = మద్దిచెట్లను తాటిచెట్లను ఇనుమద్దిచెట్లను; పాతయన్ = పడఁద్రోయుచు; వేగతః = వేగమువలన; గిరికూటాని = పర్వతశిఖరములను; అన్యాన్ = ఇతరములయిన; ద్రుమాంశ్చ= చెట్లను; పర్యస్యన్= త్రోయుచు; పద్భ్యాం = పాదములచేత; శిలాశ్చ=రాళ్లనుగూడ; శకలీకుర్వన్= పొడిగాఁజేయుచు; ఆశుగః = శీఘ్రముగానడచునట్టి; గజఇవ = ఏనుఁగువలె; ఏకపదం = ఒకపాదముగను; దూరం = దూరముగా; త్యక్త్వా=విడిచి, దూరదూరముగా అడుగులుంచి యనుట; కార్యవశాత్ = పనియొక్క యధీనతవలన; ద్రుతం= శీఘ్రముగా; యయౌ=పోయెను.

ఆలక్ష్మణుండు, ద్రోవకడ్డము వచ్చిన మద్దిచెట్లను తాటిచెట్లను ఇనుమద్దిచెట్లను పెక్కులను బాహుబలంబునం బడఁద్రోయుచు, నూరువేగంబునఁ బర్వతశిఖరంబులను ఇతరవృక్షంబులును విరిగికూలంబడ, అడుగులుంచు వేగంబున శిలలుచూర్ణంబులుగాఁ జేయుచు, శీఘ్రంబుననడచు గజంబువలె, మూడుదూరంబునకు అడుగులుంచుచును, కార్యవశంబునం జేసి, శీఘ్రంబుగాఁ బోయెను. అని, తాత్పర్యము.

తామపశ్యద్బలాకీర్ణాం హరిరాజమహాపురీమ్
దుర్గామిక్ష్వాకుశార్దూలః కిష్కింధాం గిరిసంకటే. ౨౮

టీక ॥ ఇక్ష్వాకుశార్దూలః= ఇక్ష్వాకువంశములోఁ బుట్టినవారలలో శ్రేష్ఠుండగు లక్ష్మణుఁడు; గిరిసంకటే=పర్వతములయొక్క సందునందు; బలాకీర్ణాం= సైన్యములచేవ్యాపింపఁబడినదియు; దుర్గాం= చొరరానిదియు; హరిరాజమహాపురీం = వానరరాజయినసుగ్రీవుని యొక్కపట్టణమునగు; తాం= ఆ; కిష్కింధాం= కిష్కింధను; అపశ్యత్= చూచెను.

ఇక్ష్వాకు వంశమునం బుట్టినవారలలో నుత్తముఁడగు లక్ష్మణుఁడు, పర్వతంబులనడుమ, వానర సైన్యములచే వ్యాప్తమయి ఎవ్వరికిని ప్రవేశింపనశక్యమయిన వానరరాజయిన సుగ్రీవుని రాజధానియగు కిష్కింధం జూచెను.

అని, తాత్పర్యము.

సం ౩౧

రోషాత్ప్రస్ఫురమాణోష్ఠస్సుగ్రీవంప్రతి లక్ష్మణః
దదర్శ వానరాన్ భీమాన్ కిష్కింధాయా బహిశ్చరాన్. ౧౭

టీక॥ లక్ష్మణః=లక్ష్మణుఁడు; సుగ్రీవంప్రతి=సుగ్రీవునిగూర్చి; రోషాత్=కోపమువలన; ప్రస్ఫురమాణోష్ఠః=అదరుచున్నపెదవిగలవాఁడై; కిష్కింధాయాః=కిష్కింధానగరముయొక్క; బహిశ్చరాన్ = వెలుపలఁదిరుగునట్టి; భీమాన్ = భయంకరులయిన; వానరాన్=వానరులను; దదర్శ=చూచెను.

లక్ష్మణుఁడు, సుగ్రీవునిమీఁది కోపవేగంబునం బెదవి యదరఁ, గిష్కింధకు వెలుపల సంచరించుచున్న భయంకరాకారులగు వానరులంజూచెను.

అని, తాత్పర్యము.

తం దృష్ట్వా వానరాస్సర్వే లక్ష్మణం పురుషర్షభమ్
శైలశృంగాణి శతశః ప్రవృద్ధాంశ్చ మహీరుహాన్. ౧౮
జగృహుః కుంజరప్రఖ్యా వానరాః పర్వతాంతరే

టీక॥ పర్వతాంతరే=కొండలనడుమ; వానరాః=వానరులు; సర్వే=అందఱును; పురుషర్షభం=పురుషశ్రేష్ఠుఁడగు; తం=ఆ; లక్ష్మణం=లక్ష్మణుని; దృష్ట్వా=చూచి; కుంజరప్రఖ్యాః=ఏనుఁగులతో సమానులగు; వానరాః=వానరులు; శతశః=నూఱులునూఱులుగా; శైలశృంగాణి=పర్వతశిఖరములను; ప్రవృద్ధాన్=పెరిఁగిన; మహీరుహాంశ్చ=వృక్షములను; జగృహుః=గ్రహించిరి.

ఏనుఁగు లంతటి యాకారము గల యా వానరులు, పర్వతంబులనడుమఁ, పురుషశ్రేష్ఠుండగు లక్ష్మణుఁడుకిష్కింధకు వచ్చుటంజూచి, ఎవ్వఁడో శత్రువు వచ్చినాఁడని, పెక్కు పర్వతశిఖరంబులను పెద్దవృక్షంబులను గ్రహించిరి.

అని, తాత్పర్యము.

తాన్ గృహీతప్రహరణాన్ హరీన్ దృష్ట్వాతు లక్ష్మణః. ౧౯
బభూవ ద్విగుణం క్రుద్ధో బహ్వింధన ఇవానలః

టీక॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; గృహీతప్రహరణాన్ = పట్టఁబడిన యా

యుధములుగల; తాః=ఆ; హరీః= వానరులను; దృష్ట్వాతు = చూచినంతనే; ద్విగుణం=రెండింతలు గలుగునట్లుగా; క్రుద్ధః=కోపించినవాఁడై; బహ్వింధనః=అధికములయినకట్టెలుగల; అనల ఇవ=అగ్నివలె; బభూవ=అయెను.

లక్ష్మణుఁడు, ఆవానరులు ఆయుధములుధరించుటనుజూచి, నినుమడికోపంబునొంది అధికముగాఁగట్టెలుగల యగ్నివలె, జ్వలించెను. అని, తాత్పర్యము.

తం తే భయపరీతాంగాః క్రుద్ధం దృష్ట్వా ప్లవంగమాః. ౨౦
కాలమృత్యుయుగాంతాభం శతశో విద్రుతా దిశః

టీక ॥ తే=ఆ; ప్లవంగమాః=వానరులు; క్రుద్ధం = కోపించినవాఁడును; కాలమృత్యుయుగాంతాభం (యుగాంతకాలమృత్య్వాభం) = ప్రలయకాలమునందలి మృత్యువుయొక్క కాంతివంటికాంతిగలవాఁడునగు; తం= ఆలక్ష్మణుని; దృష్ట్వా=చూచి; భయపరీతాంగాః=వెఱపుచేవ్యాపింపఁబడినయవయవములుగలవారలై; శతశః= నూఱులు నూఱులుగా; దిశః= దిక్కులనుగూర్చి; విద్రుతాః=పరుగెత్తిరి.

ఆవానరులు, అట్లు కుపితుండై ప్రలయకాలమునందలి మృత్యువువలె భయంకరంబుగా జ్వలించుచున్నలక్ష్మణుఁ జూచి, భయంబున గడగడవడంకుచు, గుంపులు గుంపులుగా దిక్కులకుఁబోయిరి. అని, తాత్పర్యము.

తత స్సుగ్రీవభవనం ప్రవిశ్య హరిపుంగవాః. ౨౧
క్రోధ మాగమనంచైవ లక్ష్మణస్య న్యవేదయన్

టీక ॥ తతః = అటుపిమ్మట; హరిపుంగవాః= వానరశ్రేష్ఠులు; సుగ్రీవభవనం= సుగ్రీవునిగృహమును; ప్రవిశ్య= చొచ్చి; లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క; క్రోధం = కోపమును; ఆగమనంచైవ=వచ్చుటను; న్యవేదయన్=తెలిపిరి.

అంత, నవ్వానరోత్తములు, సుగ్రీవగృహంబునకుఁబోయి, లక్ష్మణుఁడు కుపితుండగుటయుఁ, గిష్కింధకు వచ్చుటయు, సుగ్రీవునకుఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

తారయా సహితః కామీ సక్తః కపివృషో రహః. ౨౨
న తేషాం కపివీరాణాం శుశ్రావ వచనం తదా

టీక॥ తదా = అప్పుడు; కామీ = కాముకుఁడును; తారయా = తారతో; సహితః = కూడినవాఁడును; రహః = రహస్యమునందు; సక్తః = తగిలినవాఁడు నగు; కపివృషః = వానరశ్రేష్ఠుఁడయిన సుగ్రీవుఁడు; తేషాం = ఆ; కపివీరాణాం = వానరవీరులయొక్క; వచనం = మాటను; నశుశ్రావ = వినఁడయ్యె.

అపుడు, సుగ్రీవుఁడు, మన్మథమోహితుండై రహస్యంబునఁ దారాసహితుండై క్రీడించుచున్నవాఁ డగుటం జేసి. యవ్వానరవీరులు చెప్పినమాటను వినఁడయ్యె. అని, తాత్పర్యము.

తత స్సచివసందిష్టా హరయో రోమహర్షణాః. ౨౩
గిరికుంజరమేఘాభా నగర్యా నిర్యయు స్తదా

టీక॥ తతః = అటుపిమ్మట; తదా = అప్పుడు; సచివసందిష్టాః = మంత్రులచే నాజ్ఞాపింపఁ బడిన; రోమహర్షణాః = వెంట్రుకలనుగగురుపొడిచువారలును, భయంకరులుననుట; గిరికుంజరమేఘాభాః = పర్వతములయొక్కయు నేనుఁగుల యొక్కయు మేఘములయొక్కయు కాంతివంటికాంతిగలవారలునగు; హరయః = వానరులు; నగర్యాః = పట్టణమునుండి; నిర్యయుః = వెడలిరి.

అంతనప్పుడు, మంత్రులు యథార్థముఁ దెలిసికొనిరండనియాదేశింప,చూపరులకుభయముగలిగించువారలును బర్వతాకారులునునేనుంగులంతటివారలును మేఘసమానులునగువానరులు, పట్టణమునుండి వెడలిరి. అని, తాత్పర్యము.

నఖదంష్ట్రాయుధా ఘోరా స్సర్వే వికృతదర్శనాః. ౨౪
సర్వే శార్దూలదర్పాశ్చ సర్వే చ వికృతాననాః

టీక॥ సర్వే = అందఱును; నఖదంష్ట్రాయుధాః = గోళ్లును కోఱలును ఆయుధములు గాఁగలవారలును; ఘోరాః = భయంకరులును; వికృతదర్శనాః = వికారముగలకన్నులుగలవారలు, భయంకరములయిన కన్నులుగలవార

లనుట. సర్వే=అందఱును; శార్దూలదర్పాశ్చ=పులియొకటి గర్వమువంటి గర్వముగలవారలును. సర్వే=అందఱు; వికృతాననాశ్చ= వికృతమయినముఖము గలవారలును.

అవ్వానరులు, అందఱును నఖములు దంతములు ఆయుధముగాఁగలవారలు; అందఱును భయంకరాకారులు; అందఱును భయంకరములయిన కన్నులుగలవారలు; అందఱును పెద్దపులులువలెబలదర్పితులు; అందఱును భయంకరమయిన ముఖముగలవారలు.

అని, తాత్పర్యము.

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః. ౨౫
కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః

టీక॥ కేచిత్=కొందఱు; దశనాగబలాః=పదియేనుఁగుల బలముగలవారలు. కేచిత్=కొందఱు; దశగుణోత్తరాః=పదియంతలచేనధికులు. కేచిత్=కొందఱు; నాగసహస్రస్య=ఏనుఁగుల వేయింటికి; తుల్యవిక్రమాః= సమానమయిన పరాక్రమముగలవారలు; బభూవుః=అయిరి.

అవ్వానరులుకొందఱు, పదియేనుఁగులబలముగలవారలును గొందఱు నూతేనుఁగుల బలముగలవారలును గొందఱు వేయేనుంగుల బలముగలవారలునుగానుండిరి. అని, తాత్పర్యము.

కృత్స్నాం హి కపిభి ర్వ్యాప్తాం ద్రుమహస్తై ర్మహాబలైః. ౨౬
అపశ్య ల్లక్ష్మణః క్రుద్ధః కిష్కింధాం తాం దురాసదామ్

టీక॥ క్రుద్ధః = కుపితుఁడగు; లక్ష్మణః=లక్ష్మణుఁడు; మహాబలైః= అధికమయినబలముగలవారలును; ద్రుమహస్తైః=వృక్షములుచేతులంగల వారలునగు; కపిభిః=వానరులచేత; వ్యాప్తాం=వ్యాపింపఁబడిన; కృత్స్నాం = సమస్తమైన; దురాసదాం=సమీపింపరానిదగు; తాం=ఆ; కిష్కింధాం=కిష్కింధను; అపశ్యత్ హి=చూచెనుగదా!

క్రుద్ధుండగు లక్ష్మణుండు, అంతటను మహాబలశాలులును వృక్షహస్తులునగు వానరవీరులచే వ్యాప్తమయి యెట్టివారికిని సమీపింపనలవిగాని కిష్కింధానగరముం జూచెను. అని, తా.

తత స్తే హరయ స్సర్వే ప్రాకారపరిఘాంతరాత్. ౨౭
నిష్క్రమ్యోదగ్రసత్త్వాస్తు తస్థు రావిష్కృతం తదా

టీక॥ తతః=అంత; తదా=అప్పుడు; తే=ఆ; ఉదగ్రసత్త్వాః=అధికమయిన బలముగల; హరయః = వానరులు; సర్వే = అందఱును; ప్రాకారపరిఘాంతరాత్=ప్రాకారమునందలి యినుపగడియక్రిందనుండి; నిష్క్రమ్య=వెడలినంతనే; ఆవిష్కృతం= ప్రకటముగా; తస్థుః=నిలిచిరి.

అంత, మహాబలశాలులగు మంత్రిసంశ్లిష్టులయిన యావానరులందఱు, ప్రాకారద్వారంబునకు వేసియున్న యినుపగడియక్రిందుగా వెడలివచ్చి, లక్ష్మణునిదృష్టిపథంబున నిలిచిరి. అని, తాత్పర్యము.

సుగ్రీవస్య ప్రమాదంచ పూర్వజం చార్తమాత్మవాన్. ౨౮
బుద్ధ్వా కోపవశం వీరః పునరేవ జగామ సః

టీక॥ ఆత్మవాన్=బుద్ధిమంతుడయిన; వీరః=పరాక్రమశాలియగు; సః=ఆలక్ష్మణుడు; సుగ్రీవస్య = సుగ్రీవనియొక్క; ప్రమాదంచ= ఏమఱుపాటును; ఆర్తం=దుఃఖితుడయిన; పూర్వజంచ=అన్నను; బుద్ధ్వా=తలంచి; పునరేవ=మఱల; కోపవశం=కోపముయొక్క యధీనతను; జగామ = పొందెను.

బుద్ధిమంతుండును బలాక్రమశాలియునగు నాలక్ష్మణుండు, సుగ్రీవుం డుపేక్షించుటయు అన్నయగు రాముండు దుఃఖితుండగుటయుం దలంచి, మఱలఁ గోపంబునొందెను. అని, తాత్పర్యము.

స దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసః కోపసంరక్తలోచనః. ౨౯
బభూవ నరశార్దూల స్సధూమ ఇవ పావకః

టీక॥ నరశార్దూలః = మనుష్యశ్రేష్ఠుడగు; సః= ఆలక్ష్మణుడు; దీర్ఘోష్ణమహోచ్ఛ్వాసః=నిడుపులయినవియు వేడియయినవియు నగు గొప్పనిట్టూర్పులు గలవాడై; కోపసంరక్తలోచనః=కోపముచేమిక్కిలియెఱ్ఱనైన కన్నులుగలవాడై; సధూమః = పొగతోఁగూడిన; పావకఇవ=నిప్పువలె; బ

బభూవ=ఉండెను.

పురుషశ్రేష్ఠుండగు నాలక్ష్మణుండు, కోపంబున దీర్ఘంబులగు వేడి నిట్టూర్పులు నిగుడించుచుఁ గన్నుల మిక్కిలి యునెఱ్ఱదనంబుగదురఁ, బొగతోఁ గూడిన నిప్పువలె నొప్పెను.

అని, తాత్పర్యము.

బాణశల్యస్ఫురజ్జిహ్వ స్సాయకాసనభోగవాన్. ౩౦
స్వతేజోవిషసంఘాతః పంచాస్య ఇవ పన్నగః

టీక॥ బాణశల్యస్ఫురజ్జిహ్వః=బాణములయొక్క యుక్కులెచలించుచున్న నాలుకలుగాఁ గలవాఁడును; సాయకాసనభోగవాన్= ధనుస్సెపడగగాఁ గలవాఁడును; స్వతేజోవిషసంఘాతః= తనతేజస్సెవిషకోశముగాఁ గలవాఁడునగు; సః (అధ్యాహృతము)= ఆలక్ష్మణుఁడు; పంచాస్యః = అయిదుముఖములుగల; పన్నగఇవ = సర్పమువలె; బభూవ (అధ్యాహృతము)= ఉండెను.

ఆలక్ష్మణుండు, బాణంబులకు వేసియున్నయుక్కుమేకులె చలించుచున్ననాలుకలుగాను ధనుస్సెపడగగాను దనతేజస్సె విషముగానుగలవాఁడై, యయిదుతలలుగల సర్పమువలె భయంకరుండయ్యెను. అని, తాత్పర్యము.

తం దీప్తమివ కాలాగ్నిం నాగేంద్రమివ కోపితమ్. ౩౧
సమాసాద్యాంగద స్త్రాసా ద్విషాద మగమ ద్భృశమ్

టీక॥ అంగదః = అంగదుఁడు; దీప్తం=మండుచున్న ; కాలాగ్నిమివ(స్థితం)=ప్రళయకాలమునందలియగ్నివలె నున్నవాఁడును; కోపితం = కోపము నొందిన; నాగేంద్రమివ(స్థితం)= సర్పరాజువలెనున్నవాఁడునగు; తం = ఆలక్ష్మణుని; సమాసాద్య=సమీపించి; త్రాసాత్=భయమువలన; భృశం=మిక్కిలియు; విషాదం = దుఃఖమును; అగమత్=పొందెను.

అంగదుండు, ప్రళయకాలాగ్నివలె జ్వలించుచున్నవాఁడును కుపితుండగు సర్పరాజయినయాదిశేషునివలెనున్నవాఁడునగు నాలక్ష్మణుని సమీపమునకుంబోయి, భయమునంజేసి, మిక్కిలియుదుఃఖితుండయ్యెను. అని, తాత్పర్యము.

సోఽంగదం రోషతామ్రాక్షః స్సందిదేశ మహాయశాః. ౩౨

టీక॥ మహాయశాః= అధికమగుయిన కీర్తిగల; సః=ఆలక్ష్మణుఁడు; రోషతామ్రాక్షః=కోపముచేతనెఱ్ఱనైన కన్నులుగలవాఁడై; అంగదం = అంగదుని; సందిదేశ = సమాచారము చెప్పి పంపెను.

మహాకీర్తిశాలియగు నాలక్ష్మణుండు, కోపంబునం గన్నుల నెఱ్ఱదనంబు దోఁప, అంగదునితో, సుగ్రీవునికిఁగ నిట్లని సమాచారము చెప్పెను.

అని, తాత్పర్యము.

సుగ్రీవః కథ్యతాం వత్స మమాగమన మిత్యుత

టీక ॥ వత్స=బిడ్డఁడా! మమ= నా యొక్క; ఆగమనం = రాక; భవతి (అధ్యాహృతము) = అగుచున్నది; ఇతి ఉత = అని; సుగ్రీవః= సుగ్రీవుఁడు; కథ్యతాం= చెప్పఁబడుఁగాక.

చిన్నవాఁడా! నారాకను గుఱించి సుగ్రీవునకుఁ దెలియఁజేయుము.

అని, తాత్పర్యము.

ఏష రామానుజః ప్రాప్త స్త్వత్సకాశ మరిందమః. ౩౩
భ్రాతు ర్వ్యసనసంతప్తో ద్వారి తిష్ఠతి లక్ష్మణః

టీక ॥ భ్రాతుః = అన్నయొక్క; వ్యసనసంతప్తః = దుఃఖముచేఁ దపింపఁజేయఁబడిన; అరిందమః = శత్రువులనడఁగఁద్రొక్కువాఁడును; రామానుజః= రామునితమ్ముఁడునగు; ఏషః= ఈ; లక్ష్మణః = లక్ష్మణుఁడు; త్వత్సకాశం= నీసమీపమునుగూర్చి; ప్రాప్తః= పొందినవాఁడై; ద్వారి=వాకిలియందు; తిష్ఠతి = ఉన్నాఁడు.

శత్రువులనడంగఁ ద్రొక్కునట్టి రామునితమ్ముండులక్ష్మణుండు, అన్నయొక్క దుఃఖముచే సంతప్తుండై నీసమీపమున కువచ్చి, యిపుడువాకిటనున్నాఁడు.

అని, తాత్పర్యము.

తస్య వాక్యే యది రుచిః క్రియతాం సాధు వానర. ౩౪

టీక ॥ వానర=సుగ్రీవుఁడా! తస్య= ఆలక్ష్మణునియొక్క; వాక్యే = మాట

యాందు; రుచిర్యది= ప్రీతికలదేని; సాధు=చక్కగా; క్రియతాం= చేయఁబడుఁగాక.

సుగ్రీవుఁడా! ఆలక్ష్మణునిమాటవిను టను నీకిష్టముకలదేని, యందుకనురూపముగాఁ బ్రవర్తింపుము. అని, సుగ్రీవునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా శీఘ్ర మాగచ్ఛ వత్స వాక్య మరిందమ

టీక॥ అరిందమ= శత్రువులనడంగఁ ద్రొక్కునట్టి; వత్స=చిన్నవాఁడా! ఇతి=అని;వాక్యం=మాటను; ఉక్త్వా=చెప్పి; శీఘ్రం = వేగముగా; ఆగచ్ఛ = రమ్ము.

శత్రువులనడంగఁద్రొక్కునట్టి యంగదుఁడా! అనియిట్లుసుగ్రీవునితోఁ జెప్పి, శీఘ్రముగ రమ్ము. అని, తాత్పర్యము.

లక్ష్మణస్య వచ శ్శ్రుత్వా శోకావిష్టోఙ్గదో బ్రవీత్. ౩౫
పితు స్సమీప మాగమ్య సౌమిత్రి రయ మాగతః

టీక॥ అంగద=అంగదుఁడు; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; శోకావిష్టః=దుఃఖముచేనావేశింపఁబడినవాఁడై; పితుః=తండ్రియొక్క, పినతండ్రియొక్కయనుట; సమీపం=సన్నిధిని; ఆగమ్య=పొంది; "అయం=ఈ;సౌమిత్రిః=లక్ష్మణుఁడు; ఆగతః=వచ్చినాఁడు." ఇతి(అభ్యాహృతము)=అని;అబ్రవీత్=పలికెను.

అంగదుండు, లక్ష్మణునివాక్యంబువిని, దుఃఖితుండై, పినతండ్రియగు సుగ్రీవునియొద్దకుఁబోయి, "ఇదిగో లక్ష్మణుండువచ్చియున్నాఁ"డని చెప్పెను. అని, తాత్పర్యము.

అథాంగద స్తస్య వచో నిశమ్య
సంభ్రాంతభావః పరిదీనవక్త్రః. ౩౬
నిపత్య తూర్ణం నృపతే స్తరస్వీ
తతః కుమార శ్చరణౌ వవందే

టీక॥ అథ=అటుపిమ్మట; తరస్వీ= బలవంతుఁడగు; కుమారః=కొడుకైన;

అఙ్గదః=అంగదుఁడు; తస్య= ఆలక్ష్మణునియొక్క; వచః=మాటను; నిశమ్య= విని; సంభ్రాంతభావః=తొట్రుపాటు నొందిన మనస్సుగలవాఁడై; పరిదీనవక్త్రః=దుఃఖితమయిన ముఖముగలవాఁడై; తూర్ణం= శీఘ్రముగా; నిపత్య= పోయి; తతః=అటుపిమ్మట; నృపతేః= రాజయినసుగ్రీవునియొక్క; చరణౌ = పాదములను; వవందే = నమస్కరించెను.

అంతఁ, గుమారుండగు నంగదుండు, లక్ష్మణుని మాట విని, మనస్సుతొట్రుపాటునొంద, దుఃఖంబున ముఖంబు వెలవెలంబోవ, శీఘ్రంబునంబోయి, రాజయినసుగ్రీవుని చరణంబులకు నమస్కరించెను. అని, తాత్పర్యము.

సంగృహ్య పాదౌ పితు రగ్ర్యతేజా
జగ్రాహ మాతుః పునరేవ పాదౌ. ౩౭
పాదౌ రుమాయాశ్చ నిపీడయిత్వా
నివేదయామాస తతస్త మర్థమ్

టీక॥ అగ్ర్యతేజాః = ఉత్తమమయిన పరాక్రమముగల యంగదుఁడు; పితుః = తండ్రియొక్క; పాదౌ=పాదములను; సంగృహ్య = పట్టి; పునరేవ = మఱలనే; మాతుః = తల్లియొక్క; పాదౌ=అడుగులను; జగ్రాహ= పట్టెను. రుమాయాః = రుమయొక్క; పాదౌచ= అడుగులనుగూడ; నిపీడయిత్వా (నిపీడ్య)=పట్టి; తతః = అటుపిమ్మట; తం=ఆ; అర్థం = సమాచారమును; నివేదయామాస=తెలిపెను.

అధికమయిన పరాక్రమము గల యంగదుండు, తండ్రిపాదంబులకు మ్రొక్కి, అంతఁ దల్లియగు తారపాదంబులకు నమస్కరించి, పినతల్లియగురుమకుఁగూడ నభివందనంబు గావించి, యటుపిమ్మట లక్ష్మణుండు చెప్పి పంపిన సమాచారమును జెప్పెను.

అని, తాత్పర్యము.

స నిద్రామదసంవీతో వానరో న విబుద్ధవాన్. ౩౮
బభూవ మదమత్తశ్చ మదనేన చ మోహితః

టీక॥ నిద్రామదసంవీతః = నిదురచేతను కైపుచేతను కప్పఁబడినః సః=ఆ;

వానరః= సుగ్రీవుఁడు; నవిబుద్ధవాన్= మేలుకొనఁడయ్యె. మదమత్తశ్చ=కైపుచే మత్తిల్లినవాఁడును; మదనేన=మన్మథునిచేత; మోహితశ్చ = మోహము నొందినవాఁడును; బభూవ=అయ్యెను.

ఆసుగ్రీవుఁడప్పుడు, నిదురయుమద్యపానంబునంగల్గినకైపును మన్మథమోహంబును బొందియుండుట వలన, మేలుకొనఁడయ్యె. అని, తాత్పర్యము.

తతః కిలకిలాం చక్రు ర్లక్ష్మణం ప్రేక్ష్య వానరాః. ౩౯
ప్రసాదయంత స్తం క్రుద్ధం భయమోహితచేతసః

టీక॥ తతః = అటుపిమ్మట; వానరాః=వానరులు; లక్ష్మణం=లక్ష్మణుని; ప్రేక్ష్య= చూచి; భయమోహితచేతసః=భయముచే మోహమునొందినమనస్సుగలవారలయి; క్రుద్ధం=కుపితుండగు; తం=ఆలక్ష్మణుని; ప్రసాదయంతః= ఊఱడించువారలయి; కిలకిలాం=కిలకిలయనుధ్వనిని; చక్రుః=చేసిరి.

అంత, వానరులు, లక్ష్మణుని జూచి, మిక్కిలిభయమునొంది, కుపితుండగు లక్ష్మణునిఁ బ్రసన్నుం జేయుటకై, కిలకిలయనియఱచిరి.

అని, తాత్పర్యము.

తే మహౌఘనిభం దృష్ట్వా వజ్రాశనిసమస్వనమ్. ౪౦
సింహనాదం సమం చక్రు ర్లక్ష్మణస్య సమీపతః

టీక॥ తే=ఆవానరులు; మహౌఘనిభం= మహాప్రవాహముతో సమానుఁడగులక్ష్మణుని; దృష్ట్వా = చూచి; లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క; సమీపతః = సమీపమునందు; సమం = ఏకకాలమున; వజ్రాశనిసమస్వనం = వజ్రాయుధముతోను పిడుగుతోనుసమానమయిన ధ్వనిగల; సింహనాదం=సింహముయొక్క ధ్వనివంటి ధ్వనిని; చక్రుః = చేసిరి.

మహాప్రవాహము వచ్చినట్లు వచ్చినలక్ష్మణుంజూచి, యావానరులు, అందఱు నొకటిగా వజ్రాయుధమువలెను పిడుగువలెను మహాధ్వనిగల్గినట్లు, సింహనాదము గావించిరి.

అని, తాత్పర్యము.

తేన శబ్దేన మహతా ప్రత్యబుధ్యత వానరః. ౪౧
మదవిహ్వలతామ్రాక్షో వ్యాకులస్రగ్విభూషణః

టీక॥ వానరః= సుగ్రీవుండు; మహతా=గొప్పదగు; తేన = ఆ; శబ్దేన=ధ్వనిచేత; మదవిహ్వలతామ్రాక్షః = కైపుచేస్వాధీనతప్పినవియు నెఱ్ఱనైనవియునగు కన్నులుగలవాఁడై; వ్యాకుల స్రగ్విభూషణః=కలఁతనొందిన పుష్పమాలికలును సొమ్ములును గలవాఁడై; ప్రత్యబుధ్యత=మేలుకొనెను.

అమ్మహాధ్వనికి, సుగ్రీవుండు, కైపుచే సులభముగాఁదెఱచుట కశక్యములయి నెఱ్ఱనివైన కన్నులతోను గ్రిందుమీఁదైన పుష్పసరంబులతోను ఆభరణంబులతోను గూడినవాఁడై నిదుర మేలుకొనెను. అని, తాత్పర్యము.

అథాంగదవచశ్శ్రుత్వా తేనైవచ సమాగతౌ. ౪౨
మంత్రిణౌ వానరేంద్రస్య సమ్మతౌ దారదర్శినౌ
ప్లక్షశ్చైవ ప్రభావశ్చ మంత్రిణౌ వర్థధర్మయోః. ౪౩
వక్తుముచ్చావచం ప్రాప్తం లక్ష్మణం తౌ శశంసతుః

టీక॥ అథ = అటుపిమ్మట; మంత్రిణౌ=ప్రశస్తమయినయాలోచనగలవారలును; వానరేంద్రస్య = వానరరాజయినసుగ్రీవునకు; సమ్మతౌ=ఇష్టులును; దారదర్శినౌ=భార్యలను జూచువారలును, అంతఃపురములోనికిఁ బోఁదగినవారలుననుట, అగు; ప్లక్షశ్చైవ=ప్లక్షుండును; ప్రభావశ్చ= ప్రభావుండును అను; మంత్రిణౌ= మంత్రులు; అంగదవచః= అంగదునిమాటను; శ్రుత్వా=విని; తేనైవచ= ఆయంగదునితోఁగూడనె; సమాగతౌ = వచ్చినవారలై; అర్థధర్మయోః=అర్థమువిషయమయి ధర్మమువిషయమయి; ఉచ్చావచం = నానావిధమయినవచనమును; వక్తుం = చెప్పుటకు; ప్రాప్తం=వచ్చిన; లక్ష్మణం = లక్ష్మణుని; తౌ=ఆప్లక్షప్రభావులు; శశంసతుః=చెప్పిరి.

అంత, చక్కని యాలోచనశక్తిగలవారలును సుగ్రీవునకు ఇష్టులును అంతఃపురములోనికిఁ బ్రవేశింపఁదగినవారలునగు ప్లక్షుండు ప్రభావుండు నను మంత్రులిర్వురు, అంగదుని వచనంబు విని, యతనితోఁగూడ నంతిపురంబునకుఁబో

యి, లక్ష్మణుండు, అర్థధర్మంబుల విష యమయి చాల మాటలాడుటకై వచ్చి యున్నాఁడని సుగ్రీవునికిఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ప్రసాదయిత్వా సుగ్రీవం వచనై స్సామనిశ్చితైః. ౪౪
ఆసీనం పర్యుపాసీనా యథా శక్రం మరుత్పతిమ్

టీక ॥ తౌ (అధ్యాహృతము)= ఆప్లుతప్రభావులు; మరుత్పతిం = దేవతలకుఁ బ్రభువైన; శక్రంయథా(స్థితం)= ఇంద్రునివలెనున్న; ఆసీనం = కూర్చుండిన; సుగ్రీవం = సుగ్రీవుని; సామనిశ్చితైః = తిన్నదనము విషయమయినిశ్చతములగు; వచనైః = మాటలచేత;ప్రసాద్య = ప్రసన్నునిగావించి; పర్యుపాసీనా = సమీపంబునఁ గూర్చుండినవారలయి; ఊచతుః (అధ్యాహృతము)= చెప్పిరి.

ఆప్లుతప్రభావులు, దేవనాథుండగు నింద్రునివలె సింహాసనాసీనుండై వెలుంగుచున్న సుగ్రీవునిసామవచనంబులచేఁ బ్రసన్నుంగావించి, యతని సమీపంబునం గూర్చుండి, యిట్లనిపలికిరి.

అని, తాత్పర్యము.

సత్యసంధౌ మహాభాగౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౪౫
వయస్యభావం సంప్రాప్తౌ రాజ్యార్హౌ రాజ్యదాయినౌ

టీక॥ సత్యసంధౌ=సత్యమయినప్రతిజ్ఞ గలవారలును; మహాభాగౌ= పూజ్యమయినభాగ్యముగలవారలును; రాజ్యార్హౌ = రాజ్యమునకుఁదగినవారలును; వయస్యభావం = మిత్రత్వమును; సంప్రాప్తౌ=పొందినవారలును; రాజ్యదాయినౌ=రాజ్యము నొసంగువారలునగు; భ్రాతరౌ=అన్నదమ్ములైన; రామలక్ష్మణౌ=రాముండును, లక్ష్మణుండును; స్తః(అధ్యాహృతము)= ఉన్నారు.

ప్రతిజ్ఞ దప్పనివారలును మహాత్ములును రాజ్యంబుఁబాలింప సమర్థులును, నీతోసఖ్యంబుగావించి నీకు రాజ్యంబొసంగినవారలునగు నన్నదమ్ములు రాముండును లక్ష్మణుండుననువారలున్నారుగదా! అని, తాత్పర్యము.

తయోరేకో ధనుష్పాణి ర్ద్వారి తిష్ఠతి లక్ష్మణః. ౪౬

యస్య భీతాః ప్రవేపంతో నాదా న్ముంచంతి వానరాః

టీక॥ తయోః = వారలలో; ఏకః= ఒకఁడైన; ధనుష్పాణిః=విల్లుచేతంగల; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ద్వారి=వాకిలియందు; తిష్ఠతి = ఉన్నాఁడు. వానరాః= వానరులు; యస్య= ఎవ్వనికి, ఎవ్వనివలనననుట; భీతాః = భయపడినవారలయి; ప్రవేపంతః=వణంకుచు; నాదాన్=ధ్వనులను; ముంచంతి=విడుచుచున్నారో.

వారిలోనొకఁడు,లక్ష్మణుండనువాఁడు, ధనుర్ధరుండయి వాకిటికి వచ్చియున్నాఁడు; అతనిం జూచి, వానరులు భయపడి వడంకుచు నాదంబులు సేయుచున్నారు. అని, తాత్పర్యము.

స ఏష రాఘవభ్రాతా లక్ష్మణో వాక్యసారథిః. ౪౭
వ్యవసాయరథః ప్రాప్త స్తస్య రామస్య శాసనాత్

టీక॥ సః=అట్టి; ఏషః=ఈ; రాఘవభ్రాతా=రామునితమ్ముఁడయిన; లక్ష్మణః=లక్ష్మణుఁడు; తస్య=ఆ; రామస్య=రామునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; వాక్యసారథిః=మాటయేసారథిగాఁగలవాఁడై; వ్యవసాయరథః= ప్రయత్నమెయరదముగాఁ గలవాఁడై; ప్రాప్తః=వచ్చినాఁడు.

ఆ రామునితమ్ముండు లక్ష్మణుండు, రామునిపనుపునం జేసి, రామవాక్యమె సారథిగాను, రామనియోగంబును గావించుటయె రథంబుగానుగలవాఁడై, యిచటికువచ్చినాఁడు. అని, తాత్పర్యము.

అయం చ దయితో రాజన్ తారాయా స్తనయోంగదః. ౪౮
లక్ష్మణేన సకాశం తే ప్రేషిత స్త్వరయా నఘ

టీక॥ అనఘ = పాపరహితుండవగు; రాజన్ = రాజా! లక్ష్మణేన = లక్ష్మణునిచేత; తే= నీయొక్క; సకాశం=సమీపమునుగూర్చి; తారాయాః= తారయొక్క; దయితః = ప్రియుఁడైన; అయం=ఈ; అంగదః = అంగదుఁడును; త్వరయా = వేగముచేత; ప్రేషితః = పంపఁబడినాఁడు.

పాప రహితుఁడవగు సుగ్రీవుఁడా! తారయొక్క ప్రియపుత్త్రుండగు

నీయంగదునిఁగూడ, శీఘ్రింబునం బోవ్వాని లక్ష్మణుండు, నీయొద్దకుఁ బంపినాఁడు. అని, తాత్పర్యము.

సో௨యం రోషపరీతాక్షో ద్వారి తిష్ఠతి వీర్యవాన్. ౪౯
వానరా న్వానరపతే చక్షుషా నిర్దహన్నివ

టీక ॥ వానరపతే= వానరరాజవగుసుగ్రీవుఁడా! వీర్యవాన్ = అధికమయినపరాక్రమముగల; సః= ఆ; అయం = ఈలక్ష్మణుఁడు; రోషపరీతాక్షః=కోపముచేవ్యాపింపఁబడిన కన్నులుగలవాఁడై; చక్షుషా = కంటిచేత; వానరాన్= వానరులను; నిర్దహన్నివస్థితః=కాల్చుచున్నట్లున్నవాఁడై; ద్వారి= వాఁకిటియందు; తిష్ఠతి=ఉన్నాఁడు.

వానరేంద్రుఁడవగు సుగ్రీవుఁడా! మహాపరాక్రమశాలియగు నా లక్ష్మణుండు, కన్నులం దీవ్రకోపంబు దోఁపఁ, జూపుల వానరులను దహించువాఁడువోలె, వాకిటం గాచియున్నాఁడు. అని, తాత్పర్యము.

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్త్రస్సహబంధుభిః. ౫౦
గచ్ఛ శీఘ్రం మహారాజ రోషో హ్యస్య నివర్త్యతామ్

టీక ॥ మహారాజ = సుగ్రీవుఁడా! త్వం—నీవు; సపుత్త్రః= కొడుకుతోఁగూడినవాఁడవై; బంధుభిస్సహ=బంధువులతోఁగూడ; శీఘ్రం=వేగముగా; గచ్ఛ=పొమ్ము. తస్య = అతనికి; మూర్ధ్నా=శిరసుచేత; ప్రణమ్య=నమస్కరించి; అస్య=ఈలక్ష్మణునియొక్క; రోషోహి = కోపముమాత్రము; నివర్త్యతాం=మఱలింపఁబడుఁగాక.

సుగ్రీవుఁడా! నీవు పుత్త్రునితోను బంధువులతోనుంగూడ శీఘ్రింబున లక్ష్మణుని యొద్దకుఁబోయి, యతని శిరస్సుచేనమస్కరించి, యతనికోపమును ఎట్లైనపోఁగొట్టుము. అని, తాత్పర్యము.

య దాహ రామో ధర్మాత్మా త త్కురుష్వ సమాహితః. ౫౧
రాజన్ తిష్ఠ స్వసమయే భవ సత్యప్రతిశ్రవః

టీక॥ రాజన్=రాజా! ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు; రామః= రాముఁ

డు; యత్=దేని; ఆహ=చెప్పుచున్నా డో; తత్=దాని; సమాహితః=ఎచ్చరికగలవాఁడవై; కురుష్వ=చేయుము. స్వసమయే=నీమర్యాదయందు; తిష్ఠ=నిలువుము. సత్యప్రతిశ్రవః= సత్యమైన ప్రతిజ్ఞ గలవాఁడవు; భవ=అగుము.

వానర నాథుఁడా! ధర్మాత్ముఁడగు రాముఁడేమి చెప్పుచున్నాఁడో, ఆపనిని, జాగ్రత్తతోఁ దప్పక చేయుము; నీవు గావించిన ప్రతిజ్ఞను దప్పక నెఱవేర్చి, నీమర్యాదను గాపాడుకొనుము. అని, ప్లక్షప్రభావులు సుగ్రీవునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ఏకత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండైకత్రింశసర్గటీక,
ముగిసినది.

—

శ్రీః

ద్వాత్రింశసర్గప్రారంభః.

అంగదస్య వచశ్శ్రుత్వా సుగ్రీవస్సచివైస్సహ
లక్ష్మణం కుపితం శ్రుత్వా ముమోచాసన మాత్మవాన్. ౧

టీక ॥ ఆత్మవాన్ = బుద్ధిమంతుండగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; సచివైస్సహ = మంత్రులతోఁగూడ; అంగదస్య = అంగదునియొక్క; వచః=మాటను; శ్రుత్వా= విని (అంగదుఁడు ప్రధానభూతుఁడగుటవలన, "అంగదుని మాటవిని" యనిచెప్పఁబడినది); కుపితం = కోపించిన; లక్ష్మణం=లక్ష్మణుని; శ్రుత్వా=విని; ఆసనం = సింహాసనమును; ముమోచ = విడిచెను.

బుద్ధిమంతుఁడగు సుగ్రీవుండు, అంగదపురస్సరులగు ప్లక్షప్రభావులమాట

నుపని, లక్ష్మణుండు క్రుద్ధుండయ్యెనని దెలిసి, సింహాసనమునుండిదిగెను. అని, తా.

సచివా న్నబ్రవీ ద్వాక్యం నిశ్చిత్య గురులాఘవమ్
మంత్రజ్ఞా న్మంత్రకుశలో మంత్రేషు పరినిష్ఠితాన్. ౨

టీక॥ మంత్రకుశలః= ఆలోచనలందు సమర్థుఁడయిన సుగ్రీవుఁడు; గురులాఘవం=గౌరవమును లాఘవమును; నిశ్చిత్య=నిశ్చయించి; మంత్రజ్ఞాన్= ఆలోచనలం దెలిసినవారలును; మంత్రేషు=ఆలోచనలందు; పరినిష్ఠితాన్=ఉన్నవారలునగు; సచివాన్= మంత్రులనుగూర్చి; వాక్యం = మాటను; అబ్రవీత్=పలికెను.

ఆలోచనలందు సమర్థుఁడయిన సుగ్రీవుండు, గౌరవలాఘవంబులునిశ్చయించి, ఆలోచనలు చక్కఁగాఁ దెలిసినవారలును ఎప్పుడును ఆలోచనము సేయుటయం దెయున్నవారలునగు మంత్రులం జూచి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

న మే దుర్వ్యాహృతం కించి న్నాపి మే దురనుష్ఠితమ్
లక్ష్మణో రాఘవభ్రాతా క్రుద్ధః కి మితి చింతయే. ౩

టీక॥ కించిత్ = కొంచెమేనిః; మే= నాయొక్క; దుర్వ్యాహృతం = చెడ్డమాట; న=లేదు. మే=నాయొక్క; దురనుష్ఠితమపి = చెడ్డపనియు; న=లేదు. కిం=ఎందువలన; రాఘవభ్రాతా=రామునితమ్ముఁడయిన; లక్ష్మణః=లక్ష్మణుఁడు; క్రుద్ధః=కోపించినవాఁడు? ఇతి=అని; చింతయే=ఆలోచించుచున్నాను.

నేను గొంచెమయినను తప్పుమాట చెప్పియుండలేదు; తప్పుపనియుఁ జేసియుండలేదు; ఇట్లుండఁగా రామునితమ్ముఁడు లక్ష్మణునకు, ఎందువలనఁ గోపముగలిగెననియాలోచించుచున్నాను. అని, తాత్పర్యము.

అసుహృద్భి ర్మమా మిత్త్రై ర్నిత్య మంతరదర్శిభిః
మమ దోషా నసంభూతాన్ శ్రావితో రాఘవానుజః. ౪

టీక॥ రాఘవానుజః=లక్ష్మణుఁడు; అసుహృద్భిః=మంచిమనస్సులేనివారలును;

స ౩౨

నిత్యం=ఎల్లప్పుడును; అంతరదర్శిభిః = ఛిద్రమునుజూచువారలు నగు; మమ= నాయొక్క; అమిత్రైః= శత్రువులచేత; అసంభూతాన్= పుట్టనట్టి;మమ= నాయొక్క; దోషాన్= దోషములను; శ్రావితః = వినిపింపఁబడినాఁడు.

ఎల్లప్పుడును నాఛిద్రములనే కనిపెట్టియుండు దురాత్ములగు నాశత్రువులు, నాయందు లేనిపోని దోషములను లక్ష్మణునితోఁ జెప్పియుందురు.

అని, తాత్పర్యము.

అత్ర తావ ద్యథాబుద్ధి సర్వైరేవ యథావిధి
భావస్య నిశ్చయ స్తావ ద్విజ్ఞేయో నిపుణం శనైః. ౫

టీక॥ అత్ర=ఈవిషయమందు; తావత్ =ముందుగా; యథాబుద్ధి=బుద్ధినతిక్రమింపక; యథావిధి = యథాశాస్త్రముగా; నిపుణం = చక్కఁగా; శనైః=మెల్లగా; సర్వైరేవ= అందఱిచేతనే; భావస్య= చేష్టయొక్క; నిశ్చయః=సిద్ధాంతము; తావత్ =సాకల్యముచేత; విజ్ఞేయః=తెలియఁదగినది.

ఈవిషయమందు, ముందుగా, మీరలందఱును మీబుద్ధికౌశలంబుకొలంది, నీతిశాస్త్రోక్తపద్ధతిని ఆలోచించి, లక్ష్మణునకుఁగోపముగలుగుటకుఁ దగిన కారణంబునంతయుఁ జక్కఁగానిశ్చయించి తెలిసికొనవలెను. అని, తాత్పర్యము.

న ఖల్వస్తి మమ త్రాసో లక్ష్మణా న్నాపి రాఘవాత్
మిత్రం త్వస్థానకుపితం జనయత్యేవ సంభ్రమమ్. ౬

టీక॥ మమ=నాకు; లక్ష్మణాత్= లక్ష్మణునివలన; త్రాసః=భయము;నాస్తిఖలు=లేదుగదా! రాఘవాదపి=రామునివలనను; త్రాసః (అధ్యాహృతము)=భయము;న=లేదు. అస్థానకుపితం= కారణములేకయె కోపమునొందిన; మిత్రంతు=స్నేహితుఁడుమాత్రము; సంభ్రమం=తొట్రుపాటును; జనయత్యేవ=కలిగింపనే కలిగించును.

లక్ష్మణుని యొద్దఁగాని రాముని యొద్దఁగాని నాకెంతమాత్రముభయమువులేదు; అయితే, స్నేహితుండుకారణంబులేక కోపంబునొందినయెడ నెట్టివానికిని సంభ్రమము గలుగకమానదు.

అని, తాత్పర్యము.

స ౩౨

సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్
అనిత్యత్వాచ్చ చిత్తానాం ప్రీతి రల్పేపి భిద్యతే. ౭

టీక॥ మిత్రం= స్నేహితుఁడు; సర్వథా = అన్నివిధములచేతను; సుకరం=సులభముగాఁ జేయఁదగినవాఁడు. పరిపాలనం=కాపాడుట; దుష్కరం= చేయనలవిగానిది. చిత్తానాం = మనస్సులయొక్క; అనిత్యత్వాచ్చ = నిత్యముగామివలనను, చపలత్వమువలనను; అల్పేపి = కొంచెమునందుఁగూడ; ప్రీతిః=స్నేహము; భిద్యతే = భేదింపఁబడును.

మిత్రుని సంపాదించుట యన్నివిధములను సులభసాధ్యము; ఆమైత్రినిగాపాడుటమాత్రము కష్టము; చిత్తవృత్తి చపలమగుటవలన, కొంచెమువైషమ్యముగలిగినను స్నేహముచెడును.

అని, తాత్పర్యము.

అతోనిమిత్తం త్రస్తోహం రామేణతు మహాత్మనా
యన్మమోపకృతం శక్యం ప్రతికర్తుం న తన్మయా. ౮

టీక ॥ యత్=ఏది; మహాత్మనా = పూజ్యమయిన స్వభావముగల; రామేణతు=రామునిచేతమాత్రము; మమ= నాకు; ఉపకృతం= ఉపకారముచేయఁబడినదో; తత్ = అది; మయా=నాచేత; ప్రతికర్తుం = బదులుచేయుటకు; నశక్యం = అలవిగాదు. అతోనిమిత్తం= ఈకారణమువలన; అహం=నేను; త్రస్తః= భయపడినవాఁడను.

మహాత్ముఁడగు రాముఁడు నాకేయుపకారముగావించినాఁడో, అట్టియుపకారమునకు సరియయినప్రత్యుపకారము సేయుటకు నాచేనంతమాత్ర శక్యముగాదు; ఈకారణమువలననే, నేను భయపడెదను. అని,సుగ్రీవుండు మంత్రులతోఁజెప్పెను. అని, తాత్పర్యము.

సుగ్రీవేణైవ ముక్తస్తు హనుమాన్హరిపుంగవః
ఉవాచ స్వేన తర్కేణ మధ్యే వానరమంత్రిణామ్. ౯

టీక ॥ హరిపుంగవః=వానరశ్రేష్ఠుఁడయిన; హనుమాన్= హనుమంతుఁడు; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; ఏవం= ఇట్లు; ఉక్తస్తు= చెప్పఁబడినవాఁడైనం

తేన; వానరమంత్రిణాం= వానరమంత్రులయొక్క; మధ్యే=నడుమను; స్వేన=తనదైన; తర్కేణ=ఊహచేత; ఉవాచ=పలికెను.

వానరోత్తముఁడగు హనుమంతుండు, సుగ్రీవుండు చెప్పినమాటనువిని, వానరమంత్రులనడుమఁ, దనబుద్ధిబలంబు దేటపడ, నిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

సర్వథా నైతదాశ్చర్యం యత్త్వం హరిగణేశ్వర
న విస్మరసి సుస్నిగ్ధ ముపకారకృతం శుభమ్. ౧౦

టీక॥ హరిగణేశ్వర=వానరసమూహములకుఁ బ్రభుఁడవగు సుగ్రీవుఁడా! త్వం=నీవు; సుస్నిగ్ధం = మిక్కిలియు స్నేహముగలవాఁడును; శుభం= మంగళకరుండును; ఉపకారకృతం = ఉపకారముచేసిన వాఁడునగు వాని; నవిస్మరసి(ఇతి యత్) = మఱవకున్నావనునదియేదిగలదో; ఏతత్=ఇది; సర్వథా=అన్నివిధములను; నఆశ్చర్యం=ఆశ్చర్యకరముకాదు.

వానరరాజా! మిక్కిలియు స్నేహంబుగలవాఁడును సద్గుణ సంపన్నుండునగు నుపకారంబు కావించినవాని, నీయట్టిధర్మాత్ముండు మఱవకుండుట యెంతమాత్రము నాశ్చర్యకరముగాదు; నీకది సహజమె. అని, తాత్పర్యము.

రాఘవేణతు వీరేణ భయ ముత్సృజ్య దూరతః
త్వత్ప్రియార్థం హతో వాలీ శక్రతుల్యపరాక్రమః. ౧౧

టీక॥ వీరేణ = పరాక్రమశాలియగు; రాఘవేణతు = రామునిచేతమాత్రము; త్వత్ప్రియార్థం = నీయొక్క సంతోషంబుకొఱకు; భయం = వెఱపును; దూరతః = దూరమునందు; ఉత్సృజ్య = విడిచి; శక్రతుల్యపరాక్రమః = దేవేంద్రునితో సమానమయిన పరాక్రమముగల; వాలీ=వాలి; హతః= వధింపఁబడినాఁడు.

పరాక్రమశాలియగు రాముండు, నీయొక్క సంతోషార్థమయి, ఎంతమాత్రము భయంబునొందక, దేవేంద్రుని పరాక్రమమువంటి పరాక్రమము గల వాలిని, వధించివుచ్చెను.

అని, తాత్పర్యము.

సర్వథా ప్రణయాత్ క్రుద్ధో రాఘవో నాత్ర సంశయః
భ్రాతరం సంప్రహితవాన్ లక్ష్మణం లక్ష్మివర్ధనమ్. ౧౨

టీక॥ రాఘవః = రాముఁడు; సర్వథా=అన్నివిధములను; ప్రణయాత్=స్నేహమువలన; క్రుద్ధః = కోపించినవాఁడై; భ్రాతరం=తమ్ముఁడైన; లక్ష్మివర్ధనం = సంపదనువృద్ధిఁబొందించునట్టి; లక్ష్మణం=లక్ష్మణుని; సంప్రహితవాన్=పంపినాఁడు. అత్ర=ఈవిషయమందు; సంశయః=సందేహము; న=లేదు.

అన్నివిధంబులను, రాముండు నీపైఁ బ్రణయకోపంబుపూని, తమ్ముని, సంపదను వృద్ధిఁబొందించునట్టి లక్ష్మణుని నీయొద్దకుఁ బంపియుండునేకాని, వేఱు కాదు; ఈవిషయమునందు ఎంతమాత్రము సందియము లేదు. అని, తాత్పర్యము.

త్వం ప్రమత్తో న జానీషే కాలం కాలవిదాం వర
ఫుల్లసప్తచ్ఛదశ్యామా ప్రవృత్తా తు శరచ్ఛివా. ౧౩

టీక॥ కాలవిదాం=కాలముఁ దెలిసినవారలలో; వర=శ్రేష్ఠుఁడవగు సుగ్రీవుఁడా! త్వం=నీవు; ప్రమత్తః=ఏమఱినవాఁడవై; కాలం=కాలమును; నజానీషే=ఎఱుంగకున్నావు. ఫుల్లసప్తచ్ఛదశ్యామా=వికసించినయేడాకులరఁటిపూలచే నల్లనైన; శివా= మంగళకరమయిన; శరత్ తు=శరదృతువును; ప్రవృత్తా=వచ్చినది.

కాలముఁ దెలిసినవారలలో నుత్తముఁడవగు సుగ్రీవుఁడా! నీవు, ఏమఱియుండుటవలన, నీకుఁగాలము దెలియకున్నది; చకచకఁగా వికసించిన యేడాకు లరఁటిపూలచే నల్లనైన సుందరమయిన శరదృతువుగూడ, వచ్చినది. అని, తాత్పర్యము.

నిర్మలగ్రహనక్షత్రా ద్యౌః ప్రణష్టవలాహకా
ప్రసన్నాశ్చ దిశస్సర్వాస్సరితశ్చ సరాంసిచ. ౧౪

టీక॥ ద్యౌః=ఆకాశము; నిర్మలగ్రహనక్షత్రా= స్వచ్ఛములయిన గ్రహములును నక్షత్రములును గలది; ప్రణష్టవలాహకా=నశించిన మేఘములుగలది.

దిశశ్చ=దిక్కులును; సర్వాః = అన్నియు; సరితశ్చ=నదులును; ప్రసన్నాః= నిర్మలములయినవి. సరాంసిచ=కొలంకులును; ప్రసన్నాని (అధ్యాహృతము)= నిర్మలములయినవి.

ఆకాశమునందు, మేఘములు నశించి, గ్రహములును నక్షత్రములును నిర్మలముగానున్నవి; దిశలును నదులును గొలంకులును ప్రసన్నములయియున్నవి. అని, తాత్పర్యము.

ప్రాప్త ముద్యోగకాలంతు నావైషి హరిపుంగవ
త్వం ప్రమత్త ఇతి వ్యక్తం లక్ష్మణోయ మిహాగతః. ౧౫

టీక॥ హరిపుంగవ= వానరశ్రేష్ఠుండా! త్వం=నీవు; ప్రమత్తః=ప్రమత్తియున్నవాఁడవై; ప్రాప్తం=వచ్చిన; ఉద్యోగకాలంతు = ప్రయత్నసమయమును మాత్రము; నావైషి= ఎఱుంగకున్నావు. ఇతి=ఈకారణమువలన; అయం= ఈ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; ఇహ=ఇచటికి; ఆగతః=వచ్చినాఁడు; వ్యక్తం= స్పష్టము.

వానరోత్తముఁడా! యుద్ధమునకు బ్రయత్నము సేయు సమయమాసన్నమైనను, నీవు ప్రమత్తుఁడవై తెలియకున్నావు కావున, లక్ష్మణుఁడిచటికి వచ్చెను; అని, స్పష్టము. అని, తాత్పర్యము.

ఆర్తస్య హృతదారస్య పరుషం పురుషాంతరాత్
వచనం మర్షణీయం తే రాఘవస్య మహాత్మనః. ౧౬

టీక॥ ఆర్తస్య=దుఃఖితుండగునట్టి; హృతదారస్య= అపహరింపఁబడిన భార్యగలవాఁడునగు; మహాత్మనః = పూజ్యుఁడైనస్వభావముగల; రాఘవస్య= రాముని యొక్క; పురుషాంతరాత్ = ఇతరపురుషునుండి; ఆగతం (అధ్యాహృతము)=వచ్చిన; పరుషం=కఠినమయిన; వచనం=మాట; తే = నీకు; మర్షణీయం=సహింపఁదగినది.

భార్యం గోల్పోయి దుఃఖించుచున్నవాఁడును, నీకుపకారముగాఁ జేసిన మహాత్ముండనఁగు రాముఁడు లక్ష్మణునిచేఁ జెప్పి పంపినమాట పరుషముగానున్నను, నీవు గోపింపక, సహించి యుండవలెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.— రాముని పరుషవచనంబు సహింపవలెననుటకుఁ గారణంబు లెవ్వియని, నీకుపకారముగావిం

స ౩౨

చినవాఁడు కావునను రామునిమాటను నీవు సహింపవలెను; దుఃఖితుండైనపుడు అతని పరుష వచనమును మఱియు సహింపవలెను; అందును భార్యం గోలుపోయి దుఃఖితుండయిన యతని మాటను నీవు మఱి సహింపవలెను; అందును, ఇపుడు రాముఁడు పంపినమనిషి చెప్పఁబోవుచున్నాఁడుగాని, రాముఁడే సాక్షాత్తుగా చెప్పుటలేదు గావునఁ గూడ సహించి యుండవలెను.

కృతాపరాధస్య హి తే నాన్యత్పశ్యామ్యహం క్షమమ్
అంతరేణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్. ౧౭

టీక॥ అహం = నేను; కృతాపరాధస్య = చేయఁబడిన యపరాధముగల; తే = నీకు; అంజలిం = చేమోడ్పును; బద్ధ్వా = కట్టి; లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క; ప్రసాదనాత్ = ఊఱడించుటను విడిచి; అన్యత్ = ఇతరమయిన; క్షమం = యోగ్యమయిన కార్యమును; న పశ్యామి హి = చూడనుగదా!

సంకేతకాలము దప్పుటవలన నపరాధము గావించినవాఁడవైన నీవు, చేమోడ్పుగీలించి లక్ష్మణుని వేడుకొని ప్రసన్నుంగావింపవలసినదేకాని మఱియొకటి యుక్తమయినయుపాయము నాకు వేఱేతోఁచలేదు. అని, తాత్పర్యము.

నియుక్తైర్మంత్రిభిర్వాచ్యో హ్యవశ్యం పార్థివో హితమ్
అతఏవ భయం త్యక్త్వా బ్రవీమ్యవధృతం వచః. ౧౮

టీక॥ పార్థివః = రాజు; నియుక్తైః = నియోగింపఁబడిన; మంత్రిభిః = మంత్రులచేత; అవశ్యం = తప్పక; హితం = మేలుగలిగించుమాట; వాచ్యో హి = చెప్పఁదగినవాఁడుగదా! అతఏవ = ఇందువలననె; భయం = వెఱపును; త్యక్త్వా = విడిచి; అవధృతం = నిశ్చితమయిన; వచః = మాటను; బ్రవీమి = చెప్పుచున్నాను.

రాజనియుక్తులగు మంత్రులు, రాజునకు అవశ్యము హితంబు బోధింపవలెను గావున, నేనిపుడు రాజభయంబువదలి, నాకుఁదోఁచినహితమును నిశ్చితము గాఁజెప్పుచున్నాను. అని, తాత్పర్యము.

అభిక్రుద్ధస్సమర్థో హి చాపముద్యమ్య రాఘవః

స ౩౨

స దేవాసురగంధర్వం వశే స్థాపయితుం జగత్. ౧౯

టీక ॥ రాఘవః=రాముఁడు; అభిక్రుద్ధః=కోపించినవాఁడై; చాపం=ధనుస్సును; ఉద్యమ్య= ఎత్తి; సదేవాసురగంధర్వం = దేవతలతోను అసురులతోను గంధర్వులతోను గూడిన ; జగత్=ప్రపంచమును; వశే=అధీనతయందు; స్థాపయితుం= ఉంచుటకు; సమర్థో హి=శక్తుఁడుగదా!

రాముండు, కోపించినచో, ధనుర్ధరుండై, దేవాసుర గంధర్వ సహితంబుగాఁ బ్రపంచంబునంతయుఁ దనస్వాధీనము చేసికొనఁగలఁడుగదా!

అని, తాత్పర్యము.

న స క్షమః కోపయితుం యః ప్రసాద్యః పున ర్భవేత్
పూర్వోపకారం స్మరతా కృతజ్ఞేన విశేషతః. ౨౦

టీక ॥ యః=ఎవఁడు; ప్రసాద్యః=ఓలిఁడింపఁదగినవాఁడు; భవేత్=అగునో; సపునః=అతఁడుమాత్రము; విశేషతః=విశేషించి; పూర్వోపకారం=మునుపటియుపకారమును; స్మరతా=తలంచుచున్న; కృతజ్ఞేన = తనకుఁజేయఁబడినయుపకారమునుమఱవనివానిచేత; కోపయితుం=కోపింపఁజేయుటకు; క్షమః=తగినవాఁడు; న=కాఁడు.

ఎవ్వఁడు కుపితుండయినపుడు, ప్రసన్నుఁడుగాఁ జేయఁదగినవాఁడో, అట్టి బలవంతునికి, కోపము గలిగింపరాదు; అందువిశేషించి, అతనివలన నుపకారమునుబొంది కృతజ్ఞుఁడైనవాఁడు, ఎంతమాత్రము గలిగింపరాదు.

అని, తాత్పర్యము.

తస్య మూర్ధ్నా ప్రణమ్య త్వం సపుత్త్రః ససుహృజ్జనః
రాజం స్తిష్ఠ స్వసమయే భర్తు ర్భార్యేవ తద్వశః. ౨౧

టీక ॥ రాజన్ = వానరరాజా! త్వం=నీవు; సపుత్త్రః = కొడుకుతోఁగూడినవాఁడవై; ససుహృజ్జనః = బంధుజనముతోఁగూడినవాఁడవై; తస్య=ఆరామునకు; మూర్ధ్నా=శిరసుచేత; ప్రణమ్య=నమస్కరించి; భర్తుః=పెనిమిటికి; భార్యేవ=పెండ్లామువలెనె; తద్వశః=అతనియధీనుఁడవై; స్వసమయే=

నీప్రతిజ్ఞ యందు; తిష్ఠ=ఉండుము.

వానరరాజా! నీవిపుడు, నీపుత్ర మిత్రులను బంధుజనులతోనుంగూడ నతని కైవసమునకరించి, చెనిమిటియధీనయయి, భార్యయుండునట్లు, నీవు అతని యధీనుండవై, నీప్రతిజ్ఞను నెఱవేర్పుము.

అని, తాత్పర్యము.

న రామరామానుజశాసనం త్వయా
కపీంద్ర యుక్తం మనసా వ్యపోహితుమ్
మనో హి తే జ్ఞాస్యతి మానుషం బలం
సరాఘవస్యాస్య సురేంద్రవర్చసః. ౨౨

టీక॥ కపీంద్ర=వానరరాజా! త్వయా= నీచేత; రామరామానుజశాసనం= రామునియొక్కయు రామునితమ్ముఁడయిన లక్ష్మణునియొక్కయు ఆజ్ఞను; మనసాపి= మనసుచేతనుగూడ; అపోహితుం=అతిక్రమించుటకు; నయుక్తం=సరికాదు. తే= నీయొక్క; మనః=మనస్సు; సురేంద్రవర్చసః=దేవేంద్రునియొక్క కాంతివంటికాంతిగల; సరాఘవస్య=లక్ష్మణునితోఁగూడిన; అస్య=ఈరామునియొక్క; మానుషం= మనుష్యసంబంధియగు; బలం=బలిమిని; జ్ఞాస్యతిహి = ఎఱుంగునుగదా!

వానరరాజా! నీవు రామునిమాటను గాని లక్ష్మణునిమాటను గాని మనస్సునైనను ఎంతమాత్ర మతిక్రమించుట యుక్తము కాదు; దేవేంద్రసమానుండగు రామునియొక్కయు లక్ష్మణునియొక్కయు, దివ్యాస్త్ర బలంబుమాత్ర మెగాక, స్వాభావికమయిన దేహబలంబునుగూడ నీమనసునకుం దెలిసియె యున్నదిగదా! అని, హనుమంతుండు, సుగ్రీవునకుం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ద్వాత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండద్వాత్రింశసర్గటీక, ముగిసినది.

శ్రీః

# త్రయస్త్రింశ సర్గ ప్రారంభః.

అథ ప్రతిసమాదిష్టో లక్ష్మణః పరవీరహా
ప్రవివేశ గుహాం ఘోరాం కిష్కింధాం రామశాసనాత్. ౧

టీక ॥ అథ = అటుపిమ్మట; రామశాసనాత్=రామునియాజ్ఞవలన; పరవీరహా= శత్రువీరులవధించునట్టి; లక్ష్మణః= లక్ష్మణుండు; ప్రతిసమాదిష్టః= మఱలఁబిలువఁబడినవాఁడై; ఘోరాం= భయంకరమయిన; గుహాం=గుహాకారమయిన; కిష్కింధాం=కిష్కింధను; ప్రవివేశ=చొచ్చెను.

అంత, రామునియాజ్ఞవలన, శత్రువీరహంతయగు లక్ష్మణుండు, అంగదుండు సుగ్రీవునియొద్దకుఁ బోయి మఱలవచ్చిపిలువ, భయంకరమయినగుహాకారమగు కిష్కింధానగరముఁ బ్రవేశించెను. అని, తాత్పర్యము.

ద్వారస్థా హరయ స్తత్ర మహాకాయా మహాబలాః
బభూవు ర్లక్ష్మణం దృష్ట్వా సర్వే ప్రాంజలయ స్థితాః. ౨

టీక ॥ తత్ర = అచట; మహాకాయాః = గొప్పమేనుగలవారలును; మహాబలాః = అధికమయిన బలముగలవారలునగు; ద్వారస్థాః = వాకిటనున్న; హరయః = వానరులు; సర్వే= అందఱును; లక్ష్మణం = లక్ష్మణుని; దృష్ట్వా=చూచి; ప్రాంజలయః= మంచి చేమోడ్పుగలవారలయి; స్థితాః=నిలుచున్నవారలు; బభూవుః=అయిరి.

మహాకాయులును మహాబలశాలులునగు నచట వాకిటఁ గావలియున్న వానరులు, లక్ష్మణుంజూచి, యెందఱును చేతులుమోడ్చుకొని నిలుచుండిరి.

అని, తాత్పర్యము.

నిశ్శ్వసంతం తు తం దృష్ట్వా క్రుద్ధం దశరథాత్మజమ్
బభూవు ర్హరయ స్త్రస్తా న చైనం పర్యవారయన్. ౩

టీక ॥ హరయః = వానరులు; క్రుద్ధం =కోపించినవాఁడును; నిశ్శ్వసంతం

స 33

తం = నిట్టూర్పులువిడుచుచున్నవాఁడు నగు; తం=అ; దశరథాత్మజం=దశరథమహారాజు కొడుకైన లక్ష్మణుని; దృష్ట్వాతు=చూచినంతనే; త్రస్తాః=భయపడినవారలు; బభూవుః= అయిరి. ఏనం = ఈలక్ష్మణుని; నచపర్యవారయన్=పరివేష్టింపనైరి.

అవ్వానరులు, కుపితుండై నిట్టూర్పులనిగుడించుచున్న దశరథపుత్త్రు లక్ష్మణుంజూచి, భయపడినవారలయి, యతని సమీపంబునకుఁబోవఁజాలరైరి.

అని, తాత్పర్యము.

స తాం రత్నమయీం శ్రీమాన్ దివ్యాం పుష్పితకాననామ్
రమ్యాం రత్నసమాకీర్ణాం దదర్శ మహతీం గుహామ్. ४
హర్మ్యప్రాసాదసంబాధాం నానాపణ్యోపశోభితామ్
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితామ్. ५
దేవగంధర్వపుత్త్రైశ్చ వానరైః కామరూపిభిః
దివ్యమాల్యాంబరధరై శ్శోభితాం ప్రియదర్శనైః. ६
చందనాగరుపద్మానాం గంధై స్సురభిగంధినామ్
మైరేయాణాం మధూనాంచ సమ్మోదిత మహాపథామ్. ७

టీక ॥ శ్రీమాన్ = కాంతిమంతుండగు; సః = ఆలక్ష్మణుండు; రత్నమయీం = మణివికారమయినదియు; దివ్యాం=శ్రేష్ఠమును; పుష్పితకాననాం= పూచినయడవులుగలదియు; రమ్యాం= సుందరమును; రత్నసమాకీర్ణాం = మణులచే వ్యాపింపఁబడినదియు; హర్మ్యప్రాసాద సంబాధాం = ధనికుల యిండ్లచేతను దేవగృహములచేతను నిండినదియు; నానా పణ్యోపశోభితాం = నానావిధములయిన యంగళ్లచేఁ బ్రకాశించుచున్నదియు; సర్వకామఫలైః = సమస్తములయిన కోరఁబడిన ఫలములు గలవియు; పుష్పితైః = పూచినవియునగు; వృక్షైః= చెట్లచేత; ఉపశోభితాం = ప్రకాశించుచున్నదియు; దేవగంధర్వపుత్త్రైః= దేవతల యొక్కయు గంధర్వుల యొక్కయుఁ గొడుకులయిన వారలును; కామరూపిభిః = ఇచ్ఛాధీనమగు రూపముగలవారలును; దివ్యమాల్యాంబరధరైః=శ్రేష్ఠములయిన పుష్పమాలికలను వస్త్రములనుధరించినవారలును; ప్రియదర్శనైః=సంతోషకరంబుగు చూడ

టగలవారలునగు; వానరైశ్చ=వానరులచేతను; శోభితాం = ప్రకాశించుచున్నదియు; సురభిగంధినాం=రమణీయమయినవాసనగల; చందనాగరుపద్మానాం=చందనముయొక్కయు అగరువుయొక్కయు పద్మములనువిలేపనద్రవ్యముయొక్కయు; మైరేయాణాం=ఆరెపువ్వు కడుగునీళ్లు బెల్లమువీనితోఁజేసిన మద్యములయొక్కయు; మధూనాంచ=ఇప్పపువ్వుతోఁ జేసిన మద్యములయొక్కయు; గంధైః = వాసనలచేత;గన్ధాదితమహాపథాం=వాసనగల రాజమార్గములుగలదియునగు;మహతీం=గొప్పదైన; గుహాం=కిష్కింధను; దదర్శ=చూచెను.

శ్రీమంతుండగులక్ష్మణుండు,రత్నములతోఁగట్టఁబడినదియుఁ, బుష్పించిన వనంబులుగలదియు, రమణీయంబును, ఆపణంబులంమునిండియున్న మణులుగలదియు, ధనికగృహంబులచేతను దేవాలయంబులచేతనునిండియున్నదియు నానావిధములయిన యాపణంబులతోనొప్పుచున్నదియు ఉత్తమములయిన ఫలంబులుగల ఫలవృక్షముల చేతను బుష్పితంబులగు పుష్పవృక్షముల చేతను శోభిల్లుచున్నదియు దేవతలకు గంధర్వులకు జన్మించినవారలును గామరూపులును దివ్యంబులగు పుష్పమాలికలును వస్త్రంబులుదాల్చి చూపరులకు సంతోషంబుసేయుచున్నవారలునగు వానరులచేఁబ్రకాశించుచున్నదియు, మంచి వాసనగల చందనము అగరు పద్మము మొదలగు విలేపనద్రవ్యములయొక్కయు ఆరెపువ్వు బెల్లముకడుగునీళ్లువీనితోఁజేసినమద్యములయొక్కయు, ఇప్పపువ్వుతోఁజేసినమద్యములయొక్కయు సుగంధంబుచేగుబాళించుచున్న రాజమార్గంబులు గలదియు నగు, విశాలమయిన కిష్కింధానగరమునుంజూచెను.

అని, తాత్పర్యము.

దదర్శ గిరినద్యశ్చ విమలా స్తత్ర రాఘవః

**టీ॥** రాఘవః = లక్ష్మణుఁడు; తత్ర=ఆకిష్కింధయందు; విమలాః=స్వచ్ఛములయిన; గిరినద్యశ్చ(గిరినదీశ్చ)=పర్వతనదులను; దదర్శ=చూచెను.

ఆ కిష్కింధయందు, లక్ష్మణుండు, స్వచ్ఛజలముగల పర్వతనదులనుం జూచెను. అని, తాత్పర్యము.

**అంగదస్య గృహం రమ్యం మైందస్య ద్వివిదస్యచ. ౭**

స. 33

గవయస్య గవాక్షస్య గజస్య శరభస్యచ
విద్యున్మాలేశ్చ సంపాతే స్సూర్యాక్షస్య హనూమతః. ౯
వీరబాహో స్సుబాహోశ్చ నళస్య సుమహాత్మనః
కుముదస్య సుషేణస్య తారజాంబవతో స్తథా. ౧౦
దధివక్త్రస్య నీలస్య సుపాటలసునేత్రయోః

టీక॥ సః(అధ్యాహృతము) = ఆల క్ష్మణుఁడు; అంగదస్య= అంగదునియొక్క; రమ్యం = సుందరమయిన; గృహం=ఇంటిని; మైందస్య = మైందునియొక్కయు; ద్వివిదస్యచ = ద్వివిదునియొక్కయు; గవయస్య = గవయునియొక్కయు; గవాక్షస్య = గవాక్షునియొక్కయు; గజస్య= గజునియొక్క; శరభస్యచ=శరభునియొక్కయు;విద్యున్మాలేః= విద్యున్మాలియొక్కయు; సంపాతేః=సంపాతియొక్కయు;సూర్యాక్షస్య=సూర్యాక్షునియొక్కయు; హనూమతః= హనుమంతునియొక్కయు; వీరబాహోః = వీరబాహునియొక్కయు; సుబాహోశ్చ=సుబాహువుయొక్కయు; మహాత్మనః= అధికమయిన ప్రభావముగల; నళస్యచ= నళునియొక్కయు; కుముదస్య = కుముదునియొక్కయు; సుషేణస్య = సుషేణునియొక్కయు; తథా=అట్లు; తారజాంబవతోః=తారునియొక్కయు జాంబవంతుయొక్కయు; దధివక్త్రస్య=దధివక్త్రునియొక్కయు; నీలస్య= నీలునియొక్కయు; సుపాటలసునేత్రయోః= సుపాటలుని యొక్కయు సునేత్రునియొక్కయు; గృహాణి(అధ్యాహృతము)=ఇండ్లను; దదర్శ(అధ్యాహృతము)= చూచెను.

లక్ష్మణుండు, రమణీయమయినఅంగదుని గృహంబును మైందుని నికేతనంబును ద్వివిదుని వాసస్థానంబును గవయుని గేహంబును గవాక్షునిమందిరంబును గజుని వేశ్మమును శరభునియాలయంబును, విద్యున్మాలిసద్మంబును సంపాతియగారంబునుసూర్యాక్షుని హర్మ్యంబును హనుమంతుని భవనంబును వీరబాహునిస్థానంబును సుబాహుని గృహంబును మహాప్రభావుండగు నళుని యాలయంబును కుముదుని సదనంబును సుషేణుని గేహంబును తారజాంబవంతులహర్మ్యంబులును దధివక్త్రుని గృహంబును నీలుని. మఱియు సుపాటలసునేత్రులలోఁగిళ్లను, జూచెను.

అని, తాత్పర్యము.

ఏతేషాం కపిముఖ్యానాం రాజమార్గే మహాత్మనామ్. ౧౧
దదర్శ గృహముఖ్యాని మహాసారాణి లక్ష్మణః
పాండురాభ్రప్రకాశాని దివ్యమాల్యయుతానిచ. ౧౨
ప్రభూతధనధాన్యాని స్త్రీరత్నైశ్శోభితానిచ

టీక ॥ లక్ష్మణః = లక్ష్మణుఁడు; రాజమార్గే = రాజమార్గమునందు; మహాత్మనాం = అధికమయిన పరాక్రమముగల; ఏతేషాం = ఈ; కపిముఖ్యానాం= వానరశ్రేష్ఠులయొక్క; మహాసారాణి = అధికమయిన బలముగలవియు; పాండురాభ్రప్రకాశాని= తెల్లని మేఘములయొక్క కాంతివంటి కాంతిగలవియు; దివ్యమాల్యయుతానిచ = శ్రేష్ఠములయిన పుష్పమాలికలతోఁగూడినవియు; ప్రభూతధనధాన్యాని= అధికమయిన ధనమును ధాన్యము గలవియు; స్త్రీరత్నైః=ఉత్తమస్త్రీలచేతఁ; శోభితానిచ = ప్రకాశించుచున్నవియు నగు; గృహముఖ్యాని = ఉత్తమములయినగృహములను;దదర్శ=చూచెను.

మహాపరాక్రమశాలులగు ఈవానరోత్తములయొక్క, అధికమయిన దార్ఢ్యముగలవియు తెల్లని మేఘంబులువలెఁబ్రకాశించుచున్నవియు నుత్తమంబులగు పూలమాలికలచేనలంకరింపఁబడినవియు, అధికముగా ధనధాన్యములచేనిండినవియు నుత్తమస్త్రీలచే నొప్పుచున్నవియునగు నీ యుత్తమగృహంబులను, లక్ష్మణుండు, రాజమార్గంబునం జూచెను. అని,తాత్పర్యము.

పాండురేణ తు సాలేన పరిక్షిప్తం దురాసదమ్. ౧౩
వానరేంద్రగృహం రమ్యం మహేంద్రసదనోపమమ్

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆ లక్ష్మణుఁడు;పాండురేణ = తెల్లనైన; సాలేన = ప్రాకారముచేతను; పరిక్షిప్తం=చుట్టుఁబడినదియు; దురాసదం= పొందనలవిగానిదియు; రమ్యం= సుందరమును; మహేంద్రసదనోపమం= దేవేంద్రుని యింటితోఁ బోలికగలదియు నగు; వానరేంద్రగృహంతు=వానరరాజయిన సుగ్రీవుని యింటినిగూడ; దదర్శ = చూచెను.

అంత, చుట్టును తెల్లని ప్రాకారంబు గలదియుఁ బ్రవేశింప నలవిగానిది

యు రమణీయంబును దేవేంద్రుని గృహంబువలె నున్నదియునగు వానరరాజు సుగ్రీవుని గృహమును, లక్ష్మణుండు గాంచెను. అని, తాత్పర్యము.

శుక్లైః ప్రాసాదశిఖరైః కైలాసశిఖరోపమైః. ౧౪
సర్వకామఫలై ర్వృక్షైః పుష్పితై రుపశోభితమ్
మహేంద్రదత్తై శ్శ్రీమద్భి ర్నీలజీమూతసన్నిభైః. ౧౫
దివ్యపుష్పఫలై ర్వృక్షై శ్శీతచ్ఛాయై ర్మనోరమైః
హరిభి స్సంవృతద్వారం బలిభి శ్శస్త్రపాణిభిః. ౧౬
దివ్యమాల్యావృతం శుభ్రం తప్తకాంచనతోరణమ్
సుగ్రీవస్య గృహం రమ్యం ప్రవివేశ మహాబలః. ౧౭
అవార్యమాణ స్సౌమిత్రి ర్మహాభ్ర మివ భాస్కరః

టీక॥ మహాబలః=అధికమయినబలముగల; సౌమిత్రిః = లక్ష్మణుడు; శుక్లైః = తెల్లనివియు; కైలాసశిఖరోపమైః=కైలాసపర్వతముయొక్క శృంగములతోఁబోలిక గలవియునగు; ప్రాసాదశిఖరైః = మేడలయొక్క శిఖరములచేతను; సర్వకామఫలైః=సమస్తములునుకోరఁబడిన ఫలములు గలవియు; పుష్పితైః=పూచినవియునగు; వృక్షైః= చెట్లచేతను; మహేంద్రదత్తైః=దేవేంద్రునిచే నియ్యఁబడినవియు; శ్రీమద్భిః= కాంతిమంతములును; నీలజీమూతసన్నిభైః=నల్లనిమేఘములతో సమానములును; దివ్యపుష్పఫలైః= స్వర్గమునందలి పూలునుబండ్లును గలవియు; శీతచ్ఛాయైః=చల్లనినీడగలవియు; మనోరమైః= రమణీయములునగు; వృక్షైః=చెట్లచేతను; ఉపశోభితం = ప్రకాశించుచున్నదియు; బలిభిః= అధికమయినబలముగలవారలును; శస్త్రపాణిభిః= ఆయుధములుచేతులంగలవారలునగు; హరిభిః = వానరులచేత; సంవృతద్వారం=అడ్డగింపఁబడినవాకిలిగలదియు; దివ్యమాల్యావృతం=ఉత్తమములయిన పుష్పమాలికలచేతఁగప్పఁబడినదియు; శుభ్రం= తెల్లనిదియు; తప్తకాంచనతోరణం= కాఁచఁబడినబంగారుతలవాకిలిగలదియు; రమ్యం=సుందరమునగు; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; గృహం= ఇంటిని; అవార్యమాణః = అడ్డగింపఁబడనివాఁ

స 33

శ్రైః మహాభ్రం = గొప్పమేఘమును; భాస్కరఇవ=సూర్యుఁడువలెఁ ప్రవివే శ=చొచ్చెను.

మహా బలశాలియగు లక్ష్మణుండు, కైలాసశిఖరంబులంబోలిన తెల్లని ప్రాసాదశిఖరంబులతో నొప్పుచున్నదియు, ఉత్తమ ఫలప్రదంబులగు సమస్తఫలవృక్షములతో నుబుష్పితంబులగుపుష్పవృక్షములతో నుంగూడినదియు, మఱియు దేవేంద్రుండొసంగిన,శ్రీమంతంబులును మేఘములువలె నల్లగా విశాలములైనవియు దివ్యంబులగుపుష్పంబులును ఫలంబులును గలవియు జల్లని నీడతోఁగూడినవియు మనోహరంబులునగు దేవవృక్షంబులచేఁ బ్రకాశించుచున్నదియు, వాకిటద్వారపాలురగు ఆయుధపాణులగు న బలవంతులయిన వానరవీరులచే రక్షితంబును దివ్యంబులగు మాల్యములచే నలంకృతంబును ధవళవర్ణంబును ఉత్తమమయిన బంగారముతోఁ జేయఁబడిన తలవాకిలితో నొప్పుచున్నదియు రమణీయంబునగు సుగ్రీవునిగృహంబులోనికి, ద్వారపాలురచే నివారింపఁబడనివాఁడై, సూర్యుఁడు మహామేఘంబుఁ జొచ్చునట్లు, ప్రవేశించెను.

అని, తాత్పర్యము.

స సప్త కక్ష్యా ధర్మాత్మా నానాజనసమాకులాః । ౧౮
ప్రవిశ్య సుమహద్గుప్తం దదర్శాంతఃపురం మహత్
హైమరాజతపర్యంకై ర్బహుభి శ్చ వరాసనైః । ౧౯
మహార్హాస్తరణోపేతై స్తత్రతత్రో పశోభితమ్

టీక ॥ ధర్మాత్మా=ధర్మస్వభావుఁడగు; సః= ఆలక్ష్మణుఁడు; నానాజనసమాకులాః= నానావిధులయినజనులచేనిండిన; సప్త=ఏడైన; కక్ష్యాః=లోట్టికట్లను; ప్రవిశ్య = చొచ్చి; సుమహత్=మిక్కిలియు; గుప్తం=రక్షింపఁబడినదియు; హైమరాజతపర్యంకైః = బంగారు వికారములును వెండివికారములునగు మంచములచేతను; బహుభిః=పెక్కులగు; మహార్హాస్తరణోపేతైః=ఉత్తమములయిన యాస్తరణములతోఁగూడిన; వరాసనైశ్చ=శ్రేష్ఠములయినయాసనములచేతను;తత్రతత్ర=అచటచట; ఉపశోభితం= ప్రకాశించుచున్నదియునగు; మహత్= విశాలమునగు; అంతఃపురం=అంతఃపురమును;దదర్శ=చూచెను.

ధర్మాత్ముఁడగు లక్ష్మణుఁడు, నానా

విధులయిన జనులతోనిండిన మేడలతో ట్టికట్లను అతిక్రమించి, యిచటచట, బం గారుసుంచంబులతోను వెండిమంచంబు లతోను ఉత్తమాస్తరణములు పఱచిన పెక్కులయిన యుత్తమాసనంబులతో నుంగూడి రమణీయంబయినసురక్షితం బును విశాలంబునగు నంతఃపురంబుఁ గాంచెను. అని, తాత్పర్యము.

ప్రవిశన్నేవ సతతం శుశ్రావ మధురస్వరమ్. ౨౦
తంత్రీగీతసమాకీర్ణం సమగీతపదాక్షరమ్

టీక॥ సః=అలక్ష్మణుఁడు; ప్రవిశన్నేవ=ప్రవేశించుచునే; మధురస్వరం=మనోహరమయిన శ్రుతిగలదియు; తంత్రీగీతసమాకీర్ణం = తంత్రీరూపమయిన పాటలచేతవ్యాపింపఁబడినదియు, తంత్రీధ్వనిరూపములయిన పాటలచే వ్యాపింపఁబడినదియు ననుట; సమగీతపదాక్షరం=సమానములయిన గీతములయొక్క పదములును అక్షరములును గలదియు నగు; సతతం = వీణావాద్యమును; శుశ్రావ=వినెను.

అలక్ష్మణుండు, అంతఃపురమునుబ్రవేశించుచునె, మనోహరంబయిన శ్రుతితోఁగూడినదియు తంత్రీధ్వనిరూపము యిన నానావిధ గీతముగలదియు వైషమ్యములేక సమానములయినగీతములపదములును అక్షరములునుగలదియు నగు వీణావాద్యమునువినెను.

అని, తాత్పర్యము.

బహ్వీశ్చ వివిధాకారా రూపయౌవనగర్వితాః. ౨౧
స్త్రియ స్సుగ్రీవభవనే దదర్శ సుమహాబలః

టీక॥ సుమహాబలః= మిక్కిలియు నధికమయిన బలముగల లక్ష్మణుండు; వివిధాకారాః = నానావిధ మయిన యాకారముగలవియు; రూపయౌవన గర్వితాః = సౌందర్యము చేతను జవ్వనము చేతను గర్వించినవారలునగు; స్త్రియశ్చ= స్త్రీలనుం; బహ్వీః = పెక్కండ్రను; సుగ్రీవభవనే = సుగ్రీవునియింటియందు; దదర్శ=చూచెను.

మహాబలుండగులక్ష్మణుండు, సుగ్రీవుని యంతఃపురంబునందు, నానావిధములైన వేషభూషణములచే నొప్పుచున్నవారలును సౌందర్యముచేతను యౌవనముచేతనుగర్వించినవారలునగు స్త్రీ

స ౩౩

కఱ్ఱండ్రను స్త్రీలంజూచెను. అని, తాత్పర్యము.

దృష్ట్వా ఽభిజనసంపన్నా శ్చిత్రమాల్యకృతస్రజః. ౨౨
ఫలమాల్యకృతవ్యగ్రా భూషణోత్తమభూషితాః
నాతృప్తా న్నాపి చావ్యగ్రా న్నానుదాత్తపరిచ్ఛదాన్. ౨౩
సుగ్రీవానుచరాంశ్చాపి లక్షయామాస లక్ష్మణః

టీక ॥ లక్ష్మణః=లక్ష్మణుఁడు;అభిజనసంపన్నాః = కులముతోఁగూడినవారలును; చిత్రమాల్యకృతస్రజః = నానావిధములయిన పుష్పమాలికలచేఁ జేయఁబడిన హారములుగలవారలును; ఫలమాల్యకృతవ్యగ్రాః= పండ్లకొఱకును పుష్పమాలికలకొఱకును వేగిర పడుచున్నవారలును; భూషణోత్తమభూషితాః=ఆభరణశ్రేష్ఠములచేత నలంకరింపఁబడినవారలునగు; వనితాః (అధ్యాహృతము)=స్త్రీలను; దృష్ట్వా = చూచి;నాతృప్తాన్ = తృప్తినొందినవారలును; నావ్యగ్రానపి=వేగిరపాటునొందిన వారలును; నానుదాత్త పరిచ్ఛదాన్= ఉత్తమములయిన వస్త్రాభరణములు గలవారలునగు; సుగ్రీవానుచరాంశ్చాపి=సుగ్రీవుని సేవకులనుగూడ; లక్షయామాస=చూచెను.

లక్ష్మణుండు, సత్కులప్రసూతలును నానావిధమాల్యంబులచేతను ఉత్తమాభరణంబులచేతను అలంకృతలును ఫలంబులుగొనుటయందును బువ్వసరంబులుగట్టుటయందును ఏమఱక ఆసక్తలయియున్నవారలునగు నారీమణులం గాంచి ఫలరత్నధాన్యాములచేఁ దృప్తులయి తమకు నియుక్తములయిన కార్యములందు జాగరూకులయి యుత్తమవస్త్రాభరణాలంకృతులయియున్న సుగ్రీవుని సేవకులం జూచెను.

అని, తాత్పర్యము.

కూజితం నూపురాణాంచ కాంచీనాం నినదం తథా. ౨౪
సన్నిశమ్య తతః శ్రీమాన్ సౌమిత్రి ర్లజ్జితో భవత్

టీక ॥ తతః = అటుపిమ్మట; శ్రీమాన్ = అధికమయినకాంతిగలట్టి; సౌమిత్రిః= లక్ష్మణుఁడు; నూపురాణాం= అందెలయొక్క; కూజితంచ = ధ్వని

ని; తథా=అట్లు; కాంచీనాం = మొలనూళ్లయొక్క; నినదం = ధ్వనిని; సన్నిశమ్య=విని; లజ్జితః= సిగ్గుపడినవాఁడు; అభవత్ = అయ్యెను.

అంత, శ్రీమంతుండగులక్ష్మణుండు, నూపురంబుల ధ్వనియు స్త్రీల మొలనూళ్లను గట్టియున్న గజ్జెల స్వనంబునువిని, (యవియుపరతిని సూచించుటవలన) లజ్జనొందెను. అని, తాత్పర్యము.

రోషవేగప్రకుపిత శ్శ్రుత్వా చాభరణస్వనమ్. ౨౫
చకార జ్యాస్వనం వీరో దిశ శ్శబ్దేన పూరయన్

టీక॥ వీరః=పరాక్రమశాలియగులక్ష్మణుండు; రోషవేగప్రకుపితః=కోపముయొక్క వేగముచే నతిశయించినవాఁడై; ఆభరణస్వనం = భూషణములయొక్క-ధ్వనిని; శ్రుత్వాచ= వినియు; శబ్దేన=ధ్వనిచేత; దిశః=దిక్కులను; పూరయన్=నిండించుచు; జ్యాస్వనం= అల్లెత్రాటియొక్క-ధ్వనిని; చకార=చేసెను.

పరాక్రమవంతుండగులక్ష్మణుండు, స్త్రీల యాభరణ ధ్వనినివిని, అప్పుడుగూడ సుగ్రీవుంతింకను స్త్రీలోలుండైయున్నాఁడని తెలియుటవలనఁ, బరమకుపితుండై, దిశలన్నియు శబ్దముచేఁ బూరించుచు, జ్యాస్వని గావించెను. అని, తాత్పర్యము.

చారిత్రేణ మహాబాహు రపకృష్ట స్స లక్ష్మణః. ౨౬
తస్థా వేకాంత మాశ్రిత్య రామకోపసమన్వితః

టీక॥ రామకోపసమన్వితః = రామునియొక్క కోపముతోఁగూడిన; మహాబాహుః=గొప్పచేతులుగల; సః= ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; చారిత్రేణ= సదాచారముచేత; అపకృష్టః=లాగఁబడినవాఁడై; ఏకాంతం = వివిక్తస్థలమును; ఆశ్రిత్య=పొంది; తస్థౌ = ఉండెను.

రామునకుఁగల్గిన సుగ్రీవునిమీఁదికోపముతోఁగూడిన మహాబాహుండగులక్ష్మణుండు, సదాచారము ననుసరించి, స్త్రీలున్నప్రదేశమును వదలి, యేకాంతంబుననుండెను. అని, తాత్పర్యము.

తేన చాపస్వనే నాథ సుగ్రీవః ప్లవగాధిపః. ౨౭

స ౩౩

విజ్ఞాయాగమనం త్రస్తస్సంచచాల వరాసనాత్

టీక ॥ అథ= అటుపిమ్మట; ప్లవగాధిపః = వానరరాజయిన; సుగ్రీవః= సుగ్రీవుఁడు; తేన=ఆ; చాపస్వనేన = ధనుస్సుయొక్క ధ్వనిచేత; ఆగమనం = (లక్ష్మణుని) రాకను; విజ్ఞాయ = తెలిసి; త్రస్తః= భయపడినవాఁడై; వరాసనాత్= ఉత్తమమయిన యాసనము నుండి; సంచచాల = చలించెను.

అంత, వానరరాజయిన సుగ్రీవుండు, ఆధనుష్టంకారధ్వనిచే లక్ష్మణుండువచ్చెనని తెలిసికొని భయపడి, ఉత్తమాసనమునుండి చలనము నొందెను. అని, తాత్పర్యము.

అంగదేన యథా మహ్యం పురస్తాత్ప్రతివేదితమ్. ౨౮
సువ్యక్త మేష సంప్రాప్త స్సౌమిత్రి ర్భ్రాతృవత్సలః

టీక॥ యథా= ఎట్లు; అంగదేన= అంగదునిచేత; మహ్యం= నాకొఱకు; పురస్తాత్=ముందు; ప్రతివేదితం= చెప్పఁబడినదో; తథా (అధ్యాహృతము)=అట్లు; భ్రాతృవత్సలః = అన్నయందధికప్రీతిగల; ఏషః=ఈ; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; సంప్రాప్తః= వచ్చినాఁడు. సువ్యక్తం= మిక్కిలిస్పష్టము.

పూర్వము నాకు అంగదుఁడు చెప్పినలాగున, అన్నయందు అధిక ప్రీతిగల లక్ష్మణుండిదిగో, వచ్చినాఁడు. అని,సుగ్రీవుండు తెలిసికొనెను.

అని, తాత్పర్యము.

అంగదేన సమాఖ్యాతం జ్యాస్వనేనచ వానరః. ౨౯
బుబుధే లక్ష్మణం ప్రాప్తం ముఖం చాస్య వ్యశుష్యత

టీక॥ వానరః= సుగ్రీవుఁడు; అంగదేన=అంగదునిచేత; సమాఖ్యాతం= చెప్పఁబడిన; లక్ష్మణం = లక్ష్మణుని; ప్రాప్తం=వచ్చినవానిఁగా; జ్యాస్వనేనచ=అల్లెత్రాటియొక్క ధ్వనిచేతను; బుబుధే=తెలిసికొనెను. అస్య= ఈసుగ్రీవునియొక్క; ముఖంచ=నోరుగూడ; వ్యశుష్యత=ఎండెను.

సుగ్రీవుండు,అంగదుఁడుచెప్పినవిధంబుననె లక్ష్మణుండువచ్చెనని, నారియొ

స 33

కంఠధ్వనిచేఁ దెలిసికొనెను; అంత భయంబున నితని నోటిలోని ద్రవముగూడ నెండెను. అని, తాత్పర్యము.

తత స్తారాం హరిశ్రేష్ఠ స్సుగ్రీవః ప్రియదర్శనామ్. ౩౦
ఉవాచ హిత మవ్యగ్ర స్త్రాససంభ్రాంత మానసః

టీక ॥ తతః = అటుపిమ్మట; హరిశ్రేష్ఠః = వానరోత్తముఁడగు; సుగ్రీవః = సుగ్రీవుఁడు; అవ్యగ్రః= ఏమఱుపాటు లేనివాఁడై; త్రాససంభ్రాంతమానసః = భయముచేఁదొట్రుపాటునొందిన మనస్సుగలవాఁడై; ప్రియదర్శనాం = సంతోషకరమయిన చూచుటగల; తారాం = తారనుగూర్చి; హితం = మేలుగలిగించునట్టిమాటను; ఉవాచ=పలికెను.

అంత, వానరశ్రేష్ఠుండగు సుగ్రీవుండు, ఏమఱుపాటులేనివాఁడై, భయంబునమనంబుదొట్రుపాటునొందఁ, జూపరులకుఁ బ్రియంబుగలిగించునట్టి తారంజూచి, తనకు హితమగువిధంబున, నిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

కిన్ను తత్కారణం సుభ్రు ప్రకృత్యా మృదుమానసః. ౩౧
సరోషఇవ సంప్రాప్తో యేనా యం రాఘవానుజః

టీక॥ సుభ్రు=సుందరములయిన కనుబొమలుగలతారా! ప్రకృత్యా=స్వభావముచేత; మృదుమానసః=మెత్తనిమనసుగల; అయం= ఈ; రాఘవానుజః= రామునితమ్ముఁడయినలక్ష్మణుఁడు; యేన = దేనిచేత; సరోషఇవ= కోపముతోఁగూడిన వాఁడువలె; సంప్రాప్తః=వచ్చినాఁడో;తత్ =అ; కారణం= హేతువు; కిన్ను=ఏది?

సుందరములయిన కనుబొమలుగల తారా! రామునితమ్ముఁడయిన యీలక్ష్మణుండు, స్వభావంబున మృదువైన హృదయము గలవాఁడు; అట్టివాఁడిపుడు కుపితుండైవచ్చినట్లున్నాఁడే; ఇందుకుఁగారణమేమి? అని, తాత్పర్యము.

కిం పశ్యసి కుమారస్య రోషస్థాన మనిందితే. ౩౨
న ఖల్వ కారణే కోప మాహరే న్నరసత్తమః

స ౩౩

టీక॥ అనిందితే=నిందింపఁబడని తారా! కుమారస్య = లక్ష్మణుని యొక్క; రోషస్థానం=రోషకారణమును; కిం=దేనిని; పశ్యసి=చూచుచున్నావు? నరోత్తమః = పురుషశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడు; అకారణే=కారణము లేకయుండఁగా; కోపం = కోపమును; నాహరేత్ = పొందఁడు గదా!

సద్గుణసంపన్నురాలవగు తారా! లక్ష్మణునికిఁ గోపము గలుగుటకుఁ గారణ మేమని నీకుఁ దోఁచుచున్నది? కారణము లేకయే పురుషోత్తముఁడు లక్ష్మణుఁడు కోపంబునొందఁడు. అని, తాత్పర్యము.

యదస్య కృత మస్మాభి ర్బుధ్యసే కించి దప్రియమ్. ౩౩
త ద్బుద్ధ్వా సంప్రధార్యాశు క్షిప్ర మర్హసి భాషితుమ్

టీక॥ అస్మాభిః=మాచేత; అస్య=ఈలక్ష్మణునకు; యత్=ఏది; కృతం=చేయఁబడినదో; తత్ (అధ్యాహృతము) = అట్టి; అప్రియం=కోపము గలిగించు కార్యమును; కించిత్=కొంచెమేని; బుధ్యసే=ఎఱుంగుదువా? తత్=దానిని; ఆశు=శీఘ్రముగా; బుద్ధ్వా= బుద్ధిచేత; సంప్రధార్య = నిశ్చయించి; క్షిప్రం=శీఘ్రముగా; భాషితుం=చెప్పుటకు; అర్హసి=తగుదువు.

నేనేమైనను, ఈలక్ష్మణునకప్రియము గావించినట్లు నీకు జ్ఞాపకమున్నదా? నీవు, శీఘ్రముగా బుద్ధిచే దానినాలోచించి నాకుఁ జెప్పుము. అని, తాత్పర్యము.

అథవా స్వయమేవైనం ద్రష్టు మర్హసి భాషితుమ్. ౩౪
వచనై స్సాంత్వయుక్తైశ్చ ప్రసాదయితు మర్హసి

టీక॥ అథవా= అటుగాదేని; స్వయమేవ=నీవై యే; ఏనం = ఈలక్ష్మణుని; ద్రష్టుం = చూచుటకు; భాషితుం= మాటలాడుటకు; అర్హసి= తగుదువు. సాంత్వయుక్తైః = మంచితనముతోఁ గూడిన; వచనైః=మాటలచేత; ప్రసాదయితుంచ = ఆశ్వాసించుటకును; అర్హసి=తగుదువు.

అంతకన్నను, నీవే లక్ష్మణుని యొద్దకుఁబోయి, యతనిఁజూచి మాటలాడి మంచిమాటలచే నతనిఁ బ్రసన్నుంగావింపుము. అని, తాత్పర్యము.

త్వద్దర్శనవిశుద్ధాత్మా న స కోపం కరిష్యతి. ౩౫
నహి స్త్రీషు మహాత్మానః క్వచి త్కుర్వంతి దారుణమ్

టీక ॥ త్వద్దర్శనవిశుద్ధాత్మా = నీయొక్క చూచుటచేఁ బ్రసన్నమయినమనస్సుగల; సః = ఆలక్ష్మణుఁడు; కోపం = కినుకను; నకరిష్యతి = చేయఁడు; క్వచిత్ = ఎందును; మహాత్మానః = పూజ్యమయినస్వభావముగలవారలు; స్త్రీషు = స్త్రీలయందు; దారుణం = భయంకరమయినకార్యమును; నకుర్వంతిహి = చేయరుగదా!

గొప్పవారలు ఎప్పుడును స్త్రీలయందుఁ గోపంబుఁజూపరుకావున, లక్ష్మణుండు, నిన్నుఁజూచినంతనె, ప్రసన్నుండగుఁగాని కోపంబునొందఁడు. అని, తాత్పర్యము.

త్వయా సాంత్వై రుపక్రాంతం ప్రసన్నేంద్రియమానసమ్. ౩౬
తతః కమలపత్రాక్షం ద్రక్ష్యామ్యహ మరిందమమ్

టీక ॥ తతః = అటుపిమ్మట; అహం = నేను; త్వయా = నీచేత; సాంత్వైః = మంచిమాటలత; ఉపక్రాంతం = ప్రారంభింపఁబడినవాఁడును; ప్రసన్నేంద్రియమానసం = కోపముడిగిన యింద్రియములు మనస్సునుగలవాఁడును; కమలపత్రాక్షం = తామర పూరేకులవంటి కన్నులుగలవాఁడునగు; అరిందమం = శత్రువుల నడఁగఁద్రొక్కునట్టి లక్ష్మణుని; ద్రక్ష్యామి = చూచెదను.

నీవు, లక్ష్మణుని సాంత్వవచనంబులఁ బ్రసన్నుంగాఁజేసినపిదప, కమలపత్రంబులంబోలిననయనంబులుగలవాఁడును శత్రువుల నడఁగఁద్రొక్కువాఁడునగు లక్ష్మణుని, నేను జూచెదను. అని సుగ్రీవుండు, తారతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

సా ప్రస్ఖలంతీ మదవిహ్వలాక్షీ
ప్రలంబకాంచీగుణహేమసూత్రా. ౩౭
సలక్షణా లక్ష్మణసన్నిధానం
జగామ తారా నమితాంగయష్టిః

టీక ॥ ప్రస్ఖలంతీ = తొట్రుపడుచున్నదియు; మదవిహ్వలాక్షీ = కైపుచే

స్వాధీనతదప్పిన కన్నులుగలదియు; ప్రలంబకాంచీగుణ హేమసూత్రా = వ్రేలాడుచున్న మొలనూలునుబంగారుమొలత్రాడును గలదియును; సలక్షణా = చిహ్నములతోఁగూడినదియు; నమితాంగయష్టిః = వంగినకట్టెవంటి శరీరముగలదియునగు; సా = ఆ; తారా = తార; లక్ష్మణసన్నిధానం = లక్ష్మణునిసమీపమును; జగామ = పొందెను.

ఆతార, సంభోగవివశయగుటంజేసి తొట్రుపాటుతో నడచుచుఁ, దాన మదంబునం దేలిపోవుచున్న కన్నులుగలదై, మన్మథక్రీడలందు వీడివ్రేలుచాడుచున్న కాంచీగుణంబును బంగారుమొలత్రాడునుగలదై, సంభోగచిహ్నంబులతోనొప్పుచు, స్తనభారంబువలనఁగొంచెమువంగినశరీరముతో, లక్ష్మణునిసమీపంబునకుఁబోయెను. అని, తాత్పర్యము.

స తాం సమీక్ష్యైవ హరీశపత్నీం
తస్థా వుదాసీనతయా మహాత్మా. ౩౮
అవాఙ్ముఖో భూ న్మనుజేంద్రపుత్త్ర
స్త్రీసన్నికర్షా ద్వినివృత్తకోపః

టీక॥ మహాత్మా = పూజ్యమయిన స్వభావముగల; సః = ఆలక్ష్మణుఁడు; తాం = ఆట్టి; హరీశపత్నీం = వానరరాజుయొక్కభార్యయయిన తారను; సమీక్ష్యైవ = చూచినంతనే; ఉదాసీనతయా = ఎందును తగులనివాఁడగుటచేత; తస్థౌ = నిలిచెను. మనుజేంద్రపుత్త్రః = రాచకొమరుఁడైన లక్ష్మణుఁడు; స్త్రీసన్నికర్షాత్ = ఆడుదానియొక్క సాన్నిధ్యమువలన; వినివృత్తకోపః = మరలినకోపముగలవాఁడై; అవాఙ్ముఖః = వంగిన తలగలవాఁడు; అభూత్ = అయ్యెను.

పరమధార్మికుండగు నాలక్ష్మణుండు, అట్లుమదవివశయయి సంభోగచిహ్నంబులతోవచ్చిన వానరరాజభార్యను దారంజూచినంతనే, అమెయొక్క రూపసంపద పానమదము సంభోగరసపారవశ్యంబున వస్త్రము దొలంగియుండుట మొదలగువానియం దెంతమాత్రము మనసుంచక యుదాసీనుండై, స్త్రీసన్నిధి యగుటంజేసి, కోపంబుఁగ్రహించి, తలవంచుకొని యుండెను. అని, తాత్పర్యము.

సా పానయోగా ద్వినివృత్తలజ్జా

దృష్టిప్రసాదాచ్చ నరేంద్రసూనోః. ౩౯
ఉవాచ తారా ప్రణయప్రగల్భం
వాక్యం మహార్థం పరిసాంత్వపూర్వమ్

టీక॥ సా=ఆ; తారా=తార; పానయోగాత్ = త్రాఁగుటతో సంబంధమువలన ; వినివృత్తలజ్జా = మఱలిన సిగ్గుగలదై; నరేంద్రసూనోః = రాజపుత్త్రుఁడగు లక్ష్మణునియొక్క; దృష్టిప్రసాదాచ్చ = చూపుయొక్కప్రసన్నతవలనను; ప్రణయప్రగల్భం = ప్రేమచే ధైర్యముతోఁ గూడినదియు; మహార్థం= అధికమయిన అర్థముగలదియు; పరిసాంత్వపూర్వం= ఊఱడించుటముందుగాఁగలదియునగు; వాక్యం= మాటను; ఉవాచ=పలికెను.

ఆతార, మద్య మందంబునం జేసిన తనయందుఁగలసంభోగచిహ్నదులవలన లజ్జలేనిదై, తానువచ్చినంతనె లక్ష్మణుం డుకోపంబులేకయుండుటవలన, మైత్రీదలంబున, ధైర్యంబుగా, ముందు అతని మంచిమాటలచే బ్రసన్నుంగావించి, అధికమయిన యర్థముగల యీ మాటం జెప్పెను. అని, తాత్పర్యము.

కిం కోపమూలం మనుజేంద్రపుత్త్ర
కస్తే న సంతిష్ఠతి వాఙ్నిదేశే. ౪౦
కశ్శుష్కవృక్షం వన మాపతంతం
దవాగ్ని మాసీదతి నిర్విశంకః

టీక॥ మనుజేంద్రపుత్త్ర = మనుష్యనాథుఁడగు దశరథునికుమారుఁడవయినలక్ష్మణుఁడా! కోపమూలం= కోపముయొక్కకారణము; కిం = ఏమి? కః=ఎవ్వఁడు; తే=నీయొక్క; వాఙ్నిదేశే=నోటియొక్కయాజ్ఞయందు; న సంతిష్ఠతి (సంతిష్ఠతే)= నిలువకున్నాఁడు? కః=ఎవ్వఁడు; నిర్విశంకః=భయములేనివాఁడై; శుష్కవృక్షం= ఎండినచెట్లుగల; వనం = అడవిని; ఆపతంతం=పొందుచున్న; దవాగ్నిం= కారుచిచ్చును; ఆసీదతి=పొందును?

దశరథమహారాజపుత్త్రుఁడవగు లక్ష్మణుఁడా! నీకుఁ గోపంబు గలుగుటకు ఏమికారణము? నీనోటిమాటను ఎవ్వఁడతిక్రమించినాఁడు ? ఎవ్వఁడు, నిర్భ

యముం డై, ఎండిన యడవిం బ్రజ్వలించుచున్న దావానలంబుచెంతకుఁ బోఁగలఁడు? అని, తార, లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

నీయాజ్ఞను మీఱుట దావానలంబుఁ జొచ్చుటవంటిది; తప్పకవినాశంబుగలిగించుచు; నీయాజ్ఞను ఎవరును అతిక్రమింపఁజాలరు; సుగ్రీవుఁడును నీయాజ్ఞ నతిక్రమించినవాఁడు కాఁడు; కావునఁ, బరమ దయాళుఁడవగు నీవిట్లు కోపంబునొందుటకేమి కారణము?

అని, భావము.

స తస్యా వచనం శ్రుత్వా సాంత్వపూర్వ మసంశయమ్. ౪౧
భూయః ప్రణయదృష్టార్థం లక్ష్మణో వాక్య మబ్రవీత్

టీక ॥ సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; తస్యాః=ఆ తారయొక్క; వచనం=మాటను; సాంత్వపూర్వం = ఊరడించుటను; శ్రుత్వా=విని; వాక్యం=మాటను; ముందుగాఁగలదియు; అసంశయం = అబ్రవీత్=చెప్పెను. సందేహము లేనిదియు, కుటిలముగానిదియునగునట్లు; భూయః=మిక్కిలియు; ప్రణయదృష్టార్థం = ప్రీతిచేతఁ జూడఁబడిన ప్రయోజనము గలదియునగు;

తార యిట్లు సాంత్వపూర్వకముగాఁ జెప్పిన నివాసవచనంబును స్నేహయుక్తంబునగు మాటను విని, లక్ష్మణుండిట్లని పలికెను. అని, తాత్పర్యము.

కిమయం కామవృత్త స్తే లుప్తధర్మార్థసంగ్రహః. ౪౨
భర్తా భర్తృహితే యుక్తే న చైన మవబుధ్యసే

టీక॥ భర్తృహితే=పెనిమిటియొక్క మేలునందు; యుక్తే= ఆసక్తురాలవగు తారా! అయం=ఈ; తే = నీయొక్క; పతిః=పెనిమిటి; కామవృత్తిః= మన్మథవ్యాపారముగలవాఁడు. లుప్తధర్మార్థసంగ్రహః=లోపించినధర్మము యొక్కయు అర్థముయొక్కయు సంగ్రహించుటగలవాఁడు. ఏనం చ=వీనిని; నావబుధ్యసే కిం=ఎఱుంగవాయేమి?

పెనిమిటియొక్క హితమునందాసక్తురాలవగు తారా! నీపెనిమిటియగు యీసుగ్రీవుఁడు, మన్మథవ్యాపారంబులందగిలి ధర్మార్థంబులంబాయుచున్నాఁడు; నీవిది తెలియవాయేమి?

అని, తాత్పర్యము.

న చింతయతి రాజ్యార్థం నాస్మాన్ శోకపరాయణాన్. ౪౩
సామాత్యపరిషత్తారే పానమేవోపసేవతే

టీక॥ తారే=తారా! అయం (అధ్యాహృతము) = ఈసుగ్రీవుఁడు; రాజ్యార్థం= రాజ్యరూపమయిన ప్రయోజనమును; నచింతయతి = తలంపఁడు. శోకపరాయణాన్ = దుఃఖమే ముఖ్యమయిన గతిగాఁగల; అస్మాన్ = మమ్ము; న(చింతయతి) = తలంపఁడు. సామాత్యపరిషత్ = మంత్రులయొక్క సమూహముతోఁ గూడినవాఁడై; పానమేవ = త్రాఁగుటనే; ఉపసేవతే = సేవించుచున్నాఁడు.

తారా! సుగ్రీవుఁడు, రాచకార్యమును జూడఁడు; దుఃఖితులమగు మమ్ము గూడఁ దలంపఁడు; మంత్రులుం దానును ఎల్లప్పుడును పానమునే సేవించుచున్నాఁడు. అని, తాత్పర్యము.

స మాసాంశ్చతురః కృత్వా ప్రమాణం ప్లవగేశ్వరః. ౪౪
వ్యతీతాంస్తాన్మదవ్యగ్రో విహరన్నావబుధ్యతే

టీక॥ సః=ఆ; ప్లవగేశ్వరః=వానరరాజునగు సుగ్రీవుఁడు; మాసాన్ = నెలలను; చతురః= నాల్గిటిని; ప్రమాణం=అవధినిగా; కృత్వా=చేసికొని; మదవ్యగ్రః = మైకమునఁదగిలినవాఁడై; విహరన్=క్రీడించుచు; వ్యతీతాన్= కడచిన; తాన్= ఆనాలుగుమాసములను; నావబుధ్యతే=ఎఱుఁగఁడు.

వానరరాజునగు సుగ్రీవుఁడు, యుద్ధసన్నాహమునకు నాలుగు మాసము లవధియుంచుకొనివచ్చి, యిప్పుడు మదలోలుఁడై విహరించుచు, ఆనాలుగు మాసములును గడచినను, దెలియకున్నాఁడు. అని, తాత్పర్యము.

న హి ధర్మార్థసిద్ధ్యర్థం పానమేవం ప్రశస్యతే. ౪౫
పానాదర్థశ్చ ధర్మశ్చ కామశ్చ పరిహీయతే

టీక॥ ధర్మార్థసిద్ధ్యర్థం = ధర్మముయొక్కయు అర్థముయొక్కయు నెఱవేఱుటకొఱకు; యతమానస్య (అధ్యాహృతము) = ప్రయత్నించుచున్న వానికి; ఏవం=ఇట్లు; పానం=త్రాఁగుట; న ప్రశస్యతే హి = ప్రశంసింపఁబడదుగ

దా! పానాత్=త్రాగుటవలన; అర్థశ్చ=అర్థమును; ధర్మశ్చ=ధర్మమును; కామశ్చ=కామమును; పరిహీయతే=విడువఁబడుచున్నది, నశించుచున్నదనుట.

ధర్మార్థంబులు గోలుపోవువాఁడు, ఇట్లు మద్యపానంబునందగిలియుండుట యెంతమాత్రము యుక్తముగాదు; పానంబువలన, అర్థంబును ధర్మంబును నశించుటయగాక పిమ్మటఁ గామంబును నాశంబునొందును. అని, తాత్పర్యము.

ధర్మలోపో మహాంస్తావత్ కృతే హ్యప్రతికుర్వతః. ౨౮
అర్థలోపశ్చ మిత్రస్య నాశే గుణవతో మహాన్

టీక॥ కృతే = చేయఁబడిన యుపకారమువిషయమయి; అప్రతికుర్వతః=ప్రత్యుపకారముచేయనివానికి; ధర్మలోపస్తావత్ = ధర్మముయొక్క లోపము మాత్రము; మహాన్=గొప్పది. గుణవతః=సద్గుణముగల; మిత్రస్య=స్నేహితునియొక్క; నాశే = నశించుటయందు; అర్థలోపశ్చ=అర్థముయొక్క లోపంబునుడు; (చకారముచే కామలోపంబును) మహాన్=గొప్పది.

ఉపకారముచేసినవానికిఁ బ్రత్యుపకారముచేయనియెడ ధర్మలోపము అధికముగా సంభవించును; అట్లు ప్రత్యుపకారము సేయమిచేత గుణవంతుండగు మిత్రుండు నశించినప్పుడు అధికముగా నర్థలోపంబును కామలోపంబునుం గలుగును. అని, తాత్పర్యము.

మిత్రం హ్యర్థగుణశ్రేష్ఠం సత్యధర్మపరాయణమ్. ౨౯
తద్ద్వయం తు పరిత్యక్తం న తు ధర్మే వ్యవస్థితమ్

టీక ॥ సత్యధర్మపరాయణం = సత్యమును ధర్మమును ముఖ్యమయిన గతిగాఁగల; మిత్రం=స్నేహితుఁడు; అర్థగుణశ్రేష్ఠం హి=అర్థముకన్నను కామముకన్నను ఉత్తముఁడుగదా! తత్=అ; ద్వయంతు=రెండును; పరిత్యక్తం=విడువఁబడినది. ధర్మేతు= ధర్మమునందు మాత్రముగూడ; నవ్యవస్థితం = నిలుచుటకాలేదు.

సత్యంబునందును ధర్మమునందును స్థిరుండగుమిత్రుండు, అర్థకామంబులకు మూలమగుటవలన వానికన్నను అధికుండు; అట్టిమిత్రుని విడుచుచున్నాఁడు కావున నీసుగ్రీవునకు అర్థకామంబులునశిం

చుటయుగాక ధర్మంబుగూడనశించును. అని, తాత్పర్యము.

తదేవం ప్రస్తుతే కార్యే కార్యమస్మాభిరుత్తరమ్. ౪౫
యత్కార్యం కార్యతత్త్వజ్ఞే తదుదాహర్తుమర్హసి

టీక॥ కార్యతత్త్వజ్ఞే=కార్యముల యొక్క స్వరూపము నెఱింగినదానా! తత్=అందువలన; ఏవం= ఇట్లు; కార్యే=పని; ప్రస్తుతే= ప్రసక్తముకాఁగా; యత్=ఏ; ఉత్తరం=వెనుకటిదైన; కార్యం=పని; అస్మాభిః = మాచేత; కార్యం=చేయఁదగినదో; తత్= దానిని; ఉదాహర్తుం= చెప్పుటకు; అర్హసి=తగుదువు.

కార్యముల తత్త్వము దెలిసినదానా! అందువలన, సుగ్రీవుండిట్లు తనకు ధర్మార్థకామంబులు చేయునట్లు, ఉపకారంబునకుఁ బ్రత్యుపకారంబు సేయక మిత్రులమమ్మునుపేక్షించినపుడు, ఆపైని మేము ఏమిచేయవలయునో, దాని నీవే వచింపుము. అని, లక్ష్మణుఁడు తారతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

సా తస్య ధర్మార్థసమాధియుక్తం
నిశమ్య వాక్యం మధురస్వభావమ్. ౪౬
తారా గతార్థా మనుజేంద్రకార్యే
విశ్వాసయుక్తం తమువాచ భూయః

టీక॥ సా=ఆ; తారా=తార; ధర్మార్థసమాధియుక్తం = ధర్మార్థముల యొక్క సంబంధముతోఁగూడినదియు; మధురస్వభావం= మనోహరమయిన స్వభావముగలదియునగు; తస్య= ఆలక్ష్మణునియొక్క; వాక్యం=మాటను; నిశమ్య=విని; మనుజేంద్రకార్యే = మనుష్యనాథుఁడగు రాముని కార్యము విషయమయి; గతార్థా = తెలియఁబడిన ప్రయోజనముగలదై; తం= ఆలక్ష్మణుని గూర్చి; విశ్వాసయుక్తం=నమ్మకముతోఁగూడునట్లుగా; భూయః=మఱల; ఉవాచ=పలికెను.

ఆతార, ధర్మార్థంబులతోఁగూడినదియు మనోహరంబునగు లక్ష్మణునిమాటను విని, రాముఁడు లక్ష్మణునిఁ బంపినందుకుఁ బ్రయోజనంబు దెలిసికొన్నదై, లక్ష్మణునకు నమ్మకముగలుగునట్లు, మఱల నిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

న కోపకాలః క్షితిపాలపుత్త్ర
న చాతికోప స్స్వజనే విధేయః. ౫౦
త్వదర్థ కామస్య జనస్య తస్య
ప్రమాద మప్యర్హసి వీర సోఢుమ్

టీక॥ క్షితిపాలపుత్త్ర = రాచకొమరుఁడవగు లక్ష్మణుఁడా! కోపకాలః= కోపసమయము; న=కాదు. స్వజనే= బంధుజనమునందు; అతికోపః=మిక్కిలియుకోపము; విధేయశ్చ=చేయఁదగినదియు; న=కాదు. వీర= పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! త్వదర్థ కామస్య=నీయొక్క ప్రయోజనమునే కోరునట్టి; తస్య=ఆ; జనస్య = సుగ్రీవునియొక్క; ప్రమాదమపి = ఏమఱుపాటును గూడ; సోఢుం=ఓర్చుటకు; అర్హసి= తగుదువు.

వీరుఁడవగు లక్ష్మణుఁడా! కామవశుండగు సుగ్రీవునిమీఁదఁ గోపగించుట యుక్తము కాదు; మఱియు మీకు మిత్త్రుఁడగువానియందు ఇట్లధిక కోపము సేయవచ్చునా? ఈసుగ్రీవుండు మీకార్యమును సాధించుట యందె మిక్కిలియు నాసక్తుండైయున్నవాఁడు, కావున, ఇపుడు ఇతఁడు కామవశతంజేసి మీకార్యము విషయమయి కొంచెమేమఱియున్నను నీవు సహింపవలెను.

అని, తాత్పర్యము.

కోపం కథంనామ గుణప్రకృష్టః
కుమార కుర్యా దపకృష్టసత్త్వే. ౫౧
కస్త్వద్విధః కోపవశంహి గచ్ఛే
త్సత్త్వావరుద్ధ స్తపసః ప్రసూతిః

టీక॥ కుమార=లక్ష్మణుఁడా! గుణప్రకృష్టః = గుణములచేనధికుఁడయినవాఁడు; అపకృష్టసత్త్వే = తక్కువయయిన బలముగలవానియందు; కోపం=కినుకను; కథంనామ = ఎట్లు; కుర్యాత్=చేయును? త్వద్విధః = నీయట్టివాఁడయిన; సత్త్వావరుద్ధః= సత్త్వగుణముతోఁగూడినవాఁడును; తపసః= తపస్సుయొక్క; ప్రసూతిః = ఉత్పత్తిస్థానమునయిన వాఁడు; కః = ఎవ్వాఁడు; కోపవశంహి= కోపముయొక్క అధీనతనుగూడ; గచ్ఛేత్=పొందును?

స ౩౩

లక్ష్మణుఁడా! వీర్యాదిగుణములచేన ధికుఁడగువాఁడు, తనకన్నబలహీనుండగు నల్పునిపైఁగోపంబునొందవచ్చునా? సత్త్వగుణసమేతుండును తపోసిద్ధియు నగునీయట్టి మహాపురుషుఁడెక్కడనైనను, గోపావేశమునకు లోఁబడుటయుక్తమా? అని, తాత్పర్యము.

జానామి రోషం హరివీరబంధో
ర్జానామి కార్యస్యచ కాలసంగమ్. ౫౨
జానామి కార్యం త్వయి య త్కృతంన
స్తచ్చాపి జానామి య దత్ర కార్యమ్

టీక॥ హరివీరబంధోః=వానరవీరుఁడగు సుగ్రీవునిమిత్రుఁడైన రామునియొక్క; రోషం=కోపమును; జానామి= ఎఱుంగుదును. కార్యస్య=ప్రయత్నముయొక్క; కాలసంగంచ= కాలవిలంబమునుగూడ; జానామి= ఎఱుఁగుదును. యత్=ఏ; కార్యం=వాలివధరూపమయినకార్యము; నః=మాకు; కృతం= చేయఁబడినదో; త్వయి=నీయందు; విద్యమానం (అధ్యాహృతము)= ఉన్న; తత్ అపి (అధ్యాహృతము) = దానిని గూడ; జానామి=ఎఱుంగుదును. అత్ర= ఈ యుపకారము విషయమయి ; యత్ =ఏది; కార్యం=చేయఁదగినదో; తచ్చాపి=దానినిగూడ; జానామి = ఎఱుంగుదును.

సుగ్రీవునకుఁబరమమిత్రుఁడయినను రాముఁడు కోపంబునొందుట నెఱుంగుదును; అందుకుఁ గారణము సుగ్రీవుండు సీతాన్వేషణప్రయత్నము విషయమయి జాగుసేయుటయు నాకుఁ దెలియును;నీవుమాకు ఏమిగావించితివో ఆ మహోపకారమునుగూడ, ఎఱుంగుదును; అందుకుబదులు మేమేమిచేయవలెనో, అదియు నాకుఁ దెలియును.

అని, తాత్పర్యము.

తచ్చాపి జానామి యథాఽవిషహ్యం
బలం నరశ్రేష్ఠ శరీరజస్య. ౫౩
జానామి యస్మింశ్చ జనేఽవబద్ధం
కామేన సుగ్రీవ మసక్త మద్య

టీక ॥ నరశ్రేష్ఠ = మనుష్యశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! శరీరస్య= మన్మథునియొక్క; బలం=శక్తి; యథా = ఎట్లు; అవిషహ్యం= సహింపరానిదో; తచ్చాపి = దానినిగూడ; జానామి = ఎఱుంగుదును. అద్య=ఇప్పుడు; సుగ్రీవం=సుగ్రీవుని; యస్మిన్=ఏ; జనే = జనమునందు; కామేన = మన్మథునిచేత; అసక్తం=ఎల్లప్పుడును; అవబద్ధం= కట్టఁబడినవానిఁగా; జానామి (అధ్యాహృతము) = ఎఱుంగుదునో; తంజనం (అధ్యాహృతము)చ = ఆస్త్రీజనమునుగూడ; జానామి=ఎఱుంగుదును.

లక్ష్మణుఁడా! మన్మథునకు లోఁబడనివాఁడవుకావుకావున నీవు పురుషోత్తముఁడవు; మన్మథునిశక్తిసహించుట కష్టమయినసంగతియునాకుఁదెలియును; ఈసుగ్రీవుండు మన్మథాధీనుండై యేస్త్రీలయందుఁ దగిలియున్నాఁడో, ఆస్త్రీలశక్తియు నాకుఁదెలియును.

అని, తాత్పర్యము.

న కామతంత్రే తవ బుద్ధి రస్తి
త్వం వై యథా మన్యువశం ప్రపన్నః. ౫౪
న దేశకాలౌ హి న చార్థధర్మా
వపేక్షతే కామరతి ర్మనుష్యః

టీక ॥ త్వం=నీవు ("వై" అనునది పాదపూరణార్థము); యథా=ఏవిధముచేత; మన్యువశం = కోపముయొక్క-అధీనతను; ప్రపన్నః = పొందినావో; తథా (అధ్యాహృతము)= ఆవిధముచేత; తవ=నీకు; కామతంత్రే= మన్మథవ్యాపారమునందు; బుద్ధిః=జ్ఞానము; నాస్తి=లేదు. కామరతిః= మన్మథవ్యాపారమునందాసక్తిగల; మనుష్యః=మనుష్యుఁడు; దేశకాలౌ= దేశమును కాలమును; నాపేక్షతేహి= అపేక్షింపఁడుగదా! అర్థధర్మౌ= అర్థమును ధర్మమును; న (అపేక్షతే)= అపేక్షింపఁడు.

నీవిట్లు కోపమునొందుటను జూడఁగా, మాకువలె, నీకంతగా మన్మథవ్యాపారమునందు జ్ఞానములేనట్లుతోఁచుచున్నది;ఏల యనఁగా, మన్మథవ్యాపారపరుండగుమనుష్యుఁడు, దేశకాలంబులంగాని ధర్మార్థంబులంగాని చూడఁడు; నీకును మన్మథతంత్రపరిజ్ఞానము న్నయెడ, సుగ్రీవునివిషయమయి నీకిట్లు కోపముగలుగదు. అని, తాత్పర్యము.

స 33

తం కామవృత్తం మమ సన్నికృష్టం
కామాభియోగాచ్చ నివృత్తలజ్జమ్. ౫౩
క్షమస్వ తావ త్పరవీరహంత
స్త్వ ద్భ్రాతరం వానరవంశనాథమ్

టీక ॥ పరవీరహంతః= శత్రువీరులవధించునట్టిలక్ష్మణుఁడా! మమ= నాకు; సన్నికృష్టం=సమీపమునయున్నవాఁడును; కావుననే;కామవృత్తం=మన్మథసంబంధివ్యాపారముగలవాఁడును; కామాభియోగాత్ =మన్మథునియొక్క ఆవేశమువలన; నివృత్తలజ్జం = పోయినసిగ్గుగలవాఁడునగు; త్వద్భ్రాతరం= నీతోఁబుట్టువయిన; తం= ఆ; వానరవంశనాథం=వానరసమూహమునకు బ్రభువయినసుగ్రీవుని; తావత్= అంతమట్టుకు; క్షమస్వ=మన్నింపుము. .

శత్రువీరుల వధించునట్టి లక్ష్మణుఁడా! నాసమీపంబున నున్నవాఁడగుటం జేసి మన్మథవ్యాపారంబులందగిలి మన్మథావిష్టుండగుటవలన నిర్లజ్జుండైయున్ననీతోఁబుట్టువు నగువానరేశ్వరు సుగ్రీవుని ఇంతవఱకు, క్షమింపుము.

అని, తాత్పర్యము.

మహర్షయో ధర్మతపోభికామాః
కామానుకామాః ప్రతిబద్ధమోహాః. ౫౬
అయం ప్రకృత్యా చపలః కపిస్తు
కథం న సజ్జేత సుఖేషు రాజా

టీక ॥ ధర్మతపోభికామాః = ధర్మమునుదపస్సును గోరునట్టివారలును;ప్రతిబద్ధమోహాః = అడ్డగింపఁబడిన మోహముగలవారలునగు; మహర్షయః = పూజ్యులయిన ఋషులు; కామానుకామాః= మన్మథునననుసరించిన యభిలాషగలవారలు, మన్మథునకు లోఁబడుదురనుట. ప్రకృత్యా= స్వభావముచేత; చపలః = చంచలుఁడయిన; కపిః= వానరుఁడయిన; అయం= ఈ; రాజాతు= సుగ్రీవుఁడుమాత్రము; సుఖేషు = సుఖములయందు; కథం=ఎట్లు; నసజ్జేత= తగులకుండును?

ధర్మంబునే యవలంబించి తపశ్చర

ణపరులయినవారలును మోహమునుజయించిన వారలునగు మహర్షులుగూడ, మన్మథునకు లోఁబడుచున్నారు; ఇఁకఁ స్వభావంబుననె చపలుండగు వానరుఁడైనయీసుగ్రీవుండు కామసుఖంబులం దగులుటయేమి యాశ్చర్యము? అని, తార, లక్ష్మణునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యేవ ముక్త్వా వచనం మహార్థం
సా వానరీ లక్ష్మణ మప్రమేయమ్. ౫౭
పున స్సఖేలం మదవిహ్వలంచ
భర్తు ర్హితం వాక్య మిదం బభాషే

టీక॥ సా=ఆ; వానరీ=తార; అప్రమేయం = కొలఁదికి మీఁజిన; లక్ష్మణం=లక్ష్మణునిగూర్చి; ఇతిఏవం= అనియిట్లు; మహార్థం=అధికమయిన అర్థముగల; వచనం = మాటను; ఉక్త్వా= చెప్పి; పునః=మఱల; సఖేలం=విలాసముతోఁగూడు నట్లుగాను; మదవిహ్వలంచ=కైపుచేఁ దొట్రుపాటు గలుగునట్లుగాను; భర్తుః = పెనిమిటికి; హితం=మేలుగలిగించునట్టి; వాక్యం=మాటను; బభాషే=పలికెను.

ఆ తారయిట్లు, అప్రమేయుండగు లక్ష్మణునితో, అధికమయినయర్థముగలమాటలు వలికి, మఱల, లక్ష్మణునిం జూచి, విలాసంబును బానమదంబుచేఁ దొట్రుపాటును గదురఁ, దన పెనిమిటి కహితకరంబగు నీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

ఉద్యోగస్తు చిరాజ్ఞప్త స్సుగ్రీవేణ నరోత్తమ. ౫౮
కామస్యాపి విధేయేన తవార్థప్రతిసాధనే

టీక ॥ నరోత్తమ=పురుషశ్రేష్ఠుఁడవగులక్ష్మణుఁడా! కామస్య=మన్మథునకు; విధేయేనాపి= లోఁబడినవాఁడైనను; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; తవ = నీయొక్క; అర్థప్రతిసాధనే= ప్రయోజనముయొక్క సాధించుట నిమిత్తమయి; ఉద్యోగస్తు=ప్రయత్నముమాత్రము; చిరాజ్ఞప్తః=బహుకాలముక్రిందనాజ్ఞాపింపఁబడినది.

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! సుగ్రీవుఁడు మన్మథ వ్యాపారపరుండైయున్నను, మఱియునూరకున్న వాఁడు

కాదు; మీకార్యమును సాధించుటకై, ప్రయత్నము సేయుటకు మాత్రము

చాలకాలముక్రిందనే వానరుల కాజ్ఞాపించినాఁడు. అని, తాత్పర్యము.

ఆగతాహి మహావీర్యా హరయః కామరూపిణః. ౨౯
కోటీశతసహస్రాణి నానానగనివాసినః

టీక॥ మహావీర్యాః = అధికమయిన పరాక్రమముగలవారలును; కామరూపిణః = ఇచ్ఛాధీనమగు రూపముగలవారలునగు; నానానగనివాసినః = నానావిధములయిన పర్వతములందునివసించునట్టి; హరయః = వానరులు; కోటీశతసహస్రాణి = కోటులయొక్క లక్షలు;

ఆగతాహి = వచ్చియున్నారుగదా!

మహాపరాక్రమశాలులును గామరూపులునగు వానరవీరులు నానాపర్వతంబులనుండి అనేకలక్షలకోట్లమంది, వచ్చియున్నారుగదా!

అని, తాత్పర్యము.

తదాగచ్ఛ మహాబాహో చారిత్రం రక్షితం త్వయా. ౩౦
అచ్ఛలం మిత్రభావేన సతాం దారావలోకనమ్

టీక॥ మహాబాహో = పెద్దచేతులుగలలక్ష్మణుఁడా! తత్ = అందువలన; ఆగచ్ఛ = రమ్ము. త్వయా = నీచేత; చారిత్రం = సదాచారము; రక్షితం = కాపాడఁబడినది. మిత్రభావేన = మిత్రత్వముచేత; సతాం = ఉన్నవారలయొక్క; దారావలోకనం = భార్యలచూచుట; అచ్ఛలం = దోషముకాదు.

మహాబాహుఁడవగు లక్ష్మణుఁడా! అట్లుకావున, లోపలికిరమ్ము; నీవు, అంతఃపుర స్త్రీలున్నచోటికి రాఁగూడదని దూరముననేనిలుచుటచేత, సదాచారము ననుష్ఠించినవాఁడవైతివి; తమమిత్రులగు వారిభార్యలను జూచుట దోషముగాదు. అని, తార, లక్ష్మణుని తోఁజెప్పెను. అని, తాత్పర్యము.

తారయాచాభ్యనుజ్ఞాత స్త్వరయాచాపి చోదితః. ౩౧
ప్రవివేశ మహాబాహు రభ్యంతర మరిందమః

టీక॥ మహాబాహుః = పెద్దచేతులుగలవాఁడును; అరిందమః = శత్రువులన

డగఁ ద్రొక్కువాఁడునగు లక్ష్మణుం డు; తారయాచ=తారచేతను; అభ్య నుజ్ఞాతః = అనుమతింపఁబడినవాఁడై; త్వరయాచాపి = వేగిరపాటుచేతను; చోదితః = ప్రేరింపఁబడినవాఁడై; అ భ్యంతరం= అంతఃపురమును; ప్రవివే శ=చొచ్చెను.

మహాబాహుండును శత్రువులనణం గఁద్రొక్కఁజాలినవాఁడునగులక్ష్మణుం డు, తారయు లోనికిరమ్మని పిలుచుట వలనను, రామకార్యమునందలి త్వరవల నను, అంతఃపురంబులోనికిఁ బోయెను.

అని, తాత్పర్యము.

తత స్సుగ్రీవ మాసీనం కాంచనే పరమాసనే. ౬౨
మహార్హా స్తరణోపేతే దదర్శా దిత్యసన్నిభమ్
దివ్యాభరణచిత్రాంగం దివ్యరూపం యశస్వినమ్. ౬౩
దివ్యమాల్యాంబరధరం మహేంద్రమివ దుర్జయమ్
దివ్యాభరణమాల్యాభిః ప్రమదాభి స్సమావృతమ్. ౬౪

టీక ॥ తతః = అటుపిమ్మట;సః(అ ధ్యాహృతము) = ఆలక్ష్మణుఁడు; మ హార్హాస్తరణోపేతే = శ్రేష్ఠమయిన యాస్తరణముతోఁగూడిన; కాంచనే= బంగారువికారమయిన; ఆసనే = సిం హాసనమునందు; ఆసీనం= కూర్చున్న వాఁడును; ఆదిత్యసన్నిభం = సూర్యు నితో సమానుఁడును; దివ్యాభరణ చి త్రాంగం = శ్రేష్ఠమయినభూషణము లచేఁ జిత్రవర్ణమయిన దేహముగలవాఁ డును; దివ్యరూపం= శ్రేష్ఠమయినరూ పముగలవాఁడును; యశస్వినం = అ ధికమయినకీర్తిగలవాఁడును; దివ్యమా ల్యాంబరధరం= శ్రేష్ఠములయిన పుష్ప మాలికలను వస్త్రములనుధరించినవాఁ డను; మహేంద్రమివ = దేవేంద్రు నివలె; దుర్జయం = జయింపనలవిగా నివాఁడును; దివ్యాభరణమాల్యాభిః= శ్రేష్ఠములయిన భూషణములును పు ష్పమాలికలునుగల; ప్రమదాభిః= స్త్రీ లచేత; సమావృతం= పరివేష్టింపఁబడి నవాఁడునగు; సుగ్రీవం = సుగ్రీవునిఁ; ద దర్శ=చూచెను.

అంత, లక్ష్మణుండు, ఉత్తమమయి నయాస్తరణముతోఁగూడిన కాంచనమ యంబగు సింహాసనంబునం గూర్చున్న వాఁడును సూర్యసమానుండును ఉత్త మంబులగు నాభరణంబులు ధరించిన

స 33

వాఁడగుటం జేసి నానావర్ణములయిన తత్కాంతులతో నొప్పుచున్నవాఁడును శ్రేష్ఠమయిన రూపముగలవాఁడును గీర్తిసంపన్నుండును శ్రేష్ఠములయిన పూలమాలికలను వస్త్రంబులను ధరించిన

వాఁడును, దేవేంద్రుండుంబోలె దుర్జయుండును, దివ్యంబులగుభూషణంబులును మాలికలునుధరించినస్త్రీలచేఁ బరివేష్టితుండై యున్నవాఁడునగు సుగ్రీవుంజూచెను. అని, తాత్పర్యము.

సంరబ్ధతరరక్తాక్షో బభూవాంతకసన్నిభః.

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆ లక్ష్మణుఁడు; సంరబ్ధతరరక్తాక్షః= మిక్కిలియు కోపమునొందినవాఁడును కావున నెఱ్ఱనైన కన్నులుగల వాఁడునై; అంతకసన్నిభః = యమునితో సమానుఁడును; బభూవ=ఆయెను.

లక్ష్మణుండు, అట్లుస్త్రీలనడుమఁ బేరోలగంబునఁ గామతంత్రుండై యున్న సుగ్రీవుంజూచి, పరమకుపితుండై, యెఱ్ఱని కన్నులతో యమునివలె భయంకరుండయ్యెను. అని, తాత్పర్యము.

రుమాం తు వీరః పరిరభ్య గాఢం
వరాసనస్థో వరహేమవర్ణః. ౬౫
దదర్శ సౌమిత్రి మదీనసత్త్వం
విశాలనేత్ర స్సువిశాలనేత్రమ్

టీక ॥ రుమాం=రుమను; గాఢం= బిగువుగా; పరిరభ్యతు= కౌఁగిలించుకొనియే; వరాసనస్థః=ఉత్తమమయిన యాసనమునందున్నవాఁడును; వీరః=పరాక్రమశాలియు; వరహేమవర్ణః=ఉత్తమమయిన బంగారముయొక్క వన్నెవంటివన్నెగలవాఁడును; విశాలనేత్రః=వెడల్పులయిన కన్నులుగలవాఁడునగుసుగ్రీవుఁడు; అదీనసత్త్వం= తక్కువకానిబలముగలవాఁడును; సువిశాలనేత్రం= మిక్కిలియు వెడల్పులయిన కన్నులుగలవాఁడునగు; లక్ష్మణం= లక్ష్మణుని; దదర్శ=చూచెను.

అట్లు, రుమను గాఢంబుగాఁగౌఁగిటం జేర్చి సింహాసనంబునం గూర్చుండియున్న తప్తకాంచనవర్ణుండును విశాలంబులగు కన్నులు గలవాఁడునగు సుగ్రీవుండు, [illegible]

నయనంబులుగలవాఁడును మహాబలుండునగు లక్ష్మణుంజూచెను. అని, తా.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, త్రయస్త్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండత్రయస్త్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

చతుస్త్రింశసర్గప్రారంభః

తమప్రతిహతం క్రుద్ధం ప్రవిష్టం పురుషర్షభమ్
సుగ్రీవో లక్ష్మణం దృష్ట్వా బభూవ వ్యథితేంద్రియః. ౧

టీక॥ సుగ్రీవః= సుగ్రీవుడు; ప్రవిష్టం=ప్రవేశించిన; అప్రతిహతం=ఎదురులేనివాఁడును; క్రుద్ధం = కోపించినవాఁడును; పురుషర్షభం = పురుషశ్రేష్ఠుఁడునగు; తం = ఆలక్ష్మణుని; దృష్ట్వా=చూచి; వ్యథితేంద్రియః= భయంమునొందిన యింద్రియములు గలవాఁడు; బభూవ=అయ్యెను.

అట్లుంతఃపురంబు ప్రవేశించి తనయొద్దకువచ్చిన, ఎదురులేనివాఁడును గుపితుండును బురుషశ్రేష్ఠుండునగు లక్ష్మణుంజూచి, సుగ్రీవుండు, భయంబునొందెను. అని, తాత్పర్యము.

క్రుద్ధం నిశ్శ్వసమానం తం ప్రదీప్తమివ తేజసా
భ్రాతుర్వ్యసనసంతప్తం దృష్ట్వా దశరథాత్మజమ్. ౨
ఉత్పపాత హరిశ్రేష్ఠో హిత్వా సౌవర్ణమాసనమ్
మహాన్మహేంద్రస్య యథా స్వలంకృత ఇవధ్వజః. ౩

టీక॥ క్రుద్ధం=కుపితుండును; నిశ్శ్వసమానం= నిట్టూర్పులువుచ్చుచున్నవాఁ

డును; తేజసా=కాంతిచేత; ప్రదీప్తమి వ (స్థితం) = మండుచున్నట్లున్న వాఁడును; భ్రాతుః = అన్నయాగు రాముని యొక్క; వ్యసనసంతప్తం = దుఃఖముచేతఁ దపింపఁ జేయఁబడినవాఁడునగు; తం=ఆ; దశరథాత్మజం=లక్ష్మణుని; దృష్ట్వా=చూచి; హరిశ్రేష్ఠః=వానరోత్తముఁడగు సుగ్రీవుఁడు; మహత్ =ఉన్నతమయిన; సౌవర్ణం= బంగారు వికారమయిన; ఆసనం=సింహాసనమును; హిత్వా=విడిచి; మహేంద్రస్య = దేవేంద్రుని యొక్క; స్వలంకృతః = చక్కఁగా నలంకరింపఁబడిన; ధ్వజఇవ = టెక్కెమువలె; ఉత్పపాత=లేచెను.

అన్నయగు రామునకు వ్యసనముగలుగుటకై పరితపించుచుఁ గుపితుండై యూర్పులు నిగుడించుచుఁ దేజోవిశేషంబున మండినట్లున్న దశరథకుమారు లక్ష్మణుఁజూచి, సుగ్రీవుండు ఉన్నతంబగు కాంచన సింహాసనంబునుండి నేలకుఁ గ్రిఁ, యుత్సవార్థమయి యెత్తఁబడునలంకృతమయిన దేవేంద్రధ్వజమువలె, లేచి నిలుచుండెను. అని, తాత్పర్యము.

ఉత్పతంత మనూత్పేతూ రుమాప్రభృతయః స్త్రియః
సుగ్రీవం గగనే పూర్ణచంద్రం తారాగణాఇవ. ౪

టీక ॥ గగనే = ఆకాశమునందు; ఉత్పతంతం (అధ్యాహృతము) = లేచుచున్న; పూర్ణచంద్రం = నిండుచంద్రుని; తారాగణాఇవ= నక్షత్రసమూహములువలె; ఉత్పతంతం = లేచుచున్న; సుగ్రీవం = సుగ్రీవుని; రుమాప్రభృతయః=రుమమొదలుగాఁగల; స్త్రియః= స్త్రీలు; అనూత్పేతుః = అనుసరించి లేచిరి.

ఆకాశమునం బూర్ణచంద్రుండుదయింపఁగానే వెంబడిన నక్షత్రములుదయించునట్లు, సుగ్రీవుండు లేవఁగానే యతని వెంబడి రుమమొదలగు స్త్రీలందఱు లేచిరి. అని, తాత్పర్యము.

సంరక్తనయన శ్శ్రీమా న్విచచాల కృతాంజలిః
బభూవా వస్థిత స్తత్ర కల్పవృక్షో మహానివ. ౫

టీక॥ సంరక్తనయనః=దుక్కిలియుసిగ్గునైన కన్నులుగలు; శ్రీమాన్=సంపదతోఁగూడినవాఁడగు సుగ్రీవుండు; కృతాంజలిః=చేయఁబడిన చేమోడ్పుగల

వాఁడై; విచచాల=కదలెను, ఎదురొ్క నెనను. తత్ర=అచట; మహాన్=గొప్పదగు; కల్పవృక్షఇవ=కల్పవృక్షమువలె; అవస్థితః = నిలిచినవాఁడు; బభూవ=అయ్యెను.

పానమదంబునను మన్మథావేశంబునను మిక్కిలియు నెఱ్ఱనైన నయనంబులతోఁగూడిన శ్రీమంతుండగు సుగ్రీవుండు, చేమోడ్పుగీలించి, లక్ష్మణు నెదురొ్కని, గొప్పకల్పవృక్షంబువలె నిలువఁబడియుండెను. అని, తాత్పర్యము.

రుమాద్వితీయం సుగ్రీవం నారీమధ్యగతం స్థితమ్
అబ్రవీ ల్లక్ష్మణః క్రుద్ధ స్సతారం శశినంయథా. ౮

టీక॥ లక్ష్మణః= లక్ష్మణుఁడు; క్రుద్ధః=కుపితుండై; నారీమధ్యగతం=స్త్రీలమధ్య ప్రదేశమును బొందినవాఁడును; స్థితం=నిలుచున్నవాఁడును; రుమాద్వితీయం=రుమయే రెండవదిగాఁగలవాఁడును,రుమాసహితుఁడును; సతారం=నక్షత్రములతోఁగూడిన;శశినంయథా(స్థితం)=చంద్రునివలెనున్నవాఁడునగు;సుగ్రీవం=సుగ్రీవునిగూర్చి; అబ్రవీత్= పలికెను.

నక్షత్రంబులనడుమఁ జంద్రుండుంబోలె, స్త్రీలనడుమనున్నవాఁడును రుమాసహితుండునై నిలుచున్న సుగ్రీవుంజూచి, లక్ష్మణుండు క్రుద్ధుండై, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

సత్త్వాభిజనసంపన్న స్సానుక్రోశో జితేంద్రియః
కృతజ్ఞ స్సత్యవాదీచ రాజా లోకే మహీయతే. ౯

టీక॥ సత్త్వాభిజనసంపన్నః = బలముతోను కులముతోను కూడినవాఁడును; సానుక్రోశః=కనికరముతోఁగూడినవాఁడును; జితేంద్రియః=జయింపఁబడినయింద్రియములుగలవాఁడును; కృతజ్ఞః=[illegible]బడిన యుపకారమును మఱవనివాఁడును; సత్యవాదీచ= సత్యమునేపలుకువాఁడు నగు; రాజా = రాజు; లోకే= ప్రపంచమునందు; మహీయతే= పూజింపఁబడుచున్నాఁడు.

బలవంతుండును సత్కులప్రసూతుండును ఆర్తులయెడఁ గనికరము గల[illegible]

స ౩౪

దును జితేంద్రియుండును కృతజ్ఞుండును సత్యంబు వలుకువాఁడునగు రాజు లోకంబునం గొనియాడఁబడును.

అని, తాత్పర్యము.

యస్తు రాజా స్థితోఽధర్మే మిత్రాణా ముపకారిణామ్
మిథ్యాప్రతిజ్ఞాం కురుతే కో నృశంసతర స్తతః. ౮

టీక॥ యః=ఏ; రాజాతు=రాజయితే; అధర్మే=అధర్మమునందు; స్థితః=ఉన్నవాఁడై; ఉపకారిణాం=ఉపకారముగావించిన; మిత్రాణాం= స్నేహితులకు; మిథ్యాప్రతిజ్ఞాం=అసత్యమయినప్రతినను; కురుతే = చేయునో; తతః=అతనికన్నను; నృశంసతరః= అధికముగాఁ బాపియగువాఁడు; కః = ఎవ్వఁడు?

ఏ రాజయితే,అధర్మపరుండై,తనకు మున్నుపకారము గావించిన మిత్రులకు అసత్యమయినప్రతిజ్ఞ చేయునో, అతనికన్నను పాపిష్ఠుండు ప్రపంచంబున నెవ్వఁడును లేఁడు. అని, తాత్పర్యము.

శత మశ్వానృతే హంతి సహస్రంతు గవానృతే
ఆత్మానం స్వజనం హంతి పురుషః పురుషానృతే. ౯

టీక॥ పురుషః = పురుషుఁడు; అశ్వానృతే=గుఱ్ఱమువిషయమైన అసత్యమునందు; శతం= నూఱుగుఱ్ఱములను; హంతి= చంపును, నూఱుగుఱ్ఱములను జంపినదోషమును బొందుననుట. గవానృతేతు= గోవువిషయమయినయసత్యమునందు; సహస్రం = వేయింటిని; హంతి= వధించును, వేయిగోహత్యల పాపమును బొందుననుట. పురుషానృతే=పురుషవిషయమయిన యసత్యమునందు; ఆత్మానం=తన్నును; స్వజనం=తనజనమును; హంతి=చంపును, ఆత్మహత్యను బంధుహత్యయుఁ జేసినపాపమునుబొందుననుట.

పురుషుఁడు, ఒకగుఱ్ఱమువిషయము యసత్యమాడినయెడ నూఱు గుఱ్ఱములనువధించినపాపమును బొందును; గోవువిషయమయి యసత్యమాడినయెడ వేయిగోవులం జంపిన దోషమునొందును; అట్లు పురుషునివిషయమయియసత్యమాడినపక్షమున ఆత్మహత్యయు స్వజనహత్యయుఁ జేసినపాపము నొం

దును; ఇట్టి మహాపురుషుఁడగు రాముని విషయమయి యసత్యమాడిన చెప్పవలయురా? అని, తాత్పర్యము.

పూర్వం కృతార్థో మిత్రాణాం న తత్ప్రతికరోతి యః
కృతఘ్నః సర్వభూతానాం స వధ్యః ప్లవగేశ్వర. ౧౦

టీక ॥ ప్లవగేశ్వర= వానరరాజా! యః=ఎవ్వఁడు; పూర్వం = మున్ను; కృతార్థః= చేయఁబడిన ప్రయోజనము గలవాఁడై; మిత్రాణాం = స్నేహితులయొక్క; తత్ = ఆకార్యమును; న ప్రతికరోతి = మరలఁ జేయఁడో; కృతఘ్నః= చేయఁబడినయుపకారమును మఱచిన; సః = అతఁడు; సర్వభూతానాం= సమస్తప్రాణులకును; వధ్యః= వధింపఁదగినవాఁడు.

వానరరాజా! ముందుమిత్రులచేఁదన కార్యము చేయించుకొని, మాటప్రకారము, ఎవఁడు, తనకార్యముగా నెంచి యామిత్రులకార్యమును జేయఁడో, ఆతఁడు కృతఘ్నుం డనఁబడును; అతని ఏప్రాణిగాని వధింపవచ్చును.

అని, తాత్పర్యము.

గీతోఽయం బ్రహ్మణా శ్లోకః సర్వలోకనమస్కృతః
దృష్ట్వా కృతఘ్నం క్రుద్ధేన తం నిబోధ ప్లవంగమ. ౧౧

టీక॥ ప్లవంగమ=వానరుఁడ! కృతఘ్నం= తనకుఁ జేయఁబడినదాని మఱచినవానిని; దృష్ట్వా=చూచి; క్రుద్ధేన= కోపించిన; బ్రహ్మణా = స్వాయంభువమనువుచేత; సర్వలోకనమస్కృతః = సమస్తలోకములచేతను నమస్కరింపఁబడిన; అయం=ఈ; శ్లోకః=శ్లోకము; గీతః=పాడఁబడినది. తం=ఆశ్లోకమును; నిబోధ = తెలిసికొనుము.

వానరుఁడా! పూర్వము స్వాయంభువమనువు కృతఘ్నునిఁజూచి కుపితుండై, సమస్తలోకములచేతను బూజింపఁబడుచున్న యీశ్లోకమును జెప్పెను; దానింబఠించెద వినుము. అని, తాత్పర్యము.

బ్రహ్మఘ్నే చ సురాపే చ చోరే భగ్నవ్రతే తథా
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. ౧౨

స ౩౪

టీక ॥ బ్రహ్మఘ్నేచ = బ్రాహ్మణుఁ జంపినవాని విషయమయ్యును; సురాపేచ="సుర" అనెడు మద్యమును ద్రాగినవాని విషయమయ్యును; చోరేచ=దొంగయందును, మహాపాతకులయిన బ్రహ్మఘ్నసురాపులతోఁగూడ పఠితమగుటవలన, బంగారుదొంగిలించినవాని విషయమయ్యుననుట; భగ్నవ్రతే=చెడిన వ్రతముగలవాని విషయమయ్యును, చెడిన గురుభక్తి గురుశుశ్రూషాదిరూపమయిన బ్రహ్మచర్యవ్రతముగలవాని విషయమయ్యుననుట, గురుభార్యాగమనము చేసినవాని విషయమయ్యును; నిష్కృతిః=ప్రాయశ్చిత్తము; సద్భిః=పెద్దలచేత; విహితా=చెప్పఁబడినది. కృతఘ్నే=తనకుఁ జేయఁబడినయుపకారమును మఱచినవాని విషయమయి; నిష్కృతిః = ప్రాయశ్చిత్తము; నాస్తి= లేదు.

మహాపాతకములైన బ్రహ్మహత్య, సురాపానము, బ్రాహ్మణస్వర్ణస్తేయము గురుభార్యాగమనము, గావించినవారలకుఁ బ్రాయశ్చిత్తము, పెద్దలచేవిధింపఁబడియున్నదిగాని, కృతఘ్నునకుమాత్రము ప్రాయశ్చిత్తమేలేదు. అని, స్వానుభవమునువుచెప్పెను. అని, తాత్పర్యము.

అనార్య స్త్వం కృతఘ్నశ్చ మిథ్యావాదీచ వానర
పూర్వం కృతార్థో రామస్య న తత్ప్రతికరోషి యత్. ౧౩

టీక ॥ వానర= వానరుఁడా! యత్= ఏకారణమువలన; త్వం (అధ్యాహృతము)= నీవు; పూర్వం=ముందుగా; కృతార్థః=(రామునిచేత) చేయఁబడినకార్యముగలవాఁడవై; రామస్య= రామునియొక్క; తత్ = ఆకార్యమును; నప్రతికరోషి=మఱలఁజేయకున్నావో; తత్ (అధ్యాహృతము)=ఆకారణమువలన; త్వం=నీవు; అనార్యః=దుష్టుఁడవు. కృతఘ్నశ్చ = చేయఁబడినయుపకారమును మఱచిన వాఁడవును; మిథ్యావాదీచ= అసత్యముచెప్పినవాఁడవును.

సుగ్రీవుఁడా! నీవుఁముందుగా రామునిచే నీకార్యముచేయించుకొని కృతార్థుఁడవయి పిమ్మట, నీవుచెప్పినమాటప్రకారము, రామునికార్యమును గావింపకమాట దప్పితివి కావున, నీవుదుష్టుండవు కృతఘ్నుండవు అసత్యము పలికినవాఁడవునై తివి.

అని, తాత్పర్యము.

నను నామ కృతార్థేన త్వయా రామస్య వానర
సీతాయా మార్గణే యత్నః కర్తవ్యః కృత మిచ్ఛతా. ౧౪

టీక॥ నను=ఓయి! వానర= సుగ్రీవుఁడా! కృతార్థేన=చేయఁబడిన కార్యముగలవాఁడవును; రామస్య= రాముని యొక్క; కృతం= చేయఁబడినదాని, ఉపకారముననుట; ఇచ్ఛతా=తలంచుచున్నవాఁడవునగు; త్వయా = నీచేత; సీతాయాః=సీతయొక్క; మార్గణే = వెదకుటయందు; యత్నః = ప్రయత్నము; కర్తవ్యోనామ= చేయఁబడవలసినదిగదా!

ఓయివానరుఁడా! నీవు కృతఘ్నుఁడవుగాక, రాముఁడు నీకుఁ జేసినయుపకారమును మఱవకయేయున్నవాఁడవగుదువేని, రామునిచే నీవు కృతార్థుఁడవైతివి కావున, నీవుతగిన ప్రయత్నము చేసి సీతను వెదకింపవలయును గదా! అని, తాత్పర్యము.

స త్వం గ్రామ్యేషు భోగేషు సక్తో మిథ్యాప్రతిశ్రవః
న త్వాం రామో విజానీతే సర్పం మండూకరావిణమ్. ౧౫

టీక ॥ సః=అట్టి; త్వం=నీవు; గ్రామ్యేషు = నీచములయిన; భోగేషు = భోగములయందు; సక్తః=తగిలినవాఁడవు. మిథ్యాప్రతిశ్రవః= అసత్యమయిన ప్రతిజ్ఞగలవాఁడవు. రామః = రాముఁడు; త్వాం=నిన్ను;మండూకరావిణం = కప్పవలెఅఱచునట్టి; సర్పం = పామునుగా; నవిజానీతే=ఎఱుఁగఁడు. కప్పలను మ్రింగుటకై కప్పలుదనసమీపంబునకు వచ్చుటకు సర్పముకప్పవలె నఱచునట్లు, నీవు, మొదట కార్యార్థము సత్యవంతుఁడవుగా నభినయించి, యిప్పుడు గ్రామ్యంబులగు విషయసుఖంబులందగిలి, ప్రతిజ్ఞ దప్పినావు, నీవు కప్పవలెనఱచునట్టి సర్పమువంటివాఁడవని రామునకుఁ దెలియలేదు.

అని, తాత్పర్యము.

మహాభాగేన రామేణ పాపః కరుణవేదినా
హరీణాం ప్రాపితో రాజ్యం త్వం దురాత్మా మహాత్మనా. ౧౬

టీక ॥ మహాభాగేన=పూజ్యమయిన భాగ్యముగలవాఁడును;కరుణవేదినా=

దయగలవాఁడును; మహాత్మనా= గొప్పమనస్సుగలవాఁడునగు; రామేణ = రామునిచేత; దురాత్మా= దుష్టమయినబుద్ధిగలవాఁడవును; పాపః=పాపము సేయువాఁడవునగు; త్వం=నీవు; హరీణాం = వానరులయొక్క; రాజ్యం= దొరతనమును; ప్రాపితః= పొందింపఁబడినావు.

మహానుభావుండును దయానిధియును మహాత్ముండునగు రాముండు, నీవు దురాత్ముఁడవు పాపిష్ఠుఁడవని తెలియక, నీకు వానరరాజ్యంబొసంగెను.

అని, తాత్పర్యము.

కృతం చే న్నాభిజానీషే రామస్యాక్లిష్టకర్మణః
సద్య స్త్వం నిశితై ర్బాణై ర్హతో ద్రక్ష్యసి వాలినమ్. ౧౭

టీక ॥ అక్లిష్టకర్మణః =శ్రమములేని కార్యములుగల; రామస్య = రామునియొక్క; కృతం= ఉపకారమును; నాభిజానీషేయది=తలంపవేని; సద్యః= ఇప్పుడే; త్వం=నీవు; నిశితైః=కఱకులయిన; బాణైః=అమ్ములచేత; హతః= వధింపఁబడినవాఁడవై; వాలినం= వాలిని; ద్రక్ష్యసి=చూడఁగలవు.

నీవు,ఎంతటి కార్యమునైనను శ్రమములేకయగావించునట్టి రాముఁడు గావించినయుపకారమునుమఱతువేని,యిప్పుడే తీక్ష్ణబాణంబుల నిన్నువధించివాలియొద్దకనిచెదను. అని, తాత్పర్యము.

నచ సంకుచితః పంథా యేన వాలీ హతో గతః
సమయే తిష్ఠ సుగ్రీవ మా వాలిపథ మన్వగాః. ౧౮

టీక॥ వాలీ=వాలి; హతః= వధింపఁబడినవాఁడై; యేన=ఏమార్గముచేత;గతః=పోయినాఁడో; సః (అధ్యాహృతము)= ఆ; పంథాః=మార్గము; నసంకుచితశ్చ = మూయఁబడినదియుకాదు. సుగ్రీవ = సుగ్రీవుఁడా! సమయే=ప్రతిజ్ఞయందు; తిష్ఠ=నిలువుము. వాలిపథం= వాలిమార్గమును; మాఅన్వగాః=వెంబడింపకుము.

సుగ్రీవుఁడా! వాలి,హతుండై యేమార్గమునం బోయినాఁడో, ఆదారి యిపుడుమూయఁబడినదికాదు; కావున, నీవుచేసినప్రతిజ్ఞను నెఱవేర్పుము; వాలిపోయినమార్గంబునం బోకుము.

అని, తాత్పర్యము.

న నూన మిక్ష్వాకువరస్య కార్ముక
చ్యుతాన్ శరాన్ పశ్యసి వజ్రసన్నిభాన్
తత స్సుఖం నామ నిషేవసే సుఖీ
న రామకార్యం మనసా ప్యవేక్షసే. ౧౮

టీక ॥ త్వం (అధ్యాహృతము) = నీవు; ఇక్ష్వాకువరస్య = ఇక్ష్వాకువంశమునం బుట్టినవారలలో శ్రేష్ఠుండగు రామునియొక్క; కార్ముకచ్యుతాన్ = వింటనుండి వెడలిన; వజ్రసన్నిభాన్ = వజ్రముతో సమానములగు; శరాన్ = బాణములను; నపశ్యసి = చూచినావు కావు. నూనం = నిశ్చయము. తతో నామ = అందువలన నేకదా; సుఖం = విషయసుఖమును; నిషేవసే = సేవించుచున్నావు. సుఖీ = సుఖముగలవాండవై; మనసాపి = మనసుచేతనుగూడ; రామకార్యం = రామునికార్యమును; నావేక్షసే = చూడకున్నావు.

నీవు, ఇక్ష్వాకువంశంబునం బుట్టిన వారిలో నుత్తముండగు రామునిధనుస్సు ననుండి వెడలినట్టి వజ్రసమానంబులగు బాణంబులను, ఇంకనుజక్కంగాం జూచి నవాండవుకావు కాంబోలు; కావుననే యిట్లుమనసునసైనను రామకార్యంబుం దలంపక, విషయసుఖంబుల ననుభవించుచు,ఎంతమాత్రముభయములేకసుఖముగానున్నావు. అని, లక్ష్మణుండు, సుగ్రీవునితోం జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, చతుస్త్రింశస్సర్గః.
ఇది, స్వపార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుం, గిష్కింధాకాండచతుస్త్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ.

## పంచత్రింశసర్గప్రారంభః

తథా బ్రువాణం సౌమిత్రిం ప్రదీప్తమివ తేజసా
అబ్రవీల్లక్ష్మణం తారా తారాధిపనిభాననా. ౧

టీక ॥ తారాధిపనిభాననా = చంద్రునితోసమానమయిన ముఖముగల; తారా = తార; తథా = అట్లు; బ్రువాణం = చెప్పుచున్నవాఁడును; తేజసా = కాంతిచేత; ప్రదీప్తమివ (స్థితం) = మండినట్లున్నవాఁడును; సౌమిత్రిం = సుమిత్రకొడుకునగు; లక్ష్మణం = లక్ష్మణుని గూర్చి; అబ్రవీత్ = చెప్పెను.

అట్లు పరుషంబుగాఁ బలుకుచుఁ దేజోవిశేషంబున మండుచున్నట్లున్న సుమిత్రాపుత్త్రుండగు లక్ష్మణుఁ జూచి, చంద్రబింబమువంటి మొగంబుగల తార, యిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

నైవం లక్ష్మణ వక్తవ్యో నాయం పరుషమర్హతి
హరీణామీశ్వరః శ్రోతుం తవ వక్త్రాద్విశేషతః. ౨

టీక ॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! సుగ్రీవః (అధ్యాహృతము) = సుగ్రీవుఁడు; ఏవం = ఇట్లు; న వక్తవ్యః = చెప్పఁబడవలసినవాఁడుకాఁడు. అయం = ఈ; హరీణాం = వానరులయొక్క; ఈశ్వరః = ప్రభువైనసుగ్రీవుండు; పరుషం = కఠినమయినమాటను; విశేషతః = విశేషించీ; తవ = నీయొక్క; వక్త్రాత్ = నోటనుండి; శ్రోతుం = వినుటకు; నార్హతి = తగఁడు.

లక్ష్మణుఁడా! నీవిట్లు చెప్పవలదు; వానరేశ్వరుఁడగు నీసుగ్రీవుఁడు పరుషవాక్యమాడఁదగినవాఁడుగాఁడు; అందుఁ బ్రియమిత్త్రుఁడవయిన నీవే యిట్లు పరుషమాడుట యుక్తమా?

అని, తాత్పర్యము.

నైవాకృతజ్ఞస్సుగ్రీవో న శఠో నాపి దారుణః
నైవానృతకథో వీర న జిహ్మశ్చ కపీశ్వరః. ౩

టీక ॥ వీర = పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! కపీశ్వరః = వానరనాథుఁడ

గు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; అకృతజ్ఞః= చేయఁబడిన యుపకారమును దలంపనివాఁడు; నైవ= కానేకాఁడు. శఠః= వంచకుఁడు; న=కాఁడు. దారుణోపి= కూ్రరుఁడును; న= కాఁడు. అనృతకథః= అసత్యమయినమాటగలవాఁడు; నైవ=కానేకాఁడు. జిహ్మశ్చ=కుటిలుఁడును; న=కాఁడు.

వీరుఁడవగు లక్ష్మణుఁడా! వానరేశ్వరుండగు సుగ్రీవుఁడు, కృతఘ్నుఁడుగాని, వంచకుఁడుకాని కూ్రరుఁడుకాని అనృతమాడువాఁడుకాని కుటిలుఁడుకాని యెంతమాత్రముకాఁడు.

అని, తాత్పర్యము.

ఉపకారం కృతం వీరో నాప్యయం విస్మృతః కపిః
రామేణ వీర సుగ్రీవో యదన్యై ర్దుష్కరం రణే. ౪.

టీక ॥ వీర= పరాక్రమవంతుఁడవగు లక్ష్మణుఁడా! వీరః= శూరుఁడగు; కపిః = వానరుఁడైనసుగ్రీవుఁడు; యత్ =ఏది; అన్యైః= ఇతరులచేత; దుష్కరం=చేయనలవిగానిదో; తం (అధ్యాహృతము)=అట్టిదైన; రామేణ= రామునిచేత; రణే= యుద్ధమునందు; కృతం=చేయఁబడిన;ఉపకారం= ఉపకారమును; విస్మృతోపి=మఱచినవాఁడును; న=కాఁడు.

వీరుఁడవగు లక్ష్మణుఁడా! వీరుండగు నీసుగ్రీవుండు,రాముండు తనకయి యుద్ధంబునఁగావించిన యితరులకుఁ జేయనసాధ్యమగు మహోపకారము నెంతమాత్రము మఱచినవాఁడును కాఁడు.

అని, తాత్పర్యము.

రామప్రసాదా త్కీర్తించ కపిరాజ్యంచ శాశ్వతమ్
ప్రాప్తవా నిహ సుగ్రీవో రుమాం మాంచ పరంతప. ౫

టీక ॥ పరంతప = శత్రువులఁదపింపఁజేయునట్టిలక్ష్మణుఁడా! రామప్రసాదాత్ = రాముని యనుగ్రహమువలన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; ఇహ=ఇపుడు; కీర్తించ = యశస్సును; శాశ్వతం = నిత్యమయిన; కపిరాజ్యంచ = వానరరాజ్యమును; రుమాం = రుమను; మాంచ=నన్నును; ప్రాప్తవాన్= పొందినాఁడు.

శత్రువులఁ దపింపఁజేయునట్టి లక్ష్మ

ణుఁడా! రామునను గ్రహంబుననే, సుగ్రీవుండిపుడు. యశస్సును శాశ్వతంబయిన వానర రాజ్యంబును భార్యయగు రుమను నన్నును బొందినాఁడు.

అని, తాత్పర్యము.

సుదుఃఖం శయితః పూర్వం ప్రాప్యే దం సుఖ ముత్తమమ్
ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో మహామునిః ౬

టీక ॥ అయం(అధ్యాహృతము)= ఈసుగ్రీవుఁడు; పూర్వం = మున్ను; సుదుఃఖం = మిక్కిలియు దుఃఖముగ లుగునట్లుగా; శయితః = పరుండినవాఁడై; ఉత్తమం = మిక్కిలియు నధికమయిన; ఇదం = ఈ; సుఖం = సౌఖ్యమును; ప్రాప్య = పొంది; విశ్వామిత్రః = విశ్వామిత్రుఁడను; మహామునిరివ = గొప్పమునివలె; ప్రాప్తకాలం = పొందఁబడినకాలమును; నజానీతే = తెలిసికొనకున్నాఁడు.

ఈసుగ్రీవుఁడు, మున్ను బహుకాలము చాలఁగష్టముతోఁ గొండలపై తాళ్ళ అప్పలలో నొంటిమెయిం బరుండియున్నవాఁడు, కావున, నిపుడు, సమ్మహాసుఖమునుబొంది, మున్ను విశ్వామిత్రమహామునిమేనకంగూడి కాలమును మఱచినట్లు, రామునితోఁజెప్పిన సంకేతకాలము వచ్చిన సంగతి తెలియకున్నాఁడు.

అని, తాత్పర్యము.

ఘృతాచ్యాం కిల సంసక్తో దశవర్షాణి లక్ష్మణ
అహో ౽మన్యత ధర్మాత్మా విశ్వామిత్రో మహామునిః ౭

టీక ॥ లక్ష్మణ=లక్ష్మణుఁడా! ధర్మాత్మా=ధర్మస్వభావుఁడయిన; విశ్వామిత్రః=విశ్వామిత్రుఁడను; మహామునిః=గొప్పముని; ఘృతాచ్యాం=మేనకయందు (ఘృతాచి యని మేనకకు నామాంతరము); సంసక్తః = తగిలినవాఁడై; దశవర్షాణి = పదిసంవత్సరములను; అహః = (ఒక) పగటినిగా; అమన్యత కిల = తలంచెనుగదా!

లక్ష్మణుఁడా! పూర్వము మహాతపస్సంపన్నుండగు విశ్వామిత్రమహాముని, మేనకతోఁగూడి మన్మథసుఖంబులందగిలి పదిసంవత్సరముల నొక పగలుగాఁదలంచెనుగదా! అని, తాత్పర్యము.

స హి ప్రాప్తం న జానీతే కాలం కాలవిదాం వరః

విశ్వామిత్రో మహాతేజాః కిం పునర్యః పృథగ్జనః. ౮

టీక॥ కాలవిదాం = కాలము దెలిసినవారిలో; వరః = శ్రేష్ఠుడును; మహాతేజాః = అధికమయిన ప్రభావము గలవాడునగు; సః = అట్టి; విశ్వామిత్రోపి = విశ్వామిత్రుడే; ప్రాప్తం = పొందఁబడిన; కాలం = కాలమును; నజానీతే = ఎఱుంగఁడు. యః = ఎవఁడు; పృథగ్జనః = ఇతరుఁడో; సః (అధ్యాహృతము) = అతఁడు; కాలంనజానీతఇతి (అధ్యాహృతము) = కాలమునెఱుంగఁడని; కింపునః (వక్తవ్యం) = చెప్పవలసినదేమి?

మహాతపస్సంపన్నుండును సమస్తధర్మములను దెలిసినవాఁడును కాలజ్ఞులలో నుత్తముండునగు మహర్షియయిన విశ్వామిత్రుఁడే మన్మథసుఖంబులందగిలి, కాలమునెఱుంగఁడయ్యె; ఇఁక నితరుని సంగతి చెప్పనేల?

అని, తాత్పర్యము.

దేహధర్మం గతస్యాస్య పరిశ్రాంతస్య లక్ష్మణ
అవితృప్తస్య కామేషు కామం క్షంతుమిహార్హసి. ౯

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! పరిశ్రాంతస్య = అలసినవాఁడును; దేహధర్మం = శరీరస్వభావమును; గతస్య = పొందినవాఁడును; కామేషు = మన్మథవ్యాపారములందు; అవితృప్తస్య = తృప్తిఁబొందనివాఁడునగు; అస్య = ఈసుగ్రీవుని యొక్క; కామం = కామవృత్తిని; ఇహ = ఇపుడు; క్షంతుం = మన్నించుట కు; అర్హసి = తగుదువు.

లక్ష్మణుఁడా! బహుకాలము కష్టపడియలసి, యిపుడు శరీరస్వభావమయిన మన్మథవ్యాపారమునఁజిక్కి మన్మథసుఖంబులం దృప్తిఁజెందక చపలుండై యున్నవాఁడు కావున సుగ్రీవుండు స్త్రీలోలుండై యున్నాఁడన్న తప్పు, నిపుడు, క్షమింపుము. అని, తాత్పర్యము.

న చ రోషవశం తాత గంతుమర్హసి లక్ష్మణ
నిశ్చయార్థమవిజ్ఞాయ సహసా ప్రాకృతో యథా. ౧౦

టీక॥ తాత = నాయనా! లక్ష్మణ = లక్ష్మణుఁడా! నిశ్చయార్థం = వాస్తవాభి

ప్రాయమును; అవిజ్ఞాయ= తెలియక; సహసా=ఆలోచింపక; ప్రాకృతోయథా=పామరుఁడువలెఁ; రోషవశం= కోపముయొక్క యధీనతను; గంతుం చ=పొందుటకును; నార్హసి=తగవు.

నాయనా లక్ష్మణుఁడా! నీవు, సుగ్రీవుని వాస్తవాభిప్రాయము దెలియక యాలోచింపక ప్రాకృతునియట్లు కోపమునొందుట యుక్తముకాదు.

అని, తాత్పర్యము.

సత్త్వయుక్తా హి పురుషా స్త్వద్విధాః పురుషర్షభ
అవిమృశ్య న రోషస్య సహసా యాంతి వశ్యతామ్. ౧౧

టీక॥ పురుషర్షభ=పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! త్వద్విధాః=నీయట్టివారలయిన; సత్త్వయుక్తాః=సత్త్వగుణముతోఁగూడిన; పురుషాః=పురుషులు; అవిమృశ్య= ఆలోచింపక; సహసా= శీఘ్రింబున; రోషస్య = కోపముయొక్క; వశ్యతాం=అధీనతను; నయాంతి హి = పొందరుగదా!

పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! నీయట్టి సత్త్వగుణవంతులగు మహాపురుషులు, యుక్తాయుక్తంబులు విమర్శింపక, తటాలునఁ గోపంబు వహింతురా?

అని, తాత్పర్యము.

ప్రసాదయే త్వాం ధర్మజ్ఞ సుగ్రీవార్థే సమాహితా
మహాన్రోషసముత్పన్న స్సంభ్రమ స్త్యజ్యతా మయమ్. ౧౨

టీక॥ ధర్మజ్ఞ=ధర్మముఁదెలిసిన లక్ష్మణుఁడా! అహం(అధ్యాహృతము)= నేను; సుగ్రీవార్థే= సుగ్రీవునిప్రయోజనమునిమిత్తముయి; సమాహితా=యత్నముగలదాననై; త్వాం=నిన్ను; ప్రసాదయే=వేఁడుకొనెదను. రోషసముత్పన్నః = కోపమువలనఁబుట్టిన; అయం=ఈ; మహాన్=గొప్పదగు; సంభ్రమః=వేగిరపాటు; త్యజ్యతాం= విడువఁబడుఁగాక.

లక్ష్మణుఁడా! నీవు సమస్తధర్మములుం దెలిసినవాఁడవు; సుగ్రీవునినిమిత్తమయి, నేను వేఁడుకొనుచున్నాను; ఈ మహాక్రోధంబును సంభ్రమంబును వదలి ప్రసన్నుండవగుము.

అని, తాత్పర్యము.

రుమాం మాం కపిరాజ్యంచ ధనధాన్యవసూనిచ
రామప్రియార్థం సుగ్రీవ స్త్యజే దితి మతి ర్మమ. ౧౩

టీక ॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు ; రామప్రియార్థం= రామునియొక్కసంతోషముకొఱకు ; రుమాం = రుమను; మాం=నన్నును; కపిరాజ్యంచ= వానరరాజ్యమును; ధనధాన్యవసూనిచ = ధనమును ధాన్యమును రత్నమును; త్యజేత్ =వదలును. ఇతి=అని; మమ=నాయొక్క; మతిః=అభిప్రాయము.

రామసంతోషార్థమయి, సుగ్రీవుండు, భార్యయగు రుమను నన్నును వానరరాజ్యమును ధనములను ధాన్యములను రత్నములను సర్వమును విడుచునని నాయభిప్రాయము.

అని, తాత్పర్యము.

సమానేష్యతి సుగ్రీవ స్సీతయాసహ రాఘవమ్
శశాంకమివ రోహిణ్యా నిహత్వా రావణం రణే. ౧౪

టీక ॥ సుగ్రీవః= సుగ్రీవుఁడు; రణే=యుద్ధమునందు; రావణం= రావణుని; నిహత్వా (నిహత్య)= వధించి; రాఘవం=రాముని; సీతయాసహ = సీతతోఁగూడ; రోహిణ్యా= రోహిణీదేవితో; శశాంకమివ= చంద్రునివలె; సమానేష్యతి=చేర్పఁగలఁడు.

సుగ్రీవుండు, యుద్ధమున రావణుని వధించి, రోహిణీ చంద్రులకుంబోలె, సీతకును రామునకును సమాగమంబు సేయఁగలఁడు. అని, తాత్పర్యము.

శతకోటిసహస్రాణి లంకాయాం కిల రాక్షసాః
అయుతానిచ షట్త్రింశ త్సహస్రాణి శతానిచ. ౧౫

టీక ॥ లంకాయాం = లంకాపురియందు; రాక్షసాః=రక్కసులు; శతకోటిసహస్రాణి= నూఱుకోటులవేలును, లక్షకోటులును; షట్త్రింశత్=ముప్పదియాఱు; అయుతానిచ= పదివేలును, మూఁడులక్షలయాఱువదివేలునను; సహస్రాణి=వేలు; శతాని= నూఱులును; సంతి (అధ్యాహృతము)= కలరు.

లంకాపురియందు, రాక్షసులు, లక్షకోటుల మూఁడులక్షల యాఱువదివేల

మందియుండుటయుగాక, మఱియుఁబెక్కులక్షల రాక్షసులున్నారు. అని, తా.

అహత్వా తాంశ్చ దుర్ధర్షాన్ రాక్షసాన్ కామరూపిణః
న శక్యో రావణో హంతుం యేన సా మైథిలీ హృతా. ౧౬

టీక ॥ దుర్ధర్షాన్= ఎదిరింపనలవిగానివారలును; కామరూపిణః = ఇచ్ఛాధీనమగు రూపముగలవారలునగు; తాన్= ఆరాక్షసులను; అహత్వా= వధింపక; యేన = ఎవ్వనిచేత; సా= ఆ; మైథిలీ=సీత; హృతా = హరింపఁబడినదో; సః (అధ్యాహృతము)=ఆ; రావణః=రావణుఁడు; హంతుం = వధించుటకు; నశక్యః = అలవికాఁడు.

మహాబలశాలులును గామరూపులునగు నారాక్షసులనందఱ వధించికాని, సీతంగొనిపోయిన రావణుని వధింపనలవిగాదు. అని, తాత్పర్యము.

తే న శక్యా రణే హంతు మసహాయేన లక్ష్మణ
రావణః క్రూరకర్మా చ సుగ్రీవేణ విశేషతః. ౧౭

టీక ॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! అసహాయేన = సహాయులులేని; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; రణే= యుద్ధమునందు; హంతుం=వధించుటకు; తే=ఆ రాక్షసులు; నశక్యాః=అలవికారు. విశేషతః=విశేషించి; క్రూరకర్మా = భయంకరములయినకార్యములుగల; రావణశ్చ=రావణుండును; నశక్యః (అధ్యాహృతము)=అలవిగాఁడు.

లక్ష్మణుఁడా! యుద్ధంబున నారాక్షసులను వధించుట, వానరసైన్యసాహాయ్యము లేనియెడ సుగ్రీవునకు శక్యము గాదు; భయంకరములయిన కార్యములుసేయునట్టి రావణునివధించుట మఱియుశక్యముకాదు. అని, తాత్పర్యము.

ఏవ మాఖ్యాతవా న్వాలీ స హ్యభిజ్ఞో హరీశ్వరః
ఆగమస్తు న మే వ్యక్తశ్శ్రవా త్తస్మా ద్బ్రవీమ్య హమ్. ౧౮

టీక॥ వాలీ=వాలి; ఏవం=ఇట్లు; ఆఖ్యాతవాన్= చెప్పినాఁడు. సః=అ; హ

రీశ్వరః=వానరనాథుఁడయినవాలి; అభిజ్ఞోహి = తెలిసినవాఁడుగదా! ఆగమస్తు=జ్ఞానముమాత్రము; మే=నాకు; నవ్యక్తః=స్పష్టముగాదు. అహం = నేను; తస్మాత్=ఆ; శ్రవాత్=వినికివలన; బ్రవీమి=చెప్పుచున్నాను.

వానరేశ్వరుండగు వాలి, ఈరావణునిసంగతియంతయుఁ దెలిసినవాఁడు కావున, ఈవిషయము చెప్పినాఁడు; నాకేమో సాక్షాత్తుగాఁ దెలియదు; అతనివలనవింటిని గావునఁ జెప్పుచున్నాను. అని, తాత్పర్యము.

త్వత్సహాయనిమిత్తం వై ప్రేషితా హరిపుంగవాః
ఆనేతుం వానరాన్యుద్ధే సుబహూన్ హరియూథపాన్. ౧౯

టీక॥ హరిపుంగవాః = వానరశ్రేష్ఠులు; త్వత్సహాయనిమిత్తం=నీకు సాహాయ్యమునిమిత్తమయి; యుద్ధే=పోరునిమిత్తమయి; సుబహూన్=మిక్కిలియు పెక్కుఁడ్రయిన; హరియూథపాన్=వానరసమూహములనుబాలించువారలను; ఆనేతుం=తెచ్చుటకు; ప్రేషితాః=పంపఁబడినారు.

మీకార్యార్థముగా యుద్ధమునిమిత్తము వానరవీరుల నందఱను దీసికొని వచ్చుటకై, సుగ్రీవుండు వానరులం బంపియున్నాఁడు. అని, తాత్పర్యము.

తాంశ్చ ప్రతీక్షమాణోఽయం విక్రాంతాన్ సుమహాబలాన్
రాఘవస్యార్థసిద్ధ్యర్థం న నిర్యాతి హరీశ్వరః. ౨౦

టీక ॥ అయం=ఈ; హరీశ్వరః = వానరరాజయిన సుగ్రీవుఁడు; విక్రాంతాన్ = పరాక్రమవంతులును; సుమహాబలాన్ = మిక్కిలియునధికమయిన బలముగలవారలునగు; తాన్ చ = ఆవానరులనే; ప్రతీక్షమాణః = ఎదురుచూచుచున్నవాఁడై; రాఘవస్య=రామునియొక్క; అర్థసిద్ధ్యర్థం = ప్రయోజనముయొక్క నెఱవేఱుటకై; ననిర్యాతి = వెడలకున్నాఁడు.

ఈవానరరాజు సుగ్రీవుండు, పరాక్రమవంతులును మహాబలశాలులు నగునావానరవీరుల రాకనెదురు చూచుచున్నాఁడు కావున, రామకార్యార్థమయి యింకం బ్రయత్నింపలేదు.

అని, తాత్పర్యము.

కృతాత్ర సంస్థా సౌమిత్రే సుగ్రీవేణ యథా పురా
అద్య తై ర్వానరై స్సర్వై రాగంతవ్యం మహాబలైః. ౨౧

టీక॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! అత్ర = ఈవానరసైన్యముల రప్పించు విషయమందు; సుగ్రీవేణ = సుగ్రీవుని చేత; పురా=మున్ను; సంస్థా = వ్యవస్థ; యథా = ఎట్లు; కృతా = చేయఁబడినదో; తథా (అధ్యాహృతము) = అట్లు; అద్య=ఇపుడు; తైః= ఆ; మహాబలైః= అధికమయినబలము గల;వానరైః = వానరులచేత; సర్వైః= అందఱిచేతను; ఆగంతవ్యం= వచ్చుటకావలెను.

లక్ష్మణుఁడా! నీవువచ్చుటకు మున్నె సుగ్రీవుండు, రామకార్యార్థము, వానరులసైన్యములన్నియు, నిచటికివచ్చుటకై, "త్రిపంచరాత్రాదూర్ధ్వంయః ప్రాప్నుయాన్నేహవానరః, తస్యప్రాణాంతికోదండో నాత్రకార్యావిచారణా, (పదునైదుదినములకుమీఁద, ఏవానరుఁడిచటికి రాకయుండునో అతనికిమరణదండనము విధింపఁబడును; ఇందుసందియములేదు.) అని యాజ్ఞ గావించియున్నాఁడు కావున, ఆప్రకారమున, మహాబలశాలులగు వానరులందఱు, నేటదినమున నిచటికిరావలయును.

అని, తాత్పర్యము.

ఋక్షకోటిసహస్రాణి గోలాంగూలశతానిచ
అద్య త్వా ముపయాస్యంతి జహి కోప మరిందమ. ౨౨
కోట్యో నేకాస్తు కాకుత్స్థ కపీనాం దీప్తతేజసామ

టీక॥ అరిందమ= శత్రువులనడఁగఁ ద్రొక్కునట్టి; కాకుత్స్థ = లక్ష్మణుఁడా! దీప్తతేజసాం= ప్రకాశించుచున్న కాంతిగల; కపీనాం=వానరులయొక్క; అనేకాః= పెక్కులయిన; కోట్యస్తు= కోటులును; ఋక్షకోటిసహస్రాణి = ఎలుఁగుబంటులయొక్క కోటులయొక్క వేలును; గోలాంగూలశతానిచ= కొండముచ్చులమాఱులును; అద్య=ఇప్పుడు; త్వాం=నిన్ను; ఉపయాస్యంతి= సేవింపఁగలవు. కోపం=కినుకను; జహి=వదలుము.

శత్రువులవధించునట్టి. లక్ష్మణుఁడా! మహాతేజులగు పెక్కుకోట్లవానరులును

భైకుడు వేలకోట్ల భల్లూకవీరులును, అనేకులు గోలాంగూలవీరులును ఇపుడుని న్నుసేవింపఁగలరు; కోపమువదలి ప్రసన్నుండవగుము. అని, తాత్పర్యము.

తవ హి ముఖ మిదం నిరీక్ష్య రోషా
త్క్షతజనిభే నయనే నిరీక్షమాణాః. ౨౩
హరివరవనితా న యాంతి శాంతిం
ప్రథమభయస్య హి శంకితా స్సమసర్వాః

టీక॥ హరివరవనితాః= వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవునియొక్క స్త్రీలు; సర్వాః=అందఱును; తవ = నీయొక్క ("హి"అనునది పాదపూరణార్థము); ఇదం=ఈ; ముఖం=మొగమును; నిరీక్ష్య=చూచి; ప్రథమభయస్య=(ద్వితీయార్థమందు షష్ఠి) మొదటి భయమును; శంకితాః = సందేహించినవారలయి;రోషాత్ =కోపమువలన; క్షతజనిభే = నెత్తురుతో సమానములయిన; నయనే=కన్నులను;నిరీక్షమాణాః=చూచుచున్నవారలయి; శాంతిం=నెమ్మదిని; నయాంతిహిస్మ = పొందక మెయున్నారుగదా!

సుగ్రీవుని భార్యలందఱు, నీముఖంబుఁజూచి, మున్నువాలివధభయము ననుభవించినవారగుటం జేసి, యాట్లేమేనియవునోయని సందేహించిన వారలయి, కోపంబున నెత్తురువలె నెఱ్ఱగానున్ననీనయనంబులంజూచి, మహాభయంబునొంది, యెంతమాత్రము నెమ్మదినొందకున్నారు; కాఁబట్టి శీఘ్రముగా నీవు కోపంబు విడిచి ప్రసన్నుండవగుము. అని, తారలక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, పంచత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ పంచత్రింశసర్గటీక, ముగిసినది.

శ్రీ

షట్త్రింశసర్గప్రారంభః.

ఇత్యుక్త స్తారయా వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్
మృదుస్వభావ స్సౌమిత్రిః ప్రతిజగ్రాహ తద్వచః. ౧

టీక ॥ మృదుస్వభావః=మెత్తనిప్రకృతిగల; సౌమిత్రిః=లక్ష్మణుఁడు; తారయా=తారచేత; ఇతి= అని; ప్రశ్రితం= వినయముతోఁగూడినదియు; ధర్మసంహితం = ధర్మముతోఁగూడినది యునగు; వాక్యం=మాటను; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; తత్=ఆ; వచః= మాటను; ప్రతిజగ్రాహ = అంగీకరించెను.

లక్ష్మణుఁడు, ఇట్లు తార చెప్పిన, వినయముతోను ధర్మముతోను గూడినమాటనువిని, మెత్తనిస్వభావము గలవాఁడగుటవలన, ఆవిడమాట నంగీకరించి, కోపంబువదలి ప్రసన్నుఁడయ్యెను. అని, తాత్పర్యము.

తస్మిన్ ప్రతిగృహీతేతు వాక్యే హరిగణేశ్వరః
లక్ష్మణా త్సుమహత్త్రాసం వస్త్రం క్లిన్న మివా త్యజత్. ౨

టీక ॥ తస్మిన్=ఆ; వాక్యే= మాట; ప్రతిగృహీతేతు= అంగీకరింపఁబడినదికాఁగానే; హరిగణేశ్వరః= వానరరాజునను గ్రీవుఁడు; లక్ష్మణాత్ = లక్ష్మణునివలన; సుమహత్త్రాసం(సుమహత్త్రాసం)= మిక్కిలియుగొప్పదగు భయమును; క్లిన్నం= తడిసిన; వస్త్రమివ= బట్టనువలె; అత్యజత్ = విడిచెను.

లక్ష్మణుఁడు తారమాట నంగీకరించి ప్రసన్నుఁడుకాఁగానే, సుగ్రీవుండు, తడిసినవస్త్రమును వదలినట్లు లక్ష్మణునివలని మహాభయంబునువదలి నిర్భయుండయ్యెను. అని, తాత్పర్యము.

తతః కంఠగతం మాల్యం చిత్రం బహుగుణం మహత్
చిచ్ఛేద విమద శ్చాసీ త్సుగ్రీవో వానరేశ్వరః. ౩

టీక ॥ తతః= అటుపిమ్మట; వానరేశ్వరః= వానరరాజయిన; సుగ్రీవః= సుగ్రీవుఁడు; చిత్రం=నానావర్ణమయినదియును; బహుగుణం = అధికమయినగుణముగలదియు, అధికమయిన సుగంధము గలదియు ననుట; మహత్ =గొప్పదియునగు; కంఠగతం= మెడనుబొందిన; మాల్యం= పుష్పమాలికను; చిచ్ఛేద=తెంచెను. విమదశ్చ=కైపులేనివాఁడును; ఆసీత్ =అయ్యెను.

అంత, వానరరాజయిన సుగ్రీవుండు, చిత్రవర్ణంబును మిక్కిలియనుగంధంబుగలదియునగు కంఠంబున ధరించియున్నదివ్యమయిన పుష్పమాలికను దెంపివేసి, మన్మథమదంబునం జొక్కియుండుటనువదలెను. అని, తాత్పర్యము.

స లక్ష్మణం భీమబలం సర్వవానరసత్తమః
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవ స్సంప్రహర్షయన్. ४

టీక ॥ సర్వవానరసత్తమః = సమస్తవానరులలో నుత్తముఁడగు; సః = ఆ; సుగ్రీవః=సుగ్రీవుఁడు; భీమబలం = భయంకరమయిన బలముగల; లక్ష్మణం = లక్ష్మణుని; సంప్రహర్షయన్= మిక్కిలియు సంతోషింపఁజేయుచు; ప్రశ్రితం = వినయముతోఁగూడిన; వాక్యం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

సమస్తవానరులలోను శ్రేష్ఠుఁడగు నాసుగ్రీవుండు, మహాబలుఁడగు లక్ష్మణుంజూచి, యతనికి సంతోషంబు గలిగించుచు,సవినయముగా నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యంచ శాశ్వతమ్
రామప్రసాదా త్సౌమిత్రే పునః ప్రాప్త మిదం మయా. ౫

టీక ॥ సౌమిత్రే = లక్ష్మణుఁడా! ప్రణష్టా = నశించిన; శ్రీశ్చ = సంపదయును; కీర్తిశ్చ = యశస్సును; శాశ్వతం = నిత్యమయిన;కపిరాజ్యంచ= వానరరాజ్యమును; ఇదం (సర్వం)=ఇదంతయు; మయా = నాచేత; రామప్రసాదాత్ = రాముని యనుగ్రహమువలన; పునః= మరల; ప్రాప్తం= పొందఁబడినది.

లక్ష్మణుఁడా! నన్నువదలి పోయి

యుండిన సంపదయుఁ గీర్తియుశాశ్వతమయిన వానరరాజ్యంబును, ఇవన్నియు, నాకురాముని యనుగ్రహంబుననే ప్రాప్తించినవికాని, వేఱుగాదు.

అని, తాత్పర్యము.

కశ్శక్త స్తస్య దేవస్య ఖ్యాతస్య స్వేన కర్మణా
తాదృశం విక్రమం వీర ప్రతికర్తు మరిందమ. ౮

టీక ॥ అరిందమ=శత్రువులనడఁగఁ ద్రొక్కునట్టి; వీర= పరాక్రమశాలివగు లక్ష్మణుఁడా! స్వేన=తనదైన; కర్మణా=కార్యముచేత; ఖ్యాతస్య=ప్రసిద్ధుఁడయిన; తస్య=ఆ; దేవస్య= రామునియొక్క; తాదృశం= అట్టి; విక్రమం=పరాక్రమమును; ప్రతికర్తుం= బదులుచేయుటకు; కః=ఎవ్వఁడు; శక్తః= సమర్థుఁడు?

శత్రుహననంబు సేయునట్టి వీరుఁడవగు లక్ష్మణుఁడా! తనకార్యముచేతఁబ్రసిద్ధినొందిన యామహాపురుషుఁడు రాముఁడు పరాక్రమంబుచేఁ గావించిన యట్టి మహోపకారమునకుఁబ్రత్యుపకారమునెవ్వఁడు గావింపఁగలఁడు?

అని, తాత్పర్యము.

సీతాం ప్రాప్స్యతి ధర్మాత్మా వధిష్యతి చ రావణమ్
సహాయమాత్రేణ మయా రాఘవ స్స్వేన తేజసా. ౯

టీక ॥ ధర్మాత్మా= ధర్మస్వభావుఁడైన; రాఘవః= రాముఁడు; సహాయమాత్రేణ= తోడుమాత్రమెయయిన; మయా = నాతో; సహితః (అధ్యాహృతము)= కూడినవాఁడై; స్వేన= తనదైన; తేజసా=ప్రభావముచేత; సీతాం=సీతను; ప్రాప్స్యతి= పొందఁగలఁడు. రావణం= రావణుని; వధిష్యతిచ=వధింపనుగలఁడు.

నేను తోడుమాత్రముగానుండవలసినదేకాని, ధర్మాత్ముండగురాముండు, తనపరాక్రమముచేతనే రావణునివధించి, సీతనుబొందఁగలఁడు.

అని, తాత్పర్యము.

సహాయకృత్యం కిం తస్య యేన సప్త మహాద్రుమాః
శైలశ్చ వసుధాచైవ బాణే నైకేన దారితాః. ౧౦

టీక॥ యేన = ఏరామునిచేత; స ప్త=ఏడైన; మహాద్రుమాః=గొప్పవృక్షములును; శైలశ్చ=పర్వతమును; వసుధాచైవ=భూమియు; ఏకేన=ఒక్కటైన; బాణేన = బాణముచేత; దారితాః=భేదింపఁబడినవో; తస్య=అతనికి; సహాయకృత్యం = తోడయినవానియొక్క కార్యము; కిం=ఎందుకు?

ఏడుమహావృక్షంబులను బర్వతంబును భూమిని, ఒకబాణంబున భేదించినట్టిమహావీరునకు మఱియొకని సాహాయ్యమేమికావలసియున్నది?

అని, తాత్పర్యము.

ధను ర్విస్ఫారయానస్య యస్య శబ్దేన లక్ష్మణ
సశైలా కంపితా భూమి స్సహాయై స్తస్య కిన్నువై. ౯

టీక॥ లక్ష్మణ = లక్ష్మణుఁడా! ధనుః=వింటిని; విస్ఫారయానస్య= ధ్వనింపఁజేయుచున్న; యస్య=ఎవ్వనియొక్క; శబ్దేన=ధ్వనిచేత; సశైలా=పర్వతముతోఁగూడిన; భూమిః=నేల; కంపితా=చలించినవో; తస్య= అట్టిరామునకు; సహాయైః= సహాయులచేత; కిన్నువై = ఏమిప్రయోజనము?

లక్ష్మణుఁడా! రాముండుధనువునారిలాగిధ్వనింపఁజేయఁగా నాధ్వనికిభూమియుఁ బర్వతంబులునుజలించినవి; అట్టిమహావీరునకు సహాయులచే నేమిపనియున్నది? అని, తాత్పర్యము.

అనుయాత్రాం నరేంద్రస్య కరిష్యే హం నరర్షభ
గచ్ఛతో రావణం హంతుం వైరిణం సపురస్సరమ్. ౧౦

టీక॥ నరర్షభ = పురుషశ్రేష్ఠుఁడవగు లక్ష్మణుఁడా! అహం = నేను; వైరిణం = శత్రువయిన; సపురస్సరం = ముందునడచు వారలతోఁగూడిన; రావణం = రావణుని; హంతుం= వధించుటకు; గచ్ఛతః = పోవుచున్న; నరేంద్రస్య = రాజయినరామునియొక్క; అనుయాత్రాం = వెంబడించుటను; కరిష్యే = చేసెదను.

పురుషశ్రేష్ఠుఁడగు లక్ష్మణుఁడా! శత్రువైనరావణునిసైన్యసమేతంబుగావధింపరాముండు నడువ నే నతనివెంటనడువ వలసినవాఁడనేకాని, యతనికి సాహాయ్యము సేసెదననుటకు నేనెంతవాఁడను? అని, తాత్పర్యము.

యది కించి దతిక్రాంతం విశ్వాసా త్ప్రణయేనవా
ప్రేష్యస్య క్షమితవ్యం మే నకశ్చి న్నాపరాధ్యతి. ౧౧

టీక॥ విశ్వాసాత్ = నమ్మకమువలనఁగాని; ప్రణయేనవా= స్నేహముచేఁగాని; కించిత్ = కొంచెము; అతిక్రాంతం= అతిక్రమించుట, దోషమనుట; స్యాత్ (అధ్యాహృతము) యది= కలదేని; ప్రేష్యస్య = భృత్యుఁడనగు; మే = నాయొక్క; తత్ (అధ్యాహృతము) = అతప్పు; క్షమితవ్యం (క్షంతవ్యం) = మన్నింపఁబడవలసినది. కశ్చిత్ = ఒకానొకఁడును; ననాపరాధ్యతి = తప్పుచేయకుండఁడు.

మీభృత్యుండనునేను, ఒకవేళ రామఁడు నన్నేమియుఁ జెప్పఁడని నమ్మకమువలనను స్నేహాతిశయము వలనను ఏమేని కొంచెము కాలాతిక్రమణముగావించియుండినయెడ, అతప్పునుక్షమింపవలెను; లోకంబున నెవ్వఁడునుదప్పుచేయనివాఁడులేఁడు. అని, సుగ్రీవుండు లక్ష్మణునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇతి తస్య బ్రువాణస్య సుగ్రీవస్య మహాత్మనః
అభవ ల్లక్ష్మణః ప్రీతః ప్రేమ్ణా చైన మువాచహ. ౧౨

టీక॥ మహాత్మనః= పూజ్యమయినస్వభావముగల; తస్య = ఆ; సుగ్రీవస్య=సుగ్రీవుఁడు; ఇతి=ఇట్లు;బ్రువాణస్య=చెప్పుచుండఁగ; లక్ష్మణః= లక్ష్మణుఁడు; ప్రీతః=సంతసించినవాఁడు;అభవత్=ఆయెను. ప్రేమ్ణా=ప్రీతిచేత; ఏనం=ఈసుగ్రీవునిగూర్చి; ఉవాచచ= పలికెను. "హ"అనునదిపాదపూరణార్థము.

మహాత్ముండగుసుగ్రీవుండిట్లు ధంబు నంబలుకఁగానే లక్ష్మణుండు సంతుష్టుండై సంతోషంబున నాసుగ్రీవునిఁజూచి యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

సర్వథా హి మమ భ్రాతా స నాథో వానరేశ్వర
త్వయా నాథేన సుగ్రీవ ప్రశ్రితేన విశేషతః. ౧౩

టీక॥ వానరేశ్వర= వానరప్రభుఁడవయిన; సుగ్రీవ=సుగ్రీవుఁడా! నాథే

వును; అసి = అగుచున్నావు.

వానరోత్తముఁడా! మఱియు నీవు, పరాక్రమంబునను బలంబునను రామునకు సరియాయినవాఁడవు; ఇంతకాలమునకు నన్ను, సహాయునిఁగా, మాకు దేవతలొసంగిరి కాని వేఱువిధమున నీయట్టివానిఁ బొందుట శక్యము కాదు. అని, తాత్పర్యము.

కింతు శీఘ్రమితో వీర నిష్క్రామ త్వం మయా సహ
సాంత్వయస్వ వయస్యం త్వం భార్యాహరణకర్శితమ్. ౧౯

టీక॥ వీర=పరాక్రమశాలివగు సుగ్రీవుఁడా! కింతు=ఏమన్నను; త్వం=నీవు; శీఘ్రం = శీఘ్రముగా; మయాసహ=నాతోఁగూడ; ఇతః=ఇచ్చటనుండి; నిష్క్రామ=వెడలుము. త్వం = నీవు; భార్యాహరణకర్శితం= భార్యయొక్క హరించుటచేఁ గృశింపఁజేయఁబడిన; వయస్యం=మిత్రుఁడైన రామునిని; సాంత్వయస్వ=ఊఱడింపుము.

పరాక్రమవంతుఁడవగు సుగ్రీవుఁడా! మఱి యిప్పుడు చేయవలసినదియేమన్నను, నీవిచ్చటనుండి శీఘ్రంబున నా వెంబడివచ్చి భార్యం గోలుపోయి పరితపించుచున్న నీమిత్రుని రాముని నాశ్వాసింపుము. అని, తాత్పర్యము.

యచ్చ శోకాభిభూతస్య శ్రుత్వా రామస్య భాషితమ్
మయా త్వం పరుషాణ్యుక్త స్తచ్చ త్వం క్షంతుమర్హసి. ౨౦

టీక॥ శోకాభిభూతస్య=దుఃఖముచేఁ గొనఁబడిన; రామస్య= రామునియొక్క; భాషితం = మాటను; శ్రుత్వా=విని; మయా=నాచేత; త్వం=నీవు; పరుషాణి=కఠినవచనములను; ఉక్తః(ఇతి) యత్(అస్తి)= చెప్పఁబడితివనునదియు నేదిగలదో; తచ్చ=దానినిగూడ; త్వం=నీవు; క్షంతుం=మన్నించుటకు; అర్హసి=తగుదువు.

రాముండు పరమదుఃఖితుండై విలపించుటను జూచుటచే, నేను నిన్నుఁ బరుషవచనంబులాడినాను; నీవు దానిని మనసున నుంచక క్షమింపవలెను. అని, లక్ష్మణుఁడు, సుగ్రీవునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, షట్త్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ షట్త్రింశసర్గటీక,
ముగిసినది.

శ్రీ:

## సప్తత్రింశస్సర్గప్రారంభః.

ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా
హనుమంతం స్థితం పార్శ్వే సచివం త్విద మబ్రవీత్. ౧

టీక॥ సుగ్రీవః=సుగ్రీవుండు; మహాత్మనా = పూజ్యమయినస్వభావముగల; లక్ష్మణేన=లక్ష్మణునిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పంబడినవాండైనంతనే; పార్శ్వే=ప్రక్కయందు; స్థితం=నిలిచియున్న; సచివం= మంత్రియయిన; హనుమంతంతు=హనుమంతునిగూర్చి యీమాత్రము; అబ్రవీత్=పలికెను.

సుగ్రీవుండు, ఇట్లు మహాత్ముండగు లక్ష్మణుండు చెప్పుటను విని, తనపార్శ్వభాగంబున నిలువంబడియున్న మంత్రిని హనుమంతుంజూచి, యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

మహేంద్ర హిమవ ద్వింధ్య కైలాసశిఖరేషు చ
మందరే పాండుశిఖరే పంచ శైలేషు యే స్థితాః. ౨
తరుణాదిత్యవర్ణేషు భ్రాజమానేషు సర్వతః
పర్వతేషు సముద్రాంతే పశ్చిమాయాంతు యే దిశి. ౩
ఆదిత్యభవనే చైవ గిరౌ సంధ్యాభ్రసన్నిభే
పద్మతాళవనం భీమం సంశ్రితా హరిపుంగవాః. ౪
అంజనాంబుదసంకాశాః కుంజరప్రతిమౌజసః

స ౩౭

అంజనే పర్వతే చైవ యే వసంతి ప్లవంగమాః. ౫
మన శ్శిలా గుహావాసా వానరాః కనకప్రభాః
మేరుపార్శ్వగతా శ్చైవ యే ధూమ్రగిరిసంశ్రితాః. ౬
తరుణాదిత్యవర్ణాశ్చ పర్వతేచ మహారుణే
పిబంతో మధు మైరేయం భీమవేగాః ప్లవంగమాః. ౭
వనేషుచ సురమ్యేషు సుగంధిషు మహత్సుచ
తాపసానాంచ రమ్యేషు వనాంతేషు సమంతతః. ౮
తాం స్తాం స్త్వ మానయ క్షిప్రం పృథివ్యాం సర్వవానరాన్

టీక ॥ మహేంద్రహిమవద్వింధ్యకైలాసశిఖరేషు=మహేంద్రపర్వతమునందును వింధ్యపర్వతమునందును కైలాసపర్వత శిఖరమునందును; పాండుశిఖరే = తెల్లనిశిఖరముగల; మందరేచ= మందరపర్వతమునందును; పంచ= అయిదైన; శైలేషు = పర్వతములందు; యే=ఎవ్వరు; స్థితాః= ఉన్నారో; సముద్రాంతే=సముద్రముగట్టునందు; పశ్చిమాయాం= పడమటిదైన; దిశితు= దిక్కునందును; తరుణాదిత్యవర్ణేషు=బాలసూర్యునియొక్క వన్నెవంటి వన్నెగల; భ్రాజమానేషు=ప్రకాశించుచున్న; పర్వతేషు=కొండలయందు; సర్వతః= అంతటను; యే=ఎవరు; స్థితాః (అధ్యాహృతము)=ఉన్నారో; సంధ్యాభ్రసన్నిభే = సంధ్యాకాలమునందలి మేఘముతోసమానమయిన; ఆదిత్యభవనే= సూర్యునినివాసస్థానమయిన, సూర్యుఁడుదయించునట్టియనుట; గిరౌ = ఉదయపర్వతమునందు; భీమం= భయంకరమయిన; పద్మతాళవనం=పద్మములను చందనవృక్షములయొక్కయు తాటిచెట్లయొక్కయుఅడవిని;సంశ్రితాః= ఆశ్రయించిన; హరిపుంగవాః = వానరశ్రేష్ఠులు; యేసంతి (అధ్యాహృతము)=ఎవ్వరుగలరో; అంజనే=అంజనమనుపేరుగల; పర్వతేచైవ = కొండయందును; అంజనాంబుదసంకాశాః = కాటుకతోను మేఘముతోను సమానులును; కుంజరప్రతిమౌజసః= ఏనుఁగుతోసమానమయిన బలముగలవారలును; యే=ఏ; ప్లవంగమాః = వానరులు; వసంతి=ఉన్నారో;మనశ్శిలాగుహావాసాః = మణిశిలగుహాలే వాసస్థానముగాఁగలవారలును; కనకప్రభాః =

స ౩౭

బంగారుయొక్క కాంతివంటి కాంతిగల వారలునగు; వానరాః=వానరులు; యేసంతి (అధ్యాహృతము)= ఎవ్వరుగలరో; మేరుపార్శ్వగతాశ్చైవ= మేరుపర్వతముయొక్క ప్రక్కను బొందిన వారలును; యేసంతి ( అధ్యాహృతము)= ఎవరుగలరో; ధూమ్రగిరిసంశ్రితాః= ధూమ్రపర్వతమును బొందినవారలు; యే (సంతి)=ఎవ్వరుగలరో; మహారుణే=మహారుణమను; పర్వతే= కొండయందును; తరుణాదిత్యవర్ణాశ్చ=బాలసూర్యునియొక్క వన్నెవంటి వన్నెగలవానరులును; యేసంతి ( అధ్యాహృతము)= ఎవ్వరుగలరో; సురమ్యేషు= మిక్కిలియు సుందరములయినవియు; సుగంధిషు= మంచివాసనగలవియు; మహాత్సుచ=గొప్పవియునగు; వనేషుచ = అడవులయందును; మైరేయం=ఆరెప్పవ్వ బెల్లము కసుగునిప్పపిసితోఁజేసిన; మధు= మద్యమును; పిబంతః=త్రాఁగుచున్న; భీమవేగాః=భయంకరమయిన వేగముగల; ప్లవంగమాః= వానరులు; యేసంతి (అధ్యాహృతము)= ఎవ్వరుగలరో; తాపసానాం=ఋషులయొక్క; రమ్యేషు= రమణీయములయిన; వనాంతేషుచ= ఆశ్రమములయందును; యేసంతి (అధ్యాహృతము)= ఎవ్వరుగలరో; సమంతతః=అంతటను; పృథివ్యాం = భూమియందు; తాన్ తాన్= ఆయా; వానరాన్=వానరులను; సర్వాన్ = అందరను; త్వం=నీవు; క్షిప్రం = శీఘ్రముగా; ఆనయ=తెమ్ము, రప్పింపుమనుట.

మహేంద్ర పర్వతమునందును హిమవత్పర్వతమునందును వింధ్య పర్వతమునందును కైలాసపర్వతమునందును తెల్లనిశిఖరములుగల మందరపర్వతమునందును ఈయాయి పర్వతములందు నివసించుచున్న వారలను, పశ్చిమదిక్కునందలి సముద్రతీరంబున బాలసూర్యవర్ణంబులగు పర్వతంబుల నుండువారలను, సంధ్యాకాలమేఘంబువలె నెఱ్ఱనైన సూర్యుఁడుదయించునట్టి యుదయపర్వతంబునందు భయంకరమయిన పద్మతాళవనంబునందున్నవారలను, అంజనపర్వతంబున నివసించుచున్న కాటుకవలెను మేఘంబువలెను నల్లనిమేనుగలవారలును ఏనుఁగలంతటి బలముగలవారలునగు వానరులను, మనశ్శిలాగుహలయందునివసించునట్టి బంగారువంటి మేనుగలవానరులను, మేరుపార్శ్వ మున నున్నవారలను, ధూమ్రపర్వతంబున నున్నవారలను, మహారుణ పర్వతంబున నున్న బాలసూర్యునివలె నెఱ్ఱని దేహ

ముగల వానరులను, మంచివాసనతోఁ గూడిన రమణీయంబులగు గొప్పవనంబులందు మైరేయమద్యము ద్రావుచు నివసించుచున్న భయంకరవేగులగు వానరులను, మఱియు రమణీయంబులయి న ఋష్యాశ్రమవనంబులందు నివసించువారలను, భూమండలంబున నన్యోన్యప్రదేశంబులనుండు వానరులనందఱను, నీవిప్పుడు శీఘ్రంబున రప్పింపుము.

అని, తాత్పర్యము.

సామదానాదిభిః కల్పై రాశు ప్రేషయ వానరాన్. ౯

టీక॥ సామదానాదిభిః = మంచిమాటలు మొదలుగాఁగల; కల్పైః = ఉపాయములచేత; వానరాన్ = వానరులను; ఆశు = శీఘ్రముగా; ప్రేషయ = పంపుము.

సమస్తవానరులం బిలుచుకొనివచ్చుటకై, సామదానభేద దండోపాయంబుల శీఘ్రంబుగా వానరుల నన్యోన్యస్థలంబులకుఁ బంపుము. అని, తాత్పర్యము.

ప్రేషితాః ప్రథమం యే చ మయా దూతా మహాజవాః
త్వరణార్థం తు భూయ స్త్వం హరీన్ సంప్రేషయాపరాన్. ౧౦

టీక॥ ప్రథమం = మొదట; మయా = నాచేత; మహాజవాః = అధికమయినవేగముగల; యే = ఏ; దూతాశ్చ = దూతలును; ప్రేషితాః = పంపఁబడిరో; తేషాం (అధ్యాహృతము) = వారలయొక్క; త్వరణార్థం తు = వేగిరపఱచుటకు మాత్రము; త్వం = నీవు; భూయః = మఱల; అపరాన్ = ఇతరులయిన; హరీన్ = వానరులను; సంప్రేషయ = పంపుము.

నేను మొదట, మహావేగులగు దూతలం బంపినానే; వారలు శీఘ్రంబున సమస్తవానరులం గొనివచ్చునట్లు వారలం ద్వరపఱచుటకై, నీవు మఱల నితరవానరులను వారలయొద్దకుఁ బంపుము.

అని, తాత్పర్యము.

యే ప్రసక్తాశ్చ కామేషు దీర్ఘసూత్రాశ్చ వానరాః
ఇహానయస్వ తాన్ సర్వాన్ శీఘ్రం తు మమ శాసనాత్. ౧౧

టీక॥ కామేషు = మన్మథవ్యాపారంబులందు; ప్రసక్తాశ్చ = తగిలినవా

రలును; దీర్ఘసూత్రాః = తామసిం చిపనిచేయునట్టి; వానరాశ్చ = వానరులును; యే (సంతి)=ఎవ్వరుగలరో; తాన్ = వారలను; సర్వాన్ = అందఱను; మమ = నాయొక్క; శాసనాత్ = ఆజ్ఞవలన; ఇహ = ఇచటికి; శీఘ్రం తు = వేగముగానే; ఆనయస్వ = తెమ్ము.

విషయసుఖంబులం దగిలియున్నవారలును సోమరితనంబున శీఘ్రంబుగాం బనిచేయకుండు వారలు నెవ్వరేవరుగల రా వానరులనందఱ శీఘ్రంబున నాయొద్దకుం దీసుకొనిరమ్ము.

అని, తాత్పర్యము.

అహోభి ర్దశభి ర్యేహి నాగచ్ఛంతి మ మాజ్ఞయా
హంతవ్యా స్తే దురాత్మానో రాజశాసనదూషకాః. ౧౨

టీక॥ యే=ఎవరు ("హి" అనునది పాదపూరణార్థము); మమ= నాయొక్క; ఆజ్ఞయా = ఉత్తరువుచేత; దశభిః=పదియయిన; అహోభిః=దినములచేత; నాగచ్ఛంతి=రారో; రాజశాసనదూషకాః=రాజాజ్ఞను అతిక్రమించిన; దురాత్మానః=దుర్బుద్ధులగు; తే= ఆవానరులు; హంతవ్యాః= చంపఁబడ వలసినవారు.

నాయాజ్ఞచొప్పున, ఎవ్వరుపదిదినములకిచటికిరారో, రాజాజ్ఞనతిక్రమించినందుకు అదుర్బుద్ధులగు వానరులందఱు వధింపఁపఁదగును. అని, తాత్పర్యము

శతా న్యథ సహస్రాణాం కోట్యశ్చ మమ శాసనాత్
ప్రయాంతు కపిసింహానాం దిశో మమ మతే స్థితాః. ౧౩

టీక ॥ అథ=ఇక; మమ= నాయొక్క; మతే=ఆజ్ఞయందు; స్థితాః= ఉన్న; కపిసింహానాం = వానరశ్రేష్ఠులయొక్క; సహస్రాణాం = వేలయొక్క; శతాని=నూఱులును; కోట్యశ్చ= కోటులును; దిశః = దిక్కులనుగుఱ్ఱి; ప్రయాంతు=పోవుఁగాక.

ఇంక, ఈకిష్కింధయందుండునట్టి వానరవీరులు నాయాజ్ఞ ననువర్తించువారలు,అనేకలక్షలకొలంది అనేకకోట్లకొలంది, అందఱును, వానరులంబిలుచుకొనివచ్చుటకై, దిక్కులకుఁ బోవుదురు గాక. అని, తాత్పర్యము.

క్రాంతాన్ = పరాక్రమముగల; వానరాన్ = వానరులను; సర్వాను = సమస్తములయిన; దిక్షు = దిక్కులయందు; ప్రేషయామాస = పంపెను.

వాయుపుత్రుండగు హనుమంతుండు, వానరరాజయిన సుగ్రీవునిమాటను విని, సమస్తదిక్కులకును బరాక్రమవంతులగు వానరులం బంపెను.

అని, తాత్పర్యము.

తే పదం విష్ణువిక్రాంతం పతత్త్రిజ్యోతిరధ్వగాః
ప్రయాతాః ప్రహితా రాజ్ఞా హరయ స్తత్క్షణేన వై. ౧౭

టీక ॥ రాజ్ఞా = సుగ్రీవునిచేత; ప్రహితాః = పంపబడిన; తే = ఆ; హరయః = వానరులు; తత్క్షణేన = ఆక్షణముచేతనే ("వై" అననది పాదపూరణార్థము); పతత్త్రిజ్యోతిరధ్వగాః = పక్షులయొక్కయు నక్షత్రములయొక్కయు మార్గమును బొందినవారలయి; విష్ణువిక్రాంతం = విష్ణువుచే నాక్రమింపబడిన; పదం = స్థానమును, ఆకాశమననుట; ప్రయాతాః = పొందిరి.

అవ్వానరులు, సుగ్రీవునాజ్ఞను శిరసావహించి, యాక్షణంబున, పక్షులును నక్షత్రంబులు దిరుగునట్టి యాకాశమార్గంబునం బోయిరి.

అని, తాత్పర్యము.

తే సముద్రేషు గిరిషు వనేషు చ సరస్సు చ
వానరా వానరాన్ సర్వాన్ రామహేతో రచోదయన్. ౧౮

టీక ॥ తే = ఆ; వానరాః = వానరులు; రామహేతోః = రామునినిమిత్తముగా; సముద్రేషు = సముద్రంబులయందును, సముద్రమధ్యమునందలిద్వీపంబులందనుట; గిరిషు = పర్వతంబులయందును; వనేషు చ = అడవులయందునును; సరస్సు చ = కొలంకులయందునును; వానరాన్ = వానరులను; సర్వాన్ = అందరిను; అచోదయన్ = ప్రేరించిరి, పిలిచిరనుట.

ఆవానరులు, రామకార్యార్థముగా, సముద్రద్వీపములందును పర్వతంబులందును వనంబులందును కొలంకులయందునుండు సమస్తవానరులకును రాజాజ్ఞం దెలిపిరి. అని, తాత్పర్యము.

మృత్యుకాలోపమస్యాజ్ఞాం రాజరాజస్య వానరాః
సుగ్రీవస్యాయయుః శ్రుత్వా సుగ్రీవభయదర్శినః. ౧౯

టీక ॥ వానరాః= వానరులు; మృత్యుకాలోపమస్య (కాలమృత్యూపమస్య)=ప్రలయకాలమునందలి మృత్యువుతోఁబోల్కిగల; రాజరాజస్య= రారాజయిన; సుగ్రీవస్య=సుగ్రీవునియొక్క; ఆజ్ఞాం=ఉత్తరువును; శ్రుత్వా=విని; సుగ్రీవభయదర్శినః= సుగ్రీవునివలని భయముఁజూచినవారలయి; ఆయయుః= వచ్చిరి.

రాజయినసుగ్రీవుండు, ప్రలయకాల మృత్యువుపంటివాఁడు కావున నతని యాజ్ఞ వినఁగానే వానరులు, సుగ్రీవుండు కఠినముగా దండించుననుభయంబున, నందఱునువచ్చిరి. అని, తాత్పర్యము.

తత స్తేం జనసంకాశా గిరే స్తస్మా న్మహాజవాః
తిస్రః కోట్యః ప్లవంగానాం నిర్యయు ర్యేన రాఘవః. ౨౦

టీక ॥ యేన = ఏకారణముచేత; రాఘవః=రాముఁడు; వర్తతే (అధ్యాహృతము)=ఉన్నాఁడో; తతః= ఆకారణమువలన; ప్లవంగానాం= వానరులయొక్క; అంజనసంకాశాః= కాటుకతోసమానములయిన; మహాజవాః= అధికమయినవేగముగల; తిస్రః=మూఁడయిన; కోట్యః=కోటులు; తస్మాత్ = ఆ; గిరేః = పర్వతమునుండి; నిర్యయుః=వెడలినవి.

అంత, రామునినిమిత్తమయి, అంజనపర్వతమునుండి, కాటుకవలె నల్లని మేనుగలవారలును మహావేగులునగు మూఁడుకోట్లవానరులు బయలుదేఱిరి. అని, తాత్పర్యము.

అస్తం గచ్ఛతి యత్రార్క స్తస్మి న్గిరివరే స్థితాః
తప్తహేమమహాభాస స్తస్మా త్కోట్యో దశ చ్యుతాః. ౨౧

టీక ॥ యత్ర= ఏపర్వతమునందు; అర్కః=సూర్యుఁడు; అస్తం=అస్తమయమును; గచ్ఛతి = పొందుచున్నాఁడో; తస్మిన్=ఆ; గిరివరే=పర్వతశ్రేష్ఠమునందు; స్థితాః = ఉన్నట్టి; తప్తహేమమహాభాసః = కాఁచబడినబం

గారుపలె నధికమయినకాంతిగల వానరులు; దశ=పది; కోట్యః=కోట్లు; తస్మాత్=ఆకొండనుండి; చ్యుతాః= వెడలిరి.

సూర్యుఁ డస్తమయమునొందునట్టి యస్తగిరినుండి యప్పర్వతమునందునివసించునట్టి తప్తకాంచనవర్ణులగు వానరులు పదికోట్లువెడలిరి.

అని, తాత్పర్యము.

కైలాసశిఖరేభ్యశ్చ సింహకేసరవర్చసామ్
తతః కోటిసహస్రాణి వానరాణా ముపాగమన్. ౨౨

టీక॥ తతః=అటుపిమ్మట; కైలాసశిఖరేభ్యశ్చ = కైలాసపర్వతముయొక్క శిఖరములనుండియు; సింహకేసరవర్చసాం=సింహముమెడమీది వెండ్రుకలయొక్క కాంతివంటికాంతిగల; వానరాణాం=వానరులయొక్క; కోటిసహస్రాణి=కోటివేలు; ఉపాగమన్= వచ్చిరి.

అంతట, కైలాసపర్వతశిఖరములనుండి, సింహకేసరంబులవలె తెల్లనిమేనుగలవానరులు వేయికోట్లనుండి వచ్చిరి.

అని, తాత్పర్యము.

ఫలమూలేన జీవంతో హిమవంతం ముపాశ్రితాః
తేషాం కోటిసహస్రాణాం సహస్రం సమవర్తత. ౨౩

టీక॥ యే (అధ్యాహృతము) = ఏవానరులు; ఫలమూలేన = పండ్లచేతను గడ్డలచేతను; జీవంతః = జీవించుచు; హిమవంతం = హిమవత్పర్వతమును; ఉపాశ్రితాః= పొందినారో; తేషాం = ఆవానరులయొక్క; కోటిసహస్రాణాం = కోటివేలయొక్క; సహస్రం=వేయి, పదిలక్షలకోట్లనుటః; సమవర్తత = వచ్చెను.

ఫల మూలంబులందిని జీవించుచు హిమవత్పర్వతంబున నివసించియున్న వానరులు, పదిలక్షలకోట్లువచ్చిరి.

అని, తాత్పర్యము.

అంగారకసమానానాం భీమానాం భీమకర్మణామ్
వింధ్యా ద్వానరకోటీనాం సహస్రా ణ్యపతన్ ద్రుతమ్. ౨౪

టీక ॥ వింధ్యాత్ = వింధ్యపర్వతమునుండి; అంగారకసమానానాం = అంగారకునితోసమానములును; భీమానాం= భయంకరములయినవియు; భీమకర్మణాం= భయంకరమయినకార్యముగలవియు; వానరకోటీనాం= వానరులయొక్క కోటులయొక్క; సహస్రాణి= వేలు; ద్రుతం= శీఘ్రముగా; అపతన్=వచ్చినవి.

వింధ్యపర్వతమునుండి, అంగారకునివలె నెఱ్ఱనిదేహముగల భయంకరాకారులును భయంకరమయినకార్యముగలవారలునగు వానరులు, పెక్కువేల కోట్లు శీఘ్రంబునంబఱతెంచిరి.

అని, తాత్పర్యము.

క్షీరోదవేలానిలయా స్తమాలవనవాసినః ।
నారికేళాశనా శ్చైవ తేషాం సంఖ్యా న విద్యతే. ౨౫

టీక ॥ క్షీరోదవేలానిలయాః = పాలసముద్రముగట్టె యునికిపట్టుగాఁగలవారలును; తమాలవనవాసినః = చీఁకటిచెట్లయడవినుండువారలును; నారికేళాశనాః= టెంకాయలనుదినువారలును; ద్రుతంఅపతన్ ( అధ్యాహృతము)=శీఘ్రముగావచ్చిరి. తేషాం=వారలయొక్క; సంఖ్యా= లెక్క; నవిద్యతే=లేదు.

క్షీరసముద్రతీరంబుననుండు వానరులును తమాలవనంబున నివసించువానరులును, నారికేళవనంబుల టెంకాయలాహారముగానివసించువానరులును బెక్కుండ్రు శీఘ్రంబుననే తెంచిరి; వారలలెక్కింపనలవిగాదు. అని, తాత్పర్యము.

వనేభ్యో గహ్వరేభ్యశ్చ సరిద్భ్యశ్చ మహాజవా
ఆగచ్ఛ ద్వానరీ సేనా పిబంతీవ దివాకరమ్. ౨౬

టీక॥ వనేభ్యః=అడవులనుండియు; గహ్వరేభ్యశ్చ=గుహలనుండియు; సరిద్భ్యశ్చ = నదులనుండియు; మహాజవా = అధికమయినవేగముగల; వానరీ=వానరులదైన; సేనా=దండు; దివాకరం=సూర్యుని; పిబంతీవ= త్రాఁగుచున్నదివలె; ఆగచ్ఛత్ =వచ్చెను.

అడవులనుండియు గుహలనుండియు నదీతీరంబులనుండియు నవ్వానర సేన, అతివిస్తీర్ణంబగుటవలన సూర్యునిమ్రిం

గునదివలె, ఆకాశమార్గంబునవచ్చెను. అని, తాత్పర్యము.

ఏతే తు త్వరయితుం యాతా వానరా స్సర్వవానరాన్
తే వీరా హిమవచ్ఛైలం దదృశు స్తం మహాద్రుమమ్. ౨౭

టీక ॥ ఏతే=ఏ; వానరాస్తు= వానరులయితే; సర్వవానరాన్ = సమస్తవానరులను; త్వరయితుం = వేగిరపఱచుటకు; యాతాః= పోయినారో; తే=ఆ; వీరాః= పరాక్రమశాలులగు వానరులు; హిమవచ్ఛైలం = హిమవత్పర్వతమును; తం= అప్రసిద్ధమయిన; మహాద్రుమం = గొప్పవృక్షమును; దదృశుః = చూచిరి.

ఏవానరులు, మొదట నీలునిచేతం బఱపబడి సమస్తవానరులంబిలువఁబోయిరో, ఆవానరవీరులు, హిమవత్పర్వతంబునసున్న సుప్రసిద్ధంబగు నమ్మహా వృక్షంబుఁజూచిరి. అని, తాత్పర్యము.

తస్మి న్గిరివరే రమ్యే యజ్ఞో మాహేశ్వరః పురా
సర్వదేవమనస్తోషో బభౌ దివ్యో మనోహరః. ౨౮

టీక॥ పురా=ముందు; రమ్యే=సుందరమయిన; తస్మిన్=ఆ; గిరివరే=పర్వతశ్రేష్ఠమునందు; సర్వదేవ మనస్తోషః = సమస్తదేవతలమనస్సులనుసంతోషింపఁజేయునదియు; దివ్యః=ఉత్తమమును; మనోహరః= రమణీయమునగు; మాహేశ్వరః=మహేశ్వరదేవతాకమయిన; యజ్ఞః=యాగము; బభౌ = ప్రకాశించెను.

మున్ను, రమణీయంబగు నాహిమవత్పర్వతమునందు, సమస్తదేవతలను సంతోషపెట్టునదియు నుత్తమంబునుమనోహరంబునగు మాహేశ్వర యాగమొకటి గావింపబడెను.

అని, తాత్పర్యము.

అన్ననిష్యందజాతాని మూలానిచ ఫలానిచ
అమృతాస్వాదకల్పాని దదృశు స్తత్ర వానరాః. ౨౯

టీక॥ వానరాః=వానరులు;తత్ర= ఆయజ్ఞస్థలమునందు;అన్ననిష్యందజా

తాని=హవిస్సుయొక్క-జాఉటలవలనఁ బుట్టినవియు; అమృతాస్వాదకల్పాని= అమృతముయొక్క-రుచితో సమానములునగు; మూలానిచ=గడ్డలను; ఫలానిచ=పండ్లను; దదృశుః=చూచిరి.

ఆవానరులు, ఆయజ్ఞము గావించిన స్థలమునందు, హోమము సేయున పుడుజాఱి నేలంబడిన హవిస్సులచేతఁ బుట్టినవియు నమృతంబువంటి రుచిగలవియునగు ఫలమూలంబులంజూచిరి.

అని, తాత్పర్యము.

తదన్నసంభవం దివ్యం ఫలమూలం మనోహరమ్
యః కశ్చి త్సకృ దశ్నాతి మాసం భవతి తర్పితః. ౩౦

టీక ॥ తదన్నసంభవం = ఆహవిస్సువలనఁబుట్టిన; దివ్యం = ఉత్తమమును; మనోహరం=మంచిరుచిగలవియునగు;ఫలమూలం= ఫలమునుమూలమును; యః=ఏ;కశ్చిత్= ఒకానొకఁడు; సకృత్=ఒకమాఱు; అశ్నాతి=తినుచున్నాఁడో;సః (అధ్యాహృతము)= అతఁడు; మాసం = నెలయంతయు; తర్పితః = తృప్తినొందింపఁబడినవాఁడు; భవతి = అగుచున్నాఁడు.

ఆహవిస్సువలనఁబుట్టినమనోహరంబులగు దివ్యఫలమూలంబులను ఒకమాఱుదిన్నవాఁడు, మఱియొక నెలవఱకు, ఆఁకలినొందక, తృప్తుఁడైయుండును.

అని, తాత్పర్యము.

తాని మూలాని దివ్యాని ఫలానిచ ఫలాశనాః
ఔషధానిచ దివ్యాని జగృహు ర్హరియూథపాః. ౩౧

టీక ॥ ఫలాశనాః= పండ్లేయాహారముగాఁగల; హరియూథపాః = వానరసమూహములం బాలించునట్టి వానరులు; తాని=ఆ; దివ్యాని = ఉత్తమములయిన; మూలాని = గడ్డలను; ఫలానిచ = పండ్లను; దివ్యాని= శ్రేష్ఠములగు; ఔషధానిచ= మూలికలను; జగృహుః = గ్రహించిరి.

అవ్వానరవీరులు, ఫలంబులే యాహారముగాఁ గలవారలుగావున, దివ్యములగు నాఫలమూలంబులం గ్రహించుటయకాక, యచటి దివ్యౌషధులను గూడసంగ్రహించిరి. అని, తాత్పర్యము.

తస్మాచ్చ యజ్ఞాయతనాత్పుష్పాణి సురభీణి చ
ఆనిన్యుర్వానరా గత్వా సుగ్రీవప్రియకారణాత్. ౩౨

టీక ॥ వానరాః = వానరులు; గత్వా=పోయి; తస్మాత్=ఆ; యజ్ఞాయతనాచ్చ=యజ్ఞస్థలమునుండియు; సురభీణి=మంచివాసనగల; పుష్పాణిచ = పూలనుగూడ; సుగ్రీవప్రియకారణాత్ = సుగ్రీవుని సంతోషమునిమిత్తమయి; ఆనిన్యుః=తెచ్చిరి.

ఆవానరులు, సుగ్రీవుని సంతోషార్థమయి, ఆయజ్ఞస్థలంబునందలి ఫలమూలంబులను మాత్రమెగాక, యచటిమంచివాసనగల పూలనుగూడఁదెచ్చిరి. అని, తాత్పర్యము.

తే తు సర్వే హరివరాః పృథివ్యాం సర్వవానరాన్
సంచోదయిత్వా త్వరితా యూథానాం జగ్మురగ్రతః. ౩౩

టీక ॥ తే=ఆ; హరివరాః = వానరోత్తములు; సర్వేతు= అందఱును; పృథివ్యాం=భూమియందు; సర్వవానరాన్ = సమస్త వానరులను; త్వరితాః=వేగిరపడినవారలయి; సంచోదయిత్వా(సంచోద్య)=పిలిచి; యూథానాం= వానరసమూహములకు; అగ్రతః=ముందట; జగ్ముః=పోయిరి.

అవ్వానరోత్తములందఱు, భూమియందలి సమస్తవానరులను శీఘ్రంబునఁబిలిచి యంత నవ్వానరసమూహంబులకుముందుగాఁ గిష్కింధకు వచ్చిరి. అని, తాత్పర్యము.

తే తు తేన ముహూర్తేన యూథపాః శీఘ్రగామినః
కిష్కింధాం త్వరయా ప్రాప్తాః సుగ్రీవో యత్ర వానరః. ౩౪

టీక ॥ శీఘ్రగామినః = వేగముగా నడచునట్టి; తే=ఆ; యూథపాస్తు=సమూహములను పాలించునట్టి వానరులును; తేన=ఆ; ముహూర్తేన = కాలముచేత; సుగ్రీవః = సుగ్రీవుఁడను; వానరః=వానరుఁడు; యత్ర= ఎచటనో; తాం (అధ్యాహృతము)=ఆ; కిష్కింధాం=కిష్కింధను; త్వరయా=వేగముచేత; ప్రాప్తాః=పొందినారు.

శీఘ్రంబుననడచునట్టి యూథపులుఁ

బోయిన వానరవీరులు, లక్ష్మణుండుకి ష్కింధలోనుండు సమయంబున, సుగ్రీవుండున్న కిష్కింధానగరంబునకు వేగంబునవచ్చిరి. అని, తాత్పర్యము.

తే గృహీ త్వౌషధీ స్సర్వాః ఫలం మూలంచ వానరాః
తం ప్రతిగ్రాహయామాసు ర్వచనం చేద మబ్రువన్. ౩౫

టీక ॥ తే=ఆ; వానరాః = వానరులు; సర్వాః = సమస్తములయిన; ఓషధీః = మూలికలను; ఫలం = పండును; మూలం=గడ్డను; గృహీత్వా= తెచ్చి; తం= ఆసుగ్రీవుని; ప్రతిగ్రాహయామాసుః= అంగీకరింపఁజేసిరి, సుగ్రీవునకప్పగించిరి. ఇదం=ఈ; వచనం చ=మాటనుగూడ; అబ్రువన్=పలికిరి.

ఆవానరులు,సమస్తములయినయోషధులను దివ్యములగు ఫలములనుమూలములను దీసికొనివచ్చి, సుగ్రీవునకుఁగానుకగా సమర్పించి, యీవచనముం బలికిరి. అని, తాత్పర్యము.

సర్వే పరిగతా శ్శైలా స్సముద్రాశ్చ వనానిచ
పృథివ్యాం వానరా స్సర్వే శాసనా దుపయాంతి తే. ౩౬

టీక ॥ సర్వే=సమస్తములయిన; శైలాః=పర్వతములు; పరిగతాః= పొందఁబడినవి. సముద్రాశ్చ= సముద్రములును; పరిగతాః (అధ్యాహృతము)= పొందఁబడినవి. వనాని= అడవులును; పరిగతాని (అధ్యాహృతము) = పొందఁబడినవి. పృథివ్యాం = భూమియందు; వానరాః=వానరులు; సర్వే=అందఱును; తే=నీయొక్క; శాసనాత్= ఆజ్ఞవలన; ఉపయాంతి = వచ్చుచున్నారు.

సమస్తములయిన పర్వతంబులకు సముద్రంబులకును వనంబులకునుబోయి, యందఱను బిలిచినాము; నీయాజ్ఞవలన భూమియందలి సమస్తవానరులును వచ్చుచున్నారు. అని, వానరులు సుగ్రీవునితోఁజెప్పిరి.

అని, తాత్పర్యము.

ఏవం శ్రుత్వా తతో హృష్ట స్సుగ్రీవః ప్లవగాధిపః
ప్రతిజగ్రాహ తత్ప్రీత స్తేషాం సర్వ ముపాయనమ్. ౩౭

టీక॥ ప్లవగాధిపః = వానరరాజయిన; సుగ్రీవః= సుగ్రీవుఁడు; ఏవం= ఇట్లు; శ్రుత్వా=విని; తతః = అంత; హృష్టః=సంతోషించినవాఁడై; ప్రీతః= ప్రేమతోఁగూడినవాఁడై; తేషాం= ఆ వానరులయొక్క; తత్=ఆ; సర్వం= సమస్తమయిన; ఉపాయనం= కానుకను; ప్రతిజగ్రాహ=పుచ్చుకొనెను.

వానరేశ్వరుండగు సుగ్రీవుండు, ఈ మాటనువిని సంతుష్టుండై ఆవానరులయందుఁ బ్రీతిచే, వారలుసమర్పించు కానుకనంతయుఁ బరిగ్రహించెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, కిష్కింధాకాండే, సప్తత్రింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ సప్తత్రింశసర్గటీక, ముగిసినది.

౩౮

అష్టత్రింశసర్గప్రారంభః.

ప్రతిగృహ్య చ తత్సర్వ ముపాయన ముపాహృతమ్
వానరా న్సాంత్వయిత్వాచ సర్వానేవ వ్యసర్జయత్. ౧

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ సుగ్రీవుఁడు; ఉపాహృతం=సమర్పింపఁబడిన; తత్=ఆ; సర్వం=సమస్తమయిన; ఉపాయనం = కానుకను; ప్రతిగృహ్యచ= పుచ్చుకొనియు; వానరాన్= వానరులను; సాంత్వయిత్వాచ= ఊరడించియు; సర్వానేవ=అందఱనే; వ్యసర్జయత్=వదలెను.

సుగ్రీవుండు, ఆవ్వానరులుసమర్పించిన కానుక లన్నియుఁ బరిగ్రహించి, యావానరులను మంచిమాటలచే సంతోషపఱచి, యందఱకును వారివారి యిండ్లకుఁబోవ సెలవొసంగెను.

అని, తాత్పర్యము.

విసర్జయిత్వా స హరీన్ శూరాం స్తాన్ కృతకర్మణః
మేనే కృతార్థ మాత్మానం రాఘవంచ మహాబలమ్. ౨

టీక॥ సః=ఆసుగ్రీవుఁడు; కృతకర్మణః = చేయఁబడినకార్యముగల; శూరాన్=వీరులయిన; తాన్ = ఆ; హరీన్= వానరులను; విసర్జయిత్వా (విసర్జ్య) = పంపి; ఆత్మానం = తన్నును; మహాబలం=అధికమయిన బలముగల; రాఘవంచ = రామునిని; కృతార్థం = చేయఁబడినకార్యముగలవానిని గా; మేనే=తలంచెను.

సుగ్రీవుండు, తాను నియోగించిన కార్యమునుజేసివచ్చిన శూరులగు నా వానరులకు సెలవిచ్చిపంపి, యంతటఁద నయొక్కయు మహాబలుండగు రాము నియొక్కయుఁ గార్యముసిద్ధించెనని తలంచెను. అని, తాత్పర్యము.

స లక్ష్మణో భీమబలం సర్వవానరసత్తమమ్
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సుగ్రీవం సంప్రహర్షయన్. ౩

టీక॥ సః=ఆ; లక్ష్మణః=లక్ష్మణుఁడు; భీమబలం=భయంకరమయిన బలముగల; సర్వవానరసత్తమం=సమస్త వానరులలోనుత్తముఁడగు; సుగ్రీవం= సుగ్రీవుని; సంప్రహర్షయన్ = సంతోషింపఁజేయుచు; ప్రశ్రితం= వినయముతోఁగూడిన; వాక్యం=మాటను; అబ్రవీత్ =పలికెను.

లక్ష్మణుండు, మహాబలుండును సమస్త వానరశ్రేష్ఠుండునగు సుగ్రీవునింజూచి వినయముతో నతని సంతోషపఱచుచ నిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

కిష్కింధాయా వినిష్క్రామ యది తే సౌమ్య రోచతే

టీక॥ సౌమ్య = శాంతుఁడవగుసుగ్రీవుఁడా! తే=నీకు; రోచతేయది=రుచించునేని; కిష్కింధాయాః = కిష్కింధనుండి; వినిష్క్రామ = వెడలుము.

సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! నీకిష్టమైనయెడ, ఇప్పుడుకిష్కింధనుండి వెడలి రామునియొద్దకురమ్ము. అని, లక్ష్మణుండుసుగ్రీవుతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా లక్ష్మణస్య సుభాషితమ్. ౪
సుగ్రీవః పరమప్రీతో వాక్యమేత దువాచ హ

టీక ॥ సుగ్రీవః = సుగ్రీవుఁడు; తస్య=ఆ; లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క; సుభాషితం = చక్కఁగాఁ జెప్పఁబడిన; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; పరమప్రీతః = మిక్కిలి యు సంతోషించినవాఁడై; ఏతత్ = ఈ; వాక్యం = మాటను; ఉవాచ=పలికెను "హ" అనునది పాద పూరణార్థము.

సుగ్రీవుండు, లక్ష్మణుండు చెప్పిన మధురమయిన వచనమువిని, పరమసంతుష్టుండయి, యతనితో, నీమాటం బలికెను. అని, తాత్పర్యము.

ఏవం భవతు గచ్ఛావః స్థేయం త్వచ్ఛాసనే మయా. ౫

టీక ॥ ఏవం=ఇట్లు; భవతు= అగుఁగాక. గచ్ఛావః = పోదము. మయా=నాచేత; త్వచ్ఛాసనే=నీయాజ్ఞయందు; స్థేయం=ఉండఁదగినది.

అట్లె యగుఁగాక, రామునియొద్దకుఁబోదము, నేను నీయాజ్ఞచొప్పుననడువవలసినవాఁడనే కాని వేఱుగాదు. అని, సుగ్రీవుండు లక్ష్మణునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

త మేవ ముక్త్వా సుగ్రీవో లక్ష్మణం శుభలక్షణమ్
విసర్జయామాస తదా తారా మన్యాశ్చ యోషితః. ౬

టీక ॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; శుభలక్షణం= మంగళకరములయినలక్షణములుగల; తం=ఆ; లక్ష్మణం= లక్ష్మణుని గూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా=చెప్పి; తదా=అప్పుడు; తారాం=తారను; అన్యాః = ఇతరలయిన; యోషితశ్చ = స్త్రీలను; విసర్జయామాస=పంపెను.

సుగ్రీవుండు, మంగళకరంబులగు లక్షణంబులతో నివ్విధంబునం జెప్పి, యంతఁ దారమొదలగు స్త్రీలనందఱుం బొండని యాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

ఏతే త్యుచ్చైర్హరివరాన్ సుగ్రీవ స్సముదాహరత్

టీక ॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; హరివరాన్=వానరశ్రేష్ఠులను; ఉచ్చైః=గట్టిగా, "ఏత=రండు." ఇతి=అని; సముదాహరత్=పిలిచెను.

అంత సుగ్రీవుండు "ఇటురండు" అని గట్టిగా వానరవరులం బిలిచెను. అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా హరయ శ్శీఘ్ర మాయయుః. ౭
బద్ధాంజలి పుటా స్సర్వే యే స్యుః స్త్రీదర్శనక్షమాః

టీక ॥ తస్య= ఆసుగ్రీవునియొక్క; తత్=ఆ; వచనం = మాటను; శ్రుత్వా=విని; యే=ఎవరు; స్త్రీదర్శనక్షమాః=స్త్రీలచూచుటయందు యోగ్యులు; స్యుః = అగుదురో; తే (అధ్యాహృతము)=ఆ; హరయః=వానరులు; సర్వే=అందఱును; బద్ధాంజలిపుటాః=కట్టఁబడిన దొప్పవంటిచేమోడ్పుగలవారలయి; శీఘ్రం = వేగముగా; ఆయయుః=వచ్చిరి.

సుగ్రీవుండట్లు పిలుచుటయు, ఆపిలుపు విన్నంతనె, అంతఃపురస్త్రీలం జూడఁదగినవారలగు వానరులు శీఘ్రింబున వచ్చి, యందఱును జేతులుమోడ్చినిలువఁబడిరి. అని, తాత్పర్యము.

తా నువాచ తతః ప్రాప్తాన్ రాజాఽర్కసదృశప్రభః. ౮

టీక॥ తతః=అంత; అర్కసదృశప్రభః=సూర్యునితో సమానమయినకాంతిగల; రాజా=రాజయిన సుగ్రీవుండు; ప్రాప్తాన్=వచ్చిన; తాన్=ఆవానరులనుగూర్చి; ఉవాచ=పలికెను.

అంతఁ, దనయెదుటికి వచ్చియున్నయా వానరులం జూచి, సూర్యునివలెఁ బ్రకాశించుచున్న సుగ్రీవుండు, ఇట్లని పలికెను. అని, తాత్పర్యము.

ఉపస్థాపయత క్షిప్రం శిబికాం మమ వానరాః

టీక॥ వానరాః=వానరులారా! మమ=నాయొక్క; శిబికాం=పల్లకిని; క్షిప్రం = శీఘ్రముగా; ఉపస్థాపయత=తెండు.

వానరులారా! శీఘ్రింబుననాపల్లకి నిదిసికొనిరండు. అని, సుగ్రీవుండు పలికెను. అని, తాత్పర్యము.

స ౩౮

శ్రుత్వాతు వచనం తస్య హరయ శ్శీఘ్రవిక్రమాః. ౯
సముపస్థాపయామాసు శ్శిబికాం ప్రియదర్శనామ్

టీక ॥ శీఘ్రవిక్రమాః = శీఘ్రమయిన పరాక్రమముగల; హరయః = వానరులు; తస్య= ఆసుగ్రీవునియొక్క; వచనం = మాటను; శ్రుత్వాతు = విన్నంతనె; ప్రియదర్శనాం = సంతోషకరమయిన చూచుటగల; శిబికాం= పల్లకిని; సముపస్థాపయామాసుః = తెచ్చిరి.

శీఘ్రముగాఁ బనిచేయునట్టియువ్వానరులు, సుగ్రీవునాజ్ఞను విన్నంతనె, చూడ్కులకు వేడ్కసేయునట్టి పల్లకిం గొనివచ్చిరి. అని, తాత్పర్యము.

తా ముపస్థాపితాం దృష్ట్వా శిబికాం వానరాధిపః. ౧౦
లక్ష్మణా రుహ్య తాం శీఘ్ర మితి సౌమిత్రి మబ్రవీత్

టీక ॥ వానరాధిపః = వానరరాజయిన సుగ్రీవుఁడు; ఉపస్థాపితాం = తేఁబడిన; శిబికాం=పల్లకిని; దృష్ట్వా= చూచి; లక్ష్మణ=లక్ష్మణుఁడా! శీఘ్రం= వేగముగా; ఆరుహ్యతాం = ఎక్కఁబడుఁగాక. ఇతి = అని; సౌమిత్రిం = లక్ష్మణునిని; అబ్రవీత్ = పలికెను.

వానరరాజయిన సుగ్రీవుండు, పల్లకివచ్చుటంజూచి, లక్ష్మణునితో "నీవు శీఘ్రంబునం బల్లకినారోహింపుము" అనిచెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా కాంచనం యానం సుగ్రీవ స్సూర్యసన్నిభమ్. ౧౧
బృహద్భి ర్హరిభి ర్యుక్త మారురోహ సలక్ష్మణః

టీక॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; ఇతి= అని;ఉక్త్వా=పలికి; బృహద్భిః=గొప్పవారలగు; హరిభిః=వానరులతో; యుక్తం=కూడినదియు; సూర్యసన్నిభం= సూర్యునితో సమాన మయినదియు; కాంచనం = బంగారువికారమునగు; యానం= వాహనమును; సలక్ష్మణః= లక్ష్మణునితోఁ గూడినవాఁడై; ఆరురోహ=ఎక్కెను.

సుగ్రీవుండు, ఇట్లు లక్ష్మణునకుఁ జెప్పి, మహాకాయులగువానరులచే మోయఁ బడినదియు సూర్యసమానంబునగు కాంచనమయమయిన పల్లకిని, లక్ష్మణసహితంబుగా నారోహించెను.

అని, తాత్పర్యము.

పాంసురేణా తపత్రేణ ధ్రియమాణేన మూర్ధని. ౧౨
శుక్లైశ్చ వాలవ్యజనై ర్ధూయమానై స్సమంతతః
శంఖభేరీనినాదైశ్చ హరిభి శ్చాభినందితః. ౧౩
నిర్యయౌ ప్రాప్య సుగ్రీవో రాజ్యశ్రియ మనుత్తమామ్

టీక॥ సుగ్రీవః= సుగ్రీవుఁడు; అనుత్తమాం=తనకన్నను త్తమములేని; రాజ్యశ్రియం = రాజ్యలక్ష్మిని; ప్రాప్య= పొంది; మూర్ధని=శిరసునందు; ధ్రియమాణేన=ధరింపఁబడిన; పాండురేణ= తెల్లని; ఆతపత్రేణ=గొడుగుతోను; సమంతతః=అంతటను; ధూయమానైః= విసరఁబడుచున్న; శుక్లైః= తెల్లని; వాలవ్యజనైశ్చ = చామరములతోను; శంఖభేరీనినాదైశ్చ= శంఖములయొక్కయు భేరులయొక్కయు ధ్వనులతోను; హరిభిః=వానరులచేత; అభినందితశ్చ=కొనియాడఁబడినవాఁడునై; నిర్యయౌ= వెడలెను.

శిరస్సుపయి శ్వేతచ్ఛత్రంబు శోభిల్ల, నలుగెలంకులను వానరులు వెల్లని వింజామరలువీవ, శంఖధ్వనులును భేరీభాంకారంబులును జెలంగ, వానరులు మంగళస్తుతిపాఠంబులం గైవారంబులు సేయ, నిట్లఖండ రాజ్యలక్ష్మీవిరాజితుండై సుగ్రీవుండు వెడలెను.

అని, తాత్పర్యము.

స వానరశతై స్తీక్ష్ణై ర్బహుభి శ్శస్త్రపాణిభిః. ౧౪
పరికీర్ణో యయౌ తత్ర యత్ర రామో వ్యవస్థితః

టీక ॥ సః=ఆసుగ్రీవుఁడు; తీక్ష్ణైః= కఱకుగలవియు, అధికమయినపరాక్రమంబు గలవియునని యట; శస్త్రపాణిభిః= ఆయుధములు చేతులంగలవియు నగు; బహుభిః=పెక్కులయిన; వానరశతైః = వానరులయొక్క నూఱులచేత; పరికీర్ణః=పరివేష్టింపఁబడినవాఁడై; యత్ర=ఎచట; రామః=రాముఁడు; వ్యవస్థితః=ఉన్నాఁడో; తత్ర= అచటికి; యయౌ=పోయెను.

సుగ్రీవుఁడు, మహాపరాక్రమశాలులును ఆయుధపాణులునగు పెక్కునూఱుల వానరవీరులు తన్నుఁ బరివేష్టించి కొలువ, రాముండు నివసించియున్న స్థలమునకుఁ బోయెను.

అని, తాత్పర్యము.

స ౩౮

స తం దేశ మనుప్రాప్య శ్రేష్ఠం రామనిషేవితమ్. ౧౫
అవాతర న్మహాతేజా శ్శిబికాయా స్సలక్ష్మణః

టీక ॥ మహాతేజాః= అధికమయిన కాంతిగల; సః=ఆసుగ్రీవుఁడు; రామనిషేవితం= రామునిచే సేవింపఁబడిన; శ్రేష్ఠం=ఉత్తమమయిన; తం=ఆ; దేశం=ప్రదేశమును; అనుప్రాప్య=సమీపించి; శిబికాయాః= పల్లకినుండి; సలక్ష్మణః=లక్ష్మణునితోఁగూడినవాఁడై; అవాతరత్=దిగెను.

మహాతేజుండగు నా సుగ్రీవుండు, రాముండు నివసించుటచే నుత్తమమయి న యాప్రదేశమును (ప్రస్రవణపర్వతమును) సమీపించి, యంత, లక్ష్మణునితోఁగూడఁ బల్లకినుండి డిగ్గెను.

అని, తాత్పర్యము.

ఆసాద్యచ తతో రామం కృతాంజలిపుటోఽభవత్. ౧౬

టీక॥ సః(అధ్యాహృతము)= ఆసుగ్రీవుఁడు; రామం=రాముని; ఆసాద్య చ=పొందియు; తతః=అంత; కృతాంజలిపుటః=చేయఁబడిన దోప్పవంటి చేమోడ్పుగలవాఁడు; అభవత్ = అయెను.

సుగ్రీవుండు రామునియొద్దకుఁ బోయినంతనె, చేమోడ్పుగీలించి నిలువఁబడెను. అని, తాత్పర్యము.

కృతాంజలౌ స్థితే తస్మి న్వానరాశ్చాభవం స్తథా

టీక॥ తస్మిన్ = ఆసుగ్రీవుఁడు; కృతాంజలౌ= చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; స్థితే= నిలిచినవాఁడుకాఁగా; వానరాశ్చ=వానరులును; తథా = అట్లు; అభవన్= అయిరి.

అట్లు సుగ్రీవుండు చేతులుమోడ్చుకొని నిలుచుటయు వానరులును అట్లే చేతులును మోడ్చి నిలువఁబడినవారైరి.

అని, తాత్పర్యము.

ఉద్ధృతాంజలిపద్మా స్తే సుగ్రీవస్య సమంతతః

టీక ॥ తే = ఆవానరులు; సుగ్రీవస్య = సుగ్రీవునికి; సమంతతః=చుట్టును;

ఉద్ధృతాంజలి పద్మాః = ఎత్తఁబడిన కమలముల వంటి చేమోడ్పుగలవారలు; అభూవన్ (అధ్యాహృతము)=అయిరి.

ఆవానరులు, కమలంబులవంటి చేమోడ్పులతోఁ జేతులు పైకెత్తి సుగ్రీవుని( బరివేష్టించి నిలుచుండిరి.

అని, తాత్పర్యము.

ఈయర్ధశ్లోకము, గోవిందరాజప్రభృతి వ్యాఖ్యాతలచే వ్యాఖ్యాతముగానందున, ఇందులెక్కింపఁబడలేదు.

తటాకమివ తం దృష్ట్వా రామః కుట్మలపంకజమ్. ౧౭
వానరాణాం మహత్సైన్యం సుగ్రీవే ప్రీతిమానభూత్

టీక॥ రామః=రాముఁడు; కుట్మలపంకజం= మొగ్గలయినకమలములుగల; తటాకమివ (స్థితం)=కొలనువలెనున్న; తం=ఆ; వానరాణాం=వానరులయొక్క; మహత్=గొప్పదగు; సైన్యం=సేనను; దృష్ట్వా=చూచి; సుగ్రీవే=సుగ్రీవునియందు; ప్రీతిమాన్=సంతోషముగలవాఁడు; అభూత్ = ఆయెను.

రాముఁడు, వానరులందఱుచేమోడ్పులు పైకెత్తినిలుచుండుటవలనఁ, దామరమొగ్గలతో నిండిన తటాకంబువలెనున్న గొప్పదైన యవ్వానరసేనంజూచి, సుగ్రీవునివిషయమయి మిక్కిలియు సంతోషంబునొందెను.

అని, తాత్పర్యము.

పాదయోః పతితం మూర్ధ్నా త ముత్థాప్య హరీశ్వరమ్. ౧౮
ప్రేమ్ణాచ బహుమానాచ్చ రాఘవః పరిషస్వజే

టీక॥ రాఘవః= రాముఁడు; మూర్ధ్నా=శిరస్సుచేత; పాదయోః=అడుగులయందు; పతితం=పడిన; తం=ఆ; హరీశ్వరం=వానరనాథుఁడగు సుగ్రీవుని; ఉత్థాప్య=లేపి; ప్రేమ్ణాచ=ప్రీతిచేతను; బహుమానాచ్చ=గౌరవమువలనను; పరిషస్వజే=కౌఁగిలించెను.

వానరరాజు సుగ్రీవుండు సాష్టాంగముగా రాముని పాదంబులం బడుటయు, రాముండు, అతనిలేవనెత్తి ప్రీతితోబహుమానించి యాలింగనముచేసికొనెను. అని, తాత్పర్యము.

పరిష్వజ్య చ ధర్మాత్మా నిషీదేతి తతో బ్రవీత్. ౧౮

టీక॥ ధర్మాత్మా= ధర్మస్వభావుఁడగు రాముండు; సుగ్రీవం (అధ్యాహృతము)=సుగ్రీవుని; పరిష్వజ్యచ= కవుఁగిలించియు; తతః=అంత; "నిషీద=కూర్చుండుము." ఇతి=అని; అబ్రవీత్=చెప్పెను.

ధర్మాత్ముండగు రాముండు, అట్లు సుగ్రీవుఁ గవుఁగిలించుకొని, యంతఁ గూర్చుండుమని చెప్పెను. అని, తాత్పర్యము.

తం నిషణ్ణం తతో దృష్ట్వా క్షితౌ రామో బ్రవీ ద్వచః

టీక॥ రామః=రాముఁడు; క్షితౌ= భూమియందు; నిషణ్ణం = కూర్చుండిన; తం = ఆసుగ్రీవుని; దృష్ట్వా= చూచి; తతః=అంత; వచః=మాటను; అబ్రవీత్= = చెప్పెను.

అంత సుగ్రీవుండు నేలపైఁగూర్చుండుటయు, రాముండతనిఁ జూచియిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

ధర్మ మర్థంచ కామంచ యస్తు కాలే నిషేవతే. ౨౦
విభజ్య సతతం వీర స్స రాజా హరిసత్తమ

టీక॥ హరిసత్తమ= వానరశ్రేష్ఠుఁడవగుసుగ్రీవుఁడా! యః=ఏ; వీరస్తు= పరాక్రమశాలియగువాఁడయితే; సతతం=ఎల్లప్పుడును; ధర్మం=ధర్మమును; అర్థంచ=అర్థమును; కామంచ=కామమును; విభజ్య= వేఱుపఱిచి; కాలే= యుక్తకాలమునందు; నిషేవతే = సేవించుచున్నాఁడో; సః=అతఁడు; రాజా=రాజు.

వానరోత్తముఁడా! ఏవీరుండు ధర్మార్థకామంబులను విభజించి యేకాలంబున దేనిసేవింపవలెనో ఆకాలంబుననే దానినేయిట్లు క్రమముగానెల్లప్పుడును సేవించునో, అతఁడేసరియయిన రాజు. అని, తాత్పర్యము.

హిత్వా ధర్మం తథార్థంచ కామం యస్తు నిషేవతే. ౨౧
స వృక్షాగ్రే యథాసుప్తః పతితః ప్రతిబుధ్యతే

టీక ॥ యస్తు = ఎవ్వఁడయితే; ధర్మం = ధర్మమును; తథా = అట్లు; అర్థంచ = అర్థమునుగూడ; హిత్వా = విడిచి; కామం = కామమును; సషేవతే = మిక్కిలియు సేవించునో; సః = అతఁడు; వృక్షాగ్రే = చెట్టుచివరయందు; సుప్తోయథా = నిదురించినవాఁడువలె; పతితః = పడినవాఁడై; ప్రతిబుధ్యతే = మేలుకొనును.

ఎవ్వఁడయితే, ధర్మార్థంబుల వదలి కామమునుమాత్రమె యెల్లప్పుడును సేవించునో, అతండు, చెట్టుచివరను నిద్రించినవాఁడువలె, అధఃపతనమునొందినపిమ్మట మేలుకొనఁగలఁడు. అని, తాత్పర్యము.

అమిత్రాణాం వధే యుక్తో మిత్రాణాం సంగ్రహే రతః. ౨౨
త్రివర్గఫలభోక్తా తు రాజా ధర్మేణ యుజ్యతే

టీక ॥ అమిత్రాణాం = శత్రువులయొక్క; వధే = చంపుటయందు; యుక్తః = తగిలినవాఁడును; మిత్రాణాం = స్నేహితులయొక్క; సంగ్రహే = సంగ్రహించుటయందు; రతః = ఆసక్తుండును; త్రివర్గఫలభోక్తా = ధర్మార్థకామములయొక్క ఫలముల భుజించువాఁడునగు; రాజాతు = రాజుమాత్రము; ధర్మేణ = ధర్మముతో, రాజధర్మముచే; యుజ్యతే = పొందఁబడును.

శత్రువుల వధించుచు, మిత్రులకుపకరించుచు, ధర్మార్థకామంబులయథాకాలముగావిభజించి యన్యోన్యకాలంబులసేవించుచునుండు రాజుమాత్రమెరాజధర్మముఁ జక్కఁగా నెఱవేర్చినవాఁడగును. అని, తాత్పర్యము.

ఉద్యోగసమయ స్త్వేష ప్రాప్త శ్శత్రువినాశన. ౨౩
సంచింత్యతాం హి పింగేశ హరిభిస్సహ మంత్రిభిః

టీక॥ శత్రువినాశన = శత్రువులనశింపఁజేయునట్టి; పింగేశ = వానరరాజా! ఏషః = ఈ; ఉద్యోగసమయస్తు = ప్రయత్నకాలమయితే; ప్రాప్తః = వచ్చినది. మంత్రిభిః = మంత్రులయినహరిభిస్సహ = వానరులతోఁగూడ; సంచింత్యతాం = ఆలోచింపఁబడుఁగాక.

శత్రువులవధించునట్టి వానరరాజా! ఇది యుద్ధప్రయత్నమునకుఁదగిన కాలము శరదృతువువచ్చినది; ఇపుడు సేయ

వలసినకార్యమును గుఱించి నీమంత్రు లగు వానరులతో నాలోచింపుము. అని, రాముఁడు సుగ్రీవునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏవ ముక్తస్తు సుగ్రీవో రామం వచన మబ్రవీత్. ౨౪

టీక॥ సుగ్రీవః = సుగ్రీవుఁడు; ఏవం=ఇట్లు; ఉక్తస్తు= చెప్పఁబడినవాఁడైనంతనే; రామం=రామునిగూర్చి;వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

సుగ్రీవుండు, రాముఁడుచెప్పినమాటనువిని, రాముంజూచి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

ప్రణష్టా శ్రీశ్చ కీర్తిశ్చ కపిరాజ్యంచ శాశ్వతమ్
త్వత్ప్రసాదా న్మహాబాహో పునః ప్రాప్త మిదం మయా. ౨౫
తవ దేవ ప్రసాదాచ్చ భ్రాతుశ్చ జయతాం వర

టీక ॥ జయతాం=జయించువారలలో; వర = శ్రేష్ఠుఁడవగు; మహాబాహో=పెద్దచేతులుగలరాముఁడా! ప్రణష్టా=నశించిన; శ్రీశ్చ= సంపదయు; కీర్తిశ్చ=యశస్సును;శాశ్వతం=ఎల్లప్పుడునుండునట్టి; కపిరాజ్యంచ = వానరరాజ్యమును; ఇదం(సర్వం) = ఇదంతయు; మయా= నాచేత; త్వత్ప్రసాదాత్ =నీయనుగ్రహమువలనను;తవ= నీయొక్క; భ్రాతుశ్చ = తమ్మునియొక్క; ప్రసాదాచ్చ= అనుగ్రహమువలనను; పునః=మఱల; ప్రాప్తం = పొందఁబడినది.

సమస్తశూరులలోను త్తముఁడవుమహాబాహుఁడవగురాముఁడా! నేనుబోఁగొట్టుకొన్నసంపదయు యశస్సునుశాశ్వతంబయిన వానరరాజ్యంబును, ఇవన్నియు, నీయనుగ్రహంబుననునీతమ్ముఁడు లక్ష్మణునియనుగ్రహంబునను, నాకుమఱల లభించినవి.అని, తాత్పర్యము.

కృతం న ప్రతికుర్యాద్యః పురుషాణాం స దూషకః. ౨౬

టీక॥ యః=ఎవ్వఁడు; కృతం= చేయఁబడిన యుపకారమును; నప్రతికుర్యాత్=బదులుగాఁజేయఁడో; సః = అతఁడు; పురుషాణాం=పురుషులయొక్క; దూషకః=దూషించువాఁడు, చెఱచువాఁడు, పురుషాధముఁడనుట.

ఎవఁడు తన కితరులు గావించిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము గావింపఁడో, అతండు పురుషులలోనెల్ల అధముఁడు. అని, తాత్పర్యము.

ఏతే వానరముఖ్యా శ్చ శతశ శ్శత్రుసూదన
ప్రాప్తా శ్చా దాయ బలినః పృథివ్యాం సర్వవానరాన్. ౨౭

టీక॥ శత్రుసూదన=శత్రువులవధించునట్టి రాముఁడా! ఏతే=ఈ; వానరముఖ్యాః=వానరశ్రేష్ఠులు("చ" అనునది పాదపూరణార్థము); శతశః = నూఱులునూఱులుగా; పృథివ్యాం=భూమియందు; బలినః= అధికమయినబలముగల; సర్వవానరాన్=సమస్తవానరులను; ఆదాయ=పిలిచి; ప్రాప్తాశ్చ= వచ్చినారుగూడ.

శత్రువుల వధించునట్టి రాముఁడా! ఈ వానరవీరులు పెక్కండ్రు పోయి, భూమియందలి బలవంతులగు సమస్తవానరులనుం బిలిచి వచ్చినారు.

అని, తాత్పర్యము.

ఋక్షా శ్చావాహితా శ్శూరా గోలాంగూలాశ్చ రాఘవ
కాంతారవనదుర్గాణా మభిజ్ఞా ఘోరదర్శనాః. ౨౮

టీక ॥ రాఘవ=రాముఁడా! కాంతారవనదుర్గాణాం = పెద్దయడవులయొక్కయుచిన్నయడవులయొక్కయుచొరరాని ప్రదేశములయొక్క; అభిజ్ఞాః=పండితులును; ఘోరదర్శనాః = భయంకరమయిన చూచుటగలవారలునగు; శూరాః=యుద్ధమునందుభయములేని; ఋక్షాశ్చ= ఎలుఁగుబంటులును; గోలాంగూలాశ్చ= కోండముచ్చులును; ఆవాహితాః=పిలువఁబడిరి.

రాముఁడా! పెద్దపెద్ద వనంబులలో నెవ్వరికిని జొరరాని ప్రదేశంబులలోని సందుగొందులుగూడఁ జక్కఁగాఁ దెలిసినవారలును భయంకరాకారులును శూరులునగు భల్లూకవీరులను గోలాంగూల వీరులనుం బిలిచివచ్చినారు. అని, తాత్పర్యము.

దేవగంధర్వపుత్త్రాశ్చ వానరాః కామరూపిణః
స్వైస్స్వైః పరివృతా స్సైన్యై ర్వర్తంతే పథి రాఘవ. ౨౯

టీక ॥ రాఘవ=రాముఁడా! దేవగంధర్వపుత్రాశ్చ = దేవతలయొక్కయు గంధర్వులయొక్కయుఁ గొడుకులును; కామరూపిణః=ఇచ్ఛాధీనమయినరూపముగలవారలునగు; వానరాః= వానరులు; సైన్యైఃసైన్యైః= తమతము; సైన్యైః=సేనలచే; పరివృతాః= చుట్టఁబడినవారలయి; పథి = మార్గమునందు; వర్తంతే=ఉన్నారు.

రాముఁడా ! దేవతలకును గంధర్వులకును జన్మించినవారలును గామరూపులునగు వానరవీరులు, తమతమ సేనలతోఁ గూడినవారలయి వచ్చుచున్నారు. అని, తాత్పర్యము.

శతైశ్శతసహస్రైశ్చ కోటిభిశ్చ ప్లవంగమాః
అయుతైశ్చావృతా వీరా శ్శంకుభిశ్చ పరంతప. ౩౦

టీక॥ పరంతప=శత్రువులఁదపింపఁజేయునట్టి రాముఁడా! వీరాః=పరాక్రమశాలులగు; ప్లవంగమాః = వానరులు; కేచిత్ (అధ్యాహృతము,ఇట్లుముందును.)=కొందఱు; శతైః=నూఱులచేతను; కేచిత్ = కొందఱు; శతసహస్రైశ్చ=లక్షలచేతను; కేచిత్=కొందఱు; కోటిభిః=కోటులచేతను; కేచిత్= కొందఱు; అయుతైః=పదివేలచేతను; కేచిత్=కొందఱు; శంకుభిశ్చ=శంకువులచేత; ఆవృతాః=చుట్టఁబడినవారలయి; ఆగమిష్యంతి(అధ్యాహృతము)= రాఁగలరు.

"ఏకం దశ శతమస్మాత్సహస్రమయుతం తతఃపరంలక్షం। ప్రయుతంకోటిమథార్బుదబృందే ఖర్వంనిఖర్వంచ ॥ తస్మాన్మహాసరోజం శంకుం సరితాంపతింత్వంతం। మధ్యంపరార్థమాహుర్యథోత్తరం దశగుణంతథాజ్ఞేయం" (ఒకటి, పది, నూఱు, వేయి, పదివేలు, లక్ష, ప్రయుతము లేక పదిలక్షలు, కోటి, అర్బుదము, బృందము, ఖర్వము, నిఖర్వము, మహాపద్మము, శంకువు, సముద్రము, అంతము, మధ్యము, పరార్థము, ఇవి, ఉత్తరోత్తరముగా, ఒకటికన్ననొకటి పదియంతలధికముగా నెలుంగఁదగినది,) అని, జ్యోతిశ్శాస్త్రమున సంఖ్యాలక్షణముచెప్పఁబడినది. అనఁగా, ఒకటి, పది, నూఱు, వేయి, పదివేలు, లక్ష, పదిలక్షలు, కోటి, ఇంతవఱకు సాధారణముగా నందఱకును దెలియును. ఇఁక, పదికోటులు అర్బుదము, పదియర్బుదములు బృందము, పదిబృందములు ఖర్వము, పదిఖర్వములు నిఖర్వము, ప

దినిఖర్వములు మహాపద్మము, పదిమహాపద్మములు శంకువు, పదిశంకువులు సముద్రము, పదిసముద్రములు అంతము, పదియంతములు మధ్యము, పదిమధ్యములు పరార్థము. ఇట్లుసంఖ్యాక్రమంబెఱుఁగునది.

పరాక్రమవంతులగు వానరులుకొందఱు నూఱులతోను, కొందఱుఖలతులతోను గొందఱు కోటులతోను గొందఱు పదివేలతోను, వానరులతోడంగూడి వచ్చుచున్నారు. అని, తాత్పర్యము.

అర్బుదై రర్బుదశతై ర్మధ్యై శ్చాంతై శ్చ వానరాః
సముద్రైశ్చ పరార్థైశ్చ హరయో హరియూధపాః. ౩౧

టీక ॥ హరియూధపాః = వానరసమూహములను బాలించునట్టి; కేచిత్ = కొందఱు; వానరాః = వానరులు; అర్బుదైః = అర్బుదములచేతను; కేచిత్ = కొందఱు, అర్బుదశతైః = అర్బుదముల నూఱులచేతను, ఖర్వములచేతననుట; కేచిత్=కొందఱు;మధ్యైశ్చ = మధ్యములచేతను; కేచిత్=కొందఱు; అంతైశ్చ=అంతములచేతను; కేచిత్=కొందఱు; సముద్రైశ్చ=సముద్రములచేతను; కేచిత్=కొందఱు; పరార్థైశ్చ = పరార్థములచేతను; ఆవృతాః,ఆగమిష్యంతి(అధ్యాహృతము)=చుట్టఁబడినవారలయివచ్చుచున్నారు.

కొందఱు వానరవీరులు అర్బుదంబులతోను కొందఱు ఖర్వంబులతోను గొందఱు మధ్యంబులతోను గొందఱు అంతములతోను గొందఱు సముద్రంబులతోనుగొందఱుపరార్థంబులతోనువచ్చుచున్నారు. అని, తాత్పర్యము.

ఆగమిష్యంతి తే రాజ న్మహేంద్రసమవిక్రమాః
మేరుమందరసంకాశా వింధ్యమేరుకృతాలయాః. ౩౨

టీక॥ రాజన్=రాముఁడా!మహేంద్రసమవిక్రమాః= దేవేంద్రునియొక్క పరాక్రమమువంటిపరాక్రమముగలవారలును; మేరుమందరసంకాశాః=మేరుపర్వతముతో మందర పర్వతముతోను సమానులును; వింధ్యమేరు కృతాలయాః=వింధ్యపర్వతమునందును మేరుపర్వతమునందుఁ జేయఁబడిన యునికిప

ట్టుగలవారలునగు; వానరాః (అధ్యాహృతము) = వానరులు; తే=నీకొఱకు; ఆగమిష్యంతి=రాఁగలరు.

రాజా! మహేంద్రునివంటిపరాక్రమము గలవారలును మేరుపర్వతమువలెను మందరపర్వతమువలెను శరీరము గలవారలును వింధ్యపర్వతమునందును మేరుపర్వతమునందును నివసించువారలునగు వానరులు నీకార్యమునిమిత్తము యివచ్చుచున్నారు. అని, తాత్పర్యము.

తే త్వా మభిగమిష్యంతి రాక్షసం యే సబాంధవమ్
నిహత్య రావణం సంఖ్యే హ్యా నయిష్యంతి మైథిలీమ్. ౩౩

టీక॥ యే=ఎవ్వరు; రాక్షసం=రక్కసుఁడైన; సబాంధవం= బంధువులతోఁగూడిన; రావణం=రావణుని; సంఖ్యే=యుద్ధమునందు; నిహత్య= వధించి; మైథిలీం=సీతను; ఆనయిష్యంతి = తేఁగలరో; తే = అట్టి వానరవీరులు; త్వాం = నిన్నుఁగూర్చి; అభిగమిష్యంతి హి=పొందుచున్నారుగదా!

భార్యాపుత్త్రాదిబంధుసహితుఁడుగా రావణునియుద్ధంబునవధించి,సీతాదేవిందెచ్చి నీకు సమర్పింపఁగల మహావీరులగు వానరులు, నీ సన్నిధానమునకువచ్చుచున్నారు. అని, సుగ్రీవుండు రామునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తత స్త ముద్యోగ మవేక్ష్య బుద్ధిమాన్
హరిప్రవీరస్య నిదేశవర్తినః
బభూవ హర్షా ద్వసుధాధిపాత్మజః
ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః. ౩౪

టీక॥ తతః = అటుపిమ్మట; బుద్ధిమాన్= అధికబుద్ధిగల; వసుధాధిపాత్మజః=రాజపుత్త్రుండగు రాముండు; నిదేశవర్తినః= ఆజ్ఞయందున్న; హరిప్రవీరస్య= వానరవీరుండగు సుగ్రీవుని యొక్క; తం=ఆ;ఉద్యోగం = ప్రయత్నమును;అవేక్ష్య=చూచి;హర్షాత్=సంతోషమువలన; ప్రబుద్ధనీలోత్పలతుల్యదర్శనః=వికసించిన నల్లగలువతోసమానమయిన చూచుటగలవాఁడు; బభూవ=ఆయెను.

అంత, బుద్ధిమంతుండగు రాముం

డు, అట్లుతనయాజ్ఞ చొప్పునఁదన కార్య మునిమిత్తమయిసుగ్రీవుండు గావించిన ప్రయత్నముంజూచి, సంతోషంబు వల న దేహకాంతియధికమగుటయు, వికసించిననల్లగలువవలె మఱియు శ్యామలవర్ణుండై యొప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, అష్టత్రింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండాష్టత్రింశసర్గటీక,
ముగిసినది.

౩౯.

ఏకోనచత్వారింశసర్గప్రారంభః.

ఇతి బ్రువాణం సుగ్రీవం రామో ధర్మభృతాం వరః
బాహుభ్యాం సంపరిష్వజ్య ప్రత్యువాచ కృతాంజలిమ్. ౧

టీక ॥ ధర్మభృతాం= ధర్మమును ధరించువారలలో; వరః= ఉత్తముఁడగు; రామః=రాముఁడు; ఇతి= ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్నవాఁడును; కృతాంజలిం=చేయఁబడిన చేమోడ్పుగలవాఁడునగు; సుగ్రీవం= సుగ్రీవుని; బాహుభ్యాం = చేతులచేత; సంపరిష్వజ్య=కవుఁగిలించుకొని; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

ధార్మికులలో నుత్తముండగు రాముండు, ఇట్లు చెప్పుచుఁ జేమోడ్పుగీలించియున్న సుగ్రీవుని, చేతులచేఁగౌగిలించుకొని, యిట్లని బదులుచెప్పెను. అని, తాత్పర్యము.

యదీంద్రో వర్షతే వర్షం న తచ్చిత్రం భవేత్క్వచిత్
ఆదిత్యోవా సహస్రాంశుః కుర్యాద్వితిమిరం నభః. ౨

టీక ॥ ఇంద్రః=ఇంద్రుఁడు; వర్షం= వానను; వర్షతే యది=కురియునేని; స

హస్రాంశుః=వేయికిరణములుగల; ఆదిత్యోవా= సూర్యుఁడుగాని; నభః= ఆకాశమును; వితిమిరం = చీఁకటిలేనిదానిఁగా; కుర్యాత్ (యది)= చేయునేని; తత్=అది; క్వచిత్=ఒకానొకప్పుడును; చిత్రం=ఆశ్చర్యకరము; నభవేత్=కాదు.

ఇంద్రుఁడు వర్షములుగురిసినను, సూర్యుఁడు ప్రపంచమునకంతయుఁ బ్రకాశము గలిగించినను, అది వారలకు సహజ ధర్మమగుట వలన నెప్పుడును ఆశ్చర్యకరము గాదు. అని, తాత్పర్యము.

చంద్రమా రశ్మిభిః కుర్యా త్పృథివీం సౌమ్య నిర్మలామ్
త్వద్విధో వాపి మిత్రాణాం ప్రతికుర్యా త్పరంతప. ౩

టీక॥ పరంతప= శత్రువులఁదపింపఁజేయునట్టి; సౌమ్య= తిన్ననివాఁడవగు సుగ్రీవుఁడా! చంద్రమాః= చంద్రుఁడు; రశ్మిభిః=కిరణములచేత; పృథివీం=భూమిని; నిర్మలాం = స్వచ్ఛమునుగా; కుర్యాత్(యది)=చేయునేని; త్వద్విధోవాపి = నీయట్టివాఁడుగాని ; మిత్రాణాం = స్నేహితులకు; ప్రతికుర్యాత్ (యది)= ప్రత్యుపకారముచేయునేని; తత్నచిత్రం(అధ్యాహృతము) = అది యాశ్చర్యకరముగాదు.

శత్రువులఁ దపింపఁజేయునట్టి సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! చంద్రుఁడు తనకిరణంబుల భూమినంతయు స్వచ్ఛముగావించినను, అది యెంత మాత్రము ఆశ్చర్యకరముగాదు. అట్లు నీయట్టి వారలుమిత్రులకుఁ బ్రత్యుపకారము చేసినను, అది మీకుసహజము కావున నెంతమాత్రము ఆశ్చర్యము గాదు. అని, తాత్పర్యము.

ఏవం త్వయి న త చ్చిత్రం భ వే ద్య త్సౌమ్య శోభనమ్
జానామ్య హం త్వాం సుగ్రీవ సతతం ప్రియవాదినమ్. ౪

టీక ॥ సౌమ్య = తిన్ననివాఁడా!ఏవం = ఇట్లు; త్వయి= నీయందు; శోభనం=మంచి, ప్రత్యుపకారముసేయుటయనుటు; భవేత్ (ఇతి) యత్=కలుగు ననునదియేదిగలదో; తత్ = అది; చిత్రం=ఆశ్చర్యకరము;న=కాదు.సుగ్రీవ=సుగ్రీవుఁడా!అహం=నేను;త్వాం=నిన్ను;సతతం=ఎల్లప్పుడును; ప్రియవాదినం=సంతోషకరమయిన మాటను జెప్పువానిఁగా; జానామి=ఎఱుంగుదును.

సౌమ్యుఁడవగు సుగ్రీవుఁడా! ఇవ్విధంబున నీవుమిత్రులకుఁ బ్రత్యుపకారము సేయుట యనునది యెంతమాత్ర మాశ్చర్యకరము గాదు; నీవు, ఎల్లప్పుడును మిత్రులకు సరతోషకరమగు కార్యముగావించి యాసంగతంజెప్పవచ్చు వాఁడవని నేనెఱుంగుదును.

అని, తాత్పర్యము.

త్వ త్సనాథ స్సఖే సంఖ్యే జేతాస్మి సకలా నరీన్
త్వమేవ మే సుహృ న్మిత్రం సాహాయ్యం కర్తు మర్హసి. ౫

టీక ॥ సఖే = మిత్రుఁడా! అహం (అధ్యాహృతము)= నేను; త్వత్సనాథః=నీతోఁగూడిన వాఁడనై; సంఖ్యే= యుద్ధమునందు; అరీన్=శత్రువులను; సకలాన్= అందఱను; జేతాస్మి=జయింపఁగలను. సుహృత్ = మంచి మనస్సుగల; మిత్రం = స్నేహితుఁడవగు; త్వమేవ=నీవే; సాహాయ్యం = తోడుపాటును; కర్తుం= చేయుటకు; అర్హసి= తగుదువు.

మిత్రుఁడా! నీవు సహాయుఁడవై యుండఁగా నేనేకసమస్త శత్రువులను యుద్ధంబున జయింపఁగలను; మంచిమనస్సుగలవాఁడవు స్నేహితుఁడవగు నీవె నాకుసాహాయ్యము సేయవలెను.

అని, తాత్పర్యము.

జహారా త్మవినాశాయ వైదేహీం రాక్షసాధమః
వంచయిత్వాతు పౌలోమీ మనుహ్లాదో యథా శచీమ్. ౬

టీక ॥ రాక్షసాధమః = రక్కసులలోనీచుఁడయిన రావణుఁడు; వంచయిత్వాతు = మోసపుచ్చియే; వైదేహీం=సీతను; పౌలోమీం = పులోమపుత్త్రియగు; శచీం=శచీదేవిని; అనుహ్లాదోయథా= అనుహ్లాదుఁడువలె; ఆత్మవినాశాయ = తనయొక్కనాశముకొఱకు; జహార= అపహరించెను.

మున్ను ఇంద్రునివంచించి పులోమపుత్త్రియగు శచీదేవిని అనుహ్లాదుండపహరించినట్లు, రాక్షసాధముండగు రావణుండు, నన్ను మోసపుచ్చి తనవినాశమునకై సీతం గొని పోయెను.

అని, తాత్పర్యము.

నచిరా త్తం హనిష్యామి రావణం నిశితై శ్శరైః

పౌలోమ్యాః పితరం దృప్తం శతక్రతురివా హవే. ౭

టీక॥ పౌలోమ్యాః= శచీదేవియొక్క; దృప్తం=గర్వించిన; పితరం=తండ్రియయిన పులోమునిని; శతక్రతురివ= ఇంద్రుఁడువలె; తం = ఆ; రావణం= రావణుని; నచిరాత్ = శీఘ్రంబుననె; ఆహవే=యుద్ధమునందు; నిశితైః= తీక్ష్ణములగు; శరైః=బాణములచేత; హనిష్యామి=వధించెదను.

పూర్వము, శచీదేవిని అనుహ్లాదుఁడు హరించినందుకు సమ్మతించియుండిన శచీదేవితండ్రినిబులోముని ఇంద్రుఁడువధించినట్లు, శీఘ్రంబుననెయుద్ధంబునఁగఱకుటమ్ముల నారావణుని వధించెదను. అని, రాముండు, సుగ్రీవునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఏతస్మి న్నంతరేచైవ రజ స్సమభివర్తత
ఉష్ణాం తీవ్రాం సహస్రాంశో శ్ఛాదయ ద్గగనే ప్రభామ్. ౮

టీక॥ ఏతస్మిన్ = ఈ; అంతరేచైవ=మధ్యమునందే; గగనే=ఆకాశమునందు; ఉష్ణాం=వేఁడియు; తీవ్రాం = తీక్ష్ణమునగు; సహస్రాంశోః=సూర్యునియొక్క; ప్రభాం = కాంతిని; ఛాదయాత్ =కప్పుచున్న; రజః=దుమ్ము; సమభివర్తత(సమభ్యవర్తత)= వచ్చెను.

ఈమధ్యమున,ఆకాశంబునఁదీక్ష్ణమయిన సూర్యకాంతి నావరించుచుఁ, బెద్దదుమ్ము లేచినది. అని, తాత్పర్యము.

దిశః పర్యాకులా శ్చాస న్రజసా తేన మూర్ఛతా
చచాల చ మహీ సర్వా సశైలవనకాననా. ౯

టీక॥ మూర్ఛతా = వ్యాపించుచున్న; రజసా=పరాగముచేత; దిశశ్చ= దిక్కులును; పర్యాకులాః= కలఁతపడినవి;ఆసన్=అయినవి. సశైలవనకాననా = పర్వతములతోను చిన్నయడవులతోను పెద్దయడవులతోనుగూడిన; సర్వా= సమస్తమయిన; మహీచ=భూమియు; చచాల=కదలెను.

ఆమహాపరాగము నిండుటచేత దిశలు కలఁగుకవయ్యె; పర్వతవనంబులతో భూమియుఁ జలనంబునొందెను.

అని, తాత్పర్యము.

తతో నగేంద్రసంకాశై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహాబలైః
కృత్స్నా సంఛాదితా భూమి రసంఖ్యేయైః ప్లవంగమైః. ౧౦

టీక॥ తతః=అటుపిమ్మట; నగేంద్రసంకాశైః=పర్వతశ్రేష్ఠములతో సమానులును; తీక్ష్ణదంష్ట్రైః=కఠినములయిన కోఱలుగలవారలును; మహాబలైః= అధికమయినబలముగలవారలును; అసంఖ్యేయైః=లెక్కింప నలవిగానివారలునగు; ప్లవంగమైః = వానరులచేత; కృత్స్నా=సమస్తమయిన; భూమిః=నేల; సంఛాదితా=కప్పఁబడినది.

అంతట, బర్వతాకారులును గఱకు కోఱలుగలవారలును మహాబలశాలులు నగు లెక్కకు మీఱినవానరులు భూమి నంతయు వ్యాపించి నిలిచిరి.

అని, తాత్పర్యము.

నిమేషాంతరమాత్రేణ తత స్తై ర్హరియూథపైః
కోటీశతపరీవారైః కామరూపిభి రావృతా. ౧౧
నాదేయైః పార్వతీయైశ్చ సాముద్రైశ్చ మహాబలైః
హరిభి ర్మేఘనిర్హ్రాదై రన్యైశ్చ వనచారిభిః. ౧౨

టీక॥ తతః=అటుపిమ్మట;నిమేషాంతరమాత్రేణ = ఱెప్పపాటంతమాత్రముచేత; కోటీశతపరీవారైః= కోటులయొక్క నూఱు పరివారముగాఁగలవారలును; కామరూపిభిః = ఇచ్ఛాధీనమయిన రూపముగలవారలును; నాదేయైః = నదీతీరములఁబుట్టినవారలును; పార్వతీయైశ్చ=కొండలయందుఁ బుట్టినవారలును;సాముద్రైశ్చ= సముద్రతీరములందుఁ బుట్టినవారలునగు; మహాబలైః= అధికమయిన బలముగలవారలును; మేఘనిర్హ్రాదైః = మేఘముయొక్క ధ్వనివంటి ధ్వనిగలవారలునైన; హరియూథపైః= వానరసమూహములనుపాలించునట్టి; హరిభిః=వానరులచేతను; అన్యైః=ఇతరులయిన; వనచారిభిశ్చ=వానరులచేతను; భూమిః (అధ్యాహృతము) = నేల; ఆవృతా=కప్పఁబడినది.

అంత,నిమేషమాత్రంబున,ఒక్కొకరు నూఱుకోటుల పరివారము గలవారలును గామరూపులును మహాబలులును మేఘమునకుంబోలె మహాధ్వనిగలవారలు నగు వానరయూథపులు, నదీతీరభవు

లును బర్వతమందలివారలును సముద్ర భూమియంతయు నావరించిరి.
తీరంబులనుండువారలును, మఱియు ని
తరులగువానరులు పెక్కండ్రునువచ్చి,

అని, తాత్పర్యము.

తరుణాదిత్యవర్ణైశ్చ శశిగౌరైశ్చ వానరైః
పద్మకేసరవర్ణైశ్చ శ్వేతైర్మేరుకృతాలయైః ౧౩
కోటీసహస్రైర్దశభిః శ్రీమాన్ పరివృతస్తదా
వీరశ్శతవలిర్నామ వానరః ప్రత్యదృశ్యత. ౧౪

టీక॥ తదా=అప్పుడు; శ్రీమాన్=అధికమయిన కాంతిగల వాఁడును; వీరః=పరాక్రమశాలియునగు; శతవలిర్నామ=శతవలియను పేరుగల; వానరః=వానరుఁడు; తరుణాదిత్యవర్ణైశ్చ=బాలసూర్యునియొక్క వన్నెవంటి వన్నెగలవానరులచేతను; శశిగౌరైః=చంద్రునివలెఁదెల్లనివారలగు; వానరైశ్చ=వానరులచేతను; పద్మకేసరవర్ణైశ్చ=కమలములకింజల్కములయొక్క వన్నెవంటివన్నెగలవానరులచేతను; శ్వేతైః=తెల్లనివానరులచేతను; మేరుకృతాలయైః=మేరుపర్వతమునందుఁ జేయఁబడిన యునికిపట్టుగల; దశభిః=పదియుయిన; కోటీసహస్రైః=కోటులయొక్క వేలచేత; పరివృతః=చుట్టఁబడినవాఁడై; ప్రత్యదృశ్యత=చూడఁబడెను.

అప్పుడు, కొందఱు బాలసూర్యునివలె నెఱ్ఱనిమేనుగలవారలును గొందఱు చంద్రునివలె గౌరవర్ణులును గొందఱుకమలకింజల్కములవంటివర్ణముగలవారలును గొందఱు ధవళవర్ణులునునగు మేరుపర్వతనివాసులయిన పదివేలకోట్ల వానరవీరులచేఁబరివృతుండై, పరాక్రమవంతుఁడైన శ్రీమంతుండగు శతవలియనువానరుండు చూపట్టెను.

అని, తాత్పర్యము.

తతః కాంచనశైలాభస్తారాయా వీర్యవాన్ పితా
అనేకైర్దశసాహస్రైః కోటిభిః ప్రత్యదృశ్యత. ౧౫

టీక॥ తతః=అంత; కాంచనశైలాభః=బంగారుకొండయొక్క కాంతివం

స ౩౯

టికాంతిగలవాఁడును; వీర్యవాన్=అధికమయినపరాక్రమము గలవాఁడునగు; తారాయాః=తారయొక్క; పితా = తండ్రియయినసుషేణుండు; అనేకైః= పెక్కులయిన; దశసాహస్రైః= పదివేలగు; కోటిభిః= కోట్లతో; ప్రత్యదృశ్యత=చూడఁబడెను.

అంత, బంగారుకొండవంటి మేను గలవాఁడును బరాక్రమవంతుండు నగు తారతండ్రి సుషేణుండు, అనేకములయిన పదివేలకోట్లుగలవానరసేనతోఁ గూడినవాఁడై, కనఁబడెను.

అని, తాత్పర్యము.

తథా పరేణ కోటీనాం సహస్రేణ సమన్వితః
పితా రుమాయా స్సంప్రాప్త స్సుగ్రీవశ్వశురో విభుః. ౧౬

టీక ॥ తథా=అట్లు; సుగ్రీవశ్వశురః = సుగ్రీవునిమామయు; విభుః=ప్రభుండునగు; రుమాయాః = రుమయొక్క; పితా = తండ్రియయిన తారుఁడు; అపరేణ = ఇతరమయిన; కోటీనాం= కోటులయొక్క; సహస్రేణ= వేయింటితో ; సమన్వితః = కూడిన వాఁడై; ప్రత్యదృశ్యత (అధ్యాహృతము) = చూడఁబడెను.

అట్లు సుగ్రీవునిమామయు వానరయూధపుఁడునగు రుమతండ్రి తారుండు, వేయికోటుల వానరులతోఁ గూడినవాఁడై, వచ్చిచేరెను.

అని, తాత్పర్యము.

పద్మకేసరసంకాశ స్తరుణార్కనిభాననః
బుద్ధిమా న్వానరశ్రేష్ఠ స్సర్వవానరసత్తమః. ౧౭
అనీకై ర్బహుసాహస్రై ర్వానరాణాం సమన్వితః
పితా హనుమత శ్శ్రీమాన్ కేసరీ ప్రత్యదృశ్యత. ౧౮

టీక॥పద్మకేసరసంకాశః=కమలకింజల్కములతోఁ సమానుఁడును; తరుణార్కనిభాననః=బాలసూర్యునితోఁ సమానమయిన ముఖముగలవాఁడును; బుద్ధిమాన్ = అధికమయినబుద్ధిగలవాఁడును; వానరశ్రేష్ఠః= వానరోత్తముఁడును; సర్వవానరసత్తమః= సమస్తవానరులలోను మిక్కిలియు సాధువయిన వాఁడును; హనుమతః= హనుమంతుని యొక్క;పితా=తండ్రియు;శ్రీమాన్=

అధికమయిన కాంతిగలవాఁడునగు; కేసరీ=కేసరి; వానరాణాం= వానరుల యొక్క; బహుసాహస్రైః= పెక్కు వేలయిన; అనీకైః = ఇరువదియొక్క వేల మెనమన్నూట డెబ్బదిసంఖ్యగల సేనలతోఁ; సమన్వితః=కూడినవాఁడై; ప్రత్యదృశ్యత= చూడఁబడెను.

అంతఁ, గమలకింజల్కములవంటి మీనును బాలసూర్యునివంటి మోమునుగల వాఁడునుబుద్ధిమంతుండును, సమస్తవానరులలోను శ్రేష్ఠుండును శ్రీమంతుండునగు హనుమంతునితండ్రి కేసరియనువానరోత్తముండుఇరువదియొక్క వేలయెనమన్నూటడెబ్బదిమందివానరులుగలఅనీకములతోఁ బెక్కువేలతోవచ్చి యగపడెను. అని, తాత్పర్యము.

గోలాంగూలమహారాజో గవాక్షో భీమవిక్రమః
వృతః కోటిసహస్రేణ వానరాణా మదృశ్యత. ౧౯

టీక॥ భీమవిక్రమః = భయంకరమయిన పరాక్రమముగల; గోలాంగూలమహారాజః=కొండముచ్చుల రాజయిన; గవాక్షః= గవాక్షుండు; వానరాణాం=వానరులయొక్క; కోటిసహస్రేణ=కోటులయొక్క వేయిచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; అదృశ్యత=చూడఁబడెను.

భయంకరమయిన పరాక్రమముగలవాఁడగు గోలాంగూలరాజయిన గవాక్షుండు వేయికోట్లవానరులతోఁగూడవచ్చిచేరెను. అని, తాత్పర్యము.

ఋక్షాణాం భీమవేగానాం ధూమ్రశ్శత్రునిబర్హణః
వృతః కోటిసహస్రాభ్యాం ద్వాభ్యాం సమభివర్తత. ౨౦

టీక॥ శత్రునిబర్హణః=శత్రువుల వధించునట్టి; ధూమ్రః=ధూమ్రుఁడు; భీమవేగానాం=భయంకరమయిన పరాక్రమముగల; ఋక్షాణాం=ఎలుఁగుబంటులయొక్క; ద్వాభ్యాం=రెండైన; కోటిసహస్రాభ్యాం=కోటులయొక్క వేలచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; సమభివర్తత(సమభ్యావర్తత)=వచ్చెను.

అంత, శత్రువుల రూపుమాపునట్టి ధూమ్రుండను వాఁడు, భయంకరమయినవేగముగల రెండువేలకోట్లభల్లూకవీరులతోఁ గూడినవాఁడై వచ్చి చేరెను. అని, తాత్పర్యము.

మహాచలనిభై ర్ఘోరైః పనసో నామ యూథపః
ఆజగామ మహావీర్య స్త్రిసృభిః కోటిభి ర్వృతః. ౨౧

టీక॥ మహావీర్యః = అధికమయిన పరాక్రమముగల; పనసోనామ= పనసుఁడను పేరుగల; యూథపః=సమూహమును బాలించునట్టి వానరుఁడు; మహాచలనిభైః = పెద్దకొండలతో సమానులును; ఘోరైః = భయంకరులునగు వానరులచేత; తిసృభిః=మూఁడయిన; కోటిభిః=కోటులచేత, మూఁడుకోటులవానరులచేతననుట, వృతః = చుట్టఁబడినవాఁడై; ఆజగామ = వచ్చెను.

మహాపరాక్రమశాలియగు పనసుండను వానరయూథపుండు, పెద్దకొండలంతటి వారలును భయంకరాకారులునగు మూఁడుకోట్ల వానరవీరులతోఁ గూడినవాఁడై వచ్చెను.

అని, తాత్పర్యము.

నీలాంజనచయాకారో నీలో నామాథ యూథపః
అదృశ్యత మహాకాయః కోటిభి ర్దశభి ర్వృతః. ౨౨

టీక॥ అథ=అటుపిమ్మట; మహాకాయః=గొప్పదైనశరీరముగలవాఁడును; నీలాంజనచయాకారః= నల్లనికాటుకరాశియొక్క ఆకారమువంటి యాకారముగలవాఁడునగు, నీలోనామ= నీలుఁడు అను; యూథపః = సమూహమును బాలించువాఁడు; దశభిః=పదియయిన; కోటిభిః= కోట్లచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; అదృశ్యత= చూడఁబడెను.

అంత, కాటుకరాశివలెనల్లని గొప్పమేనుగల నీలుండను వానర యూథపుఁడు పదికోట్లవానరవీరులతోఁగూడినవాఁడై కానంబడెను.

అని, తాత్పర్యము.

తతః కాంచనశైలాభో గవయో నామ యూథపః
ఆజగామ మహావీర్యః కోటిభి ర్దశభి ర్వృతః. ౨౩

టీక॥ తతః=అటుపిమ్మట; మహావీర్యః = అధికమయినపరాక్రమముగలవాఁడును; కాంచనశైలాభః = బంగారుకొండయొక్క కాంతివంటి కాంతిగలవాఁడునగు; గవయోనామ=గవయుఁడను పేరుగల; యూథపః = సమూహమునుబాలించువాఁడు; దశభిః=పదియయిన; కోటిభిః = కోట్లచేత; వృ

తః = చుట్టఁబడినవాఁడై; ఆజగామ= వచ్చెను.

అటుపిమ్మట, మహాపరాక్రమ శాలియు మేరుపర్వతమువంటి మేను గలవాఁడునగు గవయుండను వానరవీరుఁడు, పదికోట్లవానరులంగూడి వచ్చి చేరెను. అని, తాత్పర్యము.

దరీముఖశ్చ బలవాన్ యూథపో ఽభ్యాయయౌ తదా
వృతః కోటిసహస్రేణ సుగ్రీవం సముపస్థితః. ౨౪

టీక॥ తదా=అప్పుడు; బలవాన్= అధికమయిన బలముగల; దరీముఖః= దరీముఖుఁడను; యూథపః = సమూహమును పాలించువాఁడు; కోటిసహస్రేణ=కోట్లయొక్క వేయిచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; సముపస్థితః= వచ్చినవాఁడై; సుగ్రీవం=సుగ్రీవుని; అభ్యాయయౌ=పొందెను.

అంత, మహాబలుండగు దరీముఖుండనువానరోత్తముండు, వేయికోట్లవానరవీరులతోఁగూడవచ్చి సుగ్రీవుని యెదుటనిలిచెను. అని, తాత్పర్యము.

మైందశ్చ ద్వివిదశ్చోభా వశ్విపుత్రౌ మహాబలౌ
కోటికోటిసహస్రేణ వానరాణా మదృశ్యతామ్. ౨౫

టీక॥ అశ్విపుత్రౌ = అశ్వినీదేవతల కొడుకులును; మహాబలౌ = అధికమయిన బలముగల వారలునగు; మైందశ్చ = మైందుఁడును; ద్వివిదశ్చ=ద్వివిదుఁడును; ఉభౌ = ఇద్దఱును; వానరాణాం = వానరులయొక్క; కోటికోటిసహస్రేణ = కోటికోట్ల వేయితో; సహితౌ (అధ్యాహృతము) = కూడినవారలయి; అదృశ్యతాం (అదృశ్యేతాం) = చూడఁబడిరి.

అంత, అశ్వినీదేవతల కొడుకులు మహాబలశాలులు మైందద్వివిదు లిద్దఱును, వేయికోటికోట్లవానరసైనికులతోఁ గూడినవారలయి, కనఁబడిరి.

అని, తాత్పర్యము.

గజశ్చ బలవాన్వీరః కోటిభి స్త్రిసృభి ర్వృతః
ఆజగామ మహాతేజా స్సుగ్రీవస్య సమీపతః. ౨౬

స ౩౮

టీక ॥ వీరః = శూరుండును; బలవాన్ = అధికమయిన బలముగలవాఁడును; మహాతేజాః = అధికమయినపరాక్రమము గలవాఁడునగు; గజశ్చ = గజుండును; తిసృభిః = మూఁడైన; కోటిభిః = కోట్లచే; వృతః = చుట్టఁబడినవాఁడై; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; సమీపతః = సమీపమునందు; ఆజగామ = వచ్చెను.

గొప్ప పరాక్రమంబులుగలిగి వీరుండయిన గజుండను వానరుండు, మూఁడుకోట్ల వానరులతోఁగూడ, సుగ్రీవునిసమీపంబునకువచ్చెను.

అని, తాత్పర్యము.

ఋక్షరాజో మహాతేజా జాంబవాన్నామ నామతః
కోటిభిర్దశభిః ప్రాప్తస్సుగ్రీవస్య వశే స్థితః. ౨౭

టీక ॥ మహాతేజాః = అధికమయిన పరాక్రమము గలవాఁడును; నామతః = పేరువలన; జాంబవాన్నామ = జాంబవంతుఁడని ప్రసిద్ధుఁడునగు; ఋక్షరాజః = ఎలుఁగుబంటులరాజు; దశభిః = పదియయిన; కోటిభిః = కోటులతో; ప్రాప్తః = వచ్చినవాఁడై; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; వశే = అధీనతయందు; స్థితః = నిలిచెను.

మహాపరాక్రమశాలియగు భల్లూకరాజయిన జాంబవంతుండు, పదికోట్లభల్లూక బలంబులతోఁ వచ్చి సుగ్రీవుంగొలిచినిలిచెను. అని, తాత్పర్యము.

రుమణ్వాన్నామ విక్రాంతో వానరో వానరేశ్వరమ్
ఆయయౌ బలవాం స్తూర్ణం కోటీశతసమావృతః. ౨౮

టీక ॥ బలవాన్ = అధికమయినబలముగలవాఁడును; విక్రాంతః = పరాక్రమము గలవాఁడునగు; రుమణ్వాన్నామ = రుమణ్వంతుఁడని ప్రసిద్ధుఁడయిన; వానరః = వానరుఁడు; కోటీశతసమావృతః = కోటులయొక్క నూటిచేఁ జుట్టఁబడినవాఁడై; తూర్ణం = శీఘ్రముగా; వానరేశ్వరం = వానరరాజయినసుగ్రీవుని; ఆయయౌ = పొందెను.

బలపరాక్రమశాలియగు రుమణ్వంతుండను వానరవీరుండు, నూఱుకోట్లబలంబులతోఁ గూడినవాఁడై, శీఘ్రంబున సుగ్రీవునియొద్దకుఁజేరెను.

అని, తాత్పర్యము.

స ౩౯

తతః కోటిసహస్రాణాం సహస్రేణ శతేనచ
పృష్ఠతో నుగతః ప్రాప్తో హరిభి ర్గంధమాదనః. ౨౯

టీక॥ తతః = అటుపిమ్మట; గంధమాదనః=గంధమాదనుఁడు; హరిభిః= వానరులచేత; కోటిసహస్రాణాం = కోటులయొక్క-వేలయొక్క-; సహస్రేణ=వేయింటిచేతను; శతేనచ= నూటిచేతను; పృష్ఠతః=వెనుకనుండి; అనుగతః = వెంబడింపఁబడినవాఁడై; ప్రాప్తః=వచ్చినాఁడు.

అంతట, బదిలక్షలకోట్లవానరులతోను లక్షకోట్లవానరులతోనుంగూడి గంధమాదనుండను వానరవీరుండువచ్చిచేరెను. అని, తాత్పర్యము.

తతః పద్మసహస్రేణ వృత శ్శంకుశతేనచ
యువరాజోంగదః ప్రాప్తః పితృతుల్యపరాక్రమః. ౩౦

టీక॥ తతః=అటుపిమ్మట; పితృతుల్యపరాక్రమః = తండ్రితోసమానమయినపరాక్రమముగలవాఁడును; యువరాజః=యువరాజునైన; అంగదః= అంగదుఁడు; పద్మసహస్రేణ=పద్మములయొక్క వేయిటిచేతను; శంకుశతేనచ = శంఖములయొక్క-నూఱింటిచేతను; వృతః = చుట్టఁబడినవాఁడై; ప్రాప్తః=వచ్చినాఁడు.

అంత, తండ్రితోసమానమయిన పరాక్రమంబుగల యువరాజయిన యంగదుండు, వేయిపద్మంబులును నూఱుశంఖంబులునుగల బలంబులంగూడిసుగ్రీవునియొద్దకువచ్చెను. అని, తాత్పర్యము.

తత స్తారాద్యుతి స్తారో హరి ర్భీమపరాక్రమః
పంచభి ర్హరికోటీభి ర్దూరతః ప్రత్యదృశ్యత. ౩౧

టీక॥ తతః=అటుపిమ్మట; తారాద్యుతిః=నక్షత్రముయొక్క- కాంతివంటికాంతిగలవాఁడును; భీమపరాక్రమః= భయంకరమయిన పరాక్రమము గలవాఁడునగు; తారః=తారుండను; హరిః=వానరుఁడు; పంచభిః=అయిదైన; హరికోటీభిః= వానరులయొక్క-కోట్లతో; దూరతః=దూరమునందు; ప్రత్యదృశ్యత=చూడఁబడెను.

అంత, నక్షత్రమువలెఁ బ్రకాశించుచున్నవాఁడును భయంకరమయినపరాక్రమంబుతోనొప్పినవాఁడునగు తారుం

డనువానరవీరుండు (రుమ తండ్రికన్న మఱియొక తారుండని యెఱుంగునది) అయిదుకోట్లవానరులతో వచ్చి దూరంబు నంగనఁబడెను. అని, తాత్పర్యము.

ఇంద్రజానుః కపి ర్వీరో యూథపః ప్రత్యదృశ్యత జేరి,
ఏకాదశానాం కోటీనా మీశ్వర స్తైశ్చ సంవృతః. ౩౨

టీక॥ వీరః = పరాక్రమశాలియు; యూథపః= సమూహమును బాలించువాఁడును; ఏకాదశానాం = పదునొకండైన; కోటీనాం=కోట్లయొక్క; ఈశ్వరః=ప్రభువునగు; ఇంద్రజానుః=ఇంద్రజానువనెడు; కపిః = వానరుఁడు; తైః=ఆవానరులచేత; సంవృతశ్చ=చుట్టఁబడినవాఁడునై; ప్రత్యదృశ్యత=చూడఁబడెను.

పరాక్రమ వంతుండును వానరసమూహనాయకుండును పదునొకండుకోట్లవానరుల కొడయండునగు నింద్రజానువనువానరవీరుండు, ఆసమస్తవానరులతోఁగూడినవాఁడై యగపడెను. అని, తాత్పర్యము.

తతో రంభ స్త్వనుప్రాప్త స్తరుణాదిత్యసన్నిభః
అయుతేనా వృతశ్చైవ సహస్రేణ శతేనచ. ౩౩

టీక॥ తతః=అటుపిమ్మట; తరుణాదిత్యసన్నిభః=లేఁతసూర్యునితో సమానుఁడయిన; రంభస్తు=రంభుఁడును; అయుతేన=పదివేలచేతను; సహస్రేణ=వేయింటిచేతను; శతేనచ= నూఱింటిచేతను; ఆవృతశ్చైవ = చుట్టఁబడినవాఁడునై ; అనుప్రాప్తః = వచ్చినాఁడు.

అంత, బాలసూర్యునివలె నెఱ్ఱని మేనుగల రంభుండు, దశసహస్రములుగాను సహస్రంబులుగాను శతంబులుగాను బన్నియున్న వానరబలంబులతో నేతెంచెను. అని, తాత్పర్యము:

తతో యూథపతి ర్వీరో దుర్ముఖో నామ వానరః
ప్రత్యదృశ్యత కోటిభ్యాం ద్వాభ్యాం పరివృతో బలీ. ౩౪

టీక॥ తతః= ఆపిమ్మట; యూథపతిః= సమూహమునకుఁ బ్రభువును; వీ

స ౩౯

రః=పరాక్రమశాలియును; బలీ=అధికమయినబలముగలవాఁడునగు; దుర్ముఖోనామ=దుర్ముఖుఁడను పేరుగల; వానరః... ద్వాభ్యాం=రెండైన... = కోటులచేత; పరివృతుఁడై... బడినవాఁడై; ప్రత్యదృశ్యత = కనఁబడెను.

అంత, బలపరాక్రమంబులుగల దుర్ముఖుండను వానర యూధనాథుండు, రెండుకోటుల వానర వీరులచేఁ బరివృతుండై, సుగ్రీవునెదుటం బొలిచినిలిచెను. అని, తాత్పర్యము.

కైలాసశిఖరాకారైర్వానరైర్భీమవిక్రమైః
వృతః కోటిసహస్రేణ హనుమాన్ ప్రత్యదృశ్యత. ౩౫

టీక ॥ హనుమాన్=హనుమంతుఁడు; కైలాసశిఖరాకారైః=కైలాసపర్వతముయొక్క శృంగములయొక్క ఆకారమువంటి యాకారముగలవారలును; భీమవిక్రమైః= భయంకరమయిన పరాక్రమము గలవారలునగు; కోటిసహస్రేణ=కోటులయొక్క వేయిఅయిన, వేయికోట్లుసంఖ్యగలదియైనట్టి; వానరైః=వానరులచేత; వృతః= చుట్టఁబడినవాఁడై; ప్రత్యదృశ్యత=కనఁబడెను.

భయంకరపరాక్రములగు కైలాసశిఖరంబులవంటి వానరవీరులు వేయికోట్లమంది పరివేష్టింప, హనుమంతుండు చూడనొప్పెను. అని, తాత్పర్యము.

నళశ్చాపి మహావీర్య స్సంవృతో ద్రుమవాసిభిః
కోటీశతేన సంప్రాప్త స్సహస్రేణ శతేనచ. ౩౬

టీక ॥ మహావీర్యః= అధికమయిన పరాక్రమముగల; నళశ్చాపి=నళుండును; కోటీశతేన=కోటులయొక్క నూటిచేతను; సహస్రేణ= వేయిమందిచేతను; శతేనచ= నూర్వురిచేతను; ద్రుమవాసిభిః = వానరులచేత; సంవృతః= పరివేష్టింపఁబడినవాఁడై; సంప్రాప్తః= వచ్చెను.

మహాపరాక్రమశాలియగు నలుండు, తన్ను వానరులు నూఱుకోట్లవారు సహస్రంబులుగాను శతంబులుగాను బరివేష్టించికొలువ నేతెంచెను. అని, తాత్పర్యము.

తతో దధిముఖ శ్శ్రీమాన్ కోటిభి ర్దశభి ర్వృతః

సంప్రాప్తో భిమత స్తస్య సుగ్రీవస్య మహాత్మనః. ౩౭

టీక ॥ తతః= అటుపిమ్మట; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల; తస్య=ఆ; సుగ్రీవస్య=సుగ్రీవునకు; అభిమతః=ఇష్టుండును; శ్రీమాన్=అధికమయిన కాంతిగలవాఁడునగు; దధిముఖః=దధిముఖుండు; దశభిః = పదియయిన; కోటీభిః= కోట్లచేత; వృతః=చుట్టఁబడినవాఁడై; సంప్రాప్తః = వచ్చినాఁడు.

అంత, మహాపరాక్రమశాలి యగు సుగ్రీవునకుఁ బ్రియబంధువగు శ్రీమంతుండయిన దధిముఖుండు, పదికోట్లవానరవీరులు కొలువ నగుగుదెంచెను.

అని, తాత్పర్యము.

శరభః కుముదో వహ్ని ర్వానరో రంహ ఏవచ
ఏతేచా న్యే చ బహవో వానరాః కామరూపిణః. ౩౮
ఆవృత్య పృథివీం సర్వాం పర్వతాంశ్చ వనానిచ
యూథపా స్సమనుప్రాప్తా స్తేషాం సంఖ్యా నవిద్యతే. ౩౯

టీక ॥ శరభః= శరభుండును; కుముదః=కుముదుండును; వహ్నిః= వహ్నియు; రంహః = రంహుండుఅను; వానరఏవచ=వానరుండును; ఏతేచ=వీరలును; అన్యే= ఇతరులయిన; కామరూపిణః=ఇచ్ఛాధీనమగురూపముగల; బహవః = పెక్కండ్రయిన; యూథపాః = సమూహమునుపాలించునట్టి; వానరాశ్చ= వానరులును; సర్వాం= సమస్తమయిన; పృథివీం=భూమిని; పర్వతాంశ్చ=కొండలను; వనానిచ= అడవులను; ఆవృత్య= కప్పి; సమనుప్రాప్తాః=వచ్చినారు. తేషాం = వారలయొక్క; సంఖ్యా=లెక్క; నవిద్యతే= లేదు.

శరభుండును గుముదుండును వహ్నియు రంహుండును వీరలును మఱియు నితరులు కామరూపులగు వానరయూథపతులు పెక్కండ్రునువచ్చి భూమియంతయుఁ బర్వతంబులును వనంబులునావరించిరి; వారలలెక్కపెట్ట నలవిగాదు. అని,తాత్పర్యము.

ఆగతాశ్చ విశిష్టాశ్చ పృథివ్యాం సర్వవానరాః

టీక ॥ పృథివ్యాం=భూమియందు;విశిష్టాశ్చ=అధికులగువానరులును, దేవ

తలకుఁబుట్టినవానరులుననుట; సర్వవానరాః = సాధారణులగుసమస్తవానరులును; ఆగతాశ్చ = వచ్చిరియు.

...లోకంబున నున్న దేవతావీర్య జాతులగు నప్రాకృతవానరులును సాధారణులగు ప్రాకృతవానరులును, అందఱునువచ్చిరి. అని, తాత్పర్యము.

ఆప్లవంతః ప్లవంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః. ౪౦
అభ్యవర్తంత సుగ్రీవం సూర్య మభ్రగణా ఇవ

...ంగమాః = వానరులు; ఆ... దాఁటుచును; ప్లవంతశ్చ = ...ను; గర్జంతశ్చ = అఱచుచును; ...గ్రీవం = సుగ్రీవుని; అభ్రగణాః = మేఘసమూహములు; సూర్యమివ = సూర్యునివలె; అభ్యవర్తంత = చుట్టినిలిచిరి.

అవ్వానరులు, ఉత్సాహాతిశయమునం జేసి, దాఁటుచు నెగరుచు గర్జించుచు, మేఘంబులు సూర్యునిఁబరివేష్టించునట్లు, సుగ్రీవునిఁ బరివేష్టించినిలిచిరి. అని, తాత్పర్యము.

కుర్వాణా బహుశబ్దాంశ్చ ప్రహృష్టా బాహుశాలినః. ౪౧
శిరోభి ర్వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయన్

టీక॥ బాహుశాలినః = భుజములచే నొప్పుచున్న యవ్వానరులు; బహుశబ్దాన్ = అనేకమయినధ్వనులను; కుర్వాణాశ్చ = చేయుచును; శిరోభిః = తలలచేత; వానరేంద్రాయ = వానరరాజైన; సుగ్రీవాయ = సుగ్రీవునికొఱకు; న్యవేదయన్ = తెలిపిరి.

గొప్ప భుజములతో నొప్పుచున్న యా వానరవీరులు, అనేక విధముగా సింహనాదములు సేయుచుఁ, దమతలలెత్తిచూపి, వానరరాజు సుగ్రీవునకుఁ దమరాక నెఱింగించుకొనిరి. అని, తా.

అపరే వానరశ్రేష్ఠా స్సంయమ్యచ యథోచితమ్. ౪౨
సుగ్రీవేణ సమాగమ్య స్థితాః ప్రాంజలయ స్తదా

టీక॥ తదా = అప్పుడు; అపరే = ఇతరులయిన; వానరశ్రేష్ఠాః = వానరులలోనుత్తములగు వారలు; యథోచితం = యుక్తమగునట్లుగా; సంయమ్య

చ=ముడుచుకొనియు; సుగ్రీవేణ = సుగ్రీవునితో; సమాగమ్య=చేరి; ప్రాంజలయః = మంచిచేమోడ్పుగలవారలయి; స్థితాః=నిలుచుండిరి.

అప్పుడు, మఱికొందఱు సుగ్రీవుని సమీపంబునకుఁబోఁదగిన యుత్తమవానరులు, సవినయముగా వస్త్రాదులుముడుచుకొని సుగ్రీవునిసమీపంబుఁ జేరి, చేతులుమోడ్చి నిలిచియుండిరి.

అని, తాత్పర్యము.

సుగ్రీవ స్త్వరితో రామే సర్వాం స్తాన్వానరర్షభాన్. ౪౩
నివేదయిత్వా ధర్మజ్ఞః స్థితః ప్రాంజలి రబ్రవీత్

టీక॥ ధర్మజ్ఞః=ధర్మముదెలిసినట్టి; సుగ్రీవః=సుగ్రీవుఁడు; త్వరితః=వేగిరపడినవాఁడై; ప్రాంజలిః=మంచిచేమోడ్పుగలవాఁడై; తాన్= ఆ; వానరర్షభాన్=వానరోత్తములను; సర్వాన్=అందఱును; రామే=రామునందు; నివేదయిత్వా=సమర్పించి; స్థితః = నిలుచున్నవాఁడై; అబ్రవీత్ = పలికెను.

సమస్తధర్మంబులం దెలిసిన సుగ్రీవుండు, ఆవానరోత్తములనందఱ శ్రీరామునకు సమర్పించి, యంతలేచి నిలిచియున్నవాఁడై, యావానరవీరులనందఱు గలయంగనుంగొని యిట్లనియె.

అని, తాత్పర్యము.

యథాసుఖం పర్వతనిర్ఝరేషు
వనేషు సర్వేషుచ వానరేంద్రాః. ౪౪
నివేశయిత్వా విధివ ద్బలాని
బలం బలజ్ఞః ప్రతిపత్తు మీష్టే

టీక॥ వానరేంద్రాః= వానరశ్రేష్ఠులారా! బలజ్ఞః = సైన్యము నెఱింగిన యూథపుఁడు; పర్వతనిర్ఝరేషు=కొండసెలయేళ్లయందును, వాని తీరములయందుననుట; సర్వేషు= సమస్తములయిన; వనేషుచ = అడవులయందును; యథాసుఖం= సుఖముగునట్లుగా; విధివత్= యథాశాస్త్రముగా; బలాని= సైన్యములను; నివేశయిత్వా=విడియించి; బలం= సైన్యమును; ప్రతిపత్తుం= తెలియుటకు; ఈష్టే=సమర్థుఁడగును.

వానరోత్తములారా! యూథపతియగువాఁడు, తన సైన్యమునంతయు, కొండలసెలయేళ్లతీరంబులందును వనం

బులందును సుఖముగా శాస్త్రోక్తవిధిని విడియించిన హో, దన సేనయొక్క విశేషములం జెలి సప్పుడగుంగావున, మీరలు అట్లు గావింపుఁడు.

అని, తాత్పర్యము.

ప్లవంత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, ... కిష్కింధాకాండే, ఏకోనచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, ... ర్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర ... ంబునందు, కిష్కింధాకాండైకోనచత్వారింశసర్గటీక, ముగిసినది.

శ్రీ

చత్వారింశసర్గప్రారంభః.

అథ రాజా సమృద్ధార్థ స్సుగ్రీవః ప్లవగేశ్వరః
ఉవాచ నరశార్దూలం రామం పరబలార్దనమ్. ౧

టీక॥ అథ = అటుపిమ్మట; సమృద్ధార్థః = అధికమయినసాధనసంపత్తి గలవాఁడును; ప్లవగేశ్వరః= వానరుల కుఁబ్రభువునగు; రాజా = రాజయిన; సుగ్రీవః=సుగ్రీవుఁడు; పరబలార్దనం= శత్రుసైన్యముల పీడించునట్టి; నరశార్దూలం = పురుషశ్రేష్ఠుఁడయిన; రామం=రామునిగూర్చి; ఉవాచ=పలికెను.

అంత, సమృద్ధమయినసాధనసంపత్తిగల వానరేశ్వరుండు సుగ్రీవుండు, శత్రుసైన్యంబుల మర్దించువానిఁబురుషోత్తము రాముంజూచి యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

ఆగతా వినివిష్టాశ్చ బలినః కామరూపిణః
వానరా వారణేంద్రాభా యే మద్విషయవాసినః. ౨

టీక॥ మద్విషయవాసినః = నారాజ్యముననున్నవానరులు; యే (సంతి)=

ఎవరుగలరో; తే (అధ్యాహృతము)= ఆ; బలినః = అధికమయిన బలముగల వారలును; వారణేంద్రాభాః = గజ శ్రేష్ఠములయొక్క కాంతి వంటికాంతి గలవారలును; కామరూపిణః= ఇచ్ఛాధీనమయిన రూపముగల వారలునగు; వానరాః=వానరులు; ఆగతాః=వచ్చినారు. వినివిష్టాశ్చ=విడిసినారును.

నా రాజ్యంబున నివసించునట్టి బలవంతులును గామరూపులును గొప్పయేనుంగులవంటి వారలునగు వానరవీరులందఱును వచ్చి విడిసియున్నారు. అని, తాత్పర్యము.

త ఇమే బహువిక్రాంతై ర్హరిభి ర్భీమవిక్రమైః
ఆగతా వానరా ఘోరా దైత్యదానవసన్నిభాః. ౩

టీక ॥ దైత్యదానవసన్నిభాః= దైత్యులతోను దానవులతోను సమానులును; ఘోరాః=భయంకరులునగు; తే= అట్టి; ఇమే=ఈ; వానరాః = వానరులు; బహువిక్రాంతైః = అధికమయిన పరాక్రమము గలవారులును; భీమవిక్రమైః = భయంకరమయిన గమనముగలవారలునగు; హరిభిః (సహ)= వానరులతోఁగూడ; ఆగతాః= వచ్చినారు.

భయంకరాకారులును దైత్యదానవులంబోలిన వారునగు నట్టియీవచ్చిన వానరయూథపతులందఱును, మహాపరాక్రమశాలులును శీఘ్రగమనము గలవారలునగు పెక్కండ్ర వానరులం గూడివచ్చినారు. అని, తాత్పర్యము.

ఖ్యాతకర్మాపదానాశ్చ బలవంతో జితక్లమాః
పరాక్రమేషు విఖ్యాతా వ్యవసాయేషుచోత్తమాః. ౪

టీక ॥ ఇమే (అధ్యాహృతము) = ఈవానరులు; ఖ్యాతకర్మాపదానాశ్చ=ప్రసిద్ధములయిన సహజకార్యములును బూర్వముగావించినకార్యములునుగలవారలును. బలవంతః= అధికమయినబలముగలవారలును. జితక్లమాః= జయింపఁబడిన యలసటగలవారలును. పరాక్రమేషు=శత్రువుల నాక్రమించుటలయందు; విఖ్యాతాః= ప్రసిద్ధులును. వ్యవసాయేషుచ= ప్రయత్నములయం

ము. ఉత్తమాః=శ్రేష్ఠులును.

వీరలు, మున్ను గావించినకార్యము లు ఒకొకటియుఁ బ్రసిద్ధివహించియు న్నవి; వీరలందఱు, బహుగ్రామములం ఘించుట మొదలయిన యితరులకు సా ధ్యములుకానికార్యములందుసమర్థులు; బలవంతులు; శ్రమములేనివారలు; పె క్కుమార్లు లోకప్రసిద్ధముగా శత్రువు ల మార్గ్గ్న్నవారు; ప్రయత్నములు సేయుటయందు, ఉత్తములు.

అని, తాత్పర్యము.

పృథివ్యంబుచరా రామ నానానగనివాసినః
కోట్యగ్రశ ఇమే ప్రాప్తా వానరా స్తవ కింకరాః. ౫

టీక॥ రామ=రాముఁడా! పృథివ్యంబుచరాః=భూమియందును జలమునం దును దిరుగు వారలును; నానానగనివాసినః= నానావిధములయిన పర్వతములందు ఉన్నవారలును; తవ=నీకు; కింకరాః = పరిచారకులునగు; ఇమే= ఈ; వానరాః= వానరులు; కోట్యగ్రశః=కోటిమందికన్ననధికముగా; ప్రాప్తాః=వచ్చినారు.

రాముఁడా! భూమియందును జలములయందును సంచరింపంజాలినవారలు నానావిధ పర్వతంబుల నివసించునట్టి వానరవీరులు, అనేక కోట్ల మంది వచ్చియున్నారు; వీరలందఱు నీ కింకరులు. అని, తాత్పర్యము.

నిదేశవర్తిన స్సర్వే సర్వే గురుహితే రతాః
అభిప్రేత మనుష్ఠాతుం తవ శక్యం త్వరిందమ. ౬

టీక॥ అరిందమ= శత్రువులనడఁగఁ ద్రొక్కునట్టి రాముఁడా! ఇమే (అధ్యాహృతము) = వీరలు; సర్వే=అందఱు ను; నిదేశవర్తినః=ఆజ్ఞయందుండువారలు. సర్వే=అందఱును; గురుహితే= స్వామియొక్క మేలునందు; రతాః=ఆసక్తులు. తవ=నీయొక్క;అభిప్రేతం= అభిప్రాయమును; అనుష్ఠాతుం = చేయుటకు; శక్యాంతి=చాలుదురు.

శత్రువులవధించునట్టి రాముఁడా! వీరలు అందఱు, నీయాజ్ఞను ఎంతమాత్రముజవదాఁటనివారలు, అందఱును, స్వామిహితమునేకోరువారలు; నీయభిప్రాయమును నెఱవేర్పసామర్థ్యముగలవారలు, అని, తాత్పర్యము.

స ౪౦

త ఇమే బహుసాహస్రైరనీకై ర్భీమవిక్రమైః

టీక॥ తే=ఆ; ఇమే=ఈవానరులు; బహుసాహస్రైః= పెక్కువేలసంఖ్యగల; భీమవిక్రమైః=భయంకరమయిన పరాక్రమముగల; అనీకైః=సేనలతో; సహితాః (అధ్యాహృతము)=కూడిన వారలు.

ఈవానరయూథపతులు, ఒకొకరు నుభయంకరమయిన పరాక్రమముగల పెక్కువేల సైన్యములతోఁ గూడియున్నారు. అని, తాత్పర్యము.

యన్మన్యసే నరవ్యాఘ్ర ప్రాప్తకాలం తదుచ్యతామ్. ౭
త్వత్సైన్యం త్వద్వశే యుక్త మాజ్ఞాపయితు మర్హసి

టీక॥ నరవ్యాఘ్ర=మనుష్యశ్రేష్ఠుఁడవగు రాముఁడా! యత్=దేనిని; ప్రాప్తకాలం=పొందఁబడిన కాలముగలదానిఁగా; మన్యసే= తలంచుచున్నావో; తత్=అది; ఉచ్యతాం = చెప్పఁబడుఁగాక. త్వద్వశే = నీయధీనతయందు; యుక్తం = ఆసక్తమైన; త్వత్సైన్యం= నీసేనను; ఆజ్ఞాపయితుం=ఆజ్ఞాపించుటకు; అర్హసి=తగుదువు.

మనుష్యశ్రేష్ఠుఁడవగు రాముఁడా! ఈ కాలంబున నేదియుచితమని నీకుఁదోఁచుచున్నదో, అది వచింపుము; ఇదంతయు నీయాజ్ఞయందుండుట కాసక్తమయియున్నది; నీసైన్యము; కావున,నీయిష్టముచొప్పున నాజ్ఞాపింపుము. అని, తాత్పర్యము.

కామ మేషా మిదం కార్యం విదితం మమ తత్త్వతః. ౮
తథాపితు యథాతత్త్వ మాజ్ఞాపయితు మర్హసి

టీక॥ ఏషాం = వీరలయొక్క; ఇదం=ఈ; కార్యం=పని; మమ=నాకు; తత్త్వతః=యథార్థముగా; విదితంకామం=తెలియఁబడియేయున్నని. తథాపితు=అట్లయినను; యథాతత్త్వం = తత్త్వము నతిక్రమింపక; ఆజ్ఞాపయితుం=ఆనతిచ్చుటకు; అర్హసి = తగుదువు.

ఇవ్వానరవీరులు సేయవలసిన కార్యము తత్త్వము నాకునుం దెలిసియేయున్నది; అయినను, నీమనసునందోఁచినవిధంబున నీవే వీరలకాజ్ఞయొసంగుము. అని, సుగ్రీవుండు, రామునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇతి బ్రువాణం సుగ్రీవం రామో దశరథాత్మజః. ౯
బాహుభ్యాం సంపరిష్వజ్య ఇదం వచన మబ్రవీత్

టీక ॥ దశరథాత్మజః = దశరథుని కొడుకయిన; రామః=రాముఁడు; ఇతి=ఇట్లు; బ్రువాణం=చెప్పుచున్న; సుగ్రీవం=సుగ్రీవుని; బాహుభ్యాం= చేతులచేత; సంపరిష్వజ్య=కవుఁగిలించి; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను;

ఇవ్విధంబున సుగ్రీవుండు నుడువుటయు, దశరథపుత్త్రుఁడగు రాముండు, అతని బాహువులంగ్రుచ్చి కౌఁగిటం జేర్చి, యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

జ్ఞాయతాం మమ వైదేహీ యది జీవతివా నవా. ౧౦
స చ దేశో మహాప్రాజ్ఞ యస్మి& వసతి రావణః

టీక॥ మహాప్రాజ్ఞ = మహాపండితుండవగు సుగ్రీవుఁడా! మమ=నాయొక్క; వైదేహీ=సీత; జీవతియదివా=బ్రతికియున్నదా? నవా=లేదా? ఇదం (అధ్యాహృతము) = ఈవిషయము; జ్ఞాయతాం=తెలియఁబడుఁగాక. యస్మి&=ఏప్రదేశమునందు; రావణః=రావణుఁడు; వసతి=ఉన్నాఁడో; సః=ఆ; దేశశ్చ=ప్రదేశమును; జ్ఞాయతాం (అధ్యాహృతము) = తెలియఁబడుఁగాక.

మహాపండితుఁడా ! నాప్రియురాలయినసీత బ్రతికియున్నదా లేదా యనుసంగతియు, రావణుండు నివసించు ప్రదేశమును, దెలియవలెను.

అని, తాత్పర్యము.

అధిగమ్యతు వైదేహీం నిలయం రావణస్య చ. ౧౧
ప్రాప్తకాలం విధాస్యామి తస్మి& కాలే సహ త్వయా

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; వైదేహీం = సీతను; రావణస్య=రావణునియొక్క; నిలయంచ = ఉనికిపట్టును; అధిగమ్యతు= తెలిసినంతనె; తస్మి&=ఆ; కాలే= సమయమునందు; ప్రాప్తకాలం = పొందఁబడిన కాలముగల కార్యమును; త్వయాసహ=నీతోఁగూడ; విధాస్యామి=చేసె

దను.

సీత బ్రతికియున్న వృత్తాంతమును రావణుండు నివసించుప్రదేశమును దెలిసినంతనే, యాసమయంబున నేది చేయుటయుచిత మో దాని మనమిద్దఱము నుగావింతము. అని, తాత్పర్యము.

నాహ మస్మిన్ ప్రభుః కార్యే వానరేశ న లక్ష్మణః. ౧౨
త్వ మస్య హేతుః కార్యస్య ప్రభుశ్చ ప్లవగేశ్వర

టీక॥ వానరేశ = వానరులకు నాథుఁడవగు సుగ్రీవుఁడా! అస్మిన్=ఈ; కార్యే = పనియందు; ప్రభుః=నియామకుఁడు; అహం=నేను; న=కాను; లక్ష్మణః = లక్ష్మణుండును; న=కాఁడు. ప్లవగేశ్వర = వానర నాయకుఁడా! త్వం=నీవు; అస్య=ఈ; కార్యస్య=పనికి; హేతుః = కారణమవును, సాధకుఁడవుననుట; ప్రభుశ్చ= నియామకుఁడవును.

వానరేశ్వరుఁడవగు సుగ్రీవుఁడా! ఈ కార్యమువిషయమయి, నేనుగానిలక్ష్మణుండుగాని నియామకులముగాము; ఈ కార్యమునకు సాధించు వాడవును నియామకుండవును నీవే.

అని, తాత్పర్యము.

త్వమేవా జ్ఞాపయ విభో మమ కార్యవినిశ్చయమ్. ౧౩
త్వంహి జానాసి యత్ కార్యం మమ వీర న సంశయః

టీక॥ విభో = నాథుఁడా! త్వమేవ=నీవే; మమ=నాయొక్క; కార్యవినిశ్చయం=పనియొక్కయేర్పాటును; ఆజ్ఞాపయ=అనతిమ్ము. వీర = శూరుఁడా! త్వంహి=నీవే; మమ = నాయొక్క; కార్యం= కృత్యము; యత్ (అస్తి)= ఏదిగలదో; తత్ (అధ్యాహృతము)=దాని; జానాసి= ఎఱుంగుదువు. సంశయః=సందేహము; న=లేదు.

నాథుఁడా! ఈ కార్యమువిషయమయిన నానిశ్చయమును వీరలకు నీవే యాజ్ఞాపింపుము; నా కార్యమెట్టిదో ఆ విషయమంతయు నీకే తెలియును; సందియములేదు. అని, తాత్పర్యము.

సుహృ ద్ద్వితీయో విక్రాంతః ప్రాజ్ఞః కాలవిశేషవిత్. ౧౪
"సుహృద్వినీతః" ఇతిపాఠాంతరమ్.

భవా నస్మద్ధితే యుక్త స్సుకృతార్థో ర్థవిత్తమః

టీక॥ భవాన్ = నీవు; ద్వితీయః = రెండవవాఁడవైన; సుహృత్ = స్నేహితుఁడవు. పాఠాంతరపక్షమందు, సుహృత్ = స్నేహితుఁడవు; వినీతః = వినయముగలవాఁడవు. విక్రాంతః = పరాక్రమముగలవాఁడవు. ప్రాజ్ఞః = పండితుఁడవు; కాలవిశేషవిత్ = కాలభేదములం దెలిసినవాఁడవు. అస్మద్ధితే = మాయొక్క మేలునందు; యుక్తః = ఆసక్తుఁడవు. సుకృతార్థః = చక్కఁగా నేర్వఁబడిన యర్థశాస్త్రముగలవాఁడవు. అర్థవిత్తమః = అధికముగా కార్యములఁ దెలిసినవాఁడవు.

నీవు, నాకు లక్ష్మణునివంటి స్నేహితుఁడవు; (నీవు, నాకు స్నేహితుఁడవు, వినయసంపన్నుఁడవు,) పరాక్రమవంతుఁడవు; పండితుఁడవు; దేశకాలవిశేషంబులఁ దెలిసినవాఁడవు; నాకుహితముఁ గోరువాఁడవు; అర్థశాస్త్రము చక్కఁగా నేర్చినవాఁడవు; కార్యములను సాధించుటయందు సమర్థుఁడవు. అని, రాముండు సుగ్రీవునితోఁ జెప్పెను. అని, తా.

ఏవ ముక్తస్తు సుగ్రీవో వినతంనామ యూథపం. ౧౫

అబ్రవీ ద్రామసాన్నిధ్యే లక్ష్మణస్యచ ధీమతః

శైలాభం మేఘనిర్ఘోష మూర్జితం ప్లవగేశ్వరః. ౧౬

టీక॥ ప్లవగేశ్వరః = వానరరాజైన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; ఏవం = ఇట్లు; ఉక్తస్తు = చెప్పఁబడినవాఁడైనంతనె; రామసాన్నిధ్యే = రామునిసమీపమునందు; ధీమతః = బుద్ధిమంతుండగు; లక్ష్మణస్యచ = లక్ష్మణునియొక్కయు; సాన్నిధ్యే (అధ్యాహృతము) = సమీపమునందు; శైలాభం = పర్వతముయొక్క కాంతివంటికాంతిగలవాఁడును; మేఘనిర్ఘోషం = మేఘముయొక్క గర్జనమువంటిగర్జనముగలవాఁడును; ఊర్జితం = దృఢమయినశరీరముగలవాఁడునగు; వినతంనామ = వినతుఁడను పేరుగల; యూథపం = వానరసమూహమును పాలించువానినిగూర్చి; అబ్రవీత్ = పలికెను.

వానరనాథుండు సుగ్రీవుండు, రాముని వచనంబు విని, రాముండును బుద్ధిమంతుండగు లక్ష్మణుండును వినుచుండఁగాఁ, బర్వతాకారుండును మేఘగర్జనమువంటి గర్జనముగలవాఁడును దృఢశరీరుండునగు వినతుండను వానరయూథనాయకుం జూచి యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

సోమసూర్యాత్మజై స్సార్థం వానరై ర్వానరోత్తమ
దేశకాలనయై ర్యుక్తః కార్యాకార్యవినిశ్చయే. ౧౭
వృతః శతసహస్రేణ వానరాణాం తరస్వినామ్
అధిగచ్ఛ దిశంపూర్వాం సశైలవనకాననామ్. ౧౮

టీక॥ వానరోత్తమ = వానరశ్రేష్ఠుఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; కార్యాకార్య వినిశ్చయే = చేయఁదగిన దానియొక్కయు చేయరానిదానియొక్కయు నిశ్చయించుటయందు; దేశకాలనయైః = దేశోచితముల యిన నీతులతోను గాలోచితములయిన నీతులతోను; యుక్తః=కూడినవాఁడవై; తరస్వినాం = బలవంతులగు; వానరాణాం = వానరులయొక్క; శతసహస్రేణ=లక్షతో; వృతః = చుట్టుఁబడినవాఁడవై; సోమసూర్యాత్మజైః = చంద్రునియొక్కయు సూర్యునియొక్కయుఁగొడుకులయిన; వానరైస్సార్థం = వానరులతోఁగూడ; సశైల వనకాననాం = పర్వతములతోను చిన్నయడవులతోను పెద్దయడవులతోను కూడిన; పూర్వాందిశం = తూర్పుదిక్కును; అధిగచ్ఛ = పొందుము.

వానరశ్రేష్ఠుఁడగు వినతుఁడా! నీవు దేశకాలముల ననుసరించి, నీతియుక్తముగా, కార్యాకార్యంబుల నిశ్చయించుచు, బలవంతులగు లక్షవానరవీరులచేఁ బరివృతుండవై, చంద్రసూర్యపుత్రులగు వానరులతోఁ గూడినవాఁడవై, పర్వతారణ్య సహితంబయిన తూర్పుదిక్కునకుం బొమ్ము. అని, తాత్పర్యము.

తత్ర సీతాంచ వైదేహీం నిలయం రావణస్యచ
మార్గధ్వం గిరిశృంగేషు వనేషుచ నదీషుచ. ౧౯

టీక॥ తత్ర = ఆతూర్పుదిశయందు; గిరిశృంగేషు= పర్వతశిఖరములయందును; వనేషుచ=అడవులయందును; నదీషుచ=ఏర్లయందును; వైదేహీం=విదేహదేశమునందుఁ బుట్టిన; సీతాంచ= సీతను; రావణస్య=రావణునియొక్క; నిలయంచ=నివాసమును; మార్గధ్వం= వెదకుఁడు.

ఆతూర్పుదిక్కునఁ, బర్వతశిఖరంబులందును వనంబులందును నదులందును, సీతాదేవిని రావణు నివాసంబును వెదకి చూడుఁడు. అని, తాత్పర్యము.

నదీం భాగీరథీం రమ్యాం సరయూం కౌశికీం తథా
కాళిందీం యమునాం రమ్యాం యామునం చ మహాగిరిమ్. ౨౦
సరస్వతీంచ సింధుంచ శోణం మణినిభోదకమ్
మహీం కాలమహీంచైవ శైలకాననశోభితామ్. ౨౧
బ్రహ్మమాలా న్విదేహాంశ్చ మాళవాన్ కాశికోసలాన్
మాగధాంశ్చ మహాగ్రామాన్ పుండ్రాన్ వంగాం స్తథైవచ. ౨౨
పత్తనం కోశకారాణాం భూమించ రజతాకరామ్
సర్వ మేత ద్విచేతవ్యం మార్గయద్భి స్తత స్తతః. ౨౩
రామస్య దయితాం భార్యాం సీతాం దశరథస్నుషామ్

టీక॥ తత స్తతః=అచ్చటచ్చట; రామస్య=రామునియొక్క; దయితాం=ప్రియయయిన; భార్యాం=పెండ్లామును; దశరథస్నుషాం= దశరథునికోడలునగు; సీతాం = సీతను; మార్గయద్భిః=వెదకుచున్న; భవద్భిః (అధ్యాహృతము)=మీచేత; రమ్యాం=సుందరమయిన; భాగీరథీం = భగీరథునిచేఁ దేఁబడిన; నదీం=గంగానదిని; తథా= అట్లు; సరయూం=సరయూనదిని; కౌశికీం=కౌశికీనదిని; కాళిందీం=కళిందపర్వతమునందుఁబుట్టిన; రమ్యాం=రమణీయమయిన; యమునాం=యమునానదిని; యామునం=యమునాసంబంధియయిన; మహాగిరించ= గొప్పపర్వతమును; సరస్వతీంచ=సరస్వతీనదిని;మణినిభోదకం = రత్నముతోసమానమయినజలముగల; శోణం=శోణమనుపేరుగల; సింధుంచ=నదమును;మహీం= మహియనెడు దేశమును; శైలకాననశోభితాం= పర్వతములచేతను అడవులచేతనుబ్రకాశించుచున్న;కాలమహీంచైవ=కాలమహియను దేశమును; బ్రహ్మమాలాన్=బ్రహ్మమాలమను దేశమును; విదేహాంశ్చ = విదేహ దేశమును; మాళవాన్= మాళవదేశమును; కాశికోసలాన్=కాశిదేశమును, కోసలదేశమును; మహాగ్రామాన్=గొప్పగ్రామములుగల; మాగధాంశ్చ= మాగధదేశమును; పుండ్రాన్=పుండ్రదేశమును; తథైవచ=అట్లే; వంగాన్=వంగదేశమును; కోశకారాణాం=కోశకారులను రాజులయొక్క; పత్తనం=పట్టణమును; రజతాకరాం= వెండిగనులు

గల; భూమించ=నేలను; ప్రాప్య (అధ్యాహృతము)=పొంది; ఏతత్=ఇది; సర్వం=అంతయు; విచేతవ్యం = వెదకఁబడవలయును.

మీరలు, రమణీయమగు గంగానదికిని సరయూనదికిని గౌశికికిని యమునానదికిని యమునాసంబంధి పర్వతంబునకును సరస్వతీ నదికిని మణివలె స్వచ్ఛమయిన జలముగల శోణమనునదమునకునుమహీదేశమునకును పర్వతారణ్యంబులతో నొప్పుచున్న కాలమహీదేశమునకును బ్రహ్మమాల విదేహమాళవ కాశి కోసలదేశములకును గొప్పగ్రామములుగల మగధదేశమునకును పుండ్ర వంగ దేశములకును, గోశకారులను రాజులరాజధానికిని, వెండిగనులుగల భూమికిని బోయి, యాస్థలంబుల నంతయు, రాముని ప్రియభార్యయు దశరథునికోడలునగు సీతాదేవిని వెదకుఁడు.

అని, తాత్పర్యము.

సముద్ర మవగాఢాంశ్చ పర్వతా౯ పత్తనానిచ. ౨౪
మందరస్య చ యే కోటిం సంశ్రితాః కేచి దాయతామ్
కర్ణప్రావరణాశ్చైవ తథాచా ప్యోష్ఠకర్ణకాః. ౨౫
ఘోరలోహముఖాశ్చైవ జవనా శ్చైకపాదకాః
అక్షయా బలవంతశ్చ పురుషాః పురుషాదకాః. ౨౬
కిరాతాః కర్ణచూడాశ్చ హేమాంగాః ప్రియదర్శనాః
ఆమమీనాశనా స్తత్ర కిరాతా ద్వీపవాసినః. ౨౭
అంతర్జలచరా ఘోరా నరవ్యాఘ్రా ఇతి శ్రుతాః
ఏతేషా మాలయా స్సర్వే విచేయాః కాననౌకసః. ౨౮

టీక॥ కాననౌకసః = వానరులారా! సముద్రం = సముద్రమును; అవగాఢా౯ = ప్రవిష్టములయిన; పర్వతా౯చ= కొండలను; పత్తనానిచ=పట్టణములను; ఆయతాం = దీర్ఘమయిన; మందరస్య= మందరపర్వతముయొక్క; కోటించ = శిఖరమును; సంశ్రితాః = ఆశ్రయించిన; కేచిత్= కొందఱు; కర్ణప్రావరణాశ్చైవ=చెవులకు ముసుఁగులుగలవారలును ; తథాచ= అట్లు; కేచిత్ (అధ్యాహృతము, ఇట్లుముందును)=కొందఱు; ఓష్ఠకర్ణకాః=పెదవులందు చెవులుగలవారలును;కొందఱు; ఘోరలోహముఖాశ్చైవ=భయంకర

మైన యినుమువంటి మోముగలవారలు ను; కొందఱు; జవనాః=వేగముగల; ఏకపాదకాశ్చ= ఒక పాదముగలవారలు ను; కొందఱు; అక్షయాః=నాశములేని వారలును; బలవంతశ్చ= అధికమైనబల ముగలవారలును; పురుషాదకాః=పురు షులం దినువారలునగు; పురుషాః=పురు షులును; కర్ణచూడాశ్చ= చెవులందుజు ట్టుగలవారలును; హేమాంగాః= బం గారువంటి మేనుగలవారలును; ప్రియద ర్శనాః=సంతోషకరమయిన చూచుట గలవారలునగు; కిరాతాః = బోయ లును; తత్ర = అచ్చట; కొందఱు; ద్వీ పవాసినః = దీవులనుండు వారలును; ఆమమీనాశనాః = పక్వములుకాని మ త్స్యములందినుు వారలును; అంతర్జలచ రాః = నీళ్లలోపలం దిరుగువారలును; ఘోరాః = భయంకరులును; నరవ్యా ఘ్రాః=మనుష్యబునుబులులును; సగము మనుష్యదేహమును సగము వ్యాఘ్రదే హమునుగలవారలనుట; ఇతి=అని; శ్రు తాః = వినఁబడినవారలునగు; కిరా తాః=బోయలును; యే(సంతి)= ఎవ్వ రుగలరో; తేషాం (అధ్యాహృతము)= అట్టి; ఏతేషాం = వీరలయొక్క; ఆల యాః=నివాసములు; సర్వే=అన్నియు; విచేయాః = వెదకఁదగినవి.

సముద్ర మధ్యంబుననున్న పర్వతం బులను పట్టణంబులను విశాలమయిన మందర పర్వత శిఖరమును, భయంక రాకారులగు మనుష్యులు ఆశ్రయించి యున్నారు; వారలు కొందఱు చెవులు లేనివారలును, కొందఱు పెదవులందుఁ జెవులుగలవారలును కొందఱు భయం కరమయిన యినుపమోముగలవారలు ను కొందఱు ఒకటె పాదముగలిగి మ హావేగులును , కొందఱు మనుష్యుల భక్షించుచు మరణమే యెఱుంగని వా రలయి బలవంతులైనవారలునై యుం దురు; మఱియుఁ గర్ణమునందుజుట్టుగ ల్గి బంగారుచాయ మేను గలవారలై చూపరులకుఁ బ్రియంబుగల్గించు కిరా తులును, అపక్వంబులుకాని మత్స్యము లాహారముగా ద్వీపంబులవసించుచు జ లంబులోపల సంచరింపఁజాలి సగము మనుష్యశరీరమును సగము వ్యాఘ్రదే హమునుగల్గి భయంకరులయిన మఱి యొకతెగ కిరాతులునుంగలరు; వారల నివాసములయందంతటను సీతను వెదక వలయును. అని, తాత్పర్యము.

గిరిభి ర్యేచ గమ్యంతే ప్లవనేన ప్లవేనచ
రత్నవంతం యవద్వీపం సప్తరాజ్యోపశోభితమ్. ౨౯

స ౪౦

సువర్ణరూప్యకంచైవ సువర్ణాకరమండితమ్
యవద్వీప మతిక్రమ్య శిశిరో నామ పర్వతః. ౩౦
దివం స్పృశతి శృంగేణ దేవదానవసేవితః
ఏతేషాం గిరిదుర్గేషు ప్రపాతేషు వనేషుచ. ౩౧
మార్గధ్వం సహితా స్సర్వే రామపత్నీం యశస్వినీమ్

టీక॥ యేచ= ఏద్వీపములును; గిరిభిః=పర్వతములచే; గమ్యంతే = పొందఁబడుచున్నవో ; యే (అధ్యాహృతము)=ఏద్వీపములు; ప్లవనేన= దాఁటుటచేత; గమ్యంతే (అధ్యాహృతము)= పొందఁబడుచున్నవో; యే(అధ్యాహృతము)=ఏద్వీపములు; ప్లవేనచ=పడవచేతను; గమ్యంతే(అధ్యాహృతము)= పొందఁబడుచున్నవో; తాన్ (అధ్యాహృతము)= ఆద్వీపములను; రత్నవంతం = అధికముగా మణులు గలదియు; సప్తరాజ్యోపశోభితం = ఏడురాజ్యఖండములచే నొప్పుచున్నదియు నగు; యవద్వీపం=యవద్వీపమును; సువర్ణాకరమండితం = బంగారుగనులచేనలంకృతమయిన; సువర్ణరూప్యకంచైవ= సువర్ణరూప్యకమను ద్వీపమును; ప్రాప్య(అధ్యాహృతము) = పొంది; యవద్వీపం=యవద్వీపమును; అతిక్రమ్య= దాఁటి; యః(అధ్యాహృతము) = ఏ; దేవదానవసేవితః = దేవతలచేతను దానవులచేతను సేవింపఁబడిన; శిశిరోనామ= శిశిరమను పేరుగల; పర్వతః= కొండ;శృంగేణ=శిఖరముచేత; దివం= ఆకాశమును; స్పృశతి= తాఁకుచున్నదో; తం(అధ్యాహృతము)= ఆశిశిరపర్వతమును ; ప్రాప్య (అధ్యాహృతము)= పొంది; ఏతేషాం = వీనియొక్క; గిరిదుర్గేషు= పర్వతములదుర్గమప్రదేశములందును; ప్రపాతేషు=సెలయేళ్లయందును; వనేషుచ = అడవులయందును ; యూయం (అధ్యాహృతము)=మీరలు; సర్వే= అందఱును; సహితాః= కూడినవారలయి; యశస్వినీం = అధికమయినకీర్తిగల; రామపత్నీం = రామునిభార్యయయినసీతను; మార్గధ్వం= వెదకుఁడు.

మీరలు, పర్వతంబులచేఁ బోఁదగిన ద్వీపంబులకును ఎగిరి దాఁటి చేరఁదగిన ద్వీపంబులకును తెప్పచేఁ బొందఁదగిన ద్వీపంబులకునుబోయి, రత్నంపుగనులు గలదియు ఏడుఖండములుగా విభజింపఁ

బడినదియునగు యవద్వీపంబును బంగారుగనులచేఁ బ్రకాశించునట్టి సువర్ణరూప్యకమను ద్వీపంబునుం బొంది, యంత యవద్వీపము నతిక్రమించి, యత్యున్నమయిన శిఖరము గలదియు దేవదానవసేవితంబునగు శిశిరపర్వతంబునొంది, యాద్వీపంబు లందును ఆపర్వతంబునందును పర్వతదుర్గమప్రదేశంబులందును నిర్ఝరంబులందును వనంబులందును, అందఱుంగూడి, కీర్తిసంపన్నయగు సీతాదేవినన్వేషింపుఁడు. అని, తాత్పర్యము.

తతో రక్తజలం శోణ మగాధం శీఘ్రగామినమ్. ౩౨
గత్వా పారం సముద్రస్య సిద్ధచారణ సేవితమ్
తస్య తీర్థేషు రమ్యేషు విచిత్రేషు వనేషుచ. ౩౩
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః

టీక ॥ తతః = అటుపిమ్మట; భవద్భిః (అధ్యాహృతము)= మీచేత; సముద్రస్య = సముద్రముయొక్క; పారం= ఆవలిగట్టునవున్నదియు; సిద్ధచారణసేవితం= సిద్ధులచేతను చారణులచేతను సేవింపఁబడినదియు; రక్తజలం=ఎఱ్ఱనినీళ్ళుగలదియు; అగాధం = లోఁతుగలదియు; శీఘ్రగామినం = శీఘ్రముగాఁబాఱునదియునగు; శోణం= శోణమనుపేరుగల నదమును; గత్వా= పొంది; తస్య=ఆనేటియొక్క; రమ్యేషు=మనోహరములగు; తీర్థేషు=రేవులయందును; విచిత్రేషు=నానావిధములయిన; వనేషుచ=అడవులయందును; తతస్తతః = అచ్చటచ్చట; రావణః= రావణుఁడు; వైదేహ్యాసహ = సీతతోఁగూడ; మార్గితవ్యః = వెదకఁబడవలసినవాఁడు.

అంత, మీరలు, లవణసముద్రమునవ్వలితీరంబుఁజేరి, యచటనున్న సిద్ధచారణసేవితంబును ఎఱ్ఱనిజలముగలదియునగాధంబును వేగంబుగాఁ బ్రవహించునదియునగు శోణనదము నొంది యందలి రమణీయములయిన రేవులందును నానావిధ వనంబులందును అచ్చటచ్చట సీతాదేవిని రావణుని వెదక వలయును. అని, తాత్పర్యము.

పర్వతప్రభవా నద్య స్సురమ్యా బహునిష్కుటాః. ౩౪

మార్గితవ్యా దరీమంతః పర్వతాశ్చ వనానిచ

టీక॥ సురమ్యాః = మిక్కిలియుమనోహరములును; బహునిష్కుటాః = పెక్కుతోఁటలుగలవియునగు; పర్వతప్రభవాః = కొండలుజన్మస్థానముగాఁగల; నద్యః=నదులు; మార్గితవ్యాః = వెదకఁబడవలసినవి. దరీమంతః= చఱియలుగల; పర్వతాశ్చ = కొండలును; మార్గితవ్యాః(అధ్యాహృతము)= వెదకఁబడవలసినవి. వనానిచ=అడవులును; మార్గితవానిని(అధ్యాహృతము)=వెదకఁబడవలసినవి.

అంతఁ, బ్లక్షద్వీపమునందు, మనోహరంబులును అనేకములయినయుద్యానవనములచే నొప్పుచున్నవియుఁ బర్వతంబులంబుట్టినవియునగు నదులతీరంబులందును చెక్కుచఱియలతోఁగూడినపర్వతంబులయందునువనంబులయందును, సీతాదేవినిరావణునివెదకుఁడు.అని,తా.

తత స్సముద్రద్వీపాంశ్చ సుభీమాన్ ద్రష్టు మర్హథ. ౩౫
ఊర్మిమంతం సముద్రంచ క్రోశంత మనిలోద్ధతమ్

టీక॥ తతః = అటుపిమ్మట; సుభీమాన్ = మిక్కిలియు భయంకరములయిన; సముద్రద్వీపాన్శ్చ= సముద్రమునందలిదీవులను;ఊర్మిమంతం=అధికముగాకరళ్లుగలదియు; అనిలోద్ధతం=గాలిచేఁ గొట్టఁబడినదియు; క్రోశంతం= అఱచుచున్నదియునగు; సముద్రంచ= ఇట్టిసముద్రమును; ద్రష్టుం= చూచుటకు; అర్హథ=తగుదురు.

అంత, మీరుభయంకరాకారంబులగు నిట్టిసముద్రద్వీపంబులను, గాలిచేఁ గొట్టఁబడినదై గొప్పకరళ్లతో గర్జించుచుండు నిట్టిసముద్రంబునుంజూడఁగలరు. అని, తాత్పర్యము.

తత్రా సురా మహాకాయా శ్ఛాయాం గృహ్ణంతి నిత్యశః. ౩౬
బ్రహ్మణా సమనుజ్ఞాతా దీర్ఘకాలం బుభుక్షితాః

టీక॥ తత్ర = అయిట్టిసముద్రమునందు; మహాకాయాః= గొప్పమేనుగలవారలును; బ్రహ్మణా= బ్రహ్మదేవునిచేత; సమనుజ్ఞాతాః=అనుమతింపఁబడినవారలును; దీర్ఘకాలం=బహుకాలముగా; బుభుక్షితాః=ఆఁకలిగొన్నవా

స ౪౦

రలునగు; అసురాః= అసురులు; నిత్య శః=ఎల్లప్పుడును; ఛాయాం= నీడను; గృహ్ణంతి=గ్రహించుచున్నారు.

అయ్యిక్షుసముద్రంబున, మహాకాయులును బహుకాలముగానాఁకలిగొనియున్నవారలునగు నసురులు, బ్రహ్మదేవునివరంబునంజేసి, యెల్లప్పుడును మనుష్యులనీడలను మ్రింగుటచే వారలను మ్రింగుచుందురు. అని, తాత్పర్యము.

తం కాలమేఘప్రతిమం మహోరగ నిషేవితమ్. ౩౭
అభిగమ్య మహానాదం తీర్థేనైవ మహోదధిమ్
తతో రక్తజలం భీమం లోహితం నామసాగరమ్. ౩౮
గతా ద్రక్ష్యథ తాం చైవ బృహతీం కూటశాల్మలిమ్
గృహంచ వైనతేయస్య నానారత్నవిభూషితమ్. ౩౯
తత్ర కైలాససంకాశం విహితం విశ్వకర్మణా

టీక ॥ యూయం (అధ్యాహృతము)=మీరు; కాలమేఘప్రతిమం= ప్రలయకాలమేఘముతోఁబోలిక-గలదియు; మహోరగనిషేవితం= గొప్పసర్పములచే సేవింపఁబడినదియు; మహానాదం=అధికమయిన ధ్వనిగలదియునగు; తం=ఆ; మహోదధిం=గొప్పదైనయిక్షుసముద్రమును; తీర్థేనైవ=ఉపాయముచేతనే; అభిగమ్య=పొంది;తతః=ఆయిక్షుసముద్రమునుండి;గతాః = పోయినవారలయి;రక్తజలం = ఎఱ్ఱనినీళ్లుగలదియు; భీమం= భయంకరమునునగు; లోహితంనామ=ఎఱ్ఱనిదని ప్రసిద్ధమయిన; సాగరం= సురాసముద్రమును; బృహతీం=గొప్పదగు; కూటశాల్మలించైవ= కొండబూరుగుచెట్టును; తత్ర= ఆశాల్మలిద్వీపమునందు; విశ్వకర్మణా=విశ్వకర్మచేత;విహితం=నిర్మింపఁబడినదియు; కైలాససంకాశం=కైలాసముతోసమానమైనదియు; నానారత్నవిభూషితం=నానావిధములయిన మణులచే నలంకరింపఁబడినదియునగు; వైనతేయస్య= గరుత్మంతునియొక్క; గృహంచైవ=ఇంటిని; ద్రక్ష్యథ= చూడఁగలరు.

మీరలు, ప్రలయకాల మేఘమువలె మహాభయంకరమయి గొప్పసర్పములచే నధిష్ఠితమయి మహాధ్వనితో గర్జించుచుండునయ్యిక్షుసముద్రంబును ఆరాక్షసులకుఁజిక్కకయుపాయమునందాటి,

స ౪౦

యావల, ఎఱ్ఱనిజలంబుగలిగి భయంకరమయిన మధుసముద్రింబుఁ జూడఁగలరు; అచ్చట విశాలమగుసుప్రసిద్ధమయినకొండబూరుగువృక్షము కానంబడును; ఆశాల్మలిద్వీపమునందు, విశ్వకర్మనిర్మితంబును గైలాసపర్వతంబువలె ధవళవర్ణమయి యున్నతంబైనదియునానావిధ రత్నాలంకృతమునగు గరుత్మంతునిగృహముం జూడఁగలరు.

అని, తాత్పర్యము.

తత్ర శైలనిభా భీమా మందేహా నామరాక్షసాః. ౪౦
శైలశృంగేషు లంబంతే నానారూపా భయావహాః

టీక॥ తత్ర = ఆశాల్మలిద్వీపమునందు; శైలనిభాః = పర్వతములతో సమానులును; భీమాః = భయంకరులును; నానారూపాః=నానావిధమయినయాకారము గలవారలును; భయావహాః = భయంబుగల్గించువారలునగు; మందేహాః నామ = మందేహులని ప్రసిద్ధులయిన; రాక్షసాః = రక్కసులు; శైలశృంగేషు = పర్వతశిఖరములయందు; లంబంతే=వ్రేలుకాడుచున్నారు.

ఆశాల్మలిద్వీపమునందు, నానావిధములయిన రూపములు గలవారలును బర్వతంబులంతటి భయంకరంబులైనయాకారములు గలవారలునగు మందేహులను రాక్షసులు పర్వతశిఖరంబులనధిష్ఠించియుందురు. అని, తాత్పర్యము.

తే పతంతి జలే నిత్యం సూర్యస్యోదయనం ప్రతి. ౪౧
నిహతా బ్రహ్మతేజోభి రహన్యహని రాక్షసాః

టీక ॥ తే=ఆ; రాక్షసాః= మందేహులను రక్కసులు; నిత్యం= ఎల్లప్పుడును; అహనిఅహని= ప్రతిదినమందును; సూర్యస్య=సూర్యునియొక్క; ఉదయనంప్రతి= ఉదయమునుగూర్చి, ఉదయకాలమందనుట; బ్రహ్మతేజోభిః = గాయత్రీప్రభావములచేత;నిహతాః= కొట్టఁబడినవారలయి; జలే= నీటియందు; పతంతి=పడుదురు.

ఆ మందేహులు, ఎల్లప్పుడును బ్రత్యహమందును, సూర్యోదయ కాలంబున బ్రాహ్మణులుజపించు గాయత్రీమంత్రముయొక్క ప్రభావంబుచే నిహతులయి, సముద్రజలంబులం బడుదురు.

అని, తాత్పర్యము.

అభితప్తాశ్చ సూర్యేణ లంబంతే స్మ పునఃపునః. ౪౨

టీక॥ తే (అధ్యాహృతము)= ఆ మందేహులు; సూర్యేణ= సూర్యునిచేత; అభితప్తాశ్చ= తపింపఁజేయఁబడినవారునై; పునఃపునః= మాటిమాటికి; లంబంతే= వ్రేలాడుదురు; "స్మ" అనునది పాదపూరణార్థము.

వారలట్లు జలంబులంబడుటయగాక, సూర్యుని వేఁడిమిచేతనుం బీడితులయి, మఱల శైలశృంగంబులం జేరుదురు. అని, తాత్పర్యము.

విశేషార్థము.— మందేహులను రాక్షసులు, ప్రతిదినమందును, ప్రాతఃకాలంబున సూర్యసంచారమున కడ్డపడుటయు, అప్పుడు బ్రాహ్మణులు గాయత్రిని జపించివిడుచునర్ఘ్యము ప్రభావంబున దూరంబునఁ ద్రోయఁబడుటయు, శ్రుతిప్రసిద్ధములు.

తతః పాండురమేఘాభం క్షీరోదం నామ సాగరమ్
గతా ద్రక్ష్యథ దుర్ధర్షా ముక్తాహారమివోర్మిభిః. ౪౩

టీక॥ దుర్ధర్షాః= ఎదిరింపనలవిగాని; యూయం(అధ్యాహృతము)= మీరలు; తతః = ఆసర్పిర్దధిసముద్రములనుండియు అందలికుశక్రౌంచద్వీపములనుండియు; గతాః=పోయినవారలయి; పాండురమేఘాభం = తెల్లనిమేఘముయొక్క కాంతివంటి కాంతిగలదియు; ఊర్మిభిః= అలలచేత; ముక్తాహారమివ (స్థితం)= ముత్తెములహారముగలదివలె నున్నదియునగు; క్షీరోదంనామ= క్షీరసముద్రమనిప్రసిద్ధమయిన; సాగరం= సముద్రమును; ద్రక్ష్యథ=చూడఁగలరు.

శత్రువుల కెదిరింపనలవిగాని మహాపరాక్రమముగలమీరలు, అంత, మార్గంబున ఘృతసముద్రమును కుశద్వీపమును దధిసముద్రమును క్రౌంచద్వీపమును అతిక్రమించినవారలయి, తెల్లనిమేఘమువలె నొప్పుచున్నదియు, కరళ్లచే ముత్తెములహారముగలిగినట్లు శోభిలుచున్నదియు నగు క్షీర సముద్రమునుం జూడఁగలరు. అని, తాత్పర్యము.

విశేషార్థము.— మధుసముద్రమునకుఁ బిమ్మట,ఘృతదధిసముద్రములును గుశక్రౌంచద్వీపములును వెదకవలసినవిగా కంఠోక్తముగా చెప్పఁబడకపోయినను, "లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరజ

లైస్సమం" అనిసముద్రముల క్రమము చెప్పఁబడియుండుటవలన, "తతః" అను స్థలంబున, ప్రసిద్ధవాచకమయిన తచ్ఛ ముచేతనే సంగ్రహింపఁబడినవనియు, అందు అంతగావిశేషములేదనునభిప్రాయమునఁ గంథోక్తములు కావయ్యె ననియు నెఱుంగునది.

తస్య మధ్యే మహా శ్వేత ఋషభోనామ పర్వతః
దివ్యగంధైః కుసుమితై రాజతైశ్చ నగైర్వృతః. ౪౪

టీక॥ తస్య=ఆక్షీరసముద్రముయొక్క; మధ్యే=నడుమునందు; మహాన్=గొప్పదియు; శ్వేతః=తెల్లనిదియు; దివ్యగంధైః=శ్రేష్ఠమయిన వాసనగలవియు; కుసుమితైః= పూచినవియును; రాజతైశ్చ = వెండివికారములయినవియునగు; నగైః=వృక్షములచేత; వృతః = చుట్టఁబడినదియునగు; ఋషభోనామ = ఋషభమనుపేరుగల; పర్వతః=కొండ; అస్తి(అధ్యాహృతము)= కలదు.

క్షీరసముద్రమధ్యమున, యుత్తమమైన తావితోఁగూడినపుష్పములుగల రజతవృక్షములచే శోభిల్లుచున్న శ్వేతవర్ణమయిన ఋషభంబనుమహాపర్వతంబొండుగలదు. అని, తాత్పర్యము.

సరశ్చ రాజతైః పద్మై ర్జ్వలితై ర్హేమకేసరైః
నామ్నా సుదర్శనంనామ రాజహంసై స్సమాకులమ్. ౪౫

టీక॥ జ్వలితైః= ప్రకాశించుచున్నవియు; హేమకేసరైః= బంగారుకెంజల్కములుగలవియు; రాజతైః= వెండివికారములునగు; పద్మైః=కమలములతో; సహితం (అధ్యాహృతము)= కూడినదియు; రాజహంసైః=రాయంచపక్షులచేత; సమాకులం= నిండినదియు; నామ్నా=పేరుచేత; సుదర్శనం నామ= సుదర్శనమని ప్రసిద్ధమయినదియునగు; సరశ్చ=కొలనును; అస్తి (అధ్యాహృతము) = కలదు.

బంగారుకెంజల్కంబులు గల్గి దేదీప్యమానంబులయిన వెండికమలంబులతోను రాజహంసములతోను ఒప్పుచున్న సుదర్శనంబనుపేరుగలసరస్సును ఒకండు కలదు. అని, తాత్పర్యము.

విబుధా శ్చారణా యక్షాః కిన్నరా స్సాప్సరోగణాః

స ౪౦

హృష్టా స్సమభిగచ్ఛంతి నళినీం తాం రిరంసవః. ౪౬

టీక॥ విబుధాః=దేవతలును; చారణాః=చారణులును; యక్షాః= యక్షులును; కిన్నరాః= కిన్నరులును; సాప్సరోగణాః = అప్సరసలసమూహము తోఁ గూడినవారలయి; హృష్టాః=సంతోషించినవారలయి; రిరంసవః=క్రీడింపఁగోరినవారలయి; తాం=ఆ; నళినీం=తామరకొలనును; సమభిగచ్ఛంతి=పొందుచున్నారు.

దేవతలును జారణులును యక్షులును గిన్నరులును అప్సరసలంగూడి,విహరించుటకై, సంతోషంబున,నాసుదర్శన సరస్సునకు వచ్చుచుందురు.

అని, తాత్పర్యము.

క్షీరోదం సమతిక్రమ్య తతో ద్రక్ష్యథ వానరాః
జలోదం సాగరశ్రేష్ఠం సర్వభూతభయావహమ్. ౪౭

టీక॥ వానరాః = వానరులారా! క్షీరోదం=పాలసముద్రమును; సమతిక్రమ్య = దాఁటి; తతః = అటుపిమ్మట; సర్వభూతభయావహం = సమస్తభూతంబులకును భయముగల్గించునట్టి; సాగరశ్రేష్ఠం = సముద్రములలో నుత్తమమయిన; జలోదం = మంచినీళ్ల సముద్రమును; ద్రక్ష్యథ = చూడఁగలరు.

వానరులా! మీరు, క్షీరసముద్రము నతిక్రమించినపిమ్మట, సమస్తభూతములకును భయంకరమయినదియు సమస్తసముద్రములలో నుత్తమమునగు శుద్ధజలసముద్రమును జూతురు.

అని, తాత్పర్యము.

తత్ర తత్కోపజం తేజః కృతం హయముఖం మహత్
అస్యాహు స్తన్మహావేగ మోదనం సచరాచరమ్. ౪౮

టీక॥తత్ర=ఆశుద్ధజలసముద్రమునందు; కోపజం=ఔర్వునికోపమువలనఁ బుట్టిన; హయముఖం = గుఱ్ఱముయొక్క-ముఖమువంటి ముఖముగల; తత్= ప్రసిద్ధమయిన; మహత్ = గొప్పదగు; తేజః= తేజస్సు; కృతం=ఉంచఁబడినది. సచరాచరం= జంగమస్థావరములతోఁ గూడిన; మహావేగం= అధికమయినవే

గముగల; తత్=ఆజలమును; అస్య=ఈబడబాగ్నియొక్క; ఓదనం= ఆహారమునుగా; ఆహుః=చెప్పెదరు.

ఔర్వకోపంబునంబుట్టిన అశ్వముఖమయిన బడబాగ్నియని ప్రసిద్ధమయిన యమ్మహాతేజస్సు ఆ సముద్రజలంబుల నిక్షిప్తమయియున్నది; అయ్యది, ప్రలయకాలమున, జంగమస్థావర సహితముగా మహావేగమగు నా జలమంతయు దహించివేయును.

అని, తాత్పర్యము.

తత్ర విక్రోశతాం నాదో భూతానాం సాగరౌకసామ్
శ్రూయతేచ సమర్థానాం దృష్ట్వా త ద్బడబాముఖమ్. ౪౯

టీక॥ తత్ర = అచ్చట ; సమర్థానాం=శక్తములయినను; తత్=ఆ;బడబాముఖం = ఆఁడు గుఱ్ఱము యొక్క మోమువంటి మోముగల బడబాగ్నిని; దృష్ట్వా = చూచి; విక్రోశతాం=అఱచుచున్న ; సాగరౌకసాం = సముద్రము నివాస స్థానముగాఁ గల; భూతానాం=భూతములయొక్క ; నాదః= ధ్వనియు; శ్రూయతే = వినఁబడుచున్నది.

అచట, ఆజలసముద్రమునందు నివసించునట్టి భూతములు, బలపరాక్రమ సహితంబులయినను, ఆబడబానలంబుఁ జూచి,సహింపఁజాలక, భయంబుననఱచుచుండును; ఆధ్వని మీకు వినంబడును.

అని, తాత్పర్యము.

స్వాదూదస్యో త్తరే దేశే యోజనాని త్రయోదశ
జాతరూపశిలో నామ మహా నకనకపర్వతః. ౫౦

టీక ॥ స్వాదూదస్య= మంచినీళ్ల సముద్రముయొక్క; ఉత్తరే = ఆవలిదైన; దేశే=ప్రదేశమునందు; త్రయోదశ = పదుమూఁడైన; యోజనాని = ఆమడలను;గచ్ఛేత్(అధ్యాహృతము)=పొందుఁడు. జాతరూపశిలోనామ = జాతరూపశిలము (బంగారుతాళ్లుగలది) అని ప్రసిద్ధమయిన; మహాన్= గొప్పదగు;కనకపర్వతః = బంగారుకొండ; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఆజలసముద్రమునకావలితీరంబునఁబదుమూడుయోజనంబుల దూరంబున, జాతరూపశిలంబను పేరుగల,గొప్పకాంచన పర్వతంబొకండుగలదు. అని, తా.

స ౪౦

తత్ర చంద్రప్రతీకాశం పన్నగం ధరణీధరమ్
పద్మపత్రవిశాలాక్షం తతో ద్రక్ష్యథ వానరాః. ౫౧
ఆసీనం పర్వతస్యాగ్రే సర్వభూతనమస్కృతమ్
సహస్రశిరసం దేవ మనంతం నీలవాససమ్. ౫౨

టీక॥ వానరాః=వానరులారా! తతః=అంత; తత్ర=అచ్చట; పర్వతస్య=జాతరూప శిలపర్వతముయొక్క; అగ్రే=శిఖరమునందు; ఆసీనం = కూర్చుండినవాఁడును; సర్వభూతనమస్కృతం = సమస్తభూతములచేతను నమస్కరింపఁబడినవాఁడును; చంద్రప్రతీకాశం=చంద్రునితోసమానుఁడును; పద్మపత్రవిశాలాక్షం= తామరపూరేకులవలె వెడలువులయినకన్నులుగలవాఁడును; సహస్రశిరసం = వేయితలలుగలవాఁడును; నీలవాససం= నల్లనివస్త్రముగలవాఁడును; ధరణీధరం= భూమినిధరించువాఁడునగు; పన్నగం= సర్పరూపుఁడయిన; దేవం=దేవుఁడగు; అనంతం= ఆదిశేషుని; ద్రక్ష్యథ=చూడఁగలరు.

వానరులారా! అంతనచ్చట, నాజాతరూపశిల పర్వతశిఖరంబున నాసీనుండై సమస్తభూతంబులచేత నమస్కృతుండై చంద్రుని వంటి ధవళ దేహముతోను నీలవస్త్రముతోను బ్రకాశించుచున్నవానిఁ దామర పూరేకులవంటి విశాలములయిన నేత్రములుగల్గి వేయిశిరస్సులతో భాసిల్లుచు సమస్తభూమిభారమును మోయుచున్నవాని సర్పమూర్తియయినదేవు నాదిశేషుంజూడఁగలరు. అని, తాత్పర్యము.

త్రిశిరాః కాంచనః కేతు స్తాల స్తస్య మహాత్మనః
స్థాపితః పర్వత స్యాగ్రే విరాజతి సవేదికః. ౫౩

టీక॥ పర్వతస్య = కొండయొక్క; అగ్రే= శిఖరమునందు; స్థాపితః=ఉంచఁబడిన; తస్య=ఆ; మహాత్మనః = అధికమయిన ప్రభావముగల యనంతునియొక్క; కేతుః = ధ్వజమయిన; త్రిశిరాః = మూఁడుతలలుగల; కాంచనః=బంగారువికారమయిన; తాలః= తాటిచెట్టు; సవేదికః = తిన్నెతోఁగూడినదై; విరాజతి = ప్రకాశించు చున్నది.

మహాత్ముండగు నయ్యనంత దేవునిధ్వజమయిన కాంచన తాలవృక్షము, మూండు శిఖరములుగలదై, వేదికాసహితంబుగా, నాజాతరూప శిలపర్వతశిఖరంబునస్థాపితమయి, యెంతయుశోభిల్లుచుండును. అని, తాత్పర్యము.

పూర్వస్యాం దిశి నిర్మాణం కృతం త త్త్రిదశేశ్వరైః

టీక ॥ త్రిదశేశ్వరైః = దేవతలకుం బ్రభువులయినవారలచేత; తత్ = ఆ తాలరూపధ్వజము; పూర్వస్యాందిశి= తూర్పుదిక్కునందు; నిర్మాణం= అవధిగా; కృతం=చేయఁబడినది.

దేవతలకును బ్రభువులయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, ఆతాలధ్వజమును, పూర్వదిక్కునకు ఎల్లగా నేర్పఱచిరి. అని, తాత్పర్యము.

తతఃపరం హేమమయ శ్శ్రీమా నుదయపర్వతః. ౫౪

టీక ॥ తతఃపరం = అటుపిమ్మట; హేమమయః= బంగారువికారమయిన; శ్రీమాన్=అధికమయినకాంతిగల; ఉదయపర్వతః=ఉదయగిరి; అస్తి (అధ్యాహృతము)= ఉన్నది.

అంతకుఁ బిమ్మట, దేదీప్యమానంబయిన కాంచనమయంబగు నుదయపర్వతమున్నది. అని, తాత్పర్యము.

తస్య కోటి ర్దివం స్పృష్ట్వా శతయోజన మాయతా
జాతరూపమయీ దివ్యా విరాజతి సవేదికా. ౫౫

టీక॥ తస్య = ఆ యుదయపర్వతముయొక్క ; శతయోజనం = నూఱు యోజనములు; ఆయతా = ఉన్నతమయినదియు; జాతరూపమయీ = బంగారువికారమయినదియు; దివ్యా=శ్రేష్ఠమునగు; సవేదికా= తిన్నెతోఁగూడినదియునగు; కోటిః=అగ్రభాగము; దివం=స్వర్గమును; స్పృష్ట్వా=తాఁకి, విరాజతి=ప్రకాశించుచున్నది.

కాంచనమయంబును దివ్యంబు నగు నయ్యుదయ పర్వతము నగ్రభాగము, నూఱుయోజనము లున్నతంబై వేదికాసహితంబయి, స్వర్గలోకంబునొరయుచుభాసిల్లుచున్నది. అని, తాత్పర్యము.

స ౪౦

సాలై స్తాలై స్తమాలైశ్చ కర్ణికారైశ్చ పుష్పితైః
జాతరూపమయై ర్దివ్యై శ్శోభతే సూర్యసన్నిభైః. ౫౬

టీక ॥ సా, కోటిః (అధ్యాహృతము)=ఆయగ్రభాగము; జాతరూపమయైః = బంగారువికారములును; దివ్యైః=శ్రేష్ఠములును;సూర్యసన్నిభైః= సూర్యునితో సమానములునగు; సాలైః=మద్దిచెట్లచేతను; తాలైః=తాటిచెట్లచేతను;తమాలైశ్చ = చీఁకటిచెట్లచేతను; పుష్పితైః= పూచిన; కర్ణికారైశ్చ = కొండగోఁగుచెట్లచేతను;శోభతే=ప్రకాశించుచున్నది.

అయ్యది, కాంచనమయంబులునుదివ్యంబులునుసూర్యబింబమువలెవెలుంగుచున్నవియునగు సాల వృక్షంబులును తాటిచెట్లును తమాల వృక్షంబులును, పూచిన కొండగోఁగుచెట్లును గలిగి యెంతయుశోభిలుచుండును.

అని, తాత్పర్యము.

తత్ర యోజన విస్తార ముచ్ఛ్రితం దశయోజనమ్
శృంగం సౌమనసంనామ జాతరూపమయం ధ్రువమ్. ౫౭

టీక ॥ తత్ర=ఆయుదగిరి యగ్రభాగమునందు; యోజనవిస్తారం = ఒకయోజనమువెడల్పుగలదియు; దశయోజనం=పదియోజనములు; ఉచ్ఛ్రితం= ఉన్నతమైనదియు; జాతరూపమయం= బంగారువికారమును; ధ్రువం = స్థిరమునగు; సౌమనసంనామ = సౌమనసమనుపేరుగల; శృంగం= శిఖరము; అస్తి (అధ్యాహృతము)=ఉన్నది.

అయ్యుదయగిరి యగ్రభాగంబున, ఒకయోజనము వైశాల్యమును బదియోజనములు ఔన్నత్యమునుంగల్గి, కాంచనమయమయి స్థిరమైన సౌమనసంబను శిఖరమున్నది.

అని,తాత్పర్యము.

తత్ర పూర్వం పదం కృత్వా పురా విష్ణు స్త్రివిక్రమే
ద్వితీయం శిఖరే మేరో శ్చకార పురుషోత్తమః. ౫౮

టీక॥ పురా=మున్ను; త్రివిక్రమే= మూఁడడుగు లుంచు సమయమునందు;

పురుషోత్తమః=పురుషులలో శ్రేష్ఠుఁడైన; విష్ణుః=వెన్నుఁడు; తత్ర=ఆసౌమనసశిఖరమునందు; పూర్వం= మొదటిదైన; పదం=అడుగును; కృత్వా=ఉంచి; ద్వితీయం=రెండవయడుగును; మేరుశిఖరే=మేరుపర్వతముయొక్క శిఖరమునందు; చకార=ఉంచెను.

పూర్వము, పురుషోత్తముఁడగు విష్ణువు, బలిచక్రవర్తివలన మూఁడడుగుల నేల యడిగిపుచ్చుకొని, కొలుచుకొనునప్పుడు, మొదటి యడుగును తూర్పు దిక్కునకు అవధియయిన ఈసౌమనస శృంగంబునందును, రెండవయడుగును పశ్చిమదిశ కవధియయిన సావర్ణిమేరు శిఖరంబునందు నుంచెను.

అని, తాత్పర్యము.

ఉత్తరేణ పరిక్రమ్య జంబూద్వీపం దివాకరః
దృశ్యో భవతి భూయిష్ఠం శిఖరం తన్మహోచ్ఛ్రియమ్. ౫౯

టీక॥ దివాకరః=సూర్యుఁడు; జంబూద్వీపం=జంబూద్వీపమును;ఉత్తరేణ=ఉత్తరభాగముచేత;పరిక్రమ్య=చుట్టి; మహోచ్ఛ్రియం = అధికమయిన యౌన్నత్యముగల; తత్=ఆ; శిఖరం=సౌమనసశృంగమును; ప్రాప్య(అధ్యాహృతము)=పొంది;భూయిష్ఠం=మిక్కిలియు;దృశ్యః=చూడఁదగినవాఁడు; భవతి=అగుచున్నాఁడు.

సూర్యుఁడు, అస్తమయానంతరము, జంబూద్వీపము నుత్తరభాగంబు నప్రదక్షిణంబుగాఁ జుట్టివచ్చి, మిక్కిలియునున్నతమయిన యాసౌమనసశిఖరంబుఁ జేరినపిదప, మేరు దక్షిణ పార్శ్వంబుననున్న వారికి మనకందఱకును జక్కఁగాఁ గానఁ బడును.

అని, తాత్పర్యము.

తత్ర వైఖానసా నామ వాలఖిల్యా మహర్షయః
ప్రకాశమానా దృశ్యంతే సూర్యవర్ణా స్తపస్వినః. ౬౦

టీక॥ తత్ర=ఆ సౌమనసశృంగమునందు; తపస్వినః = అధికమయినతపస్సుగలవారలును; సూర్యవర్ణాః=సూర్యునియొక్క వన్నెవంటివన్నెగలవారలునగు; వైఖానసాః= వైఖానసులనియు (బ్రహ్మదేవుని నఖములఁ బుట్టినవారలు); వాలఖిల్యానామ= వాలఖిల్యులనియుఁ (బ్రహ్మదేవుని రోమంబులం బు

ట్టినవారలు) ప్రసిద్ధులయిన; మహర్షయః=పూజ్యులయినఋషులు; ప్రకాశమానాః=ప్రకాశించుచున్నవారలయి; దృశ్యంతే = కనఁబడుచున్నారు.

ఆసోమనస శిఖరంబున, మహాతపస్సంపన్నులును సూర్యునకుంబోలెఁ దేజంబు గల వారలు నగు వైఖానసులు వాలఖిల్యులునను మహర్షులు, దీప్యమానులయి కానంబడుదురు.

అని, తాత్పర్యము.

అయం సుదర్శనో ద్వీపః పురో యస్య ప్రకాశతే
యస్మిం స్తేజశ్చ చక్షుశ్చ సర్వప్రాణభృతామపి. ౬౧

టీక ॥ యస్య= ఏతేజస్సుయొక్క; పురః = ముందట; సర్వప్రాణిభృతామపి = సమస్తజీవులయొక్కయు; చక్షుశ్చ = నేత్రమును; ప్రకాశతే=ప్రకాశించునో; తత్ (అధ్యాహృతము)= ఆ; తేజశ్చ = సూర్యాఖ్యమయిన తేజస్సును; యస్మిక్ = ఏద్వీపమందు; ప్రకాశతే (అధ్యాహృతము)= ప్రకాశించునో; సః (అధ్యాహృతము)= అట్టి; అయం= ఈ; ద్వీపః = ద్వీపము; సుదర్శనః = సుదర్శనము (మంచిదర్శనము గలది) అను పేరుగలది.

సమస్తజీవుల నేత్రములకును ప్రకాశము నొసంగునట్టి మహాతేజస్సు సూర్యుఁడు ఎచటం బ్రకాశించుచుండునో, అట్టియుదయపర్వతసమీపమందలి ద్వీపము, అన్వర్థమయిన సుదర్శనంబనునామధేయముతో నొప్పును.

అని, తాత్పర్యము.

శైలస్య తస్య శృంగేషు కందరేషు వనేషుచ
రావణ స్సహవైదేహ్యా మార్గితవ్య స్తతస్తతః. ౬౨

టీక॥ తస్య=ఆ; శైలస్య=ఉదయపర్వతముయొక్క ; శృంగేషు = శిఖరముల యందును; కందరేషు = గుహలయందును;వనేషుచ=అడవులయందును; తతస్తతః= అచటచట ; రావణః=రావణుఁడు; వైదేహ్యాసహ=సీతతోఁగూడ; మార్గితవ్యః=వెదకఁబడవలసినవాఁడు.

ఆయుదయపర్వతమందలి శిఖరములయందును గుహలయందును వనంబులందును దిరిగి,యందందు, సీతాదేవిని రావణుని వెదకుఁడు. అని, తాత్పర్యము.

కాంచనస్యచ శైలస్య సూర్యస్యచ మహాత్మనః
ఆవిష్టా తేజసా సంధ్యా పూర్వా రక్తా ప్రకాశతే. ౬౩

టీక॥ పూర్వా = తూర్పునందలిదైన; సంధ్యా=సంజ; కాంచనస్య= బంగారువికారమయిన; శైలస్యచ = పర్వతముయొక్కయు; మహాత్మనః= అధికమయిన తేజస్సుగల; సూర్యస్యచ= సూర్యునియొక్కయు; తేజసా=కాంతిచేత; ఆవిష్టా = వ్యాపింపఁబడినదై; రక్తా = ఎఱ్ఱనిదై; ప్రకాశతే=వెలుంగుచున్నది.

కాంచనమయమయిన యుదయగిరి తేజంబును మహాతేజుండగుసూర్యుని తేజంబును, ఒండొంటితోఁగలిసి భాసిల్లుటంజేసి, ప్రాతఃకాలసంధ్య రక్తవర్ణమయి వెలుఁగుచున్నది.

అని, తాత్పర్యము.

పూర్వ మేత త్కృతం ద్వారం పృథివ్యా భువనస్యచ
సూర్య స్యోదయనంచైవ పూర్వా హ్యేషా దిగుచ్యతే. ౬౪

టీక ॥ హి=ఏకారణమువలన; ఏతత్=ఇది; పృథివ్యాః= భూమియొక్కయు; భువనస్యచ = లోకముయొక్కయు; పూర్వం = మొదటిదైన; ద్వారం=వాకిలిగాను; సూర్యస్య = సూర్యునియొక్క; పూర్వం (అధ్యాహృతము)=మొదటిదైన; ఉదయనంచైవ=ఉదయించుస్థానముగాను;కృతం = చేయఁబడినదో;తత్ (అధ్యాహృతము)= అందువలన; ఏషా=ఈతూర్పుదిక్కు; పూర్వా = మొదటిదైన; దిక్=దిక్కుగా; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది.

ఈ తూర్పుదిశనే, భూమికిని సమస్తలోకంబులకును మొదటి ద్వారంబుగాను సూర్యునకు ఉదయస్థానముగాను బ్రహ్మదేవుఁడు నియమించెం గావున, నిది పూర్వదిశయని చెప్పంబడుచున్నది. అని, తాత్పర్యము.

తస్య శైలస్య పృష్ఠేషు నిర్ఝరేషు గుహాసుచ
రవణ స్సహవై దేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౬౫

టీక ॥ తస్య=ఆ; శైలస్య=ఉదయపర్వతముయొక్క; పృష్ఠేషు = నడిమిప్రదేశములయందును; నిర్ఝరేషు= సెలయేళ్ళయందును; గుహాసుచ=గుహాల

యందును; తతస్తతః=అచటచట; రావణః=రావణుఁడు; వైదేహ్యాసహ = సీతతోఁగూడ; మార్గితవ్యః= వెదకఁబడవలసినవాఁడు.

ఆయుదయ పర్వతంబునందలి నితంబప్రదేశములయందును సెలయేళ్ళయందును గుహలయందును అందందు సీతాదేవిని రావణుని వెదకవలెను.

అని, తాత్పర్యము.

తతఃపర మగమ్యా స్యా ద్దిక్పూర్వా త్రిదశావృతా
రహితా చంద్రసూర్యాభ్యా మదృశ్యా తిమిరావృతా. ౬౬

టీక॥ తతఃపరం=అటుపిమ్మట; త్రిదశావృతా= దేవతలచేతవ్యాపింపఁబడినదియు; చంద్రసూర్యాభ్యాం= చంద్రునిచేతను సూర్యునిచేతను ; రహితా = విడువఁబడినదియు; తిమిరావృతా=చీఁకటిచేఁ గప్పఁబడినదియు; అదృశ్యా=చూడఁగూడనిదియునగు; పూర్వాదిక్ = తూర్పుదిక్కు; అగమ్యా= పొందరానిది; స్యాత్=అగును.

అయ్యుదయాచలమునకావల, తూర్పుదిశ చంద్రసూర్యసంచారంబులేమింజేసి యంధకారావృతమయి యదృశ్యమయియుండుటంజేసి, దేవతలకు మాత్రము సంచారయోగ్యముకాని, యితరులకు సంచరింపనలవికాదు.

అని, తాత్పర్యము.

శైలేషు తేషు సర్వేషు కందరేషు వనేషుచ
యే చ నోక్తా మయా దేశా విచేయా తేషు జానకీ. ౬౭

టీక॥ యే=ఏ; దేశాశ్చ = ప్రదేశములును; మయా=నాచేత; నోక్తాః=చెప్పఁబడవయ్యెనో; తేషు=ఆ; తేషు= ప్రసిద్ధములయిన; శైలేషు=పర్వతములయందును; కందరేషు= గుహలయందును; వనేషుచ=అడవులయందును; సర్వేషు= అన్నిటియందు; జానకీ=సీత; విచేయా = వెదకఁదగినది.

మఱియు, నేనుజెప్పినస్థలములయందెగాక, పూర్వదిశయందున్న యితరములయినపర్వతములందును గుహలందును వనంబులందును, సమస్తప్రదేశంబులందును, సీతాదేవిని వెదకిచూడుఁడు. అని, తాత్పర్యము.

ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః

అభాస్కర మమర్యాదం నజానీమ స్తతః పరమ్. ౬౭

టీక ॥ వానరపుంగవాః = వానర శ్రేష్ఠులారా! ఏతావత్ = ఇంతదూరమును; గంతుం = పొందుటకు; వానరైః = వానరులచేత; శక్యం = అలవియగును. అభాస్కరం = సూర్యుఁడులేనిదియు; అమర్యాదం = హద్దులులేనిదియునగు; తతః = అంతకన్నను; పరం=ఆవలిప్రదేశమును; నజానీమః= ఎఱుఁగము.

వానరోత్తములారా! ఇంతదూరముపఱకె వానరులకుం బోవశక్యమగును; ఆవలిప్రదేశము, సూర్యసంచారములేక గ్రామము నగరము పర్వతము అరణ్యము మొదలయిన హద్దులులేకుండుటవలన, ఎట్టిదో మాకుఁ దెలియదు. అని, తాత్పర్యము.

అభిగమ్యతు వైదేహీం నిలయం రావణస్యచ
మాసే పూర్ణే నివర్తధ్వ ముదయం ప్రాప్య పర్వతమ్. ౬౮

టీక॥యూయం(అధ్యాహృతము)= మీరలు; ఉదయం =ఉదయమును; పర్వతం=కొండను; ప్రాప్య=పొంది;వైదేహీం=సీతను; రావణస్య=రావణునియొక్క; నిలయంచ=ఉనికిపట్టును;అభిగమ్యచ= పొందియు, తెలిసియునను టఁ; మాసే=నెల;పూర్ణే=నిండినదికాఁగా; నివర్తధ్వం=మఱలిరండు.

మీరు, ఉదయాచలముపఱకుఁ బోయి, సీతాదేవిని రావణునివాసస్థలంబునుగని పెట్టి, ఒకమాసము నిండుటకు మున్నె మఱలిరండు. అని, తాత్పర్యము.

ఊర్ధ్వం మాసా న్నవ స్తవ్యం వస న్వధ్యో భవే న్మమ
సిద్ధార్థా స్సన్నివర్తధ్వ మధిగమ్యచ మైథిలీమ్. ౭౦

టీక ॥ మాసాత్= నెలకన్నను;ఊర్ధ్వం = అధికముగా; నవస్తవ్యం = ఉండరాదు. వసన్ = ఉన్నవాఁడు;మమ=నాకు; వధ్యః= చంపఁదగినవాఁడు; భవేత్ = అగును. మైథిలీం=సీతను;అధిగమ్యచ = తెలిసియు; సిద్ధార్థాః = ఈడేఱిన ప్రయోజనముగలవారలయి; సన్నివర్తధ్వం = మఱలుఁడు.

ఒకనెలకన్న నధికముగా జాగుసేయఁగూడదు;అట్లు నెలకుసరిగారానివా

స ౪౦

నికిమరణదండన విధింపఁబడును; సీతా దేవినింజూచి, యన్నివిధంబులను గార్య సిద్ధినొందినవారలయి మఱలిరండు.

అని, తాత్పర్యము.

మహేంద్రకాంతాం వనషండమండితాం
దిశం చరిత్వా నిపుణేన వానరాః
అవాప్య సీతాం రఘువంశజప్రియాం
తతో నివృత్తా స్సుఖినో భవిష్యథ. ౭౧

టీక ॥ వానరాః = వానరులారా! యూయం(అధ్యాహృతము)=మీరలు; వనషండమండితాం = వనసమూహములచేనలంకరింపఁ బడినదియును; మహేంద్రకాంతాం = దేవేంద్రునకుఁబ్రియమయినదియునగు; దిశం=దిక్కును; నిపుణేన=నేర్పుచే; చరిత్వా=పొంది; రఘువంశజప్రియాం= రఘువంశమునం బుట్టిన రాముని ప్రియురాలయిన; సీతాం=సీతను; అవాప్య=పొంది;తతః= అచటనుండి; నివృత్తాః= మఱలినవారలయి; సుఖినః= అధికమయినసుఖము గలవారలు; భవిష్యథ= కాఁగలరు.

వానరులారా! మీరలు, నానావిధ వనసమూహములచే నొప్పుచున్నదగు దేవేంద్రపాలితంబయిన తూర్పుదిక్కునందు, నేర్పుతో సంచరించి, వెదకి,రామునిప్రియురాలగు సీతాదేవిం గనుంగొనుదు రేని, యచటనుండివచ్చి,యుత్తమములయిన సుఖము లనుభవింపుచుండఁగలరు. అని, సుగ్రీవుండు వినతాది వానరులకుఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, చత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండచత్వారింశసర్గటీక,
ముగిసినది.

౫౭

ఏకచత్వారింశసర్గప్రారంభః.

తతః ప్రస్థాప్య సుగ్రీవ స్తన్మహ ద్వానరం బలమ్
దక్షిణాం ప్రేషయామాస వానరా నభిలక్షితాన్. ౧

టీక ॥ సుగ్రీవః = సుగ్రీవుఁడు; మహత్ = గొప్పదైన; తత్ = ఆ; వానరం = వానరసంబంధియగు; బలం= సేనను; ప్రస్థాప్య= పంపి; తతః=అంత; దక్షిణాం= దక్షిణదిక్కునుగూర్చి; అభిలక్షితాన్ = పరీక్షింపఁబడిన,పరీక్షింపఁబడిన పరాక్రమముగలయనుట; వానరాన్ = వానరులను; ప్రేషయామాస = పంపెను.

అట్లుసుగ్రీవుం డవ్వానర వీరులను దూర్పుదిశకుంబనిచి, యంత,నానేకయుద్ధంబులం బరాక్రమంబుఁజూపి ప్రసిద్ధివహించినట్టి వానరులను, దక్షిణదిశకుఁ బంపెను. అని, తాత్పర్యము.

నీల మగ్నిసుతం చైవ హనుమంతం చ వానరమ్
పితామహసుతం చైవ జాంబవంతం మహాబలమ్. ౨
సుహోత్రంచ శరారించ శరగుల్మం తథైవ చ
గజం గవాక్షం గవయం సుషేణ మృషభం తథా. ౩
మైందంచ ద్వివిదంచైవ విజయం గంధమాదనమ్
ఉల్కాముఖ మసంగంచ హుతాశనసుతా వుభౌ. ౪
అంగదప్రముఖా న్వీరాన్ వీరః కపిగణేశ్వరః
వేగవిక్రమసంపన్నాన్ సందిదేశ విశేషవిత్. ౫

టీక॥ వీరః=పరాక్రమశాలియు; విశేషవిత్=తారతమ్యముఁ దెలిసినవాఁడునగు; కపిగణేశ్వరః= వానరసమూహమునకుఁ బ్రభువైనసుగ్రీవుఁడు; అగ్నిసుతం=అగ్నియొక్కకొడుకైన; నీలంచైవ=నీలునిఁ; హనుమంతం= హనుమంతుఁడను; వానరంచ = వానరుని; పితామహసుతం = బ్రహ్మదేవునికొడుకైన; మహాబలం=అధికమయినబలముగల; జాంబవంతంచైవ= జాంబవంతు

ని; సుహోత్రంచ = సుహోత్రుని; శరారించ=శరారిని; తథా=అట్లు; శరగుల్మ మేవచ=శరగుల్మని;గజం=గజుని; గవాక్షం=గవాక్షుని; గవయం= గవయుని; సుషేణం=సుషేణుని(ఇతఁడు, తారతండ్రియగుసుషేణునికన్న భిన్నుఁడు); తథా=అట్లు; ఋషభం= ఋషభుని; మైందంచ=మైందుని; ద్వివిదంచైవ=ద్వివిదుని; విజయం=విజయుని; గంధమాదనం= గంధమాదనుని; హుతాశనసుతౌ = అగ్నియొక్క కొడుకులయిన; ఉల్కాముఖం = ఉల్కాముఖుని; అసంగంచ=అసంగుని; ఉభౌ=ఇద్దఱను; వేగవిక్రమసంపన్నాన్= వేగముతోను బరాక్రమముతోనుగూడిన; అంగదప్రముఖాన్ = అంగదుఁడు మొదలుగాఁగల; వీరాన్= శూరులను; సందిదేశ= ఆజ్ఞాపించెను.

వానరులతారతమ్యము చక్కఁగాఁ దెలిసినవాఁడును వీరుండునగు వానరేశ్వరుండు సుగ్రీవుండు, అగ్నిదేవుని కొడుకైననీలుని, హనుమంతుని, మహాబలుండగుబ్రహ్మపుత్త్రుజాంబవంతుని, సుహోత్రుని, శరారిని, శరగుల్మని, గజుని, గవాక్షుని, గవయుని, సుషేణుని, ఋషభుని, మైందుని, ద్వివిదుని, విజయుని, గంధమాదనుని, అగ్నిసుతులగుఉల్కాముఖుఁడు అసంగుఁడునను నిద్దఱను,మఱియు వేగంబునఁ బరాక్రమంబుననధికులగు నంగదుండు మున్నుగాఁ గలవీరులను, దక్షిణదిశకుఁ బోనాజ్ఞాపించెను. అని, తాత్పర్యము.

తేషాం మగ్రేసరంచైవ మహ ద్బల మసంగగమ్
విధాయ హరివీరాణా మాదిశ ద్దక్షిణాం దిశమ్. ౬

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆ సుగ్రీవుఁడు; అసంగగం= అవిలంబముగాఁబోవునట్టి; మహత్ = గొప్పదైన; బలం=సేనను; తేషాం=ఆ; హరివీరాణాం = వానరవీరులకు; అగ్రేసరం = ముందు నడచుదానిఁగా ; విధాయచైవ=నియమించియు;దక్షిణాం దిశం=దక్షిణదిక్కునుగూర్చి;ఆదిశత్= ఆజ్ఞాపించెను.

సుగ్రీవుండు, ఆవానరవీరులకు, శీఘ్రగమనంబగు గొప్పవానర సైన్యమును సహాయముగా నియమించి , వారలను దక్షిణదిశకుఁబోనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

యే కేచన సముద్దేశా స్తస్యాం దిశి సుదుర్గమాః

కపీశః కపిముఖ్యానాం స తేషాం తా నుదాహరత్. ౭

టీక॥ తస్యాం= ఆ; దిశి = దక్షిణదిక్కునందు; సుదుర్గమాః = తెలియరానివైన; సముద్దేశాః=ప్రదేశములు; కేచన=కొన్ని; యే(సంతి)= ఏవికలవో; తాన్ = ఆప్రదేశములను; సః= ఆ; కపీశః = వానరరాజయినసుగ్రీవుడు; తేషాం=ఆ; కపిముఖ్యానాం=వానరశ్రేష్ఠులకు; ఉదాహరత్ =చెప్పెను.

వానరరాజుసుగ్రీవుండు, ఆవ్వానరవీరులకు, ఆదక్షిణదిక్కునందెలియనిప్రదేశంబులం గొన్నిటి నేర్పఱించి తెలియఁజెప్పెను. అని, తాత్పర్యము.

సహస్రశిరసం విన్ధ్యం నానాద్రుమలతాయుతమ్
నర్మదాంచ నదీం దుర్గాం మహోరగనిషేవితామ్. ౮
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీమ్
వరదాంచ మహాభాగాం మహోరగనిషేవితామ్. ౯
మేఖలా ముత్కలాంచైవ దశార్ణనగరాణ్యపి
అశ్వవంతీ మవంతీంచ సర్వ మేవా నుపశ్యత. ౧౦

టీక ॥ యూయం (అధ్యాహృతము) = మీరలు; సహస్రశిరసం = వేయిశిఖరములు గలదియు; నానాద్రుమలతాయుతం = నానావిధములయిన వృక్షములతోను దీగలతోను గూడినదియునగు; విన్ధ్యం = విన్ధ్యపర్వతమును; దుర్గాం = పొందరానిదియు; మహోరగనిషేవితాం= గొప్పసర్పములచే సేవింపఁబడినదియునగు; నర్మదాం = నర్మదయును; నదీంచ=ఏటిని; తతః= అటుపిమ్మట; రమ్యాం=సుందరమయిన;(విన్ధ్యసమీపముననుండు.)గోదావరీం = గోదావరిని; కృష్ణవేణీం= కృష్ణవేణియును; మహానదీం = గొప్పదానిని; మహాభాగాం = పూజ్యుయుయిన భాగ్యముగలదియు; మహోరగనిషేవితాం = గొప్పసర్పములచేత సేవింపఁబడినదియునగు;వరదాం = వరదానదిని; మేఖలాం = మేఖలానదిని; ఉత్కలాంచైవ = ఉత్కలానదిని; దశార్ణనగరాణ్యపి = దశార్ణదేశమందలి పట్టణములను; అశ్వవంతీం = అశ్వవంతీనగరమును; లేక, అశ్వవంతీం (అశ్వవతీం) = అధికముగా గుఱ్ఱములుగల;

స ౪౧

అవంతీంచ = అవంతీనగరమును; సర్వమేవ = సమస్తమునే; అనుపశ్యత= చూడుఁడు.

మీరలు, వేయిశిఖరములతోఁగూడి నానావిధ వృక్షలతలతో నొప్పుచున్న వింధ్యపర్వతము, గొప్పసర్పములతోఁ గూడినదై దాఁటుట కశక్యమయిన నర్మదానది, వింధ్యపర్వత సమీపమున నుండు సుందరమయిన గోదావరీనదీభాగము, కృష్ణానది, మహాసర్పములచే భయంకరమై పూజనీయమయిన వరదానది, మేఖలానది, యుత్పలానది, దశార్ణదేశమునందలినగరములు, అశ్వవంతీ పట్టణము (అర్థాంతర పక్షమందు, అశ్వములచేసమృద్ధమయిన) యవంతీపట్టణము, ఈస్థలములయందంతట ను సీతాదేవిని వెదకిచూడుఁడు.

అని, తాత్పర్యము.

విదర్భా నృషికాంశ్చైవ రమ్యా న్మాహిషకానపి
తథా వంగాన్ కళింగాంశ్చ కాశికాంశ్చ సమంతతః. ౧౧
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వతనదీగుహామ్
నదీం గోదావరీంచైవ సర్వమేవా నుపశ్యత. ౧౨
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్పాండ్యా న్సకేరళాన్

టీక ॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; విదర్భాన్=విదర్భదేశమును; ఋషికాంశ్చైవ= ఋషికదేశమును;రమ్యాన్ = మనోహరమయిన; మాహిషకానపి= మాహిషకదేశమును; తథా=అట్లు;వంగాన్=వంగదేశమును; కళింగాంశ్చ = కళింగదేశమును;సమంతతః = అంతటను; కాశికాంశ్చ = కాశికదేశమును;అన్వీక్ష్య= చూచి; సపర్వతనదీగుహం= కొండలతోను నదులతోను గుహలతోను గూడిన; దండకారణ్యం = దండకారణ్యమును; గోదావరీం=గోదావరియును; నదీంచైవ=ఏటిని; తథైవ = అట్లె; ఆంధ్రాంశ్చ=ఆంధ్రదేశమును;పుండ్రాంశ్చ=పుండ్రదేశమును; చోళాన్=చోళదేశమును; సకేరళాన్ = కేరళదేశముతోఁగూడిన; పాండ్యాన్=పాండ్యదేశమును; సర్వమేవ=సమస్తమునే;అనుపశ్యత=చూడుఁడు.

విదర్భదేశము, ఋషికదేశము, రమణీయమయిన మాహిషక దేశము, వంగ కళింగ కాశికదేశములు, పర్వతములతోను గుహలతోను నదులతోను

ప్పుచున్న దండకారణ్యంబు, ఆదండకారణ్యమందలి గోదావరీనది, మఱియు, ఆంధ్రదేశము, పుండ్రదేశము, చోళ

పాండ్య కేరళదేశములు, ఈస్థలములకంతయుంబోయి, అంతటందిరిగి సీతాదేవినన్వేషింపుఁడు. అని, తాత్పర్యము.

అయోముఖశ్చ గంతవ్యః పర్వతో ధాతుమండితః. ౧౩

టీక॥ ధాతుమండితః = ధాతువులచే నలంకరింపఁబడిన; అయోముఖః= సహ్యాను; పర్వతశ్చ=కొండయును; గంతవ్యః=పొందఁబడవలయును.

అంతట, గైరికధాతువులచేఁబ్రకాశించుచుండునట్టి సహ్యపర్వతమునకుఁ బొందుడు. అని, తాత్పర్యము.

విచిత్రశిఖరశ్శ్రీమాం శ్చిత్రపుష్పితకాననః
సచందనవనోద్దేశో మార్గితవ్యో మహాగిరిః. ౧౪

టీక॥ విచిత్రశిఖరః= నానావిధములయినశిఖరములుగలదియు; శ్రీమాన్= అధికమయినకాంతిగలదియు; చిత్రపుష్పితకాననః=చిత్రవర్ణములైనవియుఁ బూచినవియునగు నడవులుగలదియు; సచందనవనోద్దేశః= చందనవృక్షముల యడవితోఁగూడిన ప్రదేశములు గలదియునగు; మహాగిరిః= గొప్పపర్వతమయిన సహ్యపర్వతము; మార్గితవ్యః= వెదకఁబడవలయును.

నానావిధములయిన శిఖరములుగలదియుఁ, బుష్పించియున్నందునఁ జిత్రవర్ణములయిన వనంబులు గలదియు నమ్యప్రదేశంబులఁ జందనవనంబులతో నొప్పుచున్నదియు శ్రీమంతంబునగు నాసహ్యపర్వతమునందంతటను, సీతాదేవిని వెదకవలయును.

అని, తాత్పర్యము.

తత స్తా మాపగాం దివ్యాం ప్రసన్నసలిలాం శివామ్
తత్ర ద్రక్ష్యథ కావేరీం విహితా మప్సరోగణైః. ౧౫

టీక॥ తతః= అటుపిమ్మట; తత్ర= అచ్చట; దివ్యాం=శ్రేష్ఠమును; ప్రసన్నసలిలాం= నిర్మలమయిన జలము గలది

యు; శివాం=మంగళకరంబును; అప్సరోగణైః = అప్సరసలసమూహముల చేత; విహితాం=పూజింపఁబడినదియు

నగు; కావేరీం=కావేరియును; తాం=ప్రసిద్ధమయిన; ఆపగాం = నదిని; ద్రక్ష్యథ=చూడఁగలరు.

అంత నచట, మీరలు, నిర్మలమయిన జలంబుగలదియు స్నానంబొండె దర్శనంబొండె గావించువారలకు మంగళంబు లొసంగునదియు నప్సరసలచేఁ బూజింపఁబడునదియునగు నుత్తమమయిన కావేరీనదిం జూడఁగలరు.

అని, తాత్పర్యము.

తస్యా సీనం నగస్యాగ్రే మలయస్య మహౌజసమ్
ద్రక్ష్యథా దిత్యసంకాశ మగస్త్య మృషిసత్తమమ్. ౧౮

టీక॥ తస్య = ప్రసిద్ధమయిన; మలయస్య=మలయమను; నగస్య=పర్వతముయొక్క; అగ్రే=శిఖరమునందు; ఆసీనం=కూర్చుండినవాఁడును; మహౌజసం = అధికమయిన తేజస్సుగలవాఁడును; ఆదిత్యసంకాశం= సూర్యునితో సమానుఁడును; ఋషిసత్తమం=ఋషిశ్రేష్ఠుఁడునగు; అగస్త్యం= అగస్త్యమహామునిని; ద్రక్ష్యథ=చూడఁగలరు.

అంత, మలయపర్వతము శిఖరంబుననాసీనుండై, సూర్యునిపగిది మహాతేజముచే వెలుంగుచున్న ఋషిశ్రేష్ఠునగస్త్యమహామునింజూడఁగలరు.

అని, తాత్పర్యము.

తత స్తే నాభ్యనుజ్ఞాతాః ప్రసన్నేన మహాత్మనా
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథ మహానదీమ్. ౧౯

టీక॥ తతః= అటుపిమ్మట; యూయం(అధ్యాహృతము) = మీరలు; ప్రసన్నేన = అనుగ్రహించిన; మహాత్మనా=అధికమయిన ప్రభావముగల; తేన=ఆయగస్త్యునిచేత; అనుజ్ఞాతాః = అనుమతింపఁబడినవారలయి; గ్రాహజుష్టాం=మొసళ్లచే సేవింపఁబడిన; తామ్రపర్ణీం=తామ్రపర్ణియను; మహానదీం=గొప్పనదిని; తరిష్యథ = దాఁటఁగలరు.

అంత, మహానుభావుండగునయ్యగస్త్యుననుగ్రహంబువడసి, యతని యనుమతినొంది, మొసళ్లతోఁ గూడినదగు తామ్రపర్ణీనదిం దరింపుఁడు.

అని, తాత్పర్యము.

సా చందనవనై ర్దివ్యైః ప్రచ్ఛన్నా ద్వీపశాలినీ

స ౪౧

కాంతేవ యువతిః కాంతం సముద్ర మవగాహతే. ౧౭

టీక ॥ దివ్యైః = ఉత్తమములగు; చందనవనైః= శ్రీగంధపుచెట్ల యడవులచేత; ప్రచ్ఛన్నా= కప్పఁబడినదియు; ద్వీపశాలినీ = ద్వీపములచేఁ బ్రకాశించుచున్నదియునగు; సా=ఆ తామ్రపర్ణి నది; కాంతా =ప్రియురాలయిన; యువతిః=ఆఁడుది; కాంతమివ = ప్రియుని వలె; సముద్రం = సముద్రమును; అవగాహతే = పొందుచున్నది.

చందనం బలందినదియు ఉన్నతంబులగు స్తనంబులు గలదియునగు ప్రియురాలు ప్రియునియొద్దకుఁ బోవునట్లు, చందనవనంబులచేఁ గప్పఁబడినదియు ద్వీపంబులతోఁ గూడినదియునగు నా తామ్రపర్ణి నది, సముద్రంబునొందుచున్నది. అని, తాత్పర్యము.

తతో హేమమయం దివ్యం ముక్తామణివిభూషితమ్
యుక్తం కవాటం పాండ్యానాం గతా ద్రక్ష్యథ వానరాః. ౧౮

టీక॥ వానరాః = వానరులారా! తతః=అచటనుండి; గతాః = పోయినవారలయి; హేమమయం= బంగారు వికారమయినదియు; దివ్యం=శ్రేష్ఠమును; ముక్తామణివిభూషితం=ముత్తెములను రత్నములచేత నలంకరింపఁ బడినదియు; యుక్తం = యోగ్యమునగు; పాండ్యానాం= పాండ్య దేశపురాజుల యొక్క; కవాటం = నగరద్వారము యొక్క తలుపును; ద్రక్ష్యథ = చూడఁగలరు.

వానరులారా! అచటనుండి పోయినచో, కాంచన మయంబును, ముత్తెములచే నలంకరింపఁబడినదియు సుందరంబునగు నుత్తమమయిన పాండ్యనగరద్వార మందలి కవాటముం జూడఁగలరు. అని, తాత్పర్యము.

తత స్సముద్ర మాసాద్య సంప్రధార్యార్థనిశ్చయః

టీక ॥ తతః = అచటనుండి; సముద్రం = సముద్రమును; ఆసాద్య=పొంది; అర్థనిశ్చయః = కార్యముయొక్క యేర్పాటు; సంప్రధార్యః= నిశ్చయింపఁదగినది.

అటనుండి సముద్రతీరంబుఁజేరి, సీతా

న్వేషణ కార్యమునుగుఱించి సముద్రతరణమువిషయమయి యాలోచించినిశ్చ యించుకొనుచుడు. అని, తాత్పర్యము.

అగస్త్యే నాంతరే తత్ర సాగరే వినివేశితః. ౨౦
చిత్రనానానగ శ్శ్రీమాన్ మహేంద్రః పర్వతోత్తమః
జాతరూపమయ శ్శ్రీమా నవగాఢో మహార్ణవమ్. ౨౧

టీక॥ అగస్త్యేన = అగస్త్యమహర్షి చేత; తత్ర=ఆ; సాగరే = సముద్రమునందు; అంతరే=అవకాశమునందు; వినివేశితః=ఉంచఁబడినదియు; చిత్రనానానగః=చిత్రవర్ణములయిన నానావిధవృక్షములుగలదియు; శ్రీమాన్ = పుష్పఫలాదిసమృద్ధిగలదియు; జాతరూపమయః=బంగారువికారమయినదియు; శ్రీమాన్=కాంతిమంతంబును; మహార్ణవం=గొప్పదైనసముద్రమును; అవగాఢః=ప్రవేశించినదియునగు; పర్వతోత్తమః=పర్వతశ్రేష్ఠమయిన; మహేంద్రః=మహేంద్రపర్వతము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

అగస్త్యమహర్షి చేత సముద్రంబున నుంచఁబడినదియు చిత్రవర్ణములయిన నానావిధ వృక్షములుగల్గి పుష్పఫలాది సమృద్ధితో నొప్పుచున్నదియుఁ గాంచనమయంబును శ్రీమంతంబును బర్వతశ్రేష్ఠంబునగు మహేంద్రపర్వతంబు, సముద్రజలంబు లానియుండును.

అని, తాత్పర్యము.

నానావిధై ర్నగైః స్సర్వై ర్లతాభి శ్చోపశోభితమ్
దేవర్షి యక్షప్రవరై రప్సరోభిశ్చ సేవితమ్. ౨౨
సిద్ధచారణసంఘైశ్చ ప్రకీర్ణం సుమనోహరమ్
త ముపైతి సహస్రాక్షః స్సదా పర్వసుపర్వసు. ౨౩

టీక॥ సహస్రాక్షః = దేవేంద్రుఁడు; సదా=ఎల్లప్పుడును; పర్వసుపర్వసు=ప్రతిపర్వదినమునందును; నానావిధైః=వలువిధములైన; సర్వైః=సమస్తములయిన; నగైః= వృక్షములచేతను; లతాభిశ్చ=తీఁగలచేతను;ఉపశోభితం = ప్రకాశించుచున్నదియు; దేవర్షి యక్షప్రవరైః=దేవతలలోను ఋషులలోను యక్షులలో నుత్తములగువారలచేతను; అప్సరోభిశ్చ = అచ్చరలచేత

ను; సేవితం=సేవింపఁబడినదియు; సిద్ధచారణసంఘైశ్చ=సిద్ధులయొక్కయు చారణులయొక్కయు సమూహములచేతను; ప్రకీర్ణం = వ్యాపింపఁబడినదియు; సుమనోహరం= మిక్కిలియురమణీయంబునగు; తం=ఆమహేంద్రపర్వతమును; ఉపైతి=పొందును.

నానావిధములయిన సమస్తవృక్షములతో లతలతో నొప్పుచు దేవతలచేతను ఋషులచేతను యక్షులచేతను సిద్ధులచేతను జారణులచేతను సేవితంబయి మిక్కిలియు మనోహరంబయిన యమ్మహేంద్రపర్వతంబునకు, దేవేంద్రుండు, ప్రతిపర్వదినమందును, దప్పక, సముద్రస్నానార్థమయి వచ్చుచుండును. అని, తాత్పర్యము.

ద్వీప స్తస్యా పరే పారే శతయోజన మాయతః
అగమ్యో మానుషై ర్దీప్త స్తం మార్గధ్వం సమంతతః. ౨౪

టీక ॥ తస్య = ఆసముద్రముయొక్క; అపరే = ఆవలిదైన; పారే=గట్టునందు; శతయోజనం = నూఱుయోజనములు; ఆయతః = నిడుపయినదియు; మానుషైః = మనుష్యులచేత; అగమ్యః= పొందరానిదియు; దీప్తః= ప్రకాశించుచున్నదియునగు; ద్వీపః = దీవి; అస్తి (అధ్యాహృతము) = ఉన్నది. తం = ఆద్వీపమును; సమంతతః= అంతటను; మార్గధ్వం= వెదకుఁడు.

ఆసముద్ర మధ్యమున నావలితీరంబున నూఱుయోజనములు వైశాల్యము గలదై మనుష్యులకుఁ బోవలనలవిగాని దేదీప్యమానంబగు నొకద్వీపంబు గలదు; ఆద్వీపంబుందంతటను సీతాదేవినిజక్కఁగా వెదకుఁడు. అని, తాత్పర్యము.

తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః

టీక॥ తత్ర=ఆద్వీపమందు; సీతా= సీతాదేవి; సర్వాత్మనా= సమస్తప్రయత్నముచేతను; విశేషతః= విశేషించి; మార్గితవ్యా = వెదకఁ బడవలయును.

ఆద్వీపమందు, ఇతరస్థలములకన్న విశేషించి సీతాదేవిని సమస్త ప్రయత్నంబులను వెదకవలెను.

అని, తాత్పర్యము.

సహి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః. ౨౫
రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్షసమద్యుతేః

టీక॥ హి=ఏలయనఁగా; సః=ఆ; దేశః=ప్రదేశము; వధ్యస్య= వధింపఁదగినవాఁడును; దురాత్మనః= దుష్టమయినబుద్ధిగలవాఁడును; సహస్రాక్షసమద్యుతేః = దేవేంద్రునితోసమానమయిన కాంతిగలవాఁడునగు; రాక్షసాధిపతేః=రక్కసులకురాజయిన; రావణస్య=రావణునియొక్క; వాసః= ఉనికిపట్టు.

ఏలయనఁగా, వధ్యుండును దుష్టుండును దేవేంద్రసమానుండునగు రాక్షసరాజు రావణునకు ఆద్వీపమె నివాసస్థలము. అని, తాత్పర్యము.

దక్షిణస్య సముద్రస్య మధ్యే తస్యతు రాక్షసీ. ౨౬
అంగారకేతి విఖ్యాతా ఛాయా మాకృష్య భోజినీ

టీక॥ తస్య=ఆ; దక్షిణస్య=దక్షిణదిక్కునందలిదైన; సముద్రస్య = సముద్రముయొక్క; మధ్యేతు=నడుమునందె; ఛాయాం=నీడను;ఆకృష్య = లాగి; భోజినీ=భక్షించునదియయిన;అంగారకేతి=అంగారకయని;విఖ్యాతా= ప్రసిద్ధురాలయిన; రాక్షసీ=రక్కసి; అస్తి(అధ్యాహృతము)=కలదు.

ఆద్వీపమునకుత్తరముగా, నాదక్షిణసముద్రమధ్యమున, అంగారకయను రాక్షసియొకర్తుకలదు; ఆరక్కసి, జంతువులఛాయనుఆకర్షించి, వానిభక్షించును. అని, తాత్పర్యము.

ఏవం నిస్సంశయాన్ కృత్వా సంశయాన్ నష్టసంశయాః. ౨౭
మృగయధ్వం నరేంద్రస్య పత్నీ మమితతేజసః

టీక॥ అమితతేజసః = కొలఁదిలేని పరాక్రమముగల వానరులారా! యూయం(అధ్యాహృతము) = మీరలు; ఏవం=ఇట్లు; సంశయాన్= సందేహింపఁదగిన ప్రదేశములను ; నిస్సంశయాన్=సందేహములేనివానిఁగా; కృత్వా=చేసి; నష్టసంశయాః=పోయినసందేహము గలవారలయి; నరేంద్రి

స్య=మనుష్యులకుఁ బ్రభువైన రాముని యొక్క; పత్నీం=భార్యను; మృగయధ్వం=వెదకుఁడు.

మహాపరాక్రమశాలులారా! ఇట్టి ధంబున, ఏయేస్థలంబుల రావణుఁడు సీతనుంచియుండునని సందేహముగలుగునో, ఆయాప్రదేశంబులనంతటను వెదకిచూచి, నిస్సంశయముంగావించికొనుచు రామపత్నియగు సీతాదేవిని వెదకుఁడు. అని; తాత్పర్యము.

తమతిక్రమ్య లక్ష్మీవాన్ సముద్రే శతయోజనే. ౪౮
గిరిః పుష్పితకో నామ సిద్ధచారణ సేవితః

టీక॥ తం=ఆలంకాద్వీపమును; అతిక్రమ్య=అతిక్రమించి; శతయోజనే=నూఱుయోజనంబులదూరముగల; సముద్రే=సముద్రమునందు; లక్ష్మీవాన్=అధికమయిన కాంతిగలదియు; సిద్ధచారణసేవితః=సిద్ధులచేతను జారణులచేతను సేవింపఁబడినదియునగు; పుష్పితకోనామ=పుష్పితకమని ప్రసిద్ధమయిన; గిరిః=పర్వతము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఆలంకాద్వీపము దాఁటి నూఱుయోజనంబుల దూరంబున సముద్రంబునందు సిద్ధచారణులచే సేవింపఁబడుచుఁ గాంతిమంతంబగు పుష్పితకంబను పర్వతంబున్నది. అని, తాత్పర్యము.

చంద్ర సూర్యాంశుసంకాశ స్సాగరాంబు సమావృతః. ౪౯
భ్రాజతే విపులై శ్శృంగై రంబరం విలిఖన్నివ

టీక॥ సః(అధ్యాహృతము)=ఆపుష్పితక పర్వతము; చంద్రసూర్యాంశుసంకాశః=చంద్రునియొక్కయుసూర్యునియొక్కయుఁ గిరణములతో సమానమయి; సాగరాంబుసమావృతః=సముద్రముయొక్కజలములచేఁ జుట్టఁబడినదై; విపులైః=విశాలములగు; శృంగైః=శిఖరములచేత; అంబరం=ఆకాశమును; విలిఖన్నివ=వ్రాయుచున్నదివలె; భ్రాజతే=ప్రకాశించుచున్నది.

ఆపుష్పితకగిరి, ఒకవైపునఁజంద్రునివలె ధవళవర్ణంబై మఱియొకవైపున సూర్యునివలె నరుణవర్ణంబై, సముద్రజలంబులంబరివేష్టితమయి, యున్నతంబులగు శిఖరములచే నాకాశంబు నొరయుచు, భాసిల్లుచుండును. అని, తా.

స ౪౧

త స్యైకం కాంచనం శృంగం సేవతే యం దివాకరః. ౩౦
శ్వేతం రాజత మేకం చ సేవతే యం నిశాకరః

టీక॥ అయం=ఈ; దివాకరః=సూర్యుఁడు; తస్య= ఆపుష్పితకపర్వతము యొక్క; ఏకం=ఒకటైన; కాంచనం= బంగారువికారమయిన; శృంగం=శిఖరమును; సేవతే= సేవించును. అయం= ఈ; నిశాకరశ్చ=చంద్రుఁడును; ఏకం= ఒకటైన; శ్వేతం= తెల్లనిదైన; రాజతం = వెండివికారమయినశిఖరమును; సేవతే= సేవించును.

ఆపుష్పితక పర్వతమునందుఁ గాంచనమయంబైన యొక శిఖరమును ఈ సూర్యుఁడు దక్షిణాయనంబునం బొందును; చంద్రుండును తెల్లనిరజతమయమైన శృంగంబునొందును.

అని, తాత్పర్యము.

న తం కృతఘ్నాః పశ్యంతి న నృశంసా న నాస్తికాః. ౩౧
ప్రణమ్య శిరసా శైలం తం విమార్గత వానరాః

టీక॥ వానరాః = వానరులారా! తం = ఆపుష్పితకపర్వతమును; కృతఘ్నాః=చేయఁబడిన యుపకారమును మఱచినవారలు; నపశ్యంతి=చూడరు. నృశంసాః=పరులహింసించువారలు; న (పశ్యంతి) = చూడరు. నాస్తికాః=పరలోకములేదనువారలు; న(పశ్యంతి)= చూడరు. తం=ఆ; శైలం = పర్వతమును; శిరసా=తలచేత; ప్రణమ్య=నమస్కరించి; విమార్గత=వెదకుఁడు.

వానరులారా! కృతఘ్నులకును దయలేక పరులఁ బీడించువారలకును నాస్తికులకునుఆపుష్పితకశైలము కానంబడదు;మీరలుఅప్పర్వతంబునకు సాష్టాంగముగా మ్రొక్కి యచట సీతాదేవిని వెదకుఁడు. అని, తాత్పర్యము.

త మతిక్రమ్య దుర్ధర్షా స్సూర్యవాన్నామ పర్వతః. ౩౨
అధ్వనా దుర్విగాహేన యోజనాని చతుర్దశ

టీక॥ దుర్ధర్షాః = ఎదిరింపనలవిగాని వానరులారా! తం = ఆపుష్పితకశైలమును; అతిక్రమ్య= దాఁటి;సూర్యవాన్నామ = సూర్యవంతమనిప్రసిద్ధ

మయిన; పర్వతః=కొండ;అస్తి(అధ్యాహృతము)=కలదు. దుష్ప్రగాహేన=ప్రవేశింపనలవిగాని; అధ్వనా=మార్గముచేత;చతుర్దశ=పదునాలుగైన;యోజనాని=యోజనములు; గంతవ్యాని(అధ్యాహృతము)=పొందఁబడవలయును.

ఎవరింపనలవిగాని వీరులారా! అప్పివతక శైలం బతిక్రమించినపిదప సూర్యవంతంబనుపర్వతంబున్నది; ఆరెండు పర్వతములకును, దుర్గమంబయిన మార్గంబునఁబదునాలుగు యోజనంబులదూరంబుండును. అని. తాత్పర్యము.

తత స్తమ ప్యతిక్రమ్య వైద్యుతో నామ పర్వతః. ౩౩
సర్వకామఫలై ర్వృక్షైః స్సర్వకాలమనోహరైః

టీక॥ తతః=అటుపిమ్మట; తమపి=ఆసూర్యవత్పర్వతమునుగూడ; అతిక్రమ్య=దాఁటి; సర్వకామఫలైః= సమస్తములయిన కోరఁబడుఫలములుగలవియు; సర్వకాలమనోహరైః=సమస్తకాలములయందును రమణీయములైనవియునగు; వృక్షైః=చెట్లతో;యుక్తః(అధ్యాహృతము) = కూడినదగు;వైద్యుతోనామ= వైద్యుతమనుపేరుగల; పర్వతః=కొండ; అస్తి (అధ్యాహృతము)= కలదు.

అంత, ఆసూర్యవంతమనుపర్వతంబునకావల, కోరినఫలంబులన్నియునొసంగునవియు సమస్తకాలంబుల యందును రమణీయంబులునగు వృక్షంబులతోనొప్పుచున్న వైద్యుతంబనుపర్వతంబున్నది. అని, తాత్పర్యము.

తత్ర భుక్త్వా వరార్హాణి మూలానిచ ఫలానిచ. ౩౪
మధూని పీత్వా ముఖ్యాని పరం గచ్ఛత వానరాః

టీక॥ వానరాః=వానరులారా! తత్ర=ఆవైద్యుతపర్వతమునందు; వరార్హాణి=ఉత్తములకుయోగ్యములయిన; మూలానిచ=గడ్డలను; ఫలానిచ=పండ్లను; భుక్త్వా=భక్షించి; ముఖ్యాని=శ్రేష్ఠములయిన; మధూని= తేనియలను; పీత్వా=త్రాఁగి; పరం= ఆవలిప్రదేశమును; గచ్ఛత = పొందుఁడు.

వానరులారా! అవ్వైద్యుతగిరియందు, సర్వోత్తమములయిన ఫలములను భక్షించి, శ్రేష్ఠములయిన తేనియలం ద్రావి యావలిప్రదేశమునకుఁబొండు. అని, తాత్పర్యము.

తత్ర నేత్రమనఃకాంతః కుంజరో నామ పర్వతః. ౩౫
అగస్త్యభవనం యత్ర నిర్మితం విశ్వకర్మణా

టీక ॥ యత్ర = ఎచట; విశ్వకర్మణా = విశ్వకర్మచేత; అగస్త్యభవనం = అగస్త్యనిగృహము; నిర్మితం= నిర్మింపఁబడినదో; సః=అట్టి; నేత్రమనఃకాంతః = కన్నులకును మనస్సునకు నుప్రియమయినదగు; కుంజరోనామ= కుంజరమను పేరుగల; పర్వతః = కొండ; తత్ర = అచట; అస్తి (అధ్యాహృతము) = కలదు.

అచటఁ గన్నులకును మనంబునకును సంతోషంబు గలిగించునట్టి కుంజరమను పర్వతంబుగలదు; ఆపర్వతమునందె విశ్వకర్మ యగస్త్య మహర్షికి గృహంబు నిర్మించెను. అని, తాత్పర్యము.

తత్ర యోజన విస్తార ముచ్ఛ్రితం దశయోజనమ్. ౩౬
శరణం కాంచనం దివ్యం నానారత్నవిభూషితమ్

టీక ॥ తత్ర = ఆకుంజరపర్వతమునందు; యోజనవిస్తారం= ఒకయోజనము వెడల్పుగలదియు; దశయోజనం= పదియోజనములు గలదియు; ఉచ్ఛ్రితం = ఉన్నతమయినదియు; కాంచనం = బంగారు వికారమయినదియు; దివ్యం=శ్రేష్ఠమును; నానారత్నవిభూషితం = నానావిధమణులచే నలంకరింపఁబడినదియునగు; శరణం = గృహము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఆకుంజర శైలంబున నగస్త్యమహర్షి భవనంబు, ఒకయోజనము వెడల్పును పదియోజనములు నిడువునుంగల్గి యున్నతంబై కాంచనమయంబై నానావిధరత్నంబులచేనలంకరింపఁబడి దివ్యంబైయుండును: అని, తాత్పర్యము.

తత్ర భోగవతీనామ సర్పాణా మాలయా పురీ. ౩౭
విశాలకక్ష్యా దుర్ధర్షా సర్వతః పరిరక్షితా
రక్షితా పన్నగై ర్ఘోరై స్తీక్ష్ణదంష్ట్రై ర్మహావిషైః. ౩౮
సర్పరాజో మహాప్రాజ్ఞో యస్యాం వసతి వాసుకిః

టీక॥ తత్ర=అచట; యస్యాం= ఏపట్టణమందు; మహాప్రాజ్ఞః = మిక్కిలి

యుండిబండితుండును; సర్పరాజః= పాములతేఁడునగు; వాసుకిః=వాసుకి; వసతి = ఉండునో; సా(అధ్యాహృతము)=అట్టి; విశాలకక్ష్యా=వెడలుపులయిన తొట్టికట్లుగలదియు; దుర్ధర్షా= ఎదిరింప నలవిగానిదియు; సర్వతః = అంతటను; పరిరక్షితా= కాపాడఁబడినదియు; ఘోరైః = భయంకరములును; తీక్ష్ణదంష్ట్రైః=కఱకులయినకోఱలుగలవియు; మహావిషైః = అధికమయినవిషముగలవియునగు; పన్నగైః= సర్పములచేత; రక్షితా=రక్షింపఁబడినదియు; సర్పాణాం=పాములకు; ఆలయా= ఉనికిపట్టునగు; భోగవతీనామ=భోగవతియనుపేరుగల; పురీ=పట్టణము; అస్తి(అధ్యాహృతము) = కలదు.

అంత నచట, సర్పనివాసస్థలమయిన భోగవతీనగరియుండును; అది, విశాలములయిన తొట్టికట్లుకల్గి, అంతటను భయంకరమయిన యాకారంబును తీక్ష్ణములయినకోఱలును ఘోరమయిన విషంబునుగల మహాసర్పంబులురక్షింప, ఎట్టివారికిని బ్రవేశింప నలవిగానిదై, యుండును; అందు,మహాపండితుండగు సర్పరాజు వాసుకి నివసించును.

అని, తాత్పర్యము.

నిర్యాయ మార్గితవ్యాచ సా చ భోగవతీపురీ. ౩౯

టీక॥ భవద్భిః(అధ్యాహృతము)= మీచేత; నిర్యాయ = వెడలి; సా=ఆ; భోగవతీపురీచ = భోగవతీపట్టణమును; మార్గితవ్యాచ = వెదకఁబడవలసినదియు.

మీరలు, అగస్త్యభవనమునుండి వెలువడి, ఆభోగవతీ నగరమునందును, సీతాదేవిని వెదకవలయును.

అని, తాత్పర్యము.

తత్ర చా నంతరా దేశా యే కేచన సుసంవృతాః

టీక ॥ తత్ర = అచట; కేచన=కొన్ని; సుసంవృతాః=మిక్కిలియునాచ్ఛాదింపఁబడిన; అనంతరాః = వ్యవధానములేనివైన, సమీపంబున నున్నయనుట; దేశాః = ప్రదేశములు; యే(సంతి) = ఏవిగలవో; తే (అధ్యాహృతము)చ = అవియు; మార్గితవ్యాః=వెదకఁబడవలసినవి.

స ౪౧

మఱియు, అచటికి సమీపెంబునను న్న రహస్యప్రదేశములయందంతటను, సీతాదేవిని వెదకుఁడు.

అని, తాత్పర్యము.

తం చ దేశ మతిక్రమ్య మహా నృషభసంస్థితః. ౪౦
సర్వరత్నమయ శ్శ్రీమా నృషభో నామ పర్వతః

టీక ॥ తం=ఆ; దేశంచ = భోగవతీనగరప్రదేశమునుగూడ; అతిక్రమ్య= దాఁటి; మహాన్ = గొప్పదియు; ఋషభసంస్థితః = ఎద్దువలె నున్నదియు; సర్వరత్నమయః= సమస్తరత్నములు అధికముగాఁగలదియు; శ్రీమాన్= అధికమయినకాంతిగలదియునగు; ఋషభోనామ= ఋషభమనుపేరుగల; పర్వతః = కొండ; అస్తి (అధ్యాహృతము).= కలదు.

ఆభోగవతీనగరము నతిక్రమించిన పిదప, సమస్తరత్నంబులతోనునిండియున్నదియు శ్రీమంతంబునగు వృషభాకారమయిన ఋషభంబను నొకమహాపర్వతంబు గానఁబడును.

అని, తాత్పర్యము.

గోశీర్ష కం పద్మకంచ హరిం శ్యామంచ చందనమ్. ౪౧
దివ్య ముత్పద్యతే యత్ర తచ్చైవా గ్నిసమప్రభమ్

టీక॥ యత్ర=ఏపర్వతమందు; గోశీర్షకం = గోరోచనముతోసమానమయినవన్నెగలదియు; పద్మకంచ= తామరపూరేకుతోసమానమైనవన్నెగలదియు; హరిం= అకుపచ్చనివర్ణముగలదియు; శ్యామంచ=నల్లనిదియు; యత్ (అధ్యాహృతము) = ఏది; అగ్నిసమప్రభం=నిప్పుతోసమానమయిన కాంతిగలదో; తచ్చైవ = అట్టిదియునగు; దివ్యం=శ్రేష్ఠమయిన; చందనం= శ్రీగంధము; ఉత్పద్యతే=పుట్టుచున్నదో.

ఆఋషభపర్వతమునందు, గోరోచనమువన్నెగలవి కమలదళవర్ణముగలవి హరితవర్ణముగలవి శ్యామలవర్ణముగలవి నిప్పువలెనెఱ్ఱనివన్నెగలవి యిట్టి దివ్యములయిన చందనవృక్షములుపుట్టును. అని, తాత్పర్యము.

నతు తచ్చందనం దృష్ట్వా స్ప్రష్టవ్యం చ కదాచన. ౪౨

టీక॥ భవద్భిః(అధ్యాహృతము)= మీచేత; కదాచన = ఒకప్పుడును; తత్=ఆ; చందనం = శ్రీగంధమును; దృష్ట్వా=చూచి; నతుస్ప్రష్టవ్యంచ=ఎంతమాత్రము తాకబడఁగూడదు.

మీరలు, ఆచందనముంజూచి, యొకప్పుడును, ఎంతమాత్రము ముట్టుకొనవలదు. అని, తాత్పర్యము.

రోహితానామ గంధర్వా ఘోరా రక్షంతి తద్వనమ్ ॥

టీక ॥ ఘోరాః= భయంకరులయిన; రోహితానామ = రోహితులని ప్రసిద్ధులయిన; గంధర్వాః=గంధర్వులు; తత్ =ఆ; వనం=చందనవనమును; రక్షంతి= కాపాడుచున్నారు.

ఏలయనఁగా, భయంకరాకారులగు రోహితులను గంధర్వులు, ఆచందనవనంబునకుఁ గావలియున్నారు.

అని, తాత్పర్యము.

తత్ర గంధర్వపతయః పంచ సూర్యసమప్రభాః. ౪౩
శైలూషో గ్రామణీ శ్శిగ్రు శ్శుభ్రో బభ్రు స్తథైవచ ॥

టీక॥ తత్ర = అచట; సూర్యసమప్రభాః = సూర్యునితోసమానమయిన కాంతిగల; శైలూషః = శైలూషుండును; గ్రామణీః=గ్రామణియు; శిగ్రుః= శిగ్రువును; శుభ్రః = శుభ్రుఁడును; తథా=అట్లు; బభ్రు రేవచ= బభ్రువునును; పంచ=అయిదుగురైన; గంధర్వపతయః=గంధర్వరాజులు; సంతి(అధ్యాహృతము)=కలరు.

ఆఋషభపర్వతమందు, సూర్యునకుంబోలెఁ దేజంబుగలవారలు, శైలూషుండును గ్రామణియు శిగ్రువును శుభ్రుండును బభ్రుండును అను గంధర్వరాజులైదుగురు వాసముసేయుచుందురు.

అని, తాత్పర్యము.

రవిసోమాగ్నివపుషాం నివాసః పుణ్యకర్మణామ్. ౪౪
అంతే పృథివ్యా దుర్ధర్షా స్తత్ర స్వర్గజితః స్థితాః ॥

టీక॥ సః= ఆఋషభశైలము; రవిసోమాగ్నివపుషాం = సూర్యునియొ

కలయు చంద్రుని యొక్కయు అగ్ని యొక్కయు దేహమువంటి దేహము గల; పుణ్యకర్మణాం= పుణ్యముగలిగించునట్టి కార్యములుగలవారలయొక్క; నివాసః=ఉనికిపట్టు. పృథివ్యాః= భూమియొక్క; అంతే=నాశమునందు;దుర్ధర్షాః=చెనకరాని; స్వర్గజితః = స్వర్గమునుజయించినట్టివారలు; తత్ర=ఆ ఋషభ పర్వతమునందు; స్థితాః= ఉన్నారు.

పుణ్యకర్మములు గావించినవారలు, కొందఱు సూర్యునకుంబోలెఁ దేజస్సుగలవారలై, కొందఱు చంద్రునివలె వెలుంగుచు కొందఱు అగ్నిప్రభులై, యప్పర్వతంబుననివాసముగానుందురు; ప్రలయకాలమున, స్వర్గాది పుణ్యలోకంబుల సాధించిన మహాపురుషులు , ఇతరులకుఁ దేఱిచూడరాని తేజంబున వెలుంగుచు, ఆఋషభ పర్వతంబుననుందురు. అని, తాత్పర్యము.

తతః పరం న వ స్సేవ్యః పితృలోక స్సుదారుణః. ౪౫
రాజధానీ యమ స్యైషా కష్టేన తమసా వృతా

టీక ॥ పతః పరం = అంతకన్ననావల; సుదారుణః = మిక్కిలియు భయంకరమయిన; పితృలోకః=పితృలోకము;వః=మీకు; సేవ్యః=సేవింపఁదగినది;న=కాదు. ఏషా=ఇది;యమస్య= యమునియొక్క; రాజధానీ = రాచవీడు, లేక, ప్రధానపట్టణము. కష్టేన = సహింపరాని; తమసా=చీఁకటిచేత; వృతా = చుట్టఁబడినది.

ఆపిమ్మట మహాభయంకరంబగు పితృలోకంబు, అది యముని రాజధాని; దుస్సహంబగు చీఁకటిచేఁ బరివేష్టింపఁబడియుండును గావున,మీకుఁబ్రవేశింపన లవిగాదు. అని, తాత్పర్యము.

ఏతావ దేవ యుష్మాభి ర్వీరా వానరపుంగవాః. ౪౬
శక్యం విచేతుం గంతుంవా నాతో గతిమతాం గతిః

టీక ॥ వీరాః= పరాక్రమశాలులరయిన; వానరపుంగవాః = వానరశ్రేష్ఠులారా! ఏతావ దేవ= ఇంతమాత్రమె; యుష్మాభిః = మీచేత; విచేతుం=వెదకుటకుఁగాని; గంతుంవా = పోవుటకుఁగాని; శక్యం = అలవియగును. అతః = ఇటుపిమ్మట; గతిమతాం= అధికమయిన గమనము గలవారలకు;

గతిః = గమనమునకు = లేదు. బోయి వెదకనలవియగును; ఆపిమ్మట,

పరాక్రమశాలులరగువానరోత్తము లారా! ఇంతదూరముమాత్రమె మీకుం ఎంతటిగమనశక్తి గలవారలకును బోవనవకాశములేదు. అని, తాత్పర్యము.

సర్వ మేత త్సమాలోక్య యచ్చాన్యదపి దృశ్యతే. ౪౭
గతిం విదిత్వా వైదేహ్యా స్సన్నివర్తితు మర్హథ

టీక॥యూయం(అధ్యాహృతము)= మీరలు; ఏతత్=దీని; సర్వ = సమస్తమును; సమాలోక్య = చూచి; అన్యదపి = ఇతరమయినదిగూడ; యత్ = ఏది; దృశ్యతే= కనఁబడుచున్నదో; తత్ (అధ్యాహృతము)చ = దానినిగూడ; సమాలోక్య (అధ్యాహృతము) = చూచి; వైదేహ్యాః=సీతాదేవియొక్క; గతిం = స్థానమును; విదిత్వా = తెలిసి; సన్నివర్తితుం= మఱలుటకు; అర్హథ = తగుదురు.

ఇప్పుడు నేనుజెప్పిన స్థలములయందును మఱియు నితరప్రదేశములయందును, చక్కఁగా వెదకిచూచి, సీతాదేవియున్న స్థానమునెఱింగిమఱలిరండు. అని, తాత్పర్యము.

యస్తు మాసా న్నివృత్తోఽగ్రే దృష్టా సీతేతి వక్ష్యతి. ౪౮
మత్తుల్యవిభవో భోగై స్సుఖీ స విహరిష్యతి

టీక॥ యస్తు = ఎవఁడైతే; మాసాత్=మాసముకన్నను; అగ్రే=ముందఱ; నివృత్తః = మఱలినవాఁడై; "సీతా=సీత; దృష్టా=చూడఁబడినది." ఇతి=అని; వక్ష్యతి=చెప్పఁగలఁడో; సః= అతఁడు; మత్తుల్యవిభవః=నాతోసమానమయినసంపదగలవాఁడై; భోగైః= భోగములతో; యుక్తః(అధ్యాహృతము)=కూడినవాఁడై; సుఖం=సుఖముగా; విహరిష్యతి=క్రీడింపఁగలఁడు.

ఎవ్వఁడు, మాసములోపలనే యిటకువచ్చి, "కనఁబడినదిసీతాదేవి" అని చెప్పునో, అతఁడు, నాతోసమానముగా నఖిలసంపదలుంగల్గి దివ్యభోగంబులను భవించుచు సుఖంబుగావిహరింపఁగలఁడు. అని, తాత్పర్యము.

తతః ప్రియతరో నాస్తి మమ ప్రాణా ద్విశేషతః. ౪౯

కృతాపరాధో బహుశో మమ బంధుర్భవిష్యతి

టీక॥ తతః=అతనికన్నను; మమ=నాకు; ప్రియతరః = మిక్కిలియుఁబ్రియుఁడైనవాఁడు; నాస్తి=లేఁడు. ప్రాణాత్=ప్రాణముకన్నను; విశేషతః= విశేషించి; ప్రియతరః= మిక్కిలియుఁ బ్రియుఁడు. సః (అధ్యాహృతము) = అతఁడు; బహుశః = అనేకవిధములుగా; కృతాపరాధః= చేయఁబడినయపరాధము గలవాఁడైనను; మమ=నాకు; బంధుః=ఇష్టుఁడు; భవిష్యతి=కాఁగలఁడు.

సీతం జూచివచ్చినవానికన్నను నాకుఁబ్రియుండు లేఁడు; నాజీవితంబుకన్నను నాకతండధికుఁడగును; అతఁడు, ఎన్నియపరాధములు గావించినవాఁడైనను, నాకువిశేషించిప్రియుండైయుండఁగలఁడు. అని, తాత్పర్యము.

అమితబలపరాక్రమా భవంతో
విపులగుణేషు కులేషు చ ప్రసూతాః। ౫౦
మనుజపతిసుతాం యథా లభధ్వం
తదధిగుణం పురుషార్థ మారభధ్వమ్

టీక॥ భవంతః=మీరలు; అమితబలపరాక్రమాః=కొలందిలేని బలమును పరాక్రమమును గలవారలు. విపులగుణేషు = అధికమయినగుణములుగల; కులేషు=వంశములయందు; ప్రసూతాశ్చ= పుట్టినవారలును. యూయం (అధ్యాహృతము)=మీరలు; యథా= ఎట్లు; మనుజపతిసుతాం= రాజపుత్త్రియగు సీతను; లభధ్వం=పొందుదురో; తథా (అధ్యాహృతము) = అట్లు; తదధిగుణం = దానికనుకూలమయిన; పురుషార్థం = పురుషప్రయత్నమును; ఆరభధ్వం= చేయుఁడు.

మీరలు, కొలందికిమీఱినబలపరాక్రమంబులుగలవారలు, శౌర్యవీర్యాది సమస్తసద్గుణసంపన్నంబులగు వంశంబులజనించినవారలు; సీతాదేవి లభించునట్లు సమస్తవిధంబులం బ్రయత్నంబులు గావింపుఁడు. అని, సుగ్రీవుఁడు నీలాదివానరులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ఏకచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికావ్యాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండైకచత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౪౨.

ద్విచత్వారింశసర్గప్రారంభః.

అథ ప్రస్థాప్య సుగ్రీవ స్తాన్ హరీన్ దక్షిణాం దిశమ్
అబ్రవీ న్మేఘసంకాశం సుషేణంనామ యూథపమ్. ౧

టీక॥ అథ = అటుపిమ్మట; దక్షిణాందిశం = దక్షిణపుదిక్కునుగూర్చి; తాన్=ఆ; హరీన్ = వానరులను; ప్రస్థాప్య = పంపి; మేఘసంకాశం= మేఘముతో సమానుఁడగు; సుషేణంనామ = సుషేణుఁడని ప్రసిద్ధుఁడయిన; యూథపం = సమూహమునుపాలించువానిఁగూర్చి; అబ్రవీత్ = పలికెను.

అట్లుసుగ్రీవుండు నీలాదివానరులను దక్షిణదిశకుం బోఁబనిచి, యంతమేఘమునకుఁ బోలె నల్లని యున్నతమయిన యాకారముగల సుషేణుండను వానరయూథపతింజూచి యిట్లనియె.

అని, తాత్పర్యము.

తారాయాః పితరం రాజా శ్వశురం భీమవిక్రమమ్
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్య మభిగమ్య ప్రణమ్యచ. ౨

టీక॥ రాజా = వానరరాజయిన సుగ్రీవుఁడు; తారాయాః = తారయొక్క; పితరం= తండ్రియునుకావుననె; శ్వశురం= మామయు; భీమవిక్రమం= భయంకరమైన పరాక్రమము గలవాఁడునగు; తం (అధ్యాహృతము) = ఆ సుషేణుని; అభిగమ్య = ఎదురొంగాని యు; ప్రణమ్యచ = నమస్కరించియు;

స ౪౨

ప్రాంజలిః = మంచిచేమోడ్పుగలవాం డై; వాక్యం = మాటను; అబ్రవీత్ = పలికెను.

వానరరాజు సుగ్రీవుండు, తారకుం దండ్రికావునం దనకుమామయగుభయం కరమయిన పరాక్రమముగల సుషేణు ని యొద్దకుంబోయి యతనికినమస్కరించి, చేతులుమోడ్చియిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

మహర్షిపుత్త్రం మారీచ మర్చిష్మంతం మహాకపిమ్
"మరీచిపుత్త్రం మారీచమ్" ఇతిపాఠాంతరమ్.
వృతం కపివరై శ్శూరై ర్మహేంద్రసదృశద్యుతిమ్. ౩
బుద్ధివిక్రమసంపన్నం వైనతేయసమద్యుతిమ్
మరీచిపుత్త్రా న్మారీచా నర్చిర్మాలా న్మహాబలాన్. ౪
ఋషిపుత్త్రాంశ్చ తాన్ సర్వాన్ ప్రతీచీ మాదిశ ద్దిశమ్

టీక ॥ సః (అధ్యాహృతము) = ఆ సుగ్రీవుండు; మహర్షిపుత్త్రం = పూజ్యుండైనఋషియగు మరీచియొక్కకొడుకును; పాఠాంతరపక్షమందు, మరీచిపుత్త్రం = మరీచిమహర్షికొడుకును; అర్చిష్మంతం = అధికమయినకాంతిగలవాండును; శూరైః = వీరులగు; కపివరైః = వానరోత్తములచేత; వృతం = చుట్టంబడినవాండును; మహేంద్రసదృశద్యుతిం = దేవేంద్రునితో సమానమయిన కాంతిగలవాండును; బుద్ధివిక్రమసంపన్నం = బుద్ధితోను బరాక్రమముతోనుం గూడినవాండును; వైనతేయసమద్యుతిం = గరుత్మంతునితో సమానమయినకాంతిగలవాండునగు; మారీచం = మారీచుండను; మహాకపిం = గొప్పవానరుని; అర్చిర్మాలాన్ = కిరణములయొక్క పఙ్క్తిగలవారలును; మహాబలాన్ = అధికమయినబలమువారలునగు; మరీచిపుత్త్రాన్ = మరీచిమహర్షియొక్కకొడుకులయిన; మారీచాన్ = మారీచులనువానరులను; తాన్ = ఆ; ఋషిపుత్త్రాన్ = మరీచిమహర్షియొక్కకొడుకులను; సర్వాన్ చ = అందఱను; ప్రతీచీందిశం = పడమటిదిక్కునుగూర్చి; గంతుం (అధ్యాహృతము) = పోవుటకు; ఆదిశత్ = ఆజ్ఞాపించెను.

సుగ్రీవుండు, కాంతి మంతుండును శూరులగు వానరవీరులచేం బరివృతుండును బుద్ధియుంబరాక్రమంబును గల

వాఁడును దేవేంద్రునకుంబోలెఁ బరాక్రమంబును గరుత్మంతునకుంబోలె వేగంబును గలవాఁడునగు మరీచిమహాముని పుత్త్రుఁడయిన జ్యేష్ఠునిమారీచుని, మఱియుఁ గాంతిమంతులు మహాబలశాలులనగువారల నతనితమ్ములను, ఇట్లు మరీచికుమారులనందఱను, బడమటిదిశకుఁ బోనాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

ద్వాభ్యాం శతసహస్రాభ్యాం కపీనాం కపిసత్తమాః. ౫
సుషేణప్రముఖా యూయం వైదేహీం పరిమార్గత

టీక॥ కపిసత్తమాః= వానరశ్రేష్ఠులారా! సుషేణప్రముఖాః= సుషేణుండు మొదలుగాఁగల; యూయం = మీరు; కపీనాం=వానరులయొక్క; ద్వాభ్యాం = రెండయిన ; శతసహస్రాభ్యాం=లక్షలతోః; సహితాః (అధ్యాహృతము)= కూడినవారలయి; వైదేహీం=సీతాదేవిని; పరిమార్గత= వెదకుఁడు.

వానరోత్తములారా! మీరలు సుషేణుముందిడుకొని రెండులక్షల వానరవీరులంగూడి, సీతాదేవిని వెదకుఁడు.

అని, తాత్పర్యము.

సురాష్ట్రాన్ సహబాహ్లీకాన్ శూరాన్ భీమాం స్తథైవచ ౬
స్ఫీతాన్ జనపదా న్రమ్యా న్విపులాని పురాణిచ
పున్నాగగహనం కుక్షిం వకుళోద్దాలకాకులమ్. ౭
తథా కేతకషండాంశ్చ మార్గధ్వం హరియూథపాః

టీక॥ హరియూథపాః = వానరయూథములఁ బాలించునట్టి వారలారా! సహబాహ్లీకాన్= బాహ్లీకదేశముతోఁగూడిన; సురాష్ట్రాన్=సురాష్ట్రదేశమును; తథైవ = అట్లే; భీమాన్ = భయంకరమయిన; శూరాంశ్చ=శూరదేశమును; స్ఫీతాన్= సమృద్ధములయిన; రమ్యాన్= రమణీయములయిన; జనపదాన్= గ్రామసమూహములను; విపులాని= విశాలములయిన; పురాణిచ=పట్టణములను; పున్నాగగహనం = పున్నాగవృక్షముల వనమును; వకుళోద్దాలకాకులం= పొగడచెట్లచేతను విరిగిచెట్లచేతనునిండిన;

స ౪౨

కుక్షిం=కుక్షి దేశమును; తథా=అట్లు; కేతకషండాశ్చ = మొగిలిపొదలను; మార్గధ్వం = వెదకుఁడు.

వానర వీరులారా! సురాష్ట్రదేశమునందును బాహ్లీకదేశము నందును భయంకరములయిన శూరదేశమునందును మఱియు సస్యాది సమృద్ధంబులయిన రమణీయంబులగు గ్రామసమూహములయందును విశాలంబులగు నగరంబులయందును పున్నాగ వనంబునందునుబాగడచెట్లచేతను విరిగిచెట్లచేతను ఒప్పుచుండుకుక్షిదేశమునందును మొగిలిపొదలయందును, సీతాదేవి నన్వేషింపుఁడు. అని, తాత్పర్యము.

ప్రత్యక్స్రోతోగమా శ్చైవ నద్య శ్శీతజలా శ్శివాః. ౮
తాపసానా మరణ్యాని కాంతారా గిరయశ్చ యే

టీక॥ ప్రత్యక్స్రోతోగమాః= పడమటివైపు ప్రవాహమును బొందునట్టి; శీతజలాః=చల్లనినీళ్లుగలవియు; శివాః= మంగళకరంబులునగు; నద్యశ్చైవ=నదులును; యాః సంతి (అధ్యాహృతము)=ఏవిగలవో; తాపసానాం=ఋషులయొక్క; అరణ్యాని=అడవులును; యానిసంతి(అధ్యాహృతము) = ఏవిగలవో; కాంతారాశ్చ=అడవులును; గిరయశ్చ=పర్వతములును; యే(సంతి)= ఏవిగలవో; తత్రతత్ర (అధ్యాహృతము)=అచ్చటచ్చట; మార్గధ్వం (అధ్యాహృతము)=వెదకుఁడు.

పడమటిదట్టు ప్రవహించునట్టి చల్లనిజలంబులుగల పావనంబులయిన నదులను ఋష్యాశ్రమంబులను అరణ్యంబులను పర్వతములనుంబొంది యాన్యోన్య ప్రదేశంబులనంతటను సీతాదేవిని వెదకుఁడు. అని, తాత్పర్యము.

తతః స్థలీం మరుప్రాయా మత్యుచ్ఛశిరస శ్శిలాః. ౯
గిరిజాలావృతాం దుర్గాం మార్గిత్వా పశ్చిమాందిశమ్
తతః పశ్చిమ మాసాద్య సముద్రం ద్రష్టు మర్హథ. ౧౦
తిమి నక్రా యుత జలు మక్షోభ్య మథ వానరాః

టీక॥ వానరాః=వానరులారా! తతః=అటుపిమ్మట; మరుప్రాయాం=నిర్జలప్రదేశప్రాయమయిన; స్థలీం = భూమిని; అత్యుచ్ఛశిరసః=మిక్కిలియు

నున్నతములయిన శిఖరములుగల; శిలోచ్చ=త్తాళ్లను, పర్వతములననటః; గిరిజాలావృతాం= పర్వతసమూహముల చేజుట్టఁబడినదియు; గుర్గాం=పొందఁగుఁడనిదియునగు; పశ్చిమాందిశం= పడమటిదిక్కును; మార్గిత్వా=వెదకి;తతః=అంత; పశ్చిమం= పడమటిదిక్కునందున్న; సముద్రం= సముద్రమును; ఆసాద్య=చేరి; అథ=పిమ్మట; తిమినక్రాయుతజలం, తిమి= నూఱుయోజనముల పొడవుగలచేఁపలతోను, నక్ర= మొసళ్లతోను, ఆయుత = కూడిన,జలం=నీళ్లుగలదియు; అక్షోభ్యం=కలఁతపెట్టరానిదియునగు; తం(అధ్యాహృతము)=ఆసముద్రమును; ద్రక్ష్యథ=చూచుటకు; అర్హథ=తగుదురు.

వానరులారా! అంతమీరునిర్జలప్రాయములయిన భూములయందును మిక్కిలియునున్నతములయిన శిఖరములుగలకొండలయందును, ఇట్లు పెక్కుపర్వతములతోఁగూడి సంచరింపనలవిగాని పశ్చిమదిశనంతటను వెదకి, యంతేఁదిమి మత్స్యంబులతోను మొసళ్లతోనుంగూడి భయంకరమైనదియు నతిగంభీరమునగు పశ్చిమసముద్రమును జూడఁగలరు. అని, తాత్పర్యము.

తతః కేతకషండేషు తమాల గహనేషుచ. ౧౧
కపయో విహరిష్యంతి నారికేళ వనేషుచ

టీక॥ తతః=అచట; కపయః=వానరులు; కేతకషండేషు=మొగిలిపొదలయందును; తమాలగహనేషుచ=చీఁకటిచెట్లవనముల యందును; నారికేళవనేషుచ = కొబ్బరిచెట్లవనములయందును; విహరిష్యంతి=క్రీడింపఁగలరు.

ఆసముద్రతీరంబున మీపరిజనులయిన వానరులు మొగిలి పొదల యందును తమాలవనంబులయందు నారికేళవనంబులయందు, వేడుక మెయి విహరింపఁగలరు. అని, తాత్పర్యము.

తత్ర సీతాంచ మార్గధ్వం నిలయం రావణస్యచ. ౧౨
వేలాతటనివిష్టేషు పర్వతేషు వనేషుచ

టీక॥ తత్ర = అచట; వేలాతటనివిష్టేషు=చెలియలికట్టయొడ్డున నుండుననట్టి; పర్వతేషు=కొండలయందును; వనేషుచ= అడవులయందును; సీతాంచ=

స ౪౨

సీతను; రావణస్య=రావణుని యొక్క; నిలయంచ=ఉనికిపట్టును; మార్గధ్వం=వెదకుఁడు.

అచట సముద్రతీరంబున నున్న పర్వతంబులయందును వనంబులయందును రావణుని నివాసమును సీతాదేవిని జక్కగా నన్వేషింపుఁడు.

అని, తాత్పర్యము.

మురచీపత్తనంచైవ రమ్యంచైవ జటీపురమ్. ౧౩
అవంతీ మంగలోపాంచ తథా చాలక్షితం వనమ్
రాష్ట్రాణిచ విశాలాని పత్తనాని తత స్తతః. ౧౪

టీక॥ మురచీపత్తనంచైవ=మురచి యనుపట్టణమును; రమ్యం= సుందరమయిన; జటీపురంచైవ = జటియనుపట్టణమును; అవంతీం= అవంతీపురమును (పూర్వదిశయం దుదాహరింపఁబడిన యవంతి వేఱు, ఇది వేఱని యెఱుంగునది); అంగలోపాంచ= అంగలోపయనునగరమును; తథా=అట్లు; అలక్షితం=అలక్షితమనునట్టి (ఏవనమందుఁ బ్రవేశించినజనులు వనము దట్టముగానుండుట వలనఁగనఁబడరో, అదియలక్షితము); వనంచ=అడవిని; విశాలాని=వెడలుపు లయిన; రాష్ట్రాణిచ= దేశములను; పత్తనాని = పట్టణములను; తత స్తతః= అచటచట; మార్గధ్వం (అధ్యాహృతము)=వెదకుఁడు.

మురచీ పట్టణమును రమణీయమయిన జటీనగరమును అవంతీపురమును అంగలోపానగరియు అలక్షితం బను నరణ్యంబును మఱియు నితరములయిన దేశములను రాజధానులును బొంది యాయా ప్రదేశంబులం దంతటను సీతాదేవిని రావణుని వెదకుఁడు.

అని, తాత్పర్యము.

సింధుసాగరయో శ్చైవ సంగమే తత్ర పర్వతః
మహాన్ హేమ గిరి ర్నామ శతశృంగో మహాద్రుమః. ౧౫

టీక॥తత్ర=అచ; సింధుసాగరయోః= సింధునదము యొక్కయు సముద్రము యొక్కయు; సంగమేచైవ=చేరికయందును; మహాన్=గొప్పదియు; శతశృంగః= నూఱుశిఖరములుగలదియు; మహాద్రుమః= గొప్పవృక్షములుగలదియును; హేమగిరిర్నామ= హేమగిరి(బంగారుకొండ)యను పేరుగల; పర్వతః=

కొండ; అస్తి (అధ్యాహృతము) = కలదు.

సింధునదము సముద్రములోఁ గలియుస్థలమునందు నూఱుశిఖరములు గల్గి యత్యున్నతములగు వృక్షములతో నొప్పుచున్న హేమగిరియను గొప్పపర్వతం బొకండు గలదు.

అని, తాత్పర్యము.

తస్య ప్రస్థేషు రమ్యేషు సింహాః పక్షగమాః స్థితాః
తిమిమత్స్యగజాంశ్చైవ నీడాన్యారోపయంతి తే. ౧౬

టీక॥ తస్య= ఆహేమగిరియొక్క; రమ్యేషు = సుందరములయిన; ప్రస్థేషు=నెత్తములయందు; పక్షగమాః= ఱెక్కలచేఁబోవునట్టి; సింహాః=సింగములు; స్థితాః=ఉన్నవి. తే=అవి; తిమిమత్స్యగజాంశ్చైవ=తిమియనునూఱుయోజనములనిడుపుగలచేఁపలను ఏనుఁగులనుగూడ; నీడాని = గూండ్లను; ఆరోపయంతి=పొందించుచున్నవి.

రమణీయములగు నాహేమగిరి నెత్తములయందు ఱెక్కలుగల సింహంబులుగలవు; అవి, సముద్రంబునందలి తిమిమత్స్యంబులను గజంబులను ఎత్తుకొనిపోయి తమగూండ్లం జేర్చుచుండును.

అని, తాత్పర్యము.

తాని నీడాని సింహానాం గిరిశృంగగతాశ్చ యే
దృప్తాస్తృప్తాశ్చ మాతంగాస్తోయదస్వననిస్వనాః. ౧౭
విచరంతి విశాలేస్మిన్ తోయపూర్ణే సమంతతః

టీక॥ సమంతతః= అంతటను; తోయపూర్ణే = జలములచేనిండిన; విశాలే = విస్తీర్ణమయిన; అస్మిన్=ఈపర్వతమునందు; గిరిశృంగగతాశ్చ= పర్వతశిఖరమునొందినవి; యే(సంతి)= ఏవిగలవో; తే (అధ్యాహృతము) = అ; దృప్తాః=గర్వించినవియు; తృప్తాశ్చ = తృప్తినొందినవియు; తోయదస్వననిస్వనాః = మేఘగర్జనమువంటి ధ్వనిగలవియునగు; మాతంగాః = ఏనుంగులు; సింహానాం=సింహములయొక్క; తాని=ఆ; నీడాని=గూండ్లను; విచరంతి=పొందుచుండును.

చుట్టును జలములచేఁ బరివేష్టితంబయిన యాహేమగిరి శిఖరంబుననున్న మేఘధ్వనివంటి ధ్వనిగలవియు తృప్తి

నొందిమదించియున్నదియునగు నేనుఁగులు, నాసింహములగూండ్లున్న ప్రదేశంబులందు, నిర్భయంబుగాఁగంవరించును. అని, తాత్పర్యము.

తస్య శృంగం దివస్పృశం కాంచనం చిత్రపాదపమ్. ౧౮
సర్వ మాశు విచేతవ్యం కపిభిః కామరూపిభిః

టీక॥ దివస్పృశం=ఆకాశమునుముట్టునదియు; కాంచనం= బంగారువికారంబును; చిత్రపాదపం=చిత్రవర్ణములయినచెట్లుగలదియునగు; తస్య= ఆ హేమగిరియొక్క; శృంగం= శిఖరమును; సర్వం=సమస్తమును; కామరూపిభిః=ఇచ్ఛాధీనమగు రూపముగల; కపిభిః=వానరులరయిన; భవద్భిః(అధ్యాహృతము)=మీచేత; ఆశు = శీఘ్రముగా; విచేతవ్యం=వెదకఁబడవలయును.

ఔన్నత్యంబుచే నింగిముట్టుచున్నదియుఁ గాంచనమయంబులును బుష్పితంబులగుటను జిత్రవర్ణంబులయిన వృక్షంబులుగలదియునగు నాహేమగిరిశిఖరంబులందంతటను, గామరూపులరగు మీరలు, జాగుసేయక చక్కఁగా జానకినన్వేషింపుఁడు. అని, తాత్పర్యము.

కోటిం తత్ర సముద్రేతు కాంచనీం శతయోజనామ్. ౧౯
దుర్దర్శాం పారియాత్రస్య గతాం ద్రక్ష్యథ వానరాః

టీక॥ వానరాః = వానరులారా! తత్ర=ఆ; సముద్రేతు= సముద్రమునందే; గతాం = పొందినదియు; కాంచనీం=బంగారు వికారమయినదియు; శతయోజనాం = నూఱుయోజనములుగలదియు; దుర్దర్శాం = చూడనలవిగానిదియునగు; పారియాత్రస్య = పారియాత్రపర్వతముయొక్క; కోటిం=శిఖరమును; ద్రక్ష్యథ=చూడఁగలరు.

వానరులారా! సముద్రంబునంగొంతదవ్వరిగిన పిదప, సముద్రమధ్యంబుననున్నదియుఁ గాంచనమయంబును నూఱుయోజనంబుల విస్తారముగలదియుఁ దేజోతిశయంబునంజేసి చూడనలవిగానిదియునగు పారియాత్రశిఖరంబుఁ జూడఁగలరు. అని, తాత్పర్యము.

కోట్య స్తత్ర చతుర్వింశ ద్గంధర్వాణాం తరస్వినామ్. ౨౦

వసంత్యగ్నినికాశానాం ఘోరాణాం కామరూపిణామ్

టీక ॥ తత్ర= ఆపారియాత్రశిఖరమునందు; తరస్వినాం = బలవంతులును; అగ్నినికాశానాం=నిప్పుతోసమానులును; ఘోరాణాం= భయంకరులును; కామరూపిణాం=ఇచ్ఛాధీనమయిన రూపముగలవారలునగు; గంధర్వాణాం=గంధర్వులయొక్క; కోట్యః = నూఱులక్షలు; చతుర్వింశత్= ఇరువది నాలుగు; వసంతి=ఉన్నవి.

ఆ పారియాత్రశిఖరంబున, బలవంతులను అగ్నివలె మిక్కిలియు తీక్ష్ణులును భయంకరాకారులును గామరూపులనగు గంధర్వులు ఇరువది నాలుగు కోట్లమంది నివసించుచున్నారు.

అని, తాత్పర్యము.

పావకార్చిఃప్రతీకాశా స్సమవేతా స్సహస్రశః. ౨౧
నాత్యాసాదయితవ్యా స్తే వానరై ర్భీమవిక్రమైః

టీక ॥ పావకార్చిః ప్రతీకాశాః = అగ్నిజ్వాలలతోసమానులును; సహస్రశః = వేనవేలుగా; సమవేతాః=కూడుకొనియున్నవారలునగు; తే= ఆగంధర్వులు; భీమవిక్రమైః = భయంకరమయిన పరాక్రమముగల; వానరైః= వానరులచేత; అత్యాసాదయితవ్యాః న = మిక్కిలియు సమీపింపఁదగినవారలుకారు.

ఆగంధర్వులు, అగ్నిజ్వాలలంబోలినవారలు, వేనవేలుగా గుంపులుగూడియుందురు; కావునవానరులలోభయంకరపరాక్రమములగువారలుగూడ,వారల సమీపంబునకుఁ బోరాదు.

అని, తాత్పర్యము.

నాదేయం చ ఫలం తస్మా ద్దేశా త్కించి త్ప్లవంగమైః ౨౨

టీక॥ ప్లవంగమైః= వానరులచేత; తస్మాత్= ఆ; దేశాత్ = ప్రదేశమునుండి; ఫలంచ=పండుగూడ;కించిత్= కొంచెమయినను; నాదేయం=గ్రహింపఁదగినదికాదు.

మఱియు, అచ్చోటనుండి, ఫలములుగూడ కొంచెమైనను వానరులు కోయరాదు. అని, తాత్పర్యము.

స ౪౩

దురాసదా హి తే వీరా స్సత్త్వవంతో మహాబలాః
ఫలమూలాని తే తత్ర రక్షంతే భీమవిక్రమాః. ౨౩

టీక॥ హి=ఏలయనఁగా; తత్ర=ఆ పారియాత్రపర్వతము నందు; దురాసదాః= చెనకరానివారలును; వీరాః= శూరులును; సత్త్వవంతః = అధికమయినధైర్యము గలవారలును; మహాబలాః=అధికమయిన బలము గలవారలును; భీమవిక్రమాః = భయంకరమయిన పరాక్రమము గలవారలునగు; తే=ప్రసిద్ధులయిన; తే= ఆగంధర్వులు; ఫలమూలాని= పండ్లనుగడ్డలను; రక్షంతే= కాపాడుచున్నారు.

ఏలయనఁగా, సమీపింప నలవిగాని వారలును శూరులును ధైర్యవంతులును మహాబలశాలులును భయంకరమయిన విక్రమముగలవారలునగు ప్రసిద్ధులయిన యాగంధర్వులు, ఆ పారియాత్రశిఖరమునందలి ఫలమూలంబులకుఁ గావలియున్నారు. అని, తాత్పర్యము.

తత్ర యత్నశ్చ కర్తవ్యో మార్గితవ్యాచ జానకీ
న హి తేభ్యో భయం కించి త్కపిత్వ మనువర్తతామ్. ౨౪

టీక॥ తత్ర=అచట; యత్నశ్చ=ప్రయత్నమును; కర్తవ్యశ్చ = చేయఁబడవలసినదియు; జానకీ= సీత; మార్గితవ్యాచ = వెదకఁబడవలసినదియు. కపిత్వం = వానరధర్మమును; అనువర్తతాం= వెంబడించువారలకు; తేభ్యః = ఆగంధర్వులవలన; భయం= వెఱపు; కించిత్=కొంచెమైనను; నహి = లేదుగదా!

అచటఫలమూలంబులు ముట్టుకొనక జాగ్రత్తగా ప్రయత్నముచేసి, సీతాదేవిని వెదకవలెను; వానరులకుం దగిన రీతిని మీరుమెలంగుదురేని మీకు ఆగంధర్వులవలనఁ గొంచెమైనను భయము లేదు. అని, తాత్పర్యము.

తత్ర వైడూర్యవర్ణాభో వజ్రసంస్థానసంస్థితః
నానాద్రుమలతాకీర్ణో వజ్రోనామ మహాగిరిః. ౨౫

టీక॥ తత్ర = ఆసముద్రమునందు; వైడూర్యవర్ణాభః=వైడూర్యముయొ

కన్నవంటి కాంతిగలదియు; వజ్రసంస్థానసంస్థితః = వజ్రముయొక్క యునికివంటి యునికిగలదియు; నానాద్రుమలతాకీర్ణః = నానావిధములయినవృక్షములచేతను తీఁగలచేతను వ్యాపింపఁ బడినదియునగు; వజ్రో నామ = వజ్రమని ప్రసిద్ధమయిన; మహాగిరిః = గొప్పపర్వతము; అస్తి (అధ్యాహృతము) = కలదు.

ఆసముద్రంబున మఱియుఁ గొంత దూరంబుపోఁగా, వైడూర్యమణివంటి కాంతిగలదియు వజ్రరత్నమువలె నతి కఠినంబును నానావిధములయిన వృక్షలతల నిండియుండునదియునగు వజ్రమనుమహాపర్వతంబు కనఁబడును.

అని, తాత్పర్యము.

శ్రీమాన్ సముదిత స్తత్ర యోజనానాం శతం సమమ్

టీక॥ తత్ర = ఆసముద్రమునందు; శ్రీమాన్ = అధికమయిన కాంతిగల; సః (అధ్యాహృతము) = ఆవజ్రగిరి; సమం = సరిగా; యోజనానాం = యోజనములయొక్క; శతం = నూఱు; సముదితః = ఉన్నతమయినది.

శ్రీమంతంబగు నావజ్రగిరి, సమముగా నూఱుయోజనంబులున్నతంబైయుండును. అని, తాత్పర్యము.

గుహా స్తత్ర విచేతవ్యాః ప్రయత్నేన ప్లవంగమాః. ౨౬

టీక ॥ ప్లవంగమాః = వానరులారా! తత్ర = ఆపర్వతమునందు; గుహాః = గుహలు; ప్రయత్నేన = యత్నముచేత; విచేతవ్యాః = వెదకఁబడవలయును.

వానరులారా! ఆవజ్రపర్వతముగుహలయందుఁ బ్రయత్నపూర్వకంబుగా సీతాదేవిని వెదకవలెను.

అని, తాత్పర్యము.

చతుర్భాగే సముద్రస్య చక్రవాన్నామ పర్వతః
తత్ర చక్రం సహస్రారం నిర్మితం విశ్వకర్మణా. ౨౭

టీక ॥ సముద్రస్య = సముద్రముయొక్క; చతుర్భాగే = నాలవభాగమునందు; చక్రవాన్నామ = చక్రవంతమనుపేరుగల; పర్వతః = కొండ; అస్తి (అధ్యాహృతము) = కలదు. తత్ర = ఆపర్వతమందు; విశ్వకర్మణా = విశ్వకర్మ

చేత; సహస్రారం= వేయియాకులుగ ల; చక్రం=చక్రాయుధము; నిర్మితం= చేయఁబడినది.

అంత, సముద్రంబున మూఁడు భాగములు కడచినపిదప, జక్రవంతమను నొకపర్వతంబుగలదు; అందు, మున్ను విశ్వకర్మ వేయియరములుగల చక్రాయుధంబును నిర్మించెను.

అని, తాత్పర్యము.

తత్ర పంచజనం హత్వా హయగ్రీవం చ దానవమ్
ఆజహార తత శ్చక్రం శంఖంచ పురుషోత్తమః. ౨౭

టీక ॥ తత్ర = ఆచక్రవత్పర్వతమునందు; పురుషోత్తమః = విష్ణువు; హయగ్రీవం = హయగ్రీవుఁడను; దానవంచ = దానవుని; పంచజనం = పంచజనుఁడనుదానవుని; హత్వా= వధించి; తతః = వారలవలన; చక్రం = చక్రమును; శంఖంచ= శంఖమును; ఆజహార = గ్రహించెను.

ఆచక్రవత్పర్వతమునందె, పూర్వము విష్ణువు ఒకానొక దేవాసుర యుద్ధంబునఁ బురుషోత్తమరూపంబున నవతరించి, చక్రరక్షకుఁడైన హయగ్రీవుఁడను దానవునివధించి చక్రంబును, పంచజనుండను దానవు వధించి యతని యస్థియయిన పాంచజన్యంబను శంఖంబును, గ్రహించెను. అని, తాత్పర్యము.

తస్య సానుషు చిత్రేషు విశాలాసు గుహాసుచ
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౨౮

టీక॥తస్య=ఆచక్రవత్పర్వతముయొక్క; చిత్రేషు= చిత్రవర్ణములయిన, లేక, ఆశ్చర్యకరములయిన; సానుషు= నెత్తములయందును; విశాలాసు= వెడలుపులయిన; గుహాసుచ= గుహలయందును; తత స్తతః = అచటచట; రావణః=రావణుఁడు; వైదేహ్యాసహ= సీతతోఁగూడ; మార్గితవ్యః= వెదకఁబడవలెను.

ఆచక్రవత్పర్వతమునందుఁ, జిత్రములయిన నెత్తములయందును విశాలములయిన గుహలయందును, రావణుని సీతను వెదకవలెను. అని, తాత్పర్యము.

యోజనానాం తత ష్షష్టి ర్వరాహోనామ పర్వతః

సువర్ణశృంగ స్సుశ్రీమా నగాధే వరుణాలయే. ౩౦

టీక॥ తతః= అటుపిమ్మట; యోజనానాం=యోజనములయొక్క; షష్టిః= అఱువది; గంతవ్యా (అధ్యాహృతము)=పొందఁబడవలసినది. అగాధే= లోఁతుగల; వరుణాలయే=సముద్రమునందు; సువర్ణ శృంగః= బంగారుశిఖరములుగలదియు; సుశ్రీమాన్=మిక్కిలియునధికమయిన కాంతిగలదియునగు; వరాహోనామ=వరాహమను; పర్వతః=కొండ; అస్తి(అధ్యాహృతము)= కలదు.

అపిమ్మట, నఱువది యోజనంబుల దూరంబునందు, అగాధంబగుసముద్రంబున, బంగారుశిఖరంబులుగలిగి మహాతేజంబుతో వెలుంగుచున్న వరాహపర్వతంబున్నది. అని, తాత్పర్యము.

తత్ర ప్రాగ్జ్యోతిషంనామ జాతరూపమయం పురమ్
యస్మి న్వసతి దుష్టాత్మా నరకోనామ దానవః. ౩౧

టీక॥ తత్ర= ఆవరాహపర్వతమునందు; యస్మిన్=దేనియందు; దుష్టాత్మా=చెడ్డబుద్ధిగల; నరకోనామ= నరకుఁడనిప్రసిద్ధుఁడైన; దానవః= దానవుఁడు; వసతి=ఉన్నాఁడో; తత్ (అధ్యాహృతము)= అట్టి; జాతరూపమయం= బంగారువికారమయిన; ప్రాగ్జ్యోతిషంనామ=ప్రాగ్జ్యోతిషమను పేరుగల; పురం=పట్టణము;అస్తి(అధ్యాహృతము)=కలదు.

అవ్వరాహ పర్వతంబునఁ, గాంచనమయమయిన ప్రాగ్జ్యోతిషంబనునగరంబుగలదు; అప్పురంబునందు, దురాత్ముండగునరకాసురుండు నివసించును. అని, తాత్పర్యము.

తత్ర సానుషు చిత్రేషు విశాలాసు గుహాసుచ
రావణ స్సహవైదేహ్యా మార్గితవ్య స్తతస్తతః. ౩౨

టీక॥ తత్ర = ఆవరాహగిరియందు; చిత్రేషు= ఆశ్చర్యకరములయిన; సానుషు = నెత్తములయందును; విశాలాసు = వెడల్పులయిన; గుహాసుచ= గుహలయందును; తతస్తతః = అచటచట; రావణః=రావణుఁడు; వైదేహ్యా

సహ = సీతాదేవితోఁగూడ; మార్గితవ్యః = వెదకఁబడవలెను.

ఆవరాహగిరియందు, అద్భుతములయిన సానువులయందును విశాలంబులగుగుహలయందును రావణుని సీతాదేవిని వెదకవలెను. అని, తాత్పర్యము.

త మతిక్రమ్య శైలేంద్రం కాంచనాంతరనిర్దరః
పర్వత స్సర్వసౌవర్ణో ధారాప్రస్రవణాయుతః. ౩౩

టీక॥ తం=ఆ; శైలేంద్రం=పర్వతశ్రేష్ఠమయినవరాహగిరిని; అతిక్రమ్య=దాఁటి; కాంచనాంతరనిర్దరః= బంగారువికారములయినలోపలిప్రదేశములుగల గుహలుగలదియు; సర్వసౌవర్ణః= సమస్తమునుబంగారు వికారమయినదియు; ధారాప్రస్రవణాయుతః= జలధారలతోను సెలయేర్లతోనుగూడినదియు, లేక, ధారారూపములయిన సెలయేర్లతోఁ గూడినదియు, అగు; పర్వతః=కొండ; అస్తి(అధ్యాహృతము)= కలదు.

అవ్వరాహగిరి నతిక్రమించిన పిదపఁ, గాంచనమయములయిన యంతరప్రదేశములుగల గుహలతో నొప్పుచున్నదియు సర్వమును గాంచన మయంబును సెలయేర్లతోఁ గూడినదియునగు నొక మహాపర్వతంబున్నది. అని, తా.

తం గజాశ్చ వరాహాశ్చ సింహావ్యాఘ్రాశ్చ సర్వతః
అభిగర్జంతి సతతం తేన శబ్దేన దర్పితాః. ౩౪

టీక॥ తేన=ఆ; శబ్దేన=ధ్వనిచేత, తమధ్వనిచేఁబుట్టిన ప్రతిధ్వనిచేత ననుట; దర్పితాః = గర్వించిన; గజాశ్చ= ఏనుఁగులును; వరాహాశ్చ = పందులును; సింహావ్యాఘ్రాశ్చ= సింహములును బులులును; సర్వశః = అన్నియు; తం=ఆపర్వతమునుగూర్చి; సతతం = ఎల్లప్పుడును; అభిగర్జంతి = గర్జించుచున్నవి.

అందు, ఏనుంగులును వరాహంబులును సింహంబులునుశార్దూలంబులును, దమధ్వనికిఁగల్గిన ప్రతిధ్వనివిని గర్వించినవై, యెల్లప్పుడును, అందుకుబదులుగాగర్జించుచునే యుండును.

అని, తాత్పర్యము.

యస్మి న్హరిహయ శ్శ్రీమా న్మహేంద్రః పాకశాసనః
అభిషిక్త స్సురై రాజా మేఘవాన్నామ పర్వతః. ౩౫

టీక॥ యస్మిన్=ఏపర్వతమునందు; శ్రీమాన్= అధికమయిన కాంతిగలవాఁడును, లేక, సర్వాధికుండును; పాకశాసనః=పాకుఁడను రాక్షసునిజంపినవాఁడును; హరిహయః=పింగళవర్ణములయిన గుఱ్ఱములుగలవాఁడునగు; మహేంద్రః=దేవేంద్రుఁడు; సురైః= దేవతలచేత; రాజా=రాజుగా; అభిషిక్తః=అభిషేకింపఁబడినాఁడో; సః(అధ్యాహృతము)=అది; మేఘవాన్నామ= మేఘవంతమని ప్రసిద్ధమయిన; పర్వతః = కొండ.

ఆపర్వతమునందె శ్రీమంతుండును పింగళ వర్ణములయిన గుఱ్ఱములుగల వాఁడును పాకాసురు వధించినవాఁడు నగు దేవేంద్రునకు, సురలు, దేవరాజ్యమునకుఁ బట్టాభిషేకముచేసిరి; అదిమేఘవంతమనఁబడును.అని, తాత్పర్యము.

తమతిక్రమ్య శైలేంద్రం మహేంద్రపరిపాలితమ్
షష్టిం గిరిసహస్రాణి కాంచనాని గమిష్యథ. ౩౬
తరుణాదిత్యవర్ణాని భ్రాజమానాని సర్వతః
జాతరూపమయై ర్వృక్షై శ్శోభితాని సుపుష్పితైః. ౩౭

టీక॥ యూయం(అధ్యాహృతము)= మీరలు; మహేంద్రపరిపాలితం = దేవేంద్రునిచే రక్షింపఁబడిన; తం= ఆ; శైలేంద్రం = పర్వతశ్రేష్ఠమయిన మేఘవంతమును; అతిక్రమ్య=దాఁటి; తరుణాదిత్యవర్ణాని = లేఁతసూర్యునివన్నెవంటివన్నెగలవియు; సర్వతః= అంతటను; భ్రాజమానాని = ప్రకాశించుచున్నవియు; సుపుష్పితైః = చక్కఁగాఁ బూచిన; జాతరూపమయైః = బంగారువికారములయిన; వృక్షైః= చెట్లచేత; శోభితాని = ప్రకాశించుచున్నవియు; కాంచనాని=బంగారువికారములునగు; షష్టిం=అఱువదియయిన; గిరిసహస్రాణి = పర్వతములయొక్క వేలను; గమిష్యథ = పొందఁగలరు.

మీరు, దేవేంద్రునిచే సురక్షితంబగు నామేఘవత్పర్వతంబు నతిక్రమించి యాపిమ్మట, బాలసూర్యవర్ణంబులయి యంతటం దేజరిల్లుచున్నవియుఁ జక్క

గాఁబుష్పితంబులగు బంగారువృక్షంబులచే నొప్పుచున్నవియుఁ గాంచనమయములునగు నఱువదివేలపర్వతములంబొడఁగలవు. అని, తాత్పర్యము.

తేషాం మధ్యే స్థితో రాజా మేరు రుత్తరపర్వతః
ఆదిత్యేన ప్రసన్నేన శైలో దత్తవరః పురా. ౩౮.

టీక॥ తేషాం= ఆపర్వతములయొక్క; మధ్యే=నడుమను; రాజా=రాజయిన; ఉత్తరపర్వతః = శ్రేష్ఠమయిన కొండయగు; మేరుః= మేరుపర్వతము (భూమధ్యస్థిత మేరువుకన్న ఈసావర్ణి మేరువుభిన్నము); స్థితః= ఉన్నది. పురా=మున్ను; శైలః=మేరుపర్వతము; ప్రసన్నేన= అనుగ్రహించిన; ఆదిత్యేన=సూర్యునిచేత; దత్తవరః=ఇయ్యఁబడినవరముగలది.

అఱువదివేల పర్వతంబులనడుమ రాజయినసర్వోత్తమమగు సావర్ణిమేరుపర్వతంబున్నది; మున్నుసూర్యుండు ప్రసన్నుండై, యాపర్వతంబునకువరంబొసంగెను. అని, తాత్పర్యము.

తేనైవ ముక్త శ్శైలేంద్ర స్సర్వఏవ త్వదాశ్రయాః
మత్ప్రసాదా ద్భవిష్యంతి దివా నక్తంచ కాంచనాః. ౩౯
త్వయి యేచాపి వత్స్యంతి దేవగంధర్వదానవాః
తే భవిష్యంతి రక్తాశ్చ ప్రభయా కాంచనప్రభాః. ౪౦

టీక॥ తేన=ఆసూర్యునిచేత; శైలేంద్రః=పర్వతరాజమయిన మేరుపర్వతము; "మత్ప్రసాదాత్=నాయనుగ్రహమువలన; త్వదాశ్రయాః=నీవుఆశ్రయముగలవి; సర్వే=అన్నియు; దివా=పగటియందును; నక్తంచ= రాత్రియందును; కాంచనాః=బంగారువికారములు; భవిష్యంతి=కాఁగలవు. త్వయి= నీయందు; యే=ఏ; దేవగంధర్వదానవాః= దేవతలును గంధర్వులును దానవులును; వత్స్యంతి=ఉండఁగలరో; తేచాపి = వారలుగూడ; ప్రభయా=కాంతిచేత; రక్తాశ్చ = ఎఱ్ఱనివారలును; కాంచనప్రభాః = బంగారుయొక్క కాంతివంటి కాంతిగలవారలును; భవిష్యంతి= కాఁగలరు." ఏవం=ఇట్లు; ఉక్తః=చెప్పఁబడినది.

"నాయనుగ్రహంబునంజేసి నీయం

దున్నవృత్తశిలాదులన్నియు రేయుంబవలును గాంచనమయంబులై యుండఁగలవు; మఱియునీయందునివసించువారలు దేవతలుగాని గంధర్వులుగాని దానవులుగాని యెవ్వరుగలరో, వార లంద ఱు, రక్తవర్ణులయి కాంచనప్రభులయి యుండఁగలరు." అని, సూర్యుండు, ఆమ్మేరుపర్వతంబునకువరంబొసంగెను. అని, తాత్పర్యము.

విశ్వే దేవాశ్చ మరుతో వసవశ్చ దివౌకసః
అగమ్య పశ్చిమాం సంధ్యాం మేరు ముత్తరపర్వతమ్. ౪౧
ఆదిత్య ముపతిష్ఠంతి తైశ్చ సూర్యోభిపూజితః
అదృశ్య స్సర్వభూతానా మస్తం గచ్ఛతి పర్వతమ్. ౪౨

టీక॥ విశ్వే=విశ్వులను; దేవాశ్చ=దేవతలును; మరుతః=వాయువులును; వసవశ్చ= వసువులును; దివౌకసశ్చ=దేవతలును; పశ్చిమాం=పడమటిదైన; సంధ్యాం= సంధ్యను, సంధ్యయందనుట; ఉత్తరపర్వతం=శ్రేష్ఠమయినకొండయగు; మేరుం= మేరుపర్వతమును; అగమ్య=పొంది; ఆదిత్యం=సూర్యుని; ఉపతిష్ఠంతి (ఉపతిష్ఠంతే)=సేవింతురు. సూర్యశ్చ=సూర్యుఁడును; తైః=వారలచే; అభిపూజితః = పూజింపఁబడినవాఁడై; సర్వభూతానాం= సమస్తప్రాణులకును; అదృశ్యః=చూడఁగూడనివాఁడై; అస్తం = అస్తమను; పర్వతం=కొండను; గచ్ఛతి=పొందును.

విశ్వదేవులును వాయువులును అష్టవసువులును దేవతలును, సాయంకాలసంధ్యయందు శ్రేష్ఠమయిన మేరుపర్వతంబుఁజేరి, యచట సూర్యునకుపస్థానముగావింతురు; సూర్యుఁడువారలుగావించుపూజలంగైకొని, యస్తగిరి నొంది సమస్తభూతంబులకు నదృశ్యుండగును. అని, తాత్పర్యము.

యోజనానాం సహస్రాణి దశ తాని దివాకరః
ముహూర్తార్ధేన తం శీఘ్ర మభియాతి శిలోచ్చయమ్. ౪౩

టీక ॥ దివాకరః=సూర్యుఁడు; తాని=ఆ; యోజనానాం= యోజనముల యొక్క; సహస్రాణి=వేలను; దశ=పదింటిని; ముహూర్తార్ధేన=ముహూ

స ౪౨

ర్వతముయొక్క-సగముచేత, ఒకగడియచేత; అతిక్రమ్య (అధ్యాహృతము)=దాఁటి; తం=ఆ;శిలోచ్చయం=అస్తపర్వతమును; శీఘ్రం= వేగముగా; అభియాతి = పొందుచున్నాఁడు.

ఆ సావర్ణి మేరువునకును అస్తగిరికిని పదివేలయోజనంబుల దూరంబున్నది; సూర్యుఁడు ఆ పదివేలయోజనంబులదూరంబును అర్ధముహూర్తంబున నతిక్రమించి,యస్తగిరి శిఖరంబుఁజేరును. అని, తాత్పర్యము.

శృంగే తస్య మహ ద్దివ్యం భవనం సూర్యసన్నిభమ్
ప్రాసాదగణసంబాధం విహితం విశ్వకర్మణా. ౪౪
శోభితం తరుభి శ్చిత్రై ర్నానాపక్షి సమాకులైః
నికేతం పాశహస్తస్య వరుణస్య మహాత్మనః. ౪౫

టీక॥ తస్య=ఆపర్వతముయొక్క; శృంగే=శిఖరమునందు; విశ్వకర్మణా= విశ్వకర్మచేత; విహితం= నిర్మింపఁబడినదియు; మహత్ = గొప్పదియు; దివ్యం=శ్రేష్ఠమును; సూర్యసన్నిభం = సూర్యునితో సమానమైనదియు; ప్రాసాదగణసంబాధం= మేడలయొక్క-సమూహముచేనిండినదియు; నానాపక్షి సమాకులైః = నానావిధములయినపక్షులచేనిండిన; చిత్రైః=చిత్రవర్ణములయిన; తరుభిః=వృక్షములచేత; శోభితం=ప్రకాశించుచున్నదియు; పాశహస్తస్య=పాశముచేతియందుఁగల;మహాత్మనః= అధికమయిన ప్రభావముగల; వరుణస్య=వరుణునియొక్క-; నికేతం= నివాసస్థానమునగు; భవనం= గృహము; అస్తి(అధ్యాహృతము)=కలదు.

ఆపర్వతము శిఖరంబున, విశ్వకర్మనిర్మితంబును పెక్కు-మేడలతోనొప్పుచున్నదియుఁ దేజస్సుచే సూర్యుంబోలినదియునానావిధంబులగు పక్షులతోఁగూడినపుష్పితంబులగుటను జిత్రవర్ణములైనవృక్షములచే రమణీయంబైయున్నదియువిశాలంబును దివ్యంబునగు గృహంబుగలదు; అది,పాశధరుండును మహాప్రభావుఁడునగు వరుణుని నివాసస్థానము. అని, తాత్పర్యము.

అంతరా మేరు మస్తంచ తాలో దశశిరా మహాన్

జాతరూపమయ శ్శ్రీమాన్ జాయతే చిత్రవేదికః. ౪౮

టీక ॥ మేరుం=(వష్ఠ్యర్థమందు ద్వితీయ) మేరుపర్వతముయొక్కయు; అస్తంచ=(వష్ఠ్యర్థమందు ద్వితీయ) అస్తపర్వతముయొక్కయు; అంతరా = నడుమ; దశశిరాః = పదితలలుగలదియు; మహాన్ = గొప్పదియు; జాతరూపమయః = బంగారువికారమయినదియు; శ్రీమాన్ = అధికమయిన కాంతిగలదియు; చిత్రవేదికః = చిత్రవర్ణమయిన తిన్నెగలదియునగు; తాలః = తాటిచెట్టు; భ్రాజతే = ప్రకాశించుచున్నది.

సావర్ణి మేరుపర్వతమునకును అస్తగిరికినినడుమ, పదిశిఖరంబులును జిత్రవర్ణమయిన వేదికయుం గలిగి కాంచనమయంబై యున్నతంబైనయొకతాలవృక్షం బొప్పుచుండును.

అని, తాత్పర్యము.

తేషు సర్వేషు దుర్గేషు సరస్సుచ సరిత్సుచ
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౪౯
యత్ర తిష్ఠతి ధర్మజ్ఞ స్తపసా స్వేన భావితః
మేరుసావర్ణి రిత్యేవ ఖ్యాతో వై బ్రహ్మణా సమః. ౫౦

టీక ॥ యత్ర=ఎచ్చట; ధర్మజ్ఞః = ధర్మముదెలిసినవాఁడును; స్వేన= తనదైన; తపసా = తపస్సుచేత; భావితః= పూజింపఁబడినవాఁడును; బ్రహ్మణా=బ్రహ్మదేవునితో; సమః= సరియయినవాఁడునగు; మేరుసావర్ణి రిత్యేవ=మేరుసావర్ణియనియె; ఖ్యాతః= ప్రసిద్ధుఁడు; తిష్ఠతి=ఉన్నాఁడో; తత్ర (అధ్యాహృతము)= ఆసావర్ణిమేరుపర్వతమునందు; తేషు=ఆ; సర్వేషు= సమస్తములయిన; దుర్గేషు=పొందరానిప్రదేశములయందును, రహస్యప్రదేశములయందనుట; సరస్సుచ=కొలంకులయందును; సరిత్సుచ= నదులయందును; తత స్తతః=అచటచట; రావణః= రావణుఁడు; వైదేహ్యాసహ=సీతతోఁగూడ; మార్గితవ్యః=వెదకఁబడవలసినవాఁడు.

ధర్మవేత్తయుమహాతపస్సంపన్నుండును బ్రహ్మదేవునితో సమానుండునగు మేరుసావర్ణి యెచటనివసించునో, అట్టి సావర్ణిమేరువునందు, సమస్తము

లయిన రహస్యప్రదేశముల యందును గొలంకులయందును నదులయందును, రావణుని సీతాదేవిని జక్కఁగా వెదకవలెను. అని, తాత్పర్యము.

ప్రష్టవ్యో మేరుసావర్ణి ర్మహర్షి స్సూర్యసన్నిభః
ప్రణమ్య శిరసా భూమౌ ప్రవృత్తిం మైథిలీంప్రతి. ౪౯

టీక॥ సూర్యసన్నిభః = సూర్యునితో సమానుఁడును; మహర్షిః=పూజ్యుఁడైనఋషియునగు; మేరుసావర్ణిః=మేరుసావర్ణి; భూమౌ=నేలయందు; శిరసా=తలచేత; ప్రణమ్య= నమస్కరించి; మైథిలీంప్రతి=సీతనుగూర్చి; ప్రవృత్తిం= సమాచారమును; ప్రష్టవ్యః= అడుగఁబడవలెను.

సూర్యుఁడుంబోలె వెలుంగుచుండు నాసావర్ణిమహర్షికి, ఫాలంబుభూమి సోఁకంబ్రణమిల్లి, ఆయననుసీతాదేవి వృత్తాంతమడుగవలెను. అని, తా.

ఏతావ జ్జీవలోకస్య భాస్కరో రజనీక్షయే
కృత్వా వితిమిరం సర్వ మస్తం గచ్ఛతి పర్వతమ్. ౫౦

టీక॥ భాస్కరః=సూర్యుఁడు; రజనీక్షయే = రాత్రియొక్కనాశమునందు, ప్రాతఃకాలము నందు; జీవలోకస్య = ప్రాణిలోకముయొక్క; ఏతావత్=ఇంతప్రదేశమును; సర్వం= సమస్తమును; వితిమిరం=చీఁకటిలేనిదానిఁగా; కృత్వా=చేసి, అస్తం= అస్తమను; పర్వతం=కొండను; గచ్ఛతి= పొందుచున్నాఁడు.

సూర్యుఁడు, ఉదయించియు యస్తగిరిచేరువఱకు, ఉదయపర్వతముమొదలుకొని యిప్పుడు చెప్పిన యస్తగిరిపర్యంతముగల ప్రదేశములయందే,యంధకారమును బోఁగొట్టి ప్రకాశమునొసంగును అని, తాత్పర్యము

ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః
అభాస్కర మమర్యాదం న జానీమ స్తతఃపరమ్. ౫౧

టీక॥ వానరపుంగవాః = వానరశ్రేష్ఠులారా! ఏతావత్ = ఇంతదూరము; వానరైః = వానరులచేత; గంతుం = పోవుటకు; శక్యం = అలవియు

గును. అభాస్కరం = సూర్యుఁడులేనిదియు; అమర్యాదం = హద్దులులేనిదియునగు; తతః=అంతకన్న; పరం= ఆవలిప్రదేశమును; నజానీమః= ఎఱుంగము.

వానరోత్తములారా! ఇంతవరకు మునఱకే వానరులకుం బోవనలవిగును; అంతకునావలిప్రదేశము, సూర్యుండులేమించేసి యంధకారావృతంబై, నగరగ్రామాది మర్యాదలు లేనిదగుటను, ఎట్టిదోమాకుం దెలియదు.

అని, తాత్పర్యము.

అధిగమ్యతు వైదేహీం నిలయం రావణస్య చ
అస్తపర్వత మాసాద్య పూర్ణే మాసే నివర్తత. ౪౨

టీక॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; అస్తపర్వతం=అస్తగిరిని;ఆసాద్య=పొంది;వైదేహీం=సీతను; రావణస్య=రావణునియొక్క;నిలయం చ=ఉనికిపట్టును; అధిగమ్యతు = తెలిసియు; మాసే=నెల; పూర్ణే=నిండినదికాఁగా; నివర్తత= మఱలుఁడు.

మీరలు, అస్తపర్వతమువఱకుంబోయి, సీతాదేవిని రావణునినివాసంబును వెదకి తెలిసికొని, ఒక మాసము నిండుటకు మున్నే వచ్చిచేరవలెను.

అని, తాత్పర్యము.

ఊర్ధ్వం మాసా న్నవస్తవ్యం వస న్వధ్యో భవే న్మమ

టీక॥ మాసాత్ = నెలకన్నను; ఊర్ధ్వం=అధికముగా; నవస్తవ్యం=ఉండఁగూడదు. వసన్=ఉన్నవాఁడు; మమ=నాకు; వధ్యః = చంపఁదగినవాఁడు; భవేత్ = అగును.

ఒక నెలకన్నను అధికముగా జాగుసేయఁగూడదు; అట్లు నెలలోపలరానివానికి మరణదండనము విధింతును.

అని, తాత్పర్యము.

సహైవ శూరో యుష్మాభి శ్శ్వశురో మే గమిష్యతి. ౪౩
శ్రోతవ్యం సర్వ మేతస్య భవద్భి ర్దిష్టకారిభిః

టీక॥ యుష్మాభిస్సహైవ=మీతోఁగూడనే; శూరః=వీరుండగు; మే=నాయొక్క;శ్వశురః = మామయయినసుషేణుఁడు; గమిష్యతి = పోఁగలఁడు,

రాఁగలఁడనుట. దిష్టకారిభిః=ఆజ్ఞాపింపఁబడినదానిఁజేయువారలయిన; భవద్భిః=మీచేత; ఏతస్య=ఈతనియొక్క; సర్వం=సమస్తమయినమాటయు; శ్రోతవ్యం = వినఁబడవలెను.

మీతోఁగూడ శూరుఁడు నామామసుషేణుండు రాఁగలఁడు;మీరలితనియాజ్ఞననువర్తించువారలై యితండు పనిచినపనులన్నియుఁ జేయుచుండవలెను. అని, తాత్పర్యము.

గురు రేష మహాబాహు శ్శ్వశురో మే మహాబలః. ౫౪
భవంతశ్చాపి విక్రాంతాః ప్రమాణం సర్వకర్మసు

టీక ॥ మహాబాహుః = గొప్పచేతులుగలవాఁడును; మహాబలః = అధికమయిన బలముగల వాఁడునగు; మమ = నాయొక్క; శ్వశురః= మామయు;గురుః=పూజ్యుఁడు, లేక, పెద్దయునైన; ఏషః = ఈసుషేణుఁడు; సర్వకర్మసు = సమస్తకార్యములయందును;ప్రమాణం= నియామకుఁడు. భవంతశ్చాపి = మీరలుగూడ; విక్రాంతాః = పరాక్రమశాలులరు.

మహాబాహుండును మహాబలశాలియునగు నామామయు గురువునయిన యీసుషేణుఁడు, కార్యముల నడపువాఁడు; మీరలునుబరాక్రమవంతులరు, కావునసులభముగాఁ గార్యసిద్ధికాఁగలదు. అని, తాత్పర్యము.

ప్రమాణ మేనం సంస్థాప్య పశ్యధ్వం పశ్చిమాం దిశమ్. ౫౫

టీక ॥ యూయం ( అధ్యాహృతము)=మీరలు; ఏనం = ఈసుషేణుని; ప్రమాణం= నియామకునిగా; సంస్థాప్య= ఉంచుకొని; పశ్చిమాందిశం = పడమటిదిక్కును; పశ్యధ్వం(పశ్యత)= చూడుఁడు.

మీరలీసుషేణుని నియామకునిఁగా నేర్పఱచుకొనియితనియాజ్ఞకువిధేయులరయిపశ్చిమదిశయందుసీతాదేవినిరావణుని వెదకుఁడు.అని,తాత్పర్యము.

దృష్టాయాంతు నరేంద్రస్య పత్న్యా మమిత తేజసః
కృతకృత్యా భవిష్యామః కృతస్య ప్రతికర్మణా. ౫౬

టీక॥ అమితతేజసః= కొలఁదిలేనిపరాక్రమముగల; నరేంద్రస్య=మనుష్యులకుఁ బ్రభువైన రామునియొక్క; పత్న్యాం = భార్యయయినసీత;దృష్టా

యాంతు = చూడఁ బడినది కాఁగా నే ; కృతస్య = చేయఁ బడిన యుపకారమునకు ; ప్రతికర్మణా = ప్రత్యుపకారముచేత; కృతకృత్యాః= కృతార్థులము; భవిష్యామః=కాఁగలము.

మహా పరాక్రమశాలియగు రాము నిభార్య సీతాదేవింజూచియె వచ్చితిరేని, మనకు రాముండుపకారించిన యుపకారమునకుఁ బ్రత్యుపకారము చేసినవారమగుటంజేసి, కృతార్థుల మయ్యెదము. అని, తాత్పర్యము.

అతో న్యదపి యత్కార్యం కార్యస్యాస్య హితం భవేత్
సంప్రధార్య భవద్భి శ్చ దేశకాలార్థసంహితమ్. ౫౭

టీక॥ అతః = దీనికన్నను; అన్యదపి=ఇతరమును; యత్ = ఏది; అస్య= ఈ; కార్యస్య=పనికి; హితం= మేలుగలిగించునది; భవేత్=ఉండునో; తత్ (అధ్యాహృతము)చ = అదియు; భవద్భిః=మీచేత; దేశకాలార్థసహితం = దేశముతోనుగాలముతోను బ్రయోజనముతోనుగూడినట్లుగా; సంప్రధార్య= నిశ్చయించి; కార్యం= చేయఁదగినది.

నేను జెప్పినదిగాక యింక నితరమేమైనను ఈకార్యమునకు సాధకమయినది మీకుఁ దోఁచినను, దానిని గూడ, మీరు, దేశకాలములను గార్య కార్యములను ఆలోచించి,చేయవలెను అని, సుగ్రీవుఁడు సుషేణుఁడు మున్నగు వానరులతోఁ జెప్పెను. అని,తాత్పర్యము.

తత స్సుషేణప్రముఖాః ప్లవంగా
స్సుగ్రీవవాక్యం నిపుణం నిశమ్య
ఆమంత్ర్య సర్వే ప్లవగాధిపం తే
జగ్ము ర్దిశం తాం వరుణాభిగుప్తామ్. ౫౮

టీక॥ తతః=అటుపిమ్మట; సుషేణప్రముఖాః= సుషేణుఁడు మొదలుగాఁగల; తే=ఆ; ప్లవంగాః=వానరులు; సర్వే=అందఱును; నిపుణం = చతురమయిన; సుగ్రీవవాక్యం=సుగ్రీవునిమాటను; నిశమ్య=విని; ప్లవగాధిపం=వానరరాజునగుసుగ్రీవుని; ఆమంత్ర్య=వీడుకొని; వరుణాభిగుప్తాం= వరుణునిచే రక్షింపఁబడిన; తాం=ఆ;దిశం=దిక్కును; జగ్ముః=పొందిరి.

అంత, సుషేణుండు మున్నగు వానరులందఱు, యుక్తియుక్తం బగు సుగ్రీవు నాజ్ఞను గ్రహించి, సుగ్రీవుని యొద్ద సెలవుపుచ్చుకొని, వరుణునిచేఁ బరిపాలితం బగు పశ్చిమ దిశకుఁ బోయిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ద్విచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ ద్విచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీః

త్రిచత్వారింశసర్గప్రారంభః.

తత స్సందిశ్య సుగ్రీవ శ్శ్వశురం పశ్చిమాం దిశమ్
వీరం శతవలింనామ వానరం వానరర్షభః. ౧
ఉవాచ రాజా ధర్మజ్ఞ స్సర్వవానరసత్తమమ్
వాక్య మాత్మహితం చైవ రామస్యచ హితం తథా. ౨

టీక ॥ వానరర్షభః = వానరశ్రేష్ఠుండును; ధర్మజ్ఞః = ధర్మముఁదెలిసినవాఁడునగు; రాజా=రాజయిన;సుగ్రీవః=సుగ్రీవుఁడు; పశ్చిమాందిశం = పడమటిదిక్కునుగూర్చి; శ్వశురం=మామను; సందిశ్య = ఆజ్ఞాపించి; తతః= అటుపిమ్మట; వీరః = పరాక్రమశాలియు; సర్వవానరసత్తమం = సమస్త వానరులలో శ్రేష్ఠుండునగు; శతవలింనామ = శతవలియనుపేరుగల; వానరం = వానరునిగూర్చి; ఆత్మహితం= తనకుమేలుగలిగించునదియు; తథా = అట్లు; రామస్యచ= రామునకును;హితం = మేలుగలిగించునదియునగు; వాక్యం=మాటను; ఉవాచ = పలికెను.

వానరోత్తముండును సమస్తధర్మం

బులు దెలిసినవాఁడునగు వానరరాజు సుగ్రీవుండు, అట్లు తనమామయగు సుషేణునింబడమరకుఁ బోఁబనిచి, యంత వీరుండు వానరశ్రేష్ఠుండునగు శతవలింజూచి, ప్రత్యుపకారమునకై చెప్పఁబడునదికావున ముఖ్యముగాఁదనకు హితంబును, ప్రియాసమాగమహేతువగుటచే రామునకునుహితంబునగు వచనంబుఁబలికెను. అని, తాత్పర్యము.

వృత శ్శతసహస్రేణ త్వద్విధానాం వనౌకసామ్
వైవస్వతసుతై స్సార్థం ప్రతిష్ఠస్వ స్వమంత్రిభిః. ౩

టీక॥ త్వం(అధ్యాహృతము) = నీవు; త్వద్విధానాం= నీయట్టివారలయిన; వనౌకసాం=వానరులయొక్క; శతసహస్రేణ=లక్షచేత; వృతః=చుట్టఁబడినవాఁడవై; వైవస్వతసుతైః= యముని కొడుకులయిన; స్వమంత్రిభిస్సార్థం=నీమంత్రులతోఁగూడ; ప్రతిష్ఠస్వ= బయలుదేఱుము.

నీవు, నీవంటిపరాక్రమ వంతులయిన లక్షమంది వానరవీరులందీసికొని,యమపుత్త్రులగు నీమంత్రులంగూడి, పయనంబగుము. అని, తాత్పర్యము.

దిశం హ్యుదీచీం విక్రాంతాం హిమశైలావతంసకామ్
సర్వతః పరిమార్గధ్వం రామపత్నీ మనిందితామ్. ౪

టీక ॥ యూయం (అధ్యాహృతము)=మీరలు; విక్రాంతాం=విశాలమయినదియు; హిమశైలావతంసకాం= హిమవత్పర్వతము అలంకారముగాఁగలదియునగు; ఉదీచీందిశం= (అత్యంతసంయోగమందు ద్వితీయ) ఉత్తరపుదిక్కునందు ("హి"అనునది పాదపూరణార్థము); సర్వతః = అంతటను;అనిందితాం = నిందింపఁబడని; రామపత్నీం = రామునిభార్యయయినసీతను; పరిమార్గధ్వం = వెదకుఁడు.

మీరలు, విశాలంబునుహిమవత్పర్వతముచే నధిష్ఠితంబునగు నుత్తరదిశకుఁబోయి, యచటసమస్తకల్యాణగుణపూర్ణయగు రామభార్యను సీతాదేవినివెదకుఁడు. అని, తాత్పర్యము.

అస్మిన్ కార్యే వినిర్వృత్తే కృతే దాశరథేః ప్రియే

ఋణా న్ముక్తా భవిష్యామః కృతా ర్థార్థ విదాం వరాః. ౫

టీక ॥ అర్థవిదాం = కార్యముఁదెలిసినవారలలో; వరాః=శ్రేష్ఠులారా! అస్మిక్ = ఈ; కార్యే=పని; వినిర్వృత్తే= నెఱవేఱినదగుచుండగా; దాశరథేః = రామునకు; ప్రియె = సంతోషము; కృతే = చేయఁబడినదగుచుండఁగా; ఋణాత్ = అప్పునుండి; ముక్తాః = విడువడినవారలమై; కృతార్థాః (సంధియార్షము) = చేయఁబడిన ప్రయోజనముగలవారలము; భవిష్యామః=కాఁగలము.

కార్యజ్ఞులలో నుత్తములగువానరులారా! మీరుపోవునట్టి కార్యము సఫలమయి సీతాదేవిలభించి రాముండుసంతసంబునొందినయెడ, మేము ఋణవిముక్తులమయి కృతార్థులమగుదుము.

అని, తాత్పర్యము.

కృతంహి ప్రియ మస్మాకం రాఘవేణ మహాత్మనా
తస్యచే త్ప్రతికా రోస్తి సఫలం జీవితం భవేత్. ౬

టీక॥ మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల; రాఘవేణ= రామునిచేత; అస్మాకం=మనకు; ప్రియం=సంతోషము; కృతంహి = చేయఁబడినదిగదా! తస్య=ఆయుపకారమునకు; ప్రతికారః = ప్రత్యుపకారము ; అస్తి చేత్=కలదేని; జీవితం=బ్రతుకు; సఫలం = ఫలముతోఁగూడినది; భవేత్= అగును.

మహాత్ముండగు రాముండు, మొదట మనకు ఉపకారముగావించి నాఁడు గదా! అందుకు మనము ప్రత్యుపకారము గావింతుమేని మనబ్రతుకు సఫలమవ్వను. అని, తాత్పర్యము.

అర్థినః కార్యనిర్వృత్తి మకర్తురపి యశ్చరేత్
తస్య స్యాత్సఫలం జన్మ కింపునః పూర్వకారిణః. ౭

టీక ॥ యః=ఎవఁడు; అకర్తురపి= ముందుతనకుపకారము చేయనివాఁడైనను; అర్థినః = కోరినవానియొక్క; కార్యనిర్వృత్తిం = కార్యముయొక్క నెఱవేర్పుటను; చరేత్ = చేయునో; తస్య = అతనియొక్క; జన్మ = పుట్టుక;

సఫలం = ఫలముతోఁగూడినది; స్యాత్=అగును. పూర్వకారిణః= ముందు చేసిన వానియొక్క; కార్యనిర్వృత్తిః, యః, చరేత్ (అధ్యాహృతము)= కార్యముయొక్క నెఱవేర్చుటను ఎవఁడుచేయునో; తస్యజన్మసఫలం ఇతి (అధ్యాహృతము)=అతనిజన్మము సఫలమవునని;కింపునః(వక్తవ్యం)= చెప్పఁబడవలసినదా?

తనకు ఎంతమాత్రముపకారము చేయనివానికార్యమునుగూడ జన్మముసఫలమగుటకై నెఱవేర్పవలెను; ఇఁకఁదనకుముందు ఉపకారముచేసినవానికార్యమునుగూడ నెఱవేర్చనియెడ నంతకన్ననిరర్థకజన్మము లేదని చెప్పనేల?

అని, తాత్పర్యము.

ఏతాం బుద్ధి మవస్థాయ దృశ్యతే జానకీ యథా
తథా భవద్భిః కర్తవ్య మస్మత్ప్రియహితైషిభిః. ౮

టీక॥ అస్మత్ప్రియహితైషిభిః = మాయొక్క సంతోషమును మేలును గోరునట్టి; భవద్భిః=మీచేత; ఏతాం = ఈ; బుద్ధిం=తలంపును; అవస్థాయ=అవలంబించి; జానకీ=సీత;యథా = ఎట్లు;దృశ్యతే=చూడఁబడునో; తథా= అట్లు; కర్తవ్యం=చేయఁబడవలెను.

మీరలు, మాసంతోషంబును మేలును గోరువారలు, కావున, ఈయభిప్రాయమును మనస్సుననుంచుకొని, సీతాదేవినిజూచివచ్చునట్లు తగినంత ప్రయత్నము చేయవలెను.

అని, తాత్పర్యము.

అయం హి సర్వభూతానాం మాన్య స్తు నరసత్తమః
అస్మాసు చాగతప్రీతీ రామః పరపురంజయః. ౯

టీక॥ పరపురంజయః=శత్రుపట్టణంబులజయించునట్టి; అయం=ఈ; నరసత్తమః = మనుష్యశ్రేష్ఠుఁడగు; రామస్తు= రాముఁడుమాత్రము; సర్వభూతానాం= సమస్తప్రాణులకును; మాన్యః = పూజింపఁదగినవాఁడు. అస్మాసు=మనయందు; ఆగతప్రీతిశ్చ= పొందఁబడినప్రేమగలవాఁడును.

శత్రుపురంబుల జయించునట్టి యీ రాముండు , సమస్తభూతంబులకును పూజనీయుండు, మనయందును అధికప్రీతిగలవాఁడు , కావున నితని కార్య

మును ముఖ్యముగాఁ జేయవలెను. అని, తాత్పర్యము.

ఇమాని వనదుర్గాణి నద్య శ్శైలాంతరాణిచ
భవంతః పరిమార్గంతు బుద్ధివిక్రమసంపదా. ౧౦
తత్ర మ్లేచ్ఛాన్ పుళిందాంశ్చ శూరసేనాం స్తథైవచ
ప్రస్థలాన్ భరతాంశ్చైవ కురూంశ్చ సహ మద్రకైః. ౧౧
కాంభోజా న్యవనాంశ్చైవ శకా నారట్టకానపి
బాహ్లీకా న్నృషికాంశ్చైవ పౌరవా నథ టంకణాన్. ౧౨
చీనా న్పరమచీనాంశ్చ విహారాంశ్చ పునఃపునః
అన్వీక్ష్య దరదాంశ్చైవ హిమవంతం తథైవచ. ౧౩

టీక॥ భవంతః=మీరలు; తత్ర=ఆ యుత్తరదిశయందు; మ్లేచ్ఛాన్=మ్లేచ్ఛదేశమును; పుళిందాంశ్చ=పుళిందదేశమును; తథా=అట్లు; శూరసేనానేవ చ=శూరసేనదేశమును; ప్రస్థలాన్=ప్రస్థలదేశమును; భరతాంశ్చైవ=భరతదేశమును; మద్రకైస్సహ=మద్రదేశముతోఁగూడ; కురూంశ్చ = దక్షిణకురుదేశమును; కాంభోజాన్=కాంభోజదేశమును; యవనాంశ్చైవ=యవనదేశమును; శకాన్= శకదేశమును; ఆరట్టకానపి = ఆరట్టకదేశమును; బాహ్లీకాన్= బాహ్లీకదేశమును; ఋషికాంశ్చైవ=ఋషికదేశమును; పౌరవాన్=పౌరవదేశమును; అథ=అంత; టంకణాన్ = టంకణదేశమును; చీనాన్ = చీనదేశమును; పరమచీనాంశ్చ= పరమచీనదేశమును ; విహారాంశ్చ = విహారదేశమును; దరదాంశ్చైవ= దరదదేశమును; తథా = అట్లు; హిమవంతమేవచ= హిమవత్పర్వతమును; పునఃపునః=మాటిమాటికి; అన్వీక్ష్య=చూచి; ఇమాని=ఈ; వనదుర్గాణి = చొరనలవిగానియడవులను; నద్యః (నదీః) = ఏర్లను; శైలాంతరాణి చ=పర్వతమధ్యప్రదేశములను; బుద్ధివిక్రమసంపదా=బుద్ధియొక్కయుఁబరాక్రమముయొక్కయు అతిశయముచేత; పరిమార్గంతు=వెదకుదురుగాక.

మీరలు, ఉత్తరదిశయందు , మ్లేచ్ఛదేశమునందును బుళిందదేశమునందును శూరసేనదేశము నందును బ్రస్థలదేశమునందును భరతదేశమునందును దక్షిణకురుదేశమునందును మద్రదేశము నం

స ౪౩

దును గాంభోజదేశమునందును యవనదేశమునందును శకదేశమునందును ఆరట్టకదేశమునందును బాహ్లీక దేశమునందును ఋషికదేశమునందును పౌరవదేశమునందును టంకణదేశమునందును జీనదేశమునందును బరమచీనదేశమునందును విహారదేశమునందును దరద దేశమునందును హిమవత్పర్వతంబుదును సీతాదేవిని జక్కఁగా వెదకిపిదంత నీదుర్గమారణ్యాంబులందును నదులందును బర్వతంబులందును బుద్ధిపరాక్రమంబులతో వెదకుఁడు.

అని, తాత్పర్యము.

లోధ్రపద్మకషండేషు దేవదారువనేషుచ
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౧౪

టీక॥ లోధ్రపద్మకషండేషు = లొద్దుగుచెట్లయొక్కయుఁ బద్మకమను నొకవిధమయిన చందన వృక్షములయొక్కయు వనంబులయందును; దేవదారువనేషుచ = దేవదారువృక్షములయొక్క వనములయందును; తత స్తతః=అచ్చటచ్చట; రావణః= రావణుఁడు; వైదేహ్యాసహ = సీతతోఁగూడ; మార్గితవ్యః=వెదకఁబడవలెను.

లొద్దుగు చెట్ల వనంబులయందును బద్మకవనంబులయందును దేవదారు వనంబులయందును, దిరిగి, సీతాదేవిని, రావణునిఁ జక్కఁగా వెదకవలెను.

అని, తాత్పర్యము.

తత స్సోమాశ్రమం గత్వా దేవగంధర్వసేవితమ్
కాళంనామ మహాసానుం పర్వతం తం గమిష్యథ. ౧౫

టీక ॥ తతః=అంత; దేవగంధర్వసేవితం = దేవతలచేతను గంధర్వులచేతను సేవింపఁబడిన; సోమాశ్రమం= చంద్రుని యాశ్రమమును; గత్వా = పొంది; మహాసానుం= గొప్ప నెత్తములుగల; కాళంనామ = కాళమను పేరుగల; తం= ప్రసిద్ధమయిన; పర్వతం= కొండను; గమిష్యథ = పొందఁగలరు.

అంత, దేవతలచేతను గంధర్వులచేతను సేవితంబగు సోమాశ్రమంబునకుఁబోయి యచటనుండి గొప్పసానువులతో నొప్పుచున్న కాళపర్వతంబునకుఁ బోఁగలరు. అని, తాత్పర్యము.

స ౪౩

మహత్సు తస్య శైలస్య నిర్దరేషు గుహాసుచ
విచిన్వత మహాభాగాం రామపత్నీం తత స్తతః. ౧౬

టీక ॥ తస్య=ఆ; శైలస్య=పర్వతముయొక్క; మహత్సు=గొప్పవగు; నిర్దరేషు = కోనలయందును; గుహాసుచ=గుహలయందును; తత స్తతః= అచటచట; మహాభాగాం= పూజ్యమయినయదృష్టముగల; రామపత్నీం = రామునిభార్యను; విచిన్వత=వెదకుఁడు.

ఆ కాళపర్వతమందలి విశాలములయిన కోనలయందును గుహలయందు నుదిరిగి యుందందు మహా భాగ్యశాలగు సీతాదేవిని వెదకుఁడు.

అని, తాత్పర్యము.

త మతిక్రమ్య శైలేంద్రం హేమగర్భం మహాగిరిమ్
తత స్సుదర్శనంనామ గంతు మర్హాథ పర్వతమ్. ౧౭

టీక। శైలేంద్రం = పర్వతశ్రేష్ఠమయిన; హేమగర్భం = బంగారుగర్భమందుఁగల; తం=ఆ; మహాగిరిం=కాళపర్వతమును; అతిక్రమ్య=దాఁటి; తతః=అచటనుండి; సుదర్శనంనామ=సుదర్శనమను పేరుగల; పర్వతం=కొండను; గంతుం=పొందుటకు; అర్హాథ = తగుదురు.

మీరలు, బంగారుగనులతోఁగూడిన పర్వతశ్రేష్ఠమయిన యాకాళ పర్వతమునతిక్రమించి, యంత, సుదర్శనపర్వతమునకుఁ బొండు. అని, తాత్పర్యము.

తతో దేవసఖోనామ పర్వతః పర్వతాలయాః
నానాపక్షిసమాకీర్ణో వివిధద్రుమభూషితః. ౧౮

టీక॥ పర్వతాలయాః= వానరులారా! తతః=అటుపిమ్మట; నానాపక్షిసమాకీర్ణః = నానావిధములయినపక్షులచేత వ్యాపింపఁబడినదియు; వివిధద్రుమభూషితః=నానావిధములయిన వృక్షములచేత నలంకరింపఁబడినదియు నగు; దేవసఖోనామ=దేవసఖమను పేరుగల; పర్వతః=కొండ; అస్తి(అధ్యాహృతము)=కలదు.

వానరులారా! సుదర్శనపర్వతమునతిక్రమించినపిదప, నానావిధములయినపక్షులతోను నానావిధములయిన వృక్షములతోను ఒప్పుచున్న దేవసఖంబను పర్వతంబున్నది. అని, తాత్పర్యము.

తస్య కాననషండేషు నిర్ఝరేషు గుహాసుచ
రావణస్సహవైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౧౯

టీక ॥ తస్య= ఆదేవసఖపర్వతముయొక్క; కాననషండేషు = అడవులయొక్క సమూహములయందును; నిర్ఝరేషు= సెలయేళ్లయందును; గుహాసుచ= గుహలయందును; తతస్తతః= అచటచట; రావణః = రావణుఁడు; వైదేహ్యాసహ= సీతతోఁగూడ; మార్గితవ్యః= వెదకఁబడవలెను.

ఆ దేవసఖపర్వతమునందలి వనంబులయందును సెలయేర్లయందును గుహలయందునుదిరిగి, యాస్థలములయందు, సీతాదేవిని రావణుని వెదకి చూడుఁడు. అని, తాత్పర్యము.

త మతిక్రమ్య చాకాశం సర్వత శ్శతయోజనమ్
అపర్వతనదీవృక్షం సర్వసత్త్వవివర్జితమ్. ౨౦

టీక ॥ తం = ఆదేవసఖపర్వతమును; అతిక్రమ్యచ= దాఁటియు; సర్వతః= అంతటను; శతయోజనం= నూఱుయోజనములు గలదియు; అపర్వతనదీవృక్షం= కొండలును నదులును వృక్షములునులేనిదియు; సర్వసత్త్వవివర్జితం= సమస్తజంతువులచేతను విడువఁబడినదియునగు; ఆకాశం=శూన్యప్రదేశము; వర్తతే (అధ్యాహృతము) = ఉన్నది.

ఆదేవసఖపర్వతము నతిక్రమించిన పిదప, అంతటను నూఱు యోజనములైశాల్యముగల శూన్యప్రదేశముకటి కలదు, అందుఁ బర్వతములుగాని నదులుగాని వృక్షములుగాని యుండవు కావున, నచటనేజంతువునునివసింపదు. అని, తాత్పర్యము.

తంతు శీఘ్ర మతిక్రమ్య కాంతారం రోమహర్షణమ్
కైలాసం పాండురం శైలం ప్రాప్య హృష్టా భవిష్యథ. ౨౧

టీక ॥ యూయం (అధ్యాహృతము) = మీరలు; రోమహర్షణం=వెండ్రుకలనుగగుర్పొడించునట్టి; తం= ఆ; కాంతారం=అడవిని; శీఘ్రం= వేగముగా; అతిక్రమ్యతు= దాఁటినంతనే; పాండురం = తెల్లనిదైన; కైలాసం=

కైలాసమును; శైలం = పర్వతమును; ప్రాప్య=పొంది; హృష్టాః = సంతోషించినవారలు; భవిష్యథ=కాఁగలరు.

మహాభయంకరమయిన యాశూన్యప్రదేశమునందుమీరుతడవుసేయవలదు, దానిశీఘ్రముగా నతిక్రమించి, ధవళవర్ణ మయిన కైలాసపర్వతమును జూచిసంతోషము నొందఁగలరు.

అని, తాత్పర్యము.

తత్ర పాండుర మేఘాభం జాంబూనదపరిష్కృతమ్
కుబేరభవనం దివ్యం నిర్మితం విశ్వకర్మణా. ౨౨
విశాలనళినీ యత్ర ప్రభూతకమలోత్పలా
హంసకారండవాకీర్ణా హ్యప్సరోగణసేవితా. ౨౩

టీక॥ తత్ర = ఆకైలాసపర్వతమునందు; పాండుర మేఘాభం=తెల్లని మేఘముయొక్క కాంతివంటి కాంతిగలదియు; జాంబూనదపరిష్కృతం = బంగారముచేనలంకరింపఁ బడినదియు; విశ్వకర్మణా=విశ్వకర్మచేత; నిర్మితం= కట్టఁబడినదియు; దివ్యం=ఉత్తమమునగు; కుబేరభవనం=కుబేరునిగృహము; అస్తి(అధ్యాహృతము)= ఉన్నది. యత్ర=ఏకుబేరభవనమందు; ప్రభూతకమలోత్పలా= అధికములయిన తామరపూలును కలువలును గలదియు; హంసకారండవాకీర్ణా= హంసపక్షులచేతను కన్నెలేళ్లచేతను వ్యాపింపఁ బడినదియు; ("హి"అనునది పాదపూరణార్థము); అప్సరోగణసేవితా= అప్సరసలసమూహముచే సేవింపఁబడినదియు నగు; విశాలనళినీ= విస్తీర్ణమయిన తామరకొలను; అస్తి(అధ్యాహృతము)= ఉన్నదో.

ఆకైలాసపర్వతమందు, తెల్లని మేఘముతో సమానమయినదియు బంగారుపనులచే నలంకృతంబును విశ్వకర్మనిర్మితంబునగు దివ్యమయిన కుబేరుని గృహము కలదు; అందుఁ గమలంబులతోను గలువలతోను నిండి హంసకారండవాదిపక్షులతో నొప్పుచున్నదియునై హార్ద్రమయి యప్సరసలచే సేవితంబునగువిశాలమయిన తామరకొలనుకలదు.

అని, తాత్పర్యము.

తత్ర వైశ్రవణో రాజా సర్వభూతనమస్కృతః
ధనదో రమతే శ్రీమాన్ గుహ్యకైస్సహ యక్షరాట్. ౨౪

టీక॥ తత్ర=అచట; వైశ్రవణః=విశ్రవసునికొడుకును; శ్రీమాన్=అధికమయిన సంపదగలవాఁడును; యక్షరాట్=యక్షులకేఁడునగు; రాజా=రాజయిన; ధనదః=ధనమునొసంగునట్టి కుబేరుఁడు; సర్వభూతనమస్కృతః=సమస్తప్రాణులచేతను నమస్కరింపఁబడినవాఁడై; గుహ్యకైస్సహ=యక్షులతోఁగూడ; రమతే=క్రీడించుచున్నాఁడు.

కైలాసంబున, విశ్రవసునికుమారుండైన శ్రీమంతుండగు యక్షరాజు కుబేరుండు, సమస్తభూతంబులునుదన్నుభక్తిమెయినమస్కరించికొలువ, సర్వయక్షసమేతంబుగా విహరించుచుండును. అని, తాత్పర్యము.

తస్య చంద్రనికాశేషు పర్వతేషు గుహాసుచ
రావణ స్సహ వైదేహ్యా మార్గితవ్య స్తత స్తతః. ౨౫

టీక॥ తస్య=ఆకైలాసపర్వతముయొక్క; చంద్రనికాశేషు=చంద్రునితో సమానములయిన; పర్వతేషు=చిఱుకొండలయందును; గుహాసుచ=గుహలయందును; తత స్తతః=అచటచట; రావణః=రావణుఁడు; వైదేహ్యాసహ=సీతాదేవితోఁగూడ; మార్గితవ్యః=వెదకఁబడవలెను.

ఆకైలాసపర్వతమునఁ, జంద్రవర్ణములగు పర్యంతపర్వతములయందును గుహలయందును దిరిగి యన్యోన్యస్థలములయందు, సీతాదేవిని రావణుని వెదకి చూడవలెను. అని, తాత్పర్యము.

క్రౌంచం తు గిరి మాసాద్య బిలం తస్య సుదుర్గమమ్
అప్రమత్తైః ప్రవేష్టవ్యం దుష్ప్రవేశం హి తత్ స్మృతమ్. ౨౬

టీక॥ క్రౌంచం=క్రౌంచమను; గిరిం=పర్వతమును; ఆసాద్యతు=చేరినంతనే; తస్య=ఆక్రౌంచపర్వతముయొక్క; సుదుర్గమం=మిక్కిలియుఁబ్రవేశింపరాని; బిలం=రంధ్రము; అప్రమత్తైః=ఏమఱుపాటులేని; భవద్భిః(అధ్యాహృతము)=మీచేత; ప్రవేష్టవ్యం=ప్రవేశింపఁబడవలసినది. హి=ఏలయనఁగా; తత్=ఆబిలము; దుష్ప్రవేశం=చొరరానిదిగా; స్మృతం=చెప్పఁబడినది.

అంత, మీరు క్రౌంచపర్వతంబుఁజే

స ౪౩

ర్వతః = కొండ; అస్తి (అధ్యాహృతము) = కలదు.

క్రౌంచపర్వతమునకుఁ బిమ్మట, మైనాకపర్వతం బున్నది; అందు, మయుం డను దానవుండు తనగృహంబును నిర్మించికొని యున్నాఁడు. అని, తాత్పర్యము.

మైనాకస్తు విచేతవ్య స్ససానుప్రస్థకందరః
స్త్రీణా మశ్వముఖీనాంచ నికేతా స్తత్రతత్రతు. ౩౨

టీక॥ ససానుప్రస్థకందరః = సమభూములతోను విషమభూములతోను గుహలతోను గూడిన; మైనాకస్తు = మైనాకపర్వతమును; విచేతవ్యః = వెదకఁబడవలయును. తత్రతత్ర = అచటచట; అశ్వముఖీనాం = గుఱ్ఱముయొక్క ముఖమువంటిముఖము గల; స్త్రీణాం = కిన్నరస్త్రీలయొక్క; నికేతాస్తు = వాసస్థానములును; విచేతవ్యాః (అధ్యాహృతము) = వెదకఁబడవలయును.

ఆమైనాక పర్వతము నందలి సమభూములయందును విషమప్రదేశములయందును గుహలయందును మఱియుఁ గిన్నర స్త్రీలయొక్క వాసస్థానములయందును దిరిగి యన్యోన్య స్థలంబుల సీతాదేవిం జక్కఁగా వెదకుఁడు. అని, తాత్పర్యము.

తం దేశం సమతిక్రమ్య ఆశ్రమం సిద్ధసేవితమ్
సిద్ధా వైఖానసా స్తత్ర వాలఖిల్యాశ్చ తాపసాః. ౩౩

టీక॥ తం = ఆ; దేశం = మైనాకపర్వతప్రదేశమును; సమతిక్రమ్య = దాఁటి, దాఁటినపిదప; సిద్ధసేవితం = సిద్ధులచే సేవింపఁబడిన; ఆశ్రమం = ఆశ్రమము; అస్తి (అధ్యాహృతము) = కలదు. తత్ర = ఆయాశ్రమమునందు; సిద్ధాః = సిద్ధిగలవారలును; తాపసాః = తపస్సంపన్నులునగు; వైఖానసాః = వైఖానసులును; వాలఖిల్యాశ్చ = వాలఖిల్యులును; సంతి (అధ్యాహృతము) = కలరు.

ఆమైనాకపర్వతమును దాఁటిన పిమ్మట, సిద్ధులగు మహాత్ములచే సేవితంబగు నొకయాశ్రమంబు గలదు; అందు, అణిమాద్యష్టైశ్వర్యములు గలవారలును దపస్సంపన్నులునగు వైఖానసులును వాలఖిల్యులును నివసించియుందురు. అని, తాత్పర్యము.

వంద్యా స్తేతు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః
ప్రష్టవ్యాశ్చాపి సీతాయాః ప్రవృత్తి ర్వినయాన్వితైః. ౩౪

టీక॥ తపస్సిద్ధాః = తపస్సుచేతనణిమాద్యష్టసిద్ధులు గలవారలును; తపసా=తపస్సుచేత; వీతకల్మషాః = విడువఁబడిన పాపముగల వారలునగు; తే = ఆవైఖానసవాలఖిల్యులు; వంద్యాస్తు = నమస్కరింపఁ దగినవారలే. వినయాన్వితైః = అడఁకువతోఁ గూడిన; భవద్భిః(అధ్యాహృతము) = మీచేత; సీతాయాః=సీతయొక్క; ప్రవృత్తిశ్చ = సమాచారముగూడ; ప్రష్టవ్యా=అడుగఁబడవలయును.

మీరు, తపోబలంబున నణిమాద్యష్టసిద్ధులను బొందిన వారలును బరిశుద్ధులనగు నమ్మహానుభావులకు అవశ్యము నమస్కారముచేసి, వారలను సీతాదేవి సమాచారము గుఱించి యడుగవలెను. అని, తాత్పర్యము.

హేమపుష్కరసంఛన్నం తస్మి న్వైఖానసం సరః
తరుణాదిత్యసంకాశై ర్హంసై ర్విచరితం శుభైః. ౩౫

టీక॥ తస్మిన్ = ఆయాశ్రమమునందు; హేమపుష్కరసంఛన్నం= బంగారుకమలములచేఁగప్పఁబడినదియు; తరుణాదిత్యసంకాశైః= బాలసూర్యునితో సమానములును; శుభైః=సుందరములు నగు; హంసైః=అంచలచేత; విచరితం= పొందఁబడినదియునగు; వైఖానసం = వైఖానసమను; సరః=కొలను; అస్తి (అధ్యాహృతము)=కలదు.

ఆయాశ్రమమునందు, కాంచన కమలములతో నిండి, బాలసూర్య ప్రకాశంబులగు సుందరములయిన హంసలతో నొప్పుచున్న వైఖానసమను తామరకొలను కలదు. అని, తాత్పర్యము.

ఔపవాహ్యః కుబేరస్య సార్వభౌమఇతి స్మృతః
గజః పర్యేతి తం దేశం సదా సహ కరేణుభిః. ౩౬

టీక॥ కుబేరస్య=కుబేరునియొక్క; ఔపవాహ్యః= వాహనయోగ్యమయిన, ఔపవాహ్యమనఁగా రాజుయొక్క వాహనము, "రాజవాహస్త్వౌపవహ్యః"

అనియమఁరము; సార్వభౌమఇతి= సార్వభౌమమని; స్మృతః= చెప్పఁబడిన; గజః=ఏనుఁగు; కరేణుభిస్సహ= ఆఁడేనుంగులతోఁగూడ; సదా = ఎల్లప్పుడును; తం=ఆ; దేశం=ప్రదేశమును; పర్యేతి=పొందుచుండును.

కుబేరునివాహనమయిన సార్వభౌమంబను దిగ్గజము, ఆఁడేనుఁగులతోఁగూడ, ఎల్లప్పుడు నచట విహరించుచుండును. అని, తాత్పర్యము.

తత్సర స్సమతిక్రమ్య నష్టచంద్రదివాకరమ్
అనక్షత్రగణం వ్యోమ నిష్పయోద మనాదితమ్. ౩౭

టీక ॥ తత్=ఆ; సరః = కొలనును; సమతిక్రమ్య = దాఁటి, దాటినపిదప; వ్యోమ = ఆకాశము; నష్టచంద్రదివాకరం = అగపడనిచంద్రుఁడునుసూర్యుఁడునుగలదిగాను; అనక్షత్రగణం= నక్షత్రసమూహములేనిదిగాను; నిష్పయోదం= మేఘములేనిదిగాను; అనాదితం= ధ్వనములేనిదిగాను; వర్తతే (అధ్యాహృతము)=ఉండును.

ఆవైఖానస సరస్సునకావల, ఆకాశమునందు, చంద్రసూర్యులప్రచారముగాని నక్షత్రములసంచారముగాని యెంతమాత్రములేదు, మేఘములు సంచరింపవు; నిశ్శబ్దమై శూన్యముగానుండును. అని, తాత్పర్యము.

గభస్తిభిరివా ర్కస్య స తు దేశః ప్రకాశతే
విశ్రామ్యద్భి స్తపస్సిద్ధై ర్దేవకల్పై స్స్వయంప్రభైః. ౩౮

టీక॥ సః=ఆ; దేశస్తు = ప్రదేశమో; విశ్రామ్యద్భిః=విశ్రమించుచున్నవారలును; స్వయంప్రభైః= తనంతనె ప్రకాశముగలవారలును; దేవకల్పైః= దేవతలతో సమానులునగు; తపస్సిద్ధైః=తపస్సుచేసిద్ధులయినవారలచేత; అర్కస్య=సూర్యునియొక్క; గభస్తిభిరివ=కిరణములచేతవలె; ప్రకాశతే= వెలుంగుచున్నది.

చంద్రసూర్యుల సంచారము లేకపోయినను, అచటవిశ్రమించుచుండు దేవసమానులు స్వయంప్రకాశులునగుసిద్ధపురుషులదేహప్రకాశముచే నాప్రదేశమంతయు వెలుతురుగలిగియుండును.

అని, తాత్పర్యము.

స ౪౩

తం తు దేశ మతిక్రమ్య శైలోదానామ నిమ్నగా
ఉభయో స్తీరయో స్తస్యాః కీచకానామ వేణవః. ౩౯

టీక॥ తం=ఆ; దేశం= ప్రదేశమును; అతిక్రమ్యతు= దాటినంతనె; శైలోదానామ=శైలోదయను పేరుగల; నిమ్నగా = ఏఱు; అస్తి (అధ్యాహృతము)=కలదు. తస్యాః=ఆశైలోదానదియొక్క; ఉభయోః=రెండయిన; తీరయోః = గట్టులయందును; కీచకానామ=కీచకములను పేరుగల, కీచకమనఁగా గాలిగొట్టునపుడుధ్వనించువెదురు; సంతి(అధ్యాహృతము)=కలవు.

ఆప్రదేశమునతిక్రమించిన పిదప, శైలోదయనునదియున్నది; ఆనది తీరంబుల రెంటియందున గాలిగొట్టునపుడుధ్వనించునట్టి వెదుళ్లుగలవు.

అని, తాత్పర్యము.

తే నయంతి పరం తీరం సిద్ధాన్ ప్రత్యానయంతి చ

టీక॥ తే=ఆవెదుళ్లు; సిద్ధాన్ = సిద్ధులను; పరం= ఆవలిదైన; తీరం= గట్టును; నయంతి = పొందించును. ప్రత్యానయంతిచ = మఱలఁదీసికొని వచ్చును.

ఆరెండు తీరంబులందలి వెదుళ్లు అత్యన్నతంబులయివంగి యొండొంటితోఁ బెనఁగియుండుటవలన సిద్ధులువానిమీఁదుగా నావలిగట్టునకుఁబోవుచ వచ్చుచుందురు. అని, తాత్పర్యము.

ఉత్తరాః కురవ స్తత్ర కృతపుణ్య ప్రతిశ్రయాః. ౪౦

టీక॥ తత్ర = అచట; కృతపుణ్య ప్రతిశ్రయాః= చేయఁబడిన పుణ్యముగలవారలకు నివాసస్థానమయిన ; ఉత్తరాః = ఉత్తరదిశనుండునట్టి; కురవః= కురుదేశము; సంతి (అధ్యాహృతము) = కలదు.

అంతట, పుణ్యవంతులకు నివాసస్థానమయిన యుత్తరకురుదేశమున్నది.

అని, తాత్పర్యము.

తతః కాంచనపద్మాభిః పద్మినీభిః కృతోదకాః
నీలవైడూర్యవర్ణాభి ర్నద్య స్తత్ర సహస్రశః. ౪౧

స ౪౩

టీక ॥ తతః=అందువలన; తత్ర = అచ్చట; కాంచనపద్మాభిః=బంగారుకమలములు గలవియు; నీలవైడూర్యవర్ణాభిః = నీలమణియొక్కయు వైడూర్యరత్నము యొక్కయు వన్నెవంటివన్నెగలవియునగు; పద్మినీభిః=తామరతీఁగలతో; కృతోదకాః = సంబంధించినసీళ్ళుగల; నద్యః=ఏర్లు; సహస్రశః=వేనవేలుగా; సంతి (అధ్యాహృతము)= కలవు.

ఉత్తర కురుదేశము, పుణ్యముచేసినవారలు ఆఫలము ననుభవించుటకై జన్మించుభూమి యవుటంజేసి, యందు, బంగారుకమలంబులతోఁగూడిన నీలవైడూర్యవర్ణంబులయిన తామర తీఁగలచే నలంకృతమయి రమణీయ మయినజలముతో నొప్పుచున్ననదులు, వేనవేలుగాఁగలవు. అని, తాత్పర్యము.

రక్తోత్పలవనై శ్చాత్ర మండితా శ్చ హిరణ్మయైః
తరుణాదిత్యసదృశై ర్భాంతి తత్ర జలాశయాః. ౪౨

టీక॥ తత్ర=ఆ; అత్ర = ఈయుత్తరకురుదేశమునందు;రక్తోత్పలవనైశ్చ= ఎఱ్ఱనికలువల వనములచేతను; హిరణ్మయైశ్చ=బంగారువికారములయిన కలువల వనములచేతను; తరుణాదిత్యసదృశైః = బాలసూర్యునితో సమానములయిన కలువల వనములచేతను; మండితాః = అలంకృతము లయిన; జలాశయాః=కొలంకులు; భాంతి=ప్రకాశించుచున్నవి.

అయ్యుత్తరకురుదేశంబునఁ, గొలంకులు, ఎఱ్ఱగలువలతోను బంగారు కలువలతోను బాలసూర్యవర్ణంబులగుకలువలతోను ఒప్పుచుండును.

అని, తాత్పర్యము.

మహార్హమణిపత్రైశ్చ కాంచనప్రభకేసరైః
నీలోత్పలవనై శ్చిత్రైః స దేశ స్సర్వతో వృతః. ౪౩

టీక॥ సః=ఆ; దేశః= ఉత్తరకురుదేశము; మహార్హమణిపత్రైశ్చ=ఉత్తమములయిన నీలమణులవంటి రేకులుగలవియు; కాంచనప్రభకేసరైః = బంగారముయొక్క కాంతివంటి కాంతిగల కింజల్కములుగలవియు; చిత్రైః = ఆశ్చర్యకరములునగు; నీలోత్పలవనైః = నల్లగలువలవనములచేత; సర్వతః =

స ౪౩

అంతటను; వృతః=చుట్టఁబడినది.

ఆయుత్తరకురుదేశంబుననంతటను, నీలరత్నములవంటి రేకులును బంగారమువంటి కేసరములునుగలిగి యత్యంత సుందరములయిన నల్లగలువలకొలంకులు మెండుగానుండును.

అని, తాత్పర్యము.

నిస్తులాభి శ్చ ముక్తాభి ర్మణిభిశ్చ మహాధనైః
ఉద్భూతపులినా స్తత్ర జాతరూపైశ్చ నిమ్నగాః. ౪౪
సర్వరత్నమయై శ్చిత్రై రవగాఢా నగోత్తమైః
జాతరూపమయై శ్చాపి హుతాశనసమప్రభైః. ౪౫

టీక ॥ తత్ర = అచట; నిమ్నగాః= నదులు; నిస్తులాభిః = గుండ్రములయిన "వర్తులంనిస్తులంవృత్తం" అనియమరము; ముక్తాభిశ్చ = ముత్తెములచేతను; మహాధనైః = అధికమయినవెలగల; మణిభిశ్చ= రత్నములచేతను; జాతరూపైశ్చ = బంగారములచేతను; ఉద్భూతపులినాః = ఉన్నతములయిన యిసుకదిన్నెలుగలవై; సర్వరత్నమయైః = సమస్తమణులును అధికముగాఁగలవియు; చిత్రైః = చిత్రవర్ణములును, సుందరములునగు; నగోత్తమైః = పర్వతశ్రేష్ఠములచేతను; జాతరూపమయైః = బంగారముల అధికముగాఁగలవియు; హుతాశనసమప్రభైః= నిప్పుతోసమానమయినకాంతిగలవియునగు; నగోత్తమైః(అధ్యాహృతము)చాపి = పర్వతశ్రేష్ఠములచేతను; అవగాఢాః= ప్రవేశింపఁబడినవై; భాంతి(అధ్యాహృతము)=ప్రకాశించుచుండును.

ఆయుత్తరకురుదేశంబునందు, నదులందు సుందరములగు ముక్తాఫలంబులునుగొప్పవిలువగలరత్నంబులును బంగారమును పులినములుగానుండును; సమస్త రత్నమయములయిన పర్వతంబులునుఅగ్నివలెవెలుంగుచుండుకాంచనమయపర్వతంబులును,ఆనదులనడుమ నచటచట భాసిల్లుచుండును. అని, తా.

నిత్యపుష్పఫలా స్తత్ర నగాః పత్రరథాకులాః
దివ్యగంధరసస్పర్శా స్సర్వకామాన్ స్రవంతి చ. ౪౬

టీక॥ తత్ర=అచట; నగాః= వృక్షములు; నిత్యపుష్పఫలాః = ఎల్లప్పుడును

బూలును బండ్లును గలవై; పత్రరథాకులాః=పక్షులచే నిండినవై; దివ్యగంధరసస్పర్శాః = శ్రేష్ఠమయిన వాసనయు రుచియు స్పర్శమును గలవై; సర్వకామాన్=సమస్తములయిన యభీష్టములను; స్రవంతి=ఇచ్చుచుండును "చ" అనునది పాదపూరణార్థము.

అచట వృక్షంబులు, ఎల్లప్పుడును ఫలపుష్పంబులు గలిగి పక్షులచే నిండినవై మంచి తావియు మాధుర్యంబును గలిగి సుఖస్పర్శంబులై కోరిన కోరుకులనన్నింటి నొసంగుచుండును.

అని, తాత్పర్యము.

నానాకారాణి వాసాంసి ఫలంత్యన్యే నగోత్తమాః

టీక॥ అన్యే=ఇతరములయిన;నగోత్తమాః=వృక్షశ్రేష్ఠములు; నానాకారాణి=నానావిధములయిన ; వాసాంసి=వస్త్రములను; ఫలంతి=ఇచ్చును.

కొన్నియుత్తమవృక్షంబులు నానావిధములగు వస్త్రంబుల నొసంగును.

అని, తాత్పర్యము.

ముక్తావైడూర్యచిత్రాణి భూషణాని తథైవచ. ౪౭
స్త్రీణాంచా ప్యనురూపాణి పురుషాణాం తథైవచ
సర్వర్తుసుఖసేవ్యాని ఫలంత్యన్యే నగోత్తమాః. ౪౮

టీక॥ తథైవచ=అట్లే; అన్యే=ఇతరములయిన; నగోత్తమాః= వృక్షశ్రేష్ఠములు; సర్వర్తుసుఖసేవ్యాని= సమస్తఋతువులందును సుఖముగా సేవింపఁదగిన; ముక్తావైడూర్య చిత్రాణి=ముత్తెములచేతను వైడూర్యములచేతను చిత్రవర్ణములయిన;స్త్రీణాంచాపి=స్త్రీలకును; తథైవచ=అట్లే; పురుషాణాం = మగవారికిని; అనురూపాణి=తగిన; భూషణాని= సొమ్ములను; ఫలంతి=ఇచ్చును.

మఱికొన్ని వృక్షములు, ముత్తెములును వైడూర్యములును బొదిగియుండుటచే సుందరములును సమస్తర్తువుల్లందును సుఖప్రదంబులునగు భూషణంబులను ఆఁడువారికిఁ దగినట్లుగాను మగవారికిఁదగినట్లుగాను, ఒసంగును.

అని, తాత్పర్యము.

మహార్హాణి విచిత్రాణి హైమా న్యన్యే నగోత్తమాః

శయనాని ప్రసూయంతే చిత్రాస్తరణవంతిచ, ౪౯

టీక॥ అన్యే= ఇతరములయిన; నగోత్తమాః = వృక్షశ్రేష్ఠములు; మహార్హాణి=గొప్పవారికిఁదగినవియు, శ్రేష్ఠములును; విచిత్రాణి= నానావిధములయినవియు; హైమాని = బంగారువికారము లయినవియు; చిత్రాస్తరణవంతిచ=చిత్రవర్ణమయిన పఱపుగలవియునగు; శయనాని=పానుపులను; ప్రసూయంతే= ఇచ్చును.

మఱికొన్నితరువులు, ఉత్తమములు నానావిధములుచిత్రవర్ణములయినపఱపులుగలవియునగు కాంచనశయనీయంబులనొసంగును. అని, తాత్పర్యము.

మనః కాంతాని మాల్యాని ఫలం త్యత్రా పరే ద్రుమాః
పానానిచ మహార్హాణి భక్ష్యాణి వివిధానిచ. ౫౦
స్త్రియశ్చ గుణసంపన్నా రూపయావనలక్షితాః

టీక॥ అత్ర = ఇచట; అపరే= ఇతరములయిన; ద్రుమాః=వృక్షములు; మనఃకాంతాని= మనసునకుఁబ్రియములయిన; మాల్యాని=పుష్పమాలికలను; మహార్హాణి= ఉత్తమములయిన; పానానిచ= త్రాగుగువస్తువులను; వివిధాని = నానావిధములయిన; భక్ష్యాణిచ=పిండివంటలను; గుణసంపన్నాః = సద్గుణములతోఁగూడినవారలును; రూపయావనలక్షితాః= సౌందర్యముతోను యావనముతోను గూడినవారలునగు; స్త్రియశ్చ = స్త్రీలను; ఫలంతి= ఇచ్చును.

అయ్యుత్తర కురుదేశంబుల, మఱికొన్నిభూరుహంబులు, రమణీయములగు పుష్పమాలికలను ఉత్తమములగు పాన ద్రవ్యములను నానావిధములగు భక్ష్యములను గుణవతులును రూపయావనములుగల వారలునగు కాంతలను, ఒసంగును. అని, తాత్పర్యము.

గంధర్వాః కిన్నరా స్సిద్ధా నాగా విద్యాధరా స్తథా. ౫౧
రమంతే సహితా స్తత్ర నారీభి ర్భాస్కరప్రభాః

టీక॥ తత్ర = అచట; భాస్కరప్రభాః = సూర్యునియొక్క కాంతివం

స ౪౩

టకాంతిగల; గంధర్వాః = గంధర్వులును;కిన్నరాః= కిన్నరులును;సిద్ధాః= సిద్ధులును; నాగాః = సర్పములును;తథా=అట్లు; విద్యాధరాః = విద్యాధరులును; నారీభిః = స్త్రీలతోఁ; సహితాః = కూడినవారలయి; రమంతే= క్రీడించుచుందురు.

అచట, గంధర్వులు కిన్నరులు కింపురుషులు సిద్ధులునాగులువిద్యాధరులు సూర్యతేజంబున వెలుంగుచుఁ బ్రియాసమేతులయి, విహరింపుచుందురు.

అని, తాత్పర్యము.

సర్వే సుకృతకర్మాణ స్సర్వే రతిపరాయణాః. ౫౨
సర్వే కామార్థసహితా వసంతి సహయోషితః

టీక॥ సర్వే=అందఱును; సుకృతకర్మాణః= పుణ్యములయిన కార్యములుగలవారలును; సర్వే=అందఱును; రతిపరాయణాః = క్రీడయే ముఖ్యమయిన యాశ్రయముగాఁగలవారలును;సర్వే= అందఱును; కామార్థసహితాః= కామముతోను అర్థముతోనుగూడిన వారలునై; సహయోషితః= స్త్రీలతోఁగూడినవారయి; వసంతి=ఉందురు.

అచట నివసించు జనులందఱు పుణ్యవంతులు క్రీడాసక్తులు కామంబును అర్థంబును సమృద్ధంబుగాఁగలవారలై నిజకాంతలంగూడి యానందించుచుందురు. అని, తాత్పర్యము.

గీతవాదిత్రనిర్ఘోష స్సోత్కృష్టహసితస్వనః. ౫౩
శ్రూయతే సతతం తత్ర సర్వభూతమనోహరః

టీక॥తత్ర= అచట; సోత్కృష్టహసితస్వనః = అధికమయిన నవ్వులయొక్క ధ్వనితోఁగూడిన; గీతవాదిత్రనిర్ఘోషః= పాటలయొక్కయువాద్యములయొక్కయుధ్వని;సర్వభూతమనోహరః= సమస్తభూతములయొక్కయుమనస్సు హరించునదై; సతతం= ఎల్లప్పుడును; శ్రూయతే = వినఁబడుచుండును.

అచట, అధికముగా హాసధ్వనులును గీతవాద్యధ్వనులును, సమస్తభూతంబులకును వీనులకింపుగా నెల్లప్పుడును వినఁబడుచుండును.

అని, తాత్పర్యము.

తత్ర నా మదితః కశ్చి న్నాస్తి కశ్చి దసత్ప్రియః. ౫౪

అహన్యహని వర్ధంతే గుణా స్తత్ర మనోరమాః

టీక ॥ తత్ర=అచట; కశ్చిత్ = ఒకానొకఁడును; అముదితః = సంతోషింపనివాఁడు; నాస్తి=లేఁడు. కశ్చిత్= ఒకానొకఁడును; అసత్ప్రియః = లేనిప్రియురాలుగలవాఁడు, ప్రియురాలు లేనివాఁడనుట; నాస్తి=లేఁడు. తత్ర= అచట; మనోరమాః = మనోహరములగు; గుణాః = గుణములు; అహన్యహని = ప్రతిదినమునందును; వర్ధంతే= వృద్ధిఁబొందుచుండును.

మఱియు నాదేశంబున, సంతోషంబులేనివాఁడుగాని ప్రియురాలులేనివాఁడుగాని యొకానొకఁడునులేఁడు; అచట, మనోహరంబులగు సుఖంబులు దిన దినమునకును వృద్ధిఁబొందుచుండును.

అని, తాత్పర్యము.

సమతిక్రమ్య తం దేశ ముత్తరః పయసాన్నిధిః. ౫౫
"ఉత్తర స్తోయసన్నిధిః" ఇతి పాఠాంతరమ్.

టీక॥ తం=ఆ; దేశం=ఉత్తరకురుదేశమును; సమతిక్రమ్య=దాఁటి, దాఁటినపిమ్మట; ఉత్తరః= ఉత్తరదిక్కునందున్న; పయసాంనిధిః = సముద్రము; పాఠాంతరపక్షమునందు, తోయసన్నిధిః=సముద్రము; అస్తి (అధ్యాహృతము)=కలదు.

అయ్యుత్తరకురుదేశము నతిక్రమించినపిదప, నుత్తరసముద్రమున్నది.

అని, తాత్పర్యము.

తత్ర సోమగిరిర్నామ మధ్యే హేమమయో మహాన్

టీక॥ తత్ర=ఆయుత్తరసముద్రమునందు; మధ్యే = నడుమను; హేమమయః=బంగారువికారమును; మహాన్= గొప్పదియునగు; సోమగిరిర్నామ = సోమపర్వతమనిప్రసిద్ధమయిన పర్వతము; వర్తతే(అధ్యాహృతము) = ఉన్నది.

ఆయుత్తరసముద్రమునడుమ, కాంచనమయంబగు సోమగిరియను నొకమహాపర్వతమున్నది. అని, తాత్పర్యము

ఇంద్రలోకగతా యేచ బ్రహ్మలోకగతాశ్చ యే. ౫౬
దేవా స్తం సమవేక్షంతే గిరిరాజం దివం గతాః

స ౪౩

టీక॥ ఇంద్రలోకగతాశ్చ = విష్ణులోకమునుబొందినవారలును; ఇంద్రశబ్దము, "ఇదిపరమైశ్వర్యే" అను ధాతువునఁ బుట్టినదికావున, యోగముచేపరమేశ్వరుఁడైన విష్ణువునుబోధించును. దేవరాజునందురూఢము. యే (సంతి) = ఎవరుగలరో; బ్రహ్మలోకగతాశ్చ=బ్రహ్మలోకమును బొందినవారలును; యే (సంతి) = ఎవరుగలరో; దివం=స్వర్గమును; గతాః= పొందినవారలు; యే సంతి (అధ్యాహృతము)= ఎవరుగలరో; తే(అధ్యాహృతము) = అట్టి; దేవాః=దేవతలు; తం=ఆ; గిరిరాజం= పర్వతశ్రేష్ఠమును; సమవేక్షంతే=చూతురు.

విష్ణులోకంబున బ్రహ్మలోకంబున స్వర్గంబుననుండు దేవతలు, ఆసోమగిరిని జూడఁగలరే గాని, ఇతరులకు దానిఁ జూచుటయె యసాధ్యము.

అని, తాత్పర్యము.

స తు దేశో విసూర్యోపి తస్య భాసా ప్రకాశతే. ౫౭
సూర్యలక్ష్మ్యాభివిజ్ఞేయ స్తపతే వ వివస్వతా

టీక॥ సః=ఆ; దేశస్తు=ప్రదేశము మాత్రము; విసూర్యోపి= సూర్యుఁడు లేనిదైనను; తస్య=ఆసోమగిరియొక్క; భాసా = ప్రకాశముచేత; సూర్యలక్ష్మ్యా = సూర్యకాంతిచేత;అభివిజ్ఞేయః = తెలియఁదగినప్రదేశము; తపతా=ప్రకాశించుచున్న; వివస్వతేవ= సూర్యునిచేతవలె;ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

ఆ ప్రదేశమున సూర్యసంచారము లేకున్నను, సూర్యసంచారముగల ప్రదేశము సూర్యునిచే వెలుతురు గలిగియుండునట్లు, అమ్మహాపర్వతముయొక్క ప్రకాశముచే వెలుతురుగలిగియుండును. అని, తాత్పర్యము.

భగవానపి విశ్వాత్మా శంభు రేకాదశాత్మకః. ౫౮
బ్రహ్మా వసతి దేవేశో బ్రహ్మర్షి పరివారితః

టీక॥ తత్ర(అధ్యాహృతము)= అచట; విశ్వాత్మా=ప్రపంచమున కాత్మయయిన; భగవానపి = విష్ణువును;బ్రహ్మర్షిపరివారితః (అధ్యాహృతము) = బ్రహ్మర్షులచేఁజుట్టఁబడినవాఁడై; వసతి (అధ్యాహృతము)= ఉన్నాఁడు. ఏకా

దశాత్మకః=పదునొకండు రుద్రులయొ కరుస్వరూపముగల; శంభుః=శివుండును; బ్రహ్మర్షి పరివారితః (అధ్యాహృతము)=బ్రహ్మర్షులచేంజుట్టంబడినవాండై; వసతి (అధ్యాహృతము)=ఉన్నాండు. దేవేశః = దేవతలకుంబ్రభువైన; బ్రహ్మా = బ్రహ్మదేవుండు; బ్రహ్మర్షి పరివారితః = బ్రహ్మర్షులచేం జుట్టంబడినవాండై; వసతి = ఉన్నాండు.

ఆసోమగిరియందు, సర్వాత్మకుండగు విష్ణువును ఏకాదశరుద్రస్వరూపుండగు శివుండును సమస్తదేవనాథుండగు బ్రహ్మదేవుండును, బ్రహ్మర్షులచే సేవింపంబడుచున్నవారలయి వాసము సేయుచుందురు. అని, తాత్పర్యము.

న కథంచన గంతవ్యం కురూణా ముత్తరేణ వః. ౫౯
అన్యేషామపి భూతానాం నాతిక్రామతి వై గతిః

టీక॥ వః=మీకు, మీచేతననుట; కురూణాం = కురుదేశమునకు; ఉత్తరేణ = ఉత్తరముగా; కథంచన = ఎట్లయినను; నగంతవ్యం = పొందంబడరాదు. అన్యేషాం = ఇతరులయిన; భూతానామపి = ప్రాణులయొక్కయు; గతిః = గమనము; నాతిక్రామతి = అతిక్రమింపదు "వై" అనునది పాదపూరణార్థము.

ఆయుత్తరకురుదేశమునకు పరము గా మీరెంతమాత్రము పోవలదు; దైత్యులుమొదలగు విశేష శక్తిగలవారలకును ఆపిమ్మటంబోవుటకు శక్తిలేదు.

అని, తాత్పర్యము.

సహి సోమగిరిర్నామ దేవానామపి దుర్గమః. ౬౦
త మాలోక్య తతః క్షిప్ర ముపావర్తితు మర్హథ

టీక॥ సః=ఆ; సోమగిరిర్నామ = సోమగిరియనిప్రసిద్ధమయిన పర్వతము; దేవానామపి=దేవతలకుంగూడ; దుర్గమోహి = పొందనలవిగానిదిగదా! తం=ఆపర్వతమును; ఆలోక్య = చూచి; తతః=అటుపిమ్మట; క్షిప్రం=శీఘ్రముగా; ఉపావర్తితుం = మరలుటకు; అర్హథ=తగుదురు.

ఆసోమగిరిం బ్రవేశించుటకు దేవతలకుంగూడ సాధ్యముకాదు; కావున, మీరలా పర్వతముం జూచి యంత నటనుండి శీఘ్రముగా మరలిరండు.

అని, తాత్పర్యము.

స ౪౩

ఏతావ ద్వానరై శ్శక్యం గంతుం వానరపుంగవాః. ౬౧
అభాస్కర మమర్యాదం నజానీమ స్తతః పరమ్

టీక॥ వానరపుంగవాః= వానరశ్రేష్ఠులారా! వానరైః=వానరులచేత; ఏతావత్=ఇంతమాత్రము; గంతుం = పొందుటకు; శక్యం=అలవియగును. అభాస్కరం= సూర్యోదులేనిదియు; అమర్యాదం= హద్దులులేనిదియునగు; తతః=అంతకన్న; పరం= ఆపలిప్రదేశమును; నజానీమః=ఎఱుఁగము.

వానరోత్తములారా! ఇంతవఱకు మాత్రమె వానరులకుఁ బోవనలవియగును; ఆపై దేశము సూర్యసంచారము లేమింజేసి యంధకారావృతమయి నగరగ్రామాదిమర్యాదలు లేకుండుటవలన మాకునుం దెలియదు.

అని, తాత్పర్యము.

సర్వ మేత ద్విచేతవ్యం యన్మయా పరికీర్తితమ్. ౬౨
యదన్య దపి నోక్తంచ తత్రాపి క్రియతాం మతిః

టీక॥ మయా=నాచేత; యత్ = ఏది; పరికీర్తితం= చెప్పఁబడినదో; తత్ (అధ్యాహృతము)=అట్టి; ఏతత్= ఇది; సర్వం=అంతయు; విచేతవ్యం = వెదకఁబడవలయును. అన్యచ్చ= ఇతరమును; యత్=ఏది; నోక్తం= చెప్పఁబడలేదో; తత్రాపి= దానియందును; మతిః=తలంపు; క్రియతాం= చేయఁబడుఁగాక.

నేను ఇపుడు చెప్పిన ప్రదేశములం దంతటను జక్కఁగా వెదకుఁడు; మఱియు నావైపున, నేను జెప్పనిప్రదేశము లేమైననుండినయెడ నవటనుగూడ వెదకవలెను. అని, తాత్పర్యము.

తతః కృతం దాశరథే ర్మహ త్ప్రియం
మహత్తరం చాపి తతో మమ ప్రియమ్. ౬౩
కృతం భవిష్య త్యనిలానలోపమా
విదేహజాదర్శనజేన కర్మణా

టీక॥ అనిలానలోపమాః =వాయువుతోను అగ్నితోను బోలికగలవానరు

లారా! తతః=ఆ వెదకినపిమ్మట; విదేహజాదర్శనజేన=సీతాదేవిని జూచుటవలనఁగలిగిన; కర్మణా = కార్యముచేత; దాశరథేః=రామునకు; మహత్=గొప్పదగు; ప్రియం=సంతోషము; కృతం=చేయఁబడినది; భవిష్యతి(అధ్యాహృతము)=కాఁగలదు. మమ = నాకు; తతః=అంతకన్నను; మహత్తరం=అధికముగాగొప్పదైన; ప్రియం= సంతోషము; కృతం=చేయఁబడినది; భవిష్యతి= కాఁగలదు.

వాయుసమానులగునగ్నితుల్యులగు వానరులారా! మీరలు, చక్కఁగా వెదకి, సీతాదేవింజూచి కార్యముసాధించుకొని వత్తురేని, రామునకు మహాసంతోషముచేసినవారలగుదురు; నాకు అంతకన్నను గొప్ప సంతోషముచేసిన వారలగుదురు. అని, తాత్పర్యము.

తతః కృతార్థా స్సహితా స్సబాంధవా
మయార్చితా స్సర్వగుణై ర్మనోరమైః. ౬౪
చరిష్యథోర్వీం ప్రతి శాంతశత్రవ
స్సహప్రియా భూతధరాః ప్లవంగమాః

టీక॥ ప్లవంగమాః = వానరులారా! తతః=అటుపిమ్మట; యూయం(అధ్యాహృతము) = మీరలు; సబాంధవాః=బంధువులతోఁగూడిన వారలయి; మయా=నాచేత; మనోరమైః = మనోహరములగు; సర్వగుణైః=సమస్తగుణములచేతను; అర్చితాః = పూజింపఁబడినవారలయి; కృతార్థాః=చేయఁబడిన ప్రయోజనము గలవారలయి; సహితాః= కూడినవారలయి; శాంతశత్రవః = నశించినశత్రువులుగలవారలయి; సహప్రియాః= ప్రియురాండ్రతోఁగూడిన వారలయి; భూతధరాః = ప్రాణులనుధరించినవారలయి, ప్రాణులనురక్షించువారలయి; ఉర్వీంప్రతి=భూమినిగూర్చి; చరిష్యథ= సంచరింపఁగలరు.

వానరులారా! అంత, మీరలు, బంధుసమేతంబుగా నావలన మనోహరంబులగు సమస్తకామంబులంబొందినవారలయి, కృతార్థులయి, శత్రువులులేనివారలయి పెకరాండ్రనుపోషించుచుఁ ప్రియురాండ్రంగూడి, సుఖంబున భూమియంతయు విహరింపుచుండఁగలరు. అని, సుగ్రీవుండు శతవలి మున్నగు వానరవీరులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, త్రిచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ త్రిచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ

చతుశ్చత్వారింశసర్గప్రారంభః.

స విశేషేణ సుగ్రీవో హనుమత్యర్థ ముక్తవాన్
సహి తస్మి న్హరిశ్రేష్ఠే నిశ్చితార్థో ర్థసాధనే. ౧

టీక॥ సః=ఆ; సుగ్రీవః = సుగ్రీవుఁడు; హనుమతి= హనుమంతునియందు; విశేషేణ=ఆధిక్యముచేత; అర్థం= ప్రయోజనమును; ఉక్తవాన్ = చెప్పినాఁడు. హి=ఏలయనఁగా; సః = ఆ సుగ్రీవుఁడు; అర్థసాధనే = కార్యము సాధించుటవిషయమయి; తస్మిన్ =ఆ; హరిశ్రేష్ఠే= వానరోత్తముఁడగుహనుమంతునియందు; నిశ్చితార్థః=నిశ్చయింపఁబడిన యభిప్రాయము గలవాఁడు.

ఆసుగ్రీవుఁడు హనుమంతునివిషయమయి యధికగౌరవముగాఁ జెప్పెను; ఏలయనఁగా, హనుమంతుఁడు తప్పక కార్యమును సాధింపఁగలఁడని సుగ్రీవుండు నిశ్చయించియుండెను.

అని, తాత్పర్యము.

అబ్రవీచ్చ హనూమంతం విక్రాంత మనిలాత్మజమ్
సుగ్రీవః పరమప్రీతః ప్రభు స్సర్వ వనౌకసామ్. ౨

టీక॥ సర్వవనౌకసాం=సమస్తవానరులకును; ప్రభుః= నాథుఁడగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; పరమప్రీతః= మిక్కిలియుసంతోషించినవాఁడై; విక్రాంతం= పరాక్రమముగలవాఁడును; అనిలాత్మజం=వాయువుయొక్క కొడుకు

నగు; హనూమంతం = హనుమంతుని గూర్చి; అబ్రవీచ్చ=పలికెను.

సమస్త వానరులకును నాథుండగు సుగ్రీవుండు, హనుమంతుని విషయమై పరమ సంతోషంబునొంది, పరాక్రమవంతుండగు వాయుపుత్త్రుని హనుమంతుంజూచి యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

న భూమౌ నాంతరిక్షేవా నాంబరే నామరాలయే
నాప్సువా గతిసంగం తే పశ్యామి హరిపుంగవ. ౩

టీక॥ హరిపుంగవ = వానరశ్రేష్ఠుండా! తే=నీయొక్క; గతిసంగం= గమనయొక్క విలంబమును; భూమౌ= నేలయందు; నపశ్యామి= చూడను. అంతరిక్షేవా=పక్షులు మేఘములు సంచరించునట్టి యాకాశమునందును; న(పశ్యామి)=చూడను. అంబరే= సిద్ధవిద్యాధరాదులు సంచరించునట్టి యంతకుపై యాకాశమునందు; న(పశ్యామి)=చూడను. అమరాలయే=స్వర్గమునందు; న(పశ్యామి)చూడను. అప్సువా=జలములయందుఁగాని; న(పశ్యామి)= చూడకున్నాను.

వానరశ్రేష్ఠుఁడా! భూమియందుఁగాని పక్షులు మేఘములుసంచరించు నాకాశమునందుఁగాని సిద్ధవిద్యాధరాదులుసంచరించునట్టిపైయాకాశమునందుఁగాని స్వర్గమునందుఁగానిజలములయందుఁగాని, నీ వెదురులేక సంచరింపఁగలవు. అని, తాత్పర్యము.

సాసురా స్సహగంధర్వా స్సనాగనరదేవతాః
విదితా స్సర్వలోకా స్తే ససాగరధరాధరాః. ౪

టీక॥ సాసురాః = అసురులతోఁగూడినవియు; సహగంధర్వాః = గంధర్వులతోఁగూడినవియు; సనాగనరదేవతాః = సర్పములతోను మనుష్యులతోను దేవతలతోనుగూడినవియు; ససాగరధరాధరాః = సముద్రములతోను బర్వతములతోనుగూడినవియునగు; సర్వలోకాః = సమస్తలోకములును; తే=నీకు; విదితాః = తెలియఁబడినవి.

అసురులుండు లోకంబును గంధర్వలోకంబును నాగలోకంబును మనుష్యలోకంబును దేవలోకంబును సముద్రపర్వత సహితంబుగా సమస్తలోకంబులును నీవెఱుంగుదువు. అని, తా.

గతి ర్వేగశ్చ తేజశ్చ లాఘవంచ మహాకపే
పితు స్తే సదృశం వీర మారుతస్య మహౌజసః. ౫

టీక॥ వీర = పరాక్రమవంతుఁడవగు; మహాకపే = గొప్పవానరుఁడా! తే=నీయొక్క; గతిః=గమనమును; వేగశ్చ=వేగమును; తేజశ్చ= పరాక్రమమును; లాఘవంచ=శీఘ్రముగాఁజేయుటయు; సర్వం (అధ్యాహృతము)=సమస్తమును; పితుః=తండ్రియయిన; మహౌజసః= అధికమయినపరాక్రమముగల; మారుతస్య=వాయువునకు; సదృశం=సమానము.

వీరుఁడా! ఎదురులేని గమనమునందును వేగమునందును బరాక్రమమునందును లాఘవమునందును నీవు మహాప్రభావుండగు నీతండ్రి వాయుదేవునకుసమానుఁడవు. అని, తాత్పర్యము.

తేజసా వాపి తే భూతం సమం భువి న విద్యతే
త ద్యథా లభ్యతే సీతా త త్త్వమే వోపపాదయ. ౬

టీక॥ భువి=భూలోకమందు; తే=నీకు; తేజసా = పరాక్రమముచేత; సమం=సమానమయిన; భూతంవాపి=జంతువుగూడ; నవిద్యతే=లేదు. తత్=ఆకారణమువలన; యథా=ఎట్లు; సీతా=సీతాదేవి; లభ్యతే=పొందఁబడునో; తథా(అధ్యాహృతము)=అట్లు; తత్=ఆకార్యమును; త్వమేవ=నీవే; ఉపపాదయ=నెఱవేర్పుము.

భూమియందుఁ బరాక్రమంబున నీకన్ననధికమయినభూతము లేనేలేదుగదా! నీకు సమానమయినదియు లేదు; కావున, సీతాదేవిలభించునట్లు, నీవేతగినప్రయత్నముచేసి కార్యము నెఱవేర్పవలెను. అని, తాత్పర్యము.

త్వయ్యేవ హనుమ న్నస్తి బలం బుద్ధిః పరాక్రమః
దేశకాలానువృత్తి శ్చ నయశ్చ నయపండిత. ౭

టీక॥ నయపండిత=నీతియందుఁబండితుఁడవగు; హనుమన్ = హనుమంతుఁడా! బలం=శరీరదార్ఢ్యమును; బుద్ధిః=ప్రజ్ఞయు; పరాక్రమః= వీర్యము

ను; దేశకాలానువృత్తిశ్చ=దేశకాలము లవెంబడించుటయు; నయశ్చ=నీతియు; త్వయ్యేవ=నీయందె; అస్తి (సంతి)= కలవు.

సమస్తనీతులును జక్కఁగాఁ దెలిసి నట్టిహనుమంతుఁడా! బలము బుద్ధి పరాక్రమము దేశకాలంబులననువర్తించుట నీతి యివి నీయందుండునట్లు మఱియెవరియందును లేవు. అని, సుగ్రీవుండు హనుమంతునితోఁ బలికెను. అని, తాత్పర్యము.

తతః కార్యసమాసంగ మవగమ్య హనూమతి
విదిత్వా హనుమంతం చ చింతయామాస రాఘవః. ౮

టీక॥ రాఘవః=రాముఁడు; తతః= అందువలన; హనూమతి = హనుమంతునియందు; కార్యసమాసంగం= కార్యముయొక్క ఉంచుటను; అవగమ్య= తెలిసి; హనుమంతం= హనుమంతుని; విదిత్వాచ= తెలిసియు; చింతయామాస=ఆలోచించెను.

రాముండు, సుగ్రీవుఁడు హనుమంతునితో నాడు వచనములవలన సుగ్రీవుండు కార్యభారమంతయు హనుమంతునిపై నుంచుట నెఱింగి, హనుమంతుండు కార్యసాధకుండని తెలిసి, యిట్లనియాలోచించెను. అని, తాత్పర్యము.

సర్వథా నిశ్చితార్థో యం హనూమతి హరీశ్వరః
నిశ్చితార్థకర శ్చాపి హనుమా న్కార్యసాధనే. ౯

టీక॥ అయం=ఈ; హరీశ్వరః=వానరులకు రాజయిన సుగ్రీవుఁడు; సర్వథా= అన్నివిధములను; హనూమతి= హనుమంతునియందు; నిశ్చితార్థః= నిశ్చయింపఁబడిన సిద్ధిగలవాఁడు. హనుమాంశ్చాపి = హనుమంతుండును ; కార్యసాధనే= కార్యముసాధించుటవిషయమయి; నిశ్చితార్థకరః=నిశ్చయింపఁబడిన సిద్ధిగలవానిఁగా (సుగ్రీవుని) చేయువాఁడు.

వానరరాజయిన యీసుగ్రీవుండు, హనుమంతుండు తప్పక కార్యమును సాధించునని నిశ్చయించియున్నాఁడు; హనుమంతుండును, దనవిషయమయి సుగ్రీవునికంతటి నమ్మకముగలుగఁజేసినవాఁడుగానున్నాఁడు. అని, తాత్పర్యము.

స ౪౪

త దేవం ప్రస్థితస్యాస్య పరిజ్ఞాతస్య కర్మభిః
భర్త్రా పరిగృహీతస్య ధ్రువః కార్యఫలోదయః. ౧౦

టీక॥ తత్=అందువలన; ఏవం=ఇట్లు; కర్మభిః=కార్యములచేత; పరిజ్ఞాతస్య = తెలియఁబడినవాఁడును; భర్త్రా=స్వామిచేత; పరిగృహీతస్య = స్వీకరింపఁబడినవాఁడునగు;ప్రస్థితస్య=బయలుదేఱిన; అస్య = ఇతనికి; కార్యఫలోదయః = కార్యముయొక్క ఫలసిద్ధి; ధ్రువః=నిశ్చితము.

అందువలన, నీహనుమంతుండుము న్నెన్నెకుడు కార్యములను సాధించుటవలన నితనిసామర్థ్యముసుగ్రీవునకుఁ దెలిసియున్నది; మఱియు సుగ్రీవుండితనినధికముగా గౌరవించుచున్నాఁడు, కావున, నితండుపోయిన కార్యము తప్పకసిద్ధించును. అని, రాముఁడాలోచించెను.

అని, తాత్పర్యము.

తం సమీక్ష్య మహాతేజా వ్యవసాయోత్తరం హరిమ్
కృతార్థ ఇవ సంవృత్తః ప్రహృష్టేంద్రియ మానసః. ౧౧

టీక॥ మహాతేజాః = అధికమయిన పరాక్రమముగలరాముఁడు; వ్యవసాయోత్తరం = ప్రయత్నముచే శ్రేష్ఠుఁడగు; తం=ఆ; హరిం= హనుమంతుని; సమీక్ష్య=చూచి; ప్రహృష్టేంద్రియమానసః=సంతోషించినయింద్రియములును మనస్సునుగలవాఁడై; కృతార్థ ఇవ=చేయఁబడిన ప్రయోజనముగలవాఁడువలె; సంవృత్తః=అయ్యెను.

మహాపరాక్రమశాలియగురాముండు, కార్యసాధన సమర్థుండగు నాహనుమంతుంజూచి, పరమ సంతుష్టుండై తన్నుఁగృతార్థునిఁగాఁ దలంచెను.

అని, తాత్పర్యము.

దదౌ తస్య తతః ప్రీత స్స్వనామాంకోపశోభితమ్
అంగుళీయ మభిజ్ఞానం రాజపుత్త్ర్యాః పరంతపః. ౧౨

టీక॥ తతః=అంత; పరంతపః=శత్రువులఁదపింపఁజేయునట్టి రాముండు; ప్రీతః=సంతోషించినవాఁడై; రాజపుత్త్ర్యాః = రాచకొమార్తెయయినసీతకు; అభిజ్ఞానం = గుఱుతైన; స్వనామాంకోపశోభితం = తనపేరుయొక్క చిహ్నముచేఁబ్రకాశించుచున్న; అంగుళీయం= ఉంగరమును; తస్య=ఆహను

మంతునకు; దదౌ=ఇచ్చెను.

అంత, శత్రువులఁ దపింపఁజేయునట్టిరాముండు, సంతుష్టుండై, సీతాదేవికి గుఱుతు తెలియుటకై తనపేరు చెక్కఁబడియున్న తన ముద్దుటుంగరమును హనుమంతున కొసంగెను.

అని, తాత్పర్యము.

అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా
మత్సకాశా దనుప్రాప్త మనుద్విగ్నానుపశ్యతి. ౧౩

టీక॥ హరిశ్రేష్ఠ=వానరోత్తముఁడా! జనకాత్మజా = జనకమహారాజు కూఁతురైనసీత; అనేన=ఈ; చిహ్నేన=గుఱుతుచేత; అనుద్విగ్నా= భయములేనిదై; త్వాం = నిన్ను; మత్సకాశాత్= నాసమీపమునుండి; అనుప్రాప్తం=వచ్చినవానిఁగా; అనుపశ్యతి = తలంచును.

వానరోత్తముఁడా! ఈ యంగుళీయకమునుజూచి, సీతాదేవి, నిన్నుఁజూచి సంశయముగాని భయముగాని పొందక, నీవునాయొద్దనుండివచ్చినవాఁడవని దృఢముగానమ్మును.

అని, తాత్పర్యము.

వ్యవసాయశ్చ తే వీర సత్త్వయుక్తశ్చ విక్రమః
సుగ్రీవస్యచ సందేశ స్సిద్ధిం కథయతీవ మే. ౧౪

టీక॥ వీర = పరాక్రమవంతుఁడా! తే=నీయొక్క; వ్యవసాయశ్చ=ఉత్సాహమును; సత్త్వయుక్తః=బలముతోఁగూడిన; విక్రమశ్చ= పరాక్రమంబును; సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క; సందేశశ్చ=చెప్పినసమాచారమును; మే=నాకు; సిద్ధిం = కార్యసిద్ధిని; కథయతీవ (కథయంతీవ)=చెప్పునట్లున్నవి.

పరాక్రమవంతుఁడవగు హనుమంతుఁడా! నీయుత్సాహంబును బలంబును బరాక్రమంబును సుగ్రీవుండు నీతోఁజెప్పిన సమాచారంబునుజూడఁగాఁ, గార్యసిద్ధి తప్పకయున్నదని నాకుఁ దోఁచుచున్నది. అని, రాముండుహనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

స తం గృహ్య హరిశ్రేష్ఠః స్థాప్య మూర్ధ్ని కృతాంజలిః

వందిత్వా చరణౌ చైవ ప్రస్థితః ప్లవగోత్తమః. ౧౫

టీక॥ హరిశ్రేష్ఠః=వానరోత్తముఁడగు; సః=ఆహనుమంతుఁడు; తం=ఆయుంగరమును; గృహ్య(గృహీత్వా)=గ్రహించి; మూర్ధ్ని=శిరస్సునందు; స్థాప్య (స్థాపయిత్వా)= ఉంచి; కృతాంజలిః= చేయఁబడినచేమోడ్పుగలవాఁడై; చరణౌ=పాదములను; వందిత్వాచైవ=నమస్కరించియు; ప్లవగోత్తమః = వానరశ్రేష్ఠుఁడగుహనుమంతుఁడు; ప్రస్థితః=బయలుదేఱెను.

వానరోత్తముఁడగు నా హనుమంతుండు, అయ్యంగుళీయకంబుఁదీసి శిరస్సుననుంచుకొని, చేమోడ్పుగీలించి రామపాదములకుఁ బ్రణమిల్లి, యంతబయలుదేఱెను. అని, తాత్పర్యము.

స తత్ప్రకర్షన్ హరీణాం బలం మహ
ద్బభూవ వీరః పవనాత్మజః కపిః
గతాంబుదే వ్యోమ్ని విశుద్ధమండల
శ్శశీవ నక్షత్రగణోపశోభితః. ౧౬

టీక॥ వీరః=పరాక్రమశాలియు; పవనాత్మజః = వాయుపుత్త్రుండనగు; సః=ఆ; కపిః=హనుమంతుఁడు; మహత్=గొప్పదగు; తత్=ఆ; హరీణాం=(హరీణాం)= వానరులయొక్క; బలం=సేనను; ప్రకర్షన్= ఆకర్షించుచు; గతాంబుదే= పోయినమేఘములుగల; వ్యోమ్ని=ఆకాశమునందు; విశుద్ధమండలః=పరిశుద్ధమయినమండలముగలవాఁడును; నక్షత్రగణోపశోభితః= నక్షత్రములసమూహముచేఁ బ్రకాశించుచున్నవాఁడునగు; శశీవ=చంద్రుఁడువలె; బభూవ=ఉండెను.

పరాక్రమవంతుండును వాయుదేవునికుమారుండునగు నా హనుమంతుండు, గొప్పదగు నవ్వానరసేనచేఁ బరివేష్టింపఁ బడినవాఁడై, మేఘములులేని యాకాశమునందు స్వచ్ఛమయిన మండలముగలిగి నక్షత్ర సమూహముచేఁ బరివృతుండగు చంద్రునిభంగిఁ బ్రకాశించెను. అని, తాత్పర్యము.

అతిబల బలమాశ్రిత స్తవాహం
హరివరవిక్రమ విక్రమై రనల్పైః

పవనసుత యథా ధిగమ్యతే సా
జనకసుతా హనుమన్ తథా కురుష్వ. ౧౭

టీక॥ అతిబల=అధికమయినబలము గలవాఁడా! అహం=నేను;తవ=నీయొక్క;బలం=బలమును; ఆశ్రితః= ఆశ్రయించినాను. హరివరవిక్రమ=సింహశ్రేష్ఠముయొక్క పరాక్రమమువంటి పరాక్రమముగల; పవనసుత=వాయువు కొడుకైన; హనుమన్=హనుమంతుఁడా! సా=ఆ; జనకసుతా=జనకమహారాజుకొమార్తెయగు సీతాదేవి; యథా=ఎట్లు; అధిగమ్యతే= పొందఁబడునో; తథా=అట్లు;అనల్పైః=తక్కువ కాని; విక్రమైః= పరాక్రమములచేత; కురుష్వ=చేయుము.

మహాబలుఁడవు, సింహమునకుంబోలె మహాపరాక్రమంబుగలవాఁడవు వాయుకుమారుండవగు హనుమంతుఁడా! నేను నీబలముపై భారము వేసియున్నాను; నీదుపరాక్రమంబుకొలఁదిని ప్రయత్నముచేసి సీతాదేవిలభించునట్లు గావింపవలెను. అని, రాముండు మఱలఁ, బయనమగుచున్న హనుమంతునితోఁజెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే,చతుశ్చత్వారింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ,గిష్కింధాకాండ చతుశ్చత్వారింశసర్గటీక, ముగిసినది.

శ్రీ

పంచచత్వారింశసర్గప్రారంభః.

సర్వాంశ్చాహూయ సుగ్రీవః ప్లవగాన్ ప్లవగర్షభః
సమస్తానబ్రవీద్భూయో రామకార్యార్థ సిద్ధయే. ౧

టీక॥ ప్లవగర్షభః = వానరోత్తముఁడగు; సుగ్రీవః=సుగ్రీవుఁడు; ప్లవగాన్=వానరులను; సర్వాంశ్చ= అందఱను; ఆహూయ=పిలిచి; సమః=సమానుఁడై, పక్షపాతములేనివాఁడైయనుట; రామకార్యార్థసిద్ధయే= రామునికార్యము అను ప్రయోజనముయొక్క నెఱవేఱుటకై; భూయః = మఱల; తాన్=వారలనుగూర్చి; అబ్రవీత్=పలికెను.

వానరోత్తముఁడగుసుగ్రీవుండు, అవ్వానరులనందఱంబిలిచి, రామకార్యంబుసిద్ధించుపొంటె, మఱల వారలంజూచి, నిష్పక్షపాతముగానిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

ఏవ మేత ద్విచేతవ్యం య న్మయా పరికీర్తితమ్

టీక॥ మయా=నాచేత; యత్=ఏది; పరికీర్తితం = చెప్పఁబడినదో; ఏతత్=ఇది; ఏవం=ఇట్లు; విచేతవ్యం= వెదకఁబడవలెను.

నేను, ఎవరెవరికి ఏయేదిక్కునందు ఏయేభూభాగములను వెదకవలసినట్లుగాఁజెప్పితినో, వారువారుఅన్యోన్యస్థలంబులందప్పక చక్కఁగా నేను జెప్పినవిధంబున వెదకవలెను. అని, తాత్పర్యము.

తదుగ్రశాసనం భర్తుర్విజ్ఞాయ హరిపుంగవాః. ౨
శలభాఇవ సంఛాద్య మేదినీం సంప్రతస్థిరే

టీక ॥ హరిపుంగవాః = వానరోత్తములు; తత్=ఆ; భర్తుః = రాజుయొక్క; ఉగ్రశాసనం = భయంకరమయినయాజ్ఞను; విజ్ఞాయ=తెలిసి; శలభాఇవ = మిడుతలువలె; మేదినీం= భూమిని; సంఛాద్య= కప్పి; సంప్రతస్థిరే = తరలిరి.

ఆవ్వానరవీరులు సుగ్రీవుని తీక్ష్ణమ

యిన యాజ్ఞనుపేని, యంతనందటను మిషుతలువలెలెక్కకుమీటి భూమియం తయు నాచ్ఛాదించి నడవసాగెను.

అని, తాత్పర్యము.

రామః ప్రస్రవణే తస్మి న్న్యవస త్సహలక్ష్మణః. ౩
ప్రతీక్షమాణ స్తం మాసం సీతాభ్యధిగమే కృతమ్

టీక ॥ రామః = రాముఁడు; సీతాభ్యధిగమే = సీతాలాభమునిమిత్తమయి; కృతం = చేయఁబడిన; తం = ఆ; మాసం = నెలను; ప్రతీక్షమాణః = ఎదురుచూచుచు; సహలక్ష్మణః = లక్ష్మణునితోఁగూడినవాఁడై; తస్మిన్ = ఆ; ప్రస్రవణే = ప్రస్రవణపర్వతమందు; న్యవసత్ = ఉండెను.

రాముండు, వానరులు సీతంజూచి వచ్చుటకై యవధిగా నేర్పఱుపఁబడిన యామాసము ఎప్పుడెప్పుడుకడచునో యని నిరీక్షించుచు, లక్ష్మణసమేతంబుగా నాప్రస్రవణగిరియందే నివసించియుండెను. అని, తాత్పర్యము.

ఉత్తరాంతు దిశం రమ్యాం గిరిరాజసమావృతామ్. ౪
ప్రతస్థే సహసా వీరో హరి శ్శతవలి స్తదా

టీక॥ తదా = అప్పుడు; వీరః = పరాక్రమశాలియగు; శతవలిం = శతవలియను; హరిస్తు = వానరుండుమాత్రము; గిరిరాజసమావృతాం = హిమవత్పర్వతముచేఁగప్పఁబడిన; రమ్యాం = సుందరమయిన; ఉత్తరాందిశం = ఉత్తరపుదిక్కునుగూర్చి; సహసా = శీఘ్రమున; ప్రతస్థే = తరలెను, పోవ నుద్యుక్తుఁడయ్యెననుట.

అప్పుడు, పరాక్రమవంతుండగు శతవలి, హిమవత్పర్వతముచే నధిష్ఠితమయి రమణీయమయిన యుత్తర దిశనుగూర్చిపోవనుద్యుక్తుఁడయ్యె.

అని, తాత్పర్యము.

పూర్వాం దిశం ప్రతియయౌ వినతో హరియూథపః. ౫

టీక॥ హరియూథపః = వానరసమూహములఁబాలించునట్టి; వినతః = వినతుఁడు; పూర్వాందిశంప్రతి = తూర్పుదిక్కునుగూర్చి; యయౌ = పోయెను, పోవనుద్యుక్తుఁడయ్యెను.

వానరయూథపతియగు వినతుండు

స ౪౫

తూర్పుదిశకుఁబోవ సన్నద్ధుఁడయ్యెను. అని, తాత్పర్యము.

తారాంగదాదిసహితః ప్లవగో మారుతాత్మజః
అగస్త్యచరితా మాశాం దక్షిణాం హరియూథపః. ౬

టీక॥ మారుతాత్మజః= వాయుదేవునికుమారుఁడయిన; హరియూథపః= వానరసమూహమునుపాలించునట్టి; ప్లవగః = వానరుఁడైనహనుమంతుఁడు; తారాంగదాదిసహితః = తారుఁడు అంగదుఁడు మొదలయిన వారలతోఁ గూడినవాఁడై; అగస్త్యచరితాం=అగస్త్యునిచేఁబొందఁబడిన; దక్షిణాం, ఆశాం=దక్షిణదిక్కును; యయౌ=(అధ్యాహృతము)=పోయెను, పోవనుద్యుక్తుఁడయ్యెను.

వానరయూథనాథుండు వాయుకుమారుండునగు హనుమంతుండు, తారుండంగదుండుమున్నగు వానరవీరులంగూడి, యగస్త్యమహర్షి సేవితం బగు దక్షిణదిశకుఁబోవ నుద్యుక్తుఁడయ్యెను. అని, తాత్పర్యము.

పశ్చిమాంతు భృశం ఘోరాం సుషేణః ప్లవగేశ్వరః
ప్రతస్థే హరిశార్దూలో దిశం వరుణపాలితామ్. ౭

టీక॥ ప్లవగేశ్వరః= వానరనాథుఁడును; హరిశార్దూలః= వానరశ్రేష్ఠుఁడునగు; సుషేణః= సుషేణుఁడు; భృశం=మిక్కిలియు; ఘోరాం= భయంకరమ్మును; వరుణపాలితాం=వరుణునిచేరక్షింపఁబడినదియునగు; పశ్చిమాం దిశం = పడమటిదిక్కునుగూర్చి; ప్రతస్థే=తరలెను.

వానరోత్తముఁడగు సుషేణుండు, మహాభయంకరంబును వరుణునిచేఁబాలితంబునగు పడమటిదిశకుఁబోవనుద్యుక్తుఁడయ్యెను. అని, తాత్పర్యము.

తత స్సర్వా దిశో రాజా చోదయిత్వా యథాతథమ్
కపిసేనాపతీ న్ముఖ్యా న్ముమోద సుఖిత స్సుఖమ్. ౮

టీక॥ సుఖితః = సుఖమునొందిన; రాజా = వానరరాజయినసుగ్రీవుఁడు; సర్వాః=సమస్తములయిన; దిశః= దిక్కులనుగూర్చి; ముఖ్యాన్ = ఉత్తము

లగు; కపిసేనాపతీన్=వానరసేనానాయకులను; యథాతథం = యథావిధిగా; చోదయిత్వా=పంపి; తతః=అంత; సుఖం = సుఖముగా; ముమోద= సంతోషించెను.

పూర్వము రాజ్యలాభంబున సుఖితుండయిన సుగ్రీవుండు, ఉత్తములగు వానరసేనానాయకుల సమస్తదిశలకుం బంపి, రామకార్యంబునుగుడ నెఱవేర్చినవాఁడగుటంజేసి, మునుపటికన్నను అధికసుఖమునొంది యానందించెను. అని, తాత్పర్యము.

ఏవం సంచోదితా స్సర్వే రాజ్ఞా వానరయూధపాః
స్వాంస్వాం దిశ మభిప్రేత్య త్వరితా స్సంప్రతస్థిరే. ౯
ఆనయిష్యామహే సీతాం హనిష్యామశ్చ రావణమ్

టీక ॥ వానరయూధపాః = వానరసమూహమును బాలించునట్టి వారలు; సర్వే = అందఱును; రాజ్ఞా=సుగ్రీవునిచేత; ఏవం = ఇట్లు; సంచోదితాః = ఆజ్ఞాపింపఁబడినవారలై; త్వరితాః=వేగిరపడినవారలయి; "సీతాం= సీతాదేవిని; ఆనయిష్యామహే= తేఁగలము; రావణం = రావణుని; హనిష్యామశ్చ = వధింపనుగలము" ఇతివదంతః (అధ్యాహృతము) = అనిచెప్పచు; స్వాంస్వాం=తమతమదైన; దిశం= దిక్కును; అభిప్రేత్య= కూర్చి; సంప్రతస్థిరే = తరలిరి

అవ్వానరవీరులందఱు సుగ్రీవునాజ్ఞను శిరసావహించి, "రావణునివధించిసీతాదేవిం దెత్తుము" అనియుత్సాహంబునంబలుకుచు, తమతమదిక్కులకుఁ,ద్వరితంబుగాఁబోయిరి. అని, తాత్పర్యము.

నదంత శ్చోన్నదంతశ్చ గర్జంతశ్చ ప్లవంగమాః. ౧౦
క్ష్వేళంతో ధావమానాశ్చ వినదంతో మహాబలాః

టీక॥ మహాబలాః=అధికమయినబలముగల; ప్లవంగమాః=వానరులు; నదంతః=అఱచుచు; ఉన్నదంతశ్చ=గట్టిగానఱచుచు; గర్జంతశ్చ=తమ్ముఁబొగడుకొనుచును; క్ష్వేళంతః= సింహనాదంబులుసేయుచు; ధావమానాశ్చ=పరుగెత్తుచును; వినదంతః=వికృతంబుగానఱచుచు; సంప్రతస్థిరే (అధ్యాహృతము)=తరలిరి.

మహాబలశాలులగు నవ్వానర వీరు

లు, నాదంబులుసేయుచు మఱియు నుత్సాహంబులో నుచ్చైర్నాదంబులుగా వింపుగు వీరంబులుపలుకుచు సింహనాదంబులుచేయుచుఁ బరుగెత్తుదు వికృతంబుగా నటించుచుఁబోయిరి.

అని, తాత్పర్యము.

అహ మేకో హనిష్యామి ప్రాప్తం రాఘవ మాహవే. ౧౧

టీక॥ అహం=నేను ; ఏకః=ఒకఁడను; ఆహవే = యుద్ధంబునందు; ప్రాప్తం=వచ్చిన; రావణం = రావణుని; హనిష్యామి=వధించెదను.

రావణుఁడు యుద్ధమునకు వచ్చినయెడ, నేనొకఁడనె యతని వధించివచ్చెదను. అని, యొకఁడు పలికెను.

అని, తాత్పర్యము.

తతశ్చో న్మథ్య సహసా హరిష్యే జనకాత్మజామ్
వేపమానాం శ్రమే ణాద్య భవద్భిః స్థీయతా మితి. ౧౨

టీక॥ తతశ్చ=అటనుండియు; ఉన్మథ్య=(రావణుని) వధించి; సహసా=శీఘ్రింబున; శ్రమేణ=అలసటచేత; వేపమానాం = వడంకుచున్న ; జనకాత్మజాం=సీతను; అద్య= ఇపుడు; ఆహరిష్యే=తెచ్చెదను. భవద్భిః= మీచేత; స్థీయతాం= నిలుచుటయగుఁగాక. ఇతి= అని; ఏకః ఉవాచ (అధ్యాహృతము)=ఒకఁడుపలికెను.

నేను, రావణునివధించి, శ్రమంబున గడగడ వడంకుచున్న సీతాదేవిని, ఇప్పుడె శీఘ్రింబున నిచటికిఁదెచ్చెదను; మీరలిచటనె నిలువుండని మఱియొకఁడు వచించెను. అని, తాత్పర్యము.

ఏకఏవా హరిష్యామి పాతాళాదపి జానకీమ్

టీక॥ అహం (అధ్యాహృతము)=నేను; ఏకఏవ=ఒకఁడనె; పాతాళాదపి=పాతాళమునుండియయినను; జానకీం=సీతను;ఆహరిష్యామి=తెచ్చెను.

సీతాదేవి పాతాళంబున నున్నను నేనొకఁడె పోయితెచ్చెదను. అనిమఱియొకఁడుచెప్పెను. అని, తాత్పర్యము.

విధమిష్యా మ్యహం వృక్షాన్ పాతయిష్యా మ్యహం గిరీన్. ౧౩

ధరణీం దారయిష్యామి క్షోభయిష్యామి సాగరాన్

టీక॥ అహం=నేను; [illegible]=రె ట్లను; [illegible]= [illegible]. అ హం=నేను; [illegible] = [illegible]లను; పాతయిష్యామి = [illegible]. ధ రణీం = భూమిని. దారయిష్యామి= చీల్చెదను. సాగరాన్ = సముద్రము లను; క్షోభయిష్యామి = [illegible].

[illegible] భూమిని బగుల్చను; నేను [illegible] లంగెదను. అని [illegible] పలికెను. అని, తాత్పర్యము.

అహం యోజనసంఖ్యాయాః ప్లవితా నాత్ర సంశయః ౧౪

టీక॥ అహం = నేను; యోజనసం ఖ్యాయాః= యోజనప్రమాణభూమికి; ప్లవితా=ఎగురువాఁడను. అత్ర= ఇం దు; సంశయః=సందేహము; న=లేదు.

నేను ఒకయోజనముగూడను ఎగి రి దాఁటఁగలను; అందు సంశయములే దు. అనియొకఁడు పలికెను.

అని, తాత్పర్యము.

శతం యోజనసంఖ్యాయాశ్శతం సమధికం హ్యహమ్

టీక॥ అహం (అధ్యాహృతము) = నేను; యోజనసంఖ్యాయాః= యోజన ప్రమాణముయొక్క; శతం= నూఱు, నూఱుయోజనము లనుట; ప్లవితా (అ ధ్యాహృతము) = ఎగురువాఁడను. అ హం=నేను; సమధికం= మిక్కిలియు నధికమయిన; శతం = నూఱు, నూఱు యోజనముల కన్న నధికమనుట; ప్లవి తా(అధ్యాహృతము)హి=ఎగురువాఁ డనుగదా!

"నేను నూఱుయోజనములదూరము ఎగురుదును" అని యొకఁడును, "నేను నూఱుయోజనముల కన్న నధికముగా దాఁటుదును" అని మఱియొకఁడును ప లిచిరి. అని, తాత్పర్యము.

భూతలే సాగరే వాపి శైలేషు చ వనేషు చ. ౧౫

పాతాలస్యాపి వా మధ్యే న మమాచ్ఛిద్యతే గతిః

టీక॥ భూతలే=భూమియందును; సాగరేవాపి= సముద్రమునందును; శైలేషుచ = పర్వతములందును; వనేషుచ=అడవులయందును; పాతాళస్య = పాతాళలోకముయొక్క; మధ్యేవాపి= నడుమునందును; మమ= నాయొక్క; గతి=గమనము; నాచ్ఛిద్యతే= అడ్డగింపబడదు.

భూమియందుఁగాని సముద్రమునందుఁగాని పర్వతంబులంగాని వనంబులంగాని పాతాళమధ్యంబునంగాని నేనడ్డిలేక సంచరింపఁగలను. అని, యొకఁడు చెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యేకైకం తదా తత్ర వానరా బలదర్పితాః. ౧౬
ఊచుశ్చ వచనం తత్ర హరిరాజస్య సన్నిధౌ

టీక॥ తదా=అప్పుడు; తత్ర=అచట; తత్ర=ఆ; హరిరాజస్య = వానరరాజునగు సుగ్రీవునియొక్క; సన్నిధౌ= సమీపమునందు; బలదర్పితాః = బలముచేగర్వించిన; వానరాః = వానరులు; ఇతి=ఇట్లు; ఏకైకం = ఒకొక్కరైన; వచనం = మాటను; ఊచుశ్చ= చెప్పిరియు.

అపుడచట బలగర్వితులగు వానరులు, వానరేంద్రుండగు సుగ్రీవునెదుట, నివ్విధంబున నొక్కొకరు నొక్కొకవచనముం బలికిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, పంచచత్వారింశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ పంచచత్వారింశసర్గటీక, ముగిసినది.

౪౬

షట్చత్వారింశ సర్గ ప్రారంభః.

గతేషు వానరేంద్రేషు రామ స్సుగ్రీవ మబ్రవీత్
కథం భవా న్విజానీతే సర్వం వై మండలం భువః. ౧

టీక ॥ వానరేంద్రేషు = వానరశ్రేష్ఠులు; గతేషు = పోయినవారలగుచుండఁగా; రామః = రాముఁడు; సుగ్రీవం=సుగ్రీవునిగూర్చి; "భవాన్=నీవు; భువః = భూమియొక్క; మండలం= మండలమును; సర్వం = సమస్తమును. ("వై" అనునది పాదపూరణార్థము); కథం=ఎట్లు; విజానీతే=ఎఱుంగుదువు" ఇతి (అధ్యాహృతము)= అని; అబ్రవీత్=పలికెను.

అవ్వానరవీరులుపోయినపిమ్మట, రాముండు సుగ్రీవుంజూచి, "నీకుసమస్త భూమండలంబును ఎట్లు తెలియవచ్చె" ననియడిగెను. అని, తాత్పర్యము.

సుగ్రీవస్తు తతో రామ మువాచ ప్రణతాత్మవాన్

టీక॥ తతః=అటుపిమ్మట; సుగ్రీవస్తు=సుగ్రీవుండును; ప్రణతాత్మవాన్= నమస్కరించినదేహముగలవాఁడై; రామం=రామునిఁగూర్చి; ఉవాచ = పలికెను.

అంత, సుగ్రీవుండు నమస్కరించి రామునితో నిట్లని సవినయముగాఁబలికెను. అని, తాత్పర్యము.

శ్రూయతాం సర్వ మాఖ్యాస్యే విస్తరేణ నరర్షభ. ౨

టీక॥ నరర్షభ = పురుషోత్తముఁడా! శ్రూయతాం = వినఁబడుఁగాక. సర్వం=సమస్తమును; విస్తరేణ=విరివిచేత; ఆఖ్యాస్యే=చెప్పెదను.

పురుషోత్తముఁడా! సమస్తవృత్తాంతమును విస్తరించిచెప్పెదనువినుము. అని, తాత్పర్యము.

యదాతు దుందుభింనామ దానవం మహిషాకృతిమ్
పరికాలయతే వాలీ మలయం ప్రతి పర్వతమ్. ౩

తదా వివేశ మహిషో మలయస్య గుహాం ప్రతి

టీక॥ యదాతు = ఎప్పుడైతే; వాలీ=వాలి; మహిషాకృతిం=ఎనుఁబోతుయొక్క రూపముగల; దుందుభింనామ = దుందుభియనుపేరుగల; దానవం= రాక్షసుని; మలయం=మలయమును; పర్వతంప్రతి=కొండనుగూర్చి; పరికాలయతే=తఱిమెనో; తదా = అప్పుడు; మహిషః=దుందుభి; మలయస్య= మలయపర్వతముయొక్క; గుహాం=గుహను; ప్రతివివేశ=చొచ్చెను.

పూర్వము, మహిషరూపధరుండగు దుందుభియను రాక్షసుండు, వాలితోయుద్ధముసేయవచ్చి భయంబునంబరుగెత్తఁగా, వాలి మలయపర్వతమువఱకు వెంటనంటితఱుముటయు సద్దానవుండు, అమ్మలయపర్వతంబునందలి గుహఁజొరఁబడెను. అని, తాత్పర్యము.

విశేషార్థము.—ఇచట, "మాయావి వృత్తాంతము చెప్పవలసినదగుటచేత, "దుందుభిశబ్దముచేత దుందుభిపుత్రుఁడగు మాయావి చెప్పఁబడుచున్నాఁడు" అని మహేశ్వరతీర్థులువచించిరి. ఈపక్షమునందు, మహిషరూపధరుండగు దుందుభికొడుకగుటచే మాయావియు "మహిషః" (ఎనుఁబోతు) అని, మహిషశబ్దముచే నిర్దేశింపఁబడుట విరుద్ధముకాదని యెఱుంగునది. గోవిందరాజులు మాత్రము, "మాయావితోఁగూడ దుందుభియు యుద్ధమునకు వచ్చెను. మాయావిమాత్రము బిలంబునహతుఁడయ్యెను. దుందుభి యెట్లో తప్పించుకొని, మఱలఁగొంతకాలమునకు మత్తుఁడై వాలిమీఁదికివచ్చి హతుఁడయ్యెను". ఇట్లు, స్వసందర్భంబునఁజెప్పనియంశమును బ్రసక్తమగునపుడుచెప్పుట శ్రీవాల్మీకి స్వభావమనియెఱుంగునది.

వివేశ వాలీ తత్రాపి మలయం తజ్జిఘాంసయా. ౪

టీక॥ వాలీ = వాలి ; తజ్జిఘాంసయా=ఆదుందుభిమాయావుల వధింపనిచ్ఛచేత; తత్రాపి=ఆగుహయందును; మలయం=మలయపర్వతమును; వివేశ= చొచ్చెను.

వాలి, ఆదుందుభిమాయావులవధించుటకై మలయపర్వతంబున నా గుహలోనికిం బ్రవేశించెను.

అని, తాత్పర్యము.

తతో హం తత్ర నిక్షిప్తో గుహాద్వారి వినీతవత్

నచ నిష్క్రమతే వాలీ తదా సంవత్సరే గతే. ౫

టీక॥ తతః=అప్పుడు; అహం= నేను; వినీతవత్=వినయముగల్గినట్లుగా; గుహాద్వారి=గుహయొక్క వాకిటను; నిక్షిప్తః=ఉంచఁబడినాను. తదా=అప్పుడు; సంవత్సరే=ఏఁడాది; గతే = కడవఁగా; వాలీ=వాలి; ననిష్క్రమతేచ= బయలువెడలను లేదు.

అప్పుడు, వాలి, వినయసంపన్నుఁడ నగునన్ను గుహవాకిటనునిచెను; అంత నొక సంవత్సరము కడచినను , వాలి వెడలి రాఁడయ్యె. అని, తాత్పర్యము.

తతః క్షతజవేగేన ఆపుపూరే తదా బిలమ్
తదహం విస్మితో దృష్ట్వా భ్రాతృశోకవిషాదితః. ౬

టీక॥ తతః= అటుపిమ్మట; తదా= అప్పుడు; బిలం=గుహ; క్షతజవేగేన= నెత్తురుప్రవాహముచేత; ఆపుపూరే= నింపఁబడెను. అహం = నేను; తత్= దానిని; దృష్ట్వా= చూచి; విస్మితః= అచ్చెరువుపొందినవాఁడనై; భ్రాతృశోకవిషాదితః= అన్నదుఃఖమనువిషముచే పీడింపఁబడినవాఁడను; అభూవం (అధ్యాహృతము)= అయితిని.

అంత నప్పుడు, ఆబిలమునిండ నెత్తురుప్రవాహమువచ్చెను; నే నదిచూచి యచ్చెరువొంది, మాయన్నకేమి కల్గెనోయని మిక్కిలియుదుఃఖితుఁడనైతిని. అని, తాత్పర్యము.

అథాహం గతబుద్ధిస్తు సువ్యక్తం నిహతో గురుః

టీక॥ అథ = అటుపిమ్మట; అహంతు=నేనుమాత్రము; గురుః=అన్న; సువ్యక్తం = మిక్కిలియు స్పష్టముగా; నిహతః=వధింపఁబడినాఁడు. ఇతి (అధ్యాహృతము)=అని; గతబుద్ధిః=పొందఁబడినబుద్ధిగలవాఁడను.

అంత, అన్నయగువాలి, స్పష్టముగా హతుఁడైయుండునని నాకునమ్మకముగలిగినది. అని, తాత్పర్యము.

శిలా పర్వతసంకాశా బిలద్వారి మయా కృతా. ౭
అశక్నువ న్నిష్క్రమితుం మహిషో వినశే దితి

టీక ॥ మహిషః = దుందుభి; నిష్క్రమితుం = వెడలుటకు; అశక్నువన్ = అసమర్థుఁడై; వినశేత్ (వినశ్యేత్) = నశించును. ఇతి = అని; మయా = నాచేత; బిలద్వారి = గుహావాకిటియందు; పర్వతసంకాశా = కొండతోసమానమయిన; శిలా = ఱాయి; కృతా = చేయఁబడినది; ఉంచఁబడినదనుట.

దుందుభి గుహనుండి వెడలి రాఁజాలక యచటనే నాశమునొందవలెనని, నేను ఆగుహావాకిట పర్వతమంతటి శిలను అడ్డముంచితిని. అని, తాత్పర్యము.

తతోఽహ మాగాం కిష్కింధాం నిరాశ స్తస్య జీవితే । ౮
రాజ్యంచ సుమహ త్ప్రాప్తం తారయా రుమయా సహ

టీక ॥ తతః = అటుపిమ్మట; అహం = నేను; తస్య = ఆవాలియొక్క; జీవితే = బ్రతుకువిషయమునందు; నిరాశః = ఆశలేనివాఁడనై; కిష్కింధాం = కిష్కింధానగరమును; ఆగాం = పొందితిని; మయా (అధ్యాహృతము) = నాచేత; తారయా = తారతోను; రుమయా సహ = రుమతోనుగూడ; సుమహత్ = మిక్కిలియుగొప్పదగు; రాజ్యంచ = రాజ్యముగూడ; ప్రాప్తం = పొందబడినది.

అంత, నేను, వాలిజీవితంబువిషయమై యాశవదిలి, కిష్కింధకువచ్చి, తారను రుమను బొందుటయెగాక, యీ వానరరాజ్యమునకంతయు నాధుండనైతిని. అని, తాత్పర్యము.

మిత్త్రైశ్చ సహిత స్తత్ర వసామి విగతజ్వరః । ౯
ఆజగామ తతో వాలీ హత్వా తం దానవర్షభమ్

టీక ॥ తత్ర = ఆకిష్కింధయందు; మిత్త్రైః = స్నేహితులతో; సహితశ్చ = కూడినవాఁడనై; విగతజ్వరః = భయములేనివాఁడనై; వసామి = ఉంటిని. తతః = అంత; వాలీ = వాలి; తం = ఆ; దానవర్షభం = దానవశ్రేష్ఠుఁడగుమాయావిని; హత్వా = వధించి; ఆజగామ = వచ్చెను.

నేను కిష్కింధయందు మిత్రపరివృతుండనై దిగులులేక సుఖముగానుంటిని; అంత, దానవోత్తముఁడగు నామాయావిని వధించి వాలియు వచ్చెను. అని, తాత్పర్యము.

స ౪౬

తతో హ మదదాం రాజ్యం గౌరవా ద్భయయంత్రితః. ౧౦

టీక॥ తతః=అంత; అహం = నేను; గౌరవాత్ = గొప్పతనమువలన, పూజ్యతవలన; లేక, అన్నయగుటవలన; భయయంత్రితః = భయముచేఁగట్టఁబడినవాఁడనై; రాజ్యం= దొరతనమును; అదదాం=ఇచ్చినాను.

అంత, నేను, అన్నగాను గౌరవంబువలన, భయంబున, వాలికి రాజ్యంబొసంగితిని, అని, తాత్పర్యము.

స మాం జిఘాంసు ర్దుష్టాత్మా వాలీ ప్రవ్యథితేంద్రియః
పరికాలయతే క్రోధా ద్ధావంతం సచివైస్సహ. ౧౧

టీక॥ దుష్టాత్మా= చెడుబుద్ధిగల; సః=ఆ; వాలీ= వాలి; ప్రవ్యథితేంద్రియః=కలఁతపడిన యింద్రియములుగలవాఁడై; మాం=నన్ను; జిఘాంసుః = వధింపఁగోరినవాఁడై; సచివైస్సహ= మంత్రులతోఁగూడ; ధావంతం= పరుగెత్తుచున్న; మాం(అధ్యాహృతము)= నన్ను; క్రోధాత్=కోపమువలన; పరికాలయతే=తఱుమఁగొట్టెను.

దురాత్ముఁడగు నావాలి, కోపంబునఁ బరవశములయిన యిందియములు గలవాఁడై, నన్నువధింపఁగోరుటయు, నేను మంత్రిసహితంబుగాఁ బరుగెత్తితిని; అతండును నావెంటందఱిమెను. అని, తాత్పర్యము.

తతో హం వాలినా తేన సానుబంధః ప్రధావితః
నదీశ్చ వివిధాః పశ్య న్వనాని నగరాణిచ. ౧౨

టీక॥ తతః=అటుపిమ్మట;అహం= నేను; సానుబంధః= మంత్రులతోఁగూడినవాఁడనై; వివిధాః=నానావిధములయిన; నదీశ్చ=ఏర్లను; వనాని=అడవులను; నగరాణిచ=పట్టణములను; పశ్యన్=చూచుచు; తేన=ఆ; వాలినా= వాలిచేత; ప్రధావితః=పరుగెత్తితిని.

అంత, నేను, వాలిభయంబునం జేసి, మంత్రులంగూడి, నానావిధములగు నదులను వనంబులను నానావిధపట్టణంబులనుజూచుచుఁ, బరుగెత్తితిని. అని, తాత్పర్యము.

ఆదర్శతలసంకాశా తతో వై పృథివీ మయా
అలాతచక్రప్రతిమా దృష్టా గోష్పదవ త్తదా. ౧౩

టీక॥ తతః=అంత; తదా = అప్పుడు ; మయా = నాచేత; ఆదర్శతల సంకాశా = అద్దముతో సమానమును ; అలాతచక్రప్రతిమా = కొఱవిచక్రముతోఁ బోలికగలదియునగు; పృథివీ=భూమి; గోష్పదవదత్ = గోవుగొరిసెయిడిన గుంటవలె ; దృష్టా = చూడఁబడినది.

అంతనవుడు, నేను, భూమియంతయు గోష్పదమంతటిదిగా నేఁచి, అద్దమునుంబోలెఁ గొఱవిచక్రమునవలె, స్పష్టముగాఁ జూచినాను.

అని, తాత్పర్యము.

పూర్వాం దిశం తతో గత్వా పశ్యామి వివిధాన్ ద్రుమాన్
పర్వతాంశ్చ నదీ రమ్యా స్సరాంసి వివిధాని చ. ౧౪

టీక॥ తతః=అప్పుడు; పూర్వాందిశం=పూర్వదిక్కును; గత్వా=పోయి; వివిధాన్ = నానావిధములగు; ద్రుమాన్=వృక్షములను; పర్వతాంశ్చ=కొండలను; రమ్యాః= సుందరములయిన; నదీః=ఏర్లను; వివిధాని=నానావిధములయిన; సరాంసిచ=కొలంకులను; పశ్యామి (అపశ్యం) = చూచితిని.

అవుడు,పూర్వదిక్కునకుఁబోయి, నానావిధ వృక్షంబులను బర్వతంబులను రమణీయములగు నదులను నానావిధంబులగు సరస్సులనుజూచితిని.

అని, తాత్పర్యము.

ఉదయం తత్ర పశ్యామి పర్వతం ధాతుమండితమ్
క్షీరోదం సాగరంచైవ నిత్య మప్సరసాలయమ్. ౧౫

టీక॥ తత్ర = అచ్చట; ధాతుమండితం = గైరికధాతువులచే నలంకృతమయిన; ఉదయం = ఉదయమను; పర్వతం=కొండను; నిత్యం= ఎల్లప్పుడును; అప్సరసాలయం=అప్సరసలయునికిపట్టయిన; క్షీరోదం= పాలెజలముగాఁగల; సాగరంచైవ=సముద్రమును;పశ్యామి(అపశ్యం)= చూచితిని.

అచట, గైరికధాతువులచే నొప్పుచున్న యుదయపర్వతంబును, ఎల్లప్పుడు నప్సరసలచే సేవితంబగు క్షీరసాగరంబునుజూచితిని. అని, తాత్పర్యము.

పరికాలయమానస్తు వాలినా భిద్రుత స్తదా
పున రావృత్య సహసా ప్రస్థితో హం సదా విభో. ౧౬

టీక ॥ విభో = ప్రభుండవగు రాముఁడా! అహం=నేను; తదా= అప్పుడు; పరికాలయమానస్తు=పరుగెత్తుచున్నవాఁడనై యె; వాలినా= వాలిచేత; అభిద్రుతః= తఱుమఁబడినవాఁడనై; తదా=అప్పుడు; పునః= మఱల; సహసా=వేగమున; ఆవృత్య=మఱలి; ప్రస్థితః=పోతిని.

నాథుఁడవగు రాముఁడా! నేనిట్లు పరుగెత్తుచుండఁగానే యంత వాలి తఱుముకొనిసమీపించుటయు, నేను శీఘ్రంబున వెనుకకుమఱలి మఱియొకవైపున బరుగెత్తినాను. అని, తాత్పర్యము.

పున రావర్తమానస్తు వాలినా భిద్రుతో ద్రుతమ్

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; పునః=మఱల; ఆవర్తమానస్తు= మఱలినవాఁడనైనంతనె; వాలినా=వాలిచేత; ద్రుతం = శీఘ్రముగా; అభిద్రుతః = తఱుమఁబడితినాను.

నేను, మఱలిపరుగెత్తుటంజూచి, వాలిమఱియు వేగంబున నన్నుందఱిమెను అని, తాత్పర్యము.

దిశ స్తస్యా స్తతో భూయః ప్రస్థితో దక్షిణాందిశమ్. ౧౭
వింధ్యపాదపసంకీర్ణాం చందనద్రుమ భూషితామ్

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; తతః=అంత; తస్యాః=ఆ; దిశః= తూర్పుదిక్కునుండి; భూయః = మఱల; వింధ్యపాదపసంకీర్ణాం = వింధ్యపర్వతమునందలి వృక్షములచే వ్యాపింపఁబడినదియు; చందనద్రుమభూషితాం= చందనవృక్షములచే నలంకరింపఁబడినదియునగు; దక్షిణాందిశం = దక్షిణదిశను గూర్చి; ప్రస్థితః = బయలుదేఱినాను.

అంత నేను తూర్పుదిక్కునుండి, వింధ్యపర్వత వృక్షములచే వ్యాప్తంబును చందనవృక్షములతో నొప్పుచున్నదియు నగు దక్షిణదిశకుఁ బరుగెత్తితిని.

అని, తాత్పర్యము.

ద్రుమశైలాం స్తతః పశ్యన్ భూయో దక్షిణతో ఽపరాన్. ౧౮
పశ్చిమాంతు దిశం ప్రాప్తో వాలినా సమభిద్రుతః.

టీక॥ తతః=అంత; అహం(అధ్యాహృతము)=నేను; భూయః= మఱల; దక్షిణతః = దక్షిణదిక్కునందు; అపరాన్ = ఇతరములయిన; ద్రుమశైలాన్=వృక్షములను పర్వతములను; పశ్యన్=చూచుచు; వాలినా=వాలిచేత; సమభిద్రుతః= తఱుమఁబడినవాఁడనై; పశ్చిమాందిశంతు = పడమటిదిక్కును గూడ; ప్రాప్తః=పొందినాను.

అంత, నేను దక్షిణదిక్కునందు మఱికొన్ని వృక్షంబులను బర్వతంబులను జూచుచుఁ బరుగెత్తుచుండఁగా, వాలి తఱుముటయు, నంతఁబడమరకుఁబోయి నాను. అని, తాత్పర్యము.

సంపశ్యన్ వివిధాన్ దేశా నస్తంచ గిరిసత్తమమ్. ౧౯
ప్రాప్య చాస్తం గిరిశ్రేష్ఠ ముత్తరాం సంప్రధావితః

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; వివిధాన్=నానావిధములయిన; దేశాన్=ప్రదేశములను; అస్తం = అస్తమును; గిరిసత్తమంచ= పర్వతశ్రేష్ఠమును; సంపశ్యన్=చూచుచు; గిరిశ్రేష్ఠం=పర్వతోత్తమమయిన; అస్తం = అస్తగిరిని; ప్రాప్యచ= పొందియు; ఉత్తరాం=ఉత్తరదిక్కునుగూర్చి; సంప్రధావితః=పరుగెత్తినాను.

నేను, బడమరను నానావిధములగు దేశములను జూచి యస్తగిరివఱకుఁబోతిని; అంత వాలి తఱుముకొని వచ్చుట వలనఁ దిరిగి యుత్తరదిక్కునకుఁ బరుగెత్తితిని. అని, తాత్పర్యము.

హిమవంతంచ మేరుంచ సముద్రంచ తథోత్తరమ్. ౨౦

టీక॥ హిమవంతంచ = హిమవత్పర్వతమును; మేరుంచ=మేరుపర్వతమును; తథా=అట్లు; ఉత్తరం= ఉత్తరదిక్కుననుండునట్టి; సముద్రంచ= సముద్రమును; అపశ్యం(అధ్యాహృతము)= చూచితిని.

ఉత్తరదిక్కునహిమవత్పర్వతమును మేరుపర్వతమును ఉత్తరసముద్రంబును జూచితిని. అని, తాత్పర్యము.

యదా న విందం శరణం వాలినా సమభిద్రుతః
తదా మాం బుద్ధిసంపన్నో హనుమాన్ వాక్యమబ్రవీత్. ౨౦

టీక॥ యదా=ఎప్పుడు; అహం (అధ్యాహృతము)=నేను; వాలినా= వాలిచేత; సమభిద్రుతః = తఱుమఁబడినవాఁడనై; శరణం=రక్షించువానిని, లేక, గృహమును; నవిందం (నావిందం) = పొందనైతినో; తదా = అప్పుడు; బుద్ధిసంపన్నః = బుద్ధితోఁగూడిన; హనుమాన్ = హనుమంతుఁడు; మాం=నన్నుఁగూర్చి; వాక్యం= మాటను; అబ్రవీత్ = పలికెను.

ఇట్లు, ఎవటికేఁబోయినను వాలితఱుముటవలన, నాకు రక్షకుఁడుగాని యుండుటకు స్థానముగాని లేకపోవుటయు, ఒకప్పుడు, బుద్ధిమంతుండగు హనుమంతుండు, నాతో నిట్లుపలికెను. అని, తాత్పర్యము.

ఇదానీం మే స్మృతం రాజన్ యథా వాలీ హరీశ్వరః
మతంగేన తదా శప్తో హ్యస్మిన్నాశ్రమమండలే. ౨౧

టీక ॥ రాజన్=వానరరాజా! యథా=ఎట్లు; తదా=అప్పుడు; హరీశ్వరః= వానరనాథుఁడైన; వాలీ=వాలి; మతంగేన = మతంగమహర్షిచేత; అస్మిన్=ఈ; ఆశ్రమమండలే = ఆశ్రమపదమువిషయమయి ; శప్తః= శపింపఁబడినాఁడో ("హి"అనునది పాదపూరణార్థము); తథా (అధ్యాహృతము)= ఆవిధము; ఇదానీం=ఇప్పుడు; మే=నాకు, నాచేత; స్మృతం=స్మరింపఁబడినది.

వానరరాజా! మున్ను మతంగమహర్షి యీయాశ్రమపదము విషయమయి, వానరేశ్వరుండగు వాలిని శపించియున్నాఁడుగదా! అదియిప్పుడు నాకు స్మృతికివచ్చినది. అని, తాత్పర్యము.

ప్రవిశేద్యది వై వాలీ మూర్ధాస్య శతధా భవేత్
తత్ర వాస స్సుఖో ఽస్మాకం నిరుద్విగ్నో భవిష్యతి. ౨౩

టీక॥ వాలీ=వాలి; ప్రవిశేద్యది=ప్రవేశించునేని ("వై" అనునది పాదపూరణార్థము); అస్య = ఈవాలియొక్క; మూర్ధా=శిరస్సు; శతధా = నూఱు

స ౪౬

వర్తియ్యాలుగా; భవేత్=అగును. తత్ర= ఆమతంగాశ్రమమునందు; అస్మాకం= మనకు; వాసః=ఉండుట; సుఖః= సుఖముగలిగించునదిగాను; నిరుద్విగ్నః=భయములేనిదిగాను; భవిష్యతి = కాఁగలదు.

ఆశాపమువలన, వాలియయ్యాశ్రమంబుప్రవేశించినయెడ నతినితల నూఱుపట్టియలయిసగులను; కావున, మనము మతంగాశ్రమంబున సుఖముగాను నిర్భయముగాను నివసింపవచ్చును. అని, హనుమంతుండునాతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతః పర్వత మాసాద్య ఋశ్యమూకం నృపాత్మజ
నవివేశ తదా వాలీ మతంగస్య భయా త్తదా. ౨౪

టీక॥ నృపాత్మజ=రాచకొమరుఁడవయినరాముఁడా! తతః=అటుపిమ్మట; అహం(అధ్యాహృతము)= నేను; ఋశ్యమూకం= ఋశ్యమూకమను; పర్వతం=కొండను; ఆసాద్య = పొంది; స్థితః(అధ్యాహృతము)= ఉండినాను. తదా=అప్పుడు; వాలీ= వాలి; మతంగస్య=మతంగునియొక్క; భయాత్=వెఱపువలన; నవివేశ= ప్రవేశింపఁడయ్యె.

రాజపుత్త్రుఁడవగురాముఁడా! అంత నేను ఈ ఋశ్యమూకపర్వతంబుఁ జేరితిని; వాలి, మతంగమహాముని శాపభయమువలన నిచటికి రాఁడయ్యె.

అని, తాత్పర్యము.

ఏవం మయా తదా రాజన్ ప్రత్యక్ష ముపలక్షితమ్
పృథివీమండలం కృత్స్నం గుహా మస్యా గత స్తతః. ౨౫

టీక॥ రాజన్=రాజా! ఏవం= ఇట్లు; మయా=నాచేత; తదా = అప్పుడు; కృత్స్నం=సమస్తమయిన; పృథివీమండలం = భూమండలము; ప్రత్యక్షం=సమక్షముగా; ఉపలక్షితం=చూడఁబడినది. తతః=అంత; అస్య=ఈఋశ్యమూకపర్వతముయొక్క; గుహాం= గుహను; ఆగతః=పొందినాను.

రాజా! నేనివ్విధంబున వాలిభయంబుననపుడు, భూమండలమునంతయుఁ బ్రత్యక్షముగాఁజూచి, అటుపిమ్మట, నీ ఋశ్యమూకపర్వతము గుహలో వాసముచేయ నారంభించితిని. అని, సుగ్రీవుండురామునితోఁజెప్పెను. అని, తా.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, షట్చత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ షట్చత్వారింశసర్గటీక,
ముగిసినది.

---

౪౭

సప్తచత్వారింశసర్గప్రారంభః.

దర్శనార్థంతు వైదేహ్యా స్సర్వతః కపియూథపాః
వ్యాదిష్టాః కపిరాజేన యథోక్తం జగ్మురంజసా. ౧

టీక ॥ వైదేహ్యాః= సీతాదేవియొక్క, సీతాదేవిని; దర్శనార్థంతు=చూచుటకొఱకే; కపిరాజేన = వానరరాజయినసుగ్రీవునిచేత; వ్యాదిష్టాః=ఆజ్ఞాపింపఁబడిన; కపియూథపాః = వానరసేనానాయకులు; యథోక్తం = చెప్పఁబడినవిధినతిక్రమింపక; సర్వతః = అన్నివైపులను; అంజసా = శీఘ్రముగా; జగ్ముః=పోయిరి.

సీతాదేవిని వెదకి చూచివచ్చుటకు సుగ్రీవుండాజ్ఞాపించిన వానరసేనానాయకులు, సుగ్రీవుఁడు చెప్పినచొప్పున, శీఘ్రంబున నయ్యాదిశలకుఁబోయిరి.

అని, తాత్పర్యము.

సరాంసి సరితః కక్షా నాకాశం నగరాణిచ
నదీదుర్గాం స్తథా శైలా న్విచిన్వంతి సమంతతః. ౨

టీక॥ తే(అధ్యాహృతము)= ఆవానరులు; సరాంసి = కొలంకులను; సరితః=నదులను; కక్షాః = లతాగృహములను; ఆకాశం= బయలుప్రదేశమును; నగరాణిచ=పట్టణములను; నదీదుర్గాః = వీర్లచేఁబ్రవేశింపరానిప్రదేశ

స ౪౭

ములను; తథా=అట్లు; శైలాన్ = పర్వతములను; సమంతతః= అంతటను; విచిన్వంతి=వెదకిరి.

ఆవానరులు, సరస్సులయందును నదులయందును లతాగృహములయందును బన్నిళ్లయందును బట్టణంబులయందును నదులచే దుర్గమంబులగు ప్రదేశములయందును బర్వతంబుల యందును సీతాదేవిని వెదకిరి. అని, తాత్పర్యము.

సుగ్రీవేణ సమాఖ్యాతా స్సర్వే వానరయూథపాః
ప్రదేశాన్ ప్రవిచిన్వంతి సశైలవనకాననాన్. ౩

టీక ॥ సుగ్రీవేణ = సుగ్రీవునిచేత; సమాఖ్యాతాః= ఆజ్ఞాపింపఁబడిన;వానరయూథపాః= వానరసేనాపతులు; సర్వే = అందఱును; సశైలవనకాననాన్ = పర్వతములతోను జిన్నయడవులతోను పెద్దయడవులతోను గూడిన; ప్రదేశాన్ = స్థలములను; ప్రవిచిన్వంతి = చక్కఁగా వెదకిరి.

సుగ్రీవుం డాజ్ఞాపించిన వానరసేనాపతులందఱును, పర్వతంబులు వనంబులున్నగు ప్రదేశంబులం దంతటను సీతాదేవిని జక్కఁగా వెదకిరి.

అని, తాత్పర్యము.

విచిత్య దివసం సర్వే సీతాధిగమనే ధృతాః
సమాయాంతిస్మ మేదిన్యాం నిశాకాలేషు వానరాః. ౪

టీక ॥ వానరాః= వానరులు; సర్వే=అందఱును;సీతాధిగమనే=సీతను దెలియుటవిషయమయిన; ధృతాః= నిశ్చయించినవారలయి; దివసం=పగటను; విచిత్య=వెదకి; నిశాకాలేషు=రాత్రికాలములయందు; మేదిన్యాం=భూమియందు; సమాయాంతిస్మ=చేరిరి.

అవ్వానరులందఱు, సీతాన్వేషణతత్పరులయి, యాకాశసంచారంబున వేఱువేఱుగాఁ బగలంతయు వెదకి రాత్రికాలంబుల భూమియందు నొకరితో నొకరు చేరుచుండిరి.

అని, తాత్పర్యము.

సర్వర్తుకాంశ్చ దేశేషు వానరా స్సఫలాన్ ద్రుమాన్

ఆసాద్య రజనీం శయ్యాం చక్రు స్సర్వే ష్వహస్సు తే. ४

టీక ॥ తే=ఆ; వానరాః = వానరులు; సర్వేషు = సమస్తములయిన; అహస్సు=దినములయందును; రజనీం= రాత్రిని, రాత్రియందపట; దేశేషు= దేశములయందు; సర్వర్తుకాన్ = సమస్తఋతువులయందును ఫలించునట్టి; సఫలాన్ = ఫలములతోఁగూడిన; ద్రుమాన్ = వృక్షములను; ఆసాద్య = చేరి; శయ్యాం=పరుండుటను; చక్రుః= చేసిరి.

ఆవానరులు, అహస్సమనందలి సమస్తదినములయందును బగలంతయు సీతాదేవిని వెదకి, రాత్రికి, సమస్తఋతువులయందును ఫలించునట్టి ఫలవంతములయిన వృక్షములు చేరి యచ్చటం బరుండుచువచ్చిరి. అని, తాత్పర్యము.

తదహః ప్రథమం కృత్వా మాసే ప్రస్రవణం గతాః
కపిరాజేన సంగమ్య నిరాశాః కపియూథపాః. ౬

టీక॥ కపియూథపాః = వానరసేనాపతులు; తత్=ఆ; అహః= దినమును, ప్రయాణదినమును; ప్రథమం=మొదటివానిఁగా; కృత్వా=చేసి; మాసే= నెలకాఁగా; నిరాశాః= ఆశలేనివారలయి; కపిరాజేన=వానరరాజైన సుగ్రీవునితో; సంగమ్య=చేరి; ప్రస్రవణం= ప్రస్రవణపర్వతమును; గతాః = పొందినారు.

అంత వానరసేనాపతులు, ప్రయాణము మొదలుకొని యొకమాసము పూర్ణమగుటయు, సీతాదేవింజూచుటయందాశవదలి, వానరరాజుసుగ్రీవు నొద్దకువచ్చి ప్రస్రవణపర్వతంబుఁ జేరిరి. అని, తాత్పర్యము.

విచిత్యతు దిశం పూర్వాం యథోక్తాం సచివైస్సహ
అదృష్ట్వా వినత స్సీతాం మాజగామ మహాబలః. ౭

టీక॥ మహాబలః=అధికమయిన బలముగల; వినతః = వినతుఁడు; సచివైస్సహ=సహాయులతోఁగూడ; యథోక్తాం=చెప్పఁబడినప్రకారమయిన; పూర్వాం దిశం= తూర్పుదిక్కును; విచిత్యతు= వెదకియు; సీతాం=సీతను; అదృ

ష్ట్వా=చూడక; అజగామ=వచ్చెను.

మహాబలశాలియగు వినతుండు, తనతోడి వానరులతోఁగూడ సుగ్రీవుఁడు చెప్పినవిధంబునఁ దూర్పుదిశనంతయు వెదకి, సీతంగానక, యూరకవచ్చెను. అని, తాత్పర్యము.

ఉత్తరాంచ దిశం సర్వాం విచిత్య స మహాకపిః
ఆగత స్సహసైన్యేన వీర శ్శతవలి స్తదా. ౮

టీక॥ వీరః = పరాక్రమవంతుండును; మహాకపిః=గొప్పవానరుండునగు; శతవలిశ్చ= శతవలియు; తదా=అప్పడు; ఉత్తరాందిశం = ఉత్తరదిక్కును; సర్వాం=సమస్తమును; విచిత్య=వెదకి; సైన్యేనసహ=సేనతోఁగూడ; ఆగతః=వచ్చెను.

అంతట, పరాక్రమశాలియగుశతవలి, ఉత్తరదిశనంతటను వెదకి, సీతంబూడకయె, సైన్యములతోఁగూడ వచ్చిచేరెను. అని, తాత్పర్యము.

సుషేణః పశ్చిమామాశాం విచిత్య సహ వానరైః
సమేత్య మాసే సంపూర్ణే సుగ్రీవ ముపచక్రమే. ౯

టీక॥ సుషేణః=సుషేణుఁడు; వానరైస్సహ= వానరులతోఁగూడ; పశ్చిమాంఆశాం= పడమటిదిక్కును; విచిత్య=వెదకి; మాసే=నెల; సంపూర్ణే=నిండినదికాఁగా; సమేత్య=వచ్చి; సుగ్రీవం=సుగ్రీవుని; ఉపచక్రమే = సమీపించెను.

సుషేణుండును, వానరసేనా పరివృతుండై పడమటిదిశనంతటను సీతాదేవినివెదకి, మాసమునిండుటయు, నాబిడంగానకయె, సుగ్రీవునొద్దకు వచ్చిచేరెను. అని, తాత్పర్యము.

తం ప్రస్రవణపృష్ఠస్థం సమాసాద్యాభివాద్యచ
ఆసీనం సహ రామేణ సుగ్రీవ మిద మబ్రువన్. ౧౦

టీక॥ తే (అధ్యాహృతము)=ఆవానరులు; ప్రస్రవణపృష్ఠస్థం = ప్రస్రవణ పర్వతముయొక్క యగ్రముననున్నవాఁడును; రామేణసహ = రామునితోఁగూడ; ఆసీనం= కూర్చుండినవాఁడునగు; సుగ్రీవం=సుగ్రీవుని; ఆసాద్య=

సమీపించి; అభివాద్యచ = నమస్కరించియు; ఇదం = ఈమాటను; అబ్రువన్ = పలికిరి.

అవ్వానరవీరులందఱు, ప్రస్రవణపర్వతంబున రామునితోడఁ గూర్చుండియున్న సుగ్రీవునొద్దకువచ్చి నమస్కరించి సవినయముగా నిట్లనిపలికిరి.

అని, తాత్పర్యము.

విచితాః పర్వతాస్సర్వే వనాని గహనానిచ
నిమ్నగాస్సాగరాంతాశ్చ సర్వే జనపదాశ్చయే. ౧౧

టీక ॥ సర్వే = సమస్తములయిన; పర్వతాః = కొండలు; విచితాః = వెదకఁబడినవి. గహనాని = దుర్గమములయిన; వనానిచ = అడవులును; విచితాని (అధ్యాహృతము) = వెదకఁబడినవి. నిమ్నగాః = నదులును; విచితాః (అధ్యాహృతము) = వెదకఁబడినవి. సాగరాంతాశ్చ = సముద్రతీరములును; విచితాః (అధ్యాహృతము) = వెదకఁబడినవి. సర్వే = సమస్తములయిన; జనపదాశ్చ = దేశములును; యే (సంధి) = ఏవిగలవో; తేచ (అధ్యాహృతము) = అవియు; విచితాః (అధ్యాహృతము) = వెదకఁబడినవి.

సమస్తపర్వతంబులు వెదకినాము; దుర్గమంబులగు నరణ్యంబులను వెదకితిమి; నదులను సముద్రతీరంబులను సమస్తదేశములను వెదకినాము.

అని, తాత్పర్యము.

గుహాశ్చ విచితాస్సర్వా స్త్వయా యాః పరికీర్తితాః
విచితాశ్చ మహాగుల్మా లతావితతసంతతాః. ౧౨

టీక ॥ త్వయా = నీచేత; యాః = ఏవి; పరికీర్తితాః = చెప్పఁబడినవో; తాః (అధ్యాహృతము) = ఆ; గుహాశ్చ = గుహలును; సర్వాః = అన్నియు; విచితాః = వెదకఁబడినవి. లతావితతసంతతాః = తీఁగెలచే వ్యాపింపఁబడినవియు దట్టములయినవియునగు; మహాగుల్మాశ్చ = గొప్పపొదలును; విచితాః = వెదకఁబడినవి.

నీవుచెప్పిన గుహలనన్నిఁటిని వెదకితిమి; లతాగృహములచే నొప్పుచున్న గుల్మంబులందంతటను సీతాదేవిని వెదకివచ్చినాము. అని, తాత్పర్యము.

గహనేషుచ దేశేషు దుర్గేషు విషమేషుచ

స ౪౭

సత్త్వాన్యతిప్రమాణాని విచితాని హతానిచ. ౧౩

టీక॥ గహనేషు = ప్రవేశింపరానివైన; దేశేషుచ = ప్రదేశములయందును; దుర్గేషు = దుఃఖముచేఁబొందఁదగిన; విషమేషుచ = మిట్టపల్లపుప్రదేశములయందును; అతిప్రమాణాని = అధికమయినప్రమాణముగల; సత్త్వాని = జంతువులు; విచితాని = వెదకఁబడినవి. హతానిచ = వధింపఁబడినవియు.

ప్రవేశింపనలవిగాని ద్వీపములయందును దుర్గమంబులగు విషమప్రదేశములయందును, మహాప్రమాణ శరీరులగు ప్రాణులను వెదకిచూచివధించితిమి. అని, తాత్పర్యము.

ఉదారసత్త్వాభిజనో మహాత్మా
స మైథిలీం ద్రక్ష్యతి వానరేంద్రః
దిశంతు యామేవ గతాతు సీతా
తామాస్థితో వాయుసుతో హనూమాన్. ౧౪

టీక॥ సీతా=సీతాదేవి; యాం= ఏ; దిశం=దిక్కును; గతా= పొందినదో; తామేవతు = ఆదిక్కునే; వాయుసుతః=వాయుపుత్త్రుండగు; హనూమాన్ = హనుమంతుఁడు; ఆస్థితః= పొందినవాఁడు. ఉదారసత్త్వాభిజనః=ఉత్తమమయినబలముగల వంశము గలవాఁడును; మహాత్మా=అధికమయిన ధైర్యముగలవాఁడునగు; సః=ఆ; వానరేంద్రః=వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు; మైథిలీం=సీతను; ద్రక్ష్యతి = చూడఁగలఁడు.

హనుమంతుఁడు, మహాబలముగల వాయుదేవుని కుమారుఁడు, తాను మహాబలుఁడు, మహాధైర్యశాలి, యింతియగాక, సీత రావణునిచే నేదిక్కునకుఁ గొనిపోఁబడియుండునో, ఆదిక్కునకె పోయియున్నవాఁడు; కావున, వాయుపుత్త్రుండగు నాహనుమంతుండే సీతంజూచిరాఁగలఁడు. అని, యావానరవీరులు సుగ్రీవునితోఁ జెప్పిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, సప్తచత్వారింశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ సప్తచత్వారింశసర్గటీక, ముగిసినది.

---

శ్రీ.

అష్టచత్వారింశసర్గప్రారంభః.

సహ తారాంగదాభ్యాం తు గత్వా స హనుమాన్ కపిః
సుగ్రీవేణ యథోద్దిష్టం తం దేశ ముపచక్రమే. ౧

టీక ॥ సః=ఆ; కపిః = వానరుండైన; హనుమాన్ = హనుమంతుండు; తారాంగదాభ్యాం= తారునితోను అంగదునితోను; గత్వాతు = పోయియును; సుగ్రీవేణ = సుగ్రీవునిచేత; యథోద్దిష్టం=చెప్పఁబడినదాని నతిక్రమింపక; తం=ఆ దేశం = ప్రదేశమును; ఉపచక్రమే = ఆరంభించెను, వెదకనారంభించెను.

ఆ హనుమంతుండు, తారుండంగదుండు మొదలగు వానరులంగూడి దక్షిణదిశకుంబోయి, సుగ్రీవుండాజ్ఞాపించిన సర్వప్రదేశంబుల వెదకనారంభించెను. అని, తాత్పర్యము.

సతు దూర ముపాగమ్య సర్వై స్తైః కపిసత్తమైః
విచినోతిస్మ వింధ్యస్య గుహాశ్చ గహనానిచ. ౨
పర్వతాగ్రాన్నదీదుర్గాన్ సరాంసి విపులాన్ ద్రుమాన్
వృక్షషండాంశ్చ వివిధాన్పర్వతాన్ ఘనపాదపాన్. ౩

టీక ॥ సతు=ఆ హనుమంతుండును; తైః=ఆ; కపిసత్తమైః= వానరశ్రేష్ఠులతోను; సర్వైః=అందఱితోనుంగూడ; దూరం = దూరప్రదేశము; ఉపాగమ్య=పొంది; వింధ్యస్య = వింధ్యపర్వతముయొక్క; గుహాశ్చ = గుహలను; గహనానిచ = వనములను; పర్వతాగ్రాన్ = పర్వతశిఖరములను, వింధ్యపర్వతముయొక్క శిఖరములననుట; నదీదుర్గాన్ = ఏర్లచేదుర్గమములయినప్ర

దేశములను; సరాంసి= కొలంకులను; విపులాన్=విశాలములగు; ద్రుమాన్= వృక్షములను; వివిధాన్ = నానావిధ ములగు; వృక్షషండాశ్చ= చెట్లయొక్క సమూహములను; ఘనపాదపాన్ = పెద్దచెట్లుగల; పర్వతాన్=చేరువకొం డలను; విచినోతిస్మ = వెదకెను.

ఆహనుమంతుండు, అవ్వానరవీరు లనందఱు గూడె, బహుదూరంబుపోయి, వింధ్యపర్వతంబునందలిగుహలను వనం బులను శిఖరంబులను నదులచేదుర్గమం బగు ప్రదేశంబులను గొలంకులనుపె ద్దవృక్షంబులను నానావిధంబుగాఁ జా బట్టియున్న వృక్షసమూహంబులను వింధ్యంబు చేరువనుండు గొప్పవృక్షం బులుగలకొండలను సీతాదేవిని వెదకెను. అని, తాత్పర్యము.

అన్వేషమాణాస్తే సర్వే వానరాస్సర్వతో దిశమ్
న సీతాం దదృశుర్వీరా మైథిలీం జనకాత్మజామ్. ౪

టీక॥ వీరాః = పరాక్రమశాలులగు; తే=ఆ; వానరాః=వానరులు; సర్వే=అందఱును; దిశం= దక్షిణదిక్కును; సర్వతః= అంతటను; అన్వేషమాణాః = వెదకుచున్నవారలయి; మైథిలీం=మిథిలానగరమందుఁ బుట్టినదియు; జనకాత్మజాం = జనకమహారాజుకొ కూతురైనదియునగు; సీతాం=సీతను; న దదృశుః=చూడరైరి.

పరాక్రమవంతులగు నవ్వానరులం దఱు, అట్లు దక్షిణదిశయందు సమస్త ప్రదేశంబుల నెంతవెదకినను, జనకమ హారాజపుత్త్రికయగు సీతాదేవిం గాన రైరి. అని, తాత్పర్యము.

తే భక్షయంతో మూలాని ఫలాని వివిధాని చ
అన్వేషమాణా దుర్ధర్షా న్యవసంస్తత్రతత్ర హ. ౫

టీక॥ దుర్ధర్షాః=ఎదిరింపనలవిగానట్టి; తే= ఆవానరవీరులు; అన్వేషమాణాః=వెదకుచు; వివిధాని=నానావిధములైయున; మూలాని=గడ్డలను; ఫలాని చ=పండ్లను; భక్షయంతః= తినుచు; తత్రతత్ర=అచ్చటచ్చట; ("హ"అనునదిపాదపూరణార్థము); న్యవసన్ = ఉండిరి.

ఎట్టిభూతంబులకును ఎదిరింపనలవి గాని యీ వానరవీరులు, సీతాదేవిని

వెదకుచు నానావిధములగు ఫలమూలంబుల నాహారంబు గొనుచు, నయ్యె స్థలంబుల విడియుచుం బోయిరి.

అని, తాత్పర్యము.

స తు దేశో దురన్వేషో గుహాగహనవా న్మహాన్

టీక॥ గుహాగహనవాన్ = గుహలును అరణ్యములును గల; మహాన్ = గొప్పదగు; సః = ఆ; దేశస్తు = ప్రదేశము మాత్రము; దురన్వేషః = వెదకనలవి గానిది.

ఆవింధ్య ప్రదేశము, పెక్కు గుహలును అరణ్యమునుగలది, గొప్పది, కావున, నచట వెదకుట మిక్కిలియుఁ గష్టము.

అని, తాత్పర్యము.

నిర్జనం నిర్జలం శూన్యం గహనం రోమహర్షణమ్. ౬
త్యక్త్వా తు తం తదా దేశం సర్వే వై హరియూథపాః
తాదృశా న్యప్యరణ్యాని విచిత్య భృశపీడితాః. ౭
దేశ మన్యం దురాధర్షం వివిశు శ్చాకుతోభయాః
యత్ర వంధ్యఫలా వృక్షా విపుష్పాః పర్ణవర్జితాః. ౮
నిస్తోయా స్సరితో యత్ర మూలం యత్ర సుదుర్లభమ్
న సంతి మహిషా యత్ర న మృగా న చ హస్తినః. ౯
శార్దూలాః పక్షిణో వాపి యే చాన్యే వనగోచరాః
న యత్ర వృక్షా నౌషధ్యో న లతా నాపి వీరుధః. ౧౦
స్నిగ్ధపత్రాః స్థలే యత్ర పద్మిన్యః ఫుల్లపంకజాః
ప్రేక్షణీయా స్సుగంధాశ్చ భ్రమరైశ్చాపి వర్జితాః. ౧౧

టీక॥ అకుతోభయాః = ఎందును భయములేనివారలగు; హరియూథపాః = వానరసేనానాయకులు; సర్వే = అందఱును; ("వై" అనునది పాదపూరణార్థము) తాదృశాని = అట్టి, వెదకనలవిగానివైనయనుట; అరణ్యాన్యపి = అడవులనుగూడ; విచిత్య = వెదకి; భృశపీడితాః = మిక్కిలియుఁ బీడింపఁబడినవారలయి; తదా = అప్పుడు; తం = ఆ; దేశం = ప్రదేశమును; త్యక్త్వాతు = విడిచినంత

నే; యత్ర=ఎచట;వృక్షాః = చెట్లు; వంధ్యఫలాః=లేనిపండ్లుగలవియు, పండ్లులేనివియుననుట; విపుష్పాః=పూవులులేనివియు; పర్ణవర్జితాః=ఆకులచే విడువఁబడినవియో; యత్ర=ఎచట; సరితః=నదులు; నిస్తోయాః=నీళ్లులేనివో; యత్ర=ఎచట; మూలం=గడ్డ; సుదుర్లభం=మిక్కిలియుదుర్లభమో; యత్ర=ఎచట; మహిషాః = ఎనుఁబోతులు;న సంతి=లేవో; మృగాః=జింకలు; న=లేవో; హస్తినశ్చ=ఏనుఁగులును; న=లేవో; శార్దూలాః=పులులును; పక్షిణోవాపి=పక్షులును; అన్యే= ఇతరములగు; వనగోచరాః= అడవియందుండునట్టి జంతువులు; యే(సంతి) = ఏవి గలవో; తే (అధ్యాహృతము)=అవియు; నసంతి(అధ్యాహృతము) = లేవో; యత్ర=ఎచట;వృక్షాః=చెట్లు;న=లేవో; ఓషధ్యః=మూలికలు; న = లేవో;లతాః=తీఁగెలు; న = లేవో;వీరుధోపి=పొదలును;న=లేవో; యత్ర=ఎచట; స్థలే = ప్రదేశమందు; స్నిగ్ధపత్రాః=నునుపైన యాకులుగలవియు; ఫుల్లపంకజాః=వికసించిన కమలములుగలవియు; ప్రేక్షణీయాః= చూడఁదగినవియు, సుందరములుననుట;సుగంధాశ్చ = మంచితావిగలవియునగు; పద్మిన్యః=తామరతీఁగలు; భ్రమరైశ్చాపి=తుమ్మెదలచేతనుగూడ; వర్జితాః = విడువఁబడినవో;తం(అధ్యాహృతము)=అట్టి; నిర్జనం=జనులులేనిదియు; నిర్జలం=జలములేనిదియు; శూన్యం=పాడుపడినదియు;గహనం = పొందరానిదియు; రోమహర్షణం = వెండ్రుకలగగుర్పొందఁజేయునదియు; దురాధర్షం = చెనకరానిదియునగు; అన్యం=ఇతరమగు; దేశం=ప్రదేశమును; వివిశుః=ప్రవేశించిరి.

ఎందునుభయములేనట్టి యావానరవీరులందఱు, వెదకుటకుఁ గష్టములగు నయాగ్యాకోణ్యంబులనంతటనన్వేషించి, యంతనాప్రదేశంబునందు, ఫలపుష్పంబులుగాని పత్రంబులుగాని లేనివృక్షములును జలంబులేని నదులును గలదియు మూలంబులులేనిదియు, మహిషంబులు జింకలు గజంబులువ్యాఘ్రంబులు పక్షులుమొదలగు వన్యజంతువులు లేనిదియు మంచివృక్షంబులుగాని లతలుగాని పొదలుగాని లేనిదియు మఱియు మంచిపత్రంబులును వికసితంబులగు కమలములును మంచితావియుఁ గలిగిసుందరములయ్యు భ్రమరములచేతనుంబరిత్యక్తంబులగు మెట్టదామరతీఁగలు గలదియు జనసంచారము లేనిదియు జలవిహీనం

స ౪౮

బును దుర్గమంబును భయంకరంబును ప్రవేశింప నలవిగానిదియునగు శూన్య ప్రదేశముఁ బ్రవేశించిరి.

అని, తాత్పర్యము.

కండుర్నామ మహాభాగ స్సత్యవాదీ తపోధనః
మహర్షిః పరమామర్షీ నియమై ర్దుష్ప్రధర్షణః. ౧౨

టీక ॥ మహాభాగః= పూజ్యమయి న యదృష్టముగలవాఁడును; సత్యవాదీ = సత్యముఁబలుకువాఁడును; తపోధనః = తపస్సె ధనముగాఁ గలవాఁడును; నియమైః=తపస్సులచేత; దుష్ప్రధర్షణః=చెనకనలవిగానివాఁడును; పరమామర్షీ = అధికమయిన కోపముగలవాఁడునగు; కండునామ=కండువను పేరుగల; మహర్షిః = పూజ్యుఁడయినబుషి; ఆసీత్ (అధ్యాహృతము)=ఉండెను.

మహాత్ముండును సత్యవాదియు మహాతపస్సంపన్నుండును దపోబలంబున సమీపించుటకేని యలవిగానివాఁడును అధికకోపము గలవాడునగు కండవనుమహర్షి యొకఁడుండెను.

అని, తాత్పర్యము.

తస్య తస్మి న్వనే పుత్త్రో బాల ష్షోడశవార్షికః
ప్రణష్టో జీవితాంతాయ క్రుద్ధ స్తత్ర మహామునిః. ౧౩

టీక॥ తస్మిన్=ఆ; వనే=అడవియందు; తస్య = ఆకండుమహర్షియొక్క; షోడశవార్షికః= పదునాఱుసంవత్సరములుగల; బాలః=చిన్నవాఁడు; ప్రణష్టః=మృతిఁబొందెను. మహామునిః = కండుమహాముని; జీవితాంతాయ = ప్రాణనాశముకొఱకు; తత్ర= ఆవనమువిషయమయి;క్రుద్ధః=కోపించెను.

ఆవనమునందు, ఆకండుమహర్షిపుత్త్రుఁడొకఁడు పదునాఱేండ్లవాఁడు మృతిఁబొందెను; అమ్మహర్షి, తనకొమరుడు మృతిఁబొందుటకై, అవ్వనంబుమీఁద మహాకోపంబునొందెను.

అని, తాత్పర్యము.

తేన ధర్మాత్మనా శప్తం కృత్స్నం తత్ర మహ ద్వనమ్
అశరణ్యం దురాధర్షం మృగపక్షివివర్జితమ్. ౧౪

స ౪౮

టీక॥ ధర్మాత్మనా = ధర్మస్వభావుండగు; తేన = ఆకండుమహర్షిచేత; తత్ర=అచట; కృత్స్నం = సమస్తమయిన; మహత్ = గొప్పదగు;వనం=అడవి; అశరణ్యం = ఆశ్రయింపయోగ్యముకానిదిగాను; దురాధర్షం= చెనకనలవిగానిదిగాను; మృగపక్షివివర్జితం = మృగములచేతను పక్షులచేతను విడువఁబడినదిగాను; శప్తం = శపింపఁబడినది.

ఆధర్మాత్ముండు, అచటమహావనంబంతయు, ఎవ్వరికిని వాసయోగ్యముగాకదుష్ప్రవేశమయి మృగంబులుగాని పక్షులుగాని లేనిదై యుండునట్లు శపియించెను. అని, తాత్పర్యము.

తస్య తే కాననాంతాంశ్చ గిరీణాం కందరాణిచ
ప్రభవాని నదీనాం చ విచిన్వంతి సమాహితాః. ౧౫

టీక॥ తే=ఆవానరులు; సమాహితాః=పూనికగలవారలయి; తస్య=ఆప్రదేశముయొక్క; కాననాంతాంశ్చ= వనమధ్యప్రదేశములను; గిరీణాం=పర్వతములయొక్క; కందరాణిచ = గుహలను; నదీనాం=ఏర్లయొక్క; ప్రభవానిచ=ఉత్పత్తిస్థానములను; విచిన్వంతి=వెదకిరి.

అవ్వానరవీరులు, ఆశూన్యప్రదేశమునందలి వనమధ్యములను పర్వతగుహలను నదులయుత్పత్తిస్థానములను బూనికతోఁ జక్కఁగా వెదకిరి. అని, తాత్పర్యము.

తత్రచాపి మహాత్మానో నాపశ్యన్ జనకాత్మజామ్
హర్తారం రావణంవాపి సుగ్రీవప్రియకారిణః. ౧౬

టీక॥ తత్రచాపి= ఆప్రదేశమునందుఁగూడ; సుగ్రీవప్రియకారిణః= సుగ్రీవునకుఁ బ్రియమయిన కార్యమును జేయునట్టి; మహాత్మానః=అధికమయిన ధైర్యముగలవానరులు;జనకాత్మజాం= జనకమహారాజుకొమార్తెయగుసీతనుగాని; హర్తారం=అపహరించిన; రావణంవాపి = రావణునిఁగాని; నాపశ్యన్=చూడరైరి.

అచటఁగూడ, సుగ్రీవాజ్ఞా కారులగుమహాధైర్యశాలులయిన యవ్వానరులు,సీతనుగాని, ఆబిడనపహరించినరావణునిగాని కానరైరి.

అని, తాత్పర్యము.

అభ్యధావత సంక్రుద్ధో ముష్టి ముద్యమ్య సంహితమ్. ౧౯

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆ రాక్షసుఁడు; సంహితం= పట్టఁబడిన; ముష్టిం = పిడికిలిని; ఉద్యమ్య= ఎత్తి; సంక్రుద్ధః = మిక్కిలియుఁ గోపించిన వాఁడై; అభ్యధావత = మీఁదికిఁబరుగెత్తెను.

అంత నారాక్షసుండు, పరమకుపితుండై దృఢముగాఁబిడికిలి యలవరించి, వానరులమీఁది కడరెను.

అని, తాత్పర్యము.

తమాపతంతం సహసా వాలిపుత్రోఽంగద స్తదా
రావణో ఽయ మితి జ్ఞాత్వా తలేనాభిజఘాన హ. ౨౦

టీక॥ తదా = అప్పుడు; వాలిపుత్రః=వాలికుమారుఁడగు;అంగదః= అంగదుఁడు; ఆపతంతం=వచ్చుచున్న; తం=ఆరాక్షసుని; "అయం=ఈతఁడు; రావణః=రావణుఁడు;" ఇతి=అని;జ్ఞాత్వా=తలఁచి; సహసా= శీఘ్రమున; తలేన=అఱచేతచేత; అభిజఘాన=కొట్టెను "హ" అనునది పాదపూరణార్థము.

అంత వాలికుమారుండగునంగదుండు, ఆరాక్షసుండుపైకివచ్చుచుండుటం జూచి, "యితఁడే రావణుం"డని తలఁచి, శీఘ్రంబుననతనినఱచేతంజఱచెను.

అని, తాత్పర్యము.

స వాలిపుత్రాభిహతో వక్త్రాచ్ఛోణిత ముద్వమన్
అసురో న్యపత ద్భూమౌ పర్యస్త ఇవ పర్వతః. ౨౧

టీ॥ సః=ఆ; అసురః=రాక్షసుఁడు; వాలిపుత్రాభిహతః=వాలికొడుకయినయంగదునిచేఁగొట్టఁబడినవాఁడై; వక్త్రాత్=నోటనుండి; శోణితం= నెత్తురును; ఉద్వమన్=క్రక్కుచు; పర్యస్తః=పడఁద్రోయఁబడిన; పర్వతఇవ=కొండవలె; భూమౌ=నేలయందు;న్యపతత్ = పడెను.

అయ్యసుర, వాలిపుత్త్రుండగు నంగదునియఱచేతిదెబ్బకు నోటనెత్తురుగ్రక్కుచుఁ, బర్వతంబుకూలునట్లు, నేలంగూలెను. అని, తాత్పర్యము.

తే పి తస్మి న్నిరుచ్ఛ్వాసే వానరా జితకాశినః

వ్యచిన్వ న్ప్రాయశ స్తత్ర సర్వం త ద్గిరిగహ్వరమ్. ౨౨

టీక॥ తస్మిన్=ఆ రాక్షసుఁడు; నిరుచ్ఛ్వాసే=ఊర్పులులేనివాఁడుకాఁగా, మృతుండుగాఁగాననుట; జితకాశినః=జయముచేఁబ్రకాశించునట్టి; తే = ఆ; వానరాఅపి = వానరులును; తత్ర = అచ్చట ; ప్రాయశః = తఱుచుగా; తత్=ఆ; గిరిగహ్వరం = పర్వతగుహను;సర్వం=సమస్తమును; వ్యచిన్వన్= వెదకిరి.

ఆ రాక్షసుఁడు మృతిఁబొందినపిదప, జయము నొందినయావానరులు, అచట నే రావణుఁడనియు, ఆగుహయందు సీతయుండుననియు తలఁచి, యాపర్వతగుహయంతయుఁ, బలుమాఱుచక్కఁగా వెదకిచూచిరి. అని, తాత్పర్యము.

విచితం తు తతః కృత్వా సర్వే తే కాననం పునః
అన్య దేవా పరం ఘోరం వివిశు గిరిగహ్వరమ్. ౨౩

టీక॥ తతః=అంత; తే=ఆవానరులు; సర్వే=అందఱును; కాననం= అడవిని; విచితం=వెదకఁబడినదానిఁగా; కృత్వాతు=చేసినంతనె; పునః= మఱల; అన్యత్=ఇతరమయిన; అపరం = సమీపమునందున్న; ఘోరం= భయంకరమయిన; గిరిగహ్వరం = పర్వతగుహను; వివిశురేవ = ప్రవేశింపనేప్రవేశించిరి.

అంతనవ్వానరులు, ఆ యడవియంతయు వెదకి, యంతనిలువక, మఱలదానిసమీపంబుననుండు మఱియొకభయంకరమయిన పర్వతగుహఁజొచ్చిరి.

అని, తాత్పర్యము.

తే విచిత్య పునః ఖిన్నా వినిష్పత్య సమాగతాః
ఏకాంతే వృక్షమూలే తు నిషేదు ర్దీనమానసాః. ౨౪

టీక ॥ తే=ఆవానరులు; పునః=మఱల; విచిత్య=వెదకి; ఖిన్నాః = అలసినవారలయి; వినిష్పత్య=వెడలి; సమాగతాః = చేరినవారలయి; దీనమానసాః = దుఃఖితమయిన మనస్సుగలవారలయి; ఏకాంతే = విజనప్రదేశమునందు; వృక్షమూలే = చెట్టుయొక్కయడుగునందు; నిషేదుః=కూర్చుండిరి.

ఆవానరులు, ఆగుహయందును వె
దకినపుడటను సీతంగానక, యలసి, ప
రమదుఃఖితులయి, యేకాంతంబున నొ
కచెట్టుక్రిందనందఱునొకటిగాఁగూర్చుం
డిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే,అష్టచత్వారింశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ,గిష్కింధాకాండాష్టచత్వారింశసర్గటీక,
ముగిసినది.

శ్రీః

ఏకోనపంచాశస్సర్గప్రారంభః.

అథాంగద స్తదా సర్వా న్వానరా నిద మబ్రవీత్
పరిశ్రాంతో మహాప్రాజ్ఞ స్సమాశ్వాస్య శనై స్వచః. ౧

టీక ॥ అథ = అటుపిమ్మట; తదా=
అప్పుడు; మహాప్రాజ్ఞః = మహాపండి
తుండగు; అంగదః = అంగదుండును;ప
రిశ్రాంతః=అలసినవాఁడై;వానరాన్=
వానరులను; సర్వాన్ = అందఱను;
సమాశ్వాస్య = ఊఱడించి; శనైః=తి
న్నఁగా; ఇదం=ఈ; వచనం= మాట
ను; అబ్రవీత్=పలికెను.

అంత, మహాపండితుండగునంగదుం
డు, మిక్కిలియు నలసటనొంది, సమ
స్తవానరులం జూచి, వారల నూఱడిం
పుచు, తిన్నగా నిట్లనిపలికెను.
అని, తాత్పర్యము.

వనాని గిరయో నద్యో దుర్గాణి గహనానిచ
దర్యో గిరిగుహాశ్చైవ విచితా న స్సమంతతః. ౨

టీక ॥ వనాని = సాధారణములైన అడవులును; గిరయః = పర్వతములును; నద్యః = ఏర్లును; దుర్గాణి = దూరరానివి; గహనానిచ = అడవులును; దర్యః = బిలములును; గిరిగుహాశ్చైవ = పర్వతగుహాలును; నః (అస్మాభిః) = మనచేత; సమంతతః = అంతటను; విచితాః = వెదకఁబడినవి.

సాధారణంబులగు వనంబులును బర్వతంబులును నదులును బ్రవేశింప నలవిగాని కాఱడవులును బిలంబులును బర్వతగుహలును చక్కఁగా వెదకిచూచినాము. అని, తాత్పర్యము.

తత్రతత్ర సహాస్మాభి ర్జానకీనచ దృశ్యతే
తద్వా రక్షో హృతా యేన సీతా సురసుతోపమా. ౩

టీక॥ తత్రతత్రసహ = ఆయాస్థలములయందును; అస్మాభిః = మనచేత; జానకీనః = సీతయును గాని; యేన = ఎవ్వనిచేత; సురసుతోపమా = దేవకన్యకతోఁబోలిన; సీతా = సీత; హృతా = అపహరింపఁబడినదో; తత్ = ఆ; రక్షోవా = రాక్షసుండైనఁగాని; నదృశ్యతే = చూడఁబడలేదు.

ఆస్థలంబులనెందుఁజూచినను, సీతాదేవినిగాని, దేవకన్యవంటిదైన యామెను హరించిన రాక్షసునిగాని, యెంతమాత్రమును గానలేకపోయితిమి. అని, తాత్పర్యము.

కాలశ్చ నో మహా న్యాత స్సుగ్రీవ శ్చోగ్రశాసనః
తస్మా ద్భవంత స్సహితా విచిన్వంతు సమంతతః. ౪

టీక ॥ నః = మనకు; మహాన్ = అధికమగు; కాలశ్చ = కాలముగూడ; యాతః = కడచినది. సుగ్రీవశ్చ = సుగ్రీవుఁడును; ఉగ్రశాసనః = భయంకరమయినయాజ్ఞ గలవాఁడు. తస్మాత్ = అందువలన; భవంతః = మీరలు; సహితాః = కూడినవారలయి; సమంతతః = అంతటను; విచిన్వంతు = వెదకుదురుగాక.

మనకుఁగాలమో చాలఁగడచినది; సుగ్రీవుఁడో తీక్ష్ణంబుగా దండించువాఁడు; కావున మీరలు ఉపేక్షసేయకయందఱుంగూడి చక్కగా నంతటను వెదకుఁడు. అని, తాత్పర్యము.

విహాయ తంద్రీం శోకంచ నిద్రాంచైవ సముత్థితామ్

విచిన్వన్తస్తాం యథా సీతాం పశ్యామో జనకాత్మజామ్. ౫

టీక॥ యూయం(అధ్యాహృతము)= మీరలు; తంద్రీం = సోమరితనమును; శోకంచ=దుఃఖమును; సముత్థితాం = లేచిన; నిద్రాంచైవ= నిదురను; విహాయ=విడిచి; యథా=ఎట్లు; జనకాత్మజాం=జనకునికూఁతురయిన; సీతాం= సీతను; పశ్యామః = చూతుమో; తథా (అధ్యాహృతము)= అట్లు; విచిన్వన్తు=వెదకుఁడు.

మీరలు, సోమరితనమొందక, దుఃఖంబునకులోఁబడక నిదురవోవక, మనకు జనకమహారాజపుత్త్రియగు సీతాదేవిలభించునట్లు చక్కఁగా వెదకుఁడు. అని, తాత్పర్యము.

అనిర్వేదంచ దాక్ష్యంచ మనసశ్చాపరాజయః
కార్యసిద్ధికరాణ్యాహు స్తస్మాదేతద్బ్రవీమ్యహమ్. ౬

టీక॥ అనిర్వేదంచ=విసుగులేమియు; దాక్ష్యంచ=ఉత్సాహమును; మనసః= మనసుయొక్క; అపరాజయః= అపజయములేమియు, ధైర్యమునను; ఏతాని(అధ్యాహృతము) = ఇవి; కార్యసిద్ధికరాణి = కార్యసిద్ధినిజేయునవి; ఇతి (అధ్యాహృతము)=అని; ఆహుః=చెప్పెదరు. తస్మాత్ = అందువలన; అహం=నేను; ఏతత్ = ఈమాటను; బ్రవీమి = చెప్పుచున్నాను.

విసుగులేమియు ఉత్సాహంబును ధైర్యంబును, ఇవి కార్యసిద్ధిని గలుగఁజేయునని పెద్దలు వక్కాణింతురు; కావున నేనిట్లు వచించితిని. అని, తా.

అద్యాపి తద్వనం దుర్గం విచిన్వన్తు వనౌకసః
ఖేదం త్యక్త్వా పునస్సర్వైర్వనమేతద్విచీయతామ్. ౭

టీక ॥ అద్యాపి = ఇప్పుడును; వనౌకసః = వానరులు; దుర్గం = ప్రవేశింపరానట్టి; తత్=ఆ; వనం=అడవిని; విచిన్వంతు = వెదకుదురుగాక. సర్వైః = అందఱిచేతను; ఖేదం=అలసటను; త్యక్త్వా=విడిచి; పునః=మఱల; ఏతత్=ఇది; విచీయతాం = వెదకఁబడుఁగాక.

మఱియొకమాఱు, దుర్గంబగు నీవనమును వెదకుఁడు; అందఱును అలసటనువదలి మఱలనావనమును వెదకిచూడుఁడు. అని, తాత్పర్యము.

అవశ్యం క్రియమాణస్య దృశ్యతే కర్మణః ఫలమ్
అలం నిర్వేద మాగమ్య నహినో మీలనం క్షమమ్. ౮

టీక॥ క్రియమాణస్య= చేయఁబడుచున్న; కర్మణః=కార్యముయొక్క; ఫలం=ఫలము; అవశ్యం=తప్పక; దృశ్యతే=చూడఁబడును. నిర్వేదం= విసుగును; ఆగమ్య=పొంది; అలం=చాలును. నః=మనకు; మీలనం=నిద్రించుట; నక్షమంహి=యుక్తముకాదుగదా!

కార్యముచేసినయెడఁ దప్పక ఫలముగలుగును; కాఁబట్టి, విసుగుపడుట చాలును; ఇఁక లెండు; ఇట్లునిదురపోవుటమనకెంతమాత్రముయుక్తముగాదు.

అని, తాత్పర్యము.

సుగ్రీవః కోపనో రాజా తీక్ష్ణదండశ్చ వానరః
భేతవ్యం తస్య సతతం రామస్యచ మహాత్మనః. ౯

టీక ॥ రాజా = రాజయిన; వానరః=వానరుఁడగు; సుగ్రీవః= సుగ్రీవుఁడు; కోపనః= కోపముగలవాఁడు; తీక్ష్ణదండః = కఠినమయిన శిక్షగలవాఁడు. తస్య=అతనికి, అతనివలనననుట; సతతం=ఎల్లప్పుడును; భేతవ్యం = భయపడవలెను. మహాత్మనః= అధికమయినపరాక్రమముగల; రామస్యచ = రామునకును, రాముని వలనను; భేతవ్యం (అధ్యాహృతము) = భయపడవలెను.

వానరరాజగు సుగ్రీవుఁడు మిక్కిలియుఁ గోపముగలవాఁడు, తీక్ష్ణముగా దండించును; కావున, నతని యాజ్ఞను ఎప్పుడునుభయముతోఁగావింపవలెను; రాముండును మహాప్రభావుండు గావున నతనికిని భయపడవలెను.

అని, తాత్పర్యము.

హితార్థ మేత దుక్తంవః క్రియతాం యది రోచతే
ఉచ్యతాం వా క్షమం యన్న స్సర్వేషా మేవ వానరాః. ౧౦

టీక ॥ వానరాః = వానరులారా! ఏతత్= ఇది; వః=మీయొక్క; హితార్థం = మేలుకొఱకు; ఉక్తం= చెప్పఁబడినది. రోచతేయది = రుచించునేని; క్రియతాం = చేయఁబడుఁగాక, వాఁలేక; నః=మనకు; సర్వేషామేవ=అం

దబడునేఁ; యత్=ఏది; క్షమం=హితమో; తత్=అది; ఉచ్యతాం=చెప్పఁబడుఁగాక.

వానరులారా! మీమేలుకొఱకై యే నేనింత చెప్పినాను; మీకిష్టమగునేని, యథార్థంబుగావింపుఁడు; లేక, మనకందఱకుహితమైనదిమఱియొకకార్యముండినయెడదానినైననుజెప్పుఁడు. అని,యంగదుఁడు వానరులతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

అంగదస్య వచశ్శ్రుత్వా వచనం గంధమాదనః
ఉవాచా వ్యక్తయా వాచా పిపాసాశ్రమఖిన్నయా. ౧౧

టీక॥ గంధమాదనః= గంధమాదనుఁడు; అంగదస్య=అంగదునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; పిపాసాశ్రమఖిన్నయా=దప్పిచేతను అలసటచేతనుదీనమైనదియు; అవ్యక్తయా=స్పష్టముకానిదియునగు; వాచా=వాక్కుచేత; వచనం=మాటను; ఉవాచ = పలికెను.

అంగదుండు చెప్పిన వచనంబువిని, గంధమాదనుండు దప్పిచేతను అలసటచేతనుబాధితుండగుటచే నస్పష్టముగా దీనస్వరంబున నిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

సదృశం ఖలు వో వాక్య మంగదో య దువాచ హ
హితంచైవానుకూలంచ క్రియతా మస్య భాషితమ్. ౧౨

టీక॥ అంగదః=అంగదుఁడు; వః=మీకు; యత్=ఏ; వాక్యం = మాటను; ఉవాచ=చెప్పెనో; ("హ"అనునదిపాదపూరణార్థము) తత్ (అధ్యాహృతము)=అది; సదృశం = సరియయినది. హితంచైవ=మేలుకలిగించునదియు; అనుకూలంచ = అనుకూల్యముగలదియునగు; అస్య = ఈతనియొక్క; భాషితం=మాట; క్రియతాం = చేయఁబడుఁగాక.

అంగదుండు మీకుఁజెప్పినమాట మిక్కిలియుయుక్తము; అట్లు చేయుటవలన మీకుహితంబును,ఆనుకూల్యంబును కలుగును; కావున నాప్రకారము గావింపుఁడు. అని, తాత్పర్యము.

పున ర్మార్గామహే శైలాన్ కందరాంశ్చ దరీ స్తథా
కాననాని చ శూన్యాని గిరిప్రస్రవణానిచ. ౧౩

స ౪౯

టీక ॥ శైలాన్ = పర్వతములను; కందరాంశ్చ=గుహలను; తథా=అట్లు; దరీః=బిలములను; శూన్యాని= పాడైన; కానవానిచ=అడవులను; గిరిప్రస్థానిచ= పర్వతములయొక్క సెలయేళ్లను; పునః=మరల; మార్గామహై= వెదకుదము.

పర్వతంబులయందును గుహలయందును బిలములయందును నిర్జనములగు వనములయందును కొండసెలయేర్లయందును, మరల జక్కగా వెదకుదము. అని, తాత్పర్యము.

యథోద్దిష్టాని సర్వాణి సుగ్రీవేణ మహాత్మనా
విచిన్వంతు వనం సర్వే గిరిదుర్గాణి సర్వశః. ౧౪

టీక ॥ సర్వే = అందఱును; మహాత్మనా = అధికమయినప్రభావముగల; సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; యథా= ఎట్లు; ఉద్దిష్టాని = చెప్పబడినవో; తథా (అధ్యాహార్యము)=అట్లు; సర్వాణి=సమస్తములయిన; వనం = అడవిని; గిరిదుర్గాణి=పర్వతములయందలి దుర్గమప్రదేశములను; సర్వశః= అన్నివిధములను; విచిన్వంతు= వెదకుదురు.

మహానుభావుండగు సుగ్రీవుం డాజ్ఞాపించినప్రకారంబున, మీరలందఱుం జేరి, వనంబులందును పర్వతములందలి దుర్గమప్రదేశంబులందును సీతాదేవిని వెదకుడు. అని, గంధమాదనుండు వానరులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తత స్సముత్థాయ పున ర్వానరా స్తే మహాబలాః
వింధ్యకాననసంకీర్ణాం విచేరు ర్దక్షిణాందిశమ్. ౧౫

టీక ॥ తతః = అటుపిమ్మట; మహాబలాః = అధికమయినబలముగల; తే= ఆ; వానరాః = వానరులు; సముత్థాయ=లేచి; వింధ్యకాననసంకీర్ణాం = వింధ్యపర్వతముయొక్క యడవుల చే వ్యాపింపఁబడిన; దక్షిణాందిశం = దక్షిణదిక్కును; విచేరుః=పొందిరి.

అట్లుగంధమాదనుండు చెప్పఁగా, మహాబలశాలులగు నవ్వానరులులేచి, మరల దక్షిణదిక్కునందు వింధ్యపర్వతారణ్యంబుల వెదకనారంభించిరి.

అని, తాత్పర్యము.

తే శారదాభ్రప్రతిమం శ్రీమద్రజతపర్వతమ్
శృంగవంతం దరీమంత మధిరుహ్యచ వానరాః. ౧౬
తత్ర రోధ్రవనం రమ్యం సప్తపర్ణవనానిచ
వ్యచిన్వా స్తే హరివరా స్సీతాదర్శనకాంక్షిణః. ౧౭

టీక॥ తే= ఆవానరులు; శృంగవంతం=శిఖరములుగలదియు; దరీమంతం= గుహలు గలదియు ; శారదాభ్రప్రతిమం = శరదృతువునందలి మేఘములతో బోలికగలదియునగు; శ్రీమద్రజతం = అధికమయినకాంతిగల వెండికొండను, రజతమయమయిన వింధ్యపర్వతమునందలియొకభాగమునుఅట; అధిరుహ్య = ఎక్కి; తత్ర= అచట; సీతాదర్శనకాంక్షిణః=సీతయొక్క చూచుటను గోరునట్టి; తే=ఆ; హరివరాః= వానరశ్రేష్ఠులు; రమ్యం=సుందరమయిన; రోధ్రవనం = అరుగమైగలసమూహమును; సప్తపర్ణవనానిచ = ఏడాకులఅరటి చెట్లవనములను; వ్యచిన్వన్=వెదకిరి.

అవ్వానరోత్తములు, సీతాదర్శనంబు గోరినవారలయి, శిఖరములతోను గుహలతోనుగూడినదియు శరత్కాల మేఘంబుకైవడి ధవళవర్ణంబై భాసిల్లునదియు నగు శ్రీమంతంబయిన వింధ్యపర్వతమునందలి రజతమయమయిన యొకభాగము నారోహించి, అచట రమణీయములగు నారుగు పైరులం బును ఏడాకులఅరటుల వనములయందును సీతాదేవిని వెదకిరి.

అని, తాత్పర్యము.

తస్యాగ్ర మధిరూఢా స్తే శ్రాంతా విపులవిక్రమాః
న పశ్యంతిస్మ వైదేహీం రామస్య మహిషీం ప్రియామ్. ౧౮

టీక॥ విపులవిక్రమాః = అధికమయినపరాక్రమముగలవారలును; శ్రాంతాః = అలసినవారలునగు; తే=ఆవానరులు; తస్య = ఆపర్వతముయొక్క; అగ్రం = శిఖరమును; అధిరూఢాః=ఎక్కినవారలయి; రామస్య = రామునియొక్క; ప్రియాం = ప్రియురాలయిన; మహిషీం=పట్టపురాణియగు; వైదేహీం=సీతను;నపశ్యంతిస్మ=చూడరైరి.

మహాపరాక్రమశాలులగు నావానరులు, అలసటనొందినవారలయ్యు,ఆపర్వతశిఖరము నారోహించి, యచట

నుగూడ, రాముని ప్రియమహిషియగు సీతాదేవిని గానరైరి. అని, తాత్పర్యము.

తే తు దృష్టిగతం కృత్వా తం శైలం బహుకందరమ్
అవారోహంత హరయో వీక్షమాణా స్సమంతతః. ౧౯

టీక॥ తే=ఆ; హరయస్తు=వానరులమాత్రము; సమంతతః=అంతటను; వీక్షమాణాః = చూచుచు; బహుకందరం=పెక్కుగుహలుగల; తం=ఆ; శైలం=పర్వతమును; దృష్టిగతం= చూపునబొందినదానిగా; కృత్వా=చేసి; అవారోహంత=దిగిరి.

అవ్వానరులు, ఆపర్వతమునందంతటను సమస్తగుహలయందును జూచివెదకి, యచట సీతయగపడనందున దిగిరి. అని, తాత్పర్యము.

అవరుహ్య తతో భూమిం శ్రాంతా విగతచేతసః
స్థిత్వా ముహూర్తం తత్రాథ వృక్షమూల ముపాశ్రితాః. ౨౦

టీక॥ శ్రాంతాః = అలసినవారును; విగతచేతసః= పోయినతెలివిగలవారలునగు వానరులు; తతః=ఆపర్వతమునుండి; భూమిం=నేలనుగూర్చి; అవరుహ్య=దిగ్గి; ముహూర్తం= కొంచెముసేపు; స్థిత్వా=నిలచి; అథ=అంత; తత్ర=అచట; వృక్షమూలం=చెట్టుమొక్కఅడుగును; ఉపాశ్రితాః = పొందినారు.

అవ్వానరులు, అట్లు అలసి ప్రజ్ఞదప్పినవారలయి, ఆపర్వతమునుండి నేలకుదిగి, కొంతసేపు నిలువంబడియుండి, యటుపిమ్మట, నొకచెట్టుక్రిందఁ జేరిరి. అని, తాత్పర్యము.

తే ముహూర్తం సమాశ్వస్తాః కించి ద్భగ్నపరిశ్రమాః
పునరేవో ద్యతాః కృత్స్నాం మార్గితుం దక్షిణాం దిశమ్. ౨౧

టీక॥ తే=వారలు; ముహూర్తం= కొంచెముసేపు; సమాశ్వస్తాః = ఊఱటనొందినవారలయి; కించిత్= కొంచెము; భగ్నపరిశ్రమాః = పోయినయలసటనొందినవాలరయి; పునరేవ = మఱలనే; కృత్స్నాం = సమస్తమయిన; దక్షిణాం దిశం = దక్షిణదిక్కును; మార్గితుం= వెదకుటకు; ఉద్యతాః=

సన్నద్ధులయిరి.

అవ్వానరులు, కొంతయలసటదీర్చు కొని యూఱటనొంది, మఱలదక్షిణది శనందంతటను సీతాదేవిని వెదకనా రంభించిరి. అని, తాత్పర్యము.

హనూమత్ప్రముఖా స్తే తు ప్రస్థితాః ప్లవగర్షభాః
విన్ధ్యమేవా దిత స్తావ ద్విచేరు స్తే తత స్తతః. ౨౨

టీక॥ తే=ప్రసిద్ధులయిన; తే=ఆ; హనూమత్ప్రముఖాః = హనుమంతుండు మొదలుగాఁగల; ప్లవగర్షభాః= వానరశ్రేష్ఠులును; ప్రస్థితాః= బయలు దేఱినవారలయి; విన్ధ్యమేవ= విన్ధ్యపర్వతమునే; ఆదితః = మొదటనుండి; తత స్తతః=అచటచట; తావత్= అంతటను; విచేరుః=పొందిరి.

హనుమంతుండు మున్నగు నవ్వానరోత్తములు,మఱల వెదకుటకై బయలుదేఱి, విన్ధ్యపర్వతమున, మొదటనుండి నమస్తప్రదేశములను సంచరించి తిరిగి వెదకిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, కిష్కింధాకాండే, ఏకోనపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ,గిష్కింధాకాండైకోనపంచాశసర్గటీక, ముగిసినది.

---

౫౦

పంచాశసర్గప్రారంభః.

సహ తారాంగదాభ్యాంతు సంగమ్య హనుమాన్ కపిః
విచినోతిస్మ వింధ్యస్య గుహాశ్చ గహనానిచ ౧

టీక॥ కపిః=వానరుఁడయిన; హనుమాన్= హనుమంతుఁడు; తారాంగదాభ్యాంసహతు=తారుఁతోను అంగదునితోనుగూడ; సంగమ్య=చేరి; వింధ్యస్య= వింధ్యపర్వతముయొక్క; గుహాశ్చ=గుహలను; గహనానిచ = వనములను; విచినోతిస్మ=వెదకెను.

హనుమంతుండు తారాంగదులతోఁగూడినవాఁడై,వింధ్యపర్వతమునందలి, గుహలయందును వనంబులయందును, సీతాదేవినన్వేషించెను.

అని, తాత్పర్యము.

సింహశార్దూలజుష్టేషు శిలాశ్చ సరిత స్తథా
విషమేషు నగేంద్రస్య మహాప్రస్రవణేషుచ. ౨

టీక॥ నగేంద్రస్య= పర్వతశ్రేష్ఠమయిన వింధ్యపర్వతముయొక్క; సింహశార్దూలజుష్టేషు = సింహములచేతను బెబ్బులులచేతను సేవింపఁబడిన;విషమేషు= మిట్టపల్లపు ప్రదేశములయందు; శిలాశ్చ=రాళ్లను; తథా=అట్లు; మహాప్రస్రవణేషు = గొప్పసెలయేళ్లయందు; సరితశ్చ = నదులను; విచినోతిస్మ(అధ్యాహృతము)=వెదకెను.

అమ్మహాపర్వతమున,సింహములతోను పెద్దపులులతోనుగూడిన విషమప్రదేశములయందలి విశాలశిలలను,గొప్పసెలయేళ్లయందలి నదులను, హనుమత్ప్రముఖవానరులు వెదకిరి.

అని, తాత్పర్యము.

ఆసేదు స్తస్య శైలస్య కోటిం దక్షిణపశ్చిమామ్
తేషాం తత్రైవ వసతాం సకాలో వ్యత్యవర్తత. ౩

టీక॥ తే (అధ్యాహృతము) = ఆ వానరులు; తస్య=ఆ; శైలస్య = వింధ్యపర్వతముయొక్క;దక్షిణపశ్చిమాం= నిర్ఋతిదిశనుండునట్టి; కోటిం=కొనను;

ఆసేదుః= పొందిరి. తేషాం=వారికి; తత్ర=అచట; వసతామేవ=ఉండఁగా నే; సః=ఆ; కాలః=కాలము, సుగ్రీవుఁడు చెప్పినమాసమనుట; వ్యత్యవర్తత= కడచెను.

అంత నవ్వానరులు, వింధ్యపర్వతముయొక్క నిర్ఋతిదిశకొనకుఁ జేరిరి; వారలచటనుండునప్పుడే, సుగ్రీవుండు విధించిన యవధిమాస మతిక్రమించెను.

అని, తాత్పర్యము.

సహి దేశో దురన్వేష్యో గుహాగహనవా న్మహాన్

టీక॥ గుహాగహనవాన్=గుహలును వనములునుగల; మహాన్= గొప్పదైన; సః=ఆ; దేశః=ప్రదేశము; దురన్వేష్యోహి=వెదకనలవిగానిదిగదా!

ఆవింధ్యప్రదేశము, అధికముగా గుహలును వనములునుగలది గొప్పదికావున, నచట వెదకుట మిక్కిలియుఁ గష్టము; అందువలన నచటనుండునప్పుడె, వారలకు ఆమాసము నతిక్రమించెను.

అని, తాత్పర్యము.

తత్ర వాయుసుత స్సర్వం విచినోతిస్మ పర్వతమ్. ౪
పరస్పరేణ హనుమా నన్యోన్యస్యా విదూరతః

టీక॥ తత్ర=ఆనిర్ఋతిమూలయందు; వాయుసుతః= వాయువుయొక్క కొడుకైన; హనుమాన్= హనుమంతుఁడు; అన్యోన్యస్య=ఒండొరులకు; అవిదూరతః=సమీపమునందు; పరస్పరేణ= ఒండొరులతోఁ; సంగమ్య (అధ్యాహృతము)=చేరి; సర్వం=సమస్తమైన; పర్వతం=కొండను; విచినోతిస్మ=వెదకెను.

ఆనిర్ఋతిదిగ్భాగమునందు, వాయుపుత్త్రుండగు హనుమంతుండు మున్నగు వానరులు, ఒకరికొకరు సమీపముగా నొండొరులతోఁ గలసి, యా పర్వతమునందంతట సీతాదేవిని వెదకిరి.

అని, తాత్పర్యము.

గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః. ౫
మైందశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జాంబవా న్నళః
అంగదో యువరాజశ్చ తారశ్చ వనగోచరః. ౬
గిరిజాలావృతాన్ దేశా న్మార్గిత్వా దక్షిణాం దిశమ్

స ౫౦

విచిన్వంత స్తత స్తత్ర దదృశు ర్వివృతం బిలమ్. ౭

టీక॥ గజః=గజుండును; గవాక్షః=గవాక్షుండును; గవయః=గవయుండును; శరభః=శరభుండును; గంధమాదనః=గంధమాదనుండును; మైందశ్చ=మైందుండును; ద్వివిదశ్చైవ=ద్వివిదుండును; సుషేణః=సుషేణుండును; జాంబవాన్=జాంబవంతుండును; నళః=నళుండును; యువరాజః=యువరాజయిన; అంగదశ్చ=అంగదుండును; తారశ్చ=తారుండును; వనగోచరః=హనుమంతుండును; గిరిజాలావృతాన్=పర్వతసమూహములచేఁ గప్పఁబడిన; దేశాన్=ప్రదేశములను; మార్గిత్వా=వెదకి; దక్షిణాందిశం=దక్షిణదిక్కును; తత్రతత్ర=అచ్చటచ్చట; విచిన్వంతః=వెదకుచు; వివృతం=విస్తీర్ణమయిన; బిలం=రంధ్రమును; దదృశుః=చూచిరి.

గజుండును గవాక్షుండును గవయుండును శరభుండును గంధమాదనుండును మైందద్వివిదులును సుషేణుండును జాంబవంతుండును నళుండును యువరాజయిన యంగదుండును తారుండును హనుమంతుండును, పెక్కు పర్వతములతోఁ గూడినయట్టి ప్రదేశంబుల వెదకి, యంతట దక్షిణదిశయందు ఇతరప్రదేశంబుల వెదకుచుంబోయి, యొకవిస్తీర్ణమగు బిలముం జూచిరి. అని, తాత్పర్యము.

దుర్గ మృక్షబిలం నామ దానవేనాభిరక్షితమ్
క్షుత్పిపాసాపరీతా శ్చ శ్రాంతా శ్చ సలిలార్థినః. ౮
అవకీర్ణం లతావృక్షై ర్దదృశు స్తే మహాబిలమ్

టీక॥ క్షుత్పిపాసాపరీతాః=ఆఁకలిచేతను దప్పిచేతను వ్యాపింపఁబడినవారలును; శ్రాంతాశ్చ=అలసినవారలును; సలిలార్థినః=జలముఁగోరువారలునగు; తే=ఆవానరులు; దుర్గం=పొందనలవిగానిదియు; దానవేన=మయుండను దానవునిచేత; అభిరక్షితం=కాపాడఁబడినదియు; లతావృక్షైః=తీఁగలచేతను బోదలచేతను; అవకీర్ణం=వ్యాపింపఁబడినదియునగు; ఋక్షబిలం=ఋక్షబిలమని ప్రసిద్ధమయిన; మహాబిలం=గొప్పబిలమును; దదృశుః=చూచిరి.

అవ్వానరులు, ఆఁకలియు దప్పియుఁ గొని మిక్కిలియు నలసట నొంది త్రావ

స ౫౦

జలంబులేకదిరుగుచు, మయునిచే సురక్షితంబును ఎట్టివారికినిబ్రవేశింప నలవిగానిదియు లతాగుల్మములచేఁ గప్పఁబడినదియునగు ఋక్షబిలంబనుపేరుగల యొక గొప్పబిలముఁగాంచిరి.

అని, తాత్పర్యము.

తతః క్రౌంచాశ్చ హంసాశ్చ సారసాశ్చాపి నిష్క్రమన్. ౯
జలార్ద్రా శ్చక్రవాకాశ్చ రక్తాంగాః పద్మరేణుభిః

టీక ॥ తతః = ఆబిలమునుండి; జలార్ద్రాః = నీటిచేఁదడిసినవియు; పద్మరేణుభిః = కమలములయొక్క పరాగములచేత; రక్తాంగాః = ఎఱ్ఱనిశరీరములుగలవియునగు; క్రౌంచాశ్చ = క్రౌంచపక్షులును; హంసాశ్చ = హంసపక్షులును; సారసాశ్చాపి = బెగ్గురుపక్షులును; చక్రవాకాశ్చ = చక్రవాకపక్షులును; నిష్క్రమన్ (నిరక్రమన్) = వెడలినవి.

క్రౌంచంబులును హంసలును సారసంబులును జక్రవాకంబులును, నీటిచేఁదడిసి కమలపరాగంబులచే రక్తవర్ణంబులయిన ఱెక్కలతో నాబిలంబునుండి వెడలినవి. అని, తాత్పర్యము.

తత స్తద్బిల మాసాద్య సుగంధి దురతిక్రమమ్. ౧౦
విస్మయవ్యగ్రమనసో బభూవు ర్వానరర్షభాః

టీక॥ తతః = అంత; వానరర్షభాః = వానరశ్రేష్ఠులు; సుగంధి = మంచితావిగలదియు; దురతిక్రమం = ప్రవేశింపనలవిగానిదియునగు; తత్ = ఆ; బిలం = రంధ్రమును; ఆసాద్య = సమీపించి; విస్మయవ్యగ్రమనసః = ఆశ్చర్యమునకుఅధీనమయిన మనస్సుగలవారలు; బభూవుః = అయిరి.

అంత, హనుమంతుండు మున్నగు వానరోత్తములు, సుగంధంబు గుబాళించుచుఁ బ్రవేశించుటకుమాత్రమశక్యముగానున్న యమ్మహాబిలంబుఁజూచి, పరమాశ్చర్యంబు నొందిరి.

అని, తాత్పర్యము.

సంజాతపరిశంకా స్తే తద్బిలం ప్లవగోత్తమాః. ౧౧
అభ్యపద్య న్నసంహృష్టా స్తేజోవంతో మహాబలాః
నానాసత్త్వసమాకీర్ణం దైత్యేంద్ర నిలయోపమమ్. ౧౨
దుర్దర్శ మతిఘోరంచ దుర్విగాహంచ సర్వశః

టీక॥ తేజోవంతః = అధికమయిన పరాక్రమము గలవారలును; మహాబలాః = అధికమయినబలముగలవారలు నగు; తే=ఆ; ప్లవగోత్తమాః= వానరశ్రేష్ఠులు; సంజాతపరిశంకాః= పుట్టినసందేహము గలవారలయి;అసంహృష్టాః=సంతోషింపనివారలయు; నానాసత్త్వసమాకీర్ణం = నానావిధము లయిన జంతువులచే వ్యాపింపఁ బడినదియు; దైత్యేంద్రనిలయోపమం= దైత్యులకుఁ బ్రభువయిన బలిచక్రవర్తియొక్క స్థానమయిన పాతాళముతోఁ బోల్కి గలదియు; దుర్దర్శం= చూడనలవిగానిదియు; అతిఘోరం చ = మిక్కిలి భయంకరంబును; సర్వశః= అన్నివిధములను; దుర్విగాహం చ= ప్రవేశింపనలవిగానిదియునగు; తత్ =ఆ; బిలం=బిలమును; అభ్యపద్యన్ (అభ్యపద్యంత)=పొందిరి, సమీపించిరనుట.

మహాపరాక్రమశాలులును మహాబలశాలులునగు నవ్వానరోత్తములు, నానావిధ జంతువులచే నాక్రమింపఁబడి పాతాళసమానంబై చూడనలవిగానిదై మహాభయంకరంబై యెంతమాత్రము ప్రవేశింపఁ శక్యముగాని యమ్మహాబిలంబుఁజూచి, యిది పాతాళమో లేక రాక్షసమాయయో యని సందేహించి, సంతోషము లేనివారలయి యబ్బిలంబు సమీపమునకుఁ బోయిరి. అని, తాత్పర్యము.

తతః పర్వతకూటాభో హనుమాన్ పవనాత్మజః. ౧౩
అబ్రవీ ద్వానరాన్ సర్వాన్ కాంతారవనకోవిదః

టీక॥ తతః = అటుపిమ్మట; కాంతారవనకోవిదః= గొప్పనుడవులను సాధారణములయిన వనములను బాగుగ నెఱిఁగినవాఁడును; పర్వతకూటాభః = పర్వతశిఖరముయొక్క కాంతివంటి కాంతిగలవాఁడును; పవనాత్మజః = వాయుదేవునికొడుకునగు; హనుమాన్ = హనుమంతుఁడు; వానరాన్ = వానరులను; సర్వాన్= అందఱినిగూర్చి; అబ్రవీత్=పలికెను.

అంత, వనదుర్గంబులయందధికము గా సంచారముగల వాఁడును పర్వతశిఖరాకారుండును హనుమంతుఁడు సమస్తవానరులంజూచి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

గిరిజాలావృతాన్ దేశాన్ మార్గిత్వా దక్షిణాం దిశమ్. ౧౪

వయం సర్వే పరిశ్రాంతా నచపశ్యామ మైథిలీమ్

టీక॥ వయం=మనము; సర్వే=అందఱము; దక్షిణాందిశం (అత్యంతసంయోగద్వితీయ)= దక్షిణదిక్కునందు; గిరిజాలావృతాః = పర్వతసమూహములచేఁగప్పఁబడిన; దేశాః= ప్రదేశములను; మార్గిత్వా= వెదకి; పరిశ్రాంతాః= అలసటనొందినాము. మైథిలీం=సీతను; నచపశ్యామః= చూడనులేము.

దక్షిణదిక్కునందుఁ బర్వతప్రాయములగు ప్రదేశముల నధికముగా వెదకి మనమందఱము నలసటనొందియున్నాము; సీతనుంగానమైతిమి.

అని, తాత్పర్యము.

అస్మాచ్చాపి బిలాద్ధంసాః క్రౌంచాశ్చ సహ సారసైః. ౧౫
జలార్ద్రాశ్చక్రవాకాశ్చ నిష్పతంతిస్మ సర్వతః

టీక॥ అస్మాత్=ఈ; బిలాచ్చాపి = గుహనుండియు; జలార్ద్రాః= నీటందడిసిన; హంసాః= హంసలును; క్రౌంచాశ్చ=క్రౌంచపక్షులును; చక్రవాకాశ్చ=చక్రవాకములును; సారసైస్సహ= సారసపక్షులతోఁగూడ; సర్వతః= అంతటను; నిష్పతంతిస్మ=వెడలినవి.

మఱియు నీ గుహనుండి హంసలును గ్రౌంచంబులును సారసంబులును జక్రవాకంబులును, నీటందడిసిన పక్షులతో వెడలివచ్చుచున్నవి.

అని, తాత్పర్యము.

నూనం సలిలవా నత్ర కూపోవా యదివా హ్రదః. ౧౬
తథాచేమే బిలద్వారే స్నిగ్ధా స్తిష్ఠంతి పాదపాః

టీక॥ తథా=అట్లు; ఇమే = ఈ; స్నిగ్ధాః= మెఱుఁగుగల; పాదపాశ్చ = వృక్షములును; బిలద్వారే= గుహవాకిటను; తిష్ఠంతి=ఉన్నవి. అత్ర= ఈగుహయందు; సలిలవాన్= జలముగల; కూపోవా= బావిగాని; హ్రదో యదివా = తటాకముగాని; అస్తి (అధ్యాహృతము)= కలదు. నూనం = నిశ్చయము.

మఱియు, నీగుహవాకిట వృక్షములు పచ్చగానున్నవి; కాఁబట్టి, ఈగుహయందు, జలసమృద్ధమైనబావి గాని తటా

కముగానియున్నది; వాస్తవము. అని, హనుమంతుండు చెప్పెను. అని, తా.

ఇత్యుక్తే తద్బిలం సర్వే వివిశు స్తిమిరావృతమ్. ౧౭
అచంద్రసూర్యం హరయో దదృశూ రోమహర్షణమ్

టీక॥ ఇతి=అని; ఉక్తే=చెప్పఁబడి నదగుచుండఁగా; హరయః = వానరులు; సర్వే=అందఱును; తత్ =ఆ; బిలం= గుహను; వివిశుః = చొచ్చిరి. అచంద్రసూర్యం=చంద్రుండును సూర్యుండును లేనిదియు; తమిరావృతం=చీఁకటిచేఁ గప్పఁబడినదియును; రోమహర్షణం=వెంట్రుకలు నిక్కఁబొడుచుకొనునట్లు ప్పఁజేయునది యునగు; బిలం (అధ్యాహృతము)=గుహను; దదృశుః=చూచిరి.

ఇట్లు హనుమంతుండు చెప్పుటయు, నవ్వానరులందఱు, ఆబిలంబుఁ బ్రవేశించి, యచట, చంద్రసూర్యులకిరణంబులు ప్రసరింపమిం జేసి భయంకరంబుగా నంధకారంబు నిండియుండుటం గనిరి. అని, తాత్పర్యము.

నిశామ్య తస్మాత్సింహాంశ్చ తాంస్తాంశ్చ మృగపక్షిణః. ౧౮
ప్రవిష్టా హరిశార్దూలా బిలం తిమిరసంవృతమ్

టీక॥ హరిశార్దూలాః = వానరశ్రేష్ఠులైన; బిలం=గుహను; ప్రవిష్టాః=చొచ్చినవారు: తస్మాత్ = ఆబిలమునుండి; వచ్చి.
తిమిరసంవృతం (అధ్యాహృతము) = చీఁ ... ఆ వానరోత్తములు, ఆబిలమునుండి వచ్చు; సింహాంశ్చ = సింహములను; ఆ వెడలివచ్చు సింహములను మఱియు తాంస్తాన్=ఆయా; మృగపక్షిణశ్చ= నానావిధములగు మృగములను బకులను మృగములనుపకులను; నిశామ్య=చూచుచును, నంధకారావృతంబగు నాబి; తిమిరసంవృతం = చీఁకటిచేఁగప్పఁబడిన బిలముం బ్రవేశించిరి. అని, తాత్పర్యము.

న తేషాం సజ్జతే చక్షు ర్న తేజో న పరాక్రమః. ౧౯
వాయోరివ గతి స్తేషాం దృష్టి స్తమసి వర్తతే

టీక॥ తేషాం=ఆవానరులయొక్క; చక్షుః=కన్ను; నసజ్జతే=సమర్థముకా లేదు. తేజః=ఇతరులవలనోడఁబడనిశక్తి; న (సజ్జతే)= సమర్థముకాలేదు. పరా

స ౫౦

తే నష్టసంజ్ఞా స్తృషితా స్సంభ్రాన్తా స్సలిలార్థినః. ౨౨
పరిపేతు ర్బిలే తస్మిన్ కంచి త్కాల మతంద్రితాః

టీక ॥ తే=ఆవానరులు; తృషితాః= దప్పిగొన్నవారలయి; సలిలార్థినః= జలముగోరినవారలయి; అతంద్రితాః = సోమరితనము లేనివారలయి; నష్టసంజ్ఞాః = పోయినతెలివిగలవారలయి; సంభ్రాన్తాః = తొట్రుపాటుగలవారలయి; తస్మిన్=ఆ; బిలే = గుహయందు; కంచిత్ కాలం = (అత్యంతసంయోగద్వితీయ) కొంతకాలమందు; పరిపేతుః=తిరిగిరి.

అవ్వానరులు, దప్పిగొని జలంబుగానక, మిక్కిలియు నలసటనొంది సంజ్ఞదప్పి తొట్రుపడుచున్న సోమరితనము నొందక, నా బిలమునందు, గొంత కాలము, తిరిగిరి. అని, తాత్పర్యము.

తే కృశా దీనవదనాః పరిశ్రాన్తాః ప్లవంగమాః. ౨౩
ఆలోకం దదృశు ర్వీరా నిరాశా జీవితే తదా

టీక॥ కృశాః = సన్నగిల్లినవారలును; దీనవదనాః = దుఃఖితమైనముఖముగలవారలును; పరిశ్రాన్తాః= అలసటనొందినవారలును; జీవితే=బ్రతుకునందు; నిరాశాః= ఆశలేనివారలును గు; తే=ఆ; ప్లవంగమాః=వానరులు; తదా=అప్పుడు; ఆలోకం=వెలుతురును; దదృశుః=చూచిరి.

అవ్వానరులు, అట్లంధకారంబునందిరుగుచు దప్పిపాసలచే బరిశ్రాంతులయి కృశించి ముఖంబున దైన్యంబుదోప, బ్రతుకుపైనయుమయి యాశవదలి దుఃఖితులయి, కొంతకాలమునకు, వెలుతురుగాంచిరి. అని, తాత్పర్యము.

తత స్తం దేశమాగమ్య సౌమ్యం వితిమిరం వనమ్. ౨౪
దదృశుః కాంచనా న్వృక్షాన్ దీప్తవైశ్వానరప్రభాన్
సాలాం స్తాలాంశ్చ పున్నాగాన్ కకుభా న్వంజులాన్ ధవాన్. ౨౫
చంపకా న్నాగవృక్షాంశ్చ కర్ణికారాంశ్చ పుష్పితాన్

టీక ॥ తతః = అటుపిమ్మట; తే (అధ్యాహృతము) = ఆవానరులు; సౌ

...ర్యాం = సుందరమును; వితిమిరం=చీకటిలేనిదియునగు; వనం=వనమయిన; తం=ఆ; దేశం = ప్రదేశమును; ఆగమ్య=పొంది; దీప్తవైశ్వానరప్రభాన్= మండుచున్నయగ్నియొక్క కాంతివంటి కాంతిగల; కాంచనాన్ = బంగారువికారములయిన; వృక్షాన్ = చెట్లను; సాలాన్ = మద్దిచెట్లను; తాలాంశ్చ= తాటిచెట్లను; పున్నాగాన్ = సురపొన్నచెట్లను; కకుభాన్ = ఏఱుమద్దిచెట్లను; వంజుళాన్ = అశోకవృక్షములను; ధవాన్ = చంద్రచెట్లను; చంపకాన్ = సంపంగిచెట్లను;నాగవృక్షాంశ్చ = నాగకేసరముచెట్లను; పుష్పి తాన్=పూచిన; కర్ణికారాంశ్చ=కొండగోఁగుచెట్లను; దదృశుః= చూచిరి.

అంత, నవ్వానరులు , అంధకారవర్జితమయి ప్రకాశమయినరమణీయంబగు నవ్వనప్రదేశము నొంది, యచట, మండుచున్నయగ్నివలె దేదీప్యమానములయిన కాంచనవృక్షములను మద్దిచెట్లను తాటిచెట్లను సురపొన్నచెట్లను ఏఱుమద్దిచెట్లను అశోకవృక్షములనుచంద్రిచెట్లను సంపంగిచెట్లను నాగకేసరవృక్షములను పుష్పితంబులగు కొండగోఁగులనుం జూచిరి.

అని, తాత్పర్యము.

స్తబకైః కాంచనై శ్చిత్రై రక్తైః కిసలయై స్తథా. ౧౮
ఆపీడైశ్చ లతాభిశ్చ హేమాభరణభూషితాన్
తరుణాదిత్య సంకాశాన్ వైడూర్య కృత వేదికాన్. ౧౯
విభ్రాజమానా న్వపుషా పాదపాంశ్చ హిరణ్మయాన్

టీక ॥ తే (అధ్యాహృతము)= ఆ వానరులు; కాంచనైః= బంగారువికారములయిన; చిత్రైః = సుందరములగు; స్తబకైః=పూగుత్తులచేతను; తథా=అట్లు; రక్తైః= ఎఱ్ఱనైన; కిసలయైః=చిగుళ్ళచేతను; ఆపీడైః= శేఖరములచేతను; లతాభిశ్చ = తీఁగెలచేతను; శోభితాన్ (అధ్యాహృతము) = ప్రకాశించుచున్నవియు; హేమాభరణభూషితాన్= బంగారుభూషణములచే నలంకృతములును, ఫలములయిన బంగారుభూషణములచే నలంకృతములునుట; తరుణాదిత్యసంకాశాన్ = బాలసూర్యునితోసమానములును; వైడూర్యకృతవేదికాన్= వైడూర్యమణిచేఁజేయఁబడిన తిన్నెలుగలవియు;వపు...

పా=శరీరముచేత; విభ్రాజమానాః= ప్రకాశించుచున్నవియు నగు; హిరణ్మయాః = బంగారువికారములయిన; పాదపాంశ్చ = వృక్షములను; దదృశుః (అధ్యాహృతము)=చూచిరి.

మఱియు నచట, వానరులు, సుందరంబులయిన బంగారుపూగుత్తులను ఎఱ్ఱని చిగుళ్ళను మనోహరములగు శాఖలంబులను లతలనుగల్గినవై బంగారుభూషణములె ఫలంబులుగాఁగల్గి, బాలసూర్యునివలె వెలుంగుచు వైడూర్యమయములయిన తిన్నెలతోఁగూడినవై నిజకాంతిం బ్రకాశించుచున్న బంగారువృక్షంబులనుంజూచిరి. అని, తాత్పర్యము.

> నీలవైడూర్యవర్ణాశ్చ పద్మినీః పతగావృతాః. ౨౮
> మహద్భిః కాంచనైః పద్మైర్వృతా బాలార్కసన్నిభైః
> జాతరూపమయైర్మత్స్యైర్మహద్భిశ్చ సకచ్ఛపైః. ౨౯
> నళినీస్తత్ర దదృశుః ప్రసన్నసలిలావృతాః

టీక ॥ తే (అధ్యాహృతము)= ఆ వానరులు; తత్ర=అచట; నీలవైడూర్యవర్ణాః = నీలవైడూర్యమణులయొక్క వన్నెవంటి వన్నెగలవియు; పతగావృతాః = పక్షులచేఁగప్పఁబడినవియు; మహద్భిః = గొప్పవగు; కాంచనైః= బంగారువికారములయిన; బాలార్కసన్నిభైః= లేఁతసూర్యునితోఁ సమానములయిన; పద్మైః = కమలములచేత; వృతాః = చుట్టఁబడినవియునగు; పద్మినీః = తామరతీఁగలను; జాతరూపమయైః = బంగారువికారములును; మహద్భిః = గొప్పవియు; సకచ్ఛపైః= తాఁబేళ్లతోఁ గూడినవియునగు; మత్స్యైః=చేఁపలతోఁ; సహితాః(అధ్యాహృతము) = కూడినవియు; ప్రసన్నసలిలావృతాః = నిర్మలమయిన జలముచేఁగప్పఁబడినవియునగు; నళినీః= తామరకొలంకులను; దదృశుః = చూచిరి.

మఱియునచట, నవ్వానరులు, నీలవైడూర్యవర్ణంబులును నానావిధపక్షులతోఁగూడినవియు బాలసూర్యసమానంబులైన గొప్పవగు కాంచనకమలములతో నిండినవియునగు తామరతీఁగలను, గొప్పబంగారు మత్స్యంబులును బంగారుతాఁబేళ్లను గలిగినిర్మలంబులగు జలంబులతో నొప్పుచున్న తామరకొలంకులనుంగాంచిరి. అని, తాత్పర్యము.

స ౫౦

కాంచనాని విమానాని రాజతాని తథైవచ. ౩౦
తపనీయగవాక్షాణి ముక్తాజాలావృతానిచ
హైమరాజతభౌమాని వైడూర్యమణిమంతిచ. ౩౧
దదృశు స్తత్ర హరయో గృహముఖ్యాని సర్వశః

టీక॥ తత్ర=ఆబిలమునందు; హరయః=వానరులు; తపనీయగవాక్షాణి=బంగారుకిటికీలు గలవియు; ముక్తాజాలావృతానిచ = ముత్తెములసమూహముచేఁ గప్పఁబడినవియునగు; కాంచనాని= బంగారు వికారములయిన; విమానాని = విమానములను; తథా=అట్లు; రాజతాన్యేవచ= వెండివికారములగు విమానములను; హైమరాజతభౌమాని=బంగారువికారములును వెండివికారములునగు నేలలుగలవియు; వైడూర్యమణిమంతిచ = వైడూర్యరత్నములుగలవియునగు; గృహముఖ్యాని= గృహశ్రేష్ఠములను; సర్వశః= అన్నిటిని; దదృశుః=చూచిరి.

ఆవానరులు, ఆబిలమునందు, బంగారుకిటికీలుగల్గి ముక్తాహారంబులచేనలంకృతములయిన బంగారువిమానములను వెండివిమానంబులను, మఱియుబంగారుకట్టనపు నేలలును వెండి కట్టనపు నేలలును గలిగి వైడూర్యమణులచే నలంకృతములయిన యుత్తమగృహంబులనుం గాంచిరి. అని, తాత్పర్యము.

పుష్పితాన్ ఫలినో వృక్షాన్ ప్రవాళమణిసన్నిభాన్. ౩౨
కాంచనభ్రమరాంశ్చైవ మధూనిచ సమంతతః
మణికాంచనచిత్రాణి శయనా న్యాసనానిచ. ౩౩
మహార్హాణి చ యానాని దదృశు స్తే సమంతతః

టీక॥ తే = ఆవానరులు; పుష్పితాన్=పూచినవియు; ఫలినః= అధికములయిన ఫలములుగలవియు; ప్రవాళమణిసన్నిభాన్= పవడములతో సమానములునగు; వృక్షాన్=చెట్లను; కాంచనభ్రమరాంశ్చైవ= బంగారుతుమ్మెదలను; సమంతతః=అంతటను; మధూనిచ= తేనియలను; మణికాంచనచిత్రాణి= రత్నములచేతను బంగారముచేతను సుందరములయిన; శయనానిచ=

సతు వర్ష సహస్రాణి తప స్తప్త్వా మహావనే. ౧౨
పితామహా ద్వరం లేభే సర్వ మౌశనసం ధనమ్

టీక ॥ సతు = ఆమయుఁడో; మహావనే = గొప్పయడవియందు; వర్షసహస్రాణి = (అత్యంతసంయోగద్వితీయ) సంవత్సరముల వేలయందు; తపః = తపస్సును; తప్త్వా=తపస్సుచేసి, చేసియనుట; పితామహాత్ = బ్రహ్మదేవునివలన; సర్వం = సమస్తమయిన; ఔశనసం = శుక్రసంబంధమయిన;ధనం=ధనమును, అనఁగాజనులు గోరంతెమ కోర్కులు కోరు ధనమంతయు శుక్రాచార్యునకుఁ జేరుననిప్రసిద్ధి దానిననుట, లేక, శిల్పశాస్త్రరూపమయిన ధనముననుట; వరం = వరమునుగా; లేభే= పొందెను.

ఆమయుండు, గాఢారణ్యంబునం దెక్కువేల సంవత్సరములు మహాతపస్సు గావించి, బ్రహ్మదేవునివలన, జనులు గోరంతెమ కోర్కులు కోరు ధనమంతయుఁ దనకుఁ జేరునట్లు(శుక్రాచార్యప్రణీతమయిన శిల్పశాస్త్రమంతయుఁ దనకుఁ దెలియునట్లు)వరంబునొందెను.

అని, తాత్పర్యము.

వనం విధాయ బలవాన్ సర్వకామేశ్వర స్తదా. ౧౩
ఉవాస సుఖితః కాలం కంచి దస్మిన్ మహావనే

టీక॥ తదా=అప్పుడు; బలవాన్= అధికమయిన బలముగలవాఁడును; సర్వకామేశ్వరః = సమస్తములయినకోరఁబడు వస్తువులకును ప్రభువైనవాఁడునగు మయుండు; వనం= కాంచనవనమును; విధాయ=నిర్మించి; అస్మిన్= ఈ; మహావనే=గొప్పయడవియందు: కంచిత్కాలం= కొంతకాలము; సుఖితః=సుఖముగలవాఁడై; ఉవాస= నివసించెను.

అంత, మాయాబలంబు గలవాఁడును సమస్తకామితభోగంబులును సమృద్ధంబుగాఁగలవాఁడును, (లేక జనులు గోరంతెమ కోర్కులుకోరు ధనమునకంతయు స్వామియు) నగు నమ్మయుండు, ఈకాంచనవనంబునిర్మించి యిమ్మహావనంబునఁ గొంతకాలముగా సుఖంబున నివసించియుండెను.

అని, తాత్పర్యము.

స ౫౧

తమప్సరసి హేమాయాం సక్తం దానవపుంగవమ్. ౧౪
విక్రమ్యైవాశనిం గృహ్య జఘానేశః పురందరః

టీక॥ ఈశః = ప్రభుండగు; పురందరః = ఇంద్రుండు; హేమాయాం = హేమయను; అప్సరసి = అచ్చరయందు; సక్తం = తగిలిన; తం = ఆ; దానవపుంగవం = దానవశ్రేష్ఠుండగుమయుని; విక్రమ్యైవ = పరాక్రమించియె; అశనిం = వజ్రాయుధమును; గృహ్య (గృహీత్వా) = గ్రహించి; జఘాన = కొట్టెను.

దానవశ్రేష్ఠుండగు నమ్మయుండు, హేమయను నచ్చరమిన్నయందుఁదగిలి యుండుటంగని త్రైలోక్యనాథుండగు దేవేంద్రుండు కోపించి, వజ్రాయుధంబున నమ్మయునిం బ్రహరించెను.

అని, తాత్పర్యము.

ఇదంచ బ్రహ్మణా దత్తం హేమాయై వనముత్తమమ్. ౧౫
శాశ్వతాః కామభోగాశ్చ గృహం చేదం హిరణ్మయమ్

టీక॥ బ్రహ్మణా = బ్రహ్మదేవునిచేత; హేమాయై = హేమకొఱకు; ఇదం = ఈ; ఉత్తమం = శ్రేష్ఠమయిన; వనంచ = వనమును; దత్తం = ఇయ్యఁబడినది. శాశ్వతాః = నిత్యములయిన; కామభోగాశ్చ = కోరఁబడుభోగ్యవస్తువులును; దత్తాః (అధ్యాహృతము) = ఇయ్యఁబడినవి. ఇదం = ఈ; హిరణ్మయం = వెండివికారమయిన; గృహంచ = ఇల్లును; దత్తం (అధ్యాహృతము) = ఇయ్యఁబడినది.

మయుండీస్థలంబు విడిచిపోయినవెనుక, ఉత్తమంబగు నీవనంబును శాశ్వతంబులగు కమనీయములయినభోగ్యవస్తువులును ఈహిరణ్మయగృహంబును, బ్రహ్మదేవుండు హేమకొసంగెను.

అని, తాత్పర్యము.

దుహితా మేరుసావర్ణే రహం తస్యాః స్వయంప్రభా. ౧౬
ఇదం రక్షామి భవనం హేమాయా వానరోత్తమ

టీక॥ వానరోత్తమ = వానరశ్రేష్ఠుఁడా! మేరుసావర్ణేః = మేరుసావర్ణియొక్క; దుహితా = కొమార్తెను; స్వయంప్రభా = స్వయంప్రభయనుదాన

నగు; అహం=నేను; ఇదం=ఈ; హేమాయాః=హేమయొక్క; భవనం=ఇంటిని; రక్షామి=కాపాడుచున్నాను.

వానరవీరుఁడా! నేను మేరుసావర్ణికొమార్తెను స్వయంప్రభయను దానను; హేమయొక్క గృహము మొదలయిన దాని నంతయు రక్షించుచు నిటనున్నాను. అని, తాత్పర్యము.

మమ ప్రియసఖీ హేమా నృత్తగీతవిశారదా. ౧౭
తయా దత్తవరా చాస్మి రక్షామి భవనోత్తమమ్

టీక॥ నృత్తగీతవిశారదా = ఆటలయందును పాటలయందును బండితురాలగు; హేమా=హేమ; మమ = నాయొక్క; ప్రియసఖీ=కూరిమిచెలికత్తె. తయా=ఆహేమచేత; దత్తవరాచ = ఇయ్యఁబడినవరముగలదానను గూడ; అస్మి=అగుచున్నాను. భవనోత్తమం = గృహశ్రేష్ఠమును; రక్షామి=కాపాడుచున్నాను.

నృత్తగీతంబులయందు సమర్థురాలగు హేమ నాకూరిమిచెలికత్తియ; మఱియు నాబిడ, ఇతరులకు నన్నుఁ దిరస్కరింపనలవిగానట్లు, నాకువరంబొసంగినది; కావున, నేనిచట నీగృహంబురక్షించుచున్నాను. అని, తాత్పర్యము.

కిం కార్యం కస్యవా హేతోః కాంతారాణి ప్రపశ్యథ. ౧౮
కథం చేదం వనం దుర్గం యుష్మాభి రుపలక్షితమ్

టీక ॥ కార్యం=పని; కిం=ఏమి? కస్యహేతోర్వా = (పంచమ్యర్థమందు షష్ఠి) ఏకారణమువలన; కాంతారాణి = అడవులను; ప్రపశ్యథ= చూచుచున్నారు? యుష్మాభిః = మీచేత; దుర్గం = చొరనలవిగాని; ఇదం=ఈ; వనంచ=వనమును; కథం=ఎట్లు; ఉపలక్షితం = చూడఁబడినది?

మీరు ఏకార్యము నుద్దేశించి యేకారణము వలన వనంబుల వెదకుచున్నారు? దుర్గమంబగు నీవనంబుగూడ ఎట్లు గనుఁగొంటిరి? అని, తాత్పర్యము.

ఇమా న్యభ్యవహార్యాణి మూలానిచ ఫలానిచ. ౧౯
భుక్త్వా పీత్వాచ పానీయం సర్వం మే వక్తు మర్హథ

టీక ॥ యూయం (అధ్యాహృతము)= మీరలు; ఇమాని=ఈ; అభ్యవ

భక్ష్యాణి= భక్షింపదగిన; మూలాని చ= గడ్డలను; ఫలానిచ= పండ్లను; భుక్త్వా=తిని; పానీయం= జలమును; పీత్వాచ=త్రాగియు; మే= నాకు; సర్వం=సమస్తమును; వక్తుం= చెప్పుటకు; అర్హాథ=తగుదురు.

మీరు, ఇచటనుండునట్టి దివ్యంబులగు ఫలంబులనుభక్షించి, జలంబుద్రావి, సమస్తసమాచారంబును నాకుఁజెప్పఁడు. అని, యాతాపసి,హనుమంతునితోఁజెప్పెను. అని,తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ఏకపంచాశస్సర్గః.
ఇది,స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ,గిష్కింధాకాండైకపంచాశసర్గటీక,
ముగిసినది.

---

౫౨

ద్విపంచాశసర్గ ప్రారంభః.

అథ తా నబ్రవీ త్సర్వా న్విక్రాంతా న్హరిపుంగవా న్
ఇదం వచన మేకాగ్రా తాపసీ ధర్మచారిణీ. ౧

టీక॥ అథ= అటుపిమ్మట; ధర్మచారిణీ=ధర్మమునాచరించునట్టి; తాపసీ=స్వయంప్రభ; ఏకాగ్రా= కలఁతనొందనిదై; విక్రాంతాన్ = పరాక్రమముగల; తాన్ = ఆ; హరిపుంగవాన్=వానరశ్రేష్ఠులను; సర్వాన్=అందఱను గూర్చి; ఇదం=ఈ; వచనం = మాటను; అబ్రవీత్= పలికెను.

అంత, నచటఁ దపస్సుసేయుచున్నయా స్వయంప్రభ, పరాక్రమశాలులగు వానరోత్తముల నందఱం జూచి, మిక్కిలి యకలఁతతో నిట్లని పలికెను. అని, తాత్పర్యము.

వానరా యది వః ఖేదః ప్రణష్టః ఫలభక్షణాత్
యది చైత న్మయా శ్రావ్యం శ్రోతు మిచ్ఛామి కథ్యతామ్. ౨

టీక॥ వానరాః=వానరులారా! ఫలభక్షణాత్=పండ్లు తినుటవలన; వః=మీయొక్క; ఖేదః=శ్రమము; ప్రణష్టో యది=నశించినదగునేని; మయా= నాచేత; ఏతత్ =ఇది; శ్రావ్యంచయది=వినఁదగినదియునగునేని; శ్రోతుం = వినుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. కథ్యతాం = చెప్పఁబడుఁగాక.

వానరులారా! ఫలముల భక్షించుట వలన మీయలసట దీఱినయెడ, మీరువనంబునకు వచ్చుటకుఁ గారణము మొదలగువిషయము నేనువినఁదగినదే యవునేని, సమస్తమును జెప్పుఁడు; వినఁగోరుచున్నాను. అని, స్వయంప్రభ, వానరులతోఁ బలికెను. అని, తాత్పర్యము.

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనమా న్మారుతాత్మజః
ఆర్జవేన యథా తత్త్వ మాఖ్యాతు ముపచక్రమే. ౩

టీక॥ మారుతాత్మజః= వాయుపుత్త్రుండగు; హనుమాన్=హనుమంతుఁడు; తస్యాః=ఆ స్వయంప్రభయొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; ఆర్జవేన = కపటములేమిచేత; యథాతత్త్వం=యథార్థమునతిక్రమింపక; ఆఖ్యాతుం=చెప్పుటకు; ఉపచక్రమే=ఆరంభించెను.

వాయుదేవుని కుమారుండగు హనుమంతుండు, స్వయంప్రభ చెప్పినమాటనువిని, కపటములేక యథార్థముగాసమాచారమంతయుఁ జెప్ప నారంభించెను. అని, తాత్పర్యము.

రాజా సర్వస్య లోకస్య మహేంద్రవరుణోపమః
రామో దాశరథి శ్శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్. ౪
లక్ష్మణేనసహ భ్రాత్రా వైదేహ్యాచాపి భార్యయా

టీక॥ సర్వస్య = సమస్తమయిన; లోకస్య=లోకమునకును; రాజా=ప్రభువును; మహేంద్రవరుణోపమః=దేవేంద్రునితోను వరుణునితోనుబోల్కిగ

స ౫౭

లవాఁడును; దాశరథిః = దశరథునికొడుకును; శ్రీమాన్ = అందఱికన్ననధికుండునగు; రామః=రాముఁడు; భ్రాత్రా=తమ్ముఁడైన; లక్ష్మణేన=లక్ష్మణునితోను; భార్యయా=పెండ్లామైన; వైదేహ్యాచాపిసహ=సీతతోనుగూడ; దండకావనం = దండకారణ్యమును;ప్రవిష్టః=చొచ్చినాఁడు.

సమస్తలోకనాథుండును దేవేంద్రునకును వరుణునకును సాటియైనవాఁడును శ్రీమంతుండును దశరథపుత్త్రుండునగు రాముండు, తమ్ముండులక్ష్మణుని భార్యను సీతాదేవినింగూడి దండకారణ్యంబునకువచ్చెను. అని, తాత్పర్యము.

తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్. ౫

టీక ॥ తస్య= ఆరామునియొక్క; భార్యా=పెండ్లాము; జనస్థానాత్ = జనస్థానమునుండి; రావణేన = రావణునిచేత; బలాత్ = బలిమివలన; హృతా=అపహరింపఁబడినది.

ఆరామునిభార్యను సీతాదేవిని, జనస్థానంబున రావణుండు బలాత్కారంబునం దీసికొనిపోయెను.

అని, తాత్పర్యము.

వీర స్తస్య సఖా రాజ్ఞ స్సుగ్రీవో నామ వానరః
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్. ౬
అగస్త్యచరితా మాశాం దక్షిణాం యమరక్షితామ్

టీక ॥ యేన=ఎవనిచేత; వయం=మేము; అగస్త్యచరితాం= అగస్త్యునిచేతఁ బొందఁబడినదియు; యమరక్షితాం=యమునిచేతఁ గాపాడఁబడినదియునగు; ఆశాం=దిక్కునుగూర్చి; ప్రస్థాపితాః = పంపఁబడినామో; సః (అధ్యాహృతము)= అతఁడు; తస్య= ఆ; రాజ్ఞః = రాజయిన రామునియొక్క; సఖా=చెలికాఁడును;సుగ్రీవో నామ=సుగ్రీవుఁడనుపేరుగల; వీరః = పరాక్రమశాలియగు; వానరః = వానరుఁడును; వానరముఖ్యానాం= వానరశ్రేష్ఠులకు; రాజా=ఏలికయు.

ఆ రామునిమిత్రుండు సమస్తవానరులకును రాజయిన సుగ్రీవుండను వానరుండు, మమ్ముండఱను, అగస్త్యమహర్షిచే నాశ్రయింపఁబడినదియు యమునిచేఁ బాలితంబునగు దక్షిణదిక్కునకుఁబంపెను. అని, తాత్పర్యము.

సహైభి ర్వానరై ర్ఘోరై రంగదప్రముఖై ర్వయమ్. ౭
రావణం సహితా స్సర్వే రాక్షసం కామరూపిణమ్
సీతయాసహ వైదేహ్యా మార్గధ్వ మితి చోదితాః. ౮

టీక॥ వయం=మేము; ఏభిః= ఈ; అంగదప్రముఖైః = అంగదుఁడు మొదలుగాఁగల; ఘోరైః=భయంకరులగు; వానరై స్సహ = వానరులతోఁగూడ; "యూయం (అధ్యాహృతము) = మీరు; సర్వే= అందఱును; సహితాః= కూడినవారలయి; వైదేహ్యా=విదేహదేశమునందుఁ బుట్టిన; సీతయాసహ= సీతతోఁగూడ; కామరూపిణం=ఇచ్ఛాధీనమయినరూపముగల; రాక్షసం = రక్కసుఁడగు; రావణం = రావణుని; మార్గధ్వం=వెదకుఁడు." ఇతి = అని; చోదితాః= ఆజ్ఞాపింపఁబడినాము.

అంగదుండు మొదలయిన భయంకరాకారులగు నీవానరుల నందఱనుమ్మనుం జూచి, సుగ్రీవుండు "మీరలందఱుం జేరి, సీతాదేవిని, కామరూపియు రాక్షసుండునగు రావణుని వెదకుఁడు" అని యాజ్ఞాపించెను.

అని, తాత్పర్యము.

విచిత్యతు వయం సర్వే సమగ్రాం దక్షిణాం దిశమ్
బుభుక్షితాః పరిశ్రాంతా వృక్షమూల ముపాశ్రితాః. ౯

టీక॥ వయం=మేము; సర్వే= అందఱమును; సమగ్రాం = సమస్తమయిన; దక్షిణాందిశం=దక్షిణదిక్కును; విచిత్యతు=వెదకియు; బుభుక్షితాః=ఆఁకలిగొన్నవారమై; పరిశ్రాంతాః=అలసటనొందినవారమై ; వృక్షమూలం= చెట్టుయొక్క అడుగును; ఉపాశ్రితాః= పొందినాము.

మేము అందఱము, దక్షిణ దిశనంతయు వెదకి, యలసి యాఁకలి గొని, యొక చెట్టుక్రిందం జేరితిమి.

అని, తాత్పర్యము.

వివర్ణవదనా స్సర్వే సర్వే ధ్యానపరాయణాః
నాధిగచ్ఛామహే పారం మగ్నా శ్చింతామహార్ణవే. ౧౦

టీక ॥ సర్వే = అందఱమును; వివర్ణవదనాః=వెల్లఁబాఱిన ముఖముగ

లవారలమై; సర్వే = అందఱమును; ధ్యానపరాయణాః = చింతయే ముఖ్యమయిన గతిగాఁగలవారలమై; చింతామహార్ణవే = దుఃఖమను మహాసముద్రమునందు; మగ్నాః = మునిఁగినవారమై; పారం=తుదను; నాధిగచ్ఛామహే=పొందమైతివి.

మేమందఱమును ముఖంబు వెల్లఁబాఱఁ జింతించుచుఁ, గడలేని చింతాసముద్రంబునమునింగి, యేమియుఁదోఁచక దీనుల మయితిమి.

అని, తాత్పర్యము.

చారయంత స్తత శ్చక్షు ర్దృష్టవంతో వయం బిలమ్
లతా పాదపసంఛన్నం తిమిరేణ సమావృతమ్. ౧౧

టీక॥ వయం=మేము; తతః=అటుపిమ్మట; చక్షుః=నేత్రమును; చారయంతః = పఱపుచు; లతాపాదపసంఛన్నం= తీఁగెలచేతను వృక్షములచేతను గప్పఁబడినదియు; తిమిరేణ=చీఁకటిచేత; సమావృతం = కప్పఁబడినదియునగు; బిలం=వివరమును; దృష్టవంతః = చూచినాము.

అంత, మేము, నలువైపులంజూపులఁబరఁగించుటయు,లతావృక్షములచేఁ గప్పఁబడినదియు నంధకారసంవృతంబునగు బిలం బొకటియగపడినది.

అని, తాత్పర్యము.

అస్మా ద్ధంసా జలక్లిన్నాః పక్షైః స్సలిలవిస్రవైః
కురరా స్సారసా శ్చైవ నిష్పతంతి పతత్రిణః. ౧౨

టీక॥ అస్మాత్=ఈబిలమునుండి; జలక్లిన్నాః=నీటందడసిన; పతత్రిణః=పక్షులు, హంసాః = అంచలును; కురరాః= గోరువంకలును; సారసాశ్చైవ=బెగ్గురుపక్షులును; సలిలవిస్రవైః=జలముగాఱుచున్న; పక్షైః= ఱెక్కలతో; నిష్పతంతి=వెడలుచుండినవి.

జలములం దడిసినపక్షులు, హంసలును గోరువంకలును బెగ్గురు పక్షులును ఱెక్కలచే జలము విదిర్చుచు నీబిలమునుండి వెడలఁగంటిమి.

అని, తాత్పర్యము.

సాధ్వ త్ర ప్రవిశా మేతి మయా తూర్ణాః ప్లవంగమాః

టీక॥ "సాధు=మంచిది. అత్ర=ఇందు; ప్రవిశామ=ప్రవేశింతము;" ఇతి=అని; ప్లవంగమాః=వానరులు; మయా తు= నాచేతనే; ఉక్తాః = చెప్పఁబడినారు.

"మంచిది, ఈ బిలంబుఁ బ్రవేశింతము" అని నేనే, యీవానరులకుఁ జెప్పితిని. అని, తాత్పర్యము.

తేషామపి హి సర్వేషా మనుమాన ముపాగతమ్. ౧౩
గచ్ఛామ ప్రవిశామేతి భర్తృకార్యత్వరాన్వితాః

టీక॥ తేషామపి=ఆవానరులకును; సర్వేషాం = అందఱకును; అనుమానం=ఊహ; ఉపాగతంహి = కలిగినదిగదా! "భర్తృకార్యత్వరాన్వితాః = స్వామికార్యమువిషయమయి వేగిరపాటుతోఁగూడినవారలమై; గచ్ఛామ=పోవుదము; ప్రవిశామ= ప్రవేశింతము." ఇతి=అని; ఊచుః (అధ్యాహృతము) = చెప్పిరి.

వానరులకు అందఱకునుగూడ, తడిసిన జలచరపక్షులంజూచుటవలన, నిచటజలముండునని యూహకలిగినది; అంత, స్వామికార్యమునందలిత్వరచే, "పోయిప్రవేశింత"మని యందఱు నేకకంఠముగాఁబలికిరి. అని, తాత్పర్యము.

తతో గాఢం నిపతితా గృహ్య హస్తౌ పరస్పరమ్. ౧౪
ఇదం ప్రవిష్టా స్సహసా బిలం తిమిరసంవృతమ్

టీక॥ తతః= అటుపిమ్మట; వయం (అధ్యాహృతము) = మేము; పరస్పరం = ఒండొరులనుగూర్చి; హస్తౌ = చేతులను; గాఢం = గట్టిగా; గృహ్య (గృహీత్వా)=పట్టుకొని; నిపతితాః= పడినవారమై; తిమిరసంవృతం = చీఁకటిచేఁగప్పఁబడిన; ఇదం=ఈ; బిలం= వివరమును; సహసా = శీఘ్రముగా; ప్రవిష్టాః=చొచ్చినాము.

అంత, మేము, ఒకరిచేయొకరు గట్టిగాఁబట్టుకొని బిలద్వారంబుఁజొచ్చి, శీఘ్రంబున నంధకారావృతంబగు నీబిలంబుఁజొచ్చితిమి. అని, తాత్పర్యము.

ఏత న్నః కార్య మేతేన కృత్యేన వయ మాగతాః. ౧౫

త్వాంచైవో పగతా స్సర్వే పరిద్యూనా బుభుక్షితాః

టీక॥ ఏతత్=ఇది; నః=మాయొక్క; కార్యం = పని. ఏతేన=ఈ; కృత్యేన = కార్యముచేత; వయం=మేము; ఆగతాః= వచ్చినాము. సర్వే= అందఱమును; బుభుక్షితాః = ఆఁకలిగొన్నవారమయి; పరిద్యూనాః = కృశించినవారమై; త్వాంచైవ=నిన్నే; ఉపగతాః= ఆశ్రయించినాము.

ఇది మాకార్యము; మేము వచ్చుటకు ఇది కారణము; ఆఁకలిచేఁ గృశించియుందఱమును నిన్నాశ్రయించినాము. అని, తాత్పర్యము.

ఆతిథ్యధర్మదత్తాని మూలానిచ ఫలానిచ. ౧౬
అస్మాభి రుపభుక్తాని బుభుక్షాపరిపీడితైః

టీక॥ ఆతిథ్యధర్మదత్తాని= అతిథిసత్కారధర్మముచే నియ్యఁబడిన; మూలానిచ=గడ్డలను; ఫలానిచ = పండ్లును; బుభుక్షాపరిపీడితైః = ఆఁకలిచేఁ బీడింపఁబడిన; అస్మాభిః=మాచేత; ఉపభుక్తాని=భక్షింపఁబడినవి.

నీవు, ఆతిథ్యధర్మమవలంబించి యొసంగిన ఫలంబులను మూలంబులను, మేమందఱము, ఆఁకలిదీఱ భక్షించినాము. అని, తాత్పర్యము.

యత్త్వయా రక్షితా స్సర్వే మ్రియమాణా బుభుక్షయా. ౧౭
బ్రూహి ప్రత్యుపకారార్థం కిం తే కుర్వంతు వానరాః

టీక॥ బుభుక్షయా=ఆఁకలిచేత;మ్రియమాణాః=చచ్చుచున్న; సర్వే=అందఱును; త్వయా = నీచేత; రక్షితాః (ఇతి)యత్= కాపాడఁబడినారనునదియేదిగలదో;తస్య(అధ్యాహృతము)= దానికి; ప్రత్యుపకారార్థం= బదులుపకారముసేయుటకు; వానరాః= వానరులు; తే=నీకొఱకు; కిం = దేనిని; కుర్వంతు=చేయవలెను? బ్రూహి= చెప్పుము.

ఆఁకలిచేఁ జావఁబోయెడుమమ్మందఱను నీవిప్పుడు రక్షించితివే; ఇందుకుఁ బ్రత్యుపకారము నీకేమి సేయవలెను? వచింపుము. అని, హనుమంతుండుస్వయంప్రభతోఁ బలికెను. అని, తాత్పర్యము.

స ౫౨

ఏవ ముక్తాతు సర్వజ్ఞా వానరై స్తై స్స్వయంప్రభా. ౧౮
ప్రత్యువాచ తత స్సర్వా నిదం వానరయూథపాన్

టీక॥ సర్వజ్ఞా= సమస్తముఁదెలిసినట్టి; స్వయంప్రభా = స్వయంప్రభ; తైః=ఆ; వానరైః=వానరులచేత; ఏవం=ఇట్లు; ఉక్తాతు=చెప్పఁబడినదానైనంతనె; తతః=అంత; వానరయూథపాన్=వానరసమూహమును బాలించునట్టివారలను; సర్వాన్ = అందఱను గూర్చి; ఇదం=ఈమాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

సర్వజ్ఞురాలగుస్వయంప్రభ, హనుమంతునిముఖంబున నవ్వానరులుచెప్పిన మాటనువిని, వానరవీరులనందఱం జూచి, యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

సర్వేషాం పరితుష్టాస్మి వానరాణాం తరస్వినామ్. ౧౯
చరంత్యా మమ ధర్మేణ న కార్య మిహ కేనచిత్

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; తరస్వినాం=బలవంతులగు; వానరాణాం=వానరులవిషయమును; సర్వేషాం=అందఱివిషయమయ్యును; పరితుష్టా = సంతోషించినదానను; అస్మి =అగుచున్నాను. ధర్మేణ=ధర్మముచేత; చరంత్యాః= సంచరించుచున్న; మమ=నాకు; ఇహ=ఇందు; కేనచిత్= ఒకానొకనిచేతను; కార్యం=చేయఁదగినది; న=లేదు.

బలవంతులగు సమస్తవానరులవిషయమయ్యును, నేనుసంతోషించినాను; నాకుఁ బ్రత్యుపకారము అనావశ్యకము; ధర్మమునే యుపలంబించి యున్న నాకుఁ బ్రతిఫలముతో నేమి పని యున్నది? అని, స్వయంప్రభ వానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, కిష్కింధాకాండే, ద్విపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ ద్విపంచాశసర్గటీక, ముగిసినది.

శ్రీ

త్రిపంచాశ సర్గ ప్రారంభః.

ఏవ ముక్త శ్శుభం వాక్యం తాపస్యా ధర్మసంహితమ్
ఉవాచ హనుమా న్వాక్యం తా మనిందితచేష్టితామ్. ౧

టీక ॥ హనుమాన్=హనుమంతుఁడు; ఏవం=ఇట్లు; తాపస్యా=స్వయంప్రభచేత; ధర్మసంహితం = ధర్మముతోఁగూడినదియు; శుభం = మంగళకరంబునగు; వాక్యం=మాటను; ఉక్తః= చెప్పఁబడినవాఁడై; అనిందితచేష్టితాం= నిందింపఁబడనికార్యములుగల; తాం= ఆస్వయంప్రభనుగూర్చి; వాక్యం=మాటను; ఉవాచ = పలికెను.

హనుమంతుఁడు, ఇట్లు; ఆస్వయప్రభ చెప్పిన ధర్మయుక్తంబును మంగళకరంబునగు వచనంబును విని, పరమధార్మికయగునాపెఁ జూచి, యీమాట బలికెను. అని, తాత్పర్యము.

శరణం త్వాం ప్రపన్నాః స్మ స్సర్వే వై ధర్మచారిణి

టీక ॥ ధర్మచారిణి= ధర్మమునాచరించునట్టి స్వయంప్రభా! వయం (అధ్యాహృతము)= మేము; సర్వే=అందఱమును; త్వాం వై=నిన్నే ; శరణం=రక్షకురాలనుగా; ప్రపన్నాః= పొందినవారము; స్మః=అగుచున్నాము.

పరమ ధార్మికురాలా! మేమందఱము నిపుడు నిన్నే శరణుచొచ్చితిమి. అని, తాత్పర్యము.

యః కృత స్సమయో స్మాకం సుగ్రీవేణ మహాత్మనా. ౨
సచ కాలో హ్యతిక్రాంతో బిలే చ పరివర్తతామ్

టీక ॥ మహాత్మనా= అధికమయిన ప్రభావముగల; సుగ్రీవేణ= సుగ్రీవునిచేత; అస్మాకం=మాకు; యః=ఏ; సమయః=గడువు; కృతః= చేయఁబడినదో; సః=ఆ; కాలశ్చ=కాలముగూడ; అస్మాకం (అధ్యాహృతము)= మేము; బిలే = బిలమునందు; పరివర్తతాంచ (పరివర్తమానానాం)= తిరుగుచుండఁ

గా నే; అతిక్రాంతోపి=అతిక్రమించినదిగదా!

మహాత్ముండగు సుగ్రీవుండు, మాకు నియమించిన యావధిగూడ, మేము ఇమ్మహాబిలంబునఁ దిరుగుచుండునప్పుడే, యతిక్రమించినది.

అని, తాత్పర్యము.

సా త్వ మస్మా ద్బిలా ద్ఘోరా దుత్తారయితు మర్హసి. ౩

టీక॥ సా=అట్టి; త్వం=నీవు; ఘోరాత్ = భయంకరమయిన; అస్మాత్=ఈ; బిలాత్ = బిలమునుండి; ఉత్తారయితుం= దరిచేర్చుటకు; అర్హసి = తగుదువు.

నీవు పరమధార్మికవుకావున, భయంకరంబగు నీబిలంబునుండి మమ్ము ఎట్లయినను బయలుచేర్పవలెను.

అని, తాత్పర్యము.

తస్మా త్సుగ్రీవవచనా దతిక్రాంతా న్గతాయుషః
త్రాతు మర్హసి న స్సర్వా న్సుగ్రీవ భయకర్శితాన్. ౪

టీక॥ త్వం (అధ్యాహృతము)=నీవు; తస్మాత్=ఆ; సుగ్రీవవచనాత్ = సుగ్రీవునిమాటనుండి; అతిక్రాంతాన్= అతిక్రమించినవారమును; సుగ్రీవభయకర్శితాన్ = సుగ్రీవునివలని భయముచేఁ గృశించినవారమును; గతాయుషః = పోయినయాయుస్సు గలవారమునగు; నః=మమ్ము; సర్వాన్= అందఱను; త్రాతుం=రక్షించుటకు; అర్హసి = తగుదువు.

సుగ్రీవుం డాజ్ఞాపించిన గడువునతిక్రమించినవార మగుటం జేసి, సుగ్రీవుం డువిధించు మరణదండనమునకుఁ బాత్రులమయి యతని భయంబునంగృశించుచున్న మమ్మందఱను, నీవు రక్షింపవలెను. అని, తాత్పర్యము.

మహచ్చ కార్య మస్మాభిః కర్తవ్యం ధర్మచారిణి
తచ్చాపి న కృతం కార్య మస్మాభి రిహ వాసిభిః. ౫

టీక॥ ధర్మచారిణి = ధర్మమునాచరించుదానా! అస్మాభిః = మాచేత; మహత్ = గొప్పదగు; కార్యంచ=పనియు; కర్తవ్యం = చేయఁబడవలెను,

ఇహావాసిభిః = ఇచటనుండునట్టి; అస్మాభిః=మాచేత; తచ్చాపి=అదియు; నకృతం = చేయఁబడినదికాదు.

ధార్మికురాలా! మాకుసీతాన్వేషణరూపమయిన గొప్పకార్యము చేయవలసియున్నది; మేమిచటఁజిక్కి యున్నందున, ఆకార్యము గూడఁ జేయని వారమయితిమి. అని, హనుమంతుఁడు, స్వయంప్రభతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా హనుమతా తాపసీ వాక్య మబ్రవీత్

టీక॥ తాపసీ= స్వయంప్రభ; హనుమతా=హనుమంతునిచేత; ఏవం = ఇట్లు; ఉక్తా=చెప్పఁబడినదై; వాక్యం= మాటను; అబ్రవీత్ = పలికెను.

స్వయంప్రభ హనుమంతుఁడుచెప్పినమాటను విని, యిట్లని వానరులతోఁ బలికెను. అని, తాత్పర్యము.

జీవతా దుష్కరం మన్యే ప్రవిష్టేన నివర్తితుమ్. ౮

టీక ॥ ప్రవిష్టేన= ప్రవేశించినట్టి; జీవతా=బ్రతికియున్నవానిచేత; నివర్తితుం=వెడలుటకు; దుష్కరం = అసాధ్యముగా; మన్యే=తలంచుచున్నాను.

ఈబిలంబును బ్రవేశించినవానికి ప్రాణములతో దీనినుండి వెడలిపోవుట యసాధ్యమని తలంచుచున్నాను.

అని, తాత్పర్యము.

తపస స్తు ప్రభావేన నియమోపార్జితేన చ
సర్వానేవ బిలా దస్మా దుద్ధరిష్యామి వానరాన్. ౯

టీక॥ నియమోపార్జితేన= ఇంద్రియనిగ్రహముచే సంపాదింపఁబడిన; తపసః = తపస్సుయొక్క; ప్రభావేనచ తు = మహిమచేత మాత్రము; వానరాన్=వానరులను; సర్వానేవ= అందఱినే; అస్మాత్=ఈ; బిలాత్ = బిలమునుండి ; ఉద్ధరిష్యామి = వెడలించెదను.

అయినను, నేను ఇంద్రియముల నిగ్రహించి గావించిన తపస్సుయొక్క ప్రభావంబునం జేసి, వానరుల నందఱను గూడ, ఈబిలమునుండి వెలికిఁ జేర్చెదను. అని, తాత్పర్యము.

స ౫౩

నిమీలయత చక్షూంషి సర్వే వానరపుంగవాః
నహి నిష్క్రమితుం శక్యా అనిమీలితలోచనైః. ౮

టీక॥ వానరపుంగవాః= వానరశ్రేష్ఠులారా ! యూయం (అధ్యాహృతము)=మీరలు; సర్వే=అందఱును; చక్షూంషి=కన్నులను;నిమీలయత=మూసికొనుఁడు. అనిమీలితలోచనైః=మూయఁబడిన కన్నులుగలవారలు కానివారలచేత;నిష్క్రమితుం=వెడలుటకు; నశక్యంహి = అలవిగాదుగదా!

వానరోత్తములారా! మీరలందఱును గన్నులుమూసికొనుఁడు; కన్నులు మూసికొననియెడ,నీబిలంబునుండి వెడల నెంతమాత్రమును అలవిగాదు. అని, స్వయంప్రభ చెప్పెను.అని, తాత్పర్యము.

తత స్సంమీలితా స్సర్వే సుకుమారాంగుళైః కరైః
సహసా పిదధు ర్దృష్టిం హృష్టా గమనకాంక్షయా. ౯

టీక ॥ తతః=అటుపిమ్మట; సర్వే=అందఱును; గమనకాంక్షయా = పోవుటయందలికోరికిచేత; హృష్టాః=సంతసించినవారలయి; సంమీలితాః = కన్నులుమూసినవారలయి; సహసా = శీఘ్రంబున; సుకుమారాంగుళైః= కోమలములయినవ్రేళ్లుగల; కరైః = హస్తములచేత; దృష్టిం = కన్నును; పిదధుః = మూసికొనిరి.

అంత, వానరులందఱును బిలంబువెడలఁగలుగునని సంతోషంబునొంది, కనుఱెప్పలుమూయుటయెగాక శీఘ్రమున కోమలములయిన వ్రేళ్లుగలకరంబుల నేత్రములు మూసికొనిరి.

అని, తాత్పర్యము.

వానరాస్తు మహాత్మానో హస్తరుద్ధముఖా స్తదా
నిమేషాంతరమాత్రేణ బిలా దుత్తారితా స్తయా. ౧౦

టీక॥ తదా= అప్పుడు; మహాత్మానః = అధికమయిన పరాక్రమముగల; వానరాః = వానరులు; హస్తరుద్ధముఖాస్తు=చేతులచేఁగప్పఁబడిన ముఖములుగలవారలయినంతనె; తయా=ఆస్వయంప్రభచేత ; నిమేషాంతరమాత్రే

ణ=ఈప్పపాటంతటియవకాశముచేత నే; బిలాత్ = బిలమునుండి; ఉత్తారి తాః=దరిచేర్పఁబడిరి.

అప్పుడు, అట్లుమహాపరాక్రమశాలులగువానరులు చేతులచేఁ గన్నులంగప్పుకొనుటయు, నాక్షణంబున నావారల నందఱను స్వయంప్రభ, ఒక ఱెప్పపాటులోపల, ఆబిలంబునుండి వెలికిఁదీసికొనిపోయెను. అని, తాత్పర్యము.

తత స్తాన్ వానరాన్ సర్వాం స్తాపసీ ధర్మచారిణీ
నిస్సృతాన్ విషమా త్తస్మా త్సమాశ్వాస్యేద మబ్రవీత్. ౧౧

టీక॥ తతః = అటుపిమ్మట; ధర్మచారిణీ=ధర్మమునాచరించునట్టి; తాపసీ=స్వయంప్రభ; తస్మాత్ = ఆ; విషమాత్ =సంకటప్రదేశమునుండి; నిస్సృతాన్= వెడలిన; తాన్ = ఆ; వానరాన్=వానరులను; సర్వాన్= అందఱును;సమాశ్వాస్య=ఊఱడించి; ఇదం= ఈమాటను; అబ్రవీత్=పలికెను.

అంతఁ,బరమధార్మికయగు నాస్వయంప్రభ, యవ్వానరుల నందఱి, నాసంకట ప్రదేశమునుండి వెడలించి, వారలనాశ్వాసించి, యిట్లని పలికెను.

అని, తాత్పర్యము.

ఏష వింధ్యో గిరి శ్శ్రీమాన్ నానాద్రుమలతాకులః
ఏష ప్రస్రవణ శ్శైల స్సాగరోయం మహోదధిః. ౧౨

టీక॥ ఏషః=ఇదీ;నానాద్రుమలతాకులః=నానావిధములయిన వృక్షములచేతను దీఁగెలచేతనునిండిన;శ్రీమాన్= అధికమయిన కాంతిగల; వింధ్యః=వింధ్యమను; గిరిః=పర్వతము. ఏషః=ఇది; ప్రస్రవణః=ప్రస్రవణమను; శైలః=పర్వతము. అయం=ఇది; సాగరః=సగరునిచేవృద్ధిఁబొందింపఁబడిన; మహోదధిః = మహాసముద్రము.

ఇది, నానావిధంబులగు వృక్షములతోను లతలతోను ఒప్పుచుండు శ్రీమంతంబగు వింధ్యపర్వతము; ఇది ప్రస్రవణశైలము; ఇది మహాసముద్రము; చూడుఁడు. అని, తాత్పర్యము.

స్వస్తి వో స్తు గమిష్యామి భవనం వానరర్షభాః

టీక॥ వానరర్షభాః = వానరశ్రేష్ఠులారా! వః=మీకు; స్వస్తి=మంగళము; అస్తు = అగుఁగాక. భవనం = గృహమును; గమిష్యామి=పొందెదను.

వానరోత్తములారా! మీకుమంగళమగుఁగాక, నేనుగృహంబునకుఁ బోయెదను. అని, స్వయంప్రభ పలికెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా తద్బిలం శ్రీమత్ప్రవివేశ స్వయంప్రభా. ౧౩

టీక॥ స్వయంప్రభా = స్వయంప్రభ; ఇతి=అని; ఉక్త్వా=పలికి; శ్రీమత్= అధికమయినసంపదగల; తత్=ఆ; బిలం=బిలమును; ప్రవివేశ = చొచ్చెను.

ఇట్లు వానరులతోఁ బలికి, స్వయంప్రభ సమస్తసంపదలచేతను సమృద్ధంబగు నాబిలంబు ప్రవేశించెను. అని, తాత్పర్యము.

తత స్తే దదృశు ర్ఘోరం సాగరం వరుణాలయమ్
అపార మభిగర్జంతం ఘోరై రూర్మిభి రావృతమ్. ౧౪

టీక॥ తతః=అటుపిమ్మట; తే= ఆ వానరులు; అపారం = తుదిలేనిదియు; అభిగర్జంతం= అంతటను గర్జించుచున్నదియు; ఘోరైః= భయంకరములయిన; ఊర్మిభిః=అలలచేత; ఆవృతం= కప్పఁబడినదియు; ఘోరం=భయంకరంబును; వరుణాలయం= వరుణునియునికిపట్టయినదియునగు; సాగరం=సముద్రమును; దదృశుః=చూచిరి.

అంత, నవ్వానరులు, తుదిలేకయంతటంగర్జిల్లుచు భయంకరములగుకరుళ్లతోఁ గూడియున్నదియు భయంకరంబును వరుణుని స్థానంబునగు మహాసముద్రముం గనిరి. అని, తాత్పర్యము.

మయస్య మాయావిహితం గిరిదుర్గం విచిన్వతామ్
తేషాం మాసో వ్యతిక్రాంతో యో రాజ్ఞా సమయః కృతః. ౧౫

టీక॥ తేషాం = ఆవానరులు; మయస్య= మయునియొక్క; మాయావిహితం=మాయచేఁజేయఁబడిన; గిరిదుర్గం= పర్వతమునందలి దుర్గమప్రదేశమును, ఋక్షబిలము ననుట ; విచిన్వతాం=వెదకుచుండఁగా; రాజ్ఞా= సు

గ్రీవుని చేత; యః=ఏది; సమయః= గ డువుగా; కృతః=చేయఁబడినదో; సః (అధ్యాహృతము)=ఆ; మాసః=నెల; వ్యతిక్రాంతః=అతిక్రమించినది.

అవ్వానరులు, మయునిచే, మాయానిర్మితంబగు నాబుుక్షబిలంబునం దిరుగుచుండు నప్పుడు, సుగ్రీవుం డేర్పఱచిన గడువు మాసమంతయు నతిక్రమించెను. అని, తాత్పర్యము.

వింధ్యస్య తు గిరేః పాదే సంప్రపుష్పితపాదపే
ఉపవిశ్య మహాత్మాన శ్చింతా మాపేదిరే తదా. ౧౬

టీక ॥ మహాత్మానః = అధికమయిన పరాక్రమము గలవానరులు; తదా=అప్పుడు; సంప్రపుష్పితపాదపే= మిక్కిలియుఁజక్కఁగాఁ బూచినవృక్షములుగల; వింధ్యస్య = వింధ్యమను; గిరేః=పర్వతముయొక్క; పాదేతు= తిప్పయందె, దక్షిణపశ్చిమదిశయందలి కొనయందేయనుట; ఉపవిశ్య = కూర్చుండి; చింతాం= దుఃఖమును; ఆపేదిరే = పొందిరి.

అంత, మహాపరాక్రమశాలులగున వ్వానరులు, చక్కఁగాఁబుష్పించిన వృక్షములతో నొప్పునట్టి వింధ్యగిరిదక్షిణపశ్చిమదిశయందలి తిప్పపైఁగూర్చుండి, చింతింపసాగిరి. అని, తాత్పర్యము.

తతః పుష్పాతిభారాగ్రా& లతాశతసమావృతా&
ద్రుమా& వాసంతికా న్దృష్ట్వా బభూవు ర్భయశంకితాః. ౧౭

టీక ॥ తతః = అటుపిమ్మట; తే(అధ్యాహృతము)=అవానరులు; పుష్పాతిభారాగ్రా& = పూలచేమిక్కిలియు బరువుగల కొనలుగలవియు; లతాశతసమావృతా& = తీఁగెలనూర్లచేఁ జుట్టఁబడినవియునగు; వాసంతికా&= వసంతర్తువునందు ఫలించునట్టి; ద్రుమా& = వృక్షములను; దృష్ట్వా=చూచి; భయశంకితాః = భయమువిషయమయి సందేహించినవారలు; బభూవుః= అయిరి.

అంతనవ్వానరులు, వసంతర్తువునందు ఫలించునట్టి మామిడిమొదలగు వృక్షములుచక్కఁగాఁ బుష్పించి, పెక్కులతలచేఁ బరివేష్టితములై యొప్పుచుండుటఁజూచి,(వసంతర్తువునందు ఫలించు

వృక్షములు శిశిరర్తువునందే పుష్పించుచు నుగావున) సుగ్రీవునివలని భయంబున మిక్కిలియుఁ దల్లడిల్లిరి.

అని, తాత్పర్యము.

తే వసంత మనుప్రాప్తం ప్రతిపద్య పరస్పరమ్
నష్టసందేశకాలార్థా నిపేతు ర్ధరణీతలే. ౧౮

టీక॥ తే=ఆవానరులు; పరస్పరం=ఒండొరులనుగూర్చి; వసంతం=వసంతర్తువును; అనుప్రాప్తం = సమీపించినదానిఁగా; ప్రతిపద్య=తెలిసి; నష్టసందేశకాలార్థాః = నశించినసుగ్రీవునాజ్ఞావచనమును గడువునుప్రయోజనమునుగలవారలు; ధరణీతలే= భూతలమునందు; నిపేతుః=పడిరి.

ఆవానరులు, వసంతర్తువు సమీపించినదనియు నప్పుడుశిశిరర్తువనియు నొండొరులు నిశ్చయించి తెలిసికొని, సుగ్రీవుఁడాజ్ఞాపించినట్లు సీతం గానకపోవుటయేగాక, యతండు నియమించిన గడువునుగూడ నతిక్రమించుటంజేసి సర్వార్థంబులును నశియించుటకు భీతులై నేలంబడిరి. అని, తాత్పర్యము.

తత స్తాన్ కపివృద్ధాంస్తు శిష్టాం శ్చైవ వనౌకసః
వాచా మధురయా భాష్య యథావ దనుమాన్య చ. ౧౯
స తు సింహవృషస్కంధః పీనాయతభుజః కపిః
యువరాజో మహాప్రాజ్ఞ అంగదో వాక్య మబ్రవీత్. ౨౦

టీక॥ తతః = అటుపిమ్మట; సింహవృషస్కంధః = సింహముయొక్కయు ఆఁబోతుయొక్కయు మూఁపుల వంటి మూఁపులుగలవాఁడును; పీనాయతభుజః= బలిసినవియు నిడుపులునగు చేతులుగలవాఁడును; మహాప్రాజ్ఞః = మహాపండితుఁడును; యువరాజః = యువరాజునగు; సః=ఆ; అంగదః = అంగదుఁడును; కపిస్తు = వానరుఁడుమాత్రము; తాన్=ఆ; కపివృద్ధాంస్తు=ముసలివానరులను; శిష్టాన్= పెద్దలయిన; వనౌకసశ్చైవ = వానరులను; మధురయా=తియ్యనైన; వాచా = మాటచేత; ఆభాష్య = పిలిచి; యథావత్ = యథాయోగ్యముగ; అనుమాన్యచ = గౌరవించియు; వాక్యం = మాటను; అబ్రవీత్ = పలికెను.

అంత, సింహమునకును ఆంబోతునకునుంబోలె భుజశిఖరములు గలవాఁడును బలిసినవియు దీర్ఘములునగుబాహువులు గలవాఁడును మహాపండితుండునగు యువరాజయిన యంగదుండు ఆవానరులలో వయోవృద్ధులును విద్యాసదాచారసంపన్నులునగు వారలను, మధురవాక్యంబునంబిలిచి యథాయోగ్యముగ సన్మానించి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

శాసనాత్కపి రాజస్య వయం సర్వే వినిర్గతాః
మాసః పూర్ణో బిలస్థానాం హరయః కిం నబుధ్యతే. ౨౧

టీక॥ హరయః= వానరులారా! వయం=మనము; సర్వే= అందఱమును; కపిరాజస్య= వానరరాజయినసుగ్రీవునియొక్క; శాసనాత్=ఆజ్ఞవలన; వినిర్గతాః=వెడలినాము. బిలస్థానాం=(మనము) బిలమునందుండఁగా; మాసః=నెల; పూర్ణః=నిండినది. నబుధ్యతేకిం=తెలియఁబడలేదా యేమి?

వానరులారా! వానరరాజు సుగ్రీవునియాజ్ఞమీఁద మనమందఱము వచ్చినాము; మనము బిలంబుననుండినప్పుడే, సుగ్రీవుండు సెలవిచ్చిన యవధి నెలయు సంపూర్ణంబయ్యె; మీకుఁదెలియ లేదా యేమి? అని, తాత్పర్యము.

వయమాశ్వయుజే మాసి కాలసంఖ్యావ్యవస్థితాః
ప్రస్థితాస్సోఽపి చాతీతః కిమతః కార్యముత్తరమ. ౨౨

టీక॥ వయం= మనము; ఆశ్వయుజే=ఆశ్వయుజమను, మాసి=నెలమొదలుకొని; కాలసంఖ్యాం= కాలముయొక్కలెక్కను; వ్యవస్థితాః= పొందినవారమయి; ప్రస్థితాః = బయలుదేఱినాము; లేక, ఆశ్వయుజేమాసి= (సామీప్యార్థమందుసప్తమి) ఆశ్వయుజమాసము వెంబడిదైన కార్తిక మాసమునందు; కాలసంఖ్యాం = కాలముయొక్కయవధిని; వ్యవస్థితాః=పొందినవారమయి; ప్రస్థితాః = బయలుదేఱినాము. సః=మనము వెదకవలసిన కాలమయిన మార్గశీర్ష మాసమును; అతీతః= అతిక్రమించినది; అపిచ= ఆవెంబడివైన పుష్యమాఘమాసములును; అతీతౌ (అధ్యాహృతము)= అతిక్రమించినవి. అతః= ఇటుపిమ్మట; కార్యం=చేయఁదగిన; ఉత్తరం=ఆవలికార్యము; కిం= ఏది?

మనము, మొదట నాశ్వయుజ మా

సమందె, హనుమంతుని ప్రేరణంబున, సుగ్రీవునిచేఁ బదునైదు దినముల గడువు నియమించి పిలువఁ బడినాము; ఆపిమ్మట లక్ష్మణుఁడువచ్చి కోపించినందుమీఁద మఱలఁ బది దినములు గడువుఁబెట్టి పిలువఁబడినాము; అపిమ్మట మార్గశీర్షమాసమంతయు సీతను వెదకవలసినట్లుగా పుష్యమాసమునందు సుగ్రీవునియొద్దఁ జేరవలసినట్లుగాను సుగ్రీవునిచే నాజ్ఞాపితులమైవచ్చినాము; ఇట్లు ఆశ్వయుజమాసము మొదలుకొని కాలము లెక్కపెట్టుచున్నాము కావున, మనమిపుడు కాలమతిక్రమించుటను మఱచినామనుటకు వీలులేదు; (లేక, ఆశ్వయుజమాస మయినపిమ్మటఁ గార్తికమాసము చివరను, సుగ్రీవుండు మనలను మార్గశీర్షమాసంబంతయు సీతాదేవిని వెదకవలెననియుఁ బుష్యమాసమునఁ దనయొద్దకుఁ జేరవలెననియు నియమించి, పంపినాఁడు.) ఆమార్గశీర్షమాసమును దానివెంబడి పుష్య మాఘ మాసంబులును అతిక్రమించినవి; ఇంకఁ జేయవలసిన కార్యమెద్ది? విచారింపుఁడు. అని, తాత్పర్యము.

**భవంతః ప్రత్యయం ప్రాప్తా నీతిమార్గవిశారదాః**
**హితే ష్వభిరతా భర్తు ర్నిసృష్టా స్సర్వకర్మసు. ౧౩**

టీక॥ భవంతః = మీరలు; ప్రత్యయం=నమ్మకమును; ప్రాప్తాః=పొందినవారలు. నీతిమార్గవిశారదాః = నీతిమార్గమునందుఁబండితులరు. భర్తుః=స్వామికి; హితేషు = మేలుగలిగించుకార్యములయందు; అభిరతాః=ఆసక్తులరు. సర్వకర్మసు = సమస్తకార్యములయందును; నిసృష్టాః=తేలినవారు.

మీరలు, సుగ్రీవుని నమ్మకమునకుఁ బాత్రులయినవారలు; నీతిమార్గము చక్కఁగాఁ దెలిసినవారలు; స్వామియయినసుగ్రీవుహితంబుగోరువారలు; సమస్తకార్యంబులయందును సమర్థులరు. అని, తాత్పర్యము.

**కర్మస్వప్రతిమా స్సర్వే దిక్షు విశ్రుతపౌరుషాః**
**మాం పురస్కృత్య నిర్యాతాః పింగాక్షప్రతిచోదితాః. ౧౪**

టీక॥ భవంతః(అధ్యాహృతము)= మీరలు; సర్వే= అందఱును; కర్మసు= కార్యములయందు; అప్రతిమాః = సరిలేనివారలు. దిక్షు = దిశలయందు;వి

ప్రథితపౌరుషాః = ప్రసిద్ధమయిన పరాక్రమముగలవారలు. పింగాక్షప్రతిచోదితాః = గోరోచనవువన్నెగల కన్నులుగలసుగ్రీవునిచేతఁ బ్రేరింపఁబడిన వారలయి; మాం = నన్ను; పురస్కృత్య = మున్నిడికొని; నిర్యాతాః = బయలుదేఱినారు.

కార్యములు సాధించుటయందు మీకులోకంబునసాటిలేరు; మీపరాక్రమంబు సమస్తదిశలయందును సుప్రసిద్ధము; మీరు సుగ్రీవునాజ్ఞంజేసి నావెంబడి వచ్చినారు. అని, తాత్పర్యము.

ఇదానీ మకృతార్థానాం మర్తవ్యం నాత్ర సంశయః
హరిరాజస్య సందేశ మకృత్వా కస్సుఖీ భవేత్. ౨౫

టీక॥ అకృతార్థానాం = చేయఁబడిన ప్రయోజనముగల వారముకానివారమయిన; అస్మాకం (అధ్యాహృతము) = మనకు; ఇదానీం=ఇప్పుడు; మర్తవ్యం = చావవలసినది. అత్ర= ఇందు; సంశయః=సందేహము; న=లేదు హరిరాజస్య= వానరరాజయిన సుగ్రీవునియొక్క; సందేశం = ఆజ్ఞను; అకృత్వా = చేయక; కః=ఎవఁడు; సుఖీ = సుఖముగలవాఁడు; భవేత్=అగును?

మనము,సీతనుంజూడక గడువునందప్పుటవలన, ఇఁకఁ జావవలసినవారమె; ఇందుకుసందియములేదు; వానరరాజుసుగ్రీవునాజ్ఞనతిక్రమించి, ఎవఁడు సుఖమునొందఁగలఁడు?

అని, తాత్పర్యము.

తస్మి న్నతీతే కాలే తు సుగ్రీవేణ కృతే స్వయమ్
ప్రాయోపవేశనం యుక్తం సర్వేషాం చ వనౌకసామ్. ౨౬

టీక॥ సుగ్రీవేణ=సుగ్రీవునిచేత; స్వయం=తనచేతనె; కృతే=చేయఁబడిన; తస్మిన్=ఆ; కాలే = గడువు; అతీతే తు=అతిక్రమించినదికాఁగా మాత్రము; వనౌకసాం=వానరులకు; సర్వేషాం=అందఱకును; ప్రాయోపవేశనం=మరణము నొందుటకుఁ బరుండుట; యుక్తం=యోగ్యము.

సాక్షాత్సుగ్రీవుఁడేవిధించినగడువుల తిక్రమించినపుడు, సమస్తవానరులును,

ఆహారాదులువర్జించిపరుండియుండి మరణమునొందుటయె యుక్తము. అని, తా.

తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవ స్స్వామిభావే వ్యవస్థితః
నక్షమిష్యతి న స్సర్వా నపరాధకృతో గతాన్. ౨౭

టీక॥ స్వామిభావే=రాజగుటయందు; వ్యవస్థితః=ఉన్న; సుగ్రీవః=సుగ్రీవుఁడు; ప్రకృత్యా= స్వభావముచేత; తీక్ష్ణః=క్రూరుఁడు. గతాన్=పోయిన; అపరాధకృతః= అపరాధముగావించినట్టి; నః=మనలను; సర్వాన్=అందఱను; నక్షమిష్యతి=మన్నింపఁడు.

సుగ్రీవుండు స్వభావంబుననేమిక్కిలియుఁగ్రూరుండు, అతండురాజునైయున్నాఁడు; కావున నపరాధులమగు మనము అతనియొద్దకుఁబోయిన యెడ, తప్పక శిక్షించునుగాని యొకరినైనను ఎంతమాత్రము మన్నింపఁడు. అని, తాత్పర్యము.

అప్రవృత్తౌచ సీతాయాః పాపమేవ కరిష్యతి
తస్మా త్క్షమ మిహాద్యైవ ప్రాయోపవిశనంహి నః. ౨౮

టీక॥ సః (అధ్యాహృతము) = ఆ సుగ్రీవుఁడు; సీతాయాః = సీతయొక్క; అప్రవృత్తౌచ=వార్తయులేకపోఁగా; పాపమేవ= పాపమునే; కరిష్యతి=చేయఁగలఁడు. తస్మాత్=అందువలన; నః=మనకు; అద్యైవ= ఇపుడె; ప్రాయోపవిశనంహి (ప్రాయోపవేశనం)=మరణము నొందుటకుఁ గూర్చుండుటయె; క్షమం=యుక్తము.

మనము, గడువు దప్పి పోవుటయెగాక, సీత వార్తయుం దెలియకపోవుటవలన, సుగ్రీవుండు, మనలం జంపించునేగాని యెంత మాత్రము మన్నింపఁడు; అందు వలన, మనమిచటనె ప్రాయోపవేశముగావించి, మరణము నొందుట యుక్తము. అని, తాత్పర్యము.

త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ ధనానిచ గృహాణిచ
ధ్రువం నో హింసితా రాజా సర్వా న్ప్రతిగతా నితః. ౨౯

టీక॥ రాజా=సుగ్రీవుఁడు; ఇతః=ఇచటనుండి; ప్రతిగతాన్ = మఱలిపోయిన; నః=మమ్ము; సర్వాన్= అందఱను; పుత్రాంశ్చ= కొమరులను; దా

స ౫౩

రాంశ్చ=భార్యలను; ధనానిచ = ధనములను; గృహాణిచ = ఇండ్లను; త్యక్త్వా(త్యాజయిత్వా)=విడిపించి; హింసితా= వధించును. ధ్రువం = నిశ్చయము.

న, మనమందఱమును, గోడుకులనుభార్యలను ధనములను గృహములనువదలిహతులము గావలిసినదేగాని వేఱుగతిలేదు; ఇదినిశ్చయము.

అని, తాత్పర్యము.

అచటికిఁబోఁగానే,సుగ్రీవునాజ్ఞవల

వధే నాప్రతిరూపేణ శ్రేయా న్మృత్యు రిహైవ నః

టీక ॥ అప్రతిరూపేణ = సరిలేని; వధేన = (పంచమ్యర్థమందుఁదృతీయ) వధముకన్నను;నః=మనకు; ఇహైవ= ఇచటనె; మృత్యుః=చావు; శ్రేయాన్= మంచిది.

అచటసుగ్రీవునిచే నతిభయంకరముగా వధింపఁబడుటకన్నను, మనమిచటనె ప్రాయోపవేశంబునఁ బ్రాణంబులు వదలుటమంచిది. అని, తాత్పర్యము.

న చాహం యౌవరాజ్యేన సుగ్రీవేణాభిషేచితః. ౩౦
నరేంద్రే ణాభిషిక్తోస్మి రామేణా క్లిష్టకర్మణా

టీక ॥ అహం=నేను; సుగ్రీవేణ = సుగ్రీవునిచేత; యౌవరాజ్యేన = యువరాజు దొరతనముచేత; నాభిషేచితశ్చ=అభిషేకింపఁబడినవాఁడనుంగాను. అక్లిష్టకర్మణా = క్లేశముగలిగింపనికార్యముగల; నరేంద్రేణ = మనుష్యులకు రాజైన; రామేణ=రామునిచేత; అభిషిక్తః=అభిషేకింపఁబడినవాఁడను; అస్మి =అగుచున్నాను.

నాకు యౌవరాజ్యంబున సుగ్రీవుండు పట్టాభిషేకము సేయలేదు; ఎవ్వరికిని ఎంతమాత్రమునుమనఃక్లేశము సేయనట్టి మహారాజు రాముండు నాకుఁ బట్టాభిషేకము గావించినాఁడు.

అని, తాత్పర్యము.

స పూర్వం బద్ధవైరో మాం రాజా దృష్ట్వా వ్యతిక్రమమ్. ౩౧
ఘాతయిష్యతి దండేన తీక్ష్ణేన కృతనిశ్చయః

టీక॥ పూర్వం = ముందు; బద్ధవైరః=కట్టఁబడినవిరోధముగల; సః=ఆ; రాజా = సుగ్రీవుఁడు; వ్యతిక్రమం = అపరాధమును; దృష్ట్వా=చూచి; కృతనిశ్చయః = చేయఁబడిన నిశ్చయము గలవాఁడై; మాం=నన్ను; తీక్ష్ణేన = క్రూరమయిన; దండేన=శిక్ష చేత; ఘాతయిష్యతి = చంపించును.

సుగ్రీవుండు మున్నె నామీఁద వైరముపూనిన వాఁడుగావున, నాయందపరాధమున్నంతనె, పూనికతోఁ, దీక్ష్ణమయినశిక్షవిధించి, నన్నువధింపఁగలఁడు. అని, తాత్పర్యము.

కిం మే సుహృద్భి ర్వ్యసనం పశ్యద్భి ర్జీవితాంతరే. ౩౨
ఇహైవ ప్రాయ మాసిష్యే పుణ్యే సాగరరోధసి

టీక॥ మే=నాయొక్క; జీవితాంతరే=బ్రతుకుయొక్కయావధియందు, మరణకాలమందు; వ్యసనం= కష్టమును; పశ్యద్భిః=చూచుచున్న; సుహృద్భిః = స్నేహితులచేత; కిం= ఏమిప్రయోజనము? ఇహైవ=ఇచట; పుణ్యే=పవిత్రమయిన; సాగరరోధసి = సముద్రతీరమునందు; ప్రాయం= అనశనవ్రతమును,ఆహారములేనివ్రతమును; ఆసిష్యే= అవలంబించెదను.

నేను కిష్కింధలోసుగ్రీవునిచే హతుఁడనై, నా మిత్రులనందఱు నావధముఁజూచి దుఃఖించునట్లు చేయుటవలన నాకేమిప్రయోజనము? ఇచటనే పుణ్యంబగుసముద్రతీరంబునందు, అనశనవ్రతంబునవలంబించి ప్రాణంబులు విడిచెదను. అని, యంగదుండు పలికెను.

అని, తాత్పర్యము.

ఏత చ్ఛ్రుత్వా కుమారేణ యువరాజేన భాషితమ్. ౩౩
సర్వే తే వానరశ్రేష్ఠాః కరుణం వాక్య మబ్రువన్

టీక ॥ తే=ఆ; వానరశ్రేష్ఠాః = వానరోత్తములు; సర్వే= అందఱును; యువరాజేన = యువరాజయిన; కుమారేణ = బాలుఁడైనయంగదునిచేత; భాషితం = చెప్పఁబడిన; ఏతత్= ఈమాటను; శ్రుత్వా=విని; కరుణం= దుఃఖముగలిగించునట్టి; వాక్యం= మాటను; అబ్రువన్ = పలికిరి.

యువరాజగు కుమారుం డంగదుండు పలికిన యీవాక్యంబువిని, యవ్వాన

రోత్తములందఱును దుఃఖంబున నిట్లనిచెప్పిరి. అని, తాత్పర్యము.

తీక్ష్ణః ప్రకృత్యా సుగ్రీవః ప్రియాసక్తశ్చ రాఘవః. ౩౪
అదృష్టాయాంతు వైదేహ్యాం దృష్ట్వాచైవ సమాగతాన్
రాఘవప్రియకామార్థం ఘాతయిష్య త్యసంశయమ్. ౩౫

టీక॥ సుగ్రీవః=సుగ్రీవుఁడు; ప్రకృత్యా=స్వభావముచేత; తీక్ష్ణః= క్రూరుఁడు. రాఘవశ్చ = రాముఁడును; ప్రియాసక్తః=భార్యయందుఁ దగిలినవాఁడు. వైదేహ్యాం=సీత; అదృష్టాయాం తు=చూడఁబడనిదికాఁగా మాత్రము; సమాగతాన్ = వచ్చిన; అస్మాన్(అధ్యాహృతము) = మనలను; రాఘవప్రియకామార్థం= రామునిసంతోషముఅనుకోరికకొఱకు; అసంశయం= సందేహములేనట్లుగా; ఘాతయిష్యతి= చంపింపఁగలఁడు.

సుగ్రీవుఁడు స్వభావంబుననె క్రూరుండు, రాముఁడో ప్రియురాలిపై మిక్కిలియుఁగూర్మియున్నవాఁడు; కావున, మనము సీతంజూడకయె సుగ్రీవుని యొద్దకుఁబోవుదుమేని, యతండు, రామునిసంతోషార్థమయి, తప్పకవధించును; ఇందుకుసందియములేదు.

అని, తాత్పర్యము.

న క్షమం చాపరాద్ధానాం గమనం స్వామిపార్శ్వతః

టీక॥ అపరాద్ధానాం = తప్పుగావించినవారలకు; స్వామిపార్శ్వతః= రాజుయొక్క ప్రక్కకు; గమనంచ=పోవుటయు; నక్షమం = తగినదికాదు.

ఇదియునుగాక, యపరాధముగావించినవారలు రాజసమీపంబునకుఁబోవుటయె యుక్తముకాదు.

అని, తాత్పర్యము.

ఇహైవ సీతా మన్విష్య ప్రవృత్తి ముపలభ్యవా. ౩౬
నోచే ద్గచ్ఛామ తం వీరం గమిష్యామో యమక్షయమ్

టీక॥ సీతాం = సీతాదేవిని; అన్విష్య=వెదకి; ప్రవృత్తిం = వృత్తాంతమును; ఉపలభ్యవా= తెలిసికొనిగాని; తం=ఆ; వీరం=పరాక్రమవంతుఁడగు సుగ్రీవుని; గచ్ఛామ (గచ్ఛామః) = పొందెదము. నోచేత్ =లేనియెడ; ఇహైవ = ఇచట

న్; యమత్ యం=యమునిగృహమును; గమిష్యామః=పొందెదము.

సీతాదేవిని వెదకి యాబిడ వృత్తాంతము దెలిసికొంటిమేని వీరుండగు నాసుగ్రీవునొద్దకుంబోవుదము; లేనియెడ, నిచటనే ప్రాణంబులువిడువుదము. అని, వానరులుపలికిరి. అని, తాత్పర్యము.

ప్లవంగమానాం తు భయార్దితానాం
శ్రుత్వా వచ స్తార ఇదం బభాషే. ౩౭

టీక॥ తారః= తారుండు; భయార్దితానాం=భయముచేఁబీడింపఁబడిన; ప్లవంగమానాం=వానరులయొక్క; వచః=మాటను; శ్రుత్వాతు = విన్నంతనే; ఇదం=ఈమాటను; బభాషే=చెప్పెను.

అట్లు భయార్తులగు వానరోత్తములు పలికిన పలుకులువిని, తారుండు, ఇట్లని వక్కాణించెను.

అని, తాత్పర్యము.

అలం విషాదేన బిలం ప్రవిశ్య
వసామ సర్వే యది రోచతే వః

టీక ॥ విషాదేన = దుఃఖముచేత; అలం=చాలును. వః=మీకు; రోచతే= రుచించునేని; సర్వే = అందఱమును; బిలం = వివరమును; ప్రవిశ్య = చొచ్చి; వసామ = ఉందము.

దుఃఖింపవలదు; మీకునుఇష్టమగునేని,అందఱము నీబిలంబుఁజొచ్చి యిందు వసించియుందము. అని, తాత్పర్యము.

ఇదం హి మాయావిహితం సుదుర్గమం
ప్రభూతవృక్షోదకభోజ్యపేయకమ్. ౩౮
ఇహాస్తి నో నైవ భయం పురందరా
న్న రాఘవా ద్వానరరాజతోపివా

టీక॥ ఇదం= ఈబిలము; మాయావిహితం = మాయచేఁ జేయఁబడినదియు;సుదుర్గమం=చొరరానిదియు; ప్రభూతవృక్షోదకభోజ్యపేయకంహి = అధికములయినవృక్షములును జలమును దినఁదగిన వస్తువులును ద్రావఁదగిన వ

స ౫౩

స్తువులునుగలదియుఁగదా! ఇహ=ఇచట; నః=మనకు; భయం= వెఱపు; పురందరాత్=ఇంద్రునివలన; నైవ=లేనేలేదు. రాఘవాత్= రామునివలనఁగాని; వానరరాజతోపివా = వానరులకు ఱేఁడైన సుగ్రీవుని వలనఁ గాని; న= లేదు.

ఈ బిలము, మాయానిర్మితంబును ఎట్టి వారికిని బ్రవేశింప నలవిగానిదియు వృక్షములును జలమును భోజ్యవస్తువులును పానద్రవ్యములును. సమృద్ధముగాఁగలదియుఁ గావున, నిందుమనము సుఖముగా నుండవచ్చును; ఇచట మనము, దేవేంద్రునివలనఁగాని రాముని వలనఁగాని సుగ్రీవునివలనఁగాని యెంత మాత్రము భయపడ వలసినది లేదు. అని, తారుఁడు చెప్పెను.

అని, తాత్పర్యము.

శ్రుత్వాంగదస్యాపి వచోనుకూల
మూచుశ్చ సర్వే హరయః ప్రతీతాః. ౩౯
యథా న హింస్యేమ తథా విధాన
మసక్త మద్యైవ విధీయతాం నః

టీక ॥ హరయః = వానరులు; సర్వేచ = అందఱును; అంగదస్య=అంగదునికి; అనుకూలం = అనుకూలమయిన; వచఃఅపి=(తారుని)మాటను;శ్రుత్వా=విని; ప్రతీతాః = నమ్మకముగలవారలయి; "యథా = ఎట్లు; నహింస్యేమ=హింసింపఁబడమో; తథా = అట్లు; నః=మనకు; విధానం= ఏర్పాటు; అసక్తం = శీఘ్రముగా; అద్యైవ=ఇప్పుడే; విధీయతాం = చేయఁబడుఁగాక." ఇతి (అభ్యాహృతము)=అని; ఊచుః = పలికిరి.

అంగదునకనుకూలముగాఁ దారుఁడుగూఁడఁజెప్పటను విని, వానరులు నమ్మకమునొందినవారలయి, "ఎట్లుగావించితే మనకుబాధగలుగదో, ఆవిధంబున, శీఘ్రముగా నేర్పాటుగావింపుఁడు." అని,వచించిరి. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, త్రిపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండత్రిపంచాశసర్గటీక, ముగిసినది.

---

౫౪

చతుఃపంచాశసర్గప్రారంభః.

తథా బ్రువతి తారే తు తారాధిపతివర్చసి
అథ మేనే హృతం రాజ్యం హనుమా నంగదేన తత్. ౧

టీక ॥ అథ=అంత; తారాధిపతివర్చసి = చంద్రునియొక్క కాంతివంటి కాంతిగల; తారే = తారుఁడు; తథా=అట్లు; బ్రువతితు= చెప్పుచుండఁగా నే; హనుమాన్=హనుమంతుఁడు; తత్=ఆ; రాజ్యం=వానరరాజ్యమును; అంగదేన=అంగదునిచేత; హృతం = అపహరింపఁబడినదానిఁగా; మేనే = తలంచెను.

అంత, నట్లు చంద్రునకుంబోలెఁ గాంతిగల తారుండు పలుకుటను విని, హనుమంతుండు, "ఇఁక సుగ్రీవుని వానరరాజ్యంబునంతయు నంగదుండు తప్పకహరించు"ననితలంచెను. అని, తా.

బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం చతుర్బల సమన్వితమ్
చతుర్దశగుణం మేనే హనుమా న్వాలిన స్సుతమ్. ౨

టీక॥ హనుమాన్= హనుమంతుఁడు; వాలినః=వాలియొక్క;సుతం=కొడుకైనయంగదుని; అష్టాంగయా=ఎనిమిదియంగములుగల;బుద్ధ్యా=బుద్ధితో; యుక్తం=కూడినవానిఁగాను, "గ్రహణం ధారణంచైవ స్మరణం ప్రతిపాదనం, ఊహాపోహార్థవిజ్ఞానంతత్త్వజ్ఞానంచధీగుణాః" (గ్రహించుట,ధరించుట, జ్ఞప్తియుంచుకొనుట, బోధించుట, ఊహించుట, క్రొత్తసంగతు లూహించుట, అర్థజ్ఞానము, తత్త్వముఁదెలియుట ఇవిబుద్ధిగుణములు ఎనిమిది) చతుర్బలసమన్వితం = నాలుగుబలములతోను గూడినవానిఁగాను (బాహుబల

ము, మనోబలము, ఉపాయబలము, బంధుబలము, ఇవినాలుగు బలములు); చతుర్దశగుణం = పదునాలుగుగుణములుగలవానిఁగాను; "దేశకాలజ్ఞతా దార్ఢ్యం సర్వక్లేశసహిష్ణుతా, సర్వవిజ్ఞానితా దాక్ష్య మూర్జ స్సంవృతమంత్రతా, అవిసంవాదితా శౌర్యం శక్తిజ్ఞత్వం కృతజ్ఞతా, శరణాగతవాత్సల్యమమర్షిత్వమచాపలం" (దేశకాలములు దెలియుటయు, దృఢత్వమును, సమస్తక్లేశములు సహించుటయు, సమస్తముఁ దెలియుటయు, సామర్థ్యంబును, పూనికయు, ఆలోచన బయలుపుచ్చకుండుటయు, అబద్ధము చెప్పకుండుటయు, శూరత్వమును, ఇతరుల సామర్థ్యముఁ దెలియుటయు, తనకుఁ జేయంబడినయుపకారము మఱవకుండుటయు, శరణాగతులయం దుఁ బ్రీతియుంచుటయు, కోపముగలుగుటయు, చాపలములేకుండుటయు, ఇవిచతుర్దశ గుణములు). మేనే = తలంచెను.

వాలిపుత్త్రుండగుదుండు, గ్రహణధారణాదులగు అష్టగుణములుగల బుద్ధితోఁగూడినవాఁడనియు, బాహుబలమనో బలోపాయ బలబంధుబలములను చతుర్బలములు గలవాఁడనియు, దేశకాలజ్ఞత మొదలగు చతుర్దశగుణములతో నొప్పుచున్నవాఁడనియు, హనుమంతుండు దెలిసికొనెను. అని, తాత్పర్యము.

అపూర్యమాణం శశ్వచ్చ తేజోబలపరాక్రమైః
శశినం శుక్లపక్షాదౌ వర్ధమాన మివ శ్రియా. ౩
బృహస్పతిసమం బుద్ధ్యా విక్రమే సదృశం పితుః
శుశ్రూషమాణం తారస్య శుక్రస్యేవ పురందరమ్. ౪
భర్తు రర్థే పరిశ్రాంతం సర్వశాస్త్రవిశారదమ్
అభిసంధాతు మారేభే హనుమా నంగదం తతః. ౫

టీక ॥ తతః = అంత; హనుమాన్ = హనుమంతుండు; శశ్వచ్చ = ఎల్లప్పుడును; తేజోబలపరాక్రమైః = ఇతరులచేఁ దిరస్కరింపనలవిగాకుండు శక్తిచేతను దేహదార్ఢ్యముచేతను ఇతరుల నాక్రమించు శక్తిచేతను; అపూర్యమాణం = నిండింపఁ బడుచున్నవాఁడును; శుక్లపక్షాదౌ = శుక్లపక్షారంభమునందు; శ్రియా = కాంతిచేత; వర్ధమానం = వృద్ధిఁ బొందుచున్న ; శశినమివ(స్థితం) = చంద్రునివలెనున్నవాఁడును; బుద్ధ్యా = బుద్ధిచేత; బృహస్పతిసమం = బృహస్పతితో

సమానుండును; విక్రమే = పరాక్రమమునందు; పితుః= తండ్రికి; సదృశం= సమానుండును; తారస్య=తారునియొక్క; వచనం(అధ్యాహృతము)=మాటను; శుశ్రూషమాణం=వినఁగోరుచున్నవాఁడును; శుక్రస్య= శుక్రాచార్యునియొక్క; లేక, ఇంద్రవాచకమయినపురందరశబ్దము సన్నిహితముగా నుండుటవలన, శుక్రశబ్దము బృహస్పతివాచకమగును; కావున, శుక్రస్య=బృహస్పతియొక్క; వచనం(అధ్యాహృతము)= మాటను; శుశ్రూషమాణం (అధ్యాహృతము)= వినఁగోరుచున్న; పురందరమివ (స్థితం)= ఇంద్రునివలెనున్నవాఁడును; "గురోరివపురందరం" అను పాఠాంతరపక్షంబున; గురోః వచనంశుశ్రూషమాణంపురందరమివస్థితం=బృహస్పతివచనమునువినఁగోరుచున్న దేవేంద్రునివలెనున్నవాఁడును;భర్తుః=పెనిమిటియొక్క; అర్థే=కార్యమునందు;పరిశ్రాంతం=అలసినవాఁడును;సర్వశాస్త్రవిశారదం= సమస్తశాస్త్రములయందును బండితుండునగు; అంగదం=అంగదుని; అభిసంధాతుం = అనుకూలపఱచుటకు; ఆరేభే=ఆరంభించెను.

చంద్రుండు శుక్లపక్షంబునఁ గాంతిచే వర్ధిల్లునట్లు క్రమముగాఁ దేజోబల పరాక్రమంబుల వృద్ధినొందుచున్నవాఁడును బుద్ధియందు బృహస్పతి తుల్యుండును బరాక్రమంబునఁ దనతండ్రికి సమానుండును, ఒకానొకప్పుడు హితంబుపదేశించు శుక్రునివచనంబు వినుచున్న దేవేంద్రునియట్లు (హితముపదేశించు బృహస్పతివచనంబు వినుచున్న దేవేంద్రునియట్లు) తారునివచనంబు వినుచున్నవాఁడును సుగ్రీవునికార్యమునందే శ్రమపడియున్నవాఁడును సమస్తశాస్త్రములయందును బడితుండునగు నంగదుండు సుగ్రీవునితో భేదము నొందక యతని కనుకూలుండగునట్లు, హనుమంతుఁడు నీతివాక్యంబులు పలుకనారంభించెను. అని, తాత్పర్యము.

స చతుర్ణా ముపాయానాం తృతీయ ముపవర్ణయన్
భేదయామాస తాన్ సర్వా న్వానరా న్వాక్యసంపదా. ౬

టీక॥ సః=ఆహనుమంతుఁడు; చతుర్ణాం=నాలుగైన; ఉపాయానాం=ఉపాయములలోపల; తృతీయం= మూడవదైన భేదోపాయమును; ఉపవర్ణయన్= ప్రయోగించుచు; వాక్యసంపదా=మాటలయొక్క యతిశయముచే

తః;తాన్=ఆ;వానరాన్ = వానరులను;సర్వాన్=అందఱను; భేదయామాస=భేదిల్లునట్లు గావించెను.

హనుమంతుండు, సామదానభేదదండోపాయముల మూడవదగు భేదోపాయంబు నవలంబించి, మాటలపెంపున నవ్వానరులనందఱు, నంగదునాశ్రయించి ఋక్షబిలంబుననివసించువిషయమయి విరోధించునట్లు గావించెను. అని, తాత్పర్యము.

తేషు సర్వేషు భిన్నేషు తతో ఽభీషయ దంగదమ్
భీషణై ర్బహుభి ర్వాక్యైః కోపోపాయసమన్వితైః. ౭

టీక॥ తేషు=ఆవానరులు;సర్వేషు=అందఱును;భిన్నేషు=భేదిల్లినవారుకాఁగా; తతః=అటుపిమ్మట; సః (అధ్యాహృతము)=ఆహనుమంతుఁడు; అంగదం= అంగదుని; కోపోపాయసమన్వితైః=కోపరూపమయిన ఉపాయముతోఁగూడిన; భీషణైః=భయముగలిగించునట్టి; బహుభిః=పెక్కులయిన; వాక్యైః=మాటలచేత; అభీషయత్= వెఱపించెను.

వానరులందఱు భేదమునొందిన తరువాత, నాహనుమంతుండు కోపరూపమయిన యుపాయమగు దండోపాయమునవలంబించి తదను గుణంబులగు మాటలంజెప్పి యంగదునకు భయము గలిగించెను. అని, తాత్పర్యము.

త్వం సమర్థతరః పిత్రా యుద్ధే తారేయ వై ధురమ్
దృఢం ధారయితుం శక్తః కపిరాజ్యం యథా పితా. ౮

టీక॥ తారేయ = తారాపుత్త్రుఁడవగునంగదుఁడా! ("వై" అనునదిపాదపూరణార్థము); త్వం=నీవు; యుద్ధే=పోరునందు; పిత్రా (పితుః)= తండ్రికన్నను; సమర్థతరః= అధికముగాసమర్థుండవు. కారకవచనము. కపిరాజ్యం=వానరరాజ్యమును; పితాయథా= తండ్రివలె; ధురం=భారమును; దృఢం = గట్టిగా; ధారయితుం= ధరించుటకు; శక్తః=సమర్థుండవు.

అంగదుఁడా! నీవు, యుద్ధంబున నీతండ్రికన్న గట్టివాఁడవా? నీ తండ్రియట్లు, వానరరాజ్యభారంబునంతయు దృఢముగావహింపఁగలవు. అని, తాత్పర్యము.నీతండ్రియెట్లుహతుఁడయ్యెనోనీవునట్లే హతుఁడవవుదువు. అని,భావము.

నిత్య మస్థిరచిత్తాహి కపయో హరిపుంగవ
నాజ్ఞాప్యం విషహిష్యంతి పుత్రదారం వినా త్వయా. ౯

టీక ॥ హరిపుంగవ = వానరశ్రేష్ఠుఁడా! కపయః=వానరులు; నిత్యం= ఎల్లప్పుడును; అస్థిరచిత్తాహి = నిలుకడకానిమనస్సుగలవారలుగదా! పుత్రదారంవినా = కొడుకులను భార్యలను విడిచి; త్వయా= నీచేత; ఆజ్ఞాప్యం= ఆజ్ఞాపింపఁదగినదానిని; నవిషహిష్యంతి = ఓర్వఁజాలరు.

వానరోత్తముఁడా! ఇదిగాక, వానరులు, ఎప్పుడును చంచలచిత్తులు; రలు, పెండ్లాము పిడ్డలనువిడిచి, నీయాజ్ఞకులోఁబడి యెంతమాత్రము నుండరు. అని, తాత్పర్యము.

త్వాం నైతే హ్యనుయుంజేయుః ప్రత్యక్షం ప్రవదామి తే
యథా యం జాంబవాన్నీల స్సుహోత్రశ్చ మహాకపిః. ౧౦

టీక ॥ తే=నీయొక్క ; ప్రత్యక్షం= సమక్షమందు; ప్రవదామి = చెప్పుచున్నాను. అయం=ఈ; జాంబవాన్ = జాంబవంతుఁడును; నీలః= నీలుండును; సుహోత్రః = సుహోత్రుఁడును; మహాకపిశ్చ = గొప్పవానరుఁడును; యథా=ఎట్లు; తథా(అధ్యాహృతము)= అట్లు; ఏతే = ఈవానరులు; త్వాం=నిన్ను; నానుయుంజేయుహిః = అనువర్తింపనేయును వర్తింపరు.

నీయెదుటఁజెప్పెదను; ఈజాంబవంతుండును నీలుండును సుహోత్రుండును మున్నగువానరులు, నిన్ననువర్తించియుండరు. అని, తాత్పర్యము.

న హ్యహం త ఇమే సర్వే సామదానాదిభి ర్గుణైః
దండేనవా త్వయా శక్యా స్సుగ్రీవా దపకర్షితుమ్. ౧౧

టీక ॥ అహం=నేనును; తే=అట్టి; ఇమే=వీరలును; సర్వే= అందఱమును; త్వయా=నీచేత; సామదానాదిభిః=సామము దానము మొదలుగాఁగల; గుణైః= ఉపాయములచేతఁగాని; దండేనవా= దండోపాయముచేఁగాని; సుగ్రీవాత్ =సుగ్రీవునియొద్దనుండి; అపకర్షితుం=లాగుటకు; నశక్యాహి= అ

లవిగాముగదా!

నన్నును ఈజాంబవదాదులను, సామదానభేదంబులంగాని దండోపాయంబునంగాని సుగ్రీవునియొద్దనుండి నీయొద్దకు ఆకర్షించుటకు నీచే శక్యము గాదు గదా! అని, తాత్పర్యము.

విగృహ్య సనమప్యాహు ర్దుర్బలేన బలీయసః
ఆత్మరక్షాకర స్తస్మా న్నవిగృహ్ణీత దుర్బలః. ౧౨

టీక ॥ బలీయసః = ప్రబలునకు; దుర్బలేన = బలములేనివానితో; విగృహ్య = విరోధించి; ఆసనమపి = ఉండుటనుగూడ; ఆహుః = చెప్పుచున్నారు. దుర్బలః = బలహీనుఁడు; ఆత్మరక్షాకరః = తనసంరక్షణమును జేసికొనువాఁడు. తస్మాత్ = అందువలన; నవిగృహ్ణీత = విరోధింపఁగూడదు.

ప్రబలుఁడగువాఁడు, బలహీనుని విరోధించియుండవలెనని నీతివిదులు చెప్పుదురుగాని దుర్బలుఁడు ప్రబలునితో విరోధించియుండవచ్చునని నీతివిదుల కనుమతము గాదు; బలహీనుఁడగువాఁడు, ఆత్మసంరక్షణమునే చేసికొనవలసినవాఁడు; కావున, అతనికిఁ బ్రబలునితో విరోధ మెంతమాత్రము తగదు.

అని, తాత్పర్యము.

యాం చేమాం మన్యసే ధాత్రీ మేత ద్బిల మితి శ్రుతమ్
ఏత ల్లక్ష్మణ బాణానా మీష త్కార్యం విదారణే. ౧౩

టీక ॥ యాం=ఏ; ఇమాం=ఈగుహను; ధాత్రీం= రక్షకముగా; మన్యసే=తలంచుచున్నావో; తారాత్ (అధ్యాహృతము) = తారునివలన; "ఏతత్=ఈ; బిలం=బిలము"; ఇతి= అని; శ్రుతం=వినఁబడిన; ఏతచ్చ=ఇదియు; విదారణే=భేదించుటయందు; లక్ష్మణబాణానాం=లక్ష్మణునిబాణములకు; ఈషత్కార్యం=కొంచెముపని.

తారుండు చెప్పినట్లు, స్వబలంబులేకున్నను ఈబిలము నిన్నురక్షించునని తలంతువేమో; దీని భేదించుటయందుఁగా లక్ష్మణ బాణంబులకు స్వల్పకార్యము. అని, తాత్పర్యము.

స్వల్పం హి కృత మింద్రేణ క్షిపతా హ్యశనిం పురా

లక్ష్మణో నిశితై ర్బాణై ర్భిన్ద్యాత్పత్రపుటం యథా. ౧౪

టీక ॥ పురా=మున్ను; అశనిం=వజ్రాయుధమును; క్షిపతా = వేయునట్టి; ఇంద్రేణ= ఇంద్రునిచేత; స్వల్పం హి=కొంచెము; కృతం హి= చేయబడినదిగదా! లక్ష్మణః=లక్ష్మణుఁడు; నిశితైః=కఱకులయిన; బాణైః=బాణములచేత; పత్రపుటం యథా= ఆకులదొప్పనువలె; భింద్యాత్=భేదించును.

మున్ను, ఇంద్రుండు ఈబిలంబుపై వజ్రాయుధంబు ప్రయోగించి కొంచెమే గావించినాఁడు, ద్వారముమాత్రము కలుగఁజేసినాఁడుకాని మఱేమియు లేదు; లక్ష్మణుండో, ఆకుదొప్పను చీల్చినట్లుగా, నీబిలంబును గఱకుటమ్ముల భేదింపఁ గలఁడు.

అని, తాత్పర్యము.

లక్ష్మణస్యతు నారాచా బహవ స్సన్తి తద్విధాః
వజ్రాశనిసమస్పర్శా గిరీణామపి దారణాః. ౧౫

టీక ॥ లక్ష్మణస్యతు = లక్ష్మణునకుమాత్రము; తద్విధాః = అట్టివిధములగు; వజ్రాశనిసమస్పర్శాః = వజ్రముతోను పిడుగుతోను సమానముయిన తాఁకుడుగలవియు; గిరీణామపి=పర్వతములయొక్కయు; దారణాః= భేదించునవియునగు; బహవః= పెక్కులయిన; నారాచాః=బాణములు; సంతి=కలవు.

అట్టి యసమానమగు శక్తిగలవియు వజ్రాయుధముతోను పిడుగుతోను సమానములునగు బాణంబులు పెక్కులు లక్ష్మణునియొద్దం గలవు; అవి పర్వతంబులనేని భేదింపఁగలవు; వానికి ఈబిలంబెంతమాత్రము. అని, తాత్పర్యము.

అవస్థానే యదైవ త్వ మాసిష్యసి పరన్తప
తదైవ హరయ స్సర్వే త్యక్ష్యన్తి కృతనిశ్చయాః. ౧౬

టీక॥ పరంతప=శత్రువులఁదపింపఁజేయునట్టివాఁడా! త్వం=నీవు; అవస్థానే= విరోధించియుండుటయందు; యదైవ=ఎప్పుడే; ఆసిష్యసి = నిలువఁగలవో; తదైవ=అప్పుడే; హరయః=వానరులు; సర్వే = అందఱును; కృతనిశ్చయాః=చేయఁబడిన యేర్పాటుగలవారలయి; త్యక్ష్యంతి=విడువఁగలరు.

శత్రువులం దపింపఁజేయునట్టి యంగదుఁడా! నీవు సుగ్రీవునితో విరోధించి యాబిలంబున నుండుటకుఁ బూనినంతనే, యీవానరులందఱు నిశ్చయించికొని, నిన్నువిడిచిపోఁగలరు.

అని, తాత్పర్యము.

స్మరంతః పుత్త్రదారాణాం నిత్యోద్విగ్నా బుభుక్షితాః
ఖేదితా దుఃఖశయ్యాభి స్త్వాం కరిష్యంతి పృష్ఠతః. ౧౭

టీక ‖ ఏతే (అధ్యాహృతము) = ఈవానరులు; పుత్త్రదారాణాం=కొడుకులను భార్యలను; స్మరంతః=తలంచుచున్నవారలయి; నిత్యోద్విగ్నాః = ఎల్లప్పుడును దిగులుపడినవారలయి; బుభుక్షితాః = ఆఁకలిగొన్నవారలయి; దుఃఖశయ్యాభిః=కష్టమయిన పాన్పులచేత; ఖేదితాః=శ్రమపడినవారలయి; త్వాం=నిన్ను; పృష్ఠతః=వెనుకను; కరిష్యంతి=చేయుఁగలరు.

వీరలు, నీతోఁగూడ నుండుటకారంభించినవెంటనె, కొడుకులను భార్యలను దలంచుకొని యెల్లప్పుడును దుఃఖించుచున్నవారలయి, సరియయినయాహారములేకయాఁకలిగొన్నవారలయి, మృదుశయనంబులందిరుందువారలు కావున నిచట కఠినంపు భూమిపయింబరుండుటం జాలక నానావిధంబుగాఁ గష్టపడినవారలయి, నిన్నువదలిపోఁగలరు.

అని, తాత్పర్యము.

స త్వం హీన స్సుహృద్భిశ్చ హితకామైశ్చ బంధుభిః
తృణాదపి భృశోద్విగ్న స్స్పందమానా ద్భవిష్యసి. ౧౮

టీక ‖ సః=అట్టి; త్వం=నీవు; సుహృద్భిశ్చ= స్నేహితులచేతను; హితకామైః=మేలుఁగోరునట్టి; బంధుభిశ్చ= చుట్టములచేతను; హీనః= విడువఁబడినవాఁడవై; స్పందమానాత్ = చలించుచున్న; తృణాదపి= గడ్డిపరకకన్నను; భృశోద్విగ్నః=మిక్కిలియు దిగులుపడినవాఁడవు; భవిష్యసి=కాఁగలవు.

అట్లునిన్నీవానరులు వదలిన పిమ్మట నీవు, మిత్రులను నీ హితముఁగోరు బంధువులనుంబాసి, మిక్కిలియుదిగులొందినవాఁడవై, గాలికిఁదూలు గడ్డిపరకకన్నను హీనుండవవుదువు.

అని, తాత్పర్యము.

నచ జాతు నహింస్యు స్త్వాం ఘోరా లక్ష్మణసాయకాః

అపవృత్తం జిఘాంసంతో మహావేగా దురాసదాః. ౧౯

టీక ॥ ఘోరాః= భయంకరములును; మహావేగాః = అధికమయినవేగముగలవియు; దురాసదాః=చెనకరానివియును; జిఘాంసంతః = వధింపఁగోరినవియునగు; లక్ష్మణసాయకాః= లక్ష్మణునిబాణములు; అపవృత్తం=మర్యాదదప్పిన; త్వాం=నిన్ను; జాతు= ఒకానొకప్పుడును; నచహింస్యురన్ = హింసింపకపోవు.

శత్రువుల వధించునవియు భయంకరములును మహావేగంబులును సమీపింప నలవిగానివియునగు లక్ష్మణుబాణంబులు, సీతాన్వేషణముసేయకుండుట మాత్రమెగాక రాజాజ్ఞనుగూడ నతిక్రమించిన నిన్నుఁ దప్పక వధించును. అని, తాత్పర్యము.

అస్మాభిస్తు గతం సార్ధం వినీతవ దుపస్థితమ్
ఆనుపూర్వ్యాత్తు సుగ్రీవో రాజ్యే త్వాం స్థాపయిష్యతి. ౨౦

టీక ॥ అస్మాభిస్సార్ధం = మాతోఁగూడ; గతం = పోయినవాఁడవును; వినీతవత్ = వినయముగలుగునట్లుగా; ఉపస్థితం=వచ్చినవాఁడవునగు; త్వాంతు = నిన్నుమాత్రము; సుగ్రీవః = సుగ్రీవుఁడు; ఆనుపూర్వ్యాత్తు = క్రమమువలనమాత్రము; రాజ్యే = దొరతనమునందు; స్థాపయిష్యతి = ఉంచఁగలఁడు.

నీవుమాతోఁగూడ వచ్చి వినీతుండవై యెప్పటి యట్లయున్న యేడమాత్రము, సుగ్రీవుండునీకుఁ దనపిమ్మటఁగ్రమముగా వానరరాజ్యంబునకుఁ బట్టంబుకట్టఁగలఁడు. అని, తాత్పర్యము.

ధర్మకామః పితృవ్యస్తే ప్రీతికామో దృఢవ్రతః
శుచి స్సత్యప్రతిజ్ఞశ్చ న త్వాం జాతు జిఘాంసతి. ౨౧

టీక ॥ ధర్మకామః = ధర్మముఁగోరువాఁడును; ప్రీతికామః=సంతోషముఁగోరువాఁడును; దృఢవ్రతః= చలనములేనివ్రతముగలవాఁడును; శుచిః = పరిశుద్ధుండును; సత్యప్రతిజ్ఞశ్చ = సత్యమయినప్రతిన గలవాఁడునగు; తే=నీయొక్క; పితృవ్యః=పినతండ్రి; జాతు= ఒకానొకప్పుడును; త్వాం=నిన్ను; నజి

ఘాంసతి = వధింపఁగోరఁడు.

నీపినతండ్రి సుగ్రీవుండు, ధార్మికుండు, పరులకుసంతోషంబుసేయువాఁడు, దృఢవ్రతుండు, పాపరహితుండు, ప్రజ్ఞదప్పనివాఁడు, నిన్నొకప్పుడును ఎంతమాత్రము వధింపనొల్లఁడు.

అని, తాత్పర్యము.

ప్రియకామశ్చ తే మాతు స్తదర్థం చాస్య జీవితమ్
తస్యా పత్యంచ నాస్త్యన్య త్తస్మా దంగద గమ్యతామ్. ౨౨

టీక॥ అంగద=అంగదుఁడా! సః(అధ్యాహృతము)=ఆసుగ్రీవుఁడు; తే=నీయొక్క; మాతుః=తల్లియొక్క; ప్రియకామః=సంతోషముఁగోరువాఁడు. అస్య=ఈతనియొక్క; జీవితం=బ్రతుకు; తదర్థం=ఆతారయొప్రయోజనముగాఁగలది. త్వం(అధ్యాహృతము)=నీవు; తస్య=ఆసుగ్రీవునియొక్క; అపత్యంచ=బిడ్డఁడవును. అన్యత్=వేఱు; న=కాదు. తస్మాత్ = అందువలన; గమ్యతాం=పొందఁబడుఁగాక.

అంగదుఁడా! ఇంతియగాక, సుగ్రీవుండు నీతల్లియందుమిక్కిలియుఁ గూర్చినవాఁడు; కావున నాబిడప్రియంబునే కోరుచుండును; అతని ప్రాణంబులును ఆబిడవశమే; నీవు, ఆమెకుమారుఁడవు; కావున నతనికిని గుమారుఁడవుగాని వేఱుగాదు. అని, హనుమంతుండు అంగదునితోఁ బలికెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, చతుఃపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ చతుఃపంచాశసర్గటీక,
ముగిసినది.

(శ్రీ)

పంచపంచాశసర్గప్రారంభః.

శ్రుత్వా హనుమతో వాక్యం ప్రశ్రితం ధర్మసంహితమ్
స్వామిసత్కారసంయుక్త మంగదో వాక్య మబ్రవీత్. ౧

టీక॥ అంగదః=అంగదుఁడు; ప్రశ్రితం=వినయముఁగలదియు; ధర్మసంహితం=ధర్మముతోఁ గూడినదియు; స్వామిసత్కారసంయుక్తం = ప్రభువునందలిభక్తితోఁ గూడినదియునగు; హనుమతః = హనుమంతునియొక్క ; వాక్యం=మాటను; శ్రుత్వా = విని; వాక్యం=మాటను; అబ్రవీత్ = పలికెను.

అంగదుండు, వినయ సంపన్నంబును, ధర్మయుక్తంబును రాజభక్తితోఁ గూడినదియునగు హనుమంతుని మాటనువిని, యిట్లని బదులు చెప్పెను. అని, తాత్పర్యము.

స్థైర్యం మాత్మ మనశ్శౌచ మానృశంస్య మథార్జవమ్
విక్రమశ్చైవ ధైర్యంచ సుగ్రీవే నోపపద్యతే. ౨

టీక॥ స్థైర్యం=నిలుకడయు; ఆత్మమనశ్శౌచం= ఆత్మయొక్కపారిశుద్ధ్యమును మనసుయొక్కశుద్ధియు; ఆనృశంస్యం=దయాళుత్వమును; అథ= ఇంక; ఆర్జవం = కపటములేమియు; విక్రమశ్చైవ=పరాక్రమంబును; ధైర్యంచ= గాంభీర్యమును; సుగ్రీవే=సుగ్రీవునియం దు; నోపపద్యతే=ఉపపన్నముగాదు.

స్థిరచిత్తతయు ఆత్మశుద్ధియుఁజిత్తశుద్ధియు దయాళుత్వమును కపటంబులేమియుఁ బరాక్రమంబును గాంభీర్యంబును సుగ్రీవునియం దెంతమాత్రమును లేవు. అని, తాత్పర్యము.

భ్రాతు ర్జ్యేష్ఠస్య యోభార్యాం జీవతో మహిషీం ప్రియామ్
ధర్మేణ మాతరం యస్తు స్వీకరోతి జుగుప్సితః. ౩
కథం స ధర్మం జానీతే యేన భ్రాత్రా మహాత్మనా
యుద్ధా యాభినియుక్తేన బిలస్య పిహితం ముఖమ్. ౪

టీక॥ యః=ఎవ్వఁడు; జీవతః=బ్రతికియున్నవాఁడగు; జ్యేష్ఠస్య = పెద్దవాఁడగు; భ్రాతుః=తోఁడబుట్టినవానియొక్క; ప్రియాం = ప్రియురాలును; భార్యాం=పెండ్లామును; మహిషీం=పట్టపురాణియు; ధర్మేణ=ధర్మముచేత; మాతరం=తల్లియునైనతారను;జుగుప్సితః=నిందితుఁడైన; యస్తు=ఎవ్వఁడైతే, రెండుమార్లుయచ్ఛబ్దము ప్రయోగించుటనిందార్థము; స్వీకరోతి=పరిగ్రహించునో; మహాత్మనా=పూజ్యమయినస్వభావముగల; భ్రాత్రా= అన్నచేత; యుద్ధాయ= పోరుకొఱకు; అభినిక్తేన=నియోగింపఁబడిన; యేన=ఎవనిచేత; బిలస్య = బిలముయొక్క; ముఖం=ద్వారము; పిహితం= మూయఁబడినదో; సః=అట్టిసుగ్రీవుఁడు;ధర్మం=ధర్మమును; కథం=ఎట్లు; జానీతే = ఎఱుంగును?

తన జ్యేష్ఠభ్రాత బ్రతికియున్నపుడతని ప్రియభార్యయుఁ బట్టపుమహిషియు ధర్మంబునఁ దనకుఁ దల్లివంటిదియు నగు తారను స్వీకరించినట్టి పాపిష్ఠుండును, మహాత్ముండగు తనయన్న యుద్ధంబునకై బిలంబుఁ జొచ్చునపుడు "నీవు ఈబిలంబు వాకిటనుండి శత్రువు దప్పించుకొని బిలంబు వెలువడునేని నిలువరింపు"మని తనకు నియోగించి బిలంబుఁజొచ్చినపిమ్మట, ద్రోహబుద్ధిచే నాగిలద్వారంబు పెనుఱాతిం గప్పినట్టి ద్రోహియునగు సుగ్రీవునకు, ధర్మంబెట్లు తెలియును?

అని, తాత్పర్యము.

విశేషార్థము.— "జ్యేష్ఠభ్రాత బ్రతికియున్నపుడతనిభార్యను స్వీకరించినవాఁ" డని సుగ్రీవునిందించుటవలన, జ్యేష్ఠభ్రాత మృతిఁబొందినపిమ్మట, నతని భార్యం బరిగ్రహించుట, వాలిసుగ్రీవులకుఁ ధర్మమని, తెలియుచున్నది.

సత్యాత్పాణిగృహీతశ్చ కృతకర్మా మహాయశాః
విస్మృతో రాఘవో యేన స కస్యతు కృతం స్మరేత్. ౫

టీక॥ సత్యాత్ = సత్యమువలన; పాణిగృహీతః=హస్తమునందుఁ బట్టఁబడినవాఁడును; కృతకర్మా=చేయఁబడిన కార్యము గలవాఁడును; మహాయశాః=అధికమయినకీర్తిగలవాఁడునగు; రాఘవశ్చ= రాముండును; యేన=ఎవ్వనిచేత; విస్మృతః= మఱవఁబడినాఁడో; సః=అట్టిసుగ్రీవుఁడు; కస్యతు=ఎవ్వనియొక్కమాత్రము; కృతం=చేసిన యుపకారమును; స్మరేత్=తలంచును?

సత్యంబు నవలంబించి మిత్రభావమునొందినవాఁడును మున్నుదనకు వాలినివధించి వానరరాజ్యంబొసంగి యుపకారంబు గావించినవాఁడును యశస్సంపన్నుండునగు రామునిఁగూడ ఈ సుగ్రీవుండు మఱచినాఁడే; ఇఁక సీతఁడెవనికిఁ గృతజ్ఞుండగును?

అని, తాత్పర్యము.

లక్ష్మణస్య భయా ద్యేన నాధర్మ భయభీరుణా
ఆదిష్టా మార్గితుం సీతాం ధర్మ మస్మిన్ కథం భవేత్. ౮

టీక॥ యేన = ఎవ్వనిచేత; లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క; భయాత్ = వెఱపువలన; వయం (అధ్యాహృతము) = మనము; సీతాం=సీతను;మార్గితుం = వెదకుటకు; ఆదిష్టాః=అజ్ఞాపింపఁ బడినామో; అధర్మభయభీరుణా = అధర్మభయమువలన భయపడినవానిచేత; న=కామో; తస్మిన్ (అధ్యాహృతము) = అట్టి; అస్మిన్=ఈ సుగ్రీవునియందు; ధర్మం = ధర్మము; కథం=ఎట్లు; భవేత్=ఉండును?

సుగ్రీవుండు లక్ష్మణువలని భయంబున,సీతనువెదుకమనలనియోగించినాఁడే గాని, యధర్మభయంబునం గాదుగదా! అట్టివీనియందు ధర్మమెక్కడిది?

అని, తాత్పర్యము.

తస్మిన్ పాపే కృతఘ్నే తు స్మృతిహీనే చలాత్మని
ఆర్యః కో విశ్వసే జ్జాతు తత్కులీనో జిజీవిషుః. ౯

టీక॥ పాపే=పాపముసేయువాఁడును; కృతఘ్నే=ఉపకారమును మఱచువాఁడును; స్మృతిహీనే= వివేకముచేవిడువఁబడినవాఁడును; చలాత్మని = చంచలమయిన మనస్సుగలవాఁడునగు; తస్మిన్తు = ఆసుగ్రీవునియందుమాత్రము; తత్కులీనః=అతనికులంబునందుఁబుట్టిన; జిజీవిషుః=బ్రతుకఁగోరిన; ఆర్యః=యోగ్యుఁడగువాఁడు; కః=ఎవఁడు; విశ్వసేత్=నమ్మును?

అట్టి పాపిష్ఠుండును దనకొఁరులుగావించినయుపకారమును మఱచువాఁడును వివేకహీనుండును జంచలచిత్తుండునగుసుగ్రీవునందు, అతని యింటఁబుట్టినవానికి బ్రతుకుమీఁది యాశగలయోగ్యునకు ఎవ్వనికి నమ్మకముగలుగును?

అని, తాత్పర్యము.

రాజ్యే పుత్త్రః ప్రతిష్ఠాప్య స్సగుణో నిర్గుణోపివా
కథం శత్రుకులీనం మాం సుగ్రీవో జీవయిష్యతి. ౮

టీక॥ సగుణః=గుణములతోఁ గూడినవాఁడైనను; నిర్గుణోపివా=గుణములేనివాఁడైనను; పుత్త్రః=కొడుకు; రాజ్యే = దొరతనమునందు; ప్రతిష్ఠాప్యః=ఉంచఁదగినవాఁడు. సుగ్రీవః=సుగ్రీవుఁడు; శత్రుకులీనం=శత్రువునియింటఁబుట్టిన; మాం=నన్ను; కథం=ఎట్లు; జీవయిష్యతి=బ్రతికించును?

సుగ్రీవుండు, గుణవంతుఁడైననుగుణహీనుఁడైననుదనకొడుకునకు రాజ్యంబు నంబట్టాభిషేకముగావించునుగాని, శత్రుపుత్త్రుండనగు నన్నెంతమాత్రము బ్రతుకనీయఁడు? అని, తాత్పర్యము.

భిన్నమంత్రో పరాద్ధశ్చ హీనశక్తిః కథం హ్యహమ్
కిష్కింధాం ప్రాప్య జీవేయ మనాథఇవ దుర్బలః. ౯

టీక ॥ భిన్నమంత్రః= భేదింపఁబడిన యాలోచన గలవాఁడను; అపరాద్ధశ్చ= అపరాధము గావించినవాఁడను; హీనశక్తిః = విడువఁబడిన శక్తులుగలవాఁడను, శక్తిహీనుండనగు; అహం= నేను; అనాథఇవ = నాథుఁడులేనివాఁనివలె; దుర్బలః = బలములేనివాఁడనై; కిష్కింధాం= కిష్కింధానగరమును; ప్రాప్య=పొంది; కథంహి=ఎట్లు; జీవేయం=బ్రతుకుదును?

నేను మొదలే యపరాధముగావించినవాఁడను, అందును సుగ్రీవునితో విరోధించి ఋష్యమూకంబున నుండవలెనని నేనుగావించిన మంత్రంబును వెల్లడియయి యుండఁగాఁ, బ్రభుమంత్రోత్సాహశక్తి వర్జితుండనై యనాథునివోలె బలహీనుండనై కిష్కింధకుంబోవుదునేని, నేనెట్లు జీవింపఁగలను? అని, తాత్పర్యము.

ఉపాంశుదండేన హి మాం బంధనేనో పపాదయేత్
శఠః క్రూరో నృశంసశ్చ సుగ్రీవో రాజ్యకారణాత్. ౧౦

టీక ॥ శఠః=వంచకుండును; క్రూరః= దయలేనివాఁడును; నృశంసశ్చ =

ఘాతుకుండునగు; సుగ్రీవః = సుగ్రీవుం డు; రాజ్యకారణాత్ = రాజ్యమునిమి త్తమయి; మాం = నన్ను; ఉపాంశు దండేన = రహస్యశిక్షయాయిన; బంధ నేన = ఉరితో; ఉపపాదయేత్ = పొందిం దును.

వంచకుండును నిర్దయుండును ఘాతుకుండునగు సుగ్రీవుండు, రాజ్యంబు కొఱకు, నన్ను రహస్యముగా నురిఁ యించిచంపించును. అని, తాత్పర్యము.

బంధనాద్వావసాదాన్మే శ్రేయః ప్రాయోపవేశనమ్
అనుజానీత మాం సర్వే గృహం గచ్ఛంతు వానరాః. ౧౧

టీక॥ మే = నాకు; బంధనాత్ = ఉరి యను; అవసాదాత్ = నాశహేతువుక న్నను; ప్రాయోపవేశనం = మరణము కొఱకుఁబస్తుండుట; శ్రేయః = మంచిది. వా = ప్రసిద్ధము. యూయం (అధ్యా హృతము) = మీరలు; సర్వే = అందఱు ను; అనుజానీత = అనుమతింపుఁడు. వా నరాః = వానరులు; గృహం = ఇంటిని; గచ్ఛంతు = పొందుదురుగాక.

ఉరివేయఁబడి చచ్చుటకన్నను ప్రాయోపవేశంబున ప్రాణంబులు విడుచుటమేలుగాదే? కావున, నాకనుజ్ఞ యొసంగి, మీరలందఱు గృహంబునకుఁబొండు. అని, తాత్పర్యము.

అహం వః ప్రతిజానామి నాగమిష్యామ్యహం పురీమ్
ఇహైవ ప్రాయ మాసిష్యే శ్రేయో మరణమేవ మే. ౧౨

టీక॥ అహం = నేను; వః = మీకు; ప్ర తిజానామి = ప్రతిజ్ఞ చేయుచున్నాను. అహం = నేను; పురీం = కిష్కింధాపట్ట ణమును; నాగమిష్యామి = పొందను. ఇ హైవ = ఇచటనే; ప్రాయం = అనశన వ్రతమును; ఆసిష్యే = అవలంబించెద ను. మే = నాకు; మరణమేవ = చావే; శ్రే యః = మేలు.

దృఢముగాఁజెప్పెదవినుండు, నేను కిష్కింధాపురికిరాను; ఇచటనే ప్రాయోపవేశనంబుండెదను; నాకుఁగిష్కింధకువచ్చుటకన్న నిచ్చట మరణమునొందుటయె మేలు. అని, తాత్పర్యము.

అభివాదన పూర్వంతు రాఘవౌ బలశాలినౌ

టీక ॥ బలశాలినా = బలముచేఁ ప్రకాశించునట్టి; రాఘవౌతు= రామలక్ష్మణులును; అభివాదనపూర్వకం = నమస్కరించుట ముందుగాఁగల్గునట్లుగా; కుశలం (అధ్యాహృతము)= క్షేమమును; వాచ్యౌ (అధ్యాహృతము)= చెప్పఁదగినవారలు.

బలవంతులగు రామలక్ష్మణులంజూచి నాకుమాఱుగా నమస్కరించి క్షేమంబునడుగవలెను. అని, తాత్పర్యము.

అభివాదనపూర్వంతు రాజా కుశల మేవచ. ౧౩
వాచ్య స్తాతో యవీయా న్మే సుగ్రీవో వానరేశ్వరః

టీక ॥ వానరేశ్వరః= వానరులకుఁ ప్రభువైన; మే = నాయొక్క; యవీయాన్ = చిన్నవాఁడైన; తాతః=తండ్రియగు; రాజా = రాజయిన; సుగ్రీవః = సుగ్రీవుఁడు; అభివాదనపూర్వంతు= నమస్కరించుటముందుగాఁగల్గునట్లుగానే; కుశలమేవచ = క్షేమమునే; వాచ్యః = చెప్పఁదగినవాఁడు.

వానరేంద్రుఁడగు నాపినతండ్రి సుగ్రీవునింజూచియు, మీరు నామాఱుగా నమస్కరించి, క్షేమము నెఱుఁగుఁడు. అని, తాత్పర్యము.

ఆరోగ్యపూర్వం కుశలం వాచ్యా మాతా రుమాచ మే. ౧౪

టీక॥ మే=నాయొక్క; మాతా= తల్లియగు; రుమాచ=రుమయు; ఆరోగ్యపూర్వం = ఆరోగ్యముముందుగాఁగల; కుశలం= క్షేమమును; వాచ్యా=పలుకఁదగినది.

నాపినతల్లియగురుమంజూచి, ఆమె ఆరోగ్యమును క్షేమంబును అడుగవలెను. అని, తాత్పర్యము.

మాతరం చైవ మే తారా మాశ్వాసయితు మర్హథ

టీక॥యూయం(అధ్యాహృతము)= మీరలు; మే=నాయొక్క;మాతరం=తల్లియగు; తారాంచైవ=తారనుగూడ; ఆశ్వాసయితుం=ఊఱడించుటకు;అర్హథ=తగుదురు.

నాతల్లి తారనును యుక్తవచనంబుల నాశ్వాసనంబుగావింపుఁడు. అని, తాత్పర్యము.

ప్రకృత్యా ప్రియపుత్రా సా సానుక్రోశా తపస్వినీ. ౧౫

వినష్ట మిహ మాం శ్రుత్వా వ్యక్తం హాస్యతి జీవితమ్

టీక ॥ తపస్వినీ= శోచనీయయగు; సా=ఆతార; ప్రకృత్యా=స్వభావము చేత; ప్రియపుత్రా=ఇష్టుఁడయిన కొడుకుగలది; సానుక్రోశా = కనికరము తోఁగూడినది. ఇహ=ఇచట; వినష్టం= నశించిన; మాం=నన్ను; శ్రుత్వా= విని; జీవితం=ప్రాణమును; హాస్యతి = విడువఁగలదు. వ్యక్తం=స్పష్టము.

నాతల్లి తారం దలంచుకొన్న మిక్కిలియు దుఃఖమగుచున్నది; అబిడస్వభావంబుననె నామీఁద నధిక ప్రీతియుఁ గనికరమునుగలది; నేనిచట మృతిఁబొందుటనువిని ప్రాణంబులే విడువఁగలదు; సందియములేదు. అనియంగదుండు హనుమంతుండు మున్నగు వానరులతోఁ బలికెను. అని, తాత్పర్యము.

ఏతావ దుక్త్వా వచనం వృద్ధాం స్తా నభివాద్యచ. ౧౬
వివేశ చాంగదో భూమౌ రుదన్ దర్భేషు దుర్మనాః

టీక॥ అంగదః=అంగదుఁడు; ఏతావత్ =ఇంతమాత్రము; వచనం=మాటను; ఉక్త్వా= చెప్పి; తాన్ = ఆ; వృద్ధాన్= ముసలివానరులను; అభివాద్య చ=నమస్కరించియు; దుర్మనాః=దుఃఖమునొందినమనస్సుగలవాఁడై;రుదన్= ఏడ్చుచు; భూమౌ=నేలయందు;దర్భేషు=దర్భలయందు; వివేశచ = పరుండెను.

అంగదుం , డట్లింతవఱకుం బలికి, యా వృద్ధవానరులకు నమస్కారంబు గావించి, దుఃఖితుండై, రోదనంబు సేయుచు, భూమిపై దర్భలుపఱచుకొని పరుండెను. అని, తాత్పర్యము.

తస్య సంవిశత స్తత్ర రుదంతో వానరర్షభాః. ౧౭
నయనేభ్యః ప్రముముచు రుష్ణం వై వారి దుఃఖితాః

టీక ॥ తస్య=ఆయంగదుఁడు; సంవిశతః= పరుండఁగా; తత్ర = అచట; వానరర్షభాః=వానర శ్రేష్ఠులు;దుఃఖితాః=దుఃఖమునొందినవారలయి; రుదంతః=ఏడ్చుచు; నయనేభ్యః= కన్నులనుండి; ఉష్ణం=వేఁడియయిన ("వై" అనునది పాదపూరణార్థము); వారి = జలమును; ప్రముముచుః=విడిచిరి.

ఆయంగదుండు ప్రాయోపవేశము నవలంబించి దర్భలపైఁబరుండుటఁజూచి, యచటి వానరోత్తములందఱు, పరమదుఃఖితులయి, కన్నులనుండియశ్రుధారలుస్రవింప, రోదనంబుగావించిరి.
అని, తాత్పర్యము.

సుగ్రీవం చైవ నిందంతః ప్రశంసంతశ్చ వాలినమ్. ౧౯
పరివార్యాంగదం సర్వే వ్యవసన్ప్రాయ మాసితుమ్

టీక॥ సర్వే = అందఱును; సుగ్రీవం = సుగ్రీవుని; నిందంతశ్చైవ=నిందించుచును; వాలినం = వాలిని; ప్రశంసంతశ్చ = పొగడుచును; అంగదం= అంగదుని, పరివార్య=చుట్టి; ప్రాయం= మరణముకొఱకైన యుపవాసమును; ఆసితుం = అవలంబించుటకు; వ్యవసన్ = నిశ్చయించిరి.

ఆవానరవీరులు, సుగ్రీవునిదూషించుచు వాలిఁబ్రశంసించుచు,నంగదుంబరివేష్టించి యందఱును బ్రాయోపవేశంబు సేయ నిశ్చయించిరి.
అని, తాత్పర్యము.

మతం తద్వాలిపుత్రస్య విజ్ఞాయ ప్లవగర్షభాః. ౧౯
ఉపస్పృశ్యోదకం తత్ర ప్రాఙ్ముఖాస్సముపావిశన్
దక్షిణాగ్రేషు దర్భేషు ఉదక్తీరం సమాశ్రితాః. ౨౦
"ఉత్తరీయం సమాహితాః" ఇతి పాఠాంతరమ్.
ముమూర్షవో హరిశ్రేష్ఠా ఏతత్ క్షమమితి స్మహ

టీక॥ ప్లవగర్షభాః = వానరోత్తములు; వాలిపుత్రస్య = వాలికుమారుఁడగు నంగదునియొక్క; తత్ =ఆ; మతం = అభిప్రాయమును;విజ్ఞాయ= తెలిసి; ముమూర్షవః=చావఁగోరినవారలయి; హరిశ్రేష్ఠాః= వానరోత్తములు; ఏతత్=ఇది; క్షమం=యుక్తము; ఇతి=అని("స్మహ" అనునదిపాదపూరణార్థము); మత్వా(అధ్యాహృతము)= తలఁచి; తత్ర = అచట; ఉదకం=జలమును; ఉపస్పృశ్య= తాఁకి, స్నానము చేసియనుట; ఉదక్తీరం=ఉత్తరపుగట్టును; సమాశ్రితాః= ఆశ్రయించినవారలయి; పాఠాంతరపక్షమునందు; ఉత్తరీయం = పైవస్త్రమును; సమాహితాః = కట్టుకొన్నవారలయి;దక్షిణా

గ్రేషు=దక్షిణదిక్కునందుఁగొనలుగల; దర్భేషు=దర్భలయందు; ప్రాఙ్ముఖాః= తూర్పుదిక్కునందు ముఖముగలవారలై; సముపావిశన్=పరుండెరి.

వానరోత్తములు, అంగదునిమతంబునెఱింగి, ఇట్లుమరణమునొందుటయె యుక్తమనియెంచి, తాము ప్రాయోపవేశంబునం బ్రాణంబులువిడువనుద్యుక్తులయి, యచటస్నానంబు గావించి, సముద్రోత్తర తీరంబున (ఉత్తరీయంబు మొలకుఁజుట్టుకొని) దక్షిణాగ్రంబుగా దర్భలుపఱచికొని, తూర్పుమొగముగాఁబరుండిరి. అని, తాత్పర్యము.

రామస్య వనవాసంచ క్షయం దశరథస్యచ. ౨౧
జనస్థాన వధంచైవ వధంచైవ జటాయుషః
హరణంచైవ వైదేహ్యా వాలినశ్చ వధం రణే. ౨౨
రామకోపంచ వదతాం హరీణాం భయ మాగతమ్

టీక॥ రామస్య= రామునియొక్క; వనవాసంచ= అడవినుండుటను; దశరథస్య= దశరథునియొక్క; క్షయంచ= మరణమును; జనస్థానవధంచైవ= జనస్థానమునందలి రాక్షసులవధించుటను; జటాయుషః = జటాయువుయొక్క; వధంచైవ=వధించుటను; వైదేహ్యాః=సీతయొక్క; హరణంచైవ = అపహరించుటను; రణే=యుద్ధమునందు ; వాలినః=వాలియొక్క; వధంచ=వధించుటను; రామకోపంచ=రామునియొక్క కోపమును; వదతాం=చెప్పుచున్న ; హరీణాం=వానరులకు; భయం=భయకారణము; ఆగతం=వచ్చినది.

రాముండువనంబునకు వచ్చుటయు దశరథుండు మృతిఁబొందుటయు, జనస్థానంబున రాముండు ఖరదూషణాదులవధించుటయు, రావణుఁడు సీతాదేవినపహరించుటయు, జటాయువు రావణునిచేఁ జచ్చుటయు, యుద్ధమున రామునిచే వాలి హతుండగుటయు, సుగ్రీవుండు చెప్పిన చొప్పున శరత్కాలంబునసీతాన్వేషణంబు సేయఁబ్రియత్నింపమికి రాముండు కోపించుటయు, నంత సీతాన్వేషణార్థమయి సుగ్రీవుండువానరులంబంపుటయు, నాదిగాఁ గడచిన దంతయు నవ్వానరులు వాకొనుచుండఁగా, సంపాతియనుమహాగృధ్రము వార

లభక్షింప వచ్చుటంజేసి, వారలకుమహాభయంబుగలిగినది. అని, తాత్పర్యము.

స సంవిశద్భి ర్బహుభి ర్మహీధరో
మహాద్రికూటప్రతిమైః ప్లవంగమైః. ౨౩
బభూవ సన్నాదితనిర్ధరాంతరో
భృశం నదద్భి ర్జలదై రివోల్బణైః

టీక ॥ సః=ఆ; మహీధరః=పర్వతము; సంవిశద్భిః= పరుండుచున్నవారును; నదద్భిః=అఱచుచున్నవారలునగు; మహాద్రికూటప్రతిమైః= గొప్పపర్వతశిఖరములతోఁ బోలికగల; బహుభిః = పెక్కండ్రగు; ప్లవంగమైః= వానరులచేత; ఉల్బణైః=అతిశయించిన్న, గర్జించుచున్నయనుట; జలదైరివ= మేఘములచేతవలె; భృశం=మిక్కిలియు; సన్నాదితనిర్ధరాంతరః= ధ్వనింపఁజేయఁబడినగుహలయొక్క-లోపలిప్రదేశములుగలది; బభూవ=అయ్యెను.

అట్లు, గొప్పపర్వతశిఖరంబు లంతటి మేనులతో నమ్మేటివానరులు, అఱచుచుఁ బరుండుటయు, మేఘగర్జనములచేతంబోలె, నమ్మహాపర్వతముగుహాంతరంబులం దంతటను గొప్పప్రతిధ్వనిగలిగెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, పంచపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ పంచపంచాశసర్గటీక, ముగిసినది.

(౫౬)

షట్పంచాశ సర్గ ప్రారంభః.

ఉపవిష్టా స్తు తే సర్వే యస్మిన్ ప్రాయం గిరిస్థలే
హరయో గృధ్రరాజశ్చ తం దేశ ముపచక్రమే. ౧

టీక॥ తే=ఆ; హరయః = వానరులు; సర్వే=అందఱును; యస్మిన్ = ఏ; గిరిస్థలేతు = పర్వతప్రదేశమునందే; ప్రాయం=మరణార్థవ్రతమునుగూర్చి; ఉపవిష్టాః = పరుండిరో; తం=ఆ; దేశం=ప్రదేశమును; గృధ్రరాజశ్చ=గద్దలతేఁడయిన సంపాతియు; ఉపచక్రమే=పొందుటకు ఆరంభించెను.

అవ్వానరవీరులు, పర్వతభాగంబున నెవటఁ బ్రాయోపవేశంబునకయి నిం చిరో, అచటికి, సమీపంబుగా, గృధ్రరాజు సంపాతియు వచ్చెను.

అని, తాత్పర్యము.

సంపాతిర్నామ నామ్నా తు చిరంజీవీ విహంగమః
భ్రాతా జటాయుష శ్శ్రీమాన్ ప్రఖ్యాతబలపౌరుషః. ౨
కందరా దభినిష్క్రమ్య స వింధ్యస్య మహాగిరేః
ఉపవిష్టాన్ హరీన్ దృష్ట్వా హృష్టాత్మా గిర మబ్రవీత్. ౩

టీక॥ జటాయుషః = జటాయువు యొక్క; భ్రాతా = అన్నయును; శ్రీమాన్ = అధికమయినసంపదగలవాఁడును; ప్రఖ్యాతబలపౌరుషః = ప్రసిద్ధమయిన బలమును బరాక్రమమును గలవాఁడును; చిరంజీవీ = బహుకాలము గా బ్రతికియున్నవాఁడును; నామ్నా= పేరుచేత; సంపాతిర్నామ=సంపాతియనిప్రసిద్ధుఁడునగు; సః= ఆ; విహంగమః=పక్షి; మహాగిరేః= గొప్పపర్వతమయిన; వింధ్యస్య=వింధ్యపర్వతము యొక్క; కందరాత్=గుహనుండి; అభినిష్క్రమ్య=వెడలి; ఉపవిష్టాన్=పరుండిన; హరీన్=వానరులను; దృష్ట్వా = చూచి; హృష్టాత్మా=సంతోషించినమనస్సుగలవాఁడై; గిరం=మాటను; అబ్రవీత్=పలికెను.

జటాయువునకు అగ్రజుండును మహాబల పరాక్రమశాలియు శ్రీమంతుండును జిరంజీవియునగు సంపాతియు

గృధ్రరాజు, వింధ్యపర్వతముగుహనుండి వెడలి, యచటఁబ్రాయోపవిష్టులయి యున్న వానరవీరులం జూచి, సంతుష్టుఁడై యిట్లు పలికెను.

అని, తాత్పర్యము.

విధిః కిల నరం లోకే విధానే నానువర్తతే
యథా యం విహితో భక్ష్య శ్చిరా న్మహ్య ముపాగతః. ౪

టీక ॥ యథా = ఏకారణమువలన; చిరాత్ = బహుకాలమునకు; మహ్యం = నాకొఱకు; విహితః = ఏర్పఱుపఁబడిన; అయం = ఈ; భక్ష్యః = ఆనుబంధము; ఉపాగతః = వచ్చినదో; తస్మాత్ (అధ్యాహృతము) = ఆకారణమువలన; విధిః = దైవము; లోకే = ప్రపంచమునందు; నరం = మనుష్యుని; విధానేన = యోగక్షేమములుగూర్చుటచేత; అనువర్తతేకిల = అవశ్యము వెంబడించును.

దైవముమనుష్యునకీలోకంబునవానివాని కర్మానుసారంబునం దప్పక యోగక్షేమములు గలిగించును; బహుకాలమునకిప్పుడు, నాకుఁగా నీవానరరూపమయిన ఆనుబంధమును ఏర్పఱచి నాయొద్దకుఁ బంపినదిగదా!

అని, తాత్పర్యము.

పరం పరాణాం భక్షిష్యే వానరాణాం మృతం మృతమ్
ఉవాచే దం వచః పక్షీ తా న్నిరీక్ష్య ప్లవంగమాన్. ౫

టీక ॥ పరాణాం = శ్రేష్ఠులగు; వానరాణాం = వానరులలోపల; మృతం మృతం = చచ్చినచచ్చిన; పరం = ఉత్తమవానరుని; భక్షిష్యే = తినెదను. పక్షీ = సంపాతి; తాన్ = ఆ; ప్లవంగమాన్ = వానరులను; నిరీక్ష్య = చూచి; ఇదం = ఈ; వచః = మాటను; ఉవాచ = పలికెను.

ఉత్తములగునీవానరులలో నొక్కొక్కనిఁగాఁబట్టి వధించిభక్షించెదను. అని, సంపాతి యవ్వానరులంజూచి, పలికెను.. అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా భక్ష్యలుబ్ధస్య పక్షిణః
అంగదః పరమాయస్తో హనుమంత మథా బ్రవీత్. ౬

టీక॥ అంగదః=అంగదుఁడు; భక్ష్యలుబ్ధస్య= ఆహారముకొఱకు ఆశించిన; తస్య=ఆ; పక్షిణః=సంపాతియొక్క; తత్=ఆ; వచనం=మాటను; శ్రుత్వా=విని; పరమాయస్తః= మిక్కిలియుదిగులుపడినవాఁడై; అథ = అంత; హనుమంతం = హనుమంతునిగూర్చి; అబ్రవీత్=పలికెను.

అట్లు సంపాతి,యాహారార్థమయి యాశపడి పలికిన పలుకుల నాలకించి, యంగదుండు , మిక్కిలియు దిగులొంది, హనుమంతుంజూచి, యిట్లనియెను.

అని, తాత్పర్యము.

పశ్య గృధ్రాపదేశేన సాక్షా ద్వైవస్వతో యమః
ఇమం దేశ మనుప్రాప్తో వానరాణాం విపత్తయే. ౭

టీక॥ వానరాణాం= వానరులయొక్క; విపత్తయే = వినాశముకొఱకు; వైవస్వతః= సూర్యునికొడుకైన; సాక్షాత్ యమః=సాక్షాత్ యముఁడు; గృధ్రాపదేశేన = గద్దయొక్కవ్యాజముచేత; ఇమం=ఈ; దేశం= ప్రదేశమును; అనుప్రాప్తః= పొందినవాఁడు. పశ్య=చూడుము.

వానరుల మనల నందఱను సంహరించుటకై సూర్యుని పుత్త్రుండగు సాక్షాద్యముఁడు ఈగృధ్రవేషమున నిచటికివచ్చినాఁడు చూడుము.

అని, తాత్పర్యము.

రామస్య న కృతం కార్యం రాజ్ఞో న చ వచః కృతమ్
హరీణా మియ మజ్ఞాతా విపత్తి స్సహసా గతా. ౮

టీక ॥ రామస్య = రామునియొక్క; కార్యం=పని; నకృతం= చేయఁబడినదికాలేదు. రాజ్ఞః = రాజయిన సుగ్రీవునియొక్క; వచశ్చ= మాటయు; నకృతం = చేయఁబడినదికాలేదు. అజ్ఞాతా= తెలియఁబడని; ఇయం=ఈ; విపత్తిః = వినాశము; హరీణాం = వానరులకు; సహసా=శీఘ్రమున; ఆగతా=వచ్చినది.

రామునికార్యమునుం గావింపమైతిమి; సుగ్రీవునాజ్ఞయు నెఱవేర్పమైతిమి; ఇంతలో, ఈవానరుల కందఱకు, ఇది వఱకెప్పుడునుందలంపని యీవినాశము తటాలున సంభవించినది. అని, తా.

వైదేహ్యాః ప్రియకామేన కృతం కర్మ జటాయుషా
గృధ్రరాజేన య త్తత్ర శ్రుతం వ స్తదశేషతః. ౯

టీక॥ తత్ర= ఆజనస్థానమునందు; వైదేహ్యాః= సీతయొక్క; ప్రియకామేన=సంతోషమునుగోరునట్టి; గృధ్రరాజేన=గద్దలరాజయిన; జటాయుషా= జటాయువుచేత; యత్ =ఏ; కర్మ =కార్యము; కృతం=చేయఁబడినదో; తత్= అది; అశేషతః=నిశ్శేషముగా; వః=మీకు,మీచేతననుట; శ్రుతం=వినఁబడినది.

గృధ్రరాజగు జటాయువు సీతాదేవిప్రియార్థమయి, జనస్థానంబునఁ గావించిన కార్యమంతయు మీరలు వినియున్నారలుగదా! అని, తాత్పర్యము.

తథా సర్వాణి భూతాని తిర్యగ్యోనిగతాన్యపి
ప్రియం కుర్వంతి రామస్య త్యక్త్వా ప్రాణా న్యథా వయమ్. ౧౦

టీక॥ తథా=అట్లు; తిర్యగ్యోనిగతాన్యపి= తిర్యగ్జంతువులయొక్క యోనులనుబొందినవైనను; సర్వాణి=సమస్తములయిన; భూతాని= ప్రాణులును; వయంయథా=మనమువలె; ప్రాణాన్ =ప్రాణములను; త్యక్త్వా= విడిచి; రామస్య=రామునకు; ప్రియం = సంతోషమును; కుర్వంతి = చేయుచున్నవి.

అవ్విధంబున సమస్త భూతంబులును తిర్యగ్జంతువులుసయితము, మనయట్లు, రామునికి సంతోషంబు గలిగించుటకై, ప్రాణంబులనేని పరిత్యజించుచున్నవి. అని, తాత్పర్యము.

అన్యోన్య ముపకుర్వంతి స్నేహకారుణ్యయంత్రితాః

టీక॥ సర్వే(అధ్యాహృతము)= సమస్తప్రాణులును; స్నేహకారుణ్యయంత్రితాః=చెలిమిచేతను దయచేతను బద్ధులు; అన్యోన్యం=ఒకరొకరును; ఉపకుర్వంతి = ఉపకారము సేయుచున్నారు.

సమస్తప్రాణులు, స్నేహంబును గారుణ్యంబు నవలంబించి యొక్కరును రామున కుపకారము సేయుచున్నారు. అని, తాత్పర్యము.

తేన తస్యోపకారార్థం త్యజతా త్మాన మాత్మనా. ౧౧

స ౫౬

ప్రియం కృతంహి రామస్య ధర్మజ్ఞేన జటాయుషా

టీక॥ తస్య= ఆరామునియొక్క; ఉపకారార్థం = మేలుకొఱకు; ఆత్మనా = ధైర్యముచేత; ఆత్మానం=దేహమును; త్యజతా = విడుచుచున్న; తేన=ఆ; ధర్మజ్ఞేన = ధర్మముఁదెలిసిన; జటాయుషా = జటాయువుచేత; రామస్య = రామునకు; ప్రియం=సంతోషము; కృతంహి = చేయఁబడినది గదా!

ధర్మజ్ఞుండగు నాజటాయువు, రామునకుపకారము సేయుటకై ధైర్యంబున దేహంబువిడిచెనుగావున, నతండు రామునకుఁ బ్రియంబుచేసినవాఁడయ్యెను. అని, తాత్పర్యము.

రాఘవార్థే పరిశ్రాంతా వయం సంత్యక్తజీవితాః. ౧౨
కాంతారాణి ప్రపన్నాస్మ నచ పశ్యామ మైథిలీమ్

టీక॥ వయం=మనము; రాఘవార్థే=రామునికార్యమునిమిత్తమయి; కాంతారాణి = అడవులను; ప్రపన్నాః=పొందినవారలమయి; పరిశ్రాంతాః = అలసినవారమయి; సంత్యక్తజీవితాః = విడువఁబడిన ప్రాణముగలవారము; స్మ (స్మః) = అగుచున్నాము. మైథిలీం=సీతను; నచపశ్యామ (పశ్యామః)=చూడకున్నాము.

మనమును, రామకార్యము నిమిత్తమయి యడవులకువచ్చి పరిశ్రాంతులమయి ప్రాణంబులు విడువఁ బోవుచున్నాము; సీతనేమో చూచినవారము కాము. అని, తాత్పర్యము.

స సుఖీ గృధ్రరాజస్తు రావణేన హతో రణే. ౧౩
ముక్తశ్చ సుగ్రీవభయా ద్గతశ్చ పరమాం గతిమ్

టీక॥ రణే=యుద్ధమునందు; రావణేన=రావణునిచేత; హతః = వధింపఁబడిన; సః=ఆ; గృధ్రరాజస్తు=గద్దలరాజయినజటాయువుమాత్రము; సుగ్రీవభయాత్=సుగ్రీవువలని భయమునుండి; ముక్తశ్చ= విడువఁబడినవాఁడునై; పరమాం = ఉత్కృష్టమయిన; గతిం= స్థానమును; గతశ్చ = పొందినవాఁడునై; సుఖీ=సుఖముగలవాఁడు.

రామకార్యనిమిత్తంబయి రావణునితో యుద్ధంబుగావించి నిహతుఁడైన యాగృధ్రరాజు జటాయువుమాత్రము,

మనవలె సుగ్రీవభయంబునంజిక్కువడక, పరమగతింబొందినవాఁడై,సుఖంబు నొందెను. అని, తాత్పర్యము.

జటాయుషో వినాశేన రాజ్ఞో దశరథస్యచ. ౧౪
హరణేనచ వైదేహ్యా స్సంశయం హరయో గతాః

టీక॥ జటాయుషః=జటాయువుయొక్కయు; రాజ్ఞః=రాజయిన; దశరథస్యచ = దశరథునియొక్కయు;వినాశేన=నశించుటచేతను; వైదేహ్యాః= సీతయొక్క; హరణేనచ= అపహరించుటచేతను; హరయః = వానరులు;సంశయం=సందేహమును, ప్రాణసందేహమును; గతాః=పొందినారు.

జటాయువు హతుండగుటవలనను దశరథమహారాజు మరణంబునొందుటవలనను, రావణుండు సీతాదేవినపహరించుటవలనను, వానరులకిప్పుడు ప్రాణసంశయంబుగలిగినది; జటాయువుబ్రతికియున్నచో, నతనివలననె రావణుని వృత్తాంతము దెలియును; దశరథమహారాజుబ్రతికియున్నచో,గొంతకాలము నకైనను దనయొద్దకుఁ దోడుకొనిపోవునుగావున,నింతటికష్టంబు రాదు; సీతాదేవిని రావణుఁ డపహరింపకున్నచో, వెదకవలసిన దేలేదు. అని, తాత్పర్యము.

రామలక్ష్మణయో ర్వాస అరణ్యే సహ సీతయా. ౧౫
రాఘవస్య చ బాణేన వాలిన శ్చ తథా వధః
రామకోపా దశేషాణాం రాక్షసానాం తథా వధః. ౧౬
కైకేయ్యా వరదానేన ఇదం హి వికృతం కృతమ్

టీక॥ అరణ్యే=అడవియందు ; సీతయాసహ= సీతతోఁగూడ; రామలక్ష్మణయోః= రామలక్ష్మణులయొక్క; వాసః=ఉండుటయు; తథా=అట్లు; రాఘవస్య=రామునియొక్క; బాణేన = అమ్ముచేత; వాలినః = వాలియొక్క; వధశ్చ=వధించుటయు; తథా=అట్లు; రామకోపాత్ = రామునికోపమువలన; అశేషాణాం = మిగతలేని; రాక్షసానాం=రక్కసులయొక్క; వధః=వధించుటయు; ఇదం=ఈ; వికృతం= వికారము; కైకేయ్యాః= కైకేయికి; వరదానేన = వరమునొసంగుటచేత;కృతంహి = చేయఁబడినదిగదా!

స ౫౬

రామలక్ష్మణులు సీతా సమేతంబుగా వనవాసముసేయుటయు రామునిబాణంబున వాలిహతుఁడగుటయు రామునిచే జనస్థానంబున సమస్తరాక్షసులును హతులగుటయు, ఈకష్టమంతయు, దశరథుండు కైకేయికి వరములొసంగుటచే సంభవించినది. అని యంగదుండు చెప్పెను. అని, తాత్పర్యము.

తే దసుఖ మనుకీర్తితం వచో
భువి పతితాంశ్చ సమీక్ష్య వానరాన్. ౧౭
భృశచలితమతి ర్మహామతిః
కృపణ ముదాహృతవాన్ స గృధ్రరాట్

టీక ॥ మహామతిః = గొప్పబుద్ధిగల; సః=ఆ; గృధ్రరాట్ = గద్దలరాజైనసంపాతి; అనుకీర్తితం = చెప్పఁబడిన; అసుఖం = దుఃఖమునుగలిగించునట్టి; తత్=ఆ; వచః=మాటను; శ్రుత్వా (అధ్యాహృతము) = విని;భువి= నేలయందు;పతితాన్ = పడిన;వానరాన్ = వానరులను; సమీక్ష్యచ=చూచియు; భృశచలితమతిః=మిక్కిలియుఁగదలిన బుద్ధిగలవాఁడై; కృపణం=దుఃఖముతోఁగూడినమాటను; ఉదాహృతవాన్ = చెప్పెను.

మహాధీరుండగు నాగృధ్రరాజు సంపాతి, యంగదుండు వలికిన దుఃఖకరంబులగు పలుకులువిని, వానరులందఱు భూమిం బడియుండుటయుంజూచి, మనంబుగలంగ దుఃఖితుండై, యిట్లనిపలికెను. అని; తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, షట్పంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ షట్పంచాశసర్గటీక,
ముగిసినది.

శ్రీ

సప్తపంచాశసర్గప్రారంభః.

తత శ్శ్రుత్వా తదా వాక్య మంగదస్య ముఖోద్గతమ్
అబ్రవీ ద్వచనం గృధ్ర స్తీక్ష్ణతుండో మహాస్వనః. ౧

టీక ॥ తతః=అంత; తీక్ష్ణతుండః=కఱకైనముక్కు గలవాఁడును; మహాస్వనః = గొప్పధ్వనిగలవాఁడునగు; గృధ్రః = సంపాతి; తదా=అప్పుడు; అంగదస్య = అంగదునియొక్క; ముఖోద్గతం=నోటనుండి వెలువడిన; వాక్యం=మాటను; శ్రుత్వా=విని; వచనం= మాటను; అబ్రవీత్ = పలికెను.

అంతఁ, దీక్ష్ణమయిన ముక్కుగల యాసంపాతి, యప్పుడంగదుండు పలికిన పలుకులువిని, పేరెలుంగున నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

కోఽయం గిరా ఘోషయతి ప్రాణైః ప్రియతమస్య మే
జటాయుషో వధం భ్రాతుః కంపయన్నివ మే మనః. ౨

టీక॥ అయం=ఇతఁడు; కః=ఎవ్వఁడు; మే=నాకు; ప్రాణైః=(పంచమ్యర్థమందుఁదృతీయ) ప్రాణములకన్నను; ప్రియతమస్య = అధికముగానిష్టుండగు; భ్రాతుః=తమ్ముఁడైన; జటాయుషః= జటాయువుయొక్క; వధం = చంపుటను; మే=నాయొక్క; మనః=మనస్సును; కంపయన్నివ= వడఁకించువాఁడువలె; గిరా=వాక్కుచేత; ఘోషయతి= ధ్వనింపఁజేయుచున్నాఁడు.

నాకుఁ బ్రాణంబులకన్నను బ్రియతముండగు నాతమ్ముఁడు జటాయువు హతుఁడయ్యెనని నామనస్సునకుఁ గంపన ముగలుగునట్లు ఘంటాఘోషముగా నెవ్వఁడో చెప్పుచున్నాఁడు; ఇతం డెవ్వఁడు? అని, తాత్పర్యము.

కథ మాసీ జ్జనస్థానే యుద్ధం రాక్షస గృధ్రయోః
నామధేయ మిదం భ్రాతు శ్చిరస్యా ద్య మయా శ్రుతమ్. ౩

టీక॥ జనస్థానే = జనస్థానమునందు; రాక్షసగృధ్రయోః=రక్కసునకును

గద్దకును ; యుద్ధం = పోరు; కథం = ఎట్లు; ఆసీత్ = కలిగినది? చిరస్య = బహుకాలమునకు ; అద్య = ఇపుడు; భ్రాతుః = తమ్మునియొక్క; ఇదం = ఈ; నామధేయం = పేరు; శ్రుతం = వినఁబడినది.

జనస్థానంబున, జటాయువునకును రావణునకును యుద్ధం బెట్లు గలిగెను? బహుకాలమున కిపుడు నాతమ్ముని పేరు వినఁగంటిని. అని, తాత్పర్యము.

ఇచ్ఛేయం గిరిదుర్గాచ్చ భవద్భి రవతారితుమ్

టీక ॥ భవద్భిః = మీచేత; గిరిదుర్గాత్ = పర్వతశిఖరమునుండి; అవతారితుంచ = దించుటకును; ఇచ్ఛేయం = కోరుచున్నాను.

మీరు, నన్నుఁబర్వతశిఖరమునుండి, మీరున్నస్థలంబునకు దింపఁగోరెదను. అని, తాత్పర్యము.

యవీయసో గుణజ్ఞస్య శ్లాఘనీయస్య విక్రమైః ౪
అతిదీర్ఘస్య కాలస్య తుష్టో స్మి పరికీర్తనాత్

టీక॥ అతిదీర్ఘస్య = మిక్కిలినధికమయిన; కాలస్య = కాలమునకు; గుణజ్ఞస్య = గుణములనెఱింగినవాఁడును; విక్రమైః = పరాక్రమములచేత; శ్లాఘనీయస్య = కొనియాడఁదగినవాఁడునగు; యవీయసః = తమ్మునియొక్క ; పరికీర్తనాత్ = చెప్పుటచేత; తుష్టః = సంతోషించినవాఁడను ; అస్మి = అగుచున్నాను.

గుణజ్ఞుండును మహాపరాక్రమశాలియునగు తమ్ముని పేరు, దీర్ఘకాలమునకు, మీవలనఁ వినఁగలిగినందుకు మిక్కిలియు సంతోషించితిని.

అని, తాత్పర్యము.

తదిచ్ఛేయ మహం శ్రోతుం వినాశం వానరర్షభాః. ౫
భ్రాతు ర్జటాయుష స్తస్య జనస్థాననివాసినః

టీక॥ వానరర్షభాః = వానరశ్రేష్ఠులారా! తత్ = అందువలన; అహం = నేను; జనస్థాననివాసినః = జనస్థానమందుండునట్టి; భ్రాతుః = తమ్ముఁడైన; తస్య = ఆ; జటాయుషః = జటాయువుయొక్క; వినాశం = మరణమును; శ్రో

తుం=వినుటకు; ఇచ్ఛేయం=కోరుచును. వానరోత్తములారా! అట్లగుటంజేసి, జనస్థానంబున నివసించి యుండిన నాతమ్ముండగు జటాయువు, ఎట్లు వధింపఁబడినాఁడో ఆవివరమును వినఁగోరెదను. అని, తాత్పర్యము.

తస్యైవ చ మమ భ్రాతుః సఖా దశరథః కథమ్. ౬
యస్య రామః ప్రియః పుత్రో జ్యేష్ఠో గురుజనప్రియః

టీక॥ యస్య = ఎవ్వనికి; గురుజనప్రియః = తలిదండ్రులుమొదలగు వారికిఁబ్రియుండగు; రామః= రాముఁడు; ప్రియః = ఇష్టుఁడును; జ్యేష్ఠః= పెద్దవాఁడునగు; పుత్రః=కొడుకో; సః (అధ్యాహృతము) = అట్టి; దశరథః= దశరథమహారాజు; తస్య=ఆ; మమ= నాయొక్క; భ్రాతుః ఏవ = తమ్మునికే; సఖా=మిత్రుఁడు; కథం=ఎట్లు?

గురుజనులకు సంతోషముఁగలిగించునట్టి రాముండు, ఎవ్వనికిఁ బ్రియుండగు జ్యేష్ఠకుమారుఁడో, అట్టి దశరథమహారాజు, నాతమ్మునకు, ఎట్లు స్నేహితుఁడయ్యె? అని, తాత్పర్యము. ఇందువలన, "జటాయువు దశరథుని స్నేహితుఁడు" అని యంగదుఁడు, సంపాతితోఁజెప్పిన మాటలలోఁ జెప్పినట్లు తెలియవచ్చుచున్నది.

సూర్యాంశుదగ్ధపక్షత్వా న్నశక్నో మ్యుపసర్పితుమ్. ౭
ఇచ్ఛేయం పర్వతా దస్మా దవతర్తు మరిందమాః

టీక॥ అరిందమాః= శత్రువులనడఁగఁద్రొక్కునట్టి వారలారా! అహం (అధ్యాహృతము)= నేను; సూర్యాంశుదగ్ధపక్షత్వాత్=సూర్యుని కిరణములచే కాల్పఁబడిన ఱెక్కలుగలవాఁడనగుటవలన; ఉపసర్పితుం = వచ్చుటకు; నశక్నోమి=చాలను. అస్మాత్=ఈ; పర్వతాత్ =కొండనుండి; అవతర్తుం=దిగుటకు; ఇచ్ఛేయం=కోరెదను.

శత్రువులనడంచునట్టి వానరోత్తములారా! సూర్యుని కిరణములచే నా ఱెక్కలు దహింపఁబడినందున, నాకు వచ్చుటకు శక్తిలేదు; ఈకొండపయినుండి మీరున్న స్థలమునకు దిగుటకుఁ గోరుచున్నాను. అని, సంపాతివానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

శోకా ద్భ్రష్టస్వరమపి శ్రుత్వా తే హరియూథపాః ॥

శ్రద్దధుర్నైవ తద్వాక్యం కర్మణా తస్య శంకితాః

టీక॥ తే = ఆ; హరియూధపాః= వానరసమూహమును బాలించునట్టి వానరులు; శోకాత్ = దుఃఖమువలన; భ్రిష్టస్వరమపి = తగ్గిన ధ్వనిగలదైనను; తత్ = ఆ; వాక్యం = మాటను; శ్రుత్వా = విని; తస్య = ఆసంపాతియొక్క; కర్మణా = కార్యముచేత; నైవశ్రద్దధుః = నమ్మనేలేదు.

ఆ వానరవీరులు, దుఃఖాతిశయంబున హీనస్వరమయినను ఆసంపాతివాక్యంబును విని, అతఁడు భక్షించివేయునని తలఁచినవారగుటవలన, దానినెంతమాత్రమునమ్మరైరి. అని, తాత్పర్యము.

తే ప్రాయ ముపవిష్టా స్తు దృష్ట్వా గృధ్రం ప్లవంగమాః. ౯
చక్రు ర్బుద్ధిం తదా రౌద్రీం సర్వా న్నో భక్షయిష్యతి

టీక॥ ప్రాయం= మరణార్థమయి (అధ్యాహృతము) = అనిన యుపవాసవ్రతమును గూర్చి; ఉపవిష్టాః = పరుండిన; తే = ఆ; ప్లవంగమాః = వానరులు; గృధ్రం = సంపాతిని; దృష్ట్వాతు = చూచినంతనే; తదా = అప్పుడు; ("నః = మనలను; సర్వాన్ = అందఱను; భక్షయిష్యతి = తినఁగలఁడు") ఇతి = అని; రౌద్రీం = క్రూరమైన; బుద్ధిం = తలఁపును; చక్రుః = చేసిరి.

ఆవ్వానరులు ప్రాయోపవేశమునం బరుండియున్న యవ్వానరులు, "ఈతండు, మనలనందఱను భక్షించివేయును." అని ఇవ్విధంబునం గ్రూరమయినతలంపుచేసిరి; అని, తాత్పర్యము.

సర్వథా ప్రాయ మాసీనా న్యది నో భక్షయిష్యతి. ౧౦
కృతకృత్యా భవిష్యామః క్షిప్రం సిద్ధి మితో గతాః

టీక॥ ప్రాయం = మరణార్థమయిన యుపవాసమును; ఆసీనాన్ = అవలంబించిన; నః = మనలను; భక్షయిష్యతియది = తినునేని; ఇతః = దీనివలన; క్షిప్రం = శీఘ్రముగా; సిద్ధిం = ఇష్టసిద్ధిని; గతాః = పొందినవారమయి; సర్వథా = అన్నివిధములను; కృతకృత్యాః = చేయఁబడినపనిగలవారలము; భవిష్యామః = కాఁగలము.

మనము మరణార్థమె ప్రాయోపవే

స ౫౭

శము నవలంబించియున్నాము; ఇతఁడి ప్పుడు మనలను భక్షించి యేమేయుసేని, మనము శీఘ్రముగా నిష్టసిద్ధినొందినవా రమయి కృతార్థులమగుదుము, అని. యవ్వానరులు తలంచిరి.

అని, తాత్పర్యము.

ఏతాం బుద్ధిం తత శ్చక్రు స్సర్వే తే వానరర్షభాః. ౧౧

టీక॥ తే=ఆ; వానరర్షభాః=వాన రశ్రేష్ఠులు; సర్వే=అందఱును; తతః= అపుడు; ఏతాం=ఈ; బుద్ధిం=తలంపు ను; చక్రుః=చేసిరి.

అప్పుడు, అవ్వానరోత్తములందఱు ను, ఇవ్విధంబునం దలంచిరి.

అని, తాత్పర్యము.

అవతార్య గిరే శ్శృంగా ద్గృధ్ర మాహాంగద స్తదా

టీక ॥ తదా=అప్పుడు; అంగదః= అంగదుఁడు; గృధ్రం= సంపాతిని; గి రేః=పర్వతముయొక్క; శృంగాత్ = శిఖరమునుండి; అవతార్య= దింపి; ఆ హ=చెప్పుచున్నాఁడు.

అంతనంగదుఁడు, పర్వతశిఖరంబు నుండి సంపాతినిదింపి, యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

బభూవ ఋక్షరజా నామ వానరేంద్రః ప్రతాపవాన్. ౧౨
మమార్యః పార్థివః పక్షి న్ధార్మిక స్తస్య చాత్మజౌ
సుగ్రీవ శ్చైవ వాలీచ పుత్రౌ ఓఘబలౌ వుభౌ. ౧౩

టీక ॥ పక్షిన్ = పక్షీ! ప్రతాప వాన్=అధికమయిన పరాక్రమముగల వాఁడును; ధార్మికః=ధర్మమునాచరిం చువాఁడును; మమ=నాకు; ఆర్యః = తాతయు; వానరేంద్రః= వానరశ్రే ష్ఠుఁడునగు; ఋక్షరజాః = ఋక్షర జుఁడును; పార్థివః= రాజు, వానరరా జనుట; బభూవ=ఉండెను. తస్య= అ తనియొక్క; ఆత్మజౌ=ఔరసులయిన; సుగ్రీవశ్చైవ=సుగ్రీవుఁడనియు; వాలీ చ=వాలియనియు; ఓఘబలౌ = బృంద సంఖ్యగలపురుషులయొక్క బలముగల, నూఱుకోట్లపురుషుల బలముగల వారల నుట; పుత్రౌ=కొడుకులు; ఉభౌ=ఇద్ద

ఉః; స్తః (అధ్యాహృతము)= కలరు.

పక్షీ! మహాపరాక్రమశాలియుధా ర్మికుండునగు మాతాత ఋక్షరజుండను వానరరాజుండెను; అతనికి, నూఱుకోట్లపురుషులబలముగల వాలియు సుగ్రీవుండునను నిర్వురుకొడుకులుగలరు.

అని, తాత్పర్యము.

లోకే విశ్రుతకర్మా భూ ద్రాజా వాలీ పితా మమ

టీక॥ మమ=నాయొక్క; పితా= తండ్రియగు; రాజా= వానరరాజైన; వాలీ=వాలి; లోకే=లోకమునందు; విశ్రుతకర్మా=ప్రసిద్ధమయినకార్యముగలవాఁడు; అభూత్=అయ్యెను.

నా తండ్రియగు వానరేశ్వరుండు వాలి, పరాక్రమంబున, లోకంబులం బ్రసిద్ధుండైయుండెను.

అని, తాత్పర్యము.

రాజా కృత్స్నస్య జగత ఇక్ష్వాకూణాం మహారథః. ౧౪
రామో దాశరథి శ్శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్
లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా. ౧౫
పితు ర్నిర్దేశనిరతో ధర్మ్యం పంథాన మాశ్రితః

టీక॥ ఇక్ష్వాకూణాం= ఇక్ష్వాకువంశపురాజులయొక్క; కృత్స్నస్య = సమస్తమయిన; జగతః = భూమికిని; రాజా=రాజును; మహారథః=తన్నును సారథిని గుఱ్ఱములను గాపాడుకొనుచుఁ బహునొకండు వేలమంది విలుకాండ్రతోఁ బోరువాఁడును; శ్రీమాన్ = అందఱికన్ననధికుండును; దాశరథిః = దశరథమహారాజు కొడుకునగు; రామః=రాముఁడు; పితుః = తండ్రియొక్క; నిర్దేశనిరతః = ఆజ్ఞయందు ఆసక్తుండై; ధర్మ్యం=ధర్మముతోఁగూడిన; పంథానం = మార్గమును; ఆశ్రితః= పొందినవాఁడై; భ్రాత్రా= తమ్ముఁడైన; లక్ష్మణేన= లక్ష్మణునితోను; భార్యయా= పెండ్లామయిన; వైదేహ్యాచాపి=సీతతోనుంగూడ; దండకావనం = దండకారణ్యమును; ప్రవిష్టః = పొందెను.

ఇక్ష్వాకువంశపు రాజులదైన సమస్త భూమండలమునకును ప్రభుండును మహారథుండును శ్రీమంతుండును దశర

థపుత్త్రుండగు రాముండు, తండ్రి యాజ్ఞను శిరసావహించి, ధర్మమార్గంబు నవలంబించి, తమ్ముండు లక్ష్మణుని భార్యను సీతనుం గూడి, దండకారణ్యంబునకు వచ్చెను. అని, తాత్పర్యము.

తస్య భార్యా జనస్థానా ద్రావణేన హృతా బలాత్. ౧౮

టీక॥ తస్య = ఆరామునియొక్క; భార్యా = పెండ్లామైనసీత; జనస్థానాత్ = జనస్థానమునుండి; రావణేన = రావణునిచేత; బలాత్ = బలిమివలన; హృతా = అపహరింపఁబడినది.

ఆరాముండు జనస్థానంబుననుండు నపుడు, అతనిభార్యను సీతను, రావణుండు బలాత్కారంబున నపహరించెను. అని, తాత్పర్యము.

రామస్యతు పితు ర్మిత్రం జటాయుర్నామ గృధ్రరాట్
దదర్శ సీతాం వైదేహీం హ్రియమాణాం విహాయసా. ౧౯

టీక॥ రామస్య = రామునియొక్క; పితుః = తండ్రియొక్క; మిత్రం = స్నేహితుఁడైన; జటాయుర్నామ = జటాయువని ప్రసిద్ధుఁడైన; గృధ్రరాట్ తు = గ్ద్ధలరాజుమాత్రము; విహాయసా = ఆకాశముచేత, ఆకాశమార్గముచేత; హ్రియమాణాం = అపహరింపఁబడుచున్న; వైదేహీం = విదేహదేశమునం దుఁబుట్టిన; సీతాం = సీతను; దదర్శ = చూచెను.

రావణుండు, సీత నాకాశమార్గంబున నపహరించుకొనిపోవునపుడు, రామునితండ్రికి స్నేహితుండగు గృధ్రరాజయిన జటాయువుమాత్రము చూచెను. అని, తాత్పర్యము. "రామునితండ్రికి స్నేహితుండు" అనుటవలన, జటాయువు దశరథునకు స్నేహితుఁడయిన విధము, అంగదుండు దనకుఁ దెలియదన్నట్లు సూచితమగుచున్నది.

రావణం విరథం కృత్వా స్థాపయిత్వాచ మైథిలీమ్
పరిశ్రాంతశ్చ వృద్ధశ్చ రావణేన హతో రణే. ౨౦

టీక॥ సః (అధ్యాహృతము) = ఆజటాయువు; రణే = యుద్ధమునందు; రా

వణం=రావణుని; విరథం=రథములేనివానిఁగా; కృత్వా=చేసి; మైథిలీం=సీతను; స్థాపయిత్వా చ=నిలిపియు; పరిశ్రాంతశ్చ = అలసినవాఁడును; వృద్ధశ్చ=ముసలివాఁడునై; రావణేన=రావణుని చేత; హతః=వధింపఁబడినాఁడు.

జటాయువంతయుద్ధంబున రావణుని విరథునిఁగావించి సీతనాపియుంచి, తుదకుఅలసినవాఁడును వృద్ధుండును గావున, రావణుని చేతం జచ్చెను.

అని, తాత్పర్యము.

ఏవం గృధ్రో హత స్తేన రావణేన బలీయసా
సంస్కృతశ్చాపి రామేణ గతశ్చ గతి ముత్తమామ్. ౧౯

టీక॥ ఏవం=ఈప్రకారముగా; గృధ్రః=జటాయువు; తేన = ఆ; బలీయసా=అధికబలముగల; రావణేన=రావణుని చేత; హతః= వధింపఁబడినాఁడు. రామేణ=రాముని చేత; సంస్కృతశ్చాపి=సంస్కరింపఁబడినవాఁడునై; ఉత్తమాం=శ్రేష్ఠమయిన; గతిం=స్థానమును; గతశ్చ=పొందినవాఁడును; అభూత్ (అధ్యాహృతము)=అయ్యెను.

జటాయువు, ఇవ్విధంబున బలవంతుండగు రావణుని చేహతుండయ్యెను; అంత, రాముని చే సంస్కారమునొంది, ఉత్తమమయిన గతింబొందెను.

అని, తాత్పర్యము.

తతో మమ పితృవ్యేణ సుగ్రీవేణ మహాత్మనా
చకార రాఘవ స్సఖ్యం సో వధీ త్పితరం మమ. ౨౦

టీక॥ తతః= అటుపిమ్మట; రాఘవః= రాముఁడు; మహాత్మనా = పూజ్యమయిన స్వభావముగల ; మమ = నాయొక్క; పితృవ్యేణ= పినతండ్రియగు; సుగ్రీవేణ=సుగ్రీవునితో; సఖ్యం= స్నేహమును; చకార=చేసెను. సః= ఆరాముఁడు; మమ=నాయొక్క; పితరం=తండ్రియయినవాలిని; అవధీత్= చంపెను.

అంత, రాముఁడు, మహాత్ముండగు నాపినతండ్రి సుగ్రీవునితోసఖ్యంబుచేసి, నాతండ్రివాలినివధించెను.

అని, తాత్పర్యము.

మమ పిత్రా విరుద్ధో హి సుగ్రీవ స్సచివై స్సహ

నిహత్య వాలినం రామ స్తత స్త మభిషేచయత్. ౨౧

టీక ॥ సుగ్రీవః= సుగ్రీవుఁడు; సచివైస్సహ=మంత్రులతోఁగూడ; మమ= నాయొక్క; పిత్రా=తండ్రితోఁగూడ; విరుద్ధోహి= ద్వేషమునొందెనుగదా! రామః=రాముఁడు; వాలినం=వాలిని; నిహత్య=వధించి; తతః=అంత; తం= ఆసుగ్రీవుని; అభిషేచయత్ (అభ్యషేచయత్)= అభిషేకించెను.

సుగ్రీవుండు, తనమంత్రులుం దానును నాతండ్రివాలితో విరోధించి యుండెనుగావున, రాముండు వాలినివధించి, సుగ్రీవునకు, వానరరాజ్యంబునఁబట్టాభిషేకంబుగావించెను.

అని, తాత్పర్యము.

స రాజ్యే స్థాపిత స్తేన సుగ్రీవో వానరాధిపః
రాజా వానరముఖ్యానాం యేన ప్రస్థాపితా వయమ్. ౨౨

టీక॥ సః=ఆ;వానరాధిపః=వానరరాజయిన; సుగ్రీవః=సుగ్రీవుఁడు; తేన=ఆరామునిచేత; స్థాపితః= ఉంచఁబడినవాఁడై; వానరముఖ్యానాం=వానరశ్రేష్ఠులకు; రాజా = ఱేఁడు; అభూత్(అధ్యాహృతము)= అయ్యెను. యేన=ఎవ్వనిచేత; వయం=మేము;ప్రస్థాపితాః=పంపఁబడినామో.

ఆ సుగ్రీవుఁడు, రామునిచే వానరరాజ్యంబునఁ బట్టాభిషిక్తుండయి సమస్తవానరోత్తములకును రాజయి యున్నాఁడు; అతనియాజ్ఞమీఁదనే మేమువచ్చినాము. అని, తాత్పర్యము.

ఏవం రామప్రయుక్తాస్తు మార్గమాణా స్తత స్తతః
వైదేహీం నాధిగచ్ఛామో రాత్రౌ సూర్యప్రభామివ. ౨౩

టీక॥వయం(అధ్యాహృతము)=మేము;ఏవం=ఇట్లు;రామప్రయుక్తాస్తు= రామునిచేఁ బ్రేరింపఁబడినవారమైయు; తత స్తతః=అచటచట;మార్గమాణాః= వెదకుచు;వైదేహీం=సీతను; రాత్రౌ= రాత్రియందు; సూర్యప్రభామివ=సూర్యకాంతినివలె; నాధిగచ్ఛామః= చూడకున్నాము.

మేమిట్లు రాముని నిమిత్తమయ్యె, యన్యస్థలంబుల నెంత వెదకినను,

రాత్రియందు సూర్యకాంతియగపడనట్లు, సీతాదేవియగపడనేలేదు. అని, తా.

తే వయం దండకారణ్యం విచిత్య సుసమాహితాః
అజ్ఞానాత్తు ప్రవిష్టా స్మ ధర్మిణ్యా వివృతం బిలమ్. ౨౪

టీక॥ తే=అట్టి; వయం=మేము; సుసమాహితాః= మిక్కిలియు జాగ్రత్త గలవారలమయి; దండకారణ్యం=దండకారణ్యమును; విచిత్య=వెదకి; అజ్ఞానాత్తు= తెలియమివలననె; వివృతం= తెఱవఁబడిన; ధర్మిణ్యాః=ధర్మచారిణి యగుస్వయంప్రభయొక్క; బిలం=వివరమును; ప్రవిష్టాః=పొందినవారలము; స్మ (స్మః) = అగుచున్నాము.

అట్లు మేము, ఎంతమాత్రమేమఱక, దండకారణ్యమంతయు వెదకి, తెలియకపోవుటవలన, ధర్మచారిణియగు స్వయంప్రభయొక్క బుడువిలంబను బిలమును బ్రవేశించినాము.

అని, తాత్పర్యము.

మయస్య మాయావిహితం తద్బిలంచ విచిన్వతామ్
వ్యతీత స్తత్ర నో మాసో యో రాజ్ఞా సమయః కృతః. ౨౫

టీక॥ మయస్య= మయునియొక్క; మాయావిహితం=మాయచే నిర్మింపఁబడిన; తత్=ఆ; బిలంచ= బిలమునుగూడ; విచిన్వతాం= వెదకుచున్న; నః= మాకు; తత్ర=అచట; యః=ఏది; రాజ్ఞా= రాజయినసుగ్రీవునిచేత; సమయః=అవధిగా; కృతః=చేయఁబడినదో; సః(అధ్యాహృతము)=ఆ; మాసః=నెల; వ్యతీతః = కడచినది.

మయునిచే మాయాబల నిర్మితంబగునావిలంబున మేము సీతను వెదకుచుండఁగా, నచటనె, మాకు వానరరాజును గ్రీవ్వుండు నియమించిన యవధియయిన మాసము, అతిక్రమించినది.

అని, తాత్పర్యము.

తే వయం కపిరాజస్య సర్వే వచనకారిణః
కృతాం సంస్థా మతిక్రాంతా భయా త్ప్రాయ ముపాస్మహే. ౨౬

టీక॥ కపిరాజస్య=వానరరాజయినసుగ్రీవునియొక్క; వచనకారిణః=మా

స ౫౭

టను జేయునట్టి; తే=ఆ; వయం = మేము; సర్వే=అందఱమును; కృతాం=చేయఁబడిన; సంస్థాం = వ్యవస్థను; అతిక్రాంతాః=అతిక్రమించినవారమై; భయాత్=వెఱపువలన; ప్రాయం=మరణార్థమయిన యుపవాసమును; ఉపాస్మహే=సేవించుచున్నాము.

మేమందఱమును వానరరాజు సుగ్రీవు నియాజ్ఞకులోఁబడినవారము, అతఁడు విధించిన వ్యవస్థ నతిక్రమించినవారమగుటంజేసి, యతనియొద్దకుఁ బోఁజాలక, భయపడి, ప్రాయోపవేశము నవలంబించితిమి. అని, తాత్పర్యము.

క్రుద్ధే తస్మిం స్తు కాకుత్స్థే సుగ్రీవేచ సలక్ష్మణే
గతానామపి సర్వేషాం తత్ర నో నాస్తి జీవితమ్. ౨౭

టీక ॥ సలక్ష్మణే=లక్ష్మణునితోఁగూడిన; తస్మిన్=ఆ; కాకుత్స్థేతు=రాముండుమాత్రము; క్రుద్ధే= కోపించినవాఁడుకాఁగా; సుగ్రీవేచ=సుగ్రీవుండును; క్రుద్ధే (అధ్యాహృతము)= కోపించినవాఁడు కాఁగా; తత్ర=అచటికి; గతానామపి= పోయినవారమయినను; నః=మాకు; సర్వేషాం=అందఱకును; జీవితం=బ్రతుకు; నాస్తి=లేదు.

అట్టి మహావీరుండగు రాముండును లక్ష్మణుండును సుగ్రీవుండును మావిషయమయి కోపమువహించినపుడు, మేమచటికిఁబోయినను ఒకరమైనను ఎంతమాత్రము బ్రతుకఁజాలము. అని, యంగదుఁడు సంపాతితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, సప్తపంచాశస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ సప్తపంచాశసర్గటీక,
ముగిసినది.

౫౭

అష్టపంచాశసర్గప్రారంభః.

ఇత్యుక్తః కరుణం వాక్యం వానరై స్త్యక్తజీవితైః
సబాష్పో వానరా న్గృధ్రః ప్రత్యువాచ మహాస్వనః. ౧

టీక॥ మహాస్వనః = అధికమయిన ధ్వనిగల; గృధ్రః=సంపాతి; త్యక్తజీవితైః = విడువఁబడిన ప్రాణములుగల; వానరైః=వానరులచేత; ఇతి=ఇట్లు; కరుణం=దుఃఖకరమయిన; వాక్యం=మాటను; ఉక్తః=చెప్పఁబడినవాఁడై; సబాష్పః=కన్నీళ్లతోఁగూడినవాఁడై; వానరాన్ = వానరులనుగూర్చి; ప్రత్యువాచ = బదులుచెప్పెను.

ఆసంపాతి యిట్లు వానరులదుఃఖవచనంబువిని, తానును దుఃఖితుండై కన్నీరునించుచు, మహాధ్వనితో నిట్లని చెప్పెను. అని, తాత్పర్యము.

యవీయా న్మమ స భ్రాతా జటాయుర్నామ వానరాః
య మాఖ్యాత హతం యుద్ధే రావణేన బలీయసా. ౨

టీక॥ వానరాః = వానరులారా! యూయం(అధ్యాహృతము)=మీరలు; యం=ఎవ్వని; యుద్ధే=పోరునందు; బలీయసా=అధికముగా బలముగల; రావణేన=రావణునిచేత; హతం= వధింపఁబడినవానిఁగా; ఆఖ్యాత= చెప్పెదరో; సః=ఆ; జటాయుర్నామ= జటాయువుఅని ప్రసిద్ధుఁడయినవాఁడు; మమ=నాయొక్క; యవీయాన్ = చిన్నవాఁడైన; భ్రాతా=తోఁబుట్టువు.

వానరులారా! మీరలు యుద్ధంబున బలవంతుండగు రావణునిచే హతుఁడయినట్లుగాఁజెప్పిన జటాయువు, నాతమ్ముఁడు. అని, తాత్పర్యము.

వృద్ధభావా దపక్షత్వా చ్ఛృణ్వ న్ తదపి మర్షయే
నహి మే శక్తి రస్త్యద్య భ్రాతు ర్వైరవిమోక్షణే. ౩

టీక॥ తత్ =ఆసమాచారమును; శృణ్వన్నపి=వినుచున్నను; వృద్ధభావాత్ =

ముసలితనమువలనను; అపక్షత్వాత్ = ఱెక్కలులేనివాఁడ నగుటవలనను; మర్షయే = ఓర్చుచున్నాను. అద్య = ఇప్పుడు; మే = నాకు; భ్రాతుః = తమ్మునియొక్క; వైరవిమోక్షణే = పగదీర్చుటయందు; శక్తిః = సామర్థ్యము; నాస్తిహి = లేదుగదా!

నాతమ్ముని రావణుఁడు వధించెనన్న సమాచారమును విన్నప్పటికిని, నేను, ముసలివాఁడను ఱెక్కహీనుఁడనగుటవలన, సహించియుండవలసియున్నది; రావణునివధించినాతమ్మునిపగదీర్చుటకు నాకిప్పుడు శక్తిలేదు; ఏమిసేయుదును? అని, తాత్పర్యము.

పురా వృత్రవధే వృత్తే పరస్పరజయైషిణా
ఆదిత్య ముపయాతౌ స్వో జ్వలంతం రశ్మిమాలినమ్. ౪

టీక॥ పురా = మున్ను; వృత్రవధే = వృత్రాసురునివధము; వృత్తే = కడచినదికాఁగా; అహం (అధ్యాహృతము) = మేము; పరస్పరజయైషిణౌ = ఒండొరుల జయించుటను గోరినవారమై; జ్వలంతం = మండుచున్న; రశ్మిమాలినం = కిరణములపఙ్క్తి గల; ఆదిత్యం = సూర్యుని; ఉపయాతౌ = సమీపించినవారము; స్వః = అగుచున్నాము.

మున్ను వృత్రాసుర వధమయినప్పుడు, మేమన్నదమ్ములమిద్దఱము, ఒండొరుల వేగాతిశయముఁ బరీక్షింపఁగోరి, సహస్రకిరణములచే జ్వలించుచున్న సూర్యుని సమీపంబునకుఁ బోతిమి. అని, తాత్పర్యము.

ఆవృత్త్యాకాశమార్గేషు జవేన స్మ గతౌ భృశమ్
మధ్యం ప్రాప్తే దినకరే జటాయు రవసీదతి. ౫

టీక॥ ఆవాం (అధ్యాహృతము) = మేము; ఆకాశమార్గేషు = ఆకాశమార్గములయందు; ఆవృత్త్యా = మండలగమనముచేత; జవేన = వేగముచేత; భృశం = మిక్కిలియు; గతౌ = పోయినాము. దినకరే = సూర్యుఁడు; మధ్యం = ఆకాశమధ్యభాగమును; ప్రాప్తే = పొందినవాఁడగుచుండఁగా; జటాయుః = జటాయువు; అవసీదతిస్మ = సోలెను.

మేము, మండలగతులం జరించుచు, నాకాశమార్గంబులఁ జాలదూరమతిక్రమించిపోతిమి; అంత, సూర్యుండు,

ఆకాశమధ్యగతుం డగుటయు, జటాయువు సూర్యుని వేఁడిమిని ఆయాసంబును సహింపఁజాలక, వివశుండయ్యెను. అని, తాత్పర్యము.

త మహం భ్రాతరం దృష్ట్వా సూర్యరశ్మిభి రర్దితమ్
పక్షాభ్యాం ఛాదయామాస స్నేహా త్పరమవిహ్వలః. ౬

టీక॥ అహం= నేను; సూర్యరశ్మిభిః=సూర్యునికిరణములచేత;అర్దితం= పీడింపఁబడిన; తం=ఆ; భ్రాతరం=తమ్ముఁడైనజటాయువును; దృష్ట్వా=చూచి; స్నేహాత్= చెలిమివలన; పరమవిహ్వలః = మిక్కిలియుఁబరవశుండనై; పక్షాభ్యాం=ఱెక్కలచేత; ఛాదయామాస=కప్పితిని.

అంత, నాతమ్ముండు జటాయువు అట్లు సూర్యకిరణంబులచేఁబీడితుండగుటయు, నేనది చూచి భ్రాతృస్నేహంబునం బరవశుఁడనై నాఱెక్కలచే నతనికి సూర్యరశ్మి తగులకుండఁ గప్పితిని. అని, తాత్పర్యము.

నిర్దగ్ధపక్షః పతితో వింధ్యే౽హం వానరర్షభాః
అహ మస్మిన్ వసన్ భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే. ౭

టీక॥ వానరర్షభాః = వానరోత్తములారా! అహం=నేను; నిర్దగ్ధపక్షః= దహింపఁబడిన ఱెక్కలుగలవాఁడనై; వింధ్యే=వింధ్యపర్వతమునందు;పతితః= పతితః = పడినాను. అహం = నేను; అస్మిన్ = ఈవింధ్యపర్వతమునందు; వసన్=వాసము సేయుచు; భ్రాతుః=తమ్మునియొక్క; ప్రవృత్తిం= సమాచారమును; నోపలక్షయే=తెలియనైతిని.

వానరోత్తములారా! నేను ఱెక్కలు కాలి, యీవింధ్యపర్వతంబునం బడితిని; నేనిచటనే వాసము సేయుచుంటిని గాని నాతమ్ముని సమాచారమేనాకుఁ దెలిసినదికాదు. అని సంపాతివానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

జటాయుష స్త్వేవ ముక్తో భ్రాత్రా సంపాతినా తదా
యువరాజో మహాప్రాజ్ఞః ప్రత్యువాచాంగద స్తదా. ౮

టీక ॥ మహాప్రాజ్ఞః = మహాపండితుండును; యువరాజః= యువరాజు

నగు; అంగదః=అంగదుఁడు; తదా=అప్పుడు; జటాయుషః = జటాయువుయొక్క; భ్రాతా=అన్నయగు; సంపాతినా=సంపాతిచేత; ఏవం=ఇట్లు; ఉక్తస్తు=చెప్పఁబడినవాఁడైనంతనె; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

మహాపండితుండగు యువరాజయిన యంగదుండు, జటాయువుయొక్క అన్న సంపాతిచెప్పినమాటనువిని, అప్పుడతనింజూచి, యిట్లని బదులుపలికెను. అని, తాత్పర్యము.

జటాయుషో యది భ్రాతా శ్రుతం తే గదితం మయా
ఆఖ్యాహి యది జానాసి నిలయం తస్య రక్షసః. ౯

టీక॥ తే = నీయొక్క; గదితం = మాట; మయా = నాచేత; శ్రుతం= వినఁబడినది. త్వం(అధ్యాహృతము)=నీవు; జటాయుషః=జటాయువుయొక్క; భ్రాతాయది=అన్నవగుదువేని; జానాసియది=ఎఱుంగుదువేని;తస్య=ఆ;రక్షసః=రక్కసునియొక్క; నిలయం=స్థానమును; ఆఖ్యాహి=చెప్పుము.

నీవుచెప్పినదంతయు నేనువింటిని; నీవు మాజటాయువునకుఅన్నవయితే, నీకుఁదెలిసినయెడ, ఆ రావణుండెచ్చట నుండువాఁడో చెప్పుము.

అని, తాత్పర్యము.

అదీర్ఘదర్శినం తం వై రావణం రాక్షసాధిపమ్
అంతికే యదివా దూరే యది జానాసి శంస నః. ౧౦

టీక॥ అంతికే = సమీపమునందుఁగాని; దూరేయదివా = దూరమునందుఁగాని ; అదీర్ఘదర్శినం = దీర్ఘముగాఁజూడనట్టి, రాఁబోవుదానిఁదెలియనివాఁడనుట; రాక్షసాధిపం = రాక్షసరాజయిన; రావణం = రావణుని; జానాసియది = తెలియుదువేని; నః= మాకు; శంస=చెప్పుము.

తానుజేయు కార్యమువలన రాఁబోవు ననర్థముఁదెలియని మూర్ఖుఁడు రాక్షసరాజు రావణుండు నివసించు స్థలము, సమీపమో దూరమో నీకుఁదెలిసినయెడ, మాకుఁజెప్పుము. అనియంగదుండు సంపాతితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతో బ్రవీన్మహాతేజా జ్యేష్ఠో భ్రాతా జటాయుషః
ఆత్మానురూపం వచనం వానరాన్ సంప్రహర్షయన్. ౧౧

టీక॥ తతః= అటుపిమ్మట; మహాతేజాః= అధికమయిన పరాక్రమముగలవాఁడును; జటాయుషః=జటాయువుయొక్క; జ్యేష్ఠః=పెద్దవాఁడైన; భ్రాతా=తోఁబుట్టువునగు సంపాతి; వానరాన్ = వానరులను; సంప్రహర్షయన్= సంతోషింపఁజేయుచు; ఆత్మానురూపం=తనకుఁదగిన; వచనం=మాటను; అబ్రవీత్=చెప్పెను.

అంత, మహాపరాక్రమశాలియగు జటాయువుయొక్క అన్న సంపాతి, వానరులు సంతోషంబునొందునట్లు తనకనురూపంబుగా నిట్లు వచించెను. అని, తాత్పర్యము.

నిర్దగ్ధపక్షో గృధ్రో హం హీనవీర్యః ప్లవంగమాః
వాఙ్మాత్రేణతు రామస్య కరిష్యే సాహ్యముత్తమమ్. ౧౨

టీక॥ ప్లవంగమాః = వానరులారా! అహం=నేను; గృధ్రః= గద్దను; నిర్దగ్ధపక్షః = కాల్పఁబడినఱెక్కలుగలవాఁడను; హీనవీర్యః = విడువఁబడిన పర్రాక్రమముగలవాఁడను; రామస్య = రామునకు; వాఙ్మాత్రేణతు = మాటమాత్రము చేతనైనను; ఉత్తమం = శ్రేష్ఠమయిన; సాహ్యం=తోడ్పాటును; కరిష్యే = చేసెదను.

వానరులారా! నేనుగద్దను, అందును ఱెక్కలుగాలినవాఁడను; వీర్యహీనుండను; నేనేమిగావింపఁగలను? అయినను, రామునకు,మాటమాత్రముననైనను,సాధ్యమయినంతవఱకుసాహాయ్యముగావించెదను. అని,తాత్పర్యము.

జానామి వారుణాన్ లోకాన్ విష్ణో స్త్రైవిక్రమానపి
మహాసురవిమర్దాన హ్యమృతస్య చ మంథనమ్. ౧౩

టీక॥ అహం (అధ్యాహృతము)= నేను; వారుణాన్= వరుణసంబంధములైన; లోకాన్ = లోకములను ; విష్ణోః=విష్ణువుయొక్క; త్రైవిక్రమానపి= మూడడుగులనుంచుట సంబంధించినలోకములనుగూడ; మహాసురవిమర్దా

నపి=గొప్పయసురుల యుద్ధములనుగూడ; అమృతస్య = అమృతముయొక్క; మంథనంచ= చిలుకుటనుగూడ; జానామి=ఎఱుంగుదును.

నేను, వరుణునివైన అతలాదిలోకములను, త్రివిక్రమావతారమవ్వుడు విష్ణువు అడుగులుంచిన యూర్ధ్వలోకంబులను దేవాసురయుద్ధంబులను అమృతమథనంబును, జూచియున్నాను.

అని, తాత్పర్యము.

రామస్య య దిదం కార్యం కర్తవ్యం ప్రథమం మయా
జరయా చ హృతం తేజః ప్రాణాశ్చ శిథిలా మమ. ౧౪

టీక॥ రామస్య = రామునియొక్క; ఇదం=ఈ;కార్యం=పని; యత్ (అస్తి) = ఏదిగలదో; తత్ (అధ్యాహృతము)= అది; ప్రథమం=ముందు; మయా=నాచేత; కర్తవ్యం = చేయఁబడవలసినది. జరయా = ముసలితనముచేత; మమ=నాయొక్క; తేజశ్చ= పరాక్రమముగూడ; హృతం= అపహరింపఁబడినది. ప్రాణాశ్చ= ప్రాణములుగూడ, దేహసంధిబంధములు;శిలాః= సందువదలినవి.

రాముని కార్యము ననఁగా, నేను మీ యందఱికన్న ముందు చేయవలఁసినవాఁడను; అయితే, ముసలివాఁడనగుటంజేసి, నాపరాక్రమంబు క్షీణించుటయకాక దేహసంధిబంధములును శిథిలములయినవి;కావునమాటచేమాత్రము సాహాయ్యముగావించెదను.

అని, తాత్పర్యము.

తరుణీ రూపసంపన్నా సర్వాభరణభూషితా
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా. ౧౫

టీక॥ రూపసంపన్నా = సౌందర్యముతోఁగూడినదియు; సర్వాభరణభూషితా = సమస్తాభరణములచేతను అలంకరింపఁబడినదియు; దురాత్మనా = దుష్టబుద్ధిగల; రావణేన= రావణునిచేత; హ్రియమాణా = అపహరింపఁబడుచున్నదియునగు; తరుణీ = స్త్రీ;మయా=నాచేత;దృష్టా=చూడఁబడినది.

రూపసంపన్నయు సమస్తాభరణభూషితయునగు నొకానొకయువతిని దురాత్ముండగు రావణుండు దీసికొని పోవుచుండఁగాఁ జూచితిని.

అని, తాత్పర్యము.

క్రోశంతీ రామరామేతి లక్ష్మణేతిచ భామినీ
భూషణా న్యపవిధ్యంతీ గాత్రాణిచ విధూన్వతీ. ౧౬

టీక॥ సా(అధ్యాహృతము) = ఆ; భామినీ=స్త్రీ; రామరామేతి=రాముఁడారాముఁడాయనియు; లక్ష్మణేతిచ=లక్ష్మణుఁడాయనియు; క్రోశంతీ=అఱచుచు; భూషణాని=సొమ్ములను; అపవిధ్యంతీ = పాఱవేయుచు; గాత్రాణిచ=అవయవములను గూడ; విధూన్వతీ = విదిర్చుచు; దృష్టా (అధ్యాహృతము)=చూడఁబడినది.

ఆస్త్రీ, రామరామాయనియు లక్ష్మణాయనియు నాక్రోశించుచు నాభరణంబులం దీసి పాఱవేయుచు రావణుని చంకనుండి విడివడుటకై యవయవంబుల విదిర్చుచు నుండఁగంటిని.

అని, తాత్పర్యము.

సూర్యప్రభేవ శైలాగ్రే తస్యాః కౌశేయ ముత్తమమ్
అసితే రాక్షసే భాతి యథావా తటి దంబుదే. ౧౭

టీక॥ శైలాగ్రే= [illegible] నందు; సూర్యప్రభేవ = సూర్యకాంతి వలె; అంబుదే = ఆకాశమునందు; తటిద్యథావా = మెఱుపువలెను; తస్యాః= ఆబిడయొక్క; ఉత్తమం = శ్రేష్ఠమయిన; కౌశేయం = పట్టువస్త్రము; అసితే=నల్లనైన; రాక్షసే = రక్కసుని యందు; భాతి=ప్రకాశించుచుండినది.

పర్వతశిఖరంబుపై సూర్యకాంతి ప్రకాశించినట్లును, మేఘమునందు మెఱుపు వెలుంగునట్లును, నల్లని రాక్షసునందు, ఆబిడయొక్క యుత్తమమయిన పట్టువస్త్రము ప్రకాశించెను.

అని, తాత్పర్యము.

తాంతు సీతా మహం మన్యే రామస్య పరికీర్తనాత్
శ్రూయతాం మే కథయతో నిలయం తస్య రక్షసః. ౧౮

టీక॥ అహం=నేను; రామస్య=రామునియొక్క; పరికీర్తనాత్=చెప్పుటవలన; తాంతు=ఆస్త్రీనే; సీతాం=సీతనుగా; మన్యే= తలంచుచున్నాను. తస్య=ఆ; రక్షసః= రావణునియొక్క; నిలయం=స్థానమును; కథయతః= చె

ప్పుచున్న; మే=నాయొక్క; వచనం(అధ్యాహృతము) = మాట ; శ్రూయతాం=వినఁబడుఁగాక.

రాముని పేరు గీర్తించుటవలన, ఆ స్త్రీయె సీతయని తలంచెదను; ఇఁక నా రావణుఁడుండుస్థలమును జెప్పెదవినుము. అని, తాత్పర్యము.

పుత్త్రో విశ్రవసస్సాక్షా ద్భ్రాతా వైశ్రవణస్య చ
అధ్యాస్తే నగరీం లంకాం రావణో నామ రాక్షసః. ౧౯

టీక ॥ సాక్షాత్ విశ్రవసః= విశ్రవసుఁడంతటివానియొక్క; పుత్త్రః=కొడుకును; వైశ్రవణస్య = కుబేరునియొక్క; భ్రాతాచ=తమ్ముఁడునగు; రావణోనామ= రావణుఁడని ప్రసిద్ధుఁడయిన; రాక్షసః = రక్కసుఁడు; లంకాం=లంకయను; నగరీం= పట్టణమును;అధ్యాస్తే= అధిష్ఠించియున్నాఁడు.

ఆ రావణుఁడను రాక్షసుఁడు, సాక్షాత్ విశ్రవసునికొడుకు, కుబేరుని తమ్ముఁడు; అతఁడు లంకయను నగరియందు నివసించియుండును.

అని, తాత్పర్యము.

ఇతో ద్వీపే సముద్రస్య సంపూర్ణే శతయోజనే
తస్మిన్ లంకాపురీ రమ్యా నిర్మితా విశ్వకర్మణా. ౨౦

టీక॥ ఇతః= ఇచ్చటనుండి; సంపూర్ణే=నిండిన; శతయోజనే= నూఱుయోజనములుగల; సముద్రస్య=సముద్రముయొక్క; తస్మిన్=ఆ ; ద్వీపే = దీవియందు; రమ్యా=సుందరమయిన; లంకాపురీ = లంకాపట్టణము;విశ్వకర్మణా=విశ్వకర్మచేత;నిర్మితా = నిర్మింపఁబడినది.

లంకాపురి ఇచటనుండి నూఱు యోజనంబుల దూరంబున, సముద్రంబున నొకానొకద్వీపమునందున్నది. సుందరమయిన ఆ లంకాపట్టణమును రమణీయముగా విశ్వకర్మనిర్మించెను.

అని, తాత్పర్యము.

జాంబూనదమయై ర్ద్వారై శ్చిత్రైః కాంచనవేదికైః
ప్రాకారేణార్కవర్ణేన మహతా సుసమావృతా. ౨౧

టీక॥ సా (అధ్యాహృతము) = ఆ లంకాపురి; చిత్రైః=సుందరములును; కాంచనవేదికైః=బంగారు తిన్నెలుగలవియు; జాంబూనదమయైః=బంగారు వికారములును; ద్వారైః=వాకిళ్ల చేతను; అర్కవర్ణేన = సూర్యునియొక్క కాంతివంటికాంతిగల; మహతా=గొప్పదైన; ప్రాకారేణ=ప్రహరిచేతను; సుసమావృతా = చక్కగా పరివేష్టింపఁబడియున్నది.

ఆలంకాపురి, బంగారుతిన్నెలుగలిగి సుందరములయిన బంగారుద్వారంబులతోను సూర్యప్రకాశంబగు గొప్పప్రాకారముతోను ఎంతయునొప్పుచుండును. అని, తాత్పర్యము.

తస్యాం వసతి వైదేహీ దీనా కౌశేయవాసినీ
రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా. ౨౨

టీక ॥ కౌశేయవాసినీ= పట్టుచీరఁగట్టిన; వైదేహీ=సీత; రావణాంతఃపురే=రావణుని యంతఃపురమునందు; రుద్ధా = అడ్డగింపఁబడినదై; రాక్షసీభిః=రాక్షసస్త్రీలచేత; సురక్షితా=చక్కఁగాఁగాపాడఁబడినదై; దీనా= దుఃఖితయయి; తస్యాం= ఆలంకాపురియందు; వసతి=ఉన్నది.

ఆ లంకాపురంబున, రావణునియంతఃపురంబున, సీతాదేవి, మున్నుగట్టిన పట్టుపుట్టముతోఁ, గావలియున్న రాక్షసస్త్రీలచే రక్షితయయి, పరమదుఃఖితయయియున్నది. అని, తాత్పర్యము.

జనకస్యాత్మజాం రాజ్ఞ స్తత్ర ద్రక్ష్యథ మైథిలీమ్

టీక ॥ రాజ్ఞః =రాజయిన; జనకస్య=జనకునియొక్క; ఆత్మజాం = కొమార్తెయయిన; మైథిలీం= సీతను; తత్ర=ఆలంకాపురమునందు; ద్రక్ష్యథ= చూడఁగలరు.

జనకమహారాజు కూఁతురయినయా సీతాదేవిని, మీరలా లంకాపురంబునఁ జూడఁగలరు. అని, తాత్పర్యము.

లంకాయా మథ గుప్తాయాం సాగరేణ సమంతతః. ౨౩
సంప్రాప్య సాగర స్యాంతం సంపూర్ణం శతయోజనమ్

ఆసాద్య దక్షిణం తీరం తతో ద్రక్ష్యథ రావణమ్. ౨౪

టీక ॥ అథ=ఇంక; సంపూర్ణం=నిండిన; శతయోజనం= నూఱుయోజనములుగల; సాగరస్య=సముద్రముయొక్క; అంతం=చివరను; సంప్రాప్య=పొంది; దక్షిణం= దక్షిణపుదిక్కునందున్నదైన; తీరం=గట్టును; ఆసాద్య=పొంది; తతః=అంత; సమంతతః= అంతటను; సాగరేణ=సముద్రముచేత; గుప్తాయాం = రక్షింపఁబడిన; లంకాయాం = లంకానగరమునందు; రావణం=రావణునిని; ద్రక్ష్యథ = చూడఁగలరు.

మీరలు, ఇంక, సరిగా నూఱుయోజనంబులదూరముగల యాసముద్రంబు దాఁటి దక్షిణతీరంబుఁజేరి, యంతటను సముద్రముచే సురక్షితమయిన యాలంకాపురంబుఁ బ్రవేశింతురేని,యచట, రావణునిం జూడఁగలరు.

అని, తాత్పర్యము.

తత్రైవ త్వరితాః క్షిప్రం విక్రమధ్వం ప్లవంగమాః
జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాగమిష్యథ. ౨౫

టీక॥ ప్లవంగమాః=వానరులారా! యూయం(అధ్యాహృతము)=మీరలు; త్వరితాః = వేగిరపడినవారలును; క్షిప్రం=శీఘ్రముగా; తత్రైవ= అచటికే; విక్రమధ్వం = పొండు. దృష్ట్వా=చూచి; ప్రత్యాగమిష్యథ= మఱలిరాఁగలరు. ఇతి(అధ్యాహృతము) = అని; జ్ఞానేన= దివ్యజ్ఞానముచేత; పశ్యామి ఖలు=చూచుచున్నానుగదా!

వానరులారా! మీరలు శీఘ్రముగా నా లంకాపురమునకె పొండు; మీరలు లంకాపురింజేరి, సుఖముగా సీతం జూచి మఱలిరాఁగలరని నేను, దివ్యజ్ఞానంబునం గంటిని. అని, తాత్పర్యము.

ఆద్యః పంథాః కులింగానాం యే చాన్యే ధాన్యజీవినః
ద్వితీయో బలిభోజానాం యే చ వృక్షఫలాశినః. ౨౬

టీక ॥ కులింగానాం = పిచ్చుకలకు ; ధాన్యజీవినః= ధాన్యముచేజీవించునట్టి; అన్యేచ = ఇతరపక్షులును; యే (సంతి) = ఏవిగలవో; తేషాంచ

...ధ్యాహృతము)= వానికిని; ఆద్యః= మొదటిదైన; పంథాః = మార్గము. బలిపుష్టానాం = కాకులకును; వృక్షఫలాశనాః = చెట్లయందలి ఫలములనుదినునట్టిపక్షులు; యే (సంతి) = ఏవిగలవో; తేషాం (అధ్యాహృతము)చ= వానికిని; ద్వితీయః=రెండవమార్గము.

పిచ్చుకలును, మఱియు ధాన్యములచేజీవించునట్టి యితరపక్షులును భూమికిసమీపంబుగా, ఆకాశంబున, మొదటి మార్గంబున సంచరించును; కాకులును ఫలములందిని జీవించునవియు, అప్పైదైన రెండవమార్గంబునం జరించును.

అని, తాత్పర్యము.

భాసా స్తృతీయం గచ్ఛంతి క్రౌంచాశ్చ కురరైస్సహ
శ్యేనా శ్చతుర్థం గచ్ఛంతి గృధ్రా గచ్ఛంతి పంచమమ్. ౨౭

టీక॥ భాసాః = నీరుకాకులును; క్రౌంచాశ్చ=క్రౌంచపక్షులును; కురరైస్సహ=లకుముకిపిట్టలతోను, లేక, గోరువంకలతోను; తృతీయం= మూఁడవమార్గమును; గచ్ఛంతి = పొందుచున్నవి. శ్యేనాః= డేగలు; చతుర్థం=నాలుగవమార్గమును; గచ్ఛంతి= పొందుచున్నవి. గృధ్రాః=గద్దలు; పంచమం=అయిదవమార్గమును; గచ్ఛంతి=పొందుచున్నవి.

నీరుకాకులును క్రౌంచంబులును లకుముకులును (గోరువంకలును) అంతకుంబయిగా మూడవమార్గమున సంచరించును; డేగలు, దానికిపైని నాలుగవమార్గంబునందిరుగును; గద్దలు అయిదవమార్గంబునం జరించును.

అని, తాత్పర్యము.

బలవీర్యోపపన్నానాం రూపయౌవనశాలినామ్
షష్ఠస్తు పంథా హంసానాం వైనతేయగతిః పరా. ౨౮

టీక॥ బలవీర్యోపపన్నానాం= బలముతోను పరాక్రమముతోను గూడినవియు; రూపయౌవనశాలినాం= సౌందర్యముచేతను యౌవనముచేతను ఒప్పునవియునగు; హంసానాంతు= అంచలకుమాత్రము; షష్ఠః= ఆఱవదైన; పంథాః=మార్గము. వైనతేయగతిః=వినతకొడుకులయిన అరుణ గరుడుల యొక్క గమనమార్గము; పరా = అంతకన్న గొప్పది.

బల పరాక్రమంబులతోఁ గూడినవియు రూపయౌవనసంపన్నంబులు నగు హంసలు, అంతకుఁబైగా నాఱవమార్గంబునం దిరుగును; వినతాపుత్త్రులకు అరుణ గరుడులవంశమునం బుట్టినవి అంత కన్నను ఊర్ధ్వమైన సప్తమ మార్గంబునం జరించును.

అని, తాత్పర్యము.

వైనతేయాచ్చ నో జన్మ సర్వేషాం వానరర్షభాః

టీక ॥ వానరర్షభాః=వానరోత్తములారా! వైనతేయాత్= అరుణునివలన; నః = మాయొక్క; సర్వేషాం= అందఱియొక్కయు;ఉత్పత్తిః=పుట్టుక; ఆసీత్(అధ్యాహృతము)=అయినది.

వానరోత్తములారా! నేనును, నా కులంబునం బుట్టినవారును, వినతాపుత్త్రుఁడగు నరుణునివలనం బుట్టినవారము; కావున మాకందఱకును సప్తమ మార్గము. అని, తాత్పర్యము.

ఇహస్థో హం ప్రపశ్యామి రావణం జానకీం తథా. ౨౯
అస్మాక మపి సౌపర్ణం దివ్యం చక్షు స్తథా బలమ్

టీక ॥ అహం=నేను; ఇహస్థః=ఇచటనున్నవాఁడనై; రావణం = రావణుని; తథా=అట్లు; జానకీం=సీతను; ప్రపశ్యామి= చక్కఁగాఁజూచుచున్నాను. అస్మాకం=మాకు; సౌపర్ణం=గరుడసంబంధియయిన; దివ్యం = ఉత్తమమయ్యున, లేక, దేవతాసంబంధియగు; చక్షురపి = నేత్రమును,దృష్టియునను; తథా=అట్లు; బలం=బలమును; స్తః (అధ్యాహృతము)=కలవు.

నేనిచటనుండియె,రావణునిసీతనుం జక్కఁగాఁ జూచుచున్నాను; ఎట్లనఁగా మాకు, గరుడునకుంబోలె దివ్యదృష్టియు మహాబలంబునుగలవు.

అని, తాత్పర్యము.

తస్మా దాహారవీర్యేణ నిసర్గేణచ వానరాః. ౩౦
ఆయోజనశతా త్సాగ్రా ద్వయం పశ్యామ నిత్యశః

టీక॥ వానరాః=వానరులారా! తస్మాత్=అందువలన; ఆహారవీర్యేణ = ఆహారముయొక్క బలముచేతను; నిసర్గేణచ=స్వభావముచేతను; వయం=

మేము; నిత్యశః = ఎల్లప్పుడును; సాగ్రాత్ = సమగ్రమయిన; శతయోజనశతాత్ = నూఱుయోజనములదూరము వఱకు; పశ్యామ=చూతుము.

వానరులారా! అట్లగుటంజేసి, ఆహారబలంబునను స్వభావ నిబంధనమయిన శక్తివిశేషమువలనను, మాకు ఎప్పుడును, సమగ్రముగా నూఱుయోజనములదూరమువఱకు దృష్టిగలదు.

అని, తాత్పర్యము.

అస్మాకం విహితా వృత్తి ర్నిసర్గేణచ దూరతః. ౩౧
విహితా పాదమూలేతు వృత్తి శ్చరణయోధినామ్

టీక ॥ అస్మాకం=మాకు; వృత్తిః= జీవనము; నిసర్గేణచ=స్వభావముచేతనే; దూరతః= దూరప్రదేశమునందు; విహితా= నియమింపఁబడినది. చరణయోధినాంతు = కోడులకు మాత్రము; వృత్తిః = జీవనము; పాదమూలే= పాదముల యడుగునందు; విహితా=నియమింపఁబడినది.

దైవముచే, కోళ్లకు పాదమూలమునందె భక్ష్యగ్రహణము విహితమయినట్లు, మాకుబహుదూరప్రదేశమునందు ఆహారము గ్రహించునట్లు విహితమయినది. అని, తాత్పర్యము.

గర్హితంతు కృతం కర్మ యేన స్మ పిశితాశినా. ౩౨
ప్రతికార్యంచ మే తస్య వైరం భ్రాతుః కృతం భవేత్

టీక ॥ యేన=ఏ; పిశితాశినా=రాక్షసునిచేతమాత్రము; గర్హితం= నిందితమయిన; కర్మ = సీతాపహరణరూపమయినకార్యము; కృతం = చేయఁబడినదో; మే=(మయా) నాచేత; తస్య = ఆరావణునకు; భ్రాతుః= తమ్మునినిమిత్తమయి; ప్రతికార్యం = బదులుచేయఁదగిన; వైరంచ= పగయు; కృతం = (బదులు) చేయఁబడినది; భవేత్=అగును.

సీతనపహరించి నిందితకర్మముగావించిన దురాత్ముండగు రావణుని మీఁదగనుంగొని యతని రామునిచే వధింపించుటవలన, నేను నాతమ్ముని నిమిత్తమయి యారావణునకుఁ జేయవలసిన ప్రతిక్రియయుఁ జేసినట్లగును.

అని, తాత్పర్యము.

ఉపాయో దృశ్యతాం కశ్చి ల్లంఘనే లవణాంభసః. ౩౩
అభిగమ్యతు వైదేహీం సమృద్ధార్థా గమిష్యథ

టీక॥ లవణాంభసః = సముద్రము యొక్క; లంఘనే=దాఁటుటయందు; కశ్చిత్=ఒకానొక; ఉపాయః=వెరవు; దృశ్యతాం= చూడఁబడుఁగాక. యూయం(అధ్యాహృతము)=మీరలు; వైదేహీం=సీతను; అభిగమ్యతు = పొంది యు; సమృద్ధార్థాః=ఈడేఱినప్రయో జనము గలవారలయి; గమిష్యథ= పోఁగలరు.

సముద్రము దాఁటుటకు ఉపాయమే మైనను జూడుఁడు; మీరు సీతం జూచి, యిష్టార్థసిద్ధినొందినవారలై సుఖముగాఁగిష్కింధఁ జేరఁగలరు. అని, తాత్పర్యము.

సముద్రం నేతు మిచ్ఛామి భవద్భి ర్వరుణాలయమ్. ౩౪
ప్రదాస్యా మ్యుదకం భ్రాతు స్స్వర్గతస్య మహాత్మనః

టీక॥ భవద్భిః=మీచేత; మాం(అధ్యాహృతము) = నన్ను; వరుణాలయం = వరుణునిస్థానమయిన; సముద్రం=సముద్రమును; నేతుం= పొందించుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. స్వర్గతస్య = స్వర్గమునొందిన; మహాత్మనః= పూజ్యమయినస్వభావముగల; భ్రాతుః=తమ్మునకు; ఉదకం=జలమును; ప్రదాస్యామి= ఇచ్చెదను.

స్వర్గముఁ జేరిన మహాత్ముండగు తమ్ముఁడు జటాయువునకు జలతర్పణము గావించెదను; అందుకు, మీరు నన్ను సముద్రము నొద్దకుఁ దీసికొని పోఁగోరెదను. అని, సంపాతివానరులతోఁ బలికెను. అని, తాత్పర్యము.

తతో నీత్వాతు తం దేశం తీరం నదనదీపతేః. ౩౫
నిర్దగ్ధపక్షం సంపాతిం వానరా స్సుమహౌజసః
పునః ప్రత్యానయిత్వాచ తం దేశం పతగేశ్వరమ్. ౩౬
బభూవు ర్వానరా హృష్టాః ప్రవృత్తి ముపలభ్య తే

టీక॥ తతః = అంత; సుమహౌజసః= మిక్కిలియు నధికమయినపరాక్ర

ముఖములు గలవారును; వానరాః=వానరులు; నిర్దగ్ధపక్షం = దహింపఁబడిన ఱెక్కలుగలవాఁడును; పతగేశ్వరం= పక్షిరాజునగు; సంపాతిం=సంపాతిని; నదనదీపతేః= సముద్రముయొక్క; తీరం=గట్టుయిన; తం=ఆ; దేశం=ప్రదేశమును;నీత్వాపు= పొందించియు; తం=ఆ; దేశం=పర్వతప్రదేశమును;పునః = మరల;ప్రత్యానయిత్వాచ(ప్రత్యానీయ)= పొందించియు; తే=ఆ; వానరాః=వానరులు; ప్రవృత్తిం=సమాచారమును; ఉపలభ్య=పొంది; హృష్టాః = సంతోషించినవారలు; బభూవుః=అయిరి.

అంత, మహాపరాక్రమశాలులగు నవ్వానరులు, ఱెక్కలుకాలినవగుటవలన నశక్తుండగు పక్షిరాజును సంపాతిని, సముద్రతీరంబుఁ జేర్చి, యచట నతంఛు తమ్ము నకుదకదానంబు గావించి పిదప, మరల నెప్పటిస్థలంబున కుఁదీసికొనిపోయి, సీతయొక్కయు రావణుని యొక్కయు సమాచారమును విన్నవారలగుటంజేసి, సంతోషంబునం బొదలిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, అష్టపంచాశస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండాష్టపంచాశసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ

ఏకోనషష్టితమసర్గప్రారంభః.

తత స్తదమృతాస్వాదం గృధ్రరాజేన భాషితమ్
నిశమ్య ముదితా హృష్టా స్తే వచః ప్లవగర్షభాః. ౧

టీక ॥ తతః=అంత; తే=ఆ;ప్లవంగమాః = వానరులు; గృధ్రరాజేన= సంపాతిచేతను; భాషితం=చెప్పఁబడిన; అమృతాస్వాదం= అమృతముయొక్క

స ౫౯

రుచివంటిరుచిగల; తత్=ఆ; వచః= మాటను; నిశమ్య=విని; ముదితాః = సంతుష్టులయి; హృష్టాః= గగుర్పుగొన్నవారలు; అభూవన్ (అభ్యాహృతము)=అయిరి.

అంత, వానరులు, ఆ సంపాతి చెప్పిన యమృతంబువంటి మాటలవిని, మేనం బులకలెత్తుచుండ నమ పరమ సంతుష్టులయిరి. అని, తాత్పర్యము.

జాంబవా న్వానరశ్రేష్ఠ స్సహ సర్వైః ప్లవంగమైః
భూతలా త్సహ సోత్థాయ గృధ్రరాజ మథా బ్రవీత్. ౨

టీక ॥ అథ=అంత; వానరశ్రేష్ఠః= వానరోత్తముడగు; జాంబవాన్ = జాంబవ [illegible]; ప్లవంగమైః =వానరులతోఁ; సర్వైః [illegible] అందఱితోను౦ గూడ; సహసా= శీఘ్రమున; భూతలాత్=నేలపైనుండి; ఉత్థాయ=లేచి; గృధ్రరాజం=సంపాతిని; అబ్రవీత్ = పలికెను.

అంత, వానరోత్తముండగు జాంబవంతుఁడు సమస్తవానరులతోఁగూడ, భూమిపయినుండి లేచి, సంపాతింజూచి యిట్లనియడిగెను. అని, తాత్పర్యము.

క్వ సీతా కేనవా దృష్టా కోవా హరతి మైథిలీమ్
తదా ఖ్యాతు భవా న్సర్వం గతి ర్భవ వనౌకసామ్. ౩

టీక॥ సీతా=సీత; క్వ=ఎక్కడ? కేనవా=ఎవ్వనిచేత; దృష్టా=చూడబడినది? మైథిలీం = సీతను; కోవా=ఎవ్వఁడు; హరతి = హరించుచుండెను? భవాన్=నీవు; తత్=దానిని; సర్వం=సమస్తమును; ఆఖ్యాతు=చెప్పుము. వనౌకసాం=వానరులకు; గతిః = ఆశ్రయము; భవ=అగుము.

సీత యెక్కడ నున్నది? సీతనెవ్వఁడు హరించుకొనిపోఁగా నెవ్వఁడు చూచెను? నీవు, ఈవివరమంతయుఁ దెలియఁ జెప్పుము; వానరులకుసీ వగతివి.

అని, తాత్పర్యము.

కో దాశరథిబాణానాం వజ్రవేగనిపాతినామ్
స్వయం లక్ష్మణముక్తానాం నచింతయతి విక్రమమ్. ౪

టీక॥ కః=ఎవ్వఁడు; వజ్రవేగనిపాతినాం=వజ్రముయొక్క వేగమువంటి వేగముచేతఁబడునట్టి; దాశరథిబాణానాం= రామునిబాణములయొక్కయు; స్వయంలక్ష్మణముక్తానాం=సాక్షాత్లక్ష్మణునిచే విడువఁబడిన బాణములయొక్కయు; విక్రమం= పరాక్రమమును; నచింతయతి = తలంపకున్నాఁడు?

వజ్రసమానంబులగు రాముని బాణముల వాడిమిని సాక్షాల్లక్ష్మణుండు ప్రయోగించుబాణంబుల తీక్ష్ణతయు నెవ్వఁడు మనంబునం దలంపకున్నాఁడు? అని, జాంబవంతుఁడు సంపాతినడిగెను. అని, తాత్పర్యము.

స హరీ న్ప్రీతి సంయుక్తా న్సీతాశ్రుతిసమాహితాన్
పున రాశ్వాసయ న్ప్రీత ఇదం వచన మబ్రవీత్. ౫

టీక॥ సః=ఆసంపాతి; ప్రీతః=సంతుష్టుఁడై; ప్రీతిసంయుక్తాన్= సంతోషముతోఁగూడినవారలును; సీతాశ్రుతిసమాహితాన్=సీతనువినుటయందు ఏకాగ్రతగలవారలునగు; హరీన్=వానరులను; పునః=మరల; ఆశ్వాసయన్=ఊఱడించువాఁడై; ఇదం=ఈ; వచనం=మాటను; అబ్రవీత్=పలికెను.

వానరులు, సీతావృత్తాంతము వినుటయందు ఏకాగ్రులై సంతుష్టులై యుడుగుటనుజూచి, సంపాతి సంతుష్టుఁడై, మఱల వారలనాశ్వాసించుటకై, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

శ్రూయతా మిహ వైదేహ్యా యథా మే హరణం శ్రుతమ్
యేనచాపి మమాఖ్యాతం యత్రవా యతలోచనా. ౬

టీక॥ యథా=ఎట్లు; మే= నాకు, నాచేతననుట; వైదేహ్యాః = సీతయొక్క; హరణం=హరించుట; శ్రుతం=వినఁబడినదో; యేనచాపి=ఎవ్వనిచేతనుగూడ; మమ=నాకు; ఆఖ్యాతం = చెప్పఁబడినదో; ఆయతలోచనా = దీర్ఘములయినకన్నులుగలసీత; యత్రవా=ఎచ్చటనో; ఇహ = ఇప్పుడు; శ్రూయతాం=వినఁబడుఁగాక.

సీతను రావణుండుహరించుటను నేనువిన్నవిధంబును, ఎవ్వఁడునాకుఁజెప్పినదియు, సీతాదేవి యిపుడెచటనున్నదియు, అంతయు నిపుడు చెప్పెదవినుండు. అని, తాత్పర్యము.

అహ మస్మిన్ గిరౌ దుర్గే బహుయోజన మాయతే
చిరా న్నిపతితో వృద్ధః క్షీణప్రాణపరాక్రమః. ౭

టీక॥ అహం=నేను; బహుయోజనః=పెక్కు-యోజనములు; ఆయతే=విశాలమయిన; దుర్గే=ప్రవేశింపనశక్యమయిన; అస్మిన్=ఈ; గిరౌ=పర్వతమునందు; పతితః = పడినవాఁడనై; చిరాత్=బహుకాలముగా; క్షీణప్రాణపరాక్రమః=నశించినబలమును పరాక్రమమునుగలవాఁడనై; వృద్ధః=ముసలివాఁడను; అస్మి (అధ్యాహృతము)= అయితిని.

నేను, బహుయోజనములవై శాల్యముగల దుర్గమంబగు నీపర్వతంబునంబడి యిచటనే బహుకాలముగా బలపరాక్రమహీనుండనైయుండి వృద్ధుండనైతిని. అని, తాత్పర్యము.

తం మా మేవంగతం పుత్త్రః సుపార్శ్వో నామ నామతః
ఆహారేణ యథాకాలం బిభర్తి పతతాం వరః. ౮

టీక॥ పతతాం=పక్షులలో; వరః=శ్రేష్ఠుఁడగు; నామతః = పేరువలన; సుపార్శ్వో నామ=సుపార్శ్వుఁడనిప్రసిద్ధుఁడయిన; పుత్త్రః = కొడుకు; ఏవంగతం=ఇట్టియవస్థనుబొందిన; తం=అట్టి; మాం = నన్ను; యథాకాలం=కాలమునతిక్రమింపక; ఆహారేణ= ఆహారముచేత; బిభర్తి = పోషించుచున్నాఁడు.

నేనిట్టియవస్థనొందుటవలన, పక్షిశ్రేష్ఠుండగునాకొడుకు సుపార్శ్వుఁడనువాఁడు, నాకుఁ, గాలంబుదప్పక, ఆహారంబుఁదెచ్చియిచ్చి, పోషణము సేయుచుండును. అని, తాత్పర్యము.

తీక్ష్ణకామా స్తు గంధర్వా స్తీక్ష్ణకోపా భుజంగమాః
మృగాణాంతు భయం తీక్ష్ణం తత స్తీక్ష్ణక్షుధా వయమ్. ౯

టీక॥ గంధర్వాస్తు=గంధర్వులో; తీక్ష్ణకామాః=చురుకైన కామముగలవారలు, అధికమయిన కామముగలవారలనుట. భుజంగమాః = సర్పములు; తీక్ష్ణకోపాః= అధికమయినకోపముగలవి. మృగాణాంతు = మృగములలో;

భయం=వెఱపు; తీక్ష్ణం=అధికమయిన ది. తతః=అంతకన్న; వయం=మేము; తీక్ష్ణక్షుధాః = అధికమయిన ఆఁకలి గలవారము.

గంధర్వులకుఁ గామమధికము; సర్పములకుఁ గోపమధికము; మృగములకు భయమధికము; మాకో, ఆఁకలియధికము. అని, తాత్పర్యము.

స కదాచిత్ క్షుధార్తస్య మ మాహారాభికాంక్షిణః
గతసూర్యే హని ప్రాప్తో మమ పుత్త్రో హ్యనామిషః. ౧౦

టీక॥ సః=ఆ; మమ=నాయొక్క; పుత్త్రః=కొడుకు; కదాచిత్=ఒకానొకప్పుడు; గతసూర్యే=పోయినసూర్యుఁడుగల; అహని = ప్రొద్దునందు; క్షుధార్తస్య=ఆఁకలిచేఁ బీడింపఁబడినవాఁడను; అహారాభికాంక్షిణః = ఆహారముఁ గోరుచున్నవాఁడనగు; మమ=నాయొక్క; సమీపం(అధ్యాహృతము) = సమీపమును; అనామిషః = మాంసముతేనివాఁడై; ప్రాప్తోహి = పొందినాఁడుగదా!

నాకొడుకు సుపార్శ్వుండు, ఒకప్పుడు, నేను మిక్కిలి యాఁకలిచేఁ బరితపించుచు నాహారమునకై కాచియుండఁగా, సూర్యుం డస్తమించినవెనుక, మాంసము లేకయె వట్టిచేతులతో నాయొద్దకువచ్చెను. అని, తాత్పర్యము.

స మయా వృద్ధభావా చ్చ కోపా చ్చ పరిభర్త్సితః
క్షుత్పిపాసాపరీతేన కుమారః పతతాం వరః. ౧౧

టీక॥ పతతాం=పక్షులలోపల; వరః=శ్రేష్ఠుఁడగు; సః=ఆ; కుమారః=కొడుకు; క్షుత్పిపాసాపరీతేన=ఆఁకలిచేతను దప్పిచేతనువ్యాపింపఁబడిన; మయా=నాచేత; వృద్ధభావాత్=ముసలితనమువలనను; కోపాచ్చ=కోపమువలనను; పరిభర్త్సితః = కసరఁబడినాఁడు.

నేను ఆఁకలిచేతను దప్పిచేతను బీడితుండను ముసలివాఁడనగుటవలనఁ గుపితుండనై పక్షిశ్రేష్ఠుఁడనగు నాకుమారునింగసరితిని. అని, తాత్పర్యము.

స మా మాహారసంరోధా త్పీడితం ప్రీతివర్ధనః

అనుమాన్య యథాతత్త్వ మిదం వచన మబ్రవీత్. ౧౨

టీక ॥ ప్రీతివర్ధనః= సంతోషమును వృద్ధిఁబొందించునట్టి; సః = ఆసుపార్శ్వుఁడు; ఆహారసంరోధాత్=ఆహారముయొక్క అభావమువలన; పీడితం=పీడింపఁబడిన; మాం=నన్ను; అనుమాన్య=సమ్మతింపఁజేసి; యథాతత్త్వం= యథార్థమునతిక్రమింపక; ఇదం=ఈ; వచనం= మాటను; అబ్రవీత్=పలికెను.

నాకు ఎప్పుడును సంతోషము గలిగించునట్టి యా సుపార్శ్వుండును, ఆహారంబులేమిచేఁ గుపితుండనగు నన్ను ఆశ్వాసించి యథార్థముగా జరిగినసంగతిం జెప్పెను. అని, తాత్పర్యము.

అహం తాత యథాకాల మామిషార్థీ ఖ మాప్లుతః
మహేంద్రస్య గిరే ర్ద్వార మావృత్య చ సమాస్థితః. ౧౩

టీక ॥ తాత=నాయనా! అహం= నేను; యథాకాలం = కాలమునతిక్రమింపక; ఆమిషార్థీ=మాంసముఁగోరినవాఁడనై; ఖం=ఆ ఆకాశమునుగూర్చి; ఆప్లుతః = ఎగిరినవాఁడనై; మహేంద్రస్య=మహేంద్రమను; గిరేః= పర్వతముయొక్క; ద్వారం=వాకిలిని; ఆవృత్య=అడ్డగించి; సమాస్థితశ్చ= నిలిచినాను.

నాయనా! నేను, ఎప్పటివలెను బోవునట్లు యుక్తకాలంబున మాంసమునకై యాకాశంబున నెగసిపోయి, మహేంద్ర పర్వతద్వారము నాక్రమించియుంటిని. అని, తాత్పర్యము.

తత స్సత్త్వసహస్రాణాం సాగరాంతరచారిణామ్
పంథాన మేకో ధ్యవసం సన్నిరోద్ధు మవాఙ్ముఖః. ౧౪

టీక ॥ తతః = అచట; అహం (అధ్యాహృతము) = నేను; ఏకః=ఒకఁడను; అవాఙ్ముఖః = వంగినముఖముగలవాఁడనై; సాగరాంతరచారిణాం= సముద్రమధ్యమునందిరుగునట్టి; సత్త్వసహస్రాణాం = జంతువులయొక్క వేలయొక్క; పంథానం = మార్గమును; సన్నిరోద్ధుం= అడ్డగించుటకు; అధ్యవసం = ఉంటిని.

అచట, సముద్రంబుననుండు జంతుసహ

స్రంబులంబట్టుటకై నేను దలవంచివానిమార్గమునకడ్డముగా నిలిచితిని. అని, తా.

తత్ర కశ్చి న్మయా దృష్ట స్సూర్యోదయసమప్రభామ్
స్త్రియ మాదాయ గచ్ఛ న్వై భిన్నాంజనచయప్రభః. ౧౫

టీక॥ తత్ర=అచట; సూర్యోదయసమప్రభాం=సూర్యోదయముతో సమానమయినకాంతిగల; స్త్రియం=స్త్రీని; ఆదాయ=తీసికొని; గచ్ఛన్=పోవుచున్న ("వై" అననది పాదపూరణార్థము); భిన్నాంజనచయప్రభః= విఱిగిన కాటుకరాశియొక్క కాంతివంటి కాంతిగల; కశ్చిత్=ఒకానొకఁడు; మయా=నాచేత; దృష్టః=చూడఁబడినాఁడు.

అచట, కాటుకరాశివలెనల్లనిమేనుగల యొకానొకఁడు, సూర్యోదయమువలె భాసమానయగు నొకానొకవనితం దీసికొనిపోవుటను జూచినాను.

అని, తాత్పర్యము.

సో౽హ మభ్యవహారార్థీ తౌ దృష్ట్వా కృతనిశ్చయః
తేన సామ్నా వినీతేన పంథాన మభియాచితః. ౧౬

టీక॥ అభ్యవహారార్థీ = ఆహారముఁగోరునట్టి; సః=అట్టి; అహం=నేను; తౌ=వారలను; దృష్ట్వా= చూచి; కృతనిశ్చయః = చేయఁబడిన నిశ్చయముగలవాఁడను. వినీతేన= వినయముతోఁగూడిన; తేన = ఆపురుషునిచేత; సామ్నా = మంచిమాటచేత; పంథానం = మార్గమును; అభియాచితః = అడుగఁబడినాను.

నేనాహారముఁ గోరినవాఁడనుగావున నాస్త్రీపురుషులఁజూచి వారినే యాహారముగా గ్రహింపనిశ్చయించితిని; ఇంతలో నాపురుషుండు, వినయంబున సామవచనంబులతో నన్ను "మార్గంబువిడువు" మనియాచించెను.

అని, తాత్పర్యము.

న హి సామోపపన్నానాం ప్రహర్తా విద్యతే క్వచిత్
నీచేష్వపి జనః కశ్చి త్కి మంగ బత మద్విధః. ౧౭

టీక॥ సామోపపన్నానాం = మంచితనముతోఁ గూడినవారియొక్క; ప్రహర్తా=కొట్టువాఁడు; క్వచిత్=ఎందును; నీచేష్వపి=నీచులయందుఁగూడ; క

స ౪౯

శ్చిత్=ఒకానొక; జనః=మనుష్యుఁడు; నవిద్యతేహి=లేఁడుగదా! అంగ=అయ్యా! మద్విధః=నాయట్టివాఁడు; న ప్రహర్తేతి (అధ్యాహృతము)=ప్రహరింపఁడని; కిం(వక్తవ్యం)=చెప్పఁబడవలయునాయేమి? బత=ఆశ్చర్యము!

వినయసంపన్నులను ఎవ్వరు ప్రహరింతురు? నీచులుగూడఁ బ్రహరింపరు; ఇఁక నాయట్టివాఁడు ప్రహరింపఁడని చెప్పనేల? అని, తాత్పర్యము.

స యాత స్తేజసా వ్యోమ సంక్షిపన్నివ వేగతః
అథా హం ఖచరై ర్భూతై రభిగమ్య సభాజితః. ౧౮

టీక॥ సః=ఆపురుషుఁడు; తేజసా=కాంతిచేత; వ్యోమ = ఆకాశమును; సంక్షిపన్నివ= వేఱుపఱుచువాఁడువలె; వేగతః = వేగమువలన; యాతః=పోయెను. అథ=అంత; అహం=నేను; ఖచరైః = ఆకాశమునందిరుగునట్టి; భూతైః = భూతములచేత; అభిగమ్య = సమీపించి; సభాజితః= పూజింపఁబడినాను.

అమ్మహాపురుషుఁడు, తేజోవిశేషంబున నాకాశంబుభేదించువాఁడువలె వేగంబునంబోయెను; అంత, నాకాశచరంబులగు భూతంబులు నాయొద్దకువచ్చి నన్నుగౌరవించినవి.

అని, తాత్పర్యము.

దిష్ట్యా జీవసి తాతే తి హ్యబ్రువ న్మాం మహర్షయః
కథంచి త్సకళత్రో సౌ గత స్తే స్వస్త్య సంశయమ్. ౧౯

టీక॥ "తాత=నాయనా! దిష్ట్యా=భాగ్యముచేత; జీవసి=బ్రతికియున్నావు. అసౌ=ఈతఁడు; సకళత్రః=భార్యతోఁగూడినవాఁడై, స్త్రీతోఁ గూడినవాఁడై; కథంచిత్=ఎట్లయినను; గతః=పోయినాఁడు. అసంశయం= నిస్సందేహముగా; తే=నీకు; స్వస్తి = మంగళము; అస్తి(అధ్యాహృతము)=కలదు." ఇతి=అని; మహర్షయః= పూజ్యులయిన ఋషులు; మాం=నన్నుఁగూర్చి; అబ్రువన్=పలికిరి.

నాయనా! నీవు దైవవశంబునఁ దప్పించుకొనిబ్రతికితివి; ఎట్లో యీతఁడు స్త్రీసహితుండై నిన్నువదలిపోయినాఁడు; నీకు మంచిగలిగినది; సందేహము లేదు" అని, మహర్షులు నాతోఁబలికిరి.

అని, తాత్పర్యము.

ఏవ ముక్త స్తతో హం తై స్సిద్ధైః పరమశోభనైః

టీక ॥ తతః=అటుపిమ్మట; అహం=నేను; పరమశోభనైః = నిక్కిలిమంగళస్వరూపులగు; తైః=ఆ; సిద్ధైః=సిద్ధులచేత; ఏవం=ఇట్లు; ఉక్తః= చెప్పఁబడినాను.

అంత, మహానుభావులగు నాసిద్ధులు నాతో నివ్విధంబునంబలికిరి. అని, తాత్పర్యము.

సచ మే రావణో రాజా రక్షసాం ప్రతివేదితః. ౨౦
హరన్ దాశరథే ర్భార్యాం రామస్య జనకాత్మజామ్
భ్రష్టాభరణకౌశేయాం శోకవేగపరాజితామ్. ౨౧
రామలక్ష్మణయో ర్నామ క్రోశంతీం ముక్తమూర్ధజామ్

టీక॥ సః=ఆపురుషుఁడును; దాశరథేః=దశరథపుత్త్రుఁడగు; రామస్య=రామునియొక్క; భార్యాం = పెండ్లామును; భ్రష్టాభరణకౌశేయాం= జాఱినసొమ్ములును బట్టువస్త్రమును గలదియు; శోకవేగపరాజితాం=దుఃఖముయొక్క వేగముచేత లోఁగొనఁబడినదియు; రామలక్ష్మణయోః=రామునియొక్కయు లక్ష్మణునియొక్కయు; నామ=పేరును; క్రోశంతీం=అఱచుచున్నదియు; ముక్తమూర్ధజాం=విడువఁబడిన వెండ్రుకలుగలదియునగు; జనకాత్మజాం=సీతను; హరన్=అపహరించుచున్న; రక్షసాం=రక్కసులయొక్క; రాజా=ఱేఁడయిన; రావణః=రావణుఁడుగా; మే=(మయా)నాచేత; ప్రతివేదితః=తెలియఁబడినాఁడు.

ఆపురుషుండు, రాక్షసరాజైనరావణుండనియు, నేలంబడుచున్నయాభరణంబులతోను జాఱినపట్టుపుట్టంబుతోను విరిసినవెండ్రుకలతోను బహుదుఃఖితురాలయి రామలక్ష్మణులం జీరుకొనుచున్న యాస్త్రీ రామభార్యయగుసీతాదేవియనియు, నతం డాబిడను హరించుకొనిపోవుచున్నాఁడనియు, నాకుఁబిమ్మటఁదెలిసినది. అని, తాత్పర్యము.

ఏష కాలాత్యయ స్తావ దితి కాలవిదాం వరః. ౨౨
ఏత మర్థం సమగ్రం మే సుపార్శ్వః ప్రత్యవేదయత్

టీక ॥ ఏషః = ఈరావణుఁడు; కాలాత్యయః = కాలమునతిక్రమింపఁ జే

సినవాఁడు ("తావత్" అనునది వాక్యాలంకారార్థము). ఇతి = అని; కాలవిదాం = కాలముఁదెలిసినవారలలో; వరః=శ్రేష్ఠుఁడగు; సుపార్శ్వః= సుపార్శ్వుఁడు; ఏతం=ఈ; అర్థం = సమాచారమును; మే=నాకు; సమగ్రం = సంపూర్ణముగా; ప్రత్యవేదయత్=తెలిపెను.

రావణునివలన, ఇంతప్రొద్దయినది; అని, యీసమాచారమంతయు, కాలముఁ దెలిసినవారిలో నుత్తముఁడగుసుపార్శ్వుండు నాకుఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తచ్ఛ్రుత్వాపి హి మే బుద్ధి ర్నాసీ త్కాచి త్పరాక్రమే. ౨౩
అపక్షో హి కథం పక్షీ కర్మ కించి దుపక్రమే

టీక ॥ తత్=దాని; శ్రుత్వాపి=వినియు; మే=నాకు; పరాక్రమే = పరాక్రమించుటయందు; కాచిత్= ఒకానొక; బుద్ధిః = తలంపును; నాసీత్ హి = కలుగలేదుగదా! అపక్షః= ఱెక్కలులేని; పక్షీ=పక్షినగు; అహం(అధ్యాహృతము) = నేను; కించిత్=ఒకానొక; కర్మ = కార్యమును; కథం హి=ఎట్లు; ఉపక్రమే = ప్రారంభింతును?

ఆసమాచారము విన్నప్పటికిని, నేనుగొంచెమైనను రామునినిమిత్తమయి పరాక్రమముసేయుటకు లేకపోయెను; నేను ఱెక్కలుపోయినపక్షినై; ఏకార్యమునేని నేనెట్లుసేయఁగలను?

అని, తాత్పర్యము.

యత్తు శక్యం మయా కర్తుం వాగ్బుద్ధిగుణవర్తినా. ౨౪
శ్రూయతాం తత్ప్రవక్ష్యామి భవతాం పౌరుషాశ్రయమ్

టీక ॥ వాగ్బుద్ధిగుణవర్తినా= వాక్కుయొక్కయు బుద్ధియొక్కయు గుణమునందున్నట్టి; మయా= నాచేత; కర్తుం=చేయుటకు; యత్తు= ఏదైతే; శక్యం=అలవియగునో; భవతాం=మీయొక్క; పౌరుషాశ్రయం= పరాక్రమము అవలంబముగాఁగల; తత్=దాని; ప్రవక్ష్యామి=చెప్పెదను. శ్రూయతాం=వినఁబడుఁగాక.

నాకువాక్కును బుద్ధియుఁజక్కగానున్నవికావున, నేను వానిచేనెంతమాత్రము సాహాయ్యముచేయఁగలనో అ

దిచెప్పెద, పిని మీ పరాక్రమబలంబున సాధింపుఁడు. అని, తాత్పర్యము.

వాఙ్మతిభ్యాంతు సర్వేషాం కరిష్యామి ప్రియం హి వః. ౨౫
యద్ధి దాశరథేః కార్యం మమ తన్నాత్ర సంశయః

టీక॥ వః=మీకు; సర్వేషాం=అందఱకును; వాఙ్మతిభ్యాంతు= మాటచేతను బుద్ధిచేతనుమాత్రము; ప్రియం=సంతోషమును; కరిష్యామిహి=చేసెదను గదా! యత్=ఏది; దాశరథేః=రాముని యొక్క; కార్యం=పనియో; తత్= అది; మమ=నాయొక్క; కార్యం(అధ్యాహృతము) హి=పనిగదా! అత్ర= ఇందు; సంశయః = సందేహము; న= లేదు.

నేను మాటచేతను బుద్ధిచేతను మీకందఱకు సాహాయ్యముగావించెదను; రాముని కార్యము నాకార్యమే గాని వేఱు గాదు; ఇందు సంశయము లేదు. అని, తా.

తే భవంతో మతిశ్రేష్ఠా బలవంతో మనస్వినః. ౨౬
ప్రేషితాః కపిరాజేన దేవైరపి దురాసదాః

టీక॥ మతిశ్రేష్ఠాః=బుద్ధిచేనుత్తములును; బలవంతః=అధికమయినబలముగలవారలును; మనస్వినః = గొప్ప మనస్సుగలవారలును; దేవైరపి=దేవతలచేతను; దురాసదాః= సమీపింపనలవిగానివారలునగు; తే=అట్టి; భవంతః=మీరలు; కపిరాజేన= వానరరాజయినసుగ్రీవునిచేత; ప్రేషితాః=పంపఁబడినారు.

వానరరాజు సుగ్రీవుండు, బుద్ధిమంతులును బలవంతులును గొప్పమనస్సుగలవారలగు మిమ్ముఁ బంపినాఁడే వ్యర్థులఁబంపినవాఁడు కాఁడు.

అని, తాత్పర్యము.

రామలక్ష్మణబాణాశ్చ నిశితాః కంకపత్రిణః. ౨౭
త్రయాణా మపి లోకానాం పర్యాప్తా స్త్రాణనిగ్రహే

టీక ॥ నిశితాః=తీక్ష్ణంబులును; కంకపత్రిణః= కంకపక్షియొక్క ఱెక్కలుగలవియునగు; రామలక్ష్మణబాణాశ్చ=రామలక్ష్మణులబాణములును; త్రయాణాం= మూఁడైన; లోకానామపి= లోకములయొక్కయు; త్రాణని

గ్రహే=రక్షించుటయందును శిక్షించుటయందును; పర్యాప్తాః=చాలినవి.

తీక్ష్ణంబులును గంకపక్షంబులు గట్టినవియునగు రామలక్ష్మణుల బాణంబులే, ముల్లోకంబుల రక్షింపను శిక్షింపనుంజాలియున్నవి. అని, తాత్పర్యము.

కామంఖలు దశగ్రీవ స్తేజోబలసమన్వితః. ౨౮
భవతాంతు సమర్థానాం న కించిదపి దుష్కరమ్

టీక ॥ దశగ్రీవః=రావణుఁడు; తేజోబలసమన్వితః కామంఖలు=పరాక్రమముతోను బలముతోను గూడినవాఁడు సరేగదా! సమర్థానాం= శక్తులరగు; భవతాంతు=మీకుమాత్రము; దుష్కరం=చేయనలవిగానిది; కించిదపి=కొంచెమయినను; న=లేదు.

రావణుఁడేమో, బల పరాక్రమముల నధికుఁడనుటవాస్తవమే; అయినను, మీరు సమర్థులరుగావున, మీకసాధ్యము కొంచెమయినను లేదు. అని, తాత్పర్యము.

త దలం కాలసంగేన క్రియతాం బుద్ధినిశ్చయః. ౨౯
న హి కర్మసు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః

టీక ॥ తత్ = అందువలన; కాలసంగేన= కాలవిలంబముచేత; అలం= చాలును. బుద్ధినిశ్చయః = తలంపుయొక్క-యేర్పాటు; క్రియతాం = చేయఁబడుఁగాక. బుద్ధిమంతః = అధికమయినబుద్ధిగల; భవద్విధాః = మీయట్టివారలు; కర్మసు = కార్యములయందు; న సజ్జంతేహి=ఆలస్యము నేయరుగదా!

అందువలన, ఆలస్యము సేయవలదు; బుద్ధిమంతులరగు మీయట్టివారలు, కార్యములువచ్చినపుడు ఎంతమాత్రము జాగు సేయుదురా? అని, సంపాతివానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ఏకోనషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండైకోనషష్టితమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

షష్టితమసర్గప్రారంభః.

తతః కృతోదకం స్నాతం తం గృధ్రం హరియూధపాః
ఉపవిష్టా గిరౌ దుర్గే పరివార్య సమంతతః. ౧

టీక॥ ॥ తతః= అటుపిమ్మట; హరియూధపాః = వానరసమూహమును బాలించునట్టివానరులు; కృతోదకం = చేయఁబడిన జలతర్పణము గలవాఁడును; స్నాతం= స్నానముచేసినవాఁడునగు; తం=ఆ; గృధ్రం=సంపాతిని; సమంతతః=అంతటను; పరివార్య= చుట్టి; దుర్గే=ప్రవేశింపనశక్యమయిన; గిరౌ = పర్వతమునందు; ఉపవిష్టాః= కూర్చుండిరి.

అంత, సంపాతి తమ్మునకు జటాయువునకు నుదకదానంబు గావించిస్నానంబుచేసినపిమ్మట, వానరవీరులు, అప్పర్వతంబునందు, ఆతనిం బరివేష్టించి కూర్చిండిరి. అని, తాత్పర్యము.

తమంగద ముపాసీనం తైస్సర్వై ర్హరిభి ర్వృతమ్
జనితప్రత్యయో హర్షా త్సంపాతిః పున రబ్రవీత్. ౨

టీక॥ సంపాతిః=సంపాతి; తైః=ఆ; వానరైః=వానరులచేత; సర్వైః= అందఱిచేతను; వృతం=చుట్టఁబడినవాఁడును; ఉపాసీనం = సమీపమునందుఁ గూర్చుండినవాఁడునగు; తం=ఆ;అంగదం=అంగదునిగూర్చి;జనితప్రత్యయః= పుట్టింపఁబడిన నమ్మకము గలవాఁడై; హర్షాత్=సంతోషమువలన;పునః=మఱల; అబ్రవీత్=పలికెను.

సమస్తవానరులును బరివేష్టింపఁదనసమీపంబునఁగూర్చుండిన యంగదుం జూచి, సంపాతి, వానరులు మఱిమఱి తనమాటను శ్రద్ధతో వినుటకు సంతుష్టుండై, మఱల నిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

కృత్వా నిశ్శబ్ద మేకాగ్రాః శృణ్వంతు హరయో మమ

స ౬౦

తత్త్వం సంకీర్తయిష్యామి యథా జానామి మైథిలీమ్. ౩

టీక ॥ హరయః=వానరులు; నిశ్శబ్దం=సద్దు లేకుండునట్లు; కృత్వా= చేసి; ఏకాగ్రాః=ఒకటఁజెల్లినమనస్సుగలవారలయి; మమ=నాయొక్క; వచనం (అధ్యాహృతము)=మాటను; శృణ్వంతు=వినుదురుగాక. యథా= ఎట్లు; మైథిలీం=సీతను; జానామి = ఎఱుంగుదునో; తథా (అధ్యాహృతము) = అట్లు; తత్త్వం=యథార్థమును; సంకీర్తయిష్యామి=చెప్పెదను.

వానరులందఱు సద్దు సేయక విందురుగాక; నాకు సీతాదేవి వృత్తాంతమును దెలిసికొన్నవిధమును యథార్థముగాఁజెప్పెదను. అని, తాత్పర్యము.

అస్య వింధ్యస్య శిఖరే పతితో స్మి పురా వనే
సూర్యాతపపరీతాంగో నిర్దగ్ధ స్సూర్యరశ్మిభిః. ౪

టీక॥ పురా=మున్ను; అహం (అధ్యాహృతము)=నేను; సూర్యాతపపరీతాంగః=సూర్యునియెండచే వ్యాపింపఁబడిన శరీరముగలవాఁడనై; సూర్యరశ్మిభిః = సూర్యకిరణములచేత; నిర్దగ్ధః=కాల్పఁబడినవాఁడనై; అస్య=ఈ; వింధ్యస్య=పర్వతముయొక్క; శిఖరే= శృంగమునందు; వనే= అడవియందు; పతితః=పడినవాఁడను; అస్మి = అయితిని.

నేను, మున్ను, సూర్యునియెండచేఁ బరితప్తుఁడనై సూర్యకిరణంబుల దహింపఁబడినవాఁడనై, ఈ వింధ్యశిఖరంబున, నరణ్యమునంబడితిని.

అని, తాత్పర్యము.

లబ్ధసంజ్ఞస్తు షడ్రాత్రా ద్వివశో విహ్వలన్నివ
వీక్షమాణో దిశ స్సర్వా నాభిజానామి కించన. ౫

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; షడ్రాత్రాత్ =ఆఱురాత్రులవలన; లబ్ధసంజ్ఞస్తు=పొందఁబడిన తెలివిగలవాఁడనై; వివశః = స్వాధీనతదప్పినవాఁడనై; విహ్వలన్నివ (స్థితః)=మూర్ఛనొందునట్లున్నవాఁడనై; సర్వాః = సమస్తములయిన; దిశః= దిక్కులను; వీక్షమాణః=చూచుచు; కించన= కొం

చెమయినను; నాభిజానామి= గుర్తింపనైతిని.

అంత, నేను ఆయుదినములకుఁగొంత దెలివొంది,యప్పుడునుదప్పినక్ మూర్ఛనొందునట్లు పరవశుండనై, సమస్త దిశలం గలయఁ జూచితినుగాని యిది యేప్రదేశమో కొంచెమయినను గుర్తు తెలియలేదు. అని, తాత్పర్యము.

**తతస్తు సాగరాన్ శైలాన్ నదీ స్సర్వా స్సరాంసిచ**
**వనా న్యుదధివేలాంచ సమీక్ష్య మతి రాగమత్. ౬**

టీక॥ తతస్తు=అటుపిమ్మటను;సాగరాన్=సముద్రసంబంధములయిన; శైలాన్=పర్వతములను; సర్వాః= సమస్తములయిన; నదీః=నదులను; సరాంసిచ=కొలంకులను; వనాని=అడవులను; ఉదధివేలాంచ= సముద్రముయొక్కచెలియలికట్టను; సమీక్ష్య=చూచి;మతిః=జ్ఞానము; ఆగమత్=వచ్చెను.

అంతసముద్రతీరంబునందలి పర్వతంబులను సమస్తనదులను సరస్సులను వనంబులను సముద్రతీరంబునుం జూచి, యిదియీప్రదేశమని తెలిసికొంటిని. అని, తాత్పర్యము.

**హృష్టపక్షిగణాకీర్ణః కందరాంతరకూటవాన్**
**దక్షిణస్యో దధే స్తీరే వింధ్యో యమితి నిశ్చయః. ౭**

టీక॥ అయం=ఇది; దక్షిణస్య=దక్షిణదిక్కునందున్న; ఉదధేః = సముద్రముయొక్క; తీరే=గట్టునందు; హృష్టపక్షిగణాకీర్ణః = సంతోషించినపక్షులసమూహముచే వ్యాపింపఁబడినదియు; కందరాంతరకూటవాన్= గుహామధ్యములును శిఖరములును గలదియునగు; వింధ్యః = వింధ్యపర్వతము; ఇతి=అని; నిశ్చయః=దృఢజ్ఞానము; ఆసీత్ (అధ్యాహృతము)=కలిగినది.

ఇది, దక్షిణసముద్రతీరంబుననున్నదియు సంతుష్టంబులగు పక్షులతో నొప్పుచున్నదియు గుహలతోను శిఖరంబులతోనుం గూడినదియునగు వింధ్యపర్వతమని,నిశ్చయముగాఁ దెలిసికొంటని. అని, తాత్పర్యము.

**ఆసీ చ్చాత్రాశమం పుణ్యం సురైరపి సుపూజితమ్**

ఋషి ర్నిశాకరో నామ యస్మి న్నుగ్రతపా భవత్. ౮

టీక ॥ యస్మిన్ = ఏయాశ్రమము నందు; ఉగ్రతపాః = భయంకరమయి నతపస్సుగల; నిశాకరో నామ = నిశాకరుఁడను పేరుగల; ఋషిః = ముని; అభవత్ (సంధియార్షము) = ఉండెనో; తత్ (అధ్యాహృతము) = అట్టి; పుణ్యం = పవిత్రంబును; సుపూజితం = మిక్కిలియుఁ బూజింపఁబడినదియున గు; ఆశ్రమంచ = ఆశ్రమముగూడ; అత్ర = ఇచట; ఆసత్ = ఉండెను.

ఈప్రదేశమునందు దేవతల చేతనుం బూజితంబగు పవిత్రమయినయొక ఆశ్రమంబుండెను; అందు, భయంకరంబగు తపస్సుగల నిశాకరుండను మహర్షి నివసింపుచుండెను.

అని, తాత్పర్యము.

అష్టౌ వర్ష సహస్రాణి తేనా స్మి న్నృషిణా వినా
వసతో మమ ధర్మజ్ఞా స్స్వర్గ తేతు నిశాకరే. ౯

టీక॥ ధర్మజ్ఞాః = ధర్మముఁదెలిసినవానరులారా! నిశాకరే = నిశాకరమహర్షి; స్వర్గతే = స్వర్గమునొందినవాఁడుకాఁగా; తు = అటుపిమ్మట; తేన = ఆ; ఋషిణావినా = నిశాకరమహర్షిని విడిచి; అస్మిన్ = ఈప్రదేశమునందు; వసతః = వాసముచేయుచున్న; మమ = నాకు; వర్షసహస్రాణి = సంవత్సరములయొక్క వేలు; అష్టౌ = ఎనిమిది; గతాని (అధ్యాహృతము) = కడచినవి.

ధర్మముదెలిసినట్టివానరులారా! ఆనిశాకరమహర్షి మరణమునొందిన పిమ్మట, నేనమ్మహర్షినివిడిచి, నేనుమాత్రమె యీప్రదేశమున వాసముసేయ నారంభించి యిప్పటికి ఎనిమిదివేలసంవత్సరములయినవి. అని, తాత్పర్యము.

అవతీర్యచ వింధ్యాగ్రా త్కృచ్ఛ్రేణ విషమా చ్ఛనైః
తీక్ష్ణదర్భాం వసుమతీం దుఃఖేన పున రాగతః. ౧౦

టీక ॥ అహం (అధ్యాహృతము) = నేను; విషమాత్ = మిట్టపల్లమయిన; వింధ్యాగ్రాత్ = వింధ్యపర్వతమునుండి; కృచ్ఛ్రేణ = కష్టముచేత; శనైః = మెల్లగా; అవతీర్యచ = దిగియు; దుఃఖేన = దుఃఖముచేత; తీక్ష్ణదర్భాం = క

.అకుదర్భలుగల; వసుమతీం=భూమిని; పునః=మరల; ఆగతః=పొందినాను.

అంత, నేను, బహుకష్టముతో మిట్టపల్లమయినవింధ్యశిఖరమునుండి మెల్లగాడిగ్గి, ఋషులుకోయుటచే మొక్కలప్రటంజేసి కఱకులయిన దర్భలతోంగూడిన ఆశ్రమభూమికిఁ బరమదుఃఖితుండనైవచ్చితిని. అని, తాత్పర్యము.

తమృషిం ద్రష్టుకామోఽస్మి దుఃఖేనాభ్యాగతో భృశమ్
జటాయుషా మయాచైవ బహుశోఽధిగతో హి సః. ౧౧

టీక ॥ భృశం = మిక్కిలియు; దుఃఖేన = దుఃఖముచేత; అభ్యాగతః = పొందఁబడిన; అహం (అభ్యాహృతము)=నేను; తం=ఆ;ఋషిం=నిశాకరమహర్షిని; ద్రష్టుకామః = చూడఁగోరినవాఁడను; అస్మి=అయితిని. హి=ఏలయనఁగా; సః=ఆతఁడు; జటాయుషా = జటాయువుచేతను; మయాచైవ = నాచేతనుగూడ; బహుశః=అధికముగా; అధిగతః = పొందఁబడినవాఁడు.

నేను ఇట్లుపరమదుఃఖితుండనై అట్టి కాలమునందు, ఆనిశాకరమహర్షిని సందర్శింపఁగోరితిని; ఎందుకనఁగా, మున్ను నేనును జటాయువును, అధికముగా నతని దర్శనముచేసి సేవించుచుండువారము. అని, తాత్పర్యము.

తస్యాశ్రమపదాభ్యాశే వవుర్వాతాః సుగన్ధినః
వృక్షో నాపుష్పితః కశ్చిదఫలోవా న విద్యతే. ౧౨

టీక ॥ తస్య = ఆనిశాకరమహర్షియొక్క; ఆశ్రమపదాభ్యాశే= ఆశ్రమస్థానముయొక్క సమీపమునందు; సుగంధినః=మంచివాసనగల; వాతాః= వాయువులు; వవుః=వీచినవి. వృక్షః= చెట్టు; కశ్చిత్ = ఒకానొకటియు;అపుష్పితః = పుష్పములులేనిదిగాని; అఫలోవా = పండ్లులేనిదిగాని; న విద్యతే=లేదు.

ఆనిశాకర మహర్షి యాశ్రమంబునం బుష్పంబులుగాని ఫలములుగానిలేని వృక్షమె లేదుకావున, నతనియాశ్రమంబు సమీపించినంతనె, మంచివాసనగల గాడ్పులువీచినవి. అని, తాత్పర్యము.

ఉపేత్య చాశ్రమం పుణ్యం వృక్షమూల ముపాశ్రితః

ద్రష్టుకామః ప్రతీక్షే౽హం భగవంతం నిశాకరమ్. ౧౩

టీక ॥ అహం=నేను; పుణ్యం= పవిత్రమయిన; ఆశ్రమం = ఆశ్రమమును; ఉపేత్య=పొందియు; వృక్షమూలం = చెట్టుయొక్క అడుగును; ఉపాశ్రితః=పొందినవాఁడనై; భగవంతం= అధికమయిన మాహాత్మ్యముగల; నిశాకరం = నిశాకరుని; ద్రష్టుకామః= చూడఁగోరినవాఁడనై; ప్రతీక్షే = ఎదురుచూచుచుంటిని.

అట్లు పవిత్రంబగు నయ్యాశ్రమంబుఁ జేరి, యొకచెట్టుక్రింద, భగవంతుండగు నిశాకరుం జూడఁగోరి, కాచియుంటిని. అని, తాత్పర్యము,

అథా౽పశ్య మదూరస్థ మృషిం జ్వలిత తేజసమ్
కృతాభిషేకం దుర్ధర్ష ముపావృత్త ముదఙ్ముఖమ్. ౧౪

టీక॥ అథ=అంత; అదూరస్థం=సమీపమునందున్నవాఁడును; జ్వలిత తేజసం=మండుచున్న తేజస్సుగలవాఁడును; కృతాభిషేకం=చేయఁబడిన స్నానముగలవాఁడును; దుర్ధర్షం=ఎదిరింపసలవిగానివాఁడును; ఉదఙ్ముఖం=ఉత్తరపుతట్టు మోము గలవాఁడును; ఉపావృత్తం=వచ్చినవాఁడునగు; ఋషిం= నిశాకరమహర్షిని; అపశ్యం = చూచితిని.

అంత, స్నానముగావించి నిజతేజస్సుచే వెలుంగుచు ఉత్తరదిశకభిముఖుండై వచ్చుచున్నవాని దుర్ధర్షుండగు నమ్మహర్షి నిశాకరుని సమీపంబునం జూచితిని. అని, తాత్పర్యము.

తమృక్షా స్సృమరా వ్యాఘ్రా స్సింహా నాగా స్సరీసృపాః
పరివార్యోపగచ్ఛంతి ధాతారం ప్రాణినో యథా. ౧౫

టీక ॥ తం = ఆనిశాకరమహర్షిని; ఋక్షాః = ఎలుఁగుబంటులును; సృమరాః=చమరమృగములును; వ్యాఘ్రాః= పెద్దపులులును; సింహాః = సింగములును; నాగాః = ఏనుఁగులును; సరీసృపాః=సర్పములును; ధాతారం = బ్రహ్మదేవుని; ప్రాణినోయథా= జంతువులువలె; పరివార్య=పరివేష్టించి;ఉప

గచ్ఛంతి=పోవుచుండినవి.

అంత, సమస్త భూతంబులును బ్రహ్మదేవునిం బరివేష్టించికొనియుండునట్లు, ఆ నిశాకరమహర్షిని, భల్లూకంబులును జరంబులును పులులును సింహంబులును ఏనుంగులును సర్పంబులును బరివేష్టించికొనిచియుండినవి.

అని, తాత్పర్యము.

తతః ప్రాప్త మృషిం జ్ఞాత్వా తాని సత్వాని వై యయుః
ప్రవిష్టే రాజని యథా సర్వం సామాత్యకం బలమ్. ౧౬

టీక ॥ తతః=అటుపిమ్మట; తాని=ఆ; సత్వాని=జంతువులు; ("వై" అనునదిపాదపూరణార్థము); ఋషిం= నిశాకరమహర్షిని; ప్రాప్తం= పోయినవానిఁగా; జ్ఞాత్వా = తెలిసి; రాజని=రాజు; ప్రవిష్టే=గృహమును బ్రవేశించినవాఁడుకాఁగా; సర్వం= సమస్తమయిన; సామాత్యకం= మంత్రులతోఁగూడిన; బలం యథా= సేనవలె; యయుః=పోయినవి.

అంత, నమ్మహర్షి యాశ్రమంబులోనికిఁ బోవుట నెఱింగి, రాజు అంతఃపురంబుఁ బ్రవేశించిన వెనుక, మంత్రులుమొదలగుబలముగముపోవునట్లు, ఆజంతువులన్నియుఁ దమతమ నెలవులకుంబోయినవి. అని, తాత్పర్యము.

ఋషిస్తు దృష్ట్వా మాం ప్రీతః ప్రవిష్టశ్చా శ్రమం పునః
ముహూర్తమాత్రా న్నిష్క్రమ్య తతః కార్య మపృచ్ఛత. ౧౭

టీక॥ ఋషిస్తు = నిశాకరమహర్షియు; మాం=నన్ను; దృష్ట్వా=చూచి; ప్రీతః = సంతోషించినవాఁడై; ఆశ్రమం=ఆశ్రమమును; ప్రవిష్టశ్చ=చొచ్చినవాఁడునై; ముహూర్తమాత్రాత్ = అల్పకాలమువలననె; నిష్క్రమ్య=వెలువడి; తతః=ఆపిమ్మట; కార్యం= పనిని; అపృచ్ఛత = అడిగెను.

ఆ నిశాకరమహర్షియు, సుప్రీతుండై నన్నుఁజూచి, యాశ్రమంబులోనికిఁ బోయి, మఱలఁ గొంతసేపులో వెలువడి, నేనువచ్చినకార్యమునడిగెను.

అని, తాత్పర్యము.

సౌమ్య వైకల్యతాం దృష్ట్వా రోమ్ణాం తే నావగమ్యతే

అగ్నిదగ్ధా విమౌ పక్షౌ త్వక్చైవ వ్రణితా తవ. ౧౮

టీక॥ సౌమ్య=తిన్నని వాఁడా! తే=నీయొక్క; రోమ్ణాం = వెండ్రుకలయొక్క; వైకల్యతాం= వికలములగుటను; దృష్ట్వా=చూచి; తే= నీయొక్క; స్వరూపం(అధ్యాహృతము) = స్వరూపము; నావగమ్యతే= తెలియఁబడలేదు. తవ=నీయొక్క; ఇమౌ=ఈ; పక్షౌ= ఱెక్కలు; అగ్నిదగ్ధౌ = నిప్పుచేఁగాల్పఁబడినవిగా; దృశ్యేతే (అధ్యాహృతము)=చూడఁబడుచున్నవి. త్వక్చైవ= చర్మమును; వ్రణితా = వ్రణముగలదిగా; దృశ్యతే(అధ్యాహృతము)= చూడఁబడుచున్నవి.

సౌమ్యుఁడా! నీదేహమందలి వెండ్రుకలు వికలములగుటవలన నీరూపమే తెలియకున్నది; మఱియు నీఱెక్కలు అగ్నిదగ్ధములుగాను నీచర్మమంతయు వ్రణముగలదిగాను గానఁబడుచున్నవి.

అని, తాత్పర్యము.

గృధ్రౌ ద్వౌ దృష్టపూర్వౌ మే మాతరిశ్వసమౌ జవే
గృధ్రాణాం చైవ రాజానౌ భ్రాతరౌ కామరూపిణౌ. ౧౯

టీక॥ జవే = వేగమునందు; మాతరిశ్వసమౌ= వాయువుతో సరియయినవియు; కామరూపిణౌ = ఇచ్ఛాధీనమగురూపముగలవియు; గృధ్రాణాం= గద్దలకు; రాజానౌచైవ = ప్రభువులును; భ్రాతరౌ = తోడఁబుట్టినవియునగు; ద్వౌ=రెండు; గృధ్రౌ=గద్దలు; మయా) = నాచేత; దృష్టపూర్వౌ=మున్నుచూడఁబడినవి.

నేను, మున్ను, వేగంబునవాయుసమానంబులును, సమస్తగృధ్రంబులకును రాజులును గామరూపంబులును సహోదరంబులునగు రెండుగృధ్రంబులం జూచియున్నాను. అని, తాత్పర్యము.

జ్యేష్ఠోహి త్వంతు సంపాతే జటాయు రనుజ స్తవ
మానుషం రూప మాస్థాయ గృహ్ణీతా చరణం మమ. ౨౦

టీక॥సంపాతే=సంపాతీ! త్వంతు= నీవైతే; జ్యేష్ఠోహి=పెద్దవాఁడవుగదా! జటాయుః=జటాయువు; తవ= నీయొక్క; అనుజః= తమ్ముఁడు. యు

స ౬౦

వాం (అధ్యాహృతము)=మీరలు; మా నుషం = మనుష్యసంబంధియగు; రూ పం=ఆకారమును; ఆస్థాయ= అవలం బించి; మమ=నాయొక్క; చరణౌ = పాదములను; గృహ్ణీతః=పట్టుదురు.

సంపాతీ! నీవందు జ్యేష్ఠుఁడవుగా వా? నీతమ్ముఁడు జటాయువు; మీరిద్దఱు ను మనుష్యరూపముధరించినవారలయి నాపాదంబులకు నమస్కరించు చుందు రు. అని, తాత్పర్యము.

కిం తే వ్యాధిసముత్థానం పక్షయోః పతనం కథమ్
దండోపాయః కృతః కేన తత్త్వ మాఖ్యాహి పృచ్ఛతః. ౨౧

టీక ॥ తే=నీకు; వ్యాధిసముత్థానం కిం= రోగముయొక్క ఉత్పత్తియాయే మి? పక్షయోః=ఱెక్కలయొక్క; పత నం=పడుట; కథం=ఎట్లు? దండోపా యః = శిక్షయొక్కయుపాయము; కే న = ఎవ్వనిచేత; కృతః= చేయఁబడిన ది? పృచ్ఛతః = అడుగుచున్న; మే(అ ధ్యాహృతము) = నాకు; తత్త్వం = యథార్థమును; ఆఖ్యాహి=చెప్పుము.

నీకు వ్యాధియేమైన వచ్చినదాయే మి? అట్లయిన నీఱెక్కలు ఎట్లుపడిపో యినవి? లేక ఎవరైనను ఇట్లుశిక్షించిరా? ఎవ్వరు? అడిగెదను; నాకుయథార్థముఁ జెప్పుము. అనినిశాకర మహర్షినన్నడి గెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, షష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ షష్టితమసర్గటీక,
ముగిసినది.

శ్రీ

# ఏకషష్టితమసర్గప్రారంభః.

తత స్తద్దారుణం కర్మ దుష్కరం సాహసా త్కృతమ్
ఆచచక్షే మునే స్సర్వం సూర్యానుగమనం తదా. ౧

టీక॥ తతః=అటుపిమ్మట; తదా= అప్పుడు; అహం(అధ్యాహృతము) = నేను; తత్=ఆ; దారుణం=భయంకరమును; దుష్కరం= చేయనలవిగానిదియు; సాహసాత్= ఆలోచింపమివలన; కృతం=చేయఁబడినదియునగు; కర్మ = కార్యమయిన; సూర్యానుగమనం=సూర్యుని వెంబడించుటను; సర్వం= సమస్తమును; మునేః = నిశాకరమహామునికి; ఆచచక్షే=చెప్పితిని.

అంతనప్పుడు, నేను, ఆలోచింపక గావించిన భయంకరంబును ఎవ్వరికిని జేయనలవిగానిదియునగు సూర్యుని వెంబడించుట మొదలగు కార్యమునంతయు, నమ్మహామునికిం జెప్పితిని.

అని, తాత్పర్యము.

భగవ న్వ్రణయుక్తత్వా ల్లజ్జయా వ్యాకులేంద్రియః
పరిశ్రాంతో నశక్నోమి వచనం ప్రతిభాషితుమ్. ౨

టీక॥ భగవన్=భగవంతుఁడా! వ్రణయుక్తత్వాత్=వ్రణముతోఁ గూడినవాఁడనగుటవలన; పరిశ్రాంతః=అలసినవాఁడను; లజ్జయా=సిగ్గుచేత; వ్యాకులేంద్రియః = కలఁతనొందినయింద్రియములుగలవాఁడనగు; అహం(అధ్యాహృతము)=నేను; వచనం=మాటను; ప్రతిభాషితుం = బదులుపలుకుటకు; న శక్నోమి=సమర్థుఁడను గాను.

భగవంతుఁడా! ఱెక్కలుకాలి నా దేహమంతయు వ్రణమయియుండుటవలన, బాధితుండను లజ్జచేతఁ గలఁతపడిన యింద్రియంబులుగలవాఁడనగుటంజేసి, నీకుఁబ్రత్యుత్తరము చెప్పుటకు, అసమర్థుఁడనైయున్నాను.

అని, తాత్పర్యము.

అహం చైవ జటాయుశ్చ సంఘర్షా ద్దర్పమోహితౌ
ఆకాశం పతితౌ వీరౌ జిజ్ఞాసంతౌ పరాక్రమమ్. ౩

టీక ॥ వీరౌ = పరాక్రమశాలులమగు; అహంచైవ = నేనును; జటాయుశ్చ=జటాయువును; సంఘర్షాత్ = స్పర్ధవలన; దర్పమోహితౌ= గర్వముచే మోహము నొందినవారమయి; పరాక్రమం=వీర్యమును; జిజ్ఞాసంతౌ= తెలియఁగోరినవారమై; ఆకాశం = ఆకసమును; పతితౌ=పొందినాము.

పరాక్రమవంతులమగు, నేనును జటాయువును, స్పర్ధవలన, గర్వంబున నొడలు దెలియక, యొండొరుల పరాక్రమంబుఁ దెలియఁగోరినవారమై, యాకాశంబున కెగసితిమి. అని, తాత్పర్యము.

కైలాసశిఖరే బద్ధ్వా మునీనా మగ్రతః పణమ్
రవి స్స్యా దనుయాతవ్యో యావ దస్తం మహాగిరిమ్. ౪
అథా వాం యుగప త్ప్రాప్తా వపశ్యావ మహీతలే
రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్. ౫

టీక ॥ ఆవాం=మేము; కైలాసశిఖరే = కైలాసపర్వతముయొక్క శృంగమునందు, మునీనాం = ఋషులయొక్క; అగ్రతః= ఎదుటను; రవిః=సూర్యుఁడు; యావత్ = ఎంతవఱకు; అస్తం = అస్తమును; మహాగిరిం=మహాపర్వతమును; గచ్ఛతి (అధ్యాహృతము) = పొందునో; తావత్ = అంతవఱకు; అనుయాతవ్యః=వెంబడింపఁబడవలసినవాఁడు; స్యాత్ = కావలెను. ఇతి=అని; పణం=పందెమును; బద్ధ్వా= కట్టి; అథ=అంత; యుగపత్=ఏకకాలంబున; ప్రాప్తౌ = (ఆకాశము)పొందినవారమయి; మహీతలే=భూమియందు; నగరాణి = పట్టణములను; పృథక్పృథక్ = వేఱువేఱుగా; రథచక్రప్రమాణాని = రథముయొక్క చక్రముల యొక్క ప్రమాణమువంటి ప్రమాణముగలవానిఁగా; అపశ్యావ = చూచితిమి.

మేమిర్వురము, కైలాసపర్వత శిఖరంబున ఋషులముందట, "సూర్యుఁడస్తగిరి చేరునందాఁక నతని వెంబడి యెగసిపోవలె" ననిపందెము కట్టి, యిర్వురము నేకకాలంబున నాకాశంబెగసితిమి; అంత, భూమియందుండు నగరంబులన్నియు వేఱువేఱుగా, మాకు, బండిచక్రంబులంతటివి కానఁగపడెను.

అని, తాత్పర్యము.

స ౮౧

క్వచి ద్వాదిత్రఘోషాంశ్చ బ్రహ్మఘోషాంశ్చ శుశ్రువః
గాయంతీ శ్చాంగనా బహ్వీః పశ్యావో రక్తవాససః. ౬

టీక॥ ఆవాం (అధ్యాహృతము)= మేము; క్వచిత్=ఒకానొకచోట; వాదిత్రఘోషాంశ్చ=వాద్యధ్వనులను; బ్రహ్మఘోషాంశ్చ=వేదధ్వనులను; శుశ్రువః=వింటిమి. గాయంతీః = పాడుచున్న; రక్తవాససః=ఎఱ్ఱనివస్త్రముగల; అంగనాశ్చ=స్త్రీలను; బహ్వీః = పెక్కండ్రను; పశ్యావః=చూచినాము.

మేము, మార్గంబునం గొన్నిస్థలంబులను వాద్యధ్వనులను వేదఘోషంబులనువింటిమి; మఱియు రక్తవస్త్రముం దాల్చి గానముసేయుచున్నస్త్రీలం బెక్కండ్రంజూచితిమి. అని, తాత్పర్యము.

తూర్ణ ముత్పత్యచా కాశ మాదిత్యపథ మాశ్రితౌ
ఆవా మాలోకయావ స్తద్వనం శాద్వలసన్నిభమ్. ౭

టీక॥ ఆవాం=మేము; తూర్ణం=శీఘ్రముగా; ఆకాశం=ఆకసమును; ఉత్పత్యచ = పొందియు; ఆదిత్యపథం= సూర్యునిమార్గమును; ఆశ్రితౌ=పొందినవారలయి; తత్ = ఆ;వనం=అడవిని; శాద్వలసన్నిభం=పచ్చికతోసమానమునుగా; ఆలోకయావః = చూచితిమి.

మేము, శీఘ్రముగానాకాశమునకెగసి,సూర్యునిమార్గముంజేరి,క్రిందంజూచుటయు, మేముండినయడవి యప్పుడు పచ్చికవలె నతిసూక్ష్మముగాంగానంబడినది. అని, తాత్పర్యము.

ఉపలై రివ సంఛన్నా దృశ్యతే భూ శ్శిలోచ్చయైః
ఆపగాభి శ్చ సంవీతా సూత్రై రివ వసుంధరా. ౮

టీక॥ శిలోచ్చయైః=పర్వతములచేత; సంఛన్నా (అధ్యాహృతము)= కప్పంబడిన; భూః=భూమి; ఉపలైః= ఱాలచేత; సంఛన్నేవ = కప్పంబడినదివలె; దృశ్యతే= చూడంబడినది. ఆపగాభిః=నదులచేత; సంవీతా=చుట్టంబడిన; వసుంధరాచ=భూమియు; సూత్రైః=దారములచేత; సంవీతా (అ

ధ్యాహృతము)ఇవ= చుట్టఁబడినదివలె; అదృశ్యత(అధ్యాహృతము)= చూడఁబడినది.

భూమియందలిపర్వతంబులు చిన్నతాళ్లవలెఁ గానఁబడినవి; భూమియందలినదులు, సన్నదారములవలె నగపడెను. అని, తాత్పర్యము.

హిమవాంశ్చైవ వింధ్యశ్చ మేరుశ్చ సుమహాన్నగః
భూతలే సంప్రకాశంతే నాగాఇవ జలాశయే. ౯

టీక ॥ హిమవాంశ్చైవ = హిమవత్పర్వతమును; వింధ్యశ్చ = వింధ్యపర్వతమును; సుమహాన్= మిక్కిలియు గొప్పదైన; నగః = పర్వతమయిన; మేరుశ్చ = మేరుపర్వతమును; భూతలే = నేలయందు; జలాశయే=కొలనునందు; నాగాఇవ= ఏనుగులువలె; సంప్రకాశంతే = ప్రకాశించుచుండినవి.

అప్పుడు, హిమవత్పర్వతంబును వింధ్యగిరియు మేరుశైలంబును, సరస్సునందు విహరించు నేనుఁగు లంతవిగా, భూమియందుఁ గానంబడినవి.

అని, తాత్పర్యము.

తీవ్ర స్స్వేదశ్చ ఖేదశ్చ భయం చాసీ త్తదా వయోః
సమావిశతి మోహశ్చ తమో మూర్ఛాచ దారుణా. ౧౦

టీక ॥ తథా=అప్పుడు;ఆవయోః= మాకు; తీవ్రః = అధికమయిన; స్వేదశ్చ = చెమటయు; ఖేదశ్చ = అలసటయు; భయంచ=వెఱపును; ఆసీత్ = కలిగెను. మోహశ్చ = చిత్తభ్రాంతియు; తమః = అజ్ఞానంబును; దారుణా = భయంకరమయిన; మూర్ఛాచ = మనస్సుఇంద్రియ సహితముగా లయమునొందుటయు; సమావిశతి = ఆవేశించినది.

సూర్యమార్గంబున సంచరించునప్పుడు, మాకు, అధికముగాఁ జెమటయు నలసటయుఁగలుగుటయు గాక, భయంబును, చిత్తవిభ్రాంతియు, దృష్టిచెలియు కపోత్పటయు భయంకరంబగు మూర్ఛయుఁ గలుగనారంభించినవి.

అని, తాత్పర్యము.

న దిగ్విజ్ఞాయతే యామ్యా నాగ్నేయీ న చ వారుణీ

స ౬౧

యుగాంతే నియతో లోకో హతో దగ్ధ ఇవాగ్నినా. ౧౧

టీక॥ యామ్యా = యమునిదైన; దిక్=దక్షిణదిక్కు; నవిజ్ఞాయతే = తెలియఁబడలేదు. ఆగ్నేయీ= ఆగ్నేయదిక్కు; న(విజ్ఞాయతే)= తెలియఁబడలేదు. వారుణీచ=వరుణునిదైన పడమరయు; (చకారముచేనితరదిక్కులునుగ్రహింపఁబడుచున్నవి) న(విజ్ఞాయతే)= తెలియఁబడలేదు. నియతః=నియమము గల; లోకః=లోకము; యుగాంతే= ప్రళయకాలమునందు; అగ్నినా=నిప్పుచేత; దగ్ధః=దహింపఁబడినదై;హతఇవ = కొట్టఁబడినదివలె; అదృశ్యత(అధ్యాహృతము) = చూడఁబడెను.

ఇదిదక్షిణదిశయనియు ఇదియాగ్నేయదిక్కనియు నిదిపడమరయనియు నిదిపూర్వనియు నిదియుత్తరమనియు నెంతమాత్రము తెలిసినదికాదు; లోకమంతయునియమముదప్పి ప్రళయకాలాగ్నిచేదగ్ధమయి హతమయినట్లు కానంబడినది. అని, తాత్పర్యము.

మనశ్చ మే హతం భూయ స్సన్నివర్త్యాశు సంశ్రయమ్
యత్నేన మహతా హ్యస్మిన్ పున స్సంధాయ చక్షుషి. ౧౨
యత్నేన మహతా భూయో రవి స్సమవలోకితః

టీక॥ భూయః=పలుమాఱు; సంశ్రయం=ఆశ్రయమయినచక్షురింద్రియమును; సంనివర్త్యతు=మఱలించియు; హతం=కొట్టఁబడిన; మే=నాయొక్క; మనశ్చ=మనస్సును; మహతా=అధికమయిన; ("హ" అనునది పాదపూరణార్థము) యత్నేన = ప్రయత్నముచేత; అస్మిన్=ఈ;చక్షుషి=కంటియందు; పునః=మఱల;సంధాయ=కూర్చి; భూయః=మఱల; మహతా= గొప్పదైన; యత్నేన = ప్రయత్నముచేత; రవిః= సూర్యుఁడు; సమవలోకితః = చూడఁబడినాఁడు.

నామనస్సు కలఁతచేనేమియుఁదెలియజాలక నిశ్చలముగుటంజేసి, చక్షురింద్రియమునకు దృష్టిశక్తి తప్పిపోయినది; బహుప్రయత్నంబున నే నామనస్సును చక్షురింద్రియంబునందుఁ గూర్చి, బహుకష్టముచేత మఱల సూర్యుంగనుఁగొంటిని. అని, తాత్పర్యము.

తుల్యః పృథ్వీప్రమాణేన భాస్కరః ప్రతిభాతి నౌ. ౧౩

టీక॥ భాస్కరః = సూర్యుఁడు; నౌ=మాకు; పృథ్వీప్రమాణేన= భూమియొక్క ప్రమాణముతో; తుల్యః=సమానుఁడుగా; ప్రతిభాతి=తోఁచెను.

అప్పుడు, మాకుసూర్యుఁడు, భూమియంత ప్రమాణముగలవాఁడుగా నగపడెను. అని, తాత్పర్యము.

జటాయు ర్మా మనాపృచ్ఛ్య నిపపాత మహీం తతః
తం దృష్ట్వా తూర్ణ మాకాశా దాత్మానం ముక్తవా నహమ్. ౧౪

టీక॥ తతః=అంత; జటాయుః = జటాయువు; మాం=నన్ను; అనాపృచ్ఛ్య = వీడుకొనక; మహీం=భూమిని; నిపపాత=పడెను. అహం=నేను; తం = ఆజటాయువును; దృష్ట్వా=చూచి; తూర్ణం = శీఘ్రముగా; ఆకాశాత్ = ఆకాశమునుండి; ఆత్మానం=నన్ను; ముక్తవాన్=విడిచితిని, దిగితిననుట.

అంతజటాయువు నాతోఁజెప్పకయె, వివశుండై యాకాశంబునుండి నేలంబడసాగెను; అట్లుజటాయువు పడుటం జూచి, శీఘ్రంబున నేనునుఆకాశంబుననుండిక్రిందికిదిగితిని. అని, తాత్పర్యము.

పక్షాభ్యాం చ మయా గుప్తో జటాయు ర్న ప్రదహ్యతే
ప్రమాదా త్తత్ర నిర్దగ్ధః పత న్వాయుపథా దహమ్. ౧౫

టీక॥ జటాయుః=జటాయువు; మయా=నాచేత; పక్షాభ్యాం=ఱెక్కలచేత; గుప్తః= రక్షింపఁబడినవాఁడునై; నప్రదహ్యతే=దహింపఁబడలేదు. అహం=నేను; తత్ర=అప్పుడు;వాయుపథాత్ = వాయుమార్గమయిన ఆకాశమునుండి;పతన్=పడుచు; ప్రమాదాత్=ఏమఱుపాటువలన; నిర్దగ్ధః=దహింపఁబడితిని.

నేనుజటాయువును నాపక్షంబులఁగప్పుటవలన, జటాయువుదహింపఁబడలేదు. నేనుమాత్రము, ఆకాశంబునుండి పడునపుడు ప్రమాదంబున దగ్ధుండనైతిని. అని, తాత్పర్యము.

ఆశంకే తం నిపతితం జనస్థానే జటాయుషమ్
అహంతు పతితో వింధ్యే దగ్ధపక్షో జడీకృతః. ౧౬

స ౬౧

టీక॥ తం=ఆ; జటాయుషం=జటాయువును; జనస్థానే= జనస్థానమునందు; నిపతితం = పడినవానిఁగా;ఆశంకే=ఊహించుచున్నాను. దగ్ధపక్షః=దహింపఁబడిన ఱెక్కలుగలవాఁడను; జడీకృతః = తెలివిదప్పినవాఁడనుగాఁ జేయఁబడినవాఁడనగు;అహంతు = నేను మాత్రము; వింధ్యే= వింధ్యపర్వతమునందు;పతితః=పడినాను.

జటాయువు జనస్థానంబునఁ బడియుండునని తోఁచుచున్నది; నేనుమాత్రము ఱెక్కలుకాలిమూర్ఛితుండనై, ఈవింధ్యపర్వతంబునం బడినాను.

అని, తాత్పర్యము.

రాజ్యేన హీనో భ్రాత్రా చ పక్షాభ్యాం విక్రమేణ చ
సర్వథా మర్తుమేవేచ్ఛన్ పతిష్యే శిఖరాద్గిరేః. ౧౭

టీక॥ రాజ్యేన=దొరతనముచేతను; భ్రాత్రాచ = తమ్మునిచేతను; పక్షాభ్యాం = ఱెక్కలచేతను; విక్రమేణ చ = పరాక్రమముచేతను; హీనః = విడువఁబడినవాఁడనగు; అహం(అధ్యాహృతము)=నేను; సర్వథా=అన్నివిధములను; మర్తుమేవ = చచ్చుటకే; ఇచ్ఛన్=కోరుచు; గిరేః=పర్వతముయొక్క; శిఖరాత్=శృంగమునుండి; పతిష్యే=పడెదను.

నాపక్షంబులను దమ్మునిరాజ్యంబును బరాక్రమంబునుం బాసియింకనేజీవింపఁ జాలను; ఈపర్వతశిఖరమునుండి క్రిందం బడి, మరణంబునొందెదను. అని, నేనునిశాకరమహర్షితోఁ జెప్పితిని.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ఏకషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండైకషష్టితమసర్గటీక,
ముగిసినది.

౬౨

## ద్విషష్టితమసర్గప్రారంభః.

ఏవ ముక్త్వా మునిశ్రేష్ఠ మరుదం దుఃఖితో భృశమ్
అథ ధ్యాత్వా ముహూర్తంతు భగవా నిద మబ్రవీత్. ౧

టీక॥ అహం(అధ్యాహృతము)=నేను; మునిశ్రేష్ఠం= నిశాకరమహర్షిని గూర్చి; ఏవం=ఇట్లు; ఉక్త్వా= చెప్పి; భృశం=మిక్కిలియు; దుఃఖితః=దుఃఖముఁబొందినవాఁడనై; అరుదం=ఏడ్చితిని. అథ=అటుపిమ్మట; భగవాన్= అధికమయినమాహాత్మ్యముగల నిశాకరమహర్షి; ముహూర్తంతు= కొంచెముసేపుమాత్రము; ధ్యాత్వా=ధ్యానముచేసి; ఇదం=ఈమాటను; అబ్రవీత్=పలికెను.

నేనివ్విధంబున మునిశ్రేష్ఠుఁడగు నానిశాకరమహర్షితో విన్నవించుకొని, పరమదుఃఖితుండనై, రోదనంబు గావించితిని; అంత నమ్మహానుభావుండు, కొంతసేపు ధ్యానించి, నన్నుఁజూచి యిట్లని యానతిచ్చెను.

అని, తాత్పర్యము.

పక్షౌచ తే ప్రపక్షౌచ పున రన్యౌ భవిష్యతః
ప్రాణాశ్చ చక్షుషీ చైవ విక్రమశ్చ బలంచ తే. ౨

టీక॥ తే = నీకు; పునః = మఱల; పక్షౌచ = ఱెక్కలును; ప్రపక్షౌచ=చిన్నఱెక్కలును; అన్యౌ= ఇతరములయినవి; భవిష్యతః=కలుగఁగలవు. తే=నీకు; ప్రాణాశ్చ=ప్రాణములును; అన్యేభవిష్యంతి (అధ్యాహృతము)=ఇతరములయినవికలుగఁగలవు. చక్షుషీ= నేత్రములును; అన్యేభవిష్యతః(అధ్యాహృతము) = ఇతరములయినవికలుగఁగలవు. విక్రమశ్చ=పరాక్రమమును; అన్యోభవిష్యతి(అధ్యాహృతము) = ఇతరముగలుగఁగలదు. బలంచ=బలిమియును; అన్యత్ భవిష్యతి (అధ్యాహృతము)=ఇతరమయినది గలుగఁగలదు.

నీకు ఱెకలును బిల్లఱెక్కలును ప్రాణంబులును నేత్రంబులును బలపరాక్రమంబులును, మఱలఁ గ్రొత్తవిగలుగఁగలవు. అని, తాత్పర్యము.

స టీ

పురాణే సుమహా త్కార్యం భవిష్యతి మయా శ్రుతమ్
దృష్టం మే తపసాచైవ శ్రుత్వాచ విదితం మమ. ౩

టీక ॥ పురాణే = పూర్వకాలమునందు; మయా=నాచేత; 'సుమహత్= మిక్కిలియుగొప్పదగు; కార్యం=పని; భవిష్యతి = కాఁగలదు.' ఇతి(అధ్యాహృతము) = అని; శ్రుతం = వినఁబడినది. మే=(మయా) నాచేత;తపసాచైవ = తపస్సుచేతనుగూడ; దృష్టం= చూడఁబడినది. శ్రుత్వాచ=వినియు;మమ=నాకు; విదితం=తెలిసినది.

భవిష్యత్కాలమునందు ఒకగొప్ప కార్యముకాఁగలదని మున్నునేనువింటిని; తపోమహిమచేఁ దెలిసికొనుటమాత్రమేగాక, పెద్దలవలనవినియుఁ దెలిసికొంటిని. అని, తాత్పర్యము.

రాజా దశరథో నామ కశ్చి దిక్ష్వాకునందనః
తస్య పుత్రో మహాతేజా రామో నామ భవిష్యతి. ౪

టీక ॥ ఇక్ష్వాకునందనః = ఇక్ష్వాకువంశపురాజుల సంతోషపఱచునట్టి; దశరథో నామ=దశరథుఁడనుపేరుగల; రాజా=రాజు; కశ్చిత్ =ఒకానొకఁడు; అస్తి (అధ్యాహృతము)= ఉన్నాఁడు. తస్య=అతనికి; రామో నామ = రాముఁడనిప్రసిద్ధుండైన; మహాతేజాః = అధికమయినప్రభావంబుగల;పుత్రః= కొడుకు; భవిష్యతి = కలుఁగఁగలఁడు.

ఇక్ష్వాకువంశంబున దశరథుండను మహారాజు ఒకండున్నాఁడు; అతనికి రాముఁడనుపేరుగల మహాప్రభావసంపన్నుండగు కొడుకుపుట్టఁగలఁడు. అని, తాత్పర్యము.

అరణ్యంచ సహ భ్రాత్రా లక్ష్మణేన గమిష్యతి
అస్మి న్నర్థే నియుక్తస్సన్ పిత్రా సత్యపరాక్రమః. ౫

టీక ॥ సత్యపరాక్రమః = సత్యమయిన పరాక్రమముగల రాముఁడు; పిత్రా=తండ్రిచేత; అస్మిన్ = ఈ; అర్థే=కార్యమువిషయమయి, అరణ్యవాసము విషయమయియనుట; నియుక్తస్సన్=నియోగింపఁబడినవాఁడగుచు; భ్రాత్రా= తమ్ముఁడైన; లక్ష్మణేనసహ=లక్ష్మణునితోఁగూడ;అరణ్యంచ=అ

డవినిగూడ; గమిష్యతి=పొందఁగలఁడు. వనవాసముసేయుమని తండ్రియాజ్ఞాపించుటవలన సత్యపరాక్రముఁడగు నారాముండు, తమ్ముఁడులక్ష్మణునితోఁ గూడినవాఁడై యరణ్యంబునకువచ్చును. అని, తాత్పర్యము.

నైర్ఋతో రావణో రాజా తస్య భార్యాం హరిష్యతి
రాక్షసేంద్రో జనస్థానా దవధ్య స్సురదానవైః. ౬

టీక॥ సురదానవైః= దేవతలచేతను దానవులచేతను; అవధ్యః= చంపఁగూడనివాఁడును; రాక్షసేంద్రః=రాక్షసశ్రేష్ఠుఁడునగు; రాజా= రాజయిన; రావణోనామ=రావణుండను పేరుగల; నైర్ఋతః = రాక్షసుఁడు; జనస్థానాత్=జనస్థానమునుండి; తస్య= ఆ రామునియొక్క; భార్యాం= పెండ్లామును; హరిష్యతి=కొనిపోఁగలఁడు.

దేవాసురులకును వధింపనలవిగానివాఁడు రాక్షసరాజు రావణుండనువాఁడు, రాముండు జనస్థానంబుననుండునప్పుడు, అతనిభార్య నపహరింపఁగలఁడు. అని, తాత్పర్యము.

సా చ కామైః ప్రలోభ్యంతీ భక్ష్యై ర్భోజ్యైశ్చ మైథిలీ
నభోక్ష్యతి మహాభాగా దుఃఖే మగ్నా యశస్వినీ. ౭

టీక ॥ యశస్వినీ = అధికమయినకీర్తిగలదియు; మహాభాగా=పూజ్యమైన యదృష్టముగలదియునగు; సా=ఆ; మైథిలీచ = సీతయు; కామైః= కోరఁదగినద్రవ్యములచేతను; భక్ష్యైః=పిండివంటలచేతను; భోజ్యైశ్చ= భుజింపఁదగినయన్నాది ద్రవ్యములచేతను; ప్రలోభ్యంతీ (ప్రలోభ్యమానా) = ఆశగొనఁజేయఁబడుచున్నదైనను; దుఃఖే= దుఃఖమునందు; మగ్నా=మునిఁగినదై; నభోక్ష్యతి= భుజియింపదు.

మహానుభావురాలగునాసీత, భోగద్రవ్యంబులను భక్ష్యంబులను భోజ్యపదార్థంబులను రావణుండు ఎంతయియ్యవచ్చినను, మహాపతివ్రతగావున, పెనిమిటింబాసి పరమ దుఃఖితురాలగుటవలన, నెంతమాత్రముభుజింపదు.

అని, తాత్పర్యము.

పరమాన్నం తు వైదేహ్యై జ్ఞాత్వా దాస్యతి వాసవః

స ౬౨

టీక ॥ వాసవస్తు = ఇంద్రుఁడుమా త్రము; జ్ఞాత్వా=తెలిసి; వైదేహ్యాః= సీతాదేవికి; పరమాన్నం = ఉత్కృష్ట మయినఅన్నమును; దాస్యతి= ఇయ్యఁ గలఁడు.

ఇంద్రుఁడు, సీతాదేవి భుజింపకుం డుటనెఱింగి, తానాబిడకు ఉత్తమమ యిన దివ్యాన్నంబొసంగఁగలఁడు.

అని, తాత్పర్యము.

యదన్న మమృతప్రఖ్యం సురాణామపి దుర్లభమ్. ౮
తదన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞాయేంద్రా దిదం త్వితి
అగ్ర ముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి. ౯
యది జీవతి మే భర్తా లక్ష్మణేనసహ ప్రభుః
దేవత్వం గచ్ఛతోర్వాపి తయో రన్న మిదం త్వితి. ౧౦

టీక॥ మైథిలీ=సీత;అమృతప్రఖ్యం= అమృతముతోఁబోలిక-గల; యత్=ఏ; అన్నం=అన్నము; సురాణామపి= దే వతలకుఁగూడ; దుర్లభం=పొందనశక్యమో; తత్=అట్టి;అన్నం = అన్నము ను; ప్రాప్య=పొంది;"ఇదంతు=ఈయ న్నముమాత్రము; ఇంద్రాత్=ఇంద్రుని వలన; ఆగతం(అధ్యాహృతము)= వ చ్చినది." ఇతి=అని; విజ్ఞాయ=తెలిసి; అగ్రం=పైభాగమును; ఉద్ధృత్య = ఎ త్తి; "ప్రభుః=సమర్థుండగు; మే=నా యొక్క;భర్తా=పెనిమిటి; లక్ష్మణేనస హ=లక్ష్మణునితోఁగూడ; జీవతియది= బ్రతికియుండు నేని; తయోః=ఆరామల క్ష్మణులకు; దేవత్వం=దేవభావమును; గచ్ఛతోర్వాపి=పొందినవారలయినను; తయోః(అధ్యాహృతము)= ఆరామల క్ష్మణులకు; ఇదం=ఈ; అన్నంతు=అ న్నముమాత్రము; భవతు = అగుఁగా క."ఇతి=అని;భూతలే = నేలయందు; రామాయ = రామునికొఱకు; నిర్వపి ష్యతి=ఇయ్యఁగలదు.

అమృతంబుతో సమాన మయినది యు దేవతలకేనియు దుర్లభంబునగు న ద్దివ్యాన్నంబునొంది, సీతాదేవి, యిది యింద్రుండొసంగినది యనియెఱింగి , అందగ్రభాగముఁదీసి, "నాభర్తమహా ప్రభువు రాముండును నామఱంది లక్ష్మ ణుండును జీవించియుండు రేనియు, వా రలుమృతులై దేవత్వంబునొందియుండు రేనియు, నారామలక్ష్మణులకీయన్నంబు పభోగార్థంబగుఁగాక" యనిపలికి భూ మిపయి నొసంగఁగలదు.

అని, తాత్పర్యము.

ఏష్యంతి ప్రేషకా స్తస్యా రామదూతాః ప్లవంగమాః
ఆఖ్యేయా రామమహిషీ త్వయా తేభ్యో విహంగమ. ౧౧

టీక॥ రామదూతాః=రాముని దూతలయిన; ప్లవంగమాః =వానరులు; తస్యాః=ఆసీతయొక్క; అన్వేషకాః= వెదకువారలయి; ఏష్యంతి = రాఁగల రు. విహంగమ= సంపాతీ! త్వయా= నీచేత; తేభ్యః = ఆవానరులకు; రామమహిషీ = రాముని భార్య; ఆఖ్యేయా = చెప్పఁదగినది.

సంపాతీ! రామునిచేఁ బంపఁబడి సీతాదేవిని వెదకుటకై వానరులు రాఁగలరు; నీవు, ఆవానరులకు, సీతాదేవివృత్తాంతమును జెప్పవలయును.

అని, తాత్పర్యము.

సర్వథా హి న గంతవ్య మీదృశః క్వ గమిష్యసి
దేశకాలౌ ప్రతీక్షస్వ పక్షౌ త్వం ప్రతిపత్స్యసే. ౧౨

టీక॥ సర్వథా= అన్నివిధములను; నగంతవ్యంహి=పోవ్రటకా రాదుగదా! ఈదృశః (త్వం)=ఇట్టినీవు; క్వ=ఎచటికి; గమిష్యసి=పోఁగలవు? దేశకాలౌ= దేశమును గాలమును; ప్రతీక్షస్వ=ఎదురుచూడుము. త్వం=నీవు; పక్షౌ=ఱెక్కలను; ప్రతిపత్స్యసే = పొందఁగలవు.

నీవన్నివిధములను ఇచటనుండుటయె మంచిది; ఇట్లు ఱెక్కలులేనివాఁడవు ఎందుఁబోఁగలవు? నీవిచటనె దేశకాలంబులనిరీక్షించుచు, వసించియుండుము; నీకు ఱెక్కలు మఱలఁబుట్టఁగలవు.

అని, తాత్పర్యము.

నోత్సహే౽య మహం కర్తు మద్యైవ త్వాం సపక్షకమ్
ఇహస్థ స్త్వం తు లోకానాం హితం కార్యం కరిష్యసి. ౧౩

టీక॥ అహం = నేను; త్వాం=నిన్ను; సపక్షకం = ఱెక్కలతోఁగూడినవానిఁగా; అద్యైవ=ఇపుడె; కర్తుం= చేయుటకు; నోత్సహే౽యం = కోరను. త్వం=నీవు; ఇహస్థస్తు= ఇచటనున్నవాఁడవై మాత్రము; లోకానాం = లోకములకు; హితం = మేలుగలిగించునట్టి; కార్యం=పనిని; కరిష్యసి=చే

యఁగలవు.

నీకిప్పుడె తెకుంలువచ్చునట్లు గా వింపనాకుత్సాహము గలుగలేదు; ఏల యనఁగా, నీవిచటనేయుందువేని, లోకములకన్నిటికి హితంబుసేయఁగలవు. అని, తాత్పర్యము.

త్వయాపి ఖలు త త్కార్యం తయో శ్చ నృపపుత్త్రయోః
బ్రాహ్మణానాం సురాణాంచ మునీనాం వాసవస్యచ. ౧౪

టీక ॥ తయోః = ఆ; నృపపుత్త్రయోః = రాచకొమరులగు రామలక్ష్మణులయొక్క; తత్ = ఆకార్యము; త్వయాపి = నీచేతనుగూడ; కార్యంఖలు = చేయఁదగినదిగదా ! బ్రాహ్మణానాం = బ్రాహ్మణులకును; సురాణాం = దేవతలకును; మునీనాం = ఋషులకును; వాసవస్యచ = ఇంద్రునకును; కార్యంఖలు (అధ్యాహృతము) = చేయఁదగినది గదా!

రాజపుత్త్రులగు నారామలక్ష్మణుల కార్యము, నీకుమాత్రమేకాదు, సమస్తబ్రాహ్మణులకును దేవతలకును మహర్షులకును దేవేంద్రునకును, అవశ్యకర్తవ్యము. అని, తాత్పర్యము.

ఇచ్ఛా మ్యహమపి ద్రష్టుం భ్రాతరౌ రామలక్ష్మణౌ
నేచ్ఛే చిరం ధారయితుం ప్రాణాం స్త్యక్ష్యే కలేబరమ్. ౧౫

టీక ॥ అహమపి = నేనును; భ్రాతరౌ = అన్నదమ్ములగు; రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను; ద్రష్టుం = చూచుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. ప్రాణాన్ = ప్రాణములను; చిరం = బహుకాలమువఱకు; ధారయితుం = ధరించుటకు; నేచ్ఛే = కోరను. కలేబరం = శరీరమును; త్యక్ష్యే = విడిచెదను.

నాకును, ఆరామలక్ష్మణుల సందర్శింపవలెనని కోరికయధికముగానున్నది; అయితే, ఇంకన్ బహుకాలమువఱకుఁ బ్రాణంబులుదాల్చియుండుట నాకిష్టములేదు; కావున, ఆలోనేశరీరంబు విడిచెదను. అని, తాత్పర్యము.

మహర్షి స్త్వబ్రవీ దేవం దృష్టతత్త్వార్థదర్శనః

టీక॥ దృష్టతత్త్వార్థదర్శనః = చూడఁబడిన తత్త్వాభిప్రాయము యొక్క జ్ఞానముగల; మహర్షిస్తు= నిశాకరమహర్షి మాత్రము; ఏవం = ఇట్లు; అబ్రవీత్=చెప్పెను.

సమస్త తత్త్వంబులుం దెలిసినట్టి యా నిశాకరమహర్షి, యివ్విధంబునం బలికెను. అని, సంపాతి అంగదునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, ద్విషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ ద్విషష్టితమసర్గటీక, ముగిసినది.

---

శ్రీ.

త్రిషష్టితమసర్గప్రారంభః.

ఏతై రన్యైశ్చ బహుభి ర్వాక్యై ర్వాక్యవిదాం వరః
మాం ప్రశస్యా భ్యనుజ్ఞాప్య ప్రవిష్ట స్స స్వ మాశ్రమమ్. ౧

టీక॥ వాక్యవిదాం= మాటలఁదెలిసినవారలలో; వరః=శ్రేష్ఠుఁడగు; సః= ఆనిశాకరమహర్షి; ఏతైః=ఈమాటలచేతను; అన్యైః=ఇతరములయిన; బహుభిః=పెక్కులయిన; వాక్యైశ్చ= మాటలచేతను; మాం = నన్ను; ప్రశస్య=శ్లాఘించి; అభ్యనుజ్ఞాప్య= వీడుకొల్పి; స్వం=తనదైన; ఆశ్రమం=ఆశ్రమమును; ప్రవిష్టః=చొచ్చినాఁడు.

మాటలు దెలిసినవారిలో నుత్తముఁడగు నమ్మహర్షి, యిట్లు, నానావిధంబులగు మాటల నన్ను శ్లాఘించి నాకనుజ్ఞ యొసంగి, తానాశ్రమంబుఁ బ్రవేశించెను. అని, తాత్పర్యము.

కందరాత్తు విసర్పిత్వా పర్వతస్య శనైశ్శనైః

అహం విన్ధ్యం సమారుహ్య భవతః ప్రతిపాలయే. ౨

టీక ॥ అహం=నేను; శనైశ్శనైః= మెల్లమెల్లగా; పర్వతస్య= కొండయొక్క; కందరాత్= గుహనుండి; విసర్పిత్వాతు = ప్రాఁకియు; విన్ధ్యం= వింధ్యపర్వతమును; సమారుహ్య=ఎక్కి; భవతః=మిమ్ము; ప్రతిపాలయే = ఎదురుచూచుచున్నాను.

అంత నేను మెల్లమెల్లగాఁబర్వతగుహనుండిప్రాఁకి వింధ్యపర్వతం బారోహించి, మీరాక యెదురు చూచుచుంటిని. అని, తాత్పర్యము.

అద్య త్వేతస్య కాలస్య సాగ్రం వర్ష శతం గతమ్
దేశకాలప్రతీక్షో స్మి హృది కృత్వా మునే ర్వచః. ౩

టీక ॥ అద్యతు=ఇపుడుమాత్రము; ఏతస్య=ఈ; కాలస్య= కాలమునకు; సాగ్రం=సమగ్రమయిన; వర్షశతం= సంవత్సరములయొక్కనూఱు; గతం= కడచినది. మునేః= నిశాకరమహర్షియొక్క; వచః=మాటను; హృది= మనస్సునందు; కృత్వా= చేసి, ఉంచియునుటు; దేశకాలప్రతీక్షః= దేశమును గాలమును ఎదురుచూచువాఁడనై; అస్మి= ఉంటిని.

అమ్మహర్షి వచనంబుఁదలంచుకొని దేశకాలంబుల నిరీక్షించుచు సమగ్రంబుగా నూఱువత్సరంబులు గడపితిని. అని, తాత్పర్యము.

మహాప్రస్థాన మాసాద్య స్వర్గ తేతు నిశాకరే
మాం నిర్దహతి సంతాపో వితర్కై ర్బహుభి ర్వృతమ్. ౪

టీక॥ నిశాకరే = నిశాకరుఁడు; మహాప్రస్థానం = మరణముగలుగుటకై చేయు హిమాలయపర్వత యాత్రను; ఆసాద్య=పొంది; స్వర్గతేతు=స్వర్గము నొందినవాఁడుకాఁగానే; బహుభిః = పెక్కులయిన; వితర్కైః=విచారములచేత; వృతం=చుట్టఁబడిన; మాం=నన్ను; సంతాపః=దుఃఖము; దహతి= కాల్చుచున్నది.

అనూఱుసంవత్సరము లైనపిదపనిశాకరమహర్షి మహాప్రస్థానంబునకుఁ బోయిస్వర్గంబునొందుటయు, నేను, నాలో

స ౬౩

నానావిధముగా సంశయించుకొని, దుఃఖంబు సహింపఁజాలకున్నాను. అని, తా.

ఉత్థితాం మరణే బుద్ధిం మునివాక్యై ర్నివర్తయే

టీక ॥ మరణే=చావునందు; ఉత్థితాం=పుట్టిన; బుద్ధిం=తలంపును; మునివాక్యైః=ఋషియొక్క మాటలచేత; నివర్తయే=మఱలించుకొనుచున్నాను.

మరణముఁబొందవలెనని తోఁచినపుడెల్ల నిశాకరమహర్షి చెప్పినమాటలం దలంచుకొని, యూఱడిల్లుచుందును. అని, తాత్పర్యము.

బుద్ధి ర్యా తేన మే దత్తా ప్రాణానాం రక్షణాయ తు. ౫
సా మే ఽపనయతే దుఃఖం దీప్తే వాగ్నిశిఖా తమః

టీక ॥ తేన=ఆనిశాకరమహర్షిచేత; మే=నాకు; ప్రాణానాం=ప్రాణములయొక్క; రక్షణాయతు=కాపాడుటకొఱకే; యా=ఏ; బుద్ధిః=జ్ఞానము; దత్తా=ఇయ్యఁబడినదో; సా=ఆబుద్ధి; మే=నాయొక్క; దుఃఖం=దుఃఖమును; దీప్తా=ప్రకాశించుచున్న; అగ్నిశిఖా=నిప్పుజ్వాల; తమఇవ=చీఁకటినివలె; అపనయతే=పోఁగొట్టుచున్నది.

“నీవు మఱల ఱెక్కలు బలము రాఁగలవై, నీవు గాచియుండుము” అని, ప్రాణసంరక్షణార్థమయి నాకు నిశాకరమహర్షి చెప్పినమాట, దేదీప్యమానంబగు నగ్నిజ్వాల చీఁకటిని బోఁగొట్టునట్లు, నా దుఃఖమును బోఁగొట్టుచుండును. అని, తాత్పర్యము.

బుద్ధ్యతా చ మయా వీర్యం రావణస్య దురాత్మనః. ౬
పుత్రః సంతర్జితో వాగ్భి ర్నత్రాతా మైథిలీ కథమ్

టీక ॥ దురాత్మనః=దుష్టమయిన మనస్సుగల; రావణస్య=రావణుని యొక్క; వీర్యం=పరాక్రమమును; బుద్ధ్యతాచ=ఎఱింగినవాఁడనగు; మయా=నాచేత; వాగ్భిః=మాటలచేత; పుత్రః=కొడుకు; “కథం=ఎట్లు; మైథిలీ=సీత; నత్రాతా=రక్షింపఁబడలేదు?” ఇతి (అధ్యాహృతము)=అని; సంతర్జితః=కసరఁబడినాఁడు.

నేను దురాత్ముండగు రావణుని ప

రాక్రమంబు నెఱింగియు, "నీవు రావణుంబోరిగొని సీతనురక్షింపక యేలవచ్చితివి" అని పరుషవచనంబుల నాకొడుకుంగసరితివి. అని, తాత్పర్యము.

తస్యా విలపితం శ్రుత్వా తౌచ సీతావినాకృతౌ. ౭
న మే దశరథస్నేహా త్పుత్త్రేణో త్పాదితం ప్రియమ్

టీక॥ తస్యాః=ఆసీతయొక్క; విలపితం=రోదనమును; శ్రుత్వా=విని; సీతావినాకృతౌ = సీతచేవిడువఁబడిన; తౌచ=ఆరామలక్ష్మణులను; శ్రుత్వా(అధ్యాహృతము) = విని; దశరథస్నేహాత్=దశరథునియందలి చెలిమివలన, దశరథునియందు స్నేహమునుంచి యనుట; మే=నాకు; పుత్త్రేణ=కొడుకుచేత; ప్రియం=సంతోషము; నోత్పాదితం=పుట్టింపఁబడలేదు.

ఆసీతావిలాపమునువినియు, రామలక్ష్మణులు సీతావిరహితులయిరని యెఱింగియు, నాకొడుకు, దశరథునియందు స్నేహముంచి, సీతనువిడిపించి నాకుసంతోషము సేయఁజాలఁడయ్యె. అని, సంపాతి యంగదునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తస్య త్వేవం బ్రువాణస్య సంపాతే ర్వానరైస్సహ. ౮
ఉత్పేతతు స్తదా పక్షౌ సమక్షం వనచారిణామ్

టీక॥ తదా=అప్పుడు; వానరైస్సహ=వానరులతోఁగూడ; ఏవం=ఇట్లు; బ్రువాణస్యతు=చెప్పుచునేయున్న; తస్య=ఆ; సంపాతేః = సంపాతికి; పక్షౌ=ఱెక్కలు; వనచారిణాం=వానరులయొక్క; సమక్షం = ఎదుటను; ఉత్పేతతుః=మొలిచినవి.

అప్పుడు, అట్లు సంపాతి వానరులతోఁజెప్పుచుండఁగానే, సమస్తవానరసమక్షంబుననె యతనికి ఱెక్కలుమొలిచినవి. అని, తాత్పర్యము.

స దృష్ట్వా స్వాం తనుం పక్షై రుద్గతై రరుణచ్ఛదైః. ౯
ప్రహర్ష మతులం లేభే వానరాం శ్చేద మబ్రవీత్

టీక॥ సః=ఆసంపాతి; ఉద్గతైః=మొలిచిన; అరుణచ్ఛదైః = ఎఱ్ఱనియాఁ

కలుగల; పక్షైః = ఱెక్కలతో; సహితాం(అధ్యాహృతము)= కూడిన; స్వాం=తనదైన; తనుం = శరీరమును; దృష్ట్వా=చూచి; అతులం = సరిలేని; ప్రహర్షం = సంతోషమును; లేభే = పొందెను. వానరాన్ = వానరులను గూర్చి; ఇదం=ఈమాటను; అబ్రవీచ్చ= చెప్పెను.

అంతసంపాతి, తనశరీరమునందు ఎఱ్ఱని యీకలుగల ఱెక్కలు మొలుచుటంగని పరమ సంతుష్టుండై, వానరులంజూచి యిట్లనిపలికెను.

అని, తాత్పర్యము.

ఋషే ర్నిశాకర స్యైవ ప్రభావా దమితాత్మనః. ౧౦
ఆదిత్యరశ్మినిర్దగ్ధా పక్షౌ మే పున రుత్థితౌ

టీక॥ అమితాత్మనః = కొలఁదిలేని ప్రభావముగల; నిశాకరస్య = నిశాకరుఁడను; ఋషేః = మునియొక్క; ప్రభావాదేవ= మాహాత్మ్యమువలననే; మే = నాయొక్క; ఆదిత్యరశ్మినిర్దగ్ధౌ= సూర్యునికిరణములచే దహింపఁబడిన; పక్షౌ=ఱెక్కలు; పునః = మఱల; ఉత్థితౌ = లేచినవి.

మహాప్రభావుండగు నానిశాకరమహర్షి ప్రభావమువలననె, సూర్యకిరణంబులచే దగ్ధంబులగు నాఱెక్కలు, ఇప్పుడు మఱల మొలిచినవి.

అని, తాత్పర్యము.

యావనే వర్తమానస్య మమా సీద్యః పరాక్రమః. ౧౧
తమేవా ద్యానుగచ్ఛామి బలం పౌరుష మేవచ

టీక॥ యావనే= జవ్వనమునందు; వర్తమానస్య=ఉన్నట్టి; మమ=నాకు; యః=ఏ; పరాక్రమః=విక్రమము; ఆసీత్=కలిగెనో; అద్య=ఇప్పుడు; తమేవ=ఆపరాక్రమమునే; బలం = ఆబలమునే; పౌరుషమేవచ= ఆపౌరుషమునే; అనుగచ్ఛామి=పొందుచున్నాను.

నేను యావనమున నుండునప్పుడు, నాకెట్టి బలవిక్రమపౌరుషంబులు గలిగెనో యిపుడు మఱల నట్టిబలపరాక్రమపౌరుషంబులం బొందితిని.

అని, తాత్పర్యము.

సర్వథా క్రియతాం యత్నస్సీతా మధిగమిష్యథ. ౧౨

పక్షలాభో మమా యం వ స్సిద్ధిప్రత్యయకారకః

టీక॥ యత్నః=ప్రయత్నము;క్రియతాం=చేయఁబడుఁగాక. సర్వథా = అన్నివిధములను; సీతాం=సీతను; అధిగమిష్యథ=పొందఁగలరు. మమ = నాయొక్క; అయం = ఈ;పక్షలాభః=ఱెక్కలపొందుట; వః=మీకు; సిద్ధిప్రత్యయకారకః= కార్యసిద్ధియందునమ్మకమును గలిగించునది.

మీరు ప్రయత్నముగావింపుఁడు; అన్నివిధంబులనుదప్పక సీతాదేవింజూడఁగలరు; నాకిప్పుడు ఱెక్కలు మొలుచుటయే మీకునుం గార్యసిద్ధియవ్వననుటకు నిదర్శనము. అని,సంపాతివానరులతోఁ బలికెను. అని, తాత్పర్యము.

ఇత్యుక్త్వా స హరీన్ సర్వాన్ సంపాతిః పతగోత్తమః. ౧౩
ఉత్పపాత గిరే శ్శృంగా జ్జిజ్ఞాసుః ఖగమాం గతిమ్

టీక॥ ఇతి=అని;పతగోత్తమః=పక్షిశ్రేష్ఠుఁడగు; సః=ఆ;సంపాతిః=సంపాతి;హరీన్=వానరులను; సర్వాన్=అందఱనుగూర్చి; ఉక్త్వా = చెప్పి; ఖగమాం = ఆకాశమును బొందించునట్టి; గతిం=గమనమును; జిజ్ఞాసుః=తెలియఁగోరినవాఁడై; గిరేః=పర్వతముయొక్క; శృంగాత్ = శిఖరమునుండి; ఉత్పపాత = ఎగసెను.

పక్షిశ్రేష్ఠుండగు నాసంపాతి యివ్విధంబున సమస్తవానరులతోడనుంబలికి, ఆకాశంబున సంచరించుటయందుఁదన నూతనపక్షంబులకుంగలబలంబుదెలియఁగోరి, యాకాశమునకెగసెను.

అని, తాత్పర్యము.

తస్య త ద్వచనం శ్రుత్వా ప్రీతిసంహృష్టమానసాః. ౧౪
బభూవు ర్హరిశార్దూలా విక్రమాభ్యుదయోన్ముఖాః

టీక॥ హరిశార్దూలాః= వానరశ్రేష్ఠులు; తస్య = ఆసంపాతియొక్క; తత్ =ఆ;వచనం=మాటను; శ్రుత్వా= విని; ప్రీతిసంహృష్టమానసాః= సంతోషకారణముచే సంతుష్టమయినమనస్సు గలవారలయి; విక్రమాభ్యుదయోన్ముఖాః=పరాక్రమమునుగూర్చియు శుభమునుగూర్చియు అభిముఖులు; బభూవుః=అయిరి.

వానరోత్తములు, సంపాతి "మీరు

సీతంజూడఁగలరు" అని వచించుటవిని, అందుకు నిదర్శనంబుగా నతనికిమఱల ఱెక్కలు మొలుచుటయుం జూచి, పరమసంతుష్టులయి పరాక్రమంబు నవలంబించి, సీతాదేవింజూచుట యనుకృభమునొందఁ బ్రయత్నించిరి.

అని, తాత్పర్యము.

అథ పవనసమానవిక్రమాః
ప్లవగవరాః ప్రతిలబ్ధపౌరుషాః. ౧౫
అభిజిదభిముఖా దిశం యయు
ర్జనకసుతాపరిమార్గణోన్ముఖాః

టీక ॥ అథ=అంత; పవనసమానవిక్రమాః= వాయువుతోసమానమయిన నడకగలవారలును; ప్రతిలబ్ధపౌరుషాః= పొందఁబడిన పరాక్రమముగల వారలును; జనకసుతాపరిమార్గణోన్ముఖాః= జనకమహారాజు కొమార్తెయయిన సీతా దేవిని వెదకుటయందా సక్తులునగు; ప్లవగవరాః = వానరోత్తములు; అభిజదభిముఖాః = అభిజిన్ముహూర్తమున కునభిముఖులయి, పగటఁబదునాలుగుగడియలమీఁద రెండుగడియలకాల మభిజిన్ముహూర్తమనఁబడును, దానినిరక్షించిన వారలయియనుట; దిశం= దిక్కును; యయుః=పొందిరి.

అంత, వాయువునకుంబోలె మహావేగంబుగలవారలగు నవ్వానరోత్తములు, పరాక్రమంబవలంబించి, సీతాదేవిని వెదకఁబూనినవారలయి, యభిజిన్ముహూర్తము వచ్చువఱకు నిరీక్షించియుండి, యాముహూర్తంబునందు దక్షిణదిశాభిముఖులయిపోయిరి.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, త్రిషష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ త్రిషష్టితమసర్గటీక, ముగిసినది.

శ్రీ

చతుష్షష్టితమసర్గప్రారంభః.

ఆఖ్యాతా గృధ్రరాజేన సముత్పత్య ప్లవంగమాః
సంగమ్య ప్రీతిసంయుక్తా వినేదు స్సింహవిక్రమాః. ౧

టీక ॥ సింహవిక్రమాః = సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమమ్ముగల; ప్లవంగమాః = వానరులు; గృధ్రరాజేన=సంపాతిచేత; ఆఖ్యాతాః = చెప్పఁబడినవారలయి; ప్రీతిసంయుక్తాః=సంతోషముతోఁగూడినవారలై; సముత్పత్య=ఎగిరి; సంగమ్య=చేరి; వినేదుః=అఱచిరి.

సింహమునకుంబోలెఁ బరాక్రమంబుగల యవ్వానరవీరులు, సంపాతివచనంబున సీతయున్నస్థలంబెఱింగి, సంతోషమున గంతులువైచి మఱల నందఱు నొకటిగాఁజేరి, సింహనాదములు గావించిరి. అని, తాత్పర్యము.

సంపాతే ర్వచనం శ్రుత్వా హరయో రావణక్షయమ్
హృష్టా స్సాగర మాజగ్ము స్సీతాదర్శనకాంక్షిణః. ౨

టీక॥ హరయః=వానరులు; సంపాతేః=సంపాతియొక్క; వచనం= మాటను; శ్రుత్వా=విని; హృష్టాః=సంతోషించినవారలయి; సీతాదర్శనకాంక్షిణః= సీతాదేవినిజూచుటను గోరినవారలయి; రావణక్షయం= రావణునిగృహమయినలంకాద్వీపమునుగూర్చి; సాగరం=సముద్రమును; ఆజగ్ముః=పొందిరి.

వానరులు, సంపాతివాక్యంబువిని, పరమసంతుష్టులయి, సీతాదేవింజూచుటకై, రావణునివాసస్థానమయిన లంకాద్వీపమునకుఁ బోఁదలంచి, తన్మార్గమయిన సముద్రమునుఁజేరిరి.

అని, తాత్పర్యము.

అభిక్రమ్యతు తం దేశం దదృశు ర్భీమవిక్రమాః
కృత్స్నం లోకస్య మహతః ప్రతిబింబమివ స్థితమ్. ౩

టీక ॥ భీమవిక్రమాః = భయంకరమయిన పరాక్రమముగల వానరులు;

తం=ఆ; దేశం = ఆప్రదేశమును; అభిక్రమ్యాతు = చేరినంతనె; మహతః= గొప్పదైన; లోకస్య = ప్రపంచమునకు; ప్రతిబింబమివ (స్థితం) = ప్రతిబింబమువలెనున్న, ప్రతిబింబాధారమయినఅద్దమువలెనున్నయనుట; కృత్స్నం= సమస్తమయిన; సాగరం (అధ్యాహృతము)= సముద్రమును; దదృశుః=చూచిరి.

భయంకర పరాక్రిములగు నవ్వానరులు; ఆప్రదేశంబునొంది, సమస్తప్రపంచంబునుం దనలోఁబ్రతిబింబముగా ధరింపఁజాలిన అద్దమువలెనున్న యమ్మహాసముద్రముంజూచిరి.

అని, తాత్పర్యము.

దక్షిణస్య సముద్రస్య సమాసాద్యోత్తరాం దిశమ్
సన్నివేశం తత శ్చక్రు ర్హరివీరా మహాబలాః. ౪

టీక॥ మహాబలాః = అధికమయిన బలముగల; హరివీరాః=వానరవీరులు; దక్షిణస్య= దక్షిణపుదిక్కునందలిదైన; సముద్రస్య=సముద్రముయొక్క; ఉత్తరాందిశం=ఉత్తరదిక్కును; సమాసాద్య=పొంది; తతః = అచ్చట;సన్నివేశం=విడిదిని; చక్రుః= చేసిరి.

మహాబలశాలులగు నవ్వానరవీరులు, దక్షిణసముద్రంబు నుత్తరతీరంబుఁజేరి, యచటవిడిసిరి. అని, తాత్పర్యము.

సత్త్వై ర్మహద్భి ర్వికృతైః క్రీడద్భి ర్వివిధై ర్జలే
వ్యాత్తాస్యై స్సుమహాకాయై రూర్మిభిశ్చ సమాకులమ్. ౫
ప్రసుప్తమివ చాన్యత్ర క్రీడంతమివ చాన్యతః
క్వచి త్పర్వతమాత్రైశ్చ జలరాశిభి రావృతమ్. ౬
సంకులం దానవేంద్రైశ్చ పాతాళతలవాసిభిః
రోమహర్షకరం దృష్ట్వా విషేదుః కపికుంజరాః. ౭

టీక॥ కపికుంజరాః= వానరశ్రేష్ఠులు; మహద్భిః=గొప్పవియు;వికృతైః= భయంకరములును; వివిధైః=నానావిధములును;జలే=నీటియందు;క్రీడద్భిః= క్రీడించుచున్నవియు; వ్యాత్తాస్యైః = తెఱువఁబడిన నోరుగలవియును; సుమహాకాయైః= మిక్కిలియు గొప్పశరీరముగలవియునగు; సత్త్వైః=జంతువుల

చేతను; ఊర్మిభిశ్చ = అలలచేతను; సమాకులం=నిండినదియు; అన్యత్ర=మఱియొకచోట; ప్రసుప్తమివ(స్థితం)చ= నిదురించినదివలె నున్నదియు; అన్యతః= మఱియొకస్థలమునందు; క్రీడంతమివ (స్థితం) చ = క్రీడించుచున్నట్లున్నదియు; క్వచిత్=ఒకానొకచోట; పర్వతమాత్రైః = కొండలంతటివైన; జలరాశిభిః=నీటిరాసులచేత; ఆవృతంచ= కప్పఁబడినదియు; పాతాళ తలవాసిభిః=పాతాళలోకమునందున్నట్టి; దానవేంద్రైః = దానవశ్రేష్ఠులచేత; సంకులం = నిండినదియు; రోమహర్షకరం= వెండ్రుకలకు గగుర్పాటుసేయునదియునగు; సాగరం (అధ్యాహృతము)=సముద్రమును; దృష్ట్వా = చూచి; విషేదుః=దుఃఖించిరి.

నోరుతెఱచుకొని జలంబులం గ్రీడించుచున్న భయంకరంబులయిన మహాకాయంబులగు నానావిధ జంతువులచేత నిండియున్నదియు తరంగములతో నొప్పుచున్నదియు, జంతువులచేతనుగరళ్ళచేతను ఒకచోఁ గ్రీడించుచున్నట్లున్నదియు మఱియొకచోనవి లేకుండఁజేసి, నిదురించునట్లున్నదియు నొకచోఁగొండలంతటిజలంబులచేఁగప్పఁబడినదియుఁ బాతాళలోకంబుననుండునట్టి దానవేంద్రులచేనధిష్ఠితంబును జూపరులకు భయంబునం గగుర్పాటుగలిగించునదియునగు మహాసముద్రముఁ జూచి, యవ్వానరోత్తములు దిగులొందిరి.

అని, తాత్పర్యము.

ఆకాశమివ దుష్పారం సముద్రం ప్రేక్ష్య వానరాః
విషేదు స్సహసా సర్వే కథం కార్య మితి బ్రువన్. ౮

టీక ॥ వానరాః=వానరులు; ఆకాశమివ=ఆకాశమువలె; దుష్పారం = అంతములేనిదగు; సముద్రం= సముద్రమును; ప్రేక్ష్య=చూచి; సర్వే=అందఱును; సహసా = శీఘ్రముగ; విషేదుః=దిగులుపడిరి. కథం= ఎట్లు; కార్యం=చేయఁదగినది? ఇతి= అని; బ్రువన్ (అబ్రువన్)=చెప్పిరి.

ఆకాశమువలె నంతము గానరాకున్న యమ్మహాసముద్రంబుఁ జూచి, యావ్వానరులందఱు దిగులుపడి, "ఇఁక నేమి చేయవచ్చును?" అని పలికిరి.

అని, తాత్పర్యము.

విషణ్ణాం వాహినీం దృష్ట్వా సాగరస్య నిరీక్షణాత్

ఆశ్వాసయామాస హరీన్ భయార్తాన్ హరిసత్తమః. ౯

టీక॥ హరిసత్తమః=వానరశ్రేష్ఠుఁడగు నంగదుఁడు; సాగరస్య=సముద్రముయొక్క; నిరీక్షణాత్= చూచుటవలన; విషణ్ణాం = భయపడిన; వాహినీం=సేనను; దృష్ట్వా=చూచి; భయార్తాన్= భయముచేఁ బీడితులగు; హరీన్ = వానరులను; ఆశ్వాసయామాస=ఊఱడించెను.

వానరోత్తముఁడగు నంగదుఁడు, వానరసేనయంతయు సముద్రముంగని భయపడియుండుటంజూచి, భయార్తులగు వానరులనెల్ల నాశ్వాసించెను. అని, తాత్పర్యము.

తాన్విషాదేన మహతా విషణ్ణాన్ వానరర్షభాన్
ఉవాచ మతిమాన్కాలే వాలిసూనుర్మహాబలః. ౧౦

టీక॥ కాలే=సమయమునందు; మతిమాన్=అధికమైనబుద్ధిగలవాఁడును; మహాబలః= అధికమైనబలముగలవాఁడునగు; వాలిసూనుః = వాలికొడుకయినయంగదుఁడు; మహతా= అధికమయిన; విషాదేన=భయముచేత; విషణ్ణాన్=దుఃఖితులగు; తాన్ = ఆ; వానరర్షభాన్= వానరశ్రేష్ఠులనుగూర్చి; ఉవాచ=పలికెను.

సమయోచితమయిన బుద్ధిగల మహాబలశాలియగు నయ్యంగదుండు, మహాభయంబునొంది, పరమ దుఃఖితులగు నవ్వానరోత్తములంజూచి, యిట్లని పలికెను. అని, తాత్పర్యము.

న విషాదే మనః కార్యం విషాదో దోషవత్తమః
విషాదో హంతి పురుషం బాలం క్రుద్ధ ఇవోరగః. ౧౧

టీక॥ విషాదే=దుఃఖమునందు; మనః=మనస్సును; న కార్యం=చేయఁదగినదికాదు. విషాదః=దుఃఖము;దోషవత్తమః=దోషశ్రేష్ఠము. విషాదః= దుఃఖము; పురుషం=పురుషుని; బాలం=పిన్నవాని; క్రుద్ధః = కోపించిన;ఉరగఇవ=సర్పమువలె; హంతి=వధించును.

ఎంతమాత్రము మనస్సునదుఃఖముంచరాదు; దుఃఖముకన్న గొప్పదోషమే దియులేదు; క్రుద్ధసర్పము బాలునిఁ జం

పునట్లు దుఃఖము పురుషుం జంపివేయును. అని, తాత్పర్యము.

విషాదో యం ప్రసహతే విక్రమే పర్యుపస్థితే
తేజసా తస్య హీనస్య పురుషార్థో నసిధ్యతి. ౧౨

టీక ॥ విక్రమే=పరాక్రమము; పర్యుపస్థితే=లటస్థింపఁగా; విషాదః = దుఃఖము; యం=ఎవ్వని; ప్రసహతే=లోఁగొనునో; తేజసా=పరాక్రమము చేత; హీనస్య=విడువఁబడిన; తస్య= అతనికి; పురుషార్థః= పురుషప్రయోజనము; నసిధ్యతి=నెఱవేఱదు.

పరాక్రమము సేయవలసినప్పుడు, ఎవ్వఁడు దుఃఖమునకులోఁబడునో, అతఁడు పరాక్రమహీనుఁడగుంగావున, నతనికేపురుషార్థంబును సిద్ధింపదు. అని,యంగదుండు, వానరులంజూచి పలికెను. అని,తాత్పర్యము.

తస్యాం రాత్ర్యాం వ్యతీతాయా మంగదో వానరైస్సహ
హరివృద్ధై స్సమాగమ్య పున ర్మంత్ర మమంత్రయత్. ౧౩

టీక॥ తస్యాం=ఆ; రాత్ర్యాం=రాత్రి; వ్యతీతాయాం = కడచినదగుచుండఁగా; అంగదః = అంగదుఁడు;హరివృద్ధైః=వానరులలోఁబెద్దలయిన;వానరై స్సహ=వానరులతోఁగూడ;సమాగమ్య=చేరి; పునః=మఱల;మంత్రం=ఆలోచనను; అమంత్రయత్=ఆలోచించెను, చేసెననుట.

ఆరాత్రిగడచినపిదప, నంగదుండు, వానరులలోఁ బెద్దలయిన వారింగూడి, సముద్రతరణముంగుఱించి యాలోచించెను. అని, తాత్పర్యము.

సా వానరాణాం ధ్వజినీ పరివార్యాంగదం బభౌ
వాసవం పరివార్యేవ మరుతాం వాహినీ స్థితా. ౧౪

టీక ॥ సా=ఆ; వానరాణాం=వానరులయొక్క; ధ్వజినీ = సేన; అంగదం=అంగదుని; పరివార్య= పరివేష్టించి; వాసవం=ఇంద్రుని; పరివార్య = పరివేష్టించి; స్థితా=ఉన్న;మరుతాం= దేవతలయొక్క; వాహినీవ=సేనవలె;

బభౌ=ప్రకాశించెను.

అంగదుం బరివేష్టించి కొలిచియున్న యవ్వానరసేన, దేవేంద్రుం బరివేష్టించియుండు దేవసేనవలెఁ బ్రకాశించెను. అని, తాత్పర్యము.

కో౽స్యస్తాం వానరీం సేనాం శక్తః స్తంభయితుం భవేత్
అన్యత్ర వాలితనయా దన్యత్రచ హనూమతః. ౧౫

టీక॥ వాలితనయాత్ = వాలికొడుకయిన యంగదునికన్నను; అన్యత్ర = ఇతరుఁడును; హనూమతః=హనుమంతునికన్నను; అన్యత్రచ=ఇతరుఁడును; కః=ఎవ్వఁడు; అన్యః=మఱియొకఁడు; తాం=ఆ; వానరీం=వానరసంబంధియగు; సేనాం= సేనను; స్తంభయితుం = నిలుపుటకు; శక్తః = సమర్థుఁడు; భవేత్ = అగును?

వాలికుమారుండగు నంగదుఁడును హనుమంతుడునుంగాక మఱియెవ్వఁడు అసంఖ్యాకంబగు నవ్వానరసేనను నిలుప సమర్థుఁడు?

అని, తాత్పర్యము.

తత స్తాన్ హరివృద్ధాంశ్చ త చ్చ సైన్య మరిందమః
అనుమాన్యాంగద శ్శ్రీమాన్ వాక్య మర్థవ దబ్రవీత్. ౧౬

టీక॥ తతః = అటుపిమ్మట;అరిందమః=శత్రువుల నడఁగఁద్రొక్కువాఁడును; శ్రీమాన్=అధికమయినకాంతిగలవాఁడునగు; అంగదః = అంగదుఁడు; తాన్=ఆ; హరివృద్ధాంశ్చ=వానరులలోఁబెద్దలగువారిని; తత్=ఆ; సైన్యంచ=ఆవానరసైన్యమును; అనుమాన్య=ఒప్పించి; అర్థవత్=అధికమయినయర్థముగల; వాక్యం=మాటను;అబ్రవీత్=పలికెను.

అంత, శత్రుసంహర్తయు శ్రీమంతుండునగు నయ్యంగదుండు, ఆవృద్ధవానరులయొక్కయు నమ్మహాసేనయొక్కయునను జ్ఞంగొని, అధికముగానర్థముగల యీమాటం జెప్పెను.

అని, తాత్పర్యము.

క ఇదానీం మహాతేజా లంఘయిష్యతి సాగరమ్
కః కరిష్యతి సుగ్రీవం సత్యసంధ మరిందమమ్. ౧౭

టీక॥ మహాతేజాః=అధికమయినపరాక్రమముగల; కః=ఎవ్వఁడు; ఇదానీం=ఇప్పుడు; సాగరం= సముద్రమును; లంఘయిష్యతి = దాఁటఁగలఁడు? కః=ఎవ్వఁడు; అరిందమం=శత్రువులనడఁగఁద్రొక్కునట్టి; సుగ్రీవం=సుగ్రీవుని; సత్యసంధం=సత్యమయినప్రతిజ్ఞగలవానిఁగా; కరిష్యతి=చేయఁగలఁడు?

ఈసేనలో, ఏమహావీరుండు సముద్రంబుదాఁటి, లంకాపురిలో సీతాదేవిం జూచివచ్చి, శత్రువుల నడంగఁద్రొక్కునట్టి సుగ్రీవునిఁ బ్రతిజ్ఞ దక్కించుకొన్నవానిఁగాఁ జేయఁగలఁడు?

అని, తాత్పర్యము.

కో వీరో యోజనశతం లంఘయేచ్చ ప్లవంగమాః
ఇమాంశ్చ యూథపాన్ సర్వాన్ మోక్షయేత్కో మహాభయాత్. ౧౭

టీక॥ ప్లవంగమాః = వానరులారా! కః=ఏ; వీరః = పరాక్రమశాలి; యోజనశతంచ = యోజనంబులనూటిని; లంఘయేత్=దాఁటును? కః=ఎవ్వఁడు; ఇమాన్=ఈ; యూథపాన్=వానరసమూహమును బాలించునట్టివానరులను; సర్వాన్ = అందఱను; మహాభయాత్=గొప్పభయమునుండి; మోక్షయేత్ = విడిపించును?

వానరులారా! ఏవీరుండు, నూఱుయోజనంబుల సముద్రంబును లంఘించి కార్యంబు సాధించికొనివచ్చి, యీవానరవీరులకందఱకుంగలిగిన సుగ్రీవునివలనిభయంబుఁ బోఁగొట్టఁగలఁడు?

అని, తాత్పర్యము.

కస్య ప్రభావా ద్దారాంశ్చ పుత్త్రాంశ్చైవ గృహాణిచ
ఇతో నివృత్తాః పశ్యేమ సిద్ధార్థా స్సుఖినో వయమ్. ౧౮

టీక॥ కస్య=ఎవ్వనియొక్క; ప్రభావాత్= పరాక్రమమువలన; వయం=మనము; సిద్ధార్థాః=ఈడేఱినప్రయోజనముగలవారమై; సుఖినః=సుఖముగలవారమై; ఇతః = ఇచటనుండి;నివృత్తాః=మఱలినవారలమై; దారాంశ్చ=భార్యలను; పుత్త్రాంశ్చ=కొడుకులను; గృహాణిచ=ఇండ్లను; పశ్యేమ=చూడఁగలము?

మనము, కార్యసిద్ధినొంది, యిచటనుండి సుఖముగాఁగిష్కింధకుఁబోయి, మనభార్యలను గొడుకులను గృహంబు

లను జూచునట్లుగా వించు మహాప్రభావుండెవ్వఁడు? అని, తాత్పర్యము.

కస్య ప్రసాదా ద్దారాంశ్చ లక్ష్మణంచ మహాబలమ్
అభిగచ్ఛేమ సంహృష్టా స్సుగ్రీవంచ మహాబలమ్. ౨౦

టీక ॥ కస్య = ఎవ్వనియొక్క; ప్రసాదాత్ = అనుగ్రహమువలన; వయం (అధ్యాహృతము) = మనము; సంహృష్టాః = సంతోషించినవారలము యి; రామంచ = రాముని; మహాబలం = అధికమయినబలముగల; లక్ష్మణంచ = లక్ష్మణుని; మహాబలం = అధికమయినబలముగల; సుగ్రీవంచ = సుగ్రీవుని; అభిగచ్ఛేమ = పొందుదుము?

ఎవ్వని యనుగ్రహమువలన, మనము, సంతోషంబున, మహాబలులగు రామలక్ష్మణులయొక్కయు మహాబలశాలియగు సుగ్రీవునియొక్కయు, సన్నిధానంబునకుఁ బోఁగలము?

అని, తాత్పర్యము.

యది కశ్చి త్సమర్థో వ స్సాగరప్లవనే హరిః
స దదా త్విహ న శ్శీఘ్రం పుణ్యా మభయదక్షిణామ్. ౨౧

టీక॥ వః=మీలో; కశ్చిత్=ఒకానొక; హరిః=వానరుఁడు; సాగరప్లవనే=సముద్రము దాఁటుటయందు; సమర్థో యది=శక్తిగలవాఁడేని; సః=అతఁడు; నః=మాకు; ఇహ=ఇప్పుడు; శీఘ్రం=వేగముగా; పుణ్యాం=పవిత్రమయిన; అభయదక్షిణాం = భయములేమియను దక్షిణను; దదాతు=ఇచ్చుఁగాక.

మీలోనెవ్వరైనను నూఱుయోజనంబులసముద్రముదాఁటఁజాలుదురేని, అతఁడిపుడే శీఘ్రముగా మాకుఁ, బవిత్రమయిన యభయదక్షిణ నొసంగుఁగాక. అని యంగదుఁడు, వానరులతోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అంగదస్య వచ శ్శ్రుత్వా న కశ్చి త్కించి దబ్రవీత్
స్తిమితేవా భవ త్సర్వా తత్ర సా హరివాహినీ. ౨౨

టీక॥ అంగదస్య = అంగదునియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని; కశ్చిత్=ఒకానొకఁడును; కించిత్=కొంచెమైనను; నాబ్రవీత్ =పలుకఁడయ్యె. స

తత్ర=అప్పుడు; సా=ఆ; హరివాహినీ=వానరసేన; సర్వా=సమస్తమును; స్తిమితేవ = నిశ్చలమయినదివలె; అభవత్=ఉండెను.

అంగదునివచనంబువిని, ఎవ్వంఁడును ఏమియుఁ బలుకఁడయ్యె; అప్పుడు ఆ వానరసేనయంతయుఁ గదలక మెదలక చిత్తరువువలెనుండెను.

అని, తాత్పర్యము.

పునరేవాంగదః ప్రాహ తాన్హరీన్ హరిసత్తమః

టీక ॥ హరిసత్తమః=వానరశ్రేష్ఠుఁడగు; అంగదః= అంగదుఁడు; పునరేవ=మఱలనే; తాన్=ఆ; హరీన్ = వానరులనుగుఱిచి; ప్రాహ=పలికెను.

వానరోత్తముఁడగు నంగదుండు, అవ్వానరులంజూచి, మఱల నిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

సర్వే బలవతాం శ్రేష్ఠా భవంతో దృఢవిక్రమాః. ౨౩
వ్యపదేశ్యకులే జాతాః పూజితాశ్చాప్యభీక్ష్ణశః

టీక ॥ భవంతః=మీరలు; సర్వే=అందఱును; బలవతాం=అధికమయిన బలముగలవారిలో; శ్రేష్ఠాః=ఉత్తములగు; దృఢవిక్రమాః = దృఢమయినపరాక్రమము గలవారలు. వ్యపదేశ్యకులే=గౌరవింపఁదగినవంశమునందు; జాతాః=పుట్టినవారలు. అభీక్ష్ణశః = మిక్కిలియు; పూజితాశ్చాపి=పూజింపఁబడినవారలును.

మీరలందఱు బలవంతులలో మేటియయినవారలు; మహాపరాక్రమశాలులరు; ఉత్తమకులంబులం బుట్టినవారలు; మిక్కిలియుమన్ననవడసినవారలు.

అని, తాత్పర్యము.

నహి వో గమనే సంగః కదాచిత్కస్యచిత్క్వచిత్. ౨౪
బ్రువధ్వం యస్య యా శక్తిః ప్లవనే ప్లవగర్షభాః

టీక ॥ ప్లవగర్షభాః = వానరోత్తములారా! వః=మీలో; కస్యచిత్=ఒకానొకనికిని; కదాచిత్ = ఒకానొకప్పుడును; క్వచిత్=ఒకానొకస్థలంబునను; గమనే=నడకయందు; సంగః=అడ్డము; నహి=లేదుగదా! ప్లవనే=దాఁ

టుటయుండు; యస్య=ఎవ్వనికి; యా= ఏది; శక్తిః=సామర్థ్యమో; బ్రువధ్వం (బూత)= చెప్పుదురుగాక.

వానరోత్తములారా! మీలో నా కొఱకరును ఎప్పుడును ఎందును అడ్డులేని గమనము గలవారలుగదా! ఎవ్వరెవ్వరు,ఎంతెంతదూరము దాఁటగలరో చెప్పుఁడు? అని, యంగదుఁడు వానరులతోఁబలికెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, చతుష్షష్టితమస్సర్గః.
ఇది,స్పష్టార్థము.

ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ చతుష్షష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీః

పంచషష్టితమసర్గప్రారంభః.

తతోఙ్గదవచశ్శ్రుత్వా సర్వే తే వానరోత్తమాః
స్వంస్వం గతౌ సముత్సాహ మాహు స్తత్ర యథాక్రమమ్. ౧
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః
మైందశ్చ ద్వివిదశ్చైవ సుషేణో జాంబవాం స్తథా. ౨

టీక ॥ తతః= అటుపిమ్మట; అంగదవచః=అంగదునిమాటను; శ్రుత్వా= విని; గజః=గజుఁడును;గవాక్షః=గవాక్షుఁడును; గవయః= గవయుఁడును; శరభః=శరభుఁడును; గంధమాదనః= గంధమాదనుఁడును; మైందశ్చ= మైందుఁడును; ద్వివిదశ్చైవ= ద్వివిదుఁడును; సుషేణః=సుషేణుఁడును;తథా= అట్లు; జాంబవాన్= జాంబవంతుఁడును; తే=ఆ; వానరోత్తమాః=వానరశ్రేష్ఠులు; సర్వే=అందఱును; తత్ర = అప్పుడు; స్వంస్వం=తమతమదైన; సముత్సాహం=పరాక్రమమును;గతౌ= తెలిసినవారలై; యథాక్రమం=వరుస

దప్పక; ఆహుః=చెప్పుచున్నారు.

అంత నంగదువచనంబు విని, వానరశ్రేష్ఠులయిన గజుండు గవాక్షుండు గవయుండు శరభుఁడు గంధమాదనుండు మైందుఁడు ద్వివిదుండును సుషేణుండు జాంబవంతుండును దమతమపరాక్రమంబులారసి, వరుసగా నంగదునితో దాఁటుటయందుఁ దమతమంగలబలముం జెప్పిరి. అని, తాత్పర్యము.

ఆబభాషే గజ స్తత్ర ప్లవేయం దశయోజనమ్
గవాక్షో యోజనా న్యాహ గమిష్యామీ తి వింశతిమ్. ౩

టీక ॥ తత్ర=అప్పుడు; గజః = గజుఁడు; దశయోజనం = పదియోజనములదూరమును; ప్లవేయం= దాఁటుదును. ఇతి (అధ్యాహృతము)= అని; ఆబభాషే = చెప్పెను. గవాక్షః=గవాక్షుఁడు; "వింశతిం = ఇరువదైన; యోజనాని = యోజనములను; గమిష్యామి = పొందెదను." ఇతి=అని; ఆహ = చెప్పెను.

అప్పుడు, "నేనుబది యోజనంబుల దూరంబు దాఁటఁగలను" అనిగజుండు పలికెను; గవాక్షుండు, "నేనుఇర్వదియోజనంబులకులంఘింపగల"ననివచించెను. అని, తాత్పర్యము.

గవయో వానర స్తత్ర వానరాం స్తా నువాచ హ
త్రింశతం తు గమిష్యామి యోజనానాం ప్లవంగమాః. ౪

టీక ॥ తత్ర=అప్పుడు; గవయః = గవయుఁడను; వానరః = వానరుఁడు; తాన్=ఆ; వానరాన్ = వానరులను గూర్చి; "ప్లవంగమాః=వానరులారా! యోజనానాం=ఆమడలయొక్క; త్రింశతంతు=ముప్పదింటినిమాత్రము; గమిష్యామి = పొందఁగలను." ఇతి(అధ్యాహృతము)=అని; ఉవాచ = పలికెను "హ" అనునదిపాదపూరణార్థము.

అంత, గవయుండు, అవ్వానరులంజూచి, "వానరులారా! నేనుముప్పదియోజనంబుల దూరమునకు దాఁటఁగలను" అని, వక్కాణించెను.

అని, తాత్పర్యము.

శరభ స్తా నువాచా థ వానరాన్ వానరర్షభః

చత్వారింశ ద్గమిష్యామి యోజనానాం ప్లవంగమాః. ౫

టీక ॥ అథ=అంత; వానరర్షభః= వానరశ్రేష్ఠుఁడగు; శరభః = శరభుండు; తాన్=ఆ; వానరాన్= వానరులనుగూర్చి; "ప్లవంగమాః=వానరులారా! యోజనానాం=యోజనములయొక్క; చత్వారింశత్ =(చత్వారింశతం) నలుబదింటిని; గమిష్యామి= పొందఁగలను." ఇతి (అధ్యాహృతము)= అని; ఉవాచ=పలికెను.

అంత, "వానరులారా! నేను నలుబదియామడలదూరము దాఁటగలను" అని వానరోత్తముఁడగు శరభుఁడు, ఆ వానరులతోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

వానర స్తు మహాతేజా అబ్రవీ ద్గంధమాదనః
యోజనానాం గమిష్యామి పంచాశత్తు నసంశయః. ౬

టీక ॥ తు= అటుపిమ్మట; మహాతేజాః=అధికమయిన పరాక్రమముగల; గంధమాదనః = గంధమాదనుఁడను; వానరః = వానరుఁడు; "యోజనానాం = ఆమడలయొక్క; పంచాశత్తు (పంచాశతంతు)= ఏఁబదింటినిమాత్రము; గమిష్యామి= పొందెదను. సంశయః=సందేహము; న=లేదు." ఇతి(అధ్యాహృతము)=అని; అబ్రవీత్ = పలికెను.

అటుపిమ్మట, మహాపరాక్రమశాలియగు గంధమాదనుండను వానరోత్తముఁడు, తానేఁబదియామడల దూరమునకు లంఘింపఁగలఁడని నుడివెను.

అని, తాత్పర్యము.

మైంద స్తు వానర స్తత్ర వానరాం స్తా నువాచ హ
యోజనానాం పరం షష్టి మహం ప్లవితు ముత్సహే. ౭

టీక॥ తత్ర=అప్పుడు;మైందః=మైందుఁడను; వానరస్తు= వానరుఁడుమాత్రము;తాన్=ఆ;వానరాన్=వానరులనుగూర్చి; "అహం=నేను; యోజనానాం = ఆమడలయొక్క;షష్టింపరం= అఱువదింటినిమాత్రము;ప్లవితుం=దాఁటుటకు;ఉత్సహే=ఉత్సహింతును." ఇతి(అధ్యాహృతము)=అని; ఉవాచ=చె

ప్పెను "హ" అనునది పాదపూరణార్థము.

అప్పుడు, "నేను అఱువదియోజనంబులదూరము దాఁటఁగలను" అని మైందుండను వానరవీరుఁడు, అవ్వానరుల తో వక్కాణించెను. అని, తాత్పర్యము.

తత స్తత్ర మహాతేజా ద్వివిదః ప్రత్యభాషత
గమిష్యామి న సందేహ స్సప్తతిం యోజనా న్యహమ్. ౮

టీక॥ తతః=అటుపిమ్మట; తత్ర=అప్పుడు; మహాతేజాః= అధికమయిన పరాక్రమముగల; ద్వివిదః = ద్వివిదుఁడు; "అహం=నేను; యోజనాని=ఆమడలను; సప్తతిం = డెబ్బదింటిని;గమిష్యామి=పొందెదను. సందేహః=అనుమఱి;న = లేదు." ఇతి(అధ్యాహృతము)=అని;ప్రత్యభాషత=పలికెను.

అంత నప్పుడు, మహాపరాక్రమశాలిద్వివిదుఁడు, "నేను డెబ్బదియోజనంబుల దూరమువఱకు లంఘింపఁగలను సందియములేదు" అని, పలికెను.

అని, తాత్పర్యము.

సుషేణస్తు హరిశ్రేష్ఠః ప్రోక్తవాన్ కపిసత్తమాన్
అశీతిం యోజనానాం తు ప్లవేయం ప్లవగేశ్వరాః. ౯

టీక ॥ హరిశ్రేష్ఠః=వానరోత్తముఁడగు; సుషేణస్తు=సుషేణుఁడును; కపిసత్తమాన్= వానరశ్రేష్ఠులనుగూర్చి; "ప్లవగేశ్వరాః = వానరశ్రేష్ఠులారా! యోజనానాం=ఆమడలయొక్క; అశీతింతు= ఎనుబదింటినిమాత్రము; ప్లవేయం=దాఁటుదును." ఇతి (అధ్యాహృతము)=అని; ప్రోక్తవాన్= చెప్పెను.

వానరోత్తముఁడగు సుషేణుఁడు, అవ్వానరవీరుల నందఱంజూచి, "వానరవర్యులారా! నేను ఎనుబది యోజనంబులదూరమునకు లంఘింపఁగలను." అని వచించెను. అని, తాత్పర్యము.

తేషాం కథయతాం తత్ర సర్వాం స్తా ననుమాన్యచ
తతో వృద్ధతమ స్తేషాం జాంబవా న్ప్రత్యభాషత. ౧౦

టీక ॥ తత్ర=అప్పుడు; తేషాం = ఆవానరులు; కథయతాం= చెప్పుచుం

డఁగా; తాన్=వారలను; సర్వాన్=అందఱను; అనుమాన్య ఛ = ఒప్పించియు; తతః=అటుపిమ్మట; తేషాం=ఆ వానరులలో; వృద్ధతమః=అందఱికన్నను ముసలివాఁడగు; జాంబవాన్=జాంబవంతుఁడు; ప్రత్యభాషత=పలికెను.

అప్పుడు, ఇట్లు ఆవానరవీరులు చెప్పుచుండఁగా, సమస్త వానరులలోను అందఱికన్నను వృద్ధుండగు జాంబవంతుండు, వారియనుజ్ఞఁగొని, యిట్లుపలికెను. అని, తాత్పర్యము.

పూర్వ మస్మాకమ ప్యాసీ త్కశ్చి ద్గతిపరాక్రమః
తే వయం వయసః పార మనుప్రాప్తా స్స్మ సాంప్రతమ్. ౧౧

టీక॥ పూర్వం = మున్ను;అస్మాకమపి=మాకుఁగూడ;కశ్చిత్ = ఒకానొక; గతిపరాక్రమః=గమనమునందు శక్తి; ఆసీత్=కలిగెను. తే = అట్టి;వయం=మేము; సాంప్రతం=ఇప్పుడు; వయసః = వయస్సుయొక్క; పారం=అంతమును; అనుప్రాప్తాః = పొందినవారము; స్మ(స్మః)=అగుచున్నాము.

పూర్వము నేనును గొంతవఱకులంఘించుటయందు సామర్థ్యము కలిగియుంటిని; అయితే,ఇప్పుడు,చాలవయస్సుచెల్లి ముసలివాఁడనైతిని.
అని, తాత్పర్యము.

కింతు నైవం గతే శక్య మిదం కార్య ముపేక్షితుమ్
యదర్థం కపిరాజశ్చ రామశ్చ కృతనిశ్చయా. ౧౨

టీక॥ కింతు = మఱియేమన్నను;ఏవంగతే= ఇట్లు తటస్థింపఁగా; యదర్థం=దేనికొఱకు; కపిరాజశ్చ=వానరరాజైన సుగ్రీవుఁడును; రామశ్చ=రాముఁడును; కృతనిశ్చయా=చేయఁబడిన నిశ్చయముగలవారలో; తత్ (అధ్యాహృతము)=అట్టి; ఇదం=ఈ;కార్యం=పని; ఉపేక్షితుం= అశ్రద్ధసేయుటకు; నశక్యం=ఆలవిగాదు.

ఇప్పుడేమన్నను, అట్లు నేనుముసలివాఁడనైనను, రాముని కార్యమును వానరరాజుసుగ్రీవునిచే నవలంబింపఁబడినదియునగు నీకార్యము నెంతమాత్ర మశ్రద్ధసేయరాదు. అని, తాత్పర్యము.

సాంప్రతం కాలభేదేన యా గతి స్తాం నిబోధత
నవతిం యోజనానాం తు గమిష్యామి న సంశయః. ౧౩

టీక॥ సాంప్రతం=ఇప్పుడు; కాలభేదేన = కాలముయొక్క వేఱుపాటుచేత; యా=ఏ; గతిః=గమనము; అస్తి(అధ్యాహృతము)=ఉన్నదో; తాం=దాని; నిబోధత=తెలియుఁడు. యోజనానాం=ఆమడలయొక్క; నవతింతు = తొంబదింటినిమాత్రము; గమిష్యామి= పొందెదను. సంశయః= సందేహము; న=లేదు.

ఇప్పుడు, వయసుచెల్లి ముసలివాఁడనై యుండునప్పుడు ఎంతదూరము లంఘింపఁగలనో దానిఁజెప్పెదను వినుండు; ఇప్పుడు తొంబదియామడలవఱకు లంఘింపఁగలను; సందేహములేదు. అని, జాంబవంతుండు పలికెను.

అని, తాత్పర్యము.

తాం స్తు సర్వాన్ హరిశ్రేష్ఠాన్ జాంబవాన్ పున రబ్రవీత్

టీక॥ తు=పిమ్మట; జాంబవాన్= జాంబవంతుఁడు; పునః=మఱల; తాన్= ఆ; హరిశ్రేష్ఠాన్=వానరోత్తములను; సర్వాన్=అందఱనుగూర్చి; అబ్రవీత్= పలికెను.

అంత, మఱల జాంబవంతుండవ్వానరులంజూచి, యిట్లనివక్కాణించెను.

అని, తాత్పర్యము.

నఖ ల్వేతావ దేవాసీ ద్గమనే మే పరాక్రమః. ౧౪
మయా మహాబలే శ్చైవ యజ్ఞే విష్ణు స్సనాతనః
ప్రదక్షిణీకృతః పూర్వం క్రమమాణ స్త్రివిక్రమమ్. ౧౫

టీక॥ మే = నాకు; గమనే = లంఘించుటయందు; పరాక్రమః = శక్తి; ఏతావదేవ= ఇంతమాత్రమె; నాసీత్ఖలు = కలిగియుండలేదుగదా! పూర్వం=మున్ను; మహాబలేః = మహాబలిచక్రవర్తియొక్క; యజ్ఞేచైవ = యాగమునందును; మయా= నాచేత; త్రివిక్రమం= మూఁడడుగులను; క్రమమాణః= ఉంచుచున్న; సనాతనః=నిత్యుఁడగు; విష్ణుః=వెన్నుఁడు; ప్రదక్షిణీకృతః = ప్రదక్షిణముచేయఁబడినాఁడు.

నాకు మున్ను యౌవనకాలంబున

నాకాశగమనంబునందుండిన శక్తియింతమాత్రమెగాదు; పూర్వము బలిచక్రవర్తియాగంబున, సనాతనుండగు విష్ణువుండు, త్రివిక్రమావతారంబున మూఁడడుగులు కొలుచుకొనునప్పుడు, అంతలోఁ డై త్రిలోక్యము నతిక్రమించియున్న యతని యాకారమును నేను ప్రదక్షిణముగాఁ జుట్టివచ్చినాను.

అని, తాత్పర్యము.

స ఇదానీ మహం వృద్ధః ప్లవనే మందవిక్రమః
యౌవనే చ త దాసీన్మే బల మప్రతిమం పరైః. ౧౬

టీక ॥ సః=అట్టి; అహం=నేను; ఇదానీం=ఇప్పుడు; వృద్ధః=ముసలివాఁడనైన; ప్లవనే=దాఁటుటయందు; మందవిక్రమః=తక్కువయయినపరాక్రమము గలవాఁడను. యౌవనే చ = జవ్వనమునందో; మే=నాకు; పరైః= ఇతరులతో; అప్రతిమం=పోలికలేని; తత్=అట్టి; బలం=శక్తి; ఆసీత్=కలిగెను.

నాకు యౌవనకాలమునందు, ఆకాశగమనంబున నట్టియసదృశమయిన బలంబుగలిగియుండెను; అట్టినేనిప్పుడు వృద్ధుఁడనైతిని గావున, దాఁటుటయందు అంతగా బలములేనివాఁడనైతిని.

అని, తాత్పర్యము.

సంప్రత్యేతావతీం శక్తిం గమనే తర్కయా మ్యహమ్
నైతావతా చ సంసిద్ధిః కార్యస్యాస్య భవిష్యతి. ౧౭

టీక ॥ అహం=నేను; సంప్రతి=ఇప్పుడు; గమనే= దాఁటుటయందు; ఏతావతీం=ఇంతటిదైన; శక్తిం=బలమును; తర్కయామి= ఊహించుచున్నాను. ఏతావతా చ = ఇంతమాత్రముచేతఁగూడ; అస్య = ఈ; కార్యస్య=పనియొక్క; సంసిద్ధిః = నెఱవేఱుట; న భవిష్యతి=కాదు.

ఈయవస్థయందు, తొంబదియామడలదూరము లంఘింపఁగలనని తలఁచుచున్నాను; అయితే లంకను నూఱుయోజనంబులసముద్రమును దాఁటిపోవలెను గావున, నింతమాత్రమునఁగూడ, ఈకార్యమునుసిద్ధింపదు. అనిజాంబవంతుండు చెప్పెను. అని, తాత్పర్యము.

అథోత్తర ముదారార్థ మబ్రవీ దంగద స్తదా

అనుమాన్య మహాప్రాజ్ఞం జాంబవంతం మహాకపిః. ౧౮

టీక ॥ అథ= అటుపిమ్మట; తదా= అప్పుడు; మహాకపిః= పూజ్యుఁడయిన వానరుఁడైన; అంగదః= అంగదుఁడు; మహాప్రాజ్ఞం = మహాపండితుఁడగు; జాంబవంతం = జాంబవంతుని; అనుమాన్య = సన్మతింపఁజేసి; ఉదారార్థం= అధికమయినయర్థముగల; ఉత్తరం = పైమాటను; అబ్రవీత్ = పలికెను.

అంతనప్పుడు,యువరాజయినయంగదుండు, మహాపండితుఁడగుజాంబవంతునియనుజ్ఞనొంది, యధికమయినయర్థము గల్గునట్లు అప్పైఁ జెప్పవలసిన తనబలంబు కొలందిం జెప్పెను.

అని, తాత్పర్యము.

అహ మేత ద్గమిష్యామి యోజనానాం శతం మహత్
నివర్తనేతు మే శక్తి స్స్యా న్నవేతి న నిశ్చితా. ౧౯

టీక ॥ అహం=నేను; మహత్ = గొప్పదగు; ఏతత్ = ఈ; యోజనానాం = ఆమడలయొక్క; శతం=నూటిని; గమిష్యామి=పొందెదను. నివర్తనేతు=మఱలివచ్చుటయందుమాత్రము; మే=నాకు; శక్తిః=సామర్థ్యము; స్యాత్ = కలుగును; నవా=లేదు. ఇతి= అని; ననిశ్చితా = నిశ్చయింపఁబడివి కాదు.

నేను, ఈనూఱుయోజనంబుల దూరంబును లంఘించిపోఁగలను; అయితే, మఱలివచ్చుటకు నాకుశక్తియుండునో లేదో నేనునిశ్చయముగాఁ జెప్పఁజాలను. అని, యంగదుండుచెప్పెను.

అని, తాత్పర్యము.

త మువాచ హరిశ్రేష్ఠో జాంబవా న్వాక్యకోవిదః

టీక॥ హరిశ్రేష్ఠః = వానరోత్తముఁడగు; వాక్యకోవిదః=మాటలయందుఁ బండితుండయిన; జాంబవాన్ = జాంబవంతుండు; తం = ఆయంగదుని గూర్చి; ఉవాచ=పలికెను.

వానరోత్తముఁడును మాటలుచెప్పుటయందుఁ బండితుండునగు జాంబవంతుండు, అంగదుంజూచి యిట్లనివచించెను. అని, తాత్పర్యము.

జ్ఞాయతే గమనే శక్తి స్తవ హర్య్యృక్షసత్తమ. ౨౦

టీక ॥ హర్య్యృక్షసత్తమ= వానరులలోను భల్లూకములలోను శ్రేష్ఠుఁడవగు నంగదుఁడా! తవ= నీయొక్క; గమనే= దాఁటుటయందు; శక్తిః=సామర్థ్యము; జ్ఞాయతే = తెలియఁబడుచున్నది.

వానరవీరులలో భల్లూకవీరులలోను వరిష్ఠుఁడవగు నంగదుఁడా! లంఘనమునందు నీసామర్థ్యము కొలఁదికిమీఁదనని మాకుఁ దెలిసియే యున్నది.

అని, తాత్పర్యము.

విశేషార్థము.— భల్లూకములుఁగూడ ఒక విధమయిన వానరజాతియె కావున "భల్లూకములలో నుత్తముఁడా" అని యంగదుఁడు సంబోధింపఁబడినాఁడు. ఇట్లే పూర్వార్థమందలి 'హరిశ్రేష్ఠః'అను జాంబవద్విశేషణమును,ఎఱుంగునది.

కామం శతం సహస్రంవా న హ్యేష విధి రుచ్యతే
యోజనానాం భవాన్ శక్తో గంతుం ప్రతినివర్తితుమ్. ౨౧

టీక॥భవాన్=నీవు;యోజనానాం=ఆమడలయొక్క; శతం = నూటినిగాని; సహస్రంవా=వేయింటినిగాని; గంతుం=పొందుటకును; ప్రతినివర్తితుం=మఱలుటకును; శక్తః కామం= సమర్థుఁడవే. ఏషః=ఈ; విధిః=ఆజ్ఞ ; నోచ్యతేహి=చెప్పఁబడదుగదా!

నీవు, నూఱు యోజనంబులుమాత్రమె గాదు వేయియోజనంబులేని దాఁటిపోవుటకును అట్లె మఱలివచ్చుటకునుసమర్థుఁడవు; ఇందు సంశయములేదు;అయితె నీవురాజవు, కార్యమునకై నిన్నుఁబంపుటయెంతమాత్రము సరిగాదు.

అని, తాత్పర్యము.

నహి ప్రేషయితా తాత స్వామీ ప్రేష్యః కథంచన
భవతా యం జన స్సర్వః ప్రేష్యః ప్లవగసత్తమ. ౨౨

టీక ॥ తాత=నాయనా! ప్రేషయితా=పంపువాఁడైన; స్వామీ=ఒడయఁడు; కదాచన = ఒకానొకప్పుడును; ప్రేష్యః=పంపఁదగినవాఁడు; నహి = కాఁడుగదా! ప్లవగసత్తమ= వానరోత్తముఁడా! భవతా=నీచేత; అయం= ఈ; జనః=జనము; సర్వః=సమస్తమును; ప్రేష్యః=పంపఁదగినది.

నాయనా! వానరోత్తముఁడా!స్వామివి నీవు ఈ సమస్తవానరులను కా

ర్యము నిమిత్తమయి పంపవచ్చునే గాని నీవు రాజవు ఒకానొకప్పుడును ఎంత మాత్రము పంపఁదగినవాఁడవు కావు.

అని, తాత్పర్యము.

భవాన్ కళత్ర మస్మాకం స్వామిభావే వ్యవస్థితః
స్వామీ కళత్రం సైన్యస్య గతి రేషా పరంతప. ౨౩

టీక ॥ పరంతప= శత్రువులఁదపింపఁజేయునట్టియంగదుఁడా! స్వామిభావే=ప్రభుత్వమునందు; వ్యవస్థితః= ఉన్న; భవాన్=నీవు; అస్మాకం = మాకు; కళత్రం=భార్యవు, లేక, కోటవంటి వాఁడవు, రక్షింపఁదగినవాఁడ వనుట. స్వామీ=ప్రభువు; సైన్యస్య= సేనకు; కళత్రం=భార్య, భార్యవలె రక్షింపవలసినవాఁడనుట. ఏషా=ఇది; గతిః = నిశ్చయము.

శత్రువులఁ దపింపఁజేయునట్టియంగదుఁడా! నీవు మాకు స్వామివికావున, మేమందఱము నిన్నురక్షింపవలెను; సైనికులందఱును, భార్యనువలె స్వామిని జాగ్రత్తతో రక్షింపవలెననుట సిద్ధాంతము. అని, తాత్పర్యము.

తస్మా త్కళత్రవ త్తత్ర ప్రతిపాల్య స్సదా భవాన్

టీక ॥ తస్మాత్= అందువలన; భవాన్=నీవు; సదా= ఎల్లప్పుడును; తత్ర=ఆవిషయమందు; కళత్రవత్=భార్యవలె; ప్రతిపాల్యః= కాపాడఁదగినవాఁడవు.

అట్లగుటంజేసి, నిన్ను, మేమందఱము నెల్లప్పుడును భార్యనువలె బహుజాగ్రత్తతో రక్షింపవలెను.

అని, తాత్పర్యము.

అపి చైతస్య కార్యస్య భవా న్మూల మరిందమ. ౨౪

టీక ॥ అరిందమ=శత్రువుల నడఁగఁ ద్రొక్కునట్టియంగదుఁడా! అపిచ= ఇదిగాక; భవాన్=నీవు; ఏతస్య= ఈ; కార్యస్య=పనికి; మూలం=వేరు, వేరువంటివాఁడవు.

శత్రువుల సంహరించునట్టి యంగదుఁడా! ఇంతియగాక, ఈకార్యమునకంతయు, వృక్షమునకు వేరువలె, నీవు ముఖ్యభూతుండవు. అని, తాత్పర్యము.

స ౬౫

మూల మర్థస్య సంరక్ష్య మేష కార్యవిదాం నయః
మూలే హి సతి సిధ్యంతి గుణాః పుష్పఫలోదయాః. ౨౫

టీక ॥ అర్థస్య=కార్యముయొక్క; మూలం=మూలము; సంరక్ష్యం = చక్కఁగాఁగాపాడఁదగినది. ఏషః= ఇది; కార్యవిదాం = కార్యముఁదెలిసినవారియొక్క; నయః=నీతి. హి=ఏలయనఁగా; మూలేసతి= వేఁఱుఁడఁగా; పుష్పఫలోదయాః = పూలయొక్కయు పండ్లయొక్కయు ఉత్పత్తులనెడు; గుణాః=గుణములు; సిధ్యంతి=కలుగును

కార్యమునకంతయు మూలమువంటిదైన వస్తువును ముఖ్యముగారక్షింపవలెను; ఏలయనఁగా, వృక్షమునందు వేఁఱు చక్కఁగానున్నంగదా పూలుఫలములు మొదలగు గుణములు సిద్ధించును! అని, తాత్పర్యము.

త ద్భవా నస్య కార్యస్య సాధనే సత్యవిక్రమ
బుద్ధివిక్రమసంపన్నో హేతు రత్ర పరంతప. ౨౬

టీక॥ సత్యవిక్రమ=సత్యమయినపరాక్రమముగలవాఁడా! పరంతప = శత్రువులఁదపింపఁజేయువాఁడా! తత్=అందువలన; భవాన్ = నీవు;అత్ర=ఇచట; అస్య=ఈ;కార్యస్య = పనియొక్క; సాధనే=సాధించుటయందు; బుద్ధివిక్రమసంపన్నః=బుద్ధితోను బరాక్రమముతోనుంగూడిన; హేతుః=కారణమవు.

సత్యపరాక్రముఁడా!శత్రువులసంహరించువాఁడా! అట్లు,ఇచటనీకార్యసాధనమునందు, నీవే బుద్ధియుబరాక్రమంబునుగల్గి, మాకందఱకును ముఖ్యకారకుఁడయినవాఁడవు; నీవు, లంకకుఁబోయినచో మేమందఱము నిచట నెవ్వరినాశ్రయించియుందుము?

అని, తాత్పర్యము.

గురుశ్చ గురుపుత్త్రశ్చ త్వం హి నః కపిసత్తమ
భవంత మాశ్రిత్య వయం సమర్థా హ్యర్థసాధనే. ౨౭

టీక॥ కపిసత్తమ=వానరోత్తముఁడా! త్వం=నీవు; నః=మాకు; గురుశ్చ=

పెద్దవును, లేక, పూజనీయుఁడవును, రాజవనుట; గురుపుత్రశ్చహి=రాజుకొడుకవునుగదా! వయం = మేము; అర్థసాధనే=కార్యమును సాధించుటయందు; భవంతం=నిన్ను; ఆశ్రిత్యహి=ఆశ్రయించియేకదా; సమర్థాః = శక్తులము.

వానరోత్తముఁడవగునంగదుఁడా! ఇంతియగాక, మాకందఱకును నీవు రాజవు, రాజపుత్త్రుఁడవునుగదా! నిన్నాశ్రయించియేగదా మేము కార్యసాధనంబున సమర్థులమగుదుము! నీవు లేనిచో మేమేమి సేయఁగలము? అనిజాంబవంతుం డంగదునితోఁబలికెను.

అని, తాత్పర్యము.

ఉక్తవాక్యం మహాప్రాజ్ఞం జాంబవంతం మహాకపిః
ప్రత్యువాచోత్తరం వాక్యం వాలిసూను రథాంగదః. ౨౮

టీక॥ అథ = అటుపిమ్మట; మహాకపిః=పూజనీయువానరుఁడును; వాలిసూనుః = వాలియొక్క కుమారుఁడునగు; అంగదః= అంగదుఁడు; ఉక్తవాక్యం= చెప్పఁబడినమాటగల; మహాప్రాజ్ఞం= మహాపండితుఁడగు; జాంబవంతం = జాంబవంతునిగూర్చి; ఉత్తరం=బదులైన; వాక్యం=మాటను; ప్రత్యువాచ=బదులుచెప్పెను.

మహాపండితుండగు జాంబవంతుండట్లు పలుకుటయు, వాలికుమారుండయినయంగదుండు, అతనింజూచి, యిట్లనిబదులుచెప్పెను. అని, తాత్పర్యము.

యది నాహం గమిష్యామి నాన్యో వానరపుంగవః
పునః ఖల్విద మస్మాభిః కార్యం ప్రాయోపవేశనమ్. ౨౯

టీక॥ అహం=నేను; నగమిష్యామియది=పోనేని; అన్యః=ఇతరుఁడయిన; వానరపుంగవః=వానరశ్రేష్ఠుఁడు; న (గమిష్యతియది)=పోఁడేని; అస్మాభిః= మనచేత; పునః=మఱల; ఇదం=ఈ; ప్రాయోపవేశనం=మరణార్థమయి పరుండుట; కార్యంఖలు=చేయఁదగినదిగదా!

సముద్రంబు దాఁటుటకు నేనును బోక, మఱియొక వానరోత్తముఁడునుం బోవఁడేని, ఇఁక మనమందఱమును మఱలఁ బ్రాయోపవేశనము సేయవలసినదేకదా! అని, తాత్పర్యము.

న హ్యకృత్వా హరిపతే స్సందేశం తస్య ధీమతః
తత్రాపి గత్వా ప్రాణానాం పశ్యామి పరిరక్షణమ్. ౩౦

టీక॥ ధీమతః=బుద్ధిమంతుండగు; తస్య=ఆ; హరిపతేః=వానరరాజయిన సుగ్రీవునియొక్క; సందేశం= ఆజ్ఞను; అకృత్వా=చేయక; తత్ర=ఆకిష్కింధకు; గత్వాపి = పోయియు; ప్రాణానాం = ప్రాణములయొక్క; పరిరక్షణం= కాపాడుకొనుటను; నపశ్యామి హి= చూడనుగదా!

బుద్ధిమంతుండగు వానరరాజు సుగ్రీవునియాజ్ఞనుసెఱవేర్పక, గడువునుందప్పి, యాకిష్కింధకుఁబోయినను, మనకు జీవితాశయే మోలేదుగదా!

అని, తాత్పర్యము.

స హి ప్రసాదేచాత్యర్థం కోపేచ హరిరీశ్వరః
అతీత్య తస్య సందేశం వినాశో గమనే భవేత్. ౩౧

టీక॥ సః=ఆ; హరిః=వానరుఁడు; ప్రసాదేచ=అనుగ్రహమునందును; కోపేచ=కోపమునందును, నిగ్రహమునందుననుట; అత్యర్థం=మిక్కిలియు; ఈశ్వరో హి=సమర్థుఁడుగదా! తస్య=ఆతనియొక్క; సందేశం = ఆజ్ఞను; అతీత్య=అతిక్రమించి; గమనే = పోవుటయందు; వినాశః=చేటు; భవేత్=కలుగును.

ఆ సుగ్రీవుండు, మెప్పువడసిన మిక్కిలియుననుగ్రహించువాఁడును తప్పుచూచిన మిక్కిలియు నిగ్రహించువాఁడునుగదా! అతఁడువిధించినగడువునుందప్పి,సీతనుంజూడక,యచటికిఁబోవుదుమేని, యతఁడు మనఁనందఱవధించుట సిద్ధము. అని, తాత్పర్యము.

తద్యథా హ్యస్య కార్యస్య న భవత్యన్యథా గతిః
తద్భవానేవ దృష్టార్థ స్సంచింతయితు మర్హసి. ౩౨

టీక॥ తత్ = అందువలన; యథాహి=ఎట్లయితే; అస్య=ఈ; కార్యస్య=పనికి; అన్యథా = వేఱువిధముగా; గతిః=పోకడ; నభవతి=కాదో; తత్=ఆవిధమును; దృష్టార్థః = చూడఁబడిన కార్యములుగలఁ; భవానేవ=నీవే; సం

స ౬౫

చింతయితుం=చక్కఁగా నాలోచించుటకు; అర్హాసి=తగుదువు.

అట్లగుటంజేసి, నీవుసర్వముం దెలిసినవాఁడవు, ఈకార్యము చెడకుండునట్టి వెరవు నీవచక్కఁగా నాలోచింపవలయును. అని, యంగదుండు జాంబవంతునితోఁ బలికెను. అని, తాత్పర్యము.

సోంగదేన తదా వీరః ప్రత్యుక్తః ప్లవగర్షభః
జాంబవా నుత్తరం వాక్యం ప్రోవాచే దం తతోంగదమ్. ౩౩

టీక ॥ ప్లవగర్షభః = వానరశ్రేష్ఠుఁడగు; వీరః = పరాక్రమశాలియయిన; సః=ఆ; జాంబవాన్ = జాంబవంతుఁడు; తదా=అప్పుడు; అంగదేన = అంగదునిచేత; ప్రత్యుక్తః=బదులుచెప్పఁబడినవాఁడై; తతః=అటుపిమ్మట; అంగదం=అంగదునిగూర్చి; ఉత్తరం= బదులైన; ఇదం=ఈ; వాక్యం=మాటను; ప్రోవాచ=చెప్పెను.

పరాక్రమవంతుండు వానరోత్తముండునగు నజ్జాంబవంతుండు, అప్పుడు అంగదుండు పలికిన తెఱంగు విని, యంతనంగదుం జూచి, యిట్లని ప్రత్యుత్తరంబుఁ జెప్పెను. అని, తాత్పర్యము.

అస్య తే వీర కార్యస్య న కించి త్పరిహీయతే
ఏష సంచోదయా మ్యేనం యః కార్యం సాధయిష్యతి. ౩౪

టీక ॥ వీర = పరాక్రమవంతుఁడవగు నంగదుఁడా! తే=నీయొక్క; అస్య=ఈ; కార్యస్య=పనికి; కించిత్ = కొంచెమైనను; న పరిహీయతే= కొఱఁతవడదు. యః=ఎవ్వఁడు; కార్యం=పనిని; సాధయిష్యతి = సాధింపఁగలఁడో! తం (అధ్యాహృతము) = అట్టి; ఏనం=ఈతని; ఏషః (అహం)=ఈనేను; సంచోదయామి=ప్రేరించుచున్నాను.

పరాక్రమశాలివగు నంగదుఁడా! నీకార్యమునకుఁ గొంచెమయినను గొఱంత గలుగదు; ఈకార్యంబు సాధింపఁగల మహావీరు, నిదిగో, పంపుచున్నాను. అని జాంబవంతుండు, అంగదునితోఁ జెప్పెను. అని, తాత్పర్యము.

తతః ప్రతీతం ప్లవతాం వరిష్ఠ
మేకాంత మాశ్రిత్య సుఖోపవిష్టమ్

సంచోదయామాస హరిప్రవీరో
హరిప్రవీరం హనుమంత మేవ. ౩౫

టీక ॥ తతః = అటుపిమ్మట; హరిప్రవీరః = వానరులలోమిక్కిలియు వీరుఁడగు జాంబవంతుండు; ప్రతీతం = ప్రసిద్ధుండును; ప్లవతాం = ఎగురువారిలో; వరిష్ఠం = శ్రేష్ఠుండును; ఏకాంతం = రహస్యప్రదేశమును; ఆశ్రిత్య = పొంది; సుఖోపవిష్టం = సుఖముగాఁగూర్చుండినవాఁడును; హరిప్రవీరం = వానరులలో మిక్కిలియు వీరుండునగు; హనుమంతమేవ = హనుమంతునే; సంచోదయామాస = ప్రేరేపించెను.

అంత, వానరవీరులలో మేటియగు జాంబవంతుండు, అచ్చటి వానరులనందఱనుపేక్షించి, బలపరాక్రమంబులం బ్రఖ్యాతుండును ఆకాశంబున నెగసితిరుగువారిలో నుత్తముండునగువాని నేకాంత ప్రదేశంబున సుఖముగాఁ గూర్చుండియున్నవాని వానరవీరులకెల్లమేటివీరుండనంబరఁగినవాని హనుమంతుం జేరి, యతనిసముద్రతరణార్థమయి ప్రేరించెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, పంచషష్టితమస్సర్గః.
ఇది, స్పష్టార్థము.
ఇది, పరమార్థ చంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ పంచషష్టితమసర్గటీక,
ముగిసినది.

---

శ్రీ.

షట్ షష్టితమసర్గప్రారంభః.

అనేకశతసాహస్రీం విషణ్ణాం హరివాహినీమ్
జాంబవాన్ సముదీక్ష్యైవం హనుమంత మథాబ్రవీత్. ౧

టీక ॥ అథ=అంత; జాంబవాన్= జాంబవంతుఁడు; విషణ్ణాం = దుఃఖిత

మయిన; అనేకశతసాహస్రీం = పెక్కు లక్షలసంఖ్యగల; హరివాహినీం = వానరసేనను; సమువీక్ష్య = చూచి; ఏనం = ఈ; హనుమంతం = హనుమంతునిగూర్చి; అబ్రవీత్ = పలికెను.

అంత, జాంబవంతుండు, పెక్కులక్షలసంఖ్యగల యవ్వానరసేనయంతయు దుఃఖితమయి యుండుటంగని, ఈహనుమంతునిం జేరనరిగి, యిట్లనిపలికెను. అని, తాత్పర్యము.

వీర వానరలోకస్య సర్వశాస్త్ర విశారద
తూష్ణీ మేకాంత మాశ్రిత్య హనుమన్ కిం నజల్పసి. ౨

టీక ॥ వానరలోకస్య = వానరసమూహములో; వీర = పరాక్రమవంతుఁడవు; సర్వశాస్త్రవిశారద = సమస్తశాస్త్రములయందును బండితుఁడవగు; హనుమన్ = హనుమంతుఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; తూష్ణీం = ఊరక; ఏకాంతం = రహస్యప్రదేశమును; ఆశ్రిత్య = పొంది; కిం = ఎందుకు; నజల్పసి = పలుకవు?

వానరులకెల్ల మేటివీరుఁడవు సమస్త శాస్త్రములయందును బండితుఁడవునగు హనుమంతుఁడా! నీవు ఏకాంతస్థలంబున నూరకకూర్చుండియున్నావే కాని ఏలపలుకవు? అని, తాత్పర్యము.

హనుమన్ హరిరాజస్య సుగ్రీవస్య సమో హ్యసి
రామలక్ష్మణయోశ్చాపి తేజసాచ బలేనచ. ౩

టీక ॥ హనుమన్ = హనుమంతుఁడా! త్వం (అధ్యాహృతము) = నీవు; తేజసాచ = పరాక్రమముచేతను; బలేనచ = బలముచేతను; హరిరాజస్య = వానరరాజయిన; సుగ్రీవస్య = సుగ్రీవునకును; రామలక్ష్మణయోశ్చాపి = రామునకును లక్ష్మణునకును; సమః = సమానుఁడవు; అసిహి = అగుదువుగదా!

హనుమంతుఁడా! నీవు, పరాక్రమంబునను బలంబునను, వానరరాజు సుగ్రీవునితోను రామలక్ష్మణులతోను సరివచ్చువాఁడవుగదా! అని, తాత్పర్యము.

అరిష్టనేమినః పుత్త్రో వైనతేయో మహాబలః
గరుత్మానితి విఖ్యాత ఉత్తమ స్సర్వపక్షిణామ్. ౪

టీక॥ అరిష్టనేమినః(అరిష్టనేమేః)= కశ్యప ప్రజాపతియొక్క; పుత్రః = కొడుకును; వైనతేయః=వినతయొక్క కొడుకును; మహాబలః = అధికమయినబలముగలవాఁడును; సర్వపక్షిణాం= సమస్తపక్షులలోను; ఉత్తమః = శ్రేష్ఠుఁడునగు; గరుత్మానితి = గరుత్మంతుఁడని; విఖ్యాతః = ప్రసిద్ధుఁడయినవాఁడు; అస్తి (ఆధ్యాహృతము)= కలఁడు.

కశ్యపప్రజాపతికి వినతయందుఁ బుట్టినవాఁడు మహాబలశాలి సమస్తపక్షులలోను శ్రేష్ఠుండు గరుత్మంతుఁడని పేరుగలవాఁడొకఁడు కలఁడు.

అని, తాత్పర్యము.

బహుశో హి మయా దృష్ట స్సాగరే స మహాబలః
భుజగా నుద్ధరన్ పక్షీ మహావేగో మహాయశాః. ౫

టీక॥ మహాబలః = అధికమయినబలముగవాఁడును; మహావేగః= అధికమయిన వేగముగలవాఁడును; మహాయశాః = అధికమయిన కీర్తిగలవాఁడును నగు; సః= ఆ; పక్షీ = గరుత్మంతుఁడు; సాగరే = సముద్రమునందు; భుజగాన్ = సర్పములను; ఉద్ధరన్= హరించుచు; మయా=నాచేత; బహుశః= పెక్కుమార్లు; దృష్టోహి=చూడఁబడినాఁడుగదా!

మహాబలశాలియు నధికమయిన వేగముగలవాఁడును మహాకీర్తిశాలియు నగు నాగరుత్మంతుండు, సముద్రంబున సర్పంబులం బట్టుకొనిపోవునపుడు, అతని నేను పెక్కుమార్లు చూచియున్నాను.

అని, తాత్పర్యము.

పక్షయో ర్య ద్బలం తస్య తావ ద్భుజబలం తవ
విక్రమశ్చాపి వేగశ్చ న తే తే నాపహీయతే. ౬

టీక॥ తస్య= ఆగరుత్మంతునియొక్క; పక్షయోః = ఱెక్కలయొక్క; బలం=బలిమి; యత్ =ఏదో; తవ=నీయొక్క; భుజబలం = బాహువులయొక్కబలము; తావత్ =అంతటిది. తే= నీయొక్క; విక్రమశ్చాపి = పరాక్రమమును; వేగశ్చ=వేగమును; తేన= (పంచమ్యర్థమందుఁ దృతీయ) ఆగరుత్మంతునికన్నను; నాపహీయతే=తగ్గదు.

ఆగరుత్మంతుని ఱెక్కలకెంత బల

ముగలవో నీబాహువులకంత బలముగలదు; నీపరాక్రమంబును వేగంబును అతనిపరాక్రమవేగంబులకు, ఎంతమాత్రము తకువైనవికాదు. అని, తా.

బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్త్వంచ హరిపుంగవ
విశిష్టం సర్వభూతేషు కి మాత్మానం న బుధ్యసే. ౭

టీక॥ హరిపుంగవ = వానరోత్తముఁడవగుహనుమంతుఁడా! తే(అధ్యాహృతము) = నీయొక్క; బలం=బలిమియు; బుద్ధిశ్చ=బుద్ధియు; తేజశ్చ=పరాక్రమమును; సత్త్వంచ= ధైర్యమును; సర్వభూతేషు = సమస్తభూతములయందును; విశిష్టం= శ్రేష్ఠము. ఆత్మానం=నిన్ను; నావబుధ్యసే కిం= ఎఱుఁగవా యేమి?

వానరశ్రేష్ఠుఁడవగు హనుమంతుఁడా! నీబలంబును బుద్ధియుఁ బరాక్రమంబును ధైర్యంబును మఱి యేభూతంబునందుఁ గానను; అట్టినిన్ను నీ వెఱుఁగవా యేమి? అని, తాత్పర్యము.

అప్సరా ప్సరసాం శ్రేష్ఠా విఖ్యాతా పుంజికస్థలా
అంజనేతి పరిఖ్యాతా పత్నీ కేసరిణో హరేః. ౮
విఖ్యాతా త్రిషు లోకేషు రూపేణా ఽప్రతిమా భువి
అభిశాపా దభూ త్తాత వానరీ కామరూపిణీ. ౯
దుహితా వానరేంద్రస్య కుంజరస్య మహాత్మనః

టీక॥ తాత=నాయనా! త్రిషు = మూడైన; లోకేషు=లోకములయందు; విఖ్యాతా=ప్రసిద్ధురాలును; రూపేణ= రూపముచేత; భువి=భూలోకమునందు; అప్రతిమా=సరిలేనిదియు; అప్సరసాం=అచ్చరలలో; శ్రేష్ఠా= ఉత్తమురాలును; పుంజికస్థలా=పుంజికస్థలయని; విఖ్యాతా=ప్రసిద్ధురాలగు; అప్సరా (అప్సరాః) = అచ్చర; అభిశాపాత్=శాపమువలన; కామరూపిణీ= ఇచ్ఛాధీనమయినరూపముగల; వానరీ= వానరస్త్రీ అయి; మహాత్మనః=అధికమయినపరాక్రమముగల; కుంజరస్య= కుంజరుఁడను; వానరేంద్రస్య= వానరశ్రేష్ఠునియొక్క; దుహితా= కొమార్తెయయి; అంజనేతి=అంజనయని; పరిఖ్యాతా=పేరుగలదై; కేసరిణః=కేసరియను; హరేః=వానరునకు; పత్నీ=

భార్యః అభూత్ = అయ్యెను.

నాయనా! ముల్లోకంబులనుం బ్రసిద్ధివహించినదియు రూపసౌందర్యంబులనసదృశయునగు, పుంజికస్థలయనునచ్చరమిన్న, శాపమువలన, మహాపరాక్రమశాలియగు వానరోత్తముఁడయినకుంజరునకుఁ గొమార్తెయయి వానరయోనియందుఁబుట్టి కామరూపిణియయియంజనయను పేరంబరఁగుచుఁ గేసరినివివాహమాడెను. అని, తాత్పర్యము.

కపిత్వే చారుసర్వాంగీ కదాచి త్కామరూపిణీ. ౧౦
మానుషం విగ్రహం కృత్వా రూపయౌవనశాలినీ
విచిత్రమాల్యాభరణా మహార్హక్షౌమవాసినీ. ౧౧
అచర త్పర్వత స్యాగ్రే ప్రావృడంబుదసన్నిభే

టీక ॥ కదాచిత్ = ఒకానొకప్పుడు; కపిత్వే = వానరిత్వమునందు; చారుసర్వాంగీ = సుందరములయిన యెల్ల యవయవములునుగలదియు; కామరూపిణీ = ఇచ్ఛానురూపమగు రూపముగలదియు నగు; సా (అధ్యాహృతము) = ఆయంజన; మానుషం = మనుష్యసంబంధియగు; విగ్రహం = రూపమును; కృత్వా = చేసికొని; రూపయౌవనశాలినీ = సౌందర్యముచేతను జవ్వనముచేతను బ్రకాశించుచున్నదై; విచిత్రమాల్యాభరణా = నానావిధములయిన పుష్పమాలికలును సొమ్ములునుగలదై; మహార్హక్షౌమవాసినీ = ఉత్తమమయిన పట్టుచీరఁగట్టుకొన్నదై; ప్రావృడంబుదసన్నిభే = వర్షాకాలమేఘముతో సమానమయిన; పర్వతస్య = కొండయొక్క; అగ్రే = శిఖరమునందు; అచరత్ = తిరిగెను.

వానరిగానున్నను సర్వాంగసుందరి యిచ్ఛకువచ్చినరూపము ధరింపఁజాలినదియునగు నయ్యంజన యొకానొకప్పుడు, మనుష్యస్త్రీ రూపముదాల్చి, రూపయౌవనంబులం దేజరిల్లుచు, నానావిధములయినపుష్పమాలికలునుభూషణంబులును ధరించి, మంచి పట్టుపుట్టంబుగట్టి, వర్షాకాలమేఘంబువలె నీలవర్ణమయిన పర్వతశిఖరంబున సంచరించెను. అని, తాత్పర్యము.

తస్యా వస్త్రం విశాలాక్ష్యాః పీతం రక్తదశం శుభమ్. ౧౨
స్థితాయాః పర్వత స్యాగ్రే మారుతోఽపహరచ్ఛనైః

టీక॥ మారుతః=వాయువు; పర్వతస్య = కొండయొక్క; అగ్రే = శిఖరమునందు; స్థితాయాః=ఉన్న; విశాలాక్ష్యాః = విశాలములయిన కన్నులుగల; తస్యాః = ఆయంజనయొక్క; పీతం = పసుపువన్నెగలదియు; రక్తదశం=ఎఱుపువన్నెగల కొనలుగలదియు; శుభం=సుందరమునగు; వస్త్రం=చీరను; శనైః=మెల్లగా; అపహరత్ =తొలఁగించెను.

అట్లు పర్వతాగ్రంబునసంచరించునపుడు; వెడఁదకన్నులుగల యయ్యంజనయొక్క, సుందరమయిన యెఱ్ఱనియంచులుగల పసుపుపట్టుపుట్టంబు వాయువేగంబునకుఁ గొంతదొలంగెను.

అని, తాత్పర్యము.

స దదర్శ తత స్తస్యా వృత్తా వూరూ సుసంహితౌ. ౧౩.
స్తనౌచ పీనౌ సహితౌ సుజాతం చారు చాననమ్

టీక॥ తతః= అందువలన; సః=ఆవాయువు; తస్యాః=ఆయంజనయొక్క; వృత్తౌ = గుండ్రనులును; సుసంహితౌ=మిక్కిలియుఁ జేరినవియునగు; ఊరూ=తొడలను; పీనౌ=బలిసినవియు; సహితౌ = కూడినవియునగు; స్తనౌ చ=స్తనములను; సుజాతం=చక్కనివియు; చారు=మనోహరమునగు; ఆననం చ=ముఖమును; దదర్శ=చూచెను.

అట్లు వస్త్రంబుదొలఁగుటయు, వాయుదేవుండు, గుండ్రంబులయి యొండొంటిం గదిసియున్న యాయంజనతొడలను బలిసియొకటితో నొకటియొరయుచుండు స్తనంబులను సుందరంబగు ముఖంబునుం గాంచెను.

అని, తాత్పర్యము.

తాం విశాలాయతశ్రోణీం తనుమధ్యాం సుశోభనామ్. ౧౪
దృష్ట్వైవ శుభసర్వాంగీం పవనః కామమోహితః

టీక॥ పవనః=వాయువు; విశాలాయతశ్రోణీం= వెడల్పులును నిడుపులునగు పిఱుఁదులుగలదియు; తనుమధ్యాం=సన్ననడుముగలదియు; సుశోభనాం=మిక్కిలియు మంగళాకారయు; శుభసర్వాంగీం= సుందరములయిన సమస్తావయవములునుగలదియునగు; తాం=ఆయంజనను; దృష్ట్వైవ= చూచినంత

నే; కామమోహితః = మన్మథునిచే మోహంబునొందింపఁబడినవాఁడు.

ఆ యంజనవిశాలంబులగు పిఱుందులును సన్నపికౌనును మంగళవిగ్రహంబును సుందరములగు సమస్తావయవంబులనుంజూచినంతనే, వాయుదేవుండు మన్మథమోహితుండయ్యెను.

అని, తాత్పర్యము.

స తాం భుజాభ్యాం దీర్ఘాభ్యాం పర్యష్వజత మారుతః. ౧౫
మన్మథావిష్టసర్వాంగో గతాత్మా తా మనిందితామ్

టీక ॥ సః=ఆ; మారుతః = వాయువు; అనిందితాం = నిందింపఁబడని; తాం=ఆయంజనను; గతాత్మా= పొందినమనస్సుగలవాఁడై; మన్మథావిష్టసర్వాంగః= మన్మథునిచేనావేశింపఁబడిన సమస్తావయవములును గలవాఁడై; దీర్ఘాభ్యాం = నిడుపులయిన; భుజాభ్యాం=చేతులచేత; తాం=ఆయంజనను; పర్యష్వజత = కవుఁగిలించెను.

అంతవాయువు, సర్వాంగసుందరియగు నాయంజనయందుఁదగిలిన మనస్సుగలవాఁడై, సమస్తావయవంబులను మన్మథావేశంబునొంది, యాయంజనను దీర్ఘంబులగుబాహువులం గవుఁగిలించెను. అని, తాత్పర్యము.

సా తు తత్రైవ సంభ్రాంతా సువృత్తా వాక్య మబ్రవీత్. ౧౬
ఏకపత్నీవ్రత మిదం కో నాశయితు మిచ్ఛతి

టీక ॥ సువృత్తా= మంచియాచారముగల, పతివ్రతయగుననుట; సాతు=ఆయంజనయు; తత్రైవ=అచటనే; సంభ్రాంతా = తొట్రుపాటునొందినదై; "కః=ఎవఁడు; ఇదం=ఈ; ఏకపత్నీవ్రతం = ఒకనికేభార్యగానుండువ్రతమును, పాతివ్రత్య వ్రతముననుట; నాశయితుం=చెఱచుటకు; ఇచ్ఛతి= కోరుచున్నాఁడు?" ఇతి(అధ్యాహృతము)= అని; వాక్యం=మాటను; అబ్రవీత్ =పలికెను.

పతివ్రతయగు నాయంజన యప్పుడు, తొట్రుపాటుతో, "ఎవ్వఁడు నా పాతివ్రత్యముఁ జెఱుపవచ్చినాఁడు" అను నీవచనంబుఁబలికెను.

అని, తాత్పర్యము.

అంజనాయా వచ శ్శ్రుత్వా మారుతః ప్రత్యభాషత. ౧౭

టీక॥ మారుతః=వాయువు; అంజనాయాః = అంజనాదేవియొక్క; వచః=మాటను; శ్రుత్వా=విని;ప్రత్యభాషత=బదులుపలికెను.

అంజనచెప్పినమాటనువిని, వాయుదేవుండిట్లని బదులుపలికెను.

అని, తాత్పర్యము.

న త్వాం హింసామి సుశ్రోణి మాభూత్తే సుభగే భయమ్
మనసా స్మి గతో య త్త్వాం పరిష్వజ్య యశస్వినీమ్. ౧౮

టీక॥ యత్=ఏకారణమువలన; పరిష్వజ్య=కవుఁగిలించి; యశస్వినీం=అధికమయినకీర్తిగల; త్వాం=నిన్ను; మనసా=మనస్సుచేత; గతః = పొందినవాఁడను;అస్మి=అగుచున్నాను; తత్ (అధ్యాహృతము) = అందువలన;సుశ్రోణి = సుందరములయినపిఱుఁదులుగలదానా! త్వాం=నిన్ను; నహింసామి=హింసింపను. సుభగే = మనోజ్ఞురాలా! తే=నీకు; భయం=వెఱపు;మాభూత్ = కలుగకుండుఁగాక.

సుందరములయిన పిఱుందులు గలదానా! సర్వాంగసుందరీ! నేనుబతిగ్రవతనగు నిన్నుఁ గౌఁగిలించి మనస్సుచేసీలోఁబ్రవేశించితినిగానివేఱుగాదు, కావుననీపాతివ్రత్యమునకుభంగములేదు; నీవు భయపడవలదు.

అని, తాత్పర్యము.

వీర్యవాన్ బుద్ధిసంపన్న స్తవ పుత్త్రో భవిష్యతి

టీక॥ తవ=నీకు;వీర్యవాన్=అధికమయినపరాక్రమముఁగలవాఁడును; బుద్ధిసంపన్నః=బుద్ధితోఁ గూడినవాఁడునగు;పుత్త్రః=కొడుకు; భవిష్యతి=కలుగఁగలఁడు.

నీకు మహాపరాక్రమశాలియు మహాబుద్ధిశాలియునగు కొడుకు పుట్టఁగలఁడు. అని, తాత్పర్యము.

మహాసత్త్వో మహాతేజా మహాబలపరాక్రమః. ౧౯
లంఘనే ప్లవనేచైవ భవిష్యతి హి మత్సమః

టీక ॥ సః (అధ్యాహృతము)= ఆతఁడు; మహాసత్త్వః = అధికమయిన ధైర్యముగలవాఁడును; మహాతేజాః= అధికమయినతేజస్సుగలవాఁడును; మ

హాబలపరాక్రమః = అధికమయినబలమును బరాక్రమమును గలవాఁడును; లంఘనే = దాఁటుటయందును; ప్లవనేచైవ=ఎగురుటయందును; మత్సమః= నాతోసమానుఁడును; భవిష్యతిహి = కాఁగలఁడుగదా!

మఱియు నాతండు మహాధైర్యంబును మహాప్రభావంబును గొలఁదిలేని బలపరాక్రమంబులు గలవాఁడును దాఁటుటయందును ఆకాశగమనంబునందు నునాకుసదృశుండునై యుండఁగలఁడు. అనివాయువుఅంజనతోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

ఏవ ముక్తా తత స్తుష్టా జననీ తే మహాకపే. ౨౦
గుహాయాం త్వాం మహాబాహో ప్రజజ్ఞే ప్లవగర్షభమ్

టీక॥ మహాకపే = మహావానరుఁడా! మహాబాహో = గొప్పచేతులు గలవాఁడా! తే=నీయొక్క; జననీ=తల్లి; ఉక్తా = చెప్పఁడినదై; తతః=అంత; తుష్టా = సంతసించినదై; గుహాయాం= గుహయందు; ప్లవగర్షభం= వానరశ్రేష్ఠుండవగు; త్వాం=నిన్ను; ప్రజజ్ఞే = కనెను.

మహాబాహుండవగు హనుమంతుఁడా! ఇవ్విధంబునవాయుదేవుండుపలుకుటయు, నీతల్లియంజ నాదేవిసంతోషించినదై, గుహయందు సర్వవానరోత్తముని నిన్నుఁబ్రసవించెను.

అని, తాత్పర్యము.

అభ్యుత్థితం తత స్సూర్యం బాలో దృష్ట్వా మహావనే. ౨౧
ఫలంచేతి జిఘృక్షు స్త్వ ముత్ప్లుత్యాభ్యుద్గతో దివమ్

టీక॥ తతః=అటుపిమ్మట; బాలః= శిశువయిన; త్వం=నీవు; మహావనే= గొప్పయరణ్యమునందు; అభ్యుత్థితం= ఉదయించిన; సూర్యం=సూర్యుని; దృష్ట్వా=చూచి;ఫలమితి = పండని; మత్వా(అధ్యాహృతము)చ=తలఁచియు; ఉత్ప్లుత్య=ఎగిరి; దివం= ఆకాశమును; అభ్యుద్గతః=పోఁదినావు.

అంత, నీవు జన్మమునొందినంతనె బాలుండవైయె యమ్మహారణ్యంబున సూర్యుండుదయించుటనుజూచియదియొకఫలంబనితలంచిఁ దానిందినుటకై యెగిరి యాకాశమార్గంబునఁబోతివి.

అని, తాత్పర్యము.

శతాని త్రీణి గత్వాథ యోజనానాం మహాకపే. ౨౨
తేజసా తస్య నిర్ధూతో న విషాదం గత స్తతః

టీక ॥ మహాకపే= మహావానరుఁడా! అథ=అంత; యోజనానాం= ఆమడలయొక్క; త్రీణి = మూడైన; శతాని = నూర్లను; ఇది పెక్కునూర్ల యోజనములనుట కుపలక్షణము. అట్లు "బహుయోజన సాహస్రంక్రామ న్నేవ తతోంబరం" (అంత ఇతఁడు పెక్కు వేల యోజనములుగల యాకాశమునుదాఁటెను) అనియుత్తరకాండమునం జెప్పఁబడుచున్నది. గత్వా=పొంది; తస్య = ఆసూర్యునియొక్క; తేజసా= వేఁడిమిచేత; నిర్ధూతః=తిరస్కరింపఁబడినవాఁడవై; తతః = అందువలన; విషాదం= అలసటను; నగతః = పొందినాఁడవు కావు.

వానరోత్తముఁడా! అంత నీవు, పెక్కునూర్ల యోజనంబులదూరము ఆకాశంబునం బోయి, సూర్యుని వేఁడిమికి ఎంతమాత్రము శ్రమమునొందవైతివి, అని, తాత్పర్యము.

త్వావ దాపతత స్తూర్ణ మంతరిక్షం మహాకపే. ౨౩
క్షిప్త మింద్రేణ తే వజ్రం క్రోధావిష్టేన ధీమతా

టీక ॥ మహాకపే= మహావానరుఁడా! తూర్ణం=శీఘ్రముగా; తావత్ = అంతవఱకు; అంతరిక్షం = ఆకాశమును; ఆపతతః = పొందుచున్న; తే=నీకు; క్రోధావిష్టేన = కోపముచేత నావేశింపఁబడినవాఁడును; ధీమతా= బుద్ధిమంతుఁడును నగు; ఇంద్రేణ = ఇంద్రునిచేత; వజ్రం = వజ్రాయుధము; క్షిప్తం= వేయఁబడినది.

వానరోత్తముఁడా! నీవు బహువేగంబున నట్లు అంతరిక్షంబున నంతదూరమువఱకువచ్చుటం జూచి, బుద్ధిమంతుండగు నింద్రుండు, నీవలన లోకమున కేమి చేటుగలుగునో యని శంకించి, కుపితుండై, నీపై వజ్రాయుధంబుఁ బ్రయోగించెను. అని, తాత్పర్యము.

తత శ్శైలాగ్రశిఖరే వామో హను రభజ్యత. ౨౪
తతోహి నామధేయం తే హనుమానితి కీర్త్యతే

టీక॥ తతః=అటుపిమ్మట; శైలాగ్రశిఖరే = పర్వతముయొక్క పైశిఖరమున

నందు; వామః=ఎడమదైన; హనుః= చెక్కిలిమీఁదిభాగము; అభజ్యత = విఱువఁబడెను. తతోహి=అందువలననే కదా; తే=నీకు; నామధేయం=పేరు; హనుమానితి=హనుమంతుఁడు (హనువుగలవాఁడు, ఇంద్రుని వజ్రాయుధంబు వ్రేటున విఱిగినహనువు గలవాఁడనుట) అని; కీర్త్యతే = చెప్పఁబడుచున్నది.

అంత, ఆవ్రేటునకు, నీవుపర్వతశిఖరంబునం బడుటయు, నీయెడమ హనువువిఱిగినది; అందువలననే నీకు హనుమంతుఁడని పేరుపరఁగినది.

అని, తాత్పర్యము.

పతితం నిహతం దృష్ట్వా వాయు ర్గంధవహ స్స్వయమ్. ౨౫
త్రైలోక్యే భృశసంక్రుద్ధో నవవౌ వై ప్రభంజనః

టీక॥ ప్రభంజనః = మిక్కిలియువిఱుచువాఁడును; గంధవహః=గంధము వహించువాఁడునగు; వాయుః = వాయువు; నిహతః= కొట్టఁబడినవాఁడవును; పతితం=పడినవాఁడవునగు; త్వాం (అధ్యాహృతము) = నిన్ను; దృష్ట్వా= చూచి; భృశసంక్రుద్ధః = మిక్కిలియుఁ గోపించినవాఁడై; త్రైలోక్యే = ముల్లోకములయందును; నవవౌ=వీవలేదు "వై" అనునదిపాదపూరణార్థము.

సమస్తమును విఱిచివేయువాఁడును గంధమువహించి లోకములకుసుఖము గలిగించువాఁడునగు వాయుదేవుఁడు, ఇంద్రుఁడునిన్నట్లుకొట్టి పడఁద్రోయుటం జూచి, పరమకుపితుండగుటయు, ముల్లోకంబులను, ఎంతమాత్రము గాలివీవకుండెను. అని, తాత్పర్యము.

సంభ్రాంతా శ్చ సురా స్సర్వే త్రైలోక్యే క్షుభితేసతి. ౨౬
ప్రసాదయంతి సంక్రుద్ధం మారుతం భువనేశ్వరాః

టీక ॥ త్రైలోక్యే = ముల్లోకములు; క్షుభితేసతి = కలఁతనొందినవగుచుండఁగా; భువనేశ్వరాః = లోకనాథులయిన; సురాః = దేవతలు; సర్వేచ = అందఱును; సంభ్రాంతాః= తొట్రుపాటు నొందినవారలయి; సంక్రుద్ధం= మిక్కిలియుఁగోపించిన; మారుతం=వాయువును; ప్రసాదయంతి = ప్రసన్నునిఁజేసిరి.

అంతముల్లోకంబులును క్షుభితంబు

లగుటయు లోకనాధులగు సురలుసంభ్రమంబునొంది, కుపితుండగు వాయుదేవు నాశ్వాసించిరి.

అని, తాత్పర్యము.

ప్రసాదితేచ పవనే బ్రహ్మా తుభ్యం వరం దదౌ. ౨౭
అశస్త్రవధ్యతాం తాత సమరే సత్యవిక్రమ

టీక॥ సత్యవిక్రమ = సత్యమయిన పరాక్రమముగలవాఁడా! తాత= నాయనా! పవనే=వాయువు; ప్రసాదితేచ = ఆశ్వాసింపఁబడినవాఁడుకాఁగానే; బ్రహ్మా=బ్రహ్మదేవుఁడు;తుభ్యం=నీకొఱకు;సమరే=యుద్ధమునందు; అశస్త్రవధ్యతాం=ఆయుధములచే వధింపఁదగినవాఁడు గాకుండుటయను; వరం=వరమును; దదౌ=ఒసంగెను.

సత్యపరాక్రముఁడవగు నాయనా! అంత వాయువుప్రసన్నుండయినపిదప, బ్రహ్మదేవుండు, యుద్ధంబున నాయుధంబులచేవధ్యుండవుగాకుండునట్లు నీకువరంబొసంగెను. అని, తాత్పర్యము.

వజ్రస్యచ నిపాతేన విరుజం త్వాం సమీక్ష్యచ. ౨౮
సహస్రనేత్రః ప్రీతాత్మా దదౌ తే వర ముత్తమమ్
స్వచ్ఛందతశ్చ మరణం తే భూయా దితి వై ప్రభో. ౨౯

టీక ॥ ప్రభో=సమర్థుండవగు హనుమంతుఁడా! సహస్రనేత్రః=వేయికన్నులుగలదేవేంద్రుఁడు; వజ్రస్య = వజ్రముయొక్క; నిపాతేనచ= దెబ్బచేతనుగూడ; విరుజం = బాధలేకున్న; త్వాం=నిన్ను; సమీక్ష్యచ=చూచియు; ప్రీతాత్మా= సంతోషించినమనస్సుగలవాఁడై; "తే=నీకు; మరణం= చావు; స్వచ్ఛందతశ్చ= నీయిచ్ఛవలననె; భూయాత్ =అగుఁగాక." ఇతి=అని;("వై" అనునది పాదపూరణార్థము.) ఉత్తమం=శ్రేష్ఠమయిన; వరం=వరమును; తే=నీకొఱకు; దదౌ=ఇచ్చెను.

సమర్థుండవగు హనుమంతుఁడా! దేవేంద్రుండు, వజ్రాయుధంబు వ్రేటు నొందియు నీవు నొవ్వకుండుటం జూచి సంతుష్టుండై, నీకు, ఇచ్ఛవచ్చినపుడె మరణముగల్గునట్లుగా నుత్తమంబగు వరంబునొసంగెను. అని, తాత్పర్యము.

స త్వం కేసరిణః పుత్త్రః క్షేత్రజో భీమవిక్రమః

మారుతస్యౌరసః పుత్త్రస్తేజసా చాపి తత్సమః

టీక॥ భీమవిక్రమః = భయంకరమయినపరాక్రమముగల; సః = అట్టి; త్వం=నీవు; కేసరిణః = కేసరియొక్క; క్షేత్రజః = భార్యయందుఁబుట్టిన; పుత్త్రః= కొడుకవు, తనభార్యయందు ఒగునిబీజముచేఁబుట్టిన కొడుకు క్షేత్రజుండనఁబడును. మారుతస్య=వాయుదేవునియొక్క;ఔరసః = వీర్యమువలనఁబుట్టిన; పుత్త్రః=కొడుకవు. తేజసా = పరాక్రమముచేత; తత్సమశ్చాపి=వాయువుతోసమానుఁడవును.

అట్లు భయంకరమయిన పరాక్రమముగలనీవు, కేసరికి క్షేత్రజపుత్త్రుఁడవు, వాయువునకు ఔరసపుత్త్రుఁడవు, పరాక్రమంబున ఆవాయువునకుసరియయినవాఁడవు. అని, తాత్పర్యము.

త్వం హి వాయుసుతో వత్స ప్లవనే చాపి తత్సమః

వయ మద్య గతప్రాణా భవా న్నస్త్రాతు సాంప్రతమ్. ౩౧

దాక్ష్యవిక్రమసంపన్నః పక్షిరాజఇవాపరః

టీక॥ వత్స=బిడ్డా!త్వం=నీవు; వాయుసుతః=వాయుకుమారుఁడవును;ప్లవనే = ఎగురుటయందు; తత్సమశ్చాపి = ఆవాయువుతోసమానుఁడవును; దాక్ష్యవిక్రమసంపన్నః = సామర్థ్యముతోఁ గూడినవాఁడవును; అపరః = వేఱొక; పక్షిరాజఇవ (స్థితః)హి = గరుత్మంతుండువలె నున్నవాఁడవునుగదా! అద్య=ఇప్పుడు; వయం=మేము; గతప్రాణాః = పోయినప్రాణములుగలవారలము. సాంప్రతం=ఇపుడు; భవాన్=నీవు; నః=నమ్ము; త్రాతు=రక్షింపవలెను.

నాయనా ! నీవు, సాక్షాద్వాయుకుమారుఁడవు; ఎగురుటయందు ఆవాయువునకుసరియయినవాఁడవు, రెండవగరుత్మంతుఁడో యనందగినవాఁడవు, సామర్థ్యంబును బరాక్రమంబును గలవాఁడవు; ఇపుడు మాకుఁబ్రాణంబులు దక్కుట కష్టముగానున్నది కావున, నీవిపుడుమమ్మందఱనురక్షింపవలయును. అని, తాత్పర్యము.

త్రివిక్రమే మయా తాత సశైలవనకాననా. ౩౨

త్రిస్సప్తకృత్వః పృథివీ పరిక్రాంతా ప్రదక్షిణమ్

స ౬౬

టీక॥ తాత = నాయనా! త్రివిక్రమే = మూడడుగులుంచుకాలమునందు; మయా = నాచేత; సశైలవనకాననా = పర్వతములతోను చిన్నయడవులతోను మహావనములతోనుగూడిన; పృథివీ = భూమి; త్రిః = మూఁడైన; సప్తకృత్వః = ఏడుమార్లు, ఇరువదియొక్క మాఱులు; ప్రదక్షిణం = ప్రదక్షిణముగా; పరిక్రాంతా = చుట్టఁబడినది.

నాయనా! విష్ణుదేవుండు, త్రివిక్రమావతారంబునొందినప్పుడు, నేను బర్వతములతో నరణ్యములతోనుం గూడిన యీభూమండలమునకంతయు నిరువదియొకమాఱు ప్రదక్షిణము గావించితిని. అని, తాత్పర్యము.

తథా చౌషధయో స్మాభి స్సంచితా దేవశాసనాత్. ౩౩
నిష్పన్న మమృతం యాభి స్తదా సీన్నో మహ ద్బలమ్

టీక॥ తథాచ = అట్లు; యాభిః = ఏయోషధులచే; అమృతం = అమృతము; నిష్పన్నం = పుట్టినవో; తాః (అధ్యాహృతము) = అట్టి; ఓషధయః = మూలికలు; అస్మాభిః = మాచేత; దేవశాసనాత్ = దేవతలయాజ్ఞవలన; సంచితాః = కూర్పఁబడినవి. తదా = అప్పుడు; నః = మాకు; మహత్ = గొప్పదగు; బలం = బలిమి; ఆసీత్ = ఉండెను.

ఇంతియగాక, మున్ను అమృతమథనంబున, సముద్రమున వేసిచిలుకుటకై, దేవతలపంపున, నానావిధ మూలికలను బోగుచేసితిని; ఆ యోషధులువేసి చిలుకుటవలననె, సముద్రంబున నుండి యమృతంబు పుట్టినది; అప్పుడు, మాకు అధికబలంబుండినది.

అని, తాత్పర్యము.

స ఇదానీ మహం వృద్ధః పరిహీనపరాక్రమః. ౩౪
సాంప్రతం కాల మస్మాకం భవా న్సర్వగుణాన్వితః

టీక॥ సః = అట్టి; అహం = నేను; ఇదానీం = ఇపుడు; వృద్ధః = ముసలివాఁడను; పరిహీనపరాక్రమః = తగ్గినపరాక్రమముగలవాఁడను. సాంప్రతం = ఈ; కాలం = (అత్యంతసంయోగద్వితీయ) కాలమునందు; అస్మాకం = మాలోఁ; భవాన్ = నీవు; సర్వగుణాన్వితః = సమస్తగుణములతోఁగూడినవాఁడవు.

అట్టివాఁడను నేసిప్పుడు ముసలివాఁడనైనందున, నాపరాక్రమంబు తగ్గినది; ఈకాలమునందు, మాలో నెల్లనీవయన్నిశక్తులుఁ గలవాఁడవు.

అని, తాత్పర్యము.

త ద్విజృంభస్వ విక్రాంతః ప్లవతా ముత్తమో హ్యసి. ౩౫

టీక ॥ తత్=అందువలన; త్వం (అధ్యాహృతము)=నీవు; విక్రాంతః= పరాక్రమమునొందినవాఁడవై; విజృంభస్వ = విజృంభింపుము. త్వం (అధ్యాహృతము)= నీవు; ప్లవతాం=దాఁటువారలలో; ఉత్తమః=శ్రేష్ఠుఁడవు; అసిహి=అగుచున్నావుగదా!

అందువలనఁ బరాక్రమం బవలంబించి విజృంభింపుము, నీవు దాఁటువారలలో నుత్తముఁడవుగదా!

అని, తాత్పర్యము.

త్వద్వీర్యం ద్రష్టుకామే యం సర్వా వానరవాహినీ
ఉత్తిష్ఠ హరిశార్దూల లంఘయస్వ మహార్ణవమ్. ౩౬

టీక ॥ ఇయం= ఈ; వానరవాహినీ=వానరసైన్యము; సర్వా= సమస్తమును; త్వద్వీర్యం=నీపరాక్రమమును; ద్రష్టుకామా= చూడఁగోరినది. హరిశార్దూల= వానరశ్రేష్ఠుఁడా! ఉత్తిష్ఠ=లెమ్ము. మహార్ణవం=మహాసముద్రమును; లంఘయస్వ=దాఁటుము.

వానరోత్తముఁడా! ఈ వానరవీరులందఱు నీపరాక్రమముఁ జూచుటకై నిరీక్షించియున్నారు; లేచి; సముద్రంబు లంఘింపుము. అని, తాత్పర్యము.

వరా హి సర్వభూతానాం హనుమ న్యా గతి స్తవ

టీక॥ హనుమన్ = హనుమంతుఁడా! తవ = నీయొక్క; గతిః=గమనము; యా (అస్తి) = ఏదిగలదో; సా (అధ్యాహృతము) = అది; సర్వభూతానాం = సమస్తభూతములలోను; వరా హి = ఉత్తమముగదా!

హనుమంతుఁడా! నీకుంగలగమనశక్తి యేభూతంబునకును లేదుగదా!

అని, తాత్పర్యము.

విషణ్ణా హరయ స్సర్వే హనుమన్ కి ముపేక్షసే. ౩౭
విక్రమస్వ మహావేగో విష్ణు స్త్రీ న్విక్రమా నివ

టీక ॥ హనుమన్ = హనుమంతుఁడా! హరయః = వానరులు; సర్వే= అందఱును; విషణ్ణాః = దుఃఖమునొందినారు. కిం=ఎందుకు; ఉపేక్షసే=ఉపేక్షించుచున్నావు? మహావేగః=అధికమయినవేగముగలవాఁడవై; త్రీన్ = మూఁడయిన; విక్రమానివ = అడుగులను; విష్ణురివ = వెన్నుఁడువలె; విక్రమస్వ = దాఁటుము.

హనుమంతుఁడా! వానరులందఱు దిగులుపడియుండఁగా, నీవిట్లుపేక్షింపవచ్చునా? మున్నువిష్ణుదేవుండు, బలిచక్రవర్తియొసంగిన మూఁడడుగులనాక్రమించినట్లు నీవు మహావేగంబునూని సముద్రంబులంఘింపుము. అని, జాంబవంతుండు హనుమంతునితోఁ జెప్పెను.

అని, తాత్పర్యము.

తతస్తు వై జాంబవతా ప్రచోదితః
ప్రతీతవేగః పవనాత్మజః కపిః। ౩౬
ప్రహర్షయం స్తాం హరివీరవాహినీమ్
చకార రూపం పవనాత్మజ స్తదా

టీక॥ తతస్తు=అంతను("వై"అనునది పాదపూరణార్థము); పవనాత్మజః= వాయుకుమారుఁడైన; కపిః=హనుమంతుఁడు; జాంబవతా = జాంబవంతునిచే; ప్రచోదితః = ప్రేరింపఁబడినవాఁడై; ప్రతీతవేగః=తెలియఁబడిన వేగముగలవాఁడై; తం= ఆ; హరివీరవాహినీం= వానరవీరసైన్యమును; ప్రహర్షయన్ = సంతోషింపఁజేయుచు; రూపం=ఆకారమును; చకార=చేసెను, పెంచెననుట.

అంతనవుడట్లు జాంబవంతుండుబోధించి ప్రేరింప వేల్పూని దనబలపరాక్రమవేగాతిశయంబుఁ దెలిసి, ఆవానరవీరులందఱుఁ బరమసంతోషంబు నొందునట్లు, అద్భుతంబుగా మేనుఁ బెంచెను.

అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే,
కిష్కింధాకాండే, షట్షష్టితమస్సర్గః.

ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానంబునందుఁ, గిష్కింధాకాండ షట్షష్టితమసర్గటీక, ముగిసినది.

౬౭

## సప్తషష్టితమసర్గప్రారంభః.

తం దృష్ట్వా జృంభమాణం తే క్రమితుం శతయోజనమ్
వీర్యేణా పూర్యమాణంచ సహసా వానరోత్తమమ్. ౧
సహసా శోక ముత్సృజ్య ప్రహర్షేణ సమన్వితాః
వినేదు స్తుష్టువుశ్చాపి హనుమంతం మహాబలమ్. ౨

టీక ॥ తే= ఆవానరులు; శతయోజనం = నూఱుయోజనములను; క్రమితుం=దాటుటకు; జృంభమాణం=వృద్ధినొందుచున్నవాఁడును; సహసా = శీఘ్రముగా; వీర్యేణ=పరాక్రమముచేత; ఆపూర్యమాణంచ= నిండింపఁబడుచున్నవాఁడునగు; వానరోత్తమం=వానరశ్రేష్ఠుఁడయిన; తం=ఆహనుమంతుని; దృష్ట్వా=చూచి; సహసా= శీఘ్రముగా; శోకం= దుఃఖమును; ఉత్సృజ్య=విడిచి; ప్రహర్షేణ= సంతోషముతో; సమన్వితాః= కూడినవారలయి; వినేదుః=అఱచిరి. మహాబలం= అధికమయినబలముగల; హనుమంతం= హనుమంతుని; తుష్టువుశ్చాపి = పొగడిరియు.

అంత, నూఱుయోజనంబుల సముద్రంబులంఘింపఁబూని వృద్ధినొందుచున్నవాని నంతకంతకుఁ బరాక్రమంబున నతిశయించుచున్నవాని వానరోత్తము నా హనుమంతుంజూచి, యవ్వానరవీరులు, శీఘ్రమున దుఃఖమువిడిచి పరమానందంబునొంది, సింహనాదంబులు సేయుచు, మహాబలుండగు నా హనుమంతుం బ్రస్తుతించిరి.

అని, తాత్పర్యము.

ప్రహృష్టా విస్మితాశ్చైవ ప్రేక్షంతేస్మ హనూమతః
త్రివిక్రమకృతోత్సాహం నారాయణమివ ప్రజాః. ౩

టీక ॥ తే (అధ్యాహృతము) = ఆవానరులు; ప్రహృష్టాః= మిక్కిలియు సంతసించినవారలయి; విస్మితాశ్చైవ = ఆశ్చర్యమునొందినవారలునై; ప్రజాః = ప్రజలు; త్రివిక్రమకృతోత్సాహం= ముమ్మాఱడుగులుంచుటయం

దుఁ జేయఁబడిన యుత్సాహముగల; నారాయణమివ= నారాయణునివలె; తం (అధ్యాహృతము) = ఆహనుమంతుని; సమంతతః = అంతటను; వీక్షాంచక్రుః=చూచిరి.

త్రివిక్రమావతారంబున నారాయణునిభూతంబులు చూచినట్లు, అవ్వానరులందఱు, సముద్రంబుదాఁటుటయందుత్సాహంబునొంది వృద్ధిఁబొందుచున్న యా హనుమంతుని, సంతోషమునాశ్చర్యంబునుం బొందిచూచిరి.

అని, తాత్పర్యము.

సంస్తూయమానో హనుమాన్ వ్యవర్ధత మహాబలః
సమావిధ్య చ లాంగూలం హర్షాచ్చ బల మే యివాన్. ౪

టీక ॥ మహాబలః = అధికమయినబలముగల; హనుమాన్= హనుమంతుండు; సంస్తూయమానః = పొగడఁబడుచున్నవాఁడై; లాంగూలం = తోఁకను; సమావిధ్య చ = ఆడించియు;హర్షాచ్చ = సంతోషమువలనను; బలం= బలమును; ఏయివాన్ = పొందినవాఁడై; వ్యవర్ధత = వర్ధిల్లెను.

మహాబలశాలియగు నాహనుమంతుఁడు, తన్నుఅట్లువానరు లనేకవిధంబులం బొగడుటయు, సంతోషోత్సాహంబు లతిశయిల్లఁ, దోఁకయాడించుచు, అంతకంతకు బలపరాక్రమంబుల, వృద్ధినొందెను. అని, తాత్పర్యము.

తస్య సంస్తూయమానస్య వృద్ధై ర్వానరపుంగవైః
తేజసా పూర్యమాణస్య రూప మాసీ దనుత్తమమ్. ౫

టీక॥ వృద్ధైః=ముసలివారైన; వానరపుంగవైః=వానరశ్రేష్ఠులచేత; సంస్తూయమానస్య = పొగడఁబడుచున్నవాఁడును; తేజసా=పరాక్రమముచే; ఆపూర్యమాణస్య = నింపఁబడుచున్నవాఁడునగు; తస్య = ఆహనుమంతుని యొక్క; రూపం=ఆకారము;అనుత్తమం=తనకన్నశ్రేష్ఠములేనిది; ఆసీత్= అయ్యెను.

అట్లు వృద్ధులగువానరవీరులుచేయు స్తోత్రములవలన, నంతకంతకు వృద్ధిఁబొందుచున్న పరాక్రమముతో నొప్పుచున్న యాహనుమంతునియాకారం బద్భుతమయి చూపట్టెను.

అని, తాత్పర్యము.

యథా విజృంభతే సింహో వివృద్ధో గిరిగహ్వరే
మారుత స్యౌరసః పుత్త్ర స్తథా సంప్రతి జృంభతే. ౬

టీక॥ యథా=ఎట్లు; గిరిగహ్వరే= పర్వతగుహయందు; వివృద్ధః = వృద్ధి నొందిన; సింహః=సింగము; విజృంభతే=విజృంభించునో; తథా=అట్లు; సంప్రతి=ఇప్పుడు; మారుతస్య = వాయువుయొక్క; ఔరసః = వీర్యమునకుఁబుట్టిన; పుత్త్రః=కొడుకైనహనుమంతుఁడు; జృంభతే=ప్రకాశించెను.

పర్వతగుహయందు సింహంబు విజృంభించువిధంబున, నప్పుడు వాయుకుమారుండగుహనుమంతుండు, విజృంభించెను. అని, తాత్పర్యము.

అశోభత ముఖం తస్య జృంభమాణస్య ధీమతః
అంబరీషమివా దీప్తం విధూమ ఇవ పావకః. ౭

టీక॥ జృంభమాణస్య= వృద్ధినొందుచున్న; ధీమతః= బుద్ధిమంతుఁడగు; తస్య = ఆహనుమంతునియొక్క; ముఖం = మొగము; ఆదీప్తం = మండుచున్న; అంబరీషమివ = వేఁపుడుచట్టివలె; విధూమః = పొగలేని; పావక ఇవ = నిప్పువలె; అశోభత=ప్రకాశించెను.

అట్లుబలపరాక్రమంబుల మేనుఁబెంచుచున్న బుద్ధిమంతుఁడగు నా హనుమంతునిముఖంబు, జ్వలించుచున్నవేఁపుడుచట్టివలెను ధూమరహితంబగు నగ్నివలెను దేదీప్యమానంబై యొప్పెను. అని, తాత్పర్యము.

హరీణా ముత్థితో మధ్యా త్సంప్రహృష్టతనూరుహః
అభివాద్య హరీ న్వృద్ధా న్హనుమా నిద మబ్రవీత్. ౮

టీక॥ హనుమాన్= హనుమంతుఁడు; హరీణాం = వానరులయొక్క; మధ్యాత్ = నడిమినుండి; ఉత్థితః=లేచినవాఁడై; సంప్రహృష్టతనూరుహః= మిక్కిలియుగగుర్పొడిచిన వెంట్రుకలుగలవాఁడై; వృద్ధాన్=ముసలివారగు; హరీన్ = వానరులను; అభివాద్య=నమస్కరించి; ఇదం=ఈమాటను; అబ్రవీత్ = పలికెను.

అంత, హనుమంతుఁడు, వానరమ

ధ్యంబునుండి లేచి, మేనం బ్రహర్షంబునఁ బులకలువొడమఁ, బెద్దలగువానరులకెల్ల నమస్కరించి, యిట్లని పలికెను. అని, తాత్పర్యము.

అరుజత్పర్వతాగ్రాణి హుతాశనసఖో నిలః
బలవా నప్రమేయశ్చ వాయు రాకాశగోచరః. ౯

టీక ॥ హుతాశనసఖః= అగ్నియొక్క చెలికాఁడును; అనిలః = గమనశీలుండును; బలవాన్=అధికమయినబలముగలవాఁడును; అప్రమేయశ్చ= కొలఁదిలేనివాఁడును; ఆకాశగోచరః= ఆకసంబునందిరుగువాఁడునగు; వాయుః= వాయుదేవుఁడు; పర్వతాగ్రాణి= పర్వతశిఖరములను; అరుజత్=విఱిచెను.

నిప్పుచెలియగు వాయుదేవుండు గమనశీలుండు బలవంతుండు, కొలఁదిలేని శక్తిగలవాఁడు, ఆకాశంబుననె సంచరించువాఁడు, అతండు, పర్వతశిఖరంబులనేనియు విఱిచివేసియున్నాఁడు. అని, తాత్పర్యము.

తస్యాహం శీఘ్రవేగస్య శీఘ్రగస్య మహాత్మనః
మారుతస్యౌరసః పుత్త్రః ప్లవనే నాస్తి మత్సమః. ౧౦

టీక ॥ అహం=నేను; తస్య=అట్టి; శీఘ్రవేగస్య= శీఘ్రమయిన వేగముగలవాఁడును; శీఘ్రగస్య=శీఘ్రముగానడచువాఁడును; మహాత్మనః = అధికమయిన బలముగలవాఁడునగు; మారుతస్య=వాయువుయొక్క; ఔరసః= వీర్యమునకుఁబుట్టిన; పుత్త్రః= కొడుకను; ప్లవనే= దాఁటుటయందు; మత్సమః= నాతోసరియయినవాఁడు; నాస్తి=లేఁడు.

నేను, అట్టి శీఘ్రగమనంబుగలవాఁడును మహావేగుండును మహాబలుండునగు వాయువునకుఁ బుట్టినవాఁడను; కావున, దాఁటుటయందు నాకుసమానండెవ్వఁడును లేఁడు. అని, తాత్పర్యము.

ఉత్సహేఽహం హి విస్తీర్ణ మాలిఖంతమి వాంబరమ్
మేరుం గిరి మసంగేన పరిగంతుం సహస్రశః. ౧౧

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; విస్తీర్ణం=విశాలమును; అంబ

రం=ఆకాశమును; ఆలిఖంతమివ (స్థితం)= ఒరయుచున్నట్లున్నదియునగు; మేరుం=మేరువను; గిరిం= పర్వతమును; అసంగేన=ఆలస్యములేమిచేత; సహస్రశః=వేయిమార్లు; పరిగంతుం=చుట్టుటకు; ఉత్సహేయంహి= చాలుదునుగదా!

నేను, నడుమఁ గొంచెమైనను విశ్రమింపక యతిశీఘ్రంబున అతివిశాలంబును ఆకాశంబు నొరయునట్లున్నదియునగు మేరుపర్వతమునకు, వేయిమార్లు ప్రదక్షిణంబుగావింతును.

అని, తాత్పర్యము.

బాహువేగప్రణున్నేన సాగరేణాహ ముత్సహే
సమాప్లావయితుం లోకం సపర్వతనదీహ్రదమ్. ౧౨

టీక॥ అహం=నేను; బాహువేగప్రణున్నేన=భుజములయొక్క వేగముచేఁ బ్రేరింపఁబడిన; సాగరేణ=సముద్రముచేత; సపర్వతనదీహ్రదం=కొండలతోను నదులతోను మడుగులతోనుం గూడిన; లోకం=భూమిని; సమాప్లావయితుం=ముంచుటకు; ఉత్సహే = చాలుదును.

నేను, బాహువుల సముద్రజలంబు నుత్రోచిపుచ్చి, పర్వతంబులతోను నదులతోను మడుగులతోనుం గూడిన యీ భూమండలంబంతయు జలములమునుంగునట్లు గావింపఁజాలుదును.

అని, తాత్పర్యము.

మమోరుజంఘావేగేన భవిష్యతి సముత్థితః
సముచ్ఛ్రితమహాగ్రాహ స్సముద్రో వరుణాలయః. ౧౩

టీక॥ వరుణాలయః = వరుణుని యునికిపట్టగునది; సముద్రః = సముద్రము; మమ=నాయొక్క; ఊరుజంఘావేగేన=తొడలయొక్కయుఁ బిక్కలయొక్కయు వేగముచేత; సముత్థితః=లేచినదై; సముచ్ఛ్రితమహాగ్రాహః = పైకిలేచిన గొప్పమొసళ్లుగలది; భవిష్యతి=కాఁగలదు.

నాతొడలయొక్కయుఁ బిక్కలయొక్కయు వేగమునకు సముద్రంబు పైకిలేచుటయు, అందలి పెద్దపెద్దమొసళ్లు ఆకాశంబున నగపడఁగలవు.

అని, తాత్పర్యము.

పన్నగాశన మాకాశే పతతం పక్షిసేవితే
వైనతేయ మహం శక్తః పరిగంతుం సహస్రశః. ౧౪

టీక॥ అహం = నేను; పన్నగాశనం = సర్పములె యాహారముగాఁగలవాఁడును; పక్షిసేవితే=పక్షులచేసేవింపఁబడిన; ఆకాశే=ఆకసమునందు; పతతం= సంచరించుచున్నవాఁడునగు; వైనతేయం = గరుత్మంతుని; సహస్రశః=వేయిమార్లు; పరిగంతుం = చుట్టుటకు; శక్తః=సమర్థుఁడను.

పక్షిసేవితమగుటంజేసి తన యుచితస్థలమయిన యాకాశంబున గరుత్మంతుండు, ఆహారార్థమయి సర్పములంబట్టుటకు మహావేగంబునఁ దిరుగుచుండునప్పుడు, నేనతని నొకచేసారి వేయిమార్లుచుట్టిరాఁగలను.

అని, తాత్పర్యము.

ఉదయా త్ప్రస్థితం వాపి జ్వలంతం రశ్మిమాలినమ్
అనస్తమిత మాదిత్య మభిగంతుం సముత్సహే. ౧౫

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; ఉదయాత్ = ఉదయపర్వతమునుండి; ప్రస్థితం=తరలినవాఁడును;అనస్తమితం = అస్తమయమునొందనివాఁడును; జ్వలంతం= మండుచున్నవాఁడును; రశ్మిమాలినం= కిరణములపఙ్క్తిగలవాఁడునగు; ఆదిత్యం = సూర్యుని; అభిగంతుంవాపి = ఎదురుకొనుటకుఁగూడ; సముత్సహే=చాలుదును.

నేను, సూర్యుం డుదయగిరినుండిబయలుదేఱునప్పుడు, అతనితోఁగూడ బయలుదేఱి,యతనికిమున్న యస్తగిరిఁజేరి, మఱల నతండు ఆకాశమధ్యంబున జ్వలించుచున్నపుడె యతనికెదురు రాఁగలను. అని, తాత్పర్యము.

తతో భూమి మసంస్పృశ్య పున రాగంతు ముత్సహే
ప్రవేగేనైవ మహతా భీమేన ప్లవగర్షభాః. ౧౬

టీక ॥ ప్లవగర్షభాః= వానరోత్తములారా! తతః=అటుపిమ్మట; అహం (అధ్యాహృతము)= నేను; భూమిం= నేలను; అసంస్పృశ్య=తాఁకక; మహ

తా = గొప్పదగు; భీమేన = భయంకరమయిన; ప్రవేగ్నేవ= గొప్పవేగముచేతనే; పునః=మఱల; ఆగంతుం= ఎదుర్కొనుటకు; ఉత్సహే = చాలుదును.

వానరోత్తములారా! అట్లుసూర్యు నెదుర్కొన్నతరువాత, నేనుభూమికి వచ్చి, భూమిందాఁకకయె కొంచెమైనను విశ్రమింపక, భయంకరంబయిన యావేగముతో, మఱలమఱియొకమాఱు సూర్యు నెదుర్కొనఁజాలుదును.

అని, తాత్పర్యము.

ఉత్సహేయ మతిక్రాంతుం సర్వా నాకాశగోచరాన్

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; సర్వాన్ = సమస్తమయిన; ఆకాశగోచరాన్ = ఆకాశమునందిరుగుజంతువులను; అతిక్రాంతుం = అతిక్రమించుటకు; ఉత్సహేయం = చాలుదును.

ఇంతియకాదు; ఆకాశంబున సంచరించు భూతంబులనెల్లను, వేగంబున నతిశయింతును. అని, తాత్పర్యము.

సాగరం శోషయిష్యామి దారయిష్యామి మేదినీమ్. ౧౭
పర్వతాం శ్చూర్ణయిష్యామి ప్లవమానః ప్లవంగమాః

టీక॥ ప్లవంగమాః=వానరులారా! అహం(అధ్యాహృతము) = నేను;ప్లవమానః=ఎగిరినవాఁడనై;సాగరం = సముద్రమును; శోషయిష్యామి= ఎండింతును. మేదినీం = భూమిని;దారయిష్యామి=భేదింతును. పర్వతాన్=కొండలను; చూర్ణయిష్యామి = పొడిచేసెదను.

వానరులారా! నేను, ఆకాశంబున కెగిరినచో, సముద్రంబుశోషిల్లఁజేయుదును; భూమినిభేదింతును; పర్వతంబులు చూర్ణంబుగావింతును.

అని, తాత్పర్యము.

హరిష్యా మ్యూరువేగేన ప్లవమానో మహార్ణవమ్. ౧౮

టీక॥ అహం(అధ్యాహృతము) = నేను; ప్లవమానః=దాఁటుచున్నవాఁడ

స ౬౭

నై; ఊరువేగేన=తొడలయొక్క వేగ ముచేత; మహార్ణవం = మహాసముద్ర మును; హరిష్యామి = తీసికొనిపోయె దను.

నేను, దాటునప్పుడు, నాయూరు వేగంబున సముద్రంబంతయు నావెంట రాఁగలదు. అని, తాత్పర్యము.

లతానాం వివిధం పుష్పం పాదపానాంచ సర్వశః
అనుయాస్యంతి మా మద్య ప్లవమానం విహాయసా. ౧౯

టీక॥ అద్య=ఇప్పుడు; విహాయసా= ఆకాశముచేత; ప్లవమానం= దాటు చున్న; మాం=నన్ను; లతానాం=తీఁగ లయొక్కయు; పాదపానాంచ=వృక్ష ములయొక్కయు; వివిధం = నానావిధ మయిన; పుష్పం= (జాత్యేకవచనము) పూలు; సర్వశః=అన్నియు; అనుయా స్యంతి= వెంబడింపఁగలవు.

ఇపుడు, నేను సముద్రతరణార్థమ యి యాకాశంబునకు దాటఁగానే, నా వేగంబుచే, లతావృక్షముల నానావిధ ములయిన పూలన్నియు, నావెంటఁగొ ట్టుకొని రాఁగలవు. అని, తాత్పర్యము.

భవిష్యతి హి మే పంథా స్స్వాతేః పంథాఇవాంబరే

టీక ॥ మే=నాయొక్క; పంథాః= మార్గము; అంబరే=ఆకాశమునందు; స్వాతేః= స్వాతీనక్షత్రముయొక్క; పం థాఇవ = మార్గమువలె; భవిష్యతి హి = కాఁగలదుగదా!

అట్లు పుష్పములచేనిండియుండుటం జేసి, ఆకాశంబున నామార్గము, నక్ష త్రములచేనిండిన స్వాతీనక్షత్ర మార్గ మువలెనొప్పును. అని, తాత్పర్యము.

చరంతం ఘోర మాకాశ ముత్పతిష్యంత మేవవా. ౨౦
ద్రక్ష్యంతి నిపతంతంచ సర్వభూతాని వానరాః

టీక॥ వానరాః=వానరులారా! స ర్వభూతాని= సమస్తభూతములును; మాం(అధ్యాహృతము)=నన్ను; ఘో రం=భయంకరమయిన; ఆకాశం=ఆ కాశమును; చరంతం = పొందుచున్న వానిఁగాని; ఉత్పతిష్యంతమేవవా= ఎ గురుచున్నవానిఁగాని; నిపతంతంచ = వ్రాలుచున్నవానిఁగాని; ద్రక్ష్యంతి=చూ

డఁగలరు.

వానరులారా! నేను ఆకాశంబునకు ద్గమించునపుడుగాని గగనంబునంబోవు నపుడుగాని, సముద్ర దక్షిణతీరంబున వాలినపుడుగాని, సమస్తభూతంబులు నన్ను వేడుకమెయిం జూడఁగలవు.

అని, తాత్పర్యము.

మహామేఘప్రతీకాశం మాం చ ద్రక్ష్యథ వానరాః. ౨౧
దివ మావృత్య గచ్ఛంతం గ్రసమానమివాంబరమ్

టీక ॥ వానరాః = వానరులారా! యూయం (అధ్యాహృతము) చ = మీరలును; మహామేఘప్రతీకాశం = గొప్ప మేఘముతో సమానుఁడను; దివం = ఆకాశమును; ఆవృత్య = ఆచ్ఛాదించి; గచ్ఛంతం = పోవుచున్నవాఁడను; అంబరం = ఆకాశమును; గ్రసమానమివ (స్థితం) = మ్రింగుచున్నట్లున్నవాఁడనగు; మాం = నన్ను; ద్రక్ష్యథ = చూడఁగలరు.

వానరులారా! నేను, మహామేఘమంతటిశరీరముతో, నాకాశంబును మ్రింగువానిభంగి, నాకాశంబంతయు నావరించిపోవునపుడు, నన్ను, మీరలుగూడఁజూడఁగలరు. అని, తాత్పర్యము.

విధమిష్యామి జీమూతాన్ కంపయిష్యామి పర్వతాన్. ౨౨
సాగరం క్షోభయిష్యామి ప్లవమాన స్సమాహితః

టీక ॥ అహం (అధ్యాహృతము) = నేను; సమాహితః = పూనికగలవాఁడనై; ప్లవమానః = దాఁటుచు; జీమూతాన్ = మేఘములను; విధమిష్యామి = పాఱఁదోలెదను. పర్వతాన్ = కొండలను; కంపయిష్యామి = కదలించెదను. సాగరం = సముద్రమును; క్షోభయిష్యామి = కలఁగించెదను.

నేను బూనికతో సముద్రంబుదాఁటునపుడు, మేఘంబులు చెల్లాచెదరయి పోవును; పర్వతంబులు చలించును; సముద్రంబు క్షోభిల్లును.

అని, తాత్పర్యము.

వైనతేయస్య సా శక్తి ర్మమ వా మారుతస్యవా. ౨౩

టీక ॥ మమ=నాయొక్క; శక్తిః= సామర్థ్యము; యా (అస్తి)= ఏదిగలదో; సా=ఆశక్తి; వైనతేయస్యవా = గరుత్మంతునకుంగాని; మారుతస్యవా= వాయువునకుంగాని; అస్తి (అధ్యాహృతము)=కలదు.

నాకుంగల బలవేగములు, గరుత్మంతునందును వాయువునందును మాత్రముగలవే గాని, యితరులకెవ్వరికిని లేవు అని, తాత్పర్యము.

ఋతే సుపర్ణరాజానం మారుతంవా మహాజవమ్
న తద్భూతం ప్రపశ్యామి యన్మాం ప్లుత మనువ్రజేత్. ౨౪

టీక ॥ యత్=ఏది; ప్లుతం=ఎగిరివ; మాం=నన్ను; అనువ్రజేత్ = వెంబడించునో; తత్=అట్టి; భూతం=భూతమును; మహాజవం = అధికమయిన వేగముగల; సుపర్ణరాజానం = గరుత్మంతుని; మారుతంవా ఋతే = వాయువునువిడిచి; నప్రపశ్యామి = చూడను.

మహావేగుండగు గరుత్మంతుండును వాయువునుదక్క ఆకాశంబున సంచరించుచున్ననన్నువెంబడింపఁజాలినభూతముమఱియొకటి యెచటనుంగానను. అని, తాత్పర్యము.

నిమేషాంతరమాత్రేణ నిరాలంబన మంబరమ్
సహసా నిపతిష్యామి ఘనా ద్విద్యుది వోత్థితా. ౨౫

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; ఘనాత్ = మేఘమునుండి; ఉత్థితా=లేచిన; విద్యుదివ = మెఱుపువలె; నిమేషాంతరమాత్రేణ = ఱెప్పపాటుయొక్క అవకాశమంతమాత్రముచేత; సహసా=శీఘ్రముగా; నిరాలంబనం = ఆధారములేని; అంబరం=ఆకాశమును; నిపతిష్యామి=పొందెదను.

ఒక ఱెప్పపాటులోపల, మహావేగంబున, మేఘమునుండి మెఱుపువెడలునట్లు, నిరాలంబనమయినయాకాశమునకెగసెదను. అని, తాత్పర్యము.

భవిష్యతి హి మే రూపం ప్లవమానస్య సాగరే
విష్ణో ర్విక్రమమాణస్య పురా త్రీన్ విక్రమానివ. ౨౬

టీక ॥ సాగరే= సముద్రమునందు; ప్లవమానస్య=దాటుచున్న; మే=నా యొక్క; రూపం = ఆకారము; పురా=మున్ను; త్రీన్=మూఁడైన; విక్రమాన్=అడుగులను;విక్రమమాణస్య= ఆక్రమించుచున్న; విష్ణోః= విష్ణువుయొక్క; రూపం (అధ్యాహృతము)ఇవ= ఆకారమువలె; భవిష్యతిహి= కాఁగలదుగదా!

నేను సముద్రంబు దాఁటుచుండునపుడు, నారూపము, పూర్వము త్రివిక్రమావతారంబున మహాబలి యొసంగిన మూడడుగులనేల నాక్రమించు మహావిష్ణువు నాకారమువలె, భయంకరంబై యొప్పును. అని, తాత్పర్యము.

బుద్ధ్యా చాహం ప్రపశ్యామి మన శ్చేష్టాచ మే తథా
అహం ద్రక్ష్యామి వైదేహీం ప్రమోదధ్వం ప్లవంగమాః. ౨౭

టీక ॥ ప్లవంగమాః = వానరులారా! అహం=నేను; బుద్ధ్యా = బుద్ధిచేతనుగూడ; ప్రపశ్యామి = చూచుచున్నాను. మే=నాయొక్క; మనః= మనస్సును; చేష్టాచ = వ్యాపారమ్మును; తథా=అట్లు; గమయతః (అధ్యాహృతము) = తెల్పుచున్నవి. అహం=నేను; వైదేహీం= సీతాదేవిని; ద్రక్ష్యామి=చూడఁగలను. యూయం (అధ్యాహృతము) = మీరు; ప్రమోదధ్వం = సంతోషింపుఁడు.

వానరులారా! నాబుద్ధికిని దోఁచుచున్నది; నామనస్సంతోషము దక్షిణబాహుస్పందము మొదలయిన చేష్టలును అట్లై తెలుపుచున్నవి; నేనుదప్పకచూచివత్తును సీతాదేవిని; మీరలు సంతోషముతో నుండుఁడు.

అని, తాత్పర్యము.

మారుతస్య సమో వేగే గరుడస్య సమో జవే
అయుతం యోజనానాం తు గమిష్యామీతి మే మతిః. ౨౮

టీక ॥ వేగే=వేగమునందు; మారుతస్య=వాయువునకు; సమః= సరియయినవాఁడను; జవే=వేగమునందు; గరుడస్య=గరుత్మంతునకు; సమః = సమానుఁడనగు; అహం ( అధ్యాహృతము)=నేను; యోజనానాం= ఆమడలయొక్క; అయుతంతు= పదివేలింటిని మాత్రము; గమిష్యామి=పొందఁగలను.

ఇతి=అని; మే=నాయొక్క; మతిః = తలంపు.

నేను, వేగంబున వాయువునకుసరి వచ్చువాఁడను గరుత్మంతునితో సమానుఁడను, బదివేలయోజనంబుల దూరమువఱకు దాఁటఁగలనని నాకుఁదోఁచుచున్నది. అని, తాత్పర్యము.

వాసవస్య సవజ్రస్య బ్రహ్మణోవా స్వయంభువః
విక్రమ్య సహసా హస్తా దమృతం త దిహానయే. ౨౯

టీక ॥ అహం (అధ్యాహృతము)= నేను; సవజ్రస్య= వజ్రాయుధముతోఁ గూడిన; వాసవస్య= ఇంద్రునియొక్క గాని; స్వయంభువః = తానేపుట్టిన; బ్రహ్మణోవా= బ్రహ్మదేవునియొక్క గాని; హస్తాత్=చేతినుండి; తత్=అట్టి; అమృతం = అమృతమును; సహసా= శీఘ్రమున; ఇహ=ఇచటికి; ఆనయే= తెత్తును.

నేను, వజ్రాయుధంబుచేతం దాల్చినయింద్రుఁడైనను స్వయంభువగుబ్రహ్మదేవుఁడైనను, బరాక్రమంబున జయించి, వారిచేతులనుండు నమృతంబును శీఘ్రంబునం దేఁగలను. అని, తాత్పర్యము.

లంకాంవాపి సముత్క్షిప్య గచ్ఛేయ మితి మే మతిః

టీక॥ లంకాంవాపి= లంకనుగూడ; సముత్క్షిప్య = పెల్లగించుకొని; గచ్ఛేయం=పోవుదును. ఇతి=అని; మే=నాయొక్క; మతిః=తలంపు.

లంకనైనను పెల్లగించుకొని రాఁగలనని నాయభిప్రాయము. అని హనుమంతుఁడుపలికెను. అని, తాత్పర్యము.

త మేవం వానరశ్రేష్ఠం గర్జంత మమితౌజసమ్. ౩౦
ప్రహృష్టా హరయ స్తత్ర సముదైక్షంత విస్మితాః

టీక॥ తత్ర=అపుడు; హరయః = వానరులు; ఏవం=ఇట్లు; గర్జంతం=గర్జించుచున్నవాఁడును; అమితౌజసం= కొలఁదిలేనిపరాక్రమంబుగలవాఁడును; వానరశ్రేష్ఠం=వానరోత్తముఁడునగు; తం = ఆహనుమంతునిఁ; ప్రహృష్టాః= మిక్కిలియు సంతోషించినవారలయి; విస్మితాః = ఆశ్చర్యమునొందినవారల

యి; సముద్రేక్షంత=చూచిరి.

అట్లు కొలఁదికిమీఱిన పరాక్రమం బుగల వానరోత్తముఁడగునాహనుమంతుండు గర్జించుచుండఁగా, సర్వవానరవీరులందఱు పరమసంతుష్టులయి, యాశ్చర్యపడి చూచుచుండిరి.

అని, తాత్పర్యము.

తస్య తద్వచనం శ్రుత్వా జ్ఞాతీనాం శోకనాశనమ్. ౩౧
ఉవాచ పరిసంహృష్టో జాంబవాన్ హరిసత్తమమ్ ·

టీక ॥ జాంబవాన్ = జాంబవంతుండు; జ్ఞాతీనాం = బంధువులకు; శోకనాశనం = దుఃఖమునుబోఁగొట్టునట్టి; తస్య = ఆహనుమంతునియొక్క; తత్ = ఆ; వచనం = మాటను; శ్రుత్వా = విని; పరిసంహృష్టః = మిక్కిలియుసంతోషించినవాఁడై; హరిసత్తమం = వానరశ్రేష్ఠుఁడగు హనుమంతునిగూర్చి; ఉవాచ = పలికెను.

ఆహనుమంతుండు, సమస్తవానరుల దుఃఖంబు నశించునట్లు పలికినపలుకులు విని, జాంబవంతుండు పరమసంతుష్టుండై, వానరోత్తముఁడగు నాహనుమంతుంజూచి, యిట్లనియెను.

అని, తాత్పర్యము.

వీర కేసరిణః పుత్త్ర హనుమన్ మారుతాత్మజ. ౩౨
జ్ఞాతీనాం విపుల శ్శోక స్త్వయా తాత వినాశితః

టీక ॥ వీర = పరాక్రమవంతుఁడా! కేసరిణః = కేసరియొక్క; పుత్త్ర = కుమారుఁడా! మారుతాత్మజ = వాయుపుత్త్రుఁడా! తాత = నాయనా! హనుమన్ = హనుమంతుఁడా! త్వయా = నీచేత; జ్ఞాతీనాం = బంధువులయొక్క; విపులః = అధికమయిన; శోకః = దుఃఖము; వినాశితః = నశింపఁజేయఁబడినది.

పరాక్రమవంతుఁడా! కేసరియొక్క క్షేత్రజపుత్త్రుఁడా! వాయుదేవుని యౌరసపుత్త్రుఁడా! నాయనా! హనుమంతుఁడా! నీవిపుడు నీబంధువులయిన సమస్తవానరులమహాదుఃఖమునంతయుఁ, బోఁగొట్టితివి, అని, తాత్పర్యము.

తవ కల్యాణరుచయః కపిముఖ్యా స్సమాగతాః. ౩౩

మంగళం కార్యసిద్ధ్యర్థం కరిష్యంతి సమాహితాః

టీక ॥ కపిముఖ్యాః= వానరశ్రేష్ఠులు; సమాగతాః=చేరినవారలయి; సమాహితాః=పూనికగలవారలయి; తవ=నీకు; కల్యాణరుచయః = మంగళమునం దిచ్ఛగలవారలయి; కార్యసిద్ధ్యర్థం= కార్యముయొక్క నెఱవేఱుటకొఱకు; మంగళం= మంగళముగలిగించు కార్యమును; కరిష్యంతి=చేయఁగలరు.

వానరవీరు లందఱుం జేరి, నీమంగళంబుఁగోరినవారలయి, నీవు పోవుకార్యంబు నెఱవేఱుటకై, పూనికతో మంగళప్రదములయినయీశ్వర ధ్యానాదులం జేయుచుండఁగలరు. అని, తాత్పర్యము.

ఋషీణాం చ ప్రసాదేన కపివృద్ధమతేనచ. ౩౪
గురూణాంచ ప్రసాదేన ప్లవస్వ త్వం మహార్ణవమ్

టీక ॥ త్వం = నీవు; ఋషీణాం= ఋషులయొక్క; ప్రసాదేనచ= అనుగ్రహముచేతను; కపివృద్ధమతేనచ = వానరవృద్ధుల యభిప్రాయముచేతను; గురూణాం=గురువులయొక్క; ప్రసాదేనచ = అనుగ్రహముచేతను; మహార్ణవం = మహాసముద్రమును; ప్లవస్వ=దాఁటుము.

మహర్షుల యనుగ్రహంబునను వానరవృద్ధుల యాశీర్వాదంబునను పెద్దలగువారి యనుగ్రహంబునను, నీవు ఇమ్మహాసముద్రంబు దాఁటుము.

అని, తాత్పర్యము.

స్థాస్యామ శ్చైకపాదేన యావ దాగమనం తవ. ౩౫
త్వద్గతాని చ సర్వేషాం జీవితాని వనౌకసామ్

టీక॥ తవ=నీయొక్క; అగమనం= వచ్చుట; యావత్=ఎంతవఱకో; తావత్(అధ్యాహృతము)=అంతవఱకు;ఏకపాదేన = ఒకపెయదుగుచేత; స్థాస్యామశ్చ= నిలిచెదము. వనౌకసాం= వానరులయొక్క;సర్వేషాంచ = అందఱియొక్కయు; జీవితాని= ప్రాణములు; త్వద్గతాని=నిన్నుఁబొందినవి.

నీవువచ్చుదనుక, మేమందఱము ఒకకాలితో నిలుచుండియుందుము; ఈసమస్తవానరుల జీవితంబులును నీచేతిలోనున్నవి. అని, జాంబవంతుండు హనుమంతునితోఁజెప్పెను.

అని, తాత్పర్యము.

తతస్తు హరిశార్దూల స్తా నువాచ వనౌకసః. ౩౬

టీక॥ తతస్తు=అటుపిమ్మటను; హరిశార్దూలః=వానరశ్రేష్ఠుఁడగుహనుమంతుఁడు; తాన్=ఆ; వనౌకసః=వానరులనుగూర్చి; ఉవాచ=పలికెను.

అంత, వానరోత్తముఁడగు హనుమంతుండవ్వానరవీరులంజూచి యిట్లని పలికెను. అని, తాత్పర్యము.

నేయం మమ మహీ వేగం లంఘనే ధారయిష్యతి

టీక ॥ ఇయం=ఈ; మహీ=భూమి; లంఘనే = దాఁటుటయందు; మమ=నాయొక్క; వేగం=వేగమును;న ధారయిష్యతి = ధరింపఁజాలదు.

నేను సముద్రంబు దాఁటునపుడు, ఈభూమి నావేగమును సహింపఁజాలదు. అని, తాత్పర్యము.

ఏతా నీహ నగస్యాస్య శిలాసంకటశాలినః. ౩౭
శిఖరాణి మహేంద్రస్య స్థిరాణిచ మహాంతిచ

టీక ॥ ఇహ = ఇవ్విషయమందు; శిలాసంకటశాలినః = ఱాళ్లచేనున్నతప్రదేశములతోనొప్పుచున్న; అస్య = ఈ; మహేంద్రస్య = మహేంద్రమను; నగస్య = పర్వతముయొక్క; ఏతాని=ఈ; శిఖరాణి= శృంగములు; స్థిరాణిచ = దృఢములును; మహాంతిచ = గొప్పవియు.

ఈమహేంద్రపర్వతము,ఉన్నతములయిన ఱాతిప్రదేశములుగలది; దీనిశిఖరములు స్థిరములును గొప్పవియునుగానున్నవి; కావున, ఇవినావేగంబుసహించును. అని, తాత్పర్యము.

ఏషు వేగం కరిష్యామి మహేంద్రశిఖరేష్వహమ్. ౩౮
నానాద్రుమవికీర్ణేషు ధాతునిష్యందశోభిషు

టీక॥ అహం=నేను;నానాద్రుమవికీర్ణేషు= నానావిధములయిన వృక్షములచే వ్యాపింపఁబడినవియు; ధాతునిష్యందశోభిషు= గైరికధాతువులవ్యా

ప్తిచేఁ బ్రకాశించుచున్నవియునగు; ఏష=ఈ; మహేంద్రశిఖరేషు=మహేంద్రపర్వతముయొక్క-శిఖరములయందు; వేగం=వేగమును;కరిష్యామి = చేసెదను.

నానావిధవృక్షంబులతోఁ గూడినవియు గైరికధాతువులతో నొప్పుచున్నవియునగు నీ మహేంద్రపర్వతశిఖరంబులందు, నేను వేగంబుగావించెదను.

అని, తాత్పర్యము.

ఏతాని మమ నిష్పేషం పాదయోః ప్లవతాం వరాః. ౩౯
ప్లవతో ధారయిష్యంతి యోజనానా మిత శ్శతమ్

టీక॥ ప్లవతాం=ఎగురువారిలో;వరాః=శ్రేష్ఠులారా! ఇతః = ఇచటనుండి; యోజనానాం= ఆమడలయొక్క; శతం=నూటిని; ప్లవతః=దాఁటుచున్న; మమ=నాయొక్క; పాదయోః=చరణములయొక్క; నిష్పేషం= త్రొక్కుడును; ఏతాని=ఈశిఖరములు; ధారయిష్యంతి=ధరింపఁగలవు.

వానరవర్యులారా! ఇచటనుండినూఱుయోజనంబుల దూరము దాఁటఁబోవునట్టి నాపాదంబుల త్రొక్కుడునకు, ఈపర్వతశిఖరంబులుఆఁగఁగలవు. అని, హనుమంతుండు వానరులతోఁబలికెను.

అని, తాత్పర్యము.

తత స్తం మారుతప్రఖ్య స్స హరి ర్మారుతాత్మజః. ౪౦
ఆరురోహ నగశ్రేష్ఠం మహేంద్ర మరిమర్దనః

టీక॥ తతః = అటుపిమ్మట; అరిమర్దనః = శత్రువులమర్దించునట్టివాఁడును; మారుతాత్మజః = వాయుదేవునికుమారుండును; మారుతప్రఖ్యః = వాయువుతోసమానుండునగు; సః=ఆ; హరిః=హనుమంతుఁడు; నగశ్రేష్ఠం=పర్వతోత్తమమయిన; మహేంద్రం=మహేంద్రపర్వతమును; ఆరురోహ = ఎక్కెను.

అంత, శత్రువుల సంహరించువాఁడును వాయుదేవునికుమారుండును వాయువుతో సమానుండునగు నా హనుమంతుండు మహేంద్రపర్వతంబుపైనారోహించెను. అని,తాత్పర్యము.

వృతం నానావిధై ర్వృక్షై ర్మృగసేవితశాద్వలమ్. ౪౧

లతాకుసుమసంబాధం నిత్యపుష్పఫలద్రుమమ్
సింహశార్దూలచరితం మత్తమాతంగసేవితమ్. ४२
మత్తద్విజగణోద్ఘుష్టం సలిలోత్పీడసంకులమ్
మహద్భి రుచ్ఛ్రితం శృంగై ర్మహేంద్రం స మహాబలః. ४३
విచచార హరిశ్రేష్ఠో మహేంద్ర సమవిక్రమః

టీక ॥ మహాబలః= అధికమయినబలముగలవాఁడును; మహేంద్రసమవిక్రమః= దేవేంద్రునితో సమానమయినపరాక్రమముగలవాఁడును; హరిశ్రేష్ఠః= వానరోత్తముఁడునగు; సః= ఆహనుమంతుఁడు; నానావిధైః = అనేకవిధములయిన; వృక్షైః = చెట్లచేత; వృతం=చుట్టఁబడినదియు; మృగసేవితశాద్వలం=జింకలచేసేవింపఁబడిన పచ్చికగలదియు; లతాకుసుమసంబాధం = తీఁగెలచేతను బుష్పములచేతను ఇఱుకైనదియు; నిత్యపుష్పఫలద్రుమం= ఎల్లప్పుడును బూలును బండ్లునుగల వృక్షములుగలదియు; సింహశార్దూలచరితం = సింహములచేతను బులులచేతను బొందఁబడినదియు;మత్తమాతంగసేవితం= మదపు టేనుంగులచే సేవింపఁబడినదియు; మత్తద్విజగణోద్ఘుష్టం= మదించిన పక్షులసమూహములయొక్క ధ్వనులుగలదియు; సలిలోత్పీడసంకులం= జలప్రవాహములచే నిండినదియు; మహద్భిః=గొప్పవగు; శృంగైః=శిఖరములచేత; ఉచ్ఛ్రితం = ఉన్నతమయినదియునగు; మహేంద్రం= మహేంద్రపర్వతమును; విచచార=పొందెను.

అంత, మహాబలశాలియుఁ బరాక్రమంబున దేవేంద్రుంబోలినవాఁడును గు నావానరోత్తముఁడు హనుమంతుఁడు, నానావిధవృక్షములుగలదియు పచ్చికభూములచేయొప్పుచున్న మృగంబులతోఁ గూడినదియు లతలను బుష్పంబులను నిండినదియు నిత్యంబుఁ బుష్పించుచు ఫలించుచున్న వృక్షంబులతో నొప్పుచున్నదియు సింహంబులు వ్యాఘ్రంబులు మత్తగజంబులు మున్నగు మృగంబులచే సేవితంబును, నానావిధ ఫలరసాస్వాదంబున మదించి మధురంబుగాఁ గూయు పక్షిసమూహంబులచే మనోహరంబైనదియు, అధికమయిన సెలయేర్లతోఁగూడినదియు, నత్యున్నతంబు

లయినశిఖరంబులుగలదియునగు మహేంద్రపర్వతంబున, విహరించెను. అని, తా.

పాదాభ్యాం పీడిత స్తేన మహాశైలో మహాత్మనః. ౪౪
రరాజ సింహాభిహతో మహా న్మత్త ఇవ ద్విపః

టీక॥ మహాశైలః = గొప్పపర్వతమయినమహేంద్రము; తేన = ఆవిహారించుటచేత; మహాత్మనః = అధికమయినబలముగలహనుమంతునియొక్క; పాదాభ్యాం = పాదములచేత; పీడితః = పీడింపఁబడినదై; సింహాభిహతః = సింహముచేతఁగొట్టఁబడిన; మహాన్ = గొప్పదగు; మత్తః = మదించిన; ద్విపఇవ = ఏనుఁగువలె; రరాజ = ప్రకాశించెను.

అట్లువిహరించునపుడు, అమ్మహేంద్రగిరి, మహాబలుండగు హనుమంతునిపాదంబుల త్రొక్కుడుచే నలఁగి, సింహముచేఁ గొట్టఁబడిన గొప్పమదపుటేనుంగువలెనొప్పెను.

అని, తాత్పర్యము.

ముమోచ సలిలోత్పీడాన్ విప్రకీర్ణశిలోచ్చయః. ౪౫

టీక॥ సః (అధ్యాహృతము) = ఆమహేంద్రగిరి; విప్రకీర్ణశిలోచ్చయః = చెల్లాచెదరుగాఁ జేయఁబడిన రాళ్లసమూహముగలదై; సలిలోత్పీడాన్ = జలప్రవాహములను; ముమోచ = విడిచెను.

అమ్మహేంద్రగిరి, ఆపాదఘట్టనమునకు, చెల్లాచెదరైన శిఖరములుగలదై, జలప్రవాహంబుల స్రవించెను.

అని, తాత్పర్యము.

విత్రస్తమృగమాతంగః ప్రకంపితమహాద్రుమః
నానాగంధర్వమిథునైః పానసంసర్గకర్కశైః. ౪౬
ఉత్పతద్భి శ్చ విహగై ర్విద్యాధరగణై రపి
త్యజ్యమానమహాసాను స్సన్నిలీనమహోరగః. ౪౭
చలశృంగశిలోద్ఘాత స్తదా భూ త్స మహాగిరిః

ఋషిభి స్త్రాససంభ్రాంతై స్త్యజ్యమాన శ్శిలోచ్చయః. ౪౯
సీద న్మహతి కాంతారే సార్థహీన ఇవాధ్వగః

టీక ॥ శిలోచ్చయః = పర్వతము; త్రాససంభ్రాంతైః = భయముచే వేగిరపడిన; ఋషిభిః= ఋషులచేత; త్యజ్యమానః= విడువఁబడుచున్నదై; మహతి=గొప్పదగు; కాంతారే=అరణ్యమునందు; సార్థహీనః = సహాయులచేవిడువఁబడిన; సీదన్= దుఃఖించుచున్న; అధ్వగఇవ= బాటసారివలె; అభూత్ (అధ్యాహృతము)= ఉండెను.

అమ్మహేంద్రగిరిని మహర్షులు భయంబున వేగిరపాటుగదుర వదలిపోవుటయు, నమ్మహాపర్వతము తోడుజనులందఱు వదలిపోవుటచే మహారణ్యంబున నొంటిమయిభయంబునం బొరయుచున్న బాటసారియట్లుండెను.

అని, తాత్పర్యము.

స వేగవా న్వేగసమాహితాత్మా
హరిప్రవీరః పరవీరహంతా. ౫౦
మన స్సమాధాయ మహానుభావో
జగామ లంకాం మనసా యశస్వీ

టీక ॥ వేగవాన్= అధికమయినవేగము గలవాఁడును; వేగసమాహితాత్మా= వేగంబునందుఁ బూనినమనస్సుగలవాఁడును; పరవీరహంతా= శత్రువీరులవధించువాఁడును; మహానుభావః= అధికమయిన ప్రభావముగలవాఁడును; యశస్వీ= అధికమయినకీర్తిగలవాఁడును; హరిప్రవీరః=వానరులయందు మిక్కిలియు శూరుండగు; సః= ఆహనుమంతుఁడు; మనః= మనస్సును; సమాధాయ=సరిచేసికొని; మనసా = మనస్సుచేత; లంకాం=లంకను; జగామ=పొందెను.

మహావేగుండును వేగంబువహించుటయందుఁ బ్రీతిగలవాఁడును శత్రువీరుల వధించువాఁడును వానరులలోన

ల్లమేటివీరుండునగునాహనుమంతుండు, మనంబునసముద్రంబు దరింపఁబూని, యిపుడెమనస్సుచే లంకాపురింజొచ్చెను. అని, తాత్పర్యము.

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, శ్రీమద్వాల్మీకీయే,
చతుర్వింశత్సహస్రికాయాం సంహితాయాం
శ్రీకిష్కింధాకాండే, సప్తషష్టితమస్సర్గః.
కిష్కింధాకాండ స్సమాప్తః.
ఇది, స్పష్టార్థము.

ఇది, పరమార్థచంద్రికాఖ్యానంబగు, శ్రీమద్రామాయణాంధ్ర
వ్యాఖ్యానంబునందు, కిష్కింధాకాండ
సప్తషష్టితమసర్గటీక, ముగిసినది.
శ్రీకిష్కింధాకాండటీక సమాప్తమయ్యె.

